తెలుగు కావ్యపరంపర :

# ఆంధ్ర మహాభారతము

(కవిత్రయ ప్రణీతము : మొత్తము 4 సంపుటములు)

## చతుర్థ సంపుటము

### శాంతి సప్తకము

(శాంతి, అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల
మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు)






ప్రచురణ :
తెలుగు విశ్వవిద్యాలయం
కళాభవనం, సైఫాబాదు,
హైదరాబాదు - 500 004.

తెలుగు కావ్యపరంపర :

# ఆంధ్ర మహాభారతము

(కవిత్రయ ప్రణీతము : మొత్తము 4 సంపుటములు)

## చతుర్థ సంపుటము

### శాంతి సప్తకము

(శాంతి, అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల
మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు)






ప్రచురణ :
తెలుగు విశ్వవిద్యాలయం
కళాభవనం, సైఫాబాదు,
హైదరాబాదు-500 004.

ప్రథమముద్రణము
ప్రతులు – 5000

ఆంధ్ర మహాభారతము: కవిత్రయ ప్రణీతము
మొత్తం నాలుగు సంపుటములు: వెల: రూ. 190.00

చతుర్థ సంపుటము
శాంతి సప్తకము
(శాంతి, అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల
మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు)



ప్రతులకు:
తెలుగు విశ్వవిద్యాలయం,
కళాభవనం, సైఫాబాదు,
హైదరాబాదు-500 004.

ముద్రణ:
ది ప్రింటర్
3-6-584/H,
హిమాయత్ నగర్,
హైదరాబాద్-500 029.

# ప్రకాశక విజ్ఞప్తి

ఒక జాతి భాషాసంస్కృతుల అవగాహనకు ఆ జాతి చిరకాలంగా సృష్టించుకొన్న సాహిత్యమే ప్రబలమైన సాధనం. తెలుగుజాతి సంస్కృతిచరిత్ర తెలుసుకోవాలంటే తెలుగు భారతం తప్పక చదవాలి.

కవిత్రయ భారతం వ్యాసవాణిని తనలో స్వచ్ఛంద సుందరంగా పొదువుకొన్నది. అందు వల్లనే దానికి తెలుగున ప్రత్యేక గౌరవ మర్యాద లేర్పడినాయి.

భారత కథ తెలుగువారి జీవితంపై ప్రసరింపజేసిన ప్రభావం సామాన్యమైంది కాదు. పన్నెండవ శతాబ్దిలో తెనుగునాట జరిగిన పలనాటి యుద్ధం సర్వ విధాల భారత యుద్ధాన్ని పోలి వుండటం ఇందుకు నిదర్శనం.

నాటికీ నేటికీ రామాయణంకంటే భారతమే తెలుగువారి జీవితానికి చాల చేరువగా వచ్చిం దనిపిస్తుంది.

దీనికి బలమైన కారణం నన్నయ తిక్కన ఎఱ్ఱనలు తెలుగు భారతాన్ని తీర్చిదిద్దిన తీరు తీయమేనని వేరుగా చెప్పనక్కరలేదు.

తెలుగు కావ్య సరస్వతికి వెయ్యేండ్ల నిండైన చరిత్ర ఏర్పడింది. ప్రాచీన కావ్య సరస్వతి ప్రజలందరికీ ఉండవలసినంత అందుబాటులో ఉండాలి; ఉండేట్లు చెయ్యవలసిన బాధ్యత విశ్వవిద్యాలయాలమీద కూడా ఉంది. లోగడ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాదమీ ఆ బాధ్యత కొంత నెరవేర్చింది. ఆ బాధ్యత ఇప్పుడు తెలుగు విశ్వవిద్యాలయం స్వీకరించింది. తెలుగు భారతం పున ర్ముద్రణ అవశ్యకర్తవ్య మనిపించింది.

## తెలుగు భారతం : తొలుతటి ముద్రణలు

తెలుగు భారతం తాళపత్రాలు ఆధారంగా తొలుదొల్త ముద్రించబడిన పరిస్థితులకు, నేటి పరిస్థితులకు ఎంతో అంతరం ఉంది. ఉస్మానియా విశ్వవిద్యాలయం వారి సంశోధిత భారతం (1968) పీఠికలో కొన్ని వివరా లున్నాయి.

తెలుగు భారతం ముద్రిత ప్రతులు పరిశీలిస్తే క్రీ.శ. 1860 వ సంవత్సరానికి ముందరి విగా కొన్ని, తరువాతివిగా కొన్ని - కనిపిస్తాయి. ముందరి ప్రతుల ప్రచురణలో చిన్నయసూరి, రామానుజాచార్యులు (1847) ఆలూరి [illegible]మజోస్యులు (1851-53), కరాలపాటి రంగయ్య గార్ల (1852) ప్రతులు పేర్కొనదగివున్నాయి[illegible] తరువాతి ప్రతుల సమాచారం బ్రిటిషు మ్యూజియం గ్రంథాలయం, ఇండియా ఆఫీసు గ్ర[illegible]లయం మొదలైనవిచ్చిన వివరాలనుబట్టి సేకరించు కోవటం జరిగింది.

సి. పి. బ్రౌనుగారు తెలుగు భారతం 18 పర్వాలు తాళపత్రప్రతులతో సరిచూపించి, పాఠాంతరాలు వ్రాయించి, పరిష్కృతం చేయించి కాగితపు ప్రతి ఒకటి సిద్ధం చేయించారు.

ఆలూరి ఏకామ్రజోస్యులు మొదలైన పండితులకు, వావిళ్ళవారికి సి. పి. బ్రౌను గారు సిద్ధం చేయించిన ప్రతి ఎంతో ఉపకరించింది. ఏకామ్రజోస్యులు బ్రౌనుగారికి తను కృతజ్ఞతను (భారతం- ద్వితీయ సంపుటం 1853 పీఠికలో) తెలియజేయటం జరిగింది.

క్రీ. శ. 1900 సంవత్సరం తరువాత ముద్రితమైన భారత ప్రతులతో వావిళ్ళవారి భారతం, ఆనంద ముద్రణాలయం వారి భారతం సుప్రసిద్ధమైనవి.

## ఆనంద ముద్రణ ప్రత్యేకత

1901 వ సంవత్సరంలో కందుకూరి వీరేశలింగం పంతులుగారు, రాయదుర్గం నరసయ్య శాస్త్రిగారు సంపాదకులుగా ప్రచురించబడ్డ ఆనంద ముద్రణం వారి మహాభారతం ఎంతో ప్రశస్తి నార్జించుకొన్నది. దీని ప్రశస్తికి కారణం సుప్రసిద్ధులైన మహాపండితులు తంజనగరం తేవప్పెరు మాళ్ళయ్య, బుక్కపట్టణం రామానుజయ్య, పురాణం సూర్యనారాయణ తీర్థులు మొదలైన వారు పాఠ పరిశోధన బాధ్యత వహించటమే. ఈ పండిత ప్రకాండుల జీవిత విశేషాలు సేకరించి, ప్రత్యేక గ్రంథాలుగా ప్రజల కందించవలసిన అవసరం లేకపోలేదు.

## తెలుగు విశ్వవిద్యాలయం సంకల్పం

వారి కృషి విశేషాలు తెలుగువారికి సువిదితం చెయ్యటానికి ఆనందాశ్రమగ్రంథరత్నమాల పక్షాన వారు పరిశోధించిన ఆంధ్రమహాభారతాన్ని యథాతథంగా ముద్రించి, సాధ్యమైనంత తక్కువ ధరకు ప్రజల కందించాలని తెలుగు విశ్వవిద్యాలయం సంకల్పించింది. ఆ సంకల్ప ఫలమే నాలుగు సంపుటాలుగా రూపుదిద్దుకొన్న ఈ భారత ప్రచురణ.

| | |
|---|---|
| మొదటి సంపుటము- | ఆదిసభారణ్య పర్వములు |
| రెండవ ,, | విరాటోద్యోగ పర్వములు |
| మూడవ ,, | యుద్ధషట్కము- |
| | భీష్మ ద్రోణ కర్ణ శల్య సౌప్తిక స్త్రీ పర్వములు |
| నాల్గవ ,, | శాంతి సప్తకము- |
| | శాంతి అనుశాసనిక అశ్వమేధ ఆశ్రమవాస మౌసల మహాప్రస్థానిక స్వర్గారోహణ పర్వములు. |

ఈ ప్రచురణకు ఆధారంగా స్వీకరించిన భారతప్రతులు తొలదొల్త మద్రాస్ వేమూరి వేంకటకృష్ణమసెట్టి అండ్ సన్స్ వారు, తరువాత ఎ. కణ్ణన్‌సెట్టి అండ్ సన్స్ కంపెనీవారు, అటు పిమ్మట ఏలూరు రామా అండ్ కో పబ్లిషర్స్ వారు ప్రచురించినవి.

'భారతం - పరిష్కృతప్రతి ముద్రణలో వావిళ్ళవారిది ముందా? ఆనందాశ్రమం వారిది ముందా?' అనే ప్రశ్న ఒకటి లేకపోలేదు.

1968 లో ఉస్మానియా విశ్వవిద్యాలయం వారు ప్రచురించిన సంశోధిత ప్రతి పీఠికలోను ఈ ప్రశ్న తలయెత్తింది. వావిళ్ళ ముద్రణమే ముందరిదైయుండే అది ఆనంద ముద్రణం మరింత పరిశుద్ధంగా వెలువడటానికి దోహదం కలిగించివుంటుందని కూడా భావించవచ్చు.

ఏమైనా ఆనందాశ్రమ గ్రంథరత్నమాల వారి భారత ప్రతి ఎంత ప్రశస్తమైందో పండిత లోకానికి సువిదితమే కనుక దానిని గూర్చి ప్రకృతం చర్చించవలసిన ఆవశ్యకం అంతగా లేదు. తెలుగు విశ్వవిద్యాలయం కులపతులు ఆచార్య తూమాటి దొణప్పగారు తమ జీవిత కాలంలో భారతం వ్రాతప్రతులు దాదాపు 120 దాకా పరిశీలించారు. వారి దృష్టికి కూడా ఆనందముద్రణమే అభిలషణీయ మనిపించింది. ప్రాచ్యలిఖిత గ్రంథాలయం పరిశోధనాలయం సంచాలకుడుగాను, ఆంధ్ర భారత పరిశోధకుడుగాను నావరకు నాకు అనేక భారత ప్రతులు పరిశీలించే అవకాశం కలిగింది. ఆనంద ముద్రణం పేరు సార్థకమే అనుకుంటాను.

## పీఠికలు, విమర్శలు

"భారతం సాధ్యమైనంత చౌకధర కందించినా సముచితమైన పీఠికతో, విమర్శతో అందిస్తే ప్రయోజనకరంగా ఉండేది గదా!" అనే ఆశంక లేకపోలేదు.

భారతంపై విమర్శ రచనలు అసంఖ్యాకంగా ఉన్నాయి. వాటిలో మేలైన వాటిని ఎన్ను కొని ప్రత్యేక సంపుటంగా అందించటంవల్ల ఎక్కువ ప్రయోజనం ఉంటుందని భావించటమైంది. ప్రస్తుత సంపుటాలలో వాటిని కూడా చేర్చి గ్రంథమూల్యం పెంచటం ఉచితంకా దనిపించింది.

లోగడ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు 1970 నుంచి ప్రచురించిన భారత ప్రతులు పూర్తిగా చెల్లిపోయిన కారణంగాను, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ లలితకళా అకాడమీ అంతర్జాతీయ తెలుగు సంస్థ తెలుగు విశ్వవిద్యాలయంలోనే అంతర్లీనమైన కారణంగాను, ఆయా సంస్థలు లోగడ ప్రచురించిన రచనలు పునర్ముద్రించవలసిన సందర్భాలలో ఉచితమైన మార్పులతో వాటిని తెలుగు విశ్వవిద్యాలయమే ముద్రించవలసిన కారణంగాను - ఆ కృషిలో భాగంగానే ప్రస్తుతం ఆంధ్ర మహాభారత సంపుటాలు-ఆనందాశ్రమ గ్రంథ రత్నమాల వారి ప్రతులు ఆధారంగా-ముద్రించటం జరిగింది.

పునర్ముద్రణకై ఆనందముద్రణ ప్రతిని స్వీకరించినందుకు అభినందనపూర్వకమైన జాబులు కూడా కొన్ని మాకు అందాయి. అయినా ఇందు విషయమై తెలుగు విశ్వవిద్యాలయం దీర్ఘ సూత్రతనే అవలంబించింది.

## ప్రాచీన కావ్యాల పునర్ముద్రణ, లఘు వ్యాఖ్యాన రచనలు, భాషాంతరీకరణలు.

తెలుగు విశ్వవిద్యాలయం సంకల్పించిన పథకాలలో ప్రాచీనకావ్యాల పునర్ముద్రణ మాత్రమే కాక కొన్ని విశిష్ట కావ్యాలను లఘు వ్యాఖ్యలతో ముద్రించే పథకం కూడా ఉన్నది.

ఉదాహరణకు శ్రీనాథుని కాశీఖండ భీమఖండ హరవిలాసాలు మొదలైన వీ పథకంలో ప్రాధాన్యం వహిస్తున్నాయి. ఇప్పటికే కొన్ని ప్రబంధాలు హిందీ మొదలైన భాషలలోకి కూడా అనూదితము లైనాయి. రామకృష్ణకవి పాండురంగమాహాత్మ్యం హిందీలోకి, రాయల ఆముక్తమాల్యద తమిళం లోకి అనూదితం కావటం ఈ పథకంలో భాగమే.

చేసినపని కొద్దిదిగా చేయవలసింది పెద్దదిగా గోచరిస్తుంది. కృషి లక్షణం తెలిసి, చేయ దలచుకొన్నపని పూర్తి చెయ్యడానికి ఆరాటపడే ప్రవృత్తికి అది ఆట్లా గోచరించటం అతి సహజం.

## విశ్వవిద్యాలయ లక్ష్యాలు

తెలుగు విశ్వవిద్యాలయం లక్ష్యాలు ప్రాచీన సాహిత్యానికి మాత్రమే పరిమితమై లేవు. ఆధునిక సాహిత్యానికీ, ఆధునిక భాషాభివృద్ధికీ, వాస్తుశిల్ప జ్యోతిషాది శాస్త్ర విజ్ఞానాభివృద్ధికీ, లలిత కళాభివృద్ధికీ విశ్వవిద్యాలయం నిరంతరం కృషి చేస్తున్నది.

భూతకాలికమైన విజ్ఞానంతో, వర్తమానానికి సంబంధించిన అనుభవంతో, భవిష్యత్కాలా నికి బంగారుబాటలు నిర్మించుకునే ప్రయత్నమే విశ్వవిద్యాలయ పరమ లక్ష్యం. అందులో భాగమే అనేక ప్రాచీనాధునిక కృతుల ప్రచురణ.

ప్రస్తుతం మీ హస్తాలను అలంకరించిన ఆంధ్ర మహాభారత సంపుటాలు మీకు ఆనంద హేతువులు కాగలవని విశ్వసిస్తున్నాం.

హైదరాబాద్,
శుక్ల - ఉగాది

తెలుగు విశ్వవిద్యాలయ పక్షాన
డా॥ వి. వి. యల్. నరసింహారావు,
ప్రచురణల విభాగాధికారి

# విషయసూచిక

## శాంతిపర్వము-ప్రథమాశ్వాసము



## శాంతిపర్వము-ద్వితీయాశ్వాసము

## శాంతిపర్వము-తృతీయాశ్వాసము

## శాంతిపర్వము-చతుర్థాశ్వాసము

## శాంతిపర్వము-పంచమాశ్వాసము

## అనుశాసనిక పర్వము – ప్రథమాశ్వాసము.



## అనుశాసనిక పర్వము – ద్వితీయాశ్వాసము.

## ఆనుశాసనికపర్వము – తృతీయాశ్వాసము.

## అనుశాసనిక పర్వము – చతుర్థాశ్వాసము.



## అనుశాసనిక పర్వము – పంచమాశ్వాసము

## అశ్వమేధపర్వము - ప్రథమాశ్వాసము.

## అశ్వమేధపర్వము- ద్వితీయాశ్వాసము.



## అశ్వమేధపర్వము -తృతీయాశ్వాసము.



## అశ్వమేధపర్వము - చతుర్థాశ్వాసము.

## ఆశ్రమవాసపర్వము – ప్రథమాశ్వాసము.



## ఆశ్రమవాసపర్వము – ద్వితీయాశ్వాసము.

## మౌసలపర్వము.



హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## శాంతిపర్వము, ప్రథమాశ్వాసము.

---



సంక్రామణనిపుణవి
లాసకటాక్షా నివృత్తిలంపటచిత్తో
ల్లాసనదక్షా వేద
వ్యాసవచోవిభవలక్ష్మీ! హరిహరనాథా. 1

—◆ మహర్షులు పాండవులం జూడ వచ్చుట. ◆—

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు సకలబంధుమిత్రజనంబు
లకు నుదకకర్మం బాచరించి పాండవులు గంగాతీరంబున నశౌచిత్వం బపనయిం
చుటకయి యొక్కసమస్థలంబునం బటకుటీరసంవిధానంబు సేయించి ధృతరాష్ట్ర
విదురసర్వభరతభార్యాసమేతంబుగా నచ్చట మాసమాత్రంబు నిలిచి రట్టియెడం
గృష్ణద్వైపాయన నారద దేవల దేవస్థాను కణ్వులు మొదలుగాఁ గలమునీంద్రు
లనేకులు శిష్యవర్గసహితంబుగా ధర్మనందనుసందర్శనంబునకుం జనుదెంచిన నజ్జన
నాథుండు ప్రత్యుత్థానప్రణామపాద్యాసనాకలనంబులను దత్కాలోచితార్చనం
బులను నమ్మహాత్ములం బ్రీతులం గావించి కృష్ణనిజానుజయుక్తంబుగా వారల
నుపాసించి యుండ వారలు బహువిధంబు లగుప్రియవచనంబుల నక్కురువంశ
సత్తము సంభావింప నారదుం డమ్మహనీయద్విజులం గలయం గనుంగొని య
క్కౌంతేయాగ్రజులతోడం దాను గుశలప్రశ్నంబు లగుమాట లాడం గలవాఁ
డగుట వారి కెఱింగించి యమ్మహీపతియాననం బాలోకించి. 2

శా. గోవిందుం డనిశంబు శోభన మెదం గోరంగఁ బార్థుండు ద
[1]ర్పావేశోజ్జ్వలబాహుసారమహనీయ[2]స్ఫూర్తిసంశోభిగాం
డీవోల్లాసవిభాసి యై సమరపాండిత్యంబు వాటింప సం
భావింపం జగ మెల్ల రాజ్య మిటు లొప్పం [3]గొంటె రాజోత్తమా. 3

చ. భువనభయంకరంబులగుపోరులఁ దమ్ములతోడఁ గూడ నీ

---

1. క. ర్పావేశంబున బాహు. 2. గ. జ. స్ఫూర్తి శోభిల్ల గాం. 3. జ. గొంటె.

వు వెడలఁబాటు[1] లెస్స యలవుం జలముల వెలయించుచోట ధ
ర్మమ్మువున కొకింతయుం దొలఁగ ద్రొక్కమి యంతయు మేలు దీనఁ గౌ
రవకులముఖ్య యుమ్మలిక గ్రాఁచితె చిత్తము ప్రీతిఁ బొందెనే. 4

వ. అనిన విని యజ్ఞనవిభుం డమ్మునివిభున కిట్లనియె. 5

సీ. కృష్ణుండు మామీఁదఁ గృప సేయుటయు బ్రాహ్మ, ణానుగ్రహంబును ననిలపుత్ర
పార్థులపటుబాహుబలమున మేదిని, యంతయుఁ జేకుఱునట్టి దయ్యె
నైనను నతిఘోర మగునఖిలజ్ఞాతి,వధ యొనరించుటవలన నధిక
గుణుని సౌభద్రునిఁ గులభూషణంబుఁ బాం, చాలతనూజపంచకముఁ గోలు

తే. పోకఁ జేసియు గెల్పు గెల్పుగ మదీయ,బుద్ధి గైకొన దయ్యెడు సిద్ధముఖ్య
యుడియఁగాక వేఱొక్కండు మదిఁ గలంచు, చున్నయది దాని నేర్పడ విన్నవింతు.

చ. భువనభుజవిక్రమోన్నతుఁడు కౌరవకోటికిఁ బట్టుగొమ్మ మ
మ్మని మొనఁ దూలపుచ్చిన మహాత్ముఁడు కర్ణుఁడు గొంతితొల్తమా
లని యుదకప్రదానసమయంబున నాయమచేత వింటి నా
తని కుదకంబు లిచ్చుటకుఁ దామముఁ బంచుటఁ గోరి చెప్పినన్ 7

వ. అప్పుడు దొడంగి యంతరంగంబు నిప్పాలం[2] బొరఁటినట్లయ్యెడి నక్కుంతిమహాదేవి దాను దివాకరువరంబున నప్పురుషవరుం బడసి పాఱవైచుటయుం బిదప నతండు ధార్తరాష్ట్రులపాల దొరయై యుండ మాకును వారికిం గలహంబు పుట్టిన నది మాన్పించుటకై యక్కుఱుకడకుం జని యేకాంతంబునం బుట్టువు దెలుపుటయు లోనయినతద్విషయవార్త లసుదినంబునుం జెప్పుచుండు. 8

సీ. ఆయమ దనపుత్రుఁ డవుట యెఱింగించి, తమ్ములలోనికి రమ్ము నీవు
నావుడు నాతండు నాకుఁ గృతఘ్నత, వాటిల్లఁ దే కురుపతిఁ దొఱంగి
వచ్చిన నది గాక వాసవితోడి క, య్యంబున కితఁ డోడె ననరె యతఁడు
వెరయనొండెను నను వెరసి యొండెన, నేవు, రింతియ కాని నీ వెవుడు నీకుఁ

ఆ. దనయు లార్వు రనకు మనిమె నద్దేవి ద, క్కనుజులెల్ల వారి కభయ మొసఁగు
మనిన నట్ల కాక యని మమ్ము నలువురఁ, బట్టఁ గాని తెగఁడు ప్రాణములకు.

ఆ. తొల్లిఁ దాన దాఁచెఁ దల్లి పదంపడి, యతఁడు సెప్పవలవ దనఁగ దాఁచె
నిట్లు[3] గాఁగ నెఱుఁగ[4] మేవురమును నతం, డిట్టి డగుట దాన నింత పుట్టె. 10

క. ఆతఁడు దుర్యోధనునకుఁ, బ్రీతిగ జూదంబునాఁడు పెక్కాడెను ధ
ర్మేతరములు వానికి మ, చ్చేతోగతి [5]కోపభరము చెందక యుండున్. 11

ఆ. అతనిమేను కుంతియట్టులకై వడి, యరయ నేను జూచి యాత్మ నద్ది
కారణంబొ యిట్లు గా ననుచుండుదు, నేమి సేయువాఁడ నింకఁ జెపుమ. 12

క. కౌరవులు నేయునవమతి, కారణముగఁ గోప మెత్తుఁ గర్ణునివదనాం

---

1. చ. నేసి. 2. గ. పాఁపి_జ. జొరలి_నట్లయ్యెడి. 3. క. గాన. 4. గ. మేమేవురము నతం. 5. జ. రోషభరము.

భోరుహముం గనుఁగొన శమ, మాఱఁగ నావశము గాక § యంతన బుద్ధిన్. 13

ఉ. గాండివి నోర్వఁ బల్కి ¹తిటు § గర్ణునిఁ జంపక వచ్చి తేనిఁ ద
మ్ముండవు గావు నాకు నని § మూర్ఖత సోదరఘాతి నైన క
ష్టుండ ననరంబునం ²బెఱుగు § శోకము నెట్లు సహింతుఁ దప్పె నా
తండును నేము నైన విబు § ధప్రకరంబును మాకు నడ్డమే. 14

వ. అని పలికి మునీంద్రా యమ్మార్తాండనందనురథచక్రంబు భూమిం గ్రుంగుటకు గారణం బెద్ది దాని నవ్వీరుండు పరశురామునిచేత శప్తుండయిన తెఱంగును నెఱింగింపవలయు భువనంబులవర్తనంబులు నీకుం దేటపడనియవి లేవు గావున నిన్నడిగెద నని ప్రార్థించుటయు నవ్విధం బంతయు వివరించెద విను మని యమ్మహీపతి కమ్మహాత్ముం డి ట్లనియె. 15

—॰ నారదుండు ధర్మరాజునకుఁ గర్ణునిచరితంబు చెప్పుట ॰—

సీ. మునిదత్తమగుమంత్ర § మున గొంతి కన్నియ, నాఁడు వేడుక దిన § నాథుఁ దనకుఁ
బ్రత్యక్షముగఁ జేసి § పడయుటఁ దా సిగ్గు, పెంపున సుతు § వెలయింపదయ్యెఁ
గన్యాత్వవికలత § గాకుండ నామార్య, వరము గల్గుటఁ జేసి § వంశవర్య
యై బాల్చె దేవర § హాస్య మిత్తెఱఁ గిట్లు, పాఱ వైవఁగఁ బడ్డ § పట్టి సూతుఁ

తే. డత్తికొనిపోయె సూతజుం § డితఁ డనంగఁ బెరిగి కర్ణుండు నీనేర్పు § భీములావు
నరునివిలుబల్మి యతనికి § హరికిఁ గలుగు, చెలిమిగని తద్దవఁగఁ బొందుఁ § జిత్తమెరియ.

క. నకులసహదేవనయశా, స్త్రకళావేదిత్వమునకు § జను లనురాగా
ధికులై మిమ్ముం గొనియా, టకు నాతఁడు మనసు ³గీడ్ప § డం జింతిల్లున్. 17

వ. అది తదీయస్వభావం బట్లుం గాక దైవఘటనంబు నట్టిద యమ్మాత్సర్యంబున నక్కర్ణుండు మీయెడ నిసుగలవాఁ డయి దుర్యోధనుం గూడికొని కొఱఁ బదంపడి ధనంజయుధనుర్విద్యాతిశయం బుపలక్షించి కుంభసంభవుపాలికిం జని యేకాంతంబునం దనకు బ్రహ్మాస్త్రంబు సాంగోపాంగంబుగా నుపదేశింపవలయు నని యడిగి యేను సమరంబున సవ్యసాచికి సమానుండ నగుటఁ గోరి వచ్చితి నీవు సర్వశిష్యసమాదరుండవు భవత్ప్రసాదంబునం గృతాస్త్రుండ నయి వెలయ వలదే యనవుడు నద్దిననాథనందనునకు నగ్గురుం డి ట్లనియె. 18

తే. వ్రతసమన్వితభూసుర § వర్యుఁ డొండె, నిరుపమానతపఃపుణ్య § నృపతి యొండెఁ
గాని యన్యులు బ్రహ్మాస్త్ర § దానమునకుఁ, బాత్రములుగారు నీకు నీ § బాడి ⁴గాదు

వ. అనుటయు నట్ల కాక యని నిజమందిరంబునకుం జని మఱునాఁడు గదలి మహేంద్రమహీధరంబున కరిగి పరశురామునిం గాంచి వినయంబునఁ బ్రణమిల్లి యేను బ్రాహ్మణుండ భృగువంశజాతుండ నస్త్రవిద్యాపేక్ష నిన్నాశ్రయింప వచ్చితి ననిన నమ్మునివరుండు ప్రీతుం డై కర్ణుం బరిగ్రహించి పరిక్రమంబు

1. క. తిట్టు. 2. గ. గదుఱు; జ. బెరఁగు. 3. గ. గీడ్వడం. 4. ఛ. లేదు

సేయుచు చుండ నట్టియెడ నాశ్రమపరిసరంబున నొక్కచోఁ దనయంతన లాఘ
వాభ్యాసంబు సేయుచుండ నొక్కమహాద్విజునిహోమధేనువువత్సం బడ్డంబు
వాఱి బాణగోచరంబై మృతిం బొందినం గని యవ్విప్రుండు గోపంబున శాపం
బిచ్చిన దానం జేరు ధరణిం గ్రుంగె జామదగ్న్యుండు శపించిన తెఱంగునుం
జెప్పెద నవ్వీరుం డతనికి భక్తుండై పరిశ్రమం బాచరింప నతండు బ్రహ్మాస్త్రంబు
లోనుగా ననేకాస్త్రంబు లొసంగెఁ బడంపడి యొక్కనాఁడు. 20

తే. కర్ణునుత్సంగమున మస్తకంబుఁ జేర్చి, గురుఁడు నిద్రింప విశ్రుతాతిఘోరరూప
[1]మళకమనియెడునొకకీటకమద్దినేంద్ర, తనయు[2]క్రిందొడఁదొలిచె సత్వరముగాఁగ.

వ. అతండును గురునకు నిద్రాభంగం బగుట కోర్వక ధైర్యంబునం గీటకృత్యంబున
నోర్చి యచలుండై యుండ నెత్తు రొండొండ పరఁగి పరశురాముశరీరంబు సోఁ
కిన నమ్మహాత్ముండు మేల్కని రక్తం బెక్కడి దని యడిగినఁ దొడ యెత్తి కీటంబుం
జూపి యిది దొలుచుచుండ మీనిదుర సెడుటకుం జాలక కదల కుండితి ననిన
నమ్మునిం గనుంగొనిన నక్కీటంబు. 22

క. మృతిఁ బొంది రాక్షసుం డై, ఖతలంబుననుండి పలుకుఁ గరుణాకర నీ
కతమున దారుణశాప, ప్రతిహతి వాటిల్లె నిపుడు ప్రకృతి వడసితిన్. 23

వ. గ్రస్తుం డనుపేరం బరఁగునొక్కరక్కసుండ భృగుపత్ని నపహరించి తదీయ
శాపంబునం గీటంబ నై యుండి భవదీయవిలోకనామృతసేకంబున సుఖి నైతి నని
చెప్పి నమస్కరించి నిజేచ్ఛం జనియె రాముండు రాధేయుధైర్యంబు మనంబున
నిరూపించి యతనితోడ. 24

క. ఈ తాల్మి లేదు బ్రాహ్మణ, జాతికి నీ వెవ్వఁడవు నిజం బనవుడు నే
సూతజుఁడ ననియె వెఱచుచు, నాతం డామునివరేణ్యుఁ డతికుపితుం డై. 25

వ. నీవు బ్రాహ్మణుండ నని కపటంబున మత్పరిగ్రహంబు వడసితి తత్ఫలం బనుభ
వింపు మని యస్త్రవిభవంబు [3]వికలంబుగా శపియించెఁ గర్ణుడునుం జేయునది
లేక వగచుచు వచ్చి దుర్యోధనుం గాంచి.

ఆ. అధిప పరశురాముశనాశ్రయించితిఁ గృతాస్త్రుండ నైతి నన్ను భండనమున
మార్కొనంగ లేరు సమగ త్రిజగంబున, ననుడు నతఁడు ప్రముదితాత్ముఁ డయ్యె.

వ. ఇవి మీయన్న వోయినపోకు లిట్లు దుర్యోధనునకు ననుంగై యుండం గళింగపతి
యగుచిత్రాంగదుండు శుభాంగి యను నిజపుత్త్రికి స్వయంవరమహోత్సవంబు
సేయించువాఁ డై చాటించిన శిశుపాలుండును నీలుండును జరాసంధుండును
రుక్మియు లోనుగా రాజు లనేకులు తదీయరాజధాని యగు రాజపురంబునకుం
జనిరి దుర్యోధనుండును దోహలంబున సముచితచతురంగబలసమేతుండును గల్పి
తరథారూఢుండును గర్ణసహాయుండును నై యరిగె నట్లు గూడినభూపతులకుం

1. క. గ. ఛ. జ. 'అళక' అ. అలర్క. 2. క. గ. చ. క్రిందొడ. 3. గ. విఫలంబుగా.

దగుసంవిధానంబు లాచరించి. 28

సీ. కాళింగుఁ డాత్మీయకన్యాస్వయంవర, కార్యంబు నడప నక్కన్యసఖులు
దాదులు పేర్వేర ధరణీపతులఁ జూపి, చెప్పంగఁ జూచుచుఁ జేతఁ బుష్ప
మాలిక యొప్పఁ దన్మధ్యవీథికి నల్ల, నడచుచోఁ గురుపతిఁ గడచి పోవు
నతఁ డల్గి యచ్చపలాక్షిఁ బోనీక, పట్టి రథంబుపైఁ బెట్టఁ [1]బనిచి
ఆ. యేఁగుచున్న రాజు లెల్ల సంక్షోభించి, కూడుకొని యదగ్రఘోరభంగిఁ
దాఁకి రవ్విభుండుఁ దలఁకక బలశౌర్యములు వొగడ్త కెక్కఁ బోరె నధిప.

వ. అట్టియెడ. 30

శా. భల్లంబుల్ పరఁగించి యుగ్రముగ భూపాలోత్తమాంగంబులన్
డొల్లం జేయుచుఁ జిత్రలాఘవము నాటోపంబు దర్పంబు రా
జిల్లం గుంభిఘటారథవ్రజహయశ్రేణీపదాతిప్రతా
నోల్లాసంబుల రూపుమాపుచు ననాశ్చర్యుం డయ్యెఁ గర్ణుం డనిన్. 31

వ. ఇవ్విధంబున విక్రమించు నవ్వీరవర్యుని శౌర్యబాహువీర్యంబులకు భయంబుఁ గొని హతశేషు లయినభూపతులు వఱచినం బ్రీతుం డగుచు నక్కురుకుమారుండు గన్యారత్నంబుఁ గొని కరినగరంబున కరుగుదెంచె నప్పగ మనంబునఁ బెట్టికొని పదంపడి జరాసంధుం డక్కమలబంధుపుత్రు నెక్కటిపోరికిం బిలిచినం బోయి. 32

సీ. ఎక్క టెక్కటి పోరి యుద్ధవిద్యాస్త్రసంచయవంతుఁ డగుజరాసంధుబాణ
ధనురాదివివిధసాధనములు దనచేతఁ, దనయస్త్రశస్త్రసంఘాతాన మొల్ల
నాతనిచే మడియంగ రథంబులు, డిగ్గి పెంపారెడునగ్గలికల
నాతండుఁ దాను బాహాసంగరమునకుఁ, జొచ్చి పెనంగఁగ నొచ్చి యతని
ఆ. యురగసంధి వికల మగుటయుఁ బోరు సాలించి యతఁడు గారవించి తనకు
మహితవిభవ మైనమాలినీనగర మీ, నధిక తేజ మెసఁగ నరుగుదెంచె. 33

వ. ఈరెం డవధానంబులు నీవును గొంత యెఱుంగు దిట్టుప్రసిద్ధబలపరాక్రముం డైన కర్ణునుదీర్ణత్వంబు సెఱుచుటకునై కవచకుండలంబులు భిక్షించి పుచ్చుకొని నాకలోకపతి నీకు హితం బాచరించె దానం జేసి ధనంజయుం డతనిం దెగటార్పం జాలె నని చెప్పి వెండియు. 34

చ. వినుము నరేంద్ర విప్రుఁ డలిగెన్ జమదగ్నిసుతుండు శాప మి
చ్చె నమరభర్త వంచనము సేసె వరం బని కోరి కుంతి మా
న్చె నలుక భీష్ముఁ డర్ధరథుఁ జేసి యడంచెఁ గలంచె మద్రరా
జనుచిత మాడి శౌరి విధి యయ్యె నరుం [2]డనిఁ జంపెఁ గర్ణునిన్. 35

వ. అట్లుం గాక. 36

క. హరసురపతియమవరుణులుఁ, గురుకృపులును దివ్యబాణకోటులొసఁగుటన్

---

1. ఆ. వెవ్వేఱ. 2. క. బనిచె, నెఱఁగియున్న; గ. బనుచు [illegible] చటి. 3. చ. దటు; జ. డిటు.

నరుల శక్తి కర్ణతేజ, స్స్ఫురణము నార్పంగఁ జాలెఁ § జువ్వె నృపాలా. 37

వ. అనిన విని శోకవ్యాకులుండై యన్నరపతి గన్నీరొలుక నిట్టూర్పు నిగిడించినం దత్సమీపంబున నున్నకుంతి గనుంగొని యడ లుడుపుటకై యతనితో ని ట్లనియె. 38

చ. జననముఁ [1]జెప్పి యేఁ దెలుప § సత్యము సుమ్ము రకుంతి భాషణం
బని తనుజత్వజాతకృప § నంబుజమిత్త్రుఁడు వల్కె నేమిటం
గావకొననేరఁ డయ్యెనినుఁ § గూడ సుయోధనుఁ బట్టి యట్టిక
ర్ణునకయి నీకు నేఁటికి మనోవ్యథఁ బొందఁగ నిట్లు పుత్త్రకా 39

వ. అనుటయు నవ్వచనంబులు దనకు నసహ్యంబు లైనం గటకటంబడి యద్దేవి నాలోకించి భవదీయమంత్రకార్యగోపనంబునం గాదె యింత పుట్టె నని పలికి యంత నిలువక. 40

—◆ధర్మరాజు స్త్రీలకు రహస్యరక్షణంబు లేకుండ శపించుట.◆—

తే. అంగనాజనమ్ములకు రహస్యరక్ష, ణంబునందలిశక్తి మనంబులందుఁ
గలుగ కుండెడు మెల్లలోకముల నని శ, పించె నాధర్మదేవతాప్రియసుతుండు.

వ. ఇట్లు మహాతేజోధనుం డగుసజ్జననాథుం డట్లు శపియించి కుంతి చేసినకర్ణగోపనంబు ప్రసంగంబుగా నంతరంగంబు గృతపడినకార్యంబులదెస నిగుడం దనకతంబున మృతిఁబొందినయుభయపక్షబంధుమిత్త్రకోటులం దలంచి యుమ్మలించి విశేషించి కర్ణుచావునకుఁ దూర వగచి విహ్వాలించి వివ్వచ్చునాననం బాలోకించి యి ట్లనియె. 42

క. మన కేటిరాజ్య మొండొక, జనపదమున కేఁగి భైక్ష్యచర్యావిధి జీ
వనము నడిపికొని యుండుద, మనఘా య ట్లయిన సుఖుల § మవుదుము సుమ్మీ.

వ. అని వెండియు. 44

సీ. జ్ఞాతుల నందఱ § జంపితి మది యాత్మ,వధము కాదే రాజవర్తనంబుఁ
గాల్పు మహింస నిశ్చయము ధాల్మి మత్సర, వర్జన మిది వనవాసజనుల
కాగమవిహితంబు § లట యింత యొప్పునే, వనమున వసియింప వలయు వింటె
యసుఖదం బైనరాజ్యామిషంబునకుఁ గుక్కలభంగిఁ దమలోనఁ § గాటులాడి

తే. కులము నెల్లను బొలియింపఁ గుత్సితంపు, బ్రదుకు వచ్చెనె యనువగ § పాలువడఁగఁ
బ్రమద మొసఁగదు త్రైలోక్యరాజ్యమైనఁ, గానయేనొల్ల మహి మీరకైకొనుండు.

మ. ధృతరాష్ట్రుండు తనూజుకీడు సమబుద్ధిం జూడ కన్నిచుఁ డే
గతిఁ జన్నం జన నిచ్చెఁ గాని మగుడం § గాఁ దివ్వఁ డయ్యెన్ [2]నిరా
కృతశీలుం డగునాసుయోధనుఁడు సంరక్షణంబు సేసెం గులం
బతనిం జంపఁగఁ గోప మాఱె మది శోకాక్రాంత మయ్యెం దుదిన్. 46

1. గ. దెల్పి. 2. జ. నిరాకృతశీలుం.

వ. అదుర్జనుండు గర్జం, బెఱుంగక దుర్మానంబు వాటించిన సైరించి తొలంగనైతి రాజ్యపరిగ్రహపరత్వంబు మచ్చిత్తంబునం గలిమిం జేసి కిల్బిషం బత్యంతంబు నాచరింపవలసెఁ బరిగ్రహదోషంబు పరిగ్రహత్యాగంబునం గాని పోదు పరిగ్రహత్యాగశీలుండు జన్మమరణదుఃఖంబులం బొరయం డని శ్రుతులు సెప్పెడు నొకనికి సకలధర్మంబులు ననుష్ఠింప శక్యం బగునే యపరిగ్రహం బొక్కటన శుద్ధుండ నయ్యెద మీరు భూమిపాలనపరిగ్రహతత్పరత్వంబున వర్ణాశ్రమరక్షణంబు సేయుం డేను గాననంబునకుం జని మునిజనసకాశంబున సుఖనై యుండెద ననిన విని యింద్రాంశసంజనితత్వకలిత తేజోధనుం డగు నర్జునుం డయ్యుం దన యామ్మలత్వంబున నవ్వాక్యంబులు దుస్సహంబు లైనం బదరి దరస్మితంబునఁ దద్వికారంబుఁ గప్పి యప్పుడమిఱేని కిట్లనియె. 47

—◆ అర్జునుఁడు ధర్మజున కుచితవచనంబుల మనస్తాపోపశమంబు సేయుట. ◆—

క. ఓహో యిట్టివి గలవే, బాహాదర్పమునఁ బరులఁ బరిమార్చి తుదిన్
మాహాత్మ్యం బెడలఁగ భి, క్షాహారత నొందఁ దలఁప నగునె నరేంద్రా. 48

సీ. ధర్మపథంబున ధరణి సేకుఱినఁ బా, లింపక సత్త్వంబు పెంపు మాలి
విడుచుట యొప్పునే విను మిట్టు లైన ము, న్నేల భూపాలుర నెల్లఁ జంపి
తడలి రాజ్యము దక్కి యడవికిఁ జనిన బే, [1]లందురుగాక మే లండ్రె జనులు
కిల్బిషశంక గల్గిన నశ్వమేధాది, పుణ్యకర్మంబులఁ బోదె వంశ

ఆ. ధర్మ మెడలఁ గృపణకర్మంబుఁ గోరి త, ర్థంబు సువ్వె సకలధర్మకారి
యొడమి లేనివాఁడు నడపీనుఁగను నహు, షోక్తి వినమె దాని నూఁదవలదె.

క. సరిగా నెన్నుదు రార్యులు, దరిద్రునిం బతితునిం [2]గృతఘ్నుని జడునిన్
దొరకొను ధర్మముఁ గామము, బరమగతియు నర్థమునన పౌరవముఖ్యా. 50

క. కలిమియ చుట్టలఁ జేర్చుం. గలిమియ చెలులను ఘటించుఁ గలిమియ శౌర్యో
జ్జ్వలుఁ డనిపించుం గలిమియ, పలువురు సద్బుద్ధి యనఁగఁ బరఁగం జేయున్. 51

క. ఏవాని బంధుమిత్త్రులు, జీవధనంబులును డప్పెఁ జెందును గృశునిం
గా వాని నెన్నఁగాఁ దగుఁ, గేవలతనుకార్శ్యయుతుఁడు కృశుఁడె నరేంద్రా.

వ. కావున నర్థోపార్జనంబును బంధుమిత్త్రపరిపోషణంబును భూపతులకుం బరమపురుషార్థం బదియునుం గాక. 53

తే. జ్ఞాతినాశనమునఁ గాదె సకలదేవ, తలు ప్రవర్ధన మొందుట ధనము లడిచి
పొడిచి యొప్పని వారిచేఁ బుచ్చికొనక, యడఁగియుండంగఁ జేరు నే యం ద్రబుధులు.

వ. వేదంబులు నిట్లు సెప్పఁ బృథివి బలువునం గైకొని పార్థివు లర్థంబు లుపార్జించి పర్జన్యాదు లగు నాదిత్యుల నధ్వరక్రియాజాతంబునం బ్రీతులం జేసి యుత్తమలోకంబులు వడయుదురు త్రైరువు వట్టి దిలీప నృగ నహుష సాంబరీష మాంధాతలు

1. అ. అంధుడు గా శేల మే అంధుడు. 2. [illegible]

నడచుట వినమె తత్పదవి నీ కొదవి యున్నయది తదీయప్రకారంబున బహుళ
దక్షిణావిధానంబుగాఁ బ్రభూతం బైనయజ్ఞంబు సేయుమై తేనిఁ జూవె సకల్పిషుండ
వగుట యశ్వమేధంబు సేసినరాజు లెల్ల నవభృథంబునం బరిపూతాత్ములగుదు
రని పలికిన నయ్యజాతశత్రుండు. 55

క. వెడవెడ యప్పలుకులు చెవి, నిడి కొండొకసేపు చింత యొసకంబునపా
ల్పడి యూరకుండి చిత్తం, బడలునఁ జిక్కువడ నిట్లు లను నర్జునుతోన్. 56

క. నేమప్పుఁ దెరు వొక్కటి గల, దే మెచ్చితి దాని నడుగు మెయ్యది యని సు
త్రామసుత యడుగ కున్నను, నేమి వినుము చెప్పెదను మునీంద్రుల కెక్కన్.

సీ. సారహీనము లగుసంసారసుఖములు, విడిచి యేకాకి నై యడవి కేఁగి
తాపసవాక్యామృతములు వీనులఁ గ్రోలి, చెలిమి వేర్పాటను చిరమరలకుఁ
జొరకనిందాస్తుతుల్ సరిగాఁ గొనుచు గత్తి,నొకఁడు వ్రేసినను వేఱొక్కరుండు
చందనం బలఁదిన డెంద మొక్కరువుర, యెడ సమంబుగ మూఁగజడుఁడనంగ

తే. మెలఁగి తగువేళఁ బర్ణశాలలకు నరిగి, యెత్తఁగా భిక్ష యెవ్వార లెట్టు లేమి
యిడినఁ గైకొని నాలుగే నెడలమాత్రఁ, గన్నదానఁ దృప్తుండనై యున్నమేలు.

క. అటు గాక కర్మగతిలం, పటుఁడ నగుదు నేని నల్ప[1]ఫలభాగితమై
నట నిట దిరుగుచు మోక్షని, కటవృత్తికి బాహిరుండఁ గానె కుమారా. 59

వ. కావున నాకు దొరకొన్నవిమల[2]ప్రజ్ఞామృతం బనుభవింపక తక్కుదు నే యిది
శాశ్వతపదప్రదం బనిన విని యనిలతనయుం డతని కిట్లనియె. 60

క. శ్రుతివిహితకర్మజాత, స్థితియోగ్యుఁడ వైననీకుఁ జేయఁగ వశమే
యతిలోకజ్ఞానసమ, న్వితయతిజనకృత్య మటు వివేకింపు మెదన్. 61

చ. అకలున రాజధర్మములయందు జనించె ననూయ నీకు ని
ప్పుడు మును నిస్పృహాహుండవయి పోవఁగఁ గన్నఁ గులంబువారు ని
ప్పుడమినృపాలురై బ్రదికి పోనుడు నెమ్మది నట్లు లైన నే
యుడుగుదు మన్త్రజీవనసమృద్ధతిఁ జొత్తుము భైక్షవృత్తికిన్. 62

క. వాఁడి యగుసలుక లోకము, పోఁడిమి సెడఁ గయ్య మట్లు వాడిచి వనటమై
నేఁ డింక నడవికిం జను, వాఁడం గా కనినఁ బుడమివారలు నగరే. 63

సీ. పనివడి త్రవ్వి కూపమునందు సుధఁ బానంబు సేయనివానిభంగి
యున్నతతరు వెక్కి జున్ను సేకుఱఁ గొని, తేనియ యాననివానిభంగి
యూఁకొని యొడఁగూర్చి యన్నంబు దళియకు, వచ్చినఁ గుడువనివానిభంగి
తనుకంచి యొకభంగిఁ దనవశంబుగఁ జేసి, మానినిఁ గవయనివానిభంగి

ఆ. గాదె కురువరేణ్య ఘనశక్తిశౌర్యసం, పన్నులైనపగఱ భండనమున
నోర్చి పూజ్యరాజ్య మొల్లక యడవికి, నేఁగు టీవ యెఱుఁగుదిత్తెఱంగు. 64

1. క. ఫలభోగముపై. 2. చ. జ్ఞానామృత.

క. నీ వడవి కరుగ నొడఁబడి, నీ వెనుకన వచ్చునపుడు ǂ నిందింతురు మ
మ్మీ వెఱ్ఱు లితని మానుపఁ, గా వలఁతులు గార యని జ ǂ గజ్జను లధిపా. 65

క. భోగములఁ బాపి నిందా, భాగులఁగాఁ జేసి యడవి ǂ పాల్పఱిచెద వే
నీ గౌరవం పుఁ దమ్ముల, సాగరవృతధరణిఁ గలుగు ǂ జనములు వగవన్. 66

వ. అని వెండియు. 67

క. కేవలనిష్కర్మత మో, క్షావహ మగునేని గిరులు ǂ నవనీజములున్
భూవర ముక్తిం బడయుం, గా వలవదె యడవి నునికి ǂ కైవల్యదమే. 68

క. ఫలములయెడ బ్రహ్మార్పణ, కలనపరుం డగుచుఁ గార్య ǂ కర్మము నడపన్
వలయుం దత్త్వజ్ఞానము, దలకొనినం గర్మశమము ǂ దా నై కలుగున్. 69

వ. కావునం గర్మహీనత్వం బపవర్గకరంబు గా దనవుఁడు నర్జునుండు ధర్మనందను
నుద్దేశించి దేవా యొక్క యితిహాసంబు గల దవధరింపు మని యి ట్లనియె. 70

సీ. కొందఱు బ్రాహ్మణుల్ ǂ [1]గొంకక లాత్మకు లోచితాచారంబు ǂ లుడిగి కాన
లకుఁ జన్న వజ్రి వారి కిఁ గృప చేసి పతత్త్రిరూపమునఁ ద ǂ త్పార్శ్వమునకు
నరిగి మీ కై కొన్న ǂ తెరు వొప్ప దనవుఁడు, విని వా రఖిలమార్గ ǂ వేది యద్భు
తాస్పద మీపక్షి ǂ యని దాని కభిముఖు, లై సత్పథం బెద్ది ǂ యనఘ చెపుమ

తే. యనిన [2]నలుగాలివానగో ǂ వును విశేష, శబ్దములమంత్రమును లో ǂ హజాలిఁగాంచ
నమును మనుజులవిప్రుండు ǂ సమధికత్వ, భాజనము లండ్రు వేదప్ర ǂ పంచవిదులు.

వ. ఇ ట్లుత్తముం డైనవిప్రుం డుత్తమమంత్రోపాశ్రితంబు లగువిహితకర్మంబులు
నవపుట రత్నకాంచనసాంగత్యంబునుం బోలె సంస్తుత్యం బై యుండు నాలస్యంబు
నఁ [3]గ్రోధంబున శోకంబునఁ దదనుష్ఠానంబు విడుచుట పాతకం బజ్ఞాను లగునర్థ
హీనులు సన్న్యాసకాలవివేకంబు లేక వేగిరపడి యుభయభ్రష్టు లగుదురు గృహ
స్థధర్మంబున వర్తించి యతిథి దేవ పితృ [4]సంతృప్తి సేయుచు శిష్టాన్నభోజనపరు
లగుపుణ్యులకుం బుణ్యలోకంబు లఱచేతిలోనివి గావె బ్రహ్మార్పితం బగున
సత్కర్మకలాపంబు మహానందంబుఁ జేయు ననుటయు. 72

క. విని వారు దెలిసి మరలం, జనిరి గృహస్థత్వధర్మ ǂ సదనుష్ఠానం
బునకు నటు లగుట నేలుము, జనవల్లభ పుడమి నడుపు ǂ జన్నము లెలమిన్. 73

వ. అని చెప్పె నప్పుడు నకులుం డన్నరనాథున కి ట్లనియె. 74

నకులుఁడు ధర్మజునకు మనస్తాపోపశమనంబు సేయుట.

సీ. దేవతల్ వేదవి ǂ ధిప్రవర్తకులు బ్రా, హ్మణులును వారల ǂ యట్ల శ్రుతుల
కింకరు లై కాదె ǂ కిల్బిషంబులఁ బాసి, వారిచందమున శా ǂ శ్వతవిభూతి
నొందుట యజ్ఞాదు ǂ లుడుగుట సంపద, త్యాగమే పాడిమై ǂ నర్థముల ను
పార్జించి దేవతా ǂ బ్రాహ్మణపూజగా, నిడుచుఁ దత్ఫలకోటి ǂ విడుపు గాక

1. ఖ. చ. గొండొక. 2. జ. నలుకాలిలోన. 3. గ. గోపంబున. 4. చ. పూజలు.

ఆ. క్రోధశోకహర్షకోటుల గృహములో, విడిచి యోగ మూఁది వృక్షమూల
వాసనిరతి నుండు[1] వాఁడొకసంపరి, త్యాగి నృపుల కది స్వామర్థ్య మగును. 75

క. తక్కినయూఁ డాశ్రమములు, నొక్కదెస గృహస్థధర్మ మొకదెసఁ దులయం
దెక్కింప వానిలోన, య్యొక్కటిసరిదూఁగ నందు రుర్వీశ బుధుల్. 76

వ. కావున గృహస్థధర్మంబ యాచరణీయం బట్లుం గాక. 77

క. జతనంబున నర్థము సం, చితముగఁ గావించి క్రతువిశేషంబుల దే
వతలం దృప్తులఁ జేయుమి, యతికిల్బిషకారి యందు రాగము వేదుల్. 78

చ. వినుము తపోమయం బయినవిశ్వముఁ దా వెలిఁగించు నీశ్వరుం
డన నొకరుండు వర్ణతతి నాశ్రమకోటిని వాఁడు గాదె చే
సె నిఖిలకర్మయోగసవిశేషత గల్గుటయుం దదీయక
ల్పనమ తదాజ్ఞకుం దొలఁగ బాడియె శోకము గారణంబుగన్. 79

వ. హింస దోషంబు గలుగు ననుశంకకుం బని లేదవధరింపుము.

క. పరుల వధింపక యెవ్వఁడు, ధర యేలెం జెపుమ పూర్వధరణీశులలోఁ
బొరయరు పాపము సుగతిక, యరిగిరి వారీవు నట్ల యగు టొప్పు నృపా. 81

క. రక్ష ప్రజ గోరు నిజయోగక్షేమార్థముగ జనసుఖస్థితి నడపం
దక్షుఁ డగురాజు నడపకు, పేక్షించినఁ బాప మొందదే కురుముఖ్యా. 82

తే. గోవులను ఘోటకంబులఁ గుంజరముల
దాసులను బ్రీతి నిమ్మెల్లధాన్యములను
గ్రామముల మందిరముల నిష్కముల వేడ్క
నొసఁగు తత్తత్సుపాత్రత్వయుక్తవిధుల. 83

వ. వీని నిన్నింటి రిత్తవో విడిచి పోయెద ననుట నీయట్టిమహానుభావునకుం
దగునే యని పలికినం దదనంతరంబ సహదేవుం డమ్మహీపతి కిట్లనియె. 84

సీ. [2]వెలివెలి వస్తువుల్ [3]విడిచెఁ బో నరుఁడు గర్మిష్ఠతం గాదె శరీరయాత్ర
నడపువాఁ డది మోక్షణంబు గా నేరదు, శారీరసౌఖ్యసంసక్తి వదలి
బాహ్యపదార్థముల్ పాటించి నిజవంశ, ధర్మముల్ వదలక తగఁ జరింపు
మమత బంధంబు నిర్మమత మోక్షంబును, జేయు నింత యెఱింగి చేసి రథిప.

తే. రాజ్యమెలమి మన్నాదు లరణ్యమునకు, నరిగినీవందువలయు ద్రవ్యములమీఁదఁ
జేయవలదె మమత్వంబు వేయు నేల, యదియు సంసారచక్రవాహకముగాదె.

తే. నీవ చుట్టంబు బక్కంబుఁ నీవ చెలియు, నీవ తల్లియుఁ దండ్రియు నీవ గురువు
నీవ దైవంబుఁ గావున నావిషాద, భావణంబులు సైరింపు భరతముఖ్య. 86

క, తథ్యము లైనను దలఁప న,తథ్యము లైనను సభక్తి తాత్పర్యము వై
తథ్యంబుఁ బొరయకుండఁగఁ, బథ్యంబుగఁ గొనుము నాదు పలుకులు కరుణన్.

---

1 గ. వాఁడతో; చ. వాఁడొకో. 2. చ. వెడవెడ వస్తువుల్. 3. చ. వీటిలో...గాక శరీర.

వ. అనియిట్లు దమ్ము లందఱును బోధించుపలుకులు విని ధర్మనందనుం డూరక యుండ నతనియెడ సవిశేషబహుమానయు నతనిచేత సంతతోపలాలితయు [1]ధర్మాధర్మనిదర్శనశీలయు నగుపాంచాలి భద్రగజప్రతిమాను లైనయుప్పవమాన తనయధనంజయనకులసహదేవులమధ్యంబున యూథపతివోలె నున్నయన్నరేంద్రు నల్లనఁజేరి యేనును నాయెఱింగినంత సెప్పెద నని యనుజ్ఞఁ గొని యవ్విభు వదనంబున నిజవిశాలలోచనరోచులు పరఁగ వినయం బాననంబున నతిశయిల్ల.

—ద్రౌపది ధర్మజునకు హితవచనంబుల మనస్తాపోపశమంబు సేయుట.—

సీ. శోకాగ్ని దనికిన ॥ [2]సాగయానీతమ్ముల, నుపపన్నవాక్యామృ॥తోపయుక్తిఁ
దేర్పుము గానలం ॥ ద్రిమ్మరుచున్నాఁడవీ, రాయాసములఁ బడు ॥ టవధరించి
సమయకాలము సన్నఁ॥జని సుయోధనుఁ జంపి, భోగంబులను బహు॥త్యాగములను
యాగంబులను సద్వి॥హారమ్ములఁ సలుపుద, మని యూఱడింపవే ॥ యరిగణంబుఁ
తే. ద్రుంచి రాజ్యంబు [3]నేకొంటి॥తో నెఱిఁగిపోదుఁ, గాక యనియిప్పుడిట్టికిం ప॥నికిఁ దగు నె
ధర్మమ్మును సత్యమును నుచి॥తంబు నిన్నుఁ, గడవ నెఱిఁగెడువార లు॥గలరె యధిప.

వ. అని ముట్ట నాడి మఱియును. 90

క. వేదమున నగుట ధర్మువ్వు, గాదు నరేంద్రుఁడరు జగము ॥ గావం బ్రోవం
గాదె సృష్టి లోకపాలాం, శోదితుఁ గాఁ జేసెఁ బద్మ॥యోని చతురతన్. 91

క. నరరూపంబునఁ [4]బరఁగెడు, పరదేవత గాక నృపుఁడు ॥ బాలుఁ డయినన
ప్పురుషుని నెడ నేమి వొమ్మని, తిరిగినదుర్మతులఁ బొంద॥దే కీడధిపా. 92

ఉ. నేరక చేర నొక్కనిన ॥ నీఱుగఁ జేయుఁ గృశానుఁ డిద్ధధా
త్రీరమణాగ్ని గాల్చు నతి॥తీవ్రత వంశము నెల్ల నిట్లుగాఁ
గారవకోటి దర్పమునఁ ॥ గానక నిన్నుఁ బరాభవించిదు
ర్వారభవత్ప్ర[5]కోపశిఖిఁ ॥ గ్రాఁగె మదిం దగఁ బేల దీనికిన్. 93

సీ. నృపునందు విధి దండ॥నీతి ప్రతిష్ఠించెఁ, గావున నపరాధ॥గతి యెఱింగి
దండించునృపతికి ॥ రెండులోకంబులుఁ, జేకుఱు దోషంబు ॥ సేయ నుదుట
నచ్ఛాత్తి వెడలంగ ॥ నడుచు విప్రుని నైన, భూవరుం డిది మెచ్చు ॥ దేవకోటి
సభ కేకవస్త్రి ర॥జస్వల యనక నన్, దల వట్టి యీడ్చినన॥తప్పుఁ దనదు
తే. తొడలు సూపినతప్పును ॥ దుష్టకష్ట, తరవచనములఁ బఱిచిన॥తప్పు ననుజు
నందు దుర్యోధనునియందు॥ననుఁగునందుఁ, గాంచి దండించి తిట్టిది ॥ కల్మషం బె.

క. గరదుని గృహదాహకు మం, త్రరహస్యవిభేది వధవి॥ధాయిఁ బరసతీ
హారు బంధుఘాతిఁ బరధన, హారణపరునిఁ జంపి పుణ్యుఁ॥డగు నృపుఁ డనఘా.

క. దండార్హు లైనవారల, దండింపక యున్నఁ జుఞ్వె ॥ ధాత్రీవిభు నా
ఖండలసన్నిభు నైనఁ బ్ర, చండపుఁగిల్బిషము వొందు ॥ జగతీనాథా. 96

1. క. ధర్మార్థనిదర్శన. 2. క. ఖ. గ. సాగియు. 3. గ. కోని. 4. క. నిరిగెడు. 5. న. కోపమున.

క. పేదలకును సాధులకును, వేదములకుఁ దాపసులకు । వే యేల సమ
స్తాదిత్యులకును దండము, కాదె బ్రదుకుఁ జేయు రాజు । గావింపంగన్. 97

వ. కావున. 98

ఆ. ఉచితదండవృత్తి । నుర్వీప్రజాభిరక్షణము నోపి చేతఁ । గాక రాజ
వంశజునకు ధర్మ । మా భూసురార్హంబు, లైనశమదమాదు । లాత్మనిడుట. 99

వ. అని యంత నిలువక చనవు మెఱసి మేలంపుఁజందంబున. 100

ఉ. వైదికకర్మచారి జన । వత్సల నీమదిఁ బట్టుకొన్నయు
న్మాదము హీనమానవుమ । నంబునఁ బుట్టినవెట్టివోలె న
స్వాదులఁ దీర్చు టొప్పదు ని । జానుజవర్గముమీఁదఁ గల్గిన
త్యాదరసాంద్రసారకరు । ణామృత మానఁగ నిమ్ము [1]నెమ్మదిన్. 101

వ. అని పలికి యిట్లనియె. 102

క. నాయట్లు వడినయుంగన, లేమెడలం గలరె యిట్టి । యేనును ధర్మా
పాయము నీకగు [2]నను వెఱఁ, బాయన గృహధర్మవృత్తిఁ । బాఱవముఖ్యా.

వ. అని వెండియు. 104

క. కౌరవులు దమదురితమునఁ, దా రెరిసిరి కల్మషంబు । దానఁ గలదె భూ
భారము వహింపు బహుయ, జ్ఞారంభణ మాచరింపు । మఖిలహితముగన్. 105

క. సురగురుఁడును శుక్రుండును, బరిపాటిగ దండనీతిఁ । బలికిరి దానం
బరిణతుఁడవు నీ వనుజులు, పరికరముగ నడపు ధర్మ । భాసుర దానిన్. 106

వ. అనినం బాంచాలితో మఱుమాట లాడక యున్నయన్న రేంద్రునకు నింద్ర
నన్దనుం డి ట్లనియె. 107

సీ. దక్షుఁడై భూపతి । దండనీతి నయింప, కున్న సన్న్యాసులు । నుత్పథప్ర
వర్తను లగుదురు । వారి నన్యోన్య, ధన ధాన్య పశు భూమి । దారహరణ
మాచరింతురు జను । లప్పాప మవ్విభు, నొందు గండము హింస । యుఁగఁదలంప
వలదు దుర్వృత్తుల । వధియించురుద్రుని, గోవిందు వాసవు । గుహునిఁ జూడు

తే. మామహాత్ములు దక్కనుస । న్మార్గచరుల, దండితులఁ జేఁతవినమెయు । ధర్మమడఁగు
ధర్మ మెసఁగుదండమున న । ర్థంబుఁ గామ,మునునమాష్యంబులై సిద్ధిఁ । బొందునధిప.

వ. దండంబున సకలజనశ్రీరక్షణంబు సేయం బూనినభూనాథునక యేల యోగ్య
హింసకుం దొలంగ నట్టివారికి వశంబు గా దవధరింపుము. 109

ఉ. కాయులఁ బండ్ల నీళులను । గల్గవె సూక్ష్మపుజంతువుల్ మునుల్
సేయరె హింస వాని నుప । జీవితఁ ద్రవ్వరె కందమూలముల్
నీమెడఁ జూడు ప్రాణములు । నిల్వఁగ నేర వహింస నేరికిన్
వేయును నేల భక్ష్యముగ । వేధ విధింపఁడె ప్రాణిప్రాణికిన్. 110

1. చ. బుద్ధిన్. 2. జ. నని వెఱఁ. 3. గ. వాని నుపజీవితఁ.

క. విను పశుహింసాకృతయా, గనిరూఢుని ధర్మపరునిఁ గా వేదంబుల్
గొనియాడెడు సముచితహిం,సన మఱియు నహింస గాన జగతీనాథ. 111

క. అరివీరుల ఘోరం, బగు, దురమున వధియించు టెల్ల దోసం బయ్యెన్
ధరణీశ పాండుపాలిత, ధరావలయ మాసపడుట దగదే నీకున్. 112

క. ఇల [1]నీకై కొన్న తెఱఁగు, దలపఁగ ధర్మంబొ కాదొ దైవం బెఱుఁగున్
వలవనిచింత యుడిగి ధృతి, దలకొని పాలింపు యజ్ఞదక్షుఁడ వగుచున్. 113

క. అని పలుకుపార్థుపలుకులు. విని పలుకక యున్నమనుజవిభుదెసఁ గోపిం
చినతనమదివెడఁ గుడుపుచు, ననిలసుతుం డిట్లులనియె నాతనితోడన్. 114

ఉ. నీవు సమస్తధర్మపరినిశ్చయవేదిని నీచరిత్రమే
మే వసుధేశ వంక యని మెచ్చక చక్కఁగఁ జేయువారిమే
[2]నీవచనప్రపంచమున కింకఁ జొరం జొర నంచు నుండియున్
వావిరిఁ జెప్పఁగా వలసె వాలినదుఃఖము దాల్మిఁ గ్రాఁచినన్. 115

వ. అవధరింపుము. 116

క. ఒడఁగూడినసామ్రాజ్యము, నడలున దిగఁద్రావి చనిన నఖిలజనులు నిన్
గడుఁ బేదమనసునాఁ డని, నెడ నాడుదు రనిన మము నికసీ యను టరుదే.

మ. కపటద్యూతమునం బరాభవము రాఁ గా నూనృతం బూఁది భూ
మిప మమ్మం జులుకంగఁ జేసి నినుఁ బేర్మిం బాపికొంచున్ దురం
తపుదుఃఖంబుల కోర్చి పోయి తది యుద్ధక్రీడ నప్పాపక
ర్మపుజాతిం దెగటారఁ జేయఁగఁ బ్రకీర్త్యం బయ్యె లోకంబులన్. 118

వ. దుర్జయు లగువిరోధుల నిర్జించి యుపార్జించినపృథివీప్రముఖపదార్థంబులు నిర
ర్థకంబులు సేసి వనంబునకుం జనుచులుకఁదనం బేమిటం బాపికొనువాఁడ
వట్లుం గాక. 119

సీ. ఆసభలోఁ బడినట్టిబన్నంబును, నడవులఁ దిరిగెడునపుడు దుష్ట
దైత్యులచేత సైంధవునిచే [3]నొంటిపులఁ, బడ్డవిపాదంబుఁ బరమదైన్య
మునకోర్చి కొలిచి మాత్స్యునిపాలనున్నదుఃఖంబును ద్రోహులఁగనుపుగొట్టి
వెలువరించెద నని తలఁచి కృష్ణునినిశ్చయం బూఁది ధర్మంబ యగుట దెలిసి

తే. రణ మొనర్చితి నిను ధార్తరాష్ట్రులొండె, నీవు వారలనొండెను జావఁజూడ
వలయుటప్పు డెఱుంగవే వసుమతీశ, యిప్పు డడలుట నింద్యంబయింత నిజము.

క. పను లేము సేయఁగాదు, ర్జనులం జెఱుచుచును సాధుజనుల మనుచుచున్
జననాథ మహాయజ్ఞము, లొనర్చుచును వెలయు కురుకులోత్తంసమవై. 121

వ. అనిన విని ధర్మతనయుఁ డిట్లనియె. 122

చ. మదమును రాగమున్ భయము మానము లోనగుకిల్బిషంబులన్

---

1. గ. నీచేకొన్న. 2. జ. ఈవచనప్రపంచమున • కింకఁ 3. గ. నొంచ్చులఁ

హృదయమునఁ జొన్పి భూజనుల ♦ నేలుట మే లని పల్కె దార్త్రి కా
స్పద మని రాజ్యలాభవిషము ♦ పైఁ దగు లిమ్మహి యెల్ల నేలినం
దుది నరకంబె కాండ నృప ♦ తుల్ సుఖులే యుపశాంతి యొప్పదే. 125

తే. కామభోగముల్ మేలనఁ ♦ గాదు వాని, విడిచి చూడుము పొందెడు ♦ విపులసుఖము
కాయ లాకులు నీళ్ళును ♦ గాలి యనుభ, వించియున్న మునీంద్రులు ♦ వెఱ్ఱివారె.

క. దుర్మతు లామిషగత మగు, కర్మము వాటించి బంధ ♦ కలితు లగుదు ర
య్యార్మి గడచి సువిచారులు, నిర్మమతను ముక్తి వడయ ♦ నేర్తురు వత్సా.

వ. జనకునివచనంబులు వినమే వాని నేనుం జెప్పెద నాకర్ణింపుము. 126

ఆ. ఒకటిదెసను దృష్ణ ♦ యొలయదు గావున, నేమియర్థములును ♦ లేమి లేదు
కాలఁ జొచ్చె మిథిల ♦ గాలదు నాకు [1]నం, దొకటఁ డైన నింత ♦ నిక్కువంబు.

క. అని పలుకుజనకుఁ డెగడిరె, జను లుల్లము శాంతిఁ బొంది ♦ సంసారం బొ
ల్లనివాఁడు నింద కర్హుం, డని పలుకుట నీక యొప్పు ♦ నధికవిచారా. 128

తే. వినుము ప్రజ్ఞాధిరూఢుఁడై ♦ వనటదక్కి, సంస్కృతిక్లేశపరుల భూ ♦ స్థలిఁ జరించు
వారి నచలంబుపై నున్న వాఁడు నూచు, నట్లచూచుట నూవె నే ♦ ర్పమలహృదయ.

— జనకున కతనిపతితో నైనసంవాదం బర్జునుఁడు ధర్మజునికిఁ జెప్పుట —

వ. అని పలికి మఱి పలుక కున్నయప్పుడు మితేనికిం గవ్వడి యిట్లనియె. 130

క. జననాథ నీవు సెప్పిన, జనకనృపాలునకు నతివిశ ♦ దమానస యా
తనిభార్యకు నీక్రియ న, య్యెను సంవాదంబు దాని ♦ నేర్పడ వినుమా. 131

వ. అమ్మహీపతి పూజ్యరాజ్యంబు [2]విడిచి భిక్షావృత్తికి వెడలఁ జూచినం దదీయ
భార్య యతని కిట్లనియె. 132

సీ. పుడమి యేలుట డిగ్గ ♦ విడిచి భిక్షార్థి వై, పోయిన నతిథిసం ♦ పూజనంబు
దేవతర్పణపితృ ♦ దేవతర్పణములుఁ, గలుగునే కాషాయ ♦ ములు ధరించి
ముందుఁ డై నతఁ డన్న ♦ మునకు గృహంబుల, కరుగక యున్నె గృ ♦ హస్థుఁ డెల్ల
వారికి నన్నంబు ♦ గారుణ్యమునఁ బెట్టు, నన్నదానము సేత ♦ యధికధర్మ

ఆ. మనుట వినమె పెట్టు ♦ నతనిఁ జేయొడ్డెడు, వానిఁ దలఁప నంపు ♦ వరుఁడు పెట్టు
వాఁడ యగుట నిక్క ♦ వం బింత సూడక, యిట్లు దీనవృత్తి ♦ [3]కేఁగఁ దలఁతె.

క. త్రైవిద్యు లగుమహాత్ములు, నీవలన బ్రదుకఁ దలఁప ♦ నిష్క్రియత మెయిఁ
నీ విందఱఁ జెఱిచెద విది, దేవా ధర్మంబు గాదు ♦ దీని నుడుగవే. 134

తే. అధిప మీ [4]తల్లియుల్లంబు ♦ నడలువెల్లి, ముంచి సతి శోకసంతాప ♦ మూర్తిఁ జేసి
వంశవిహితధర్మంబుల ♦ వదలి నెడలి, పోయి యేగతిఁ బొ మెదవో ♦ యెఱుంగ.

క. [5]చలిపందిరిచందంబున, ఫలభరితం బైనతరువు ♦ భంగిఁ బ్రజలకు
ప్పాలు దీర్ప నమరి యుండెడు, నలఘుచరిత్రునకు లఘుత ♦ యగునే కోరన్. 136

1. చ. నిం, దొక్కఁ. 2. జ. నొల్లక భిక్షవృత్తి వెడ. 3. గ. నేఁగ. 4. క. తల్లిదండ్రుల 5. క. గ. చలివందిరి.

వ. ఇది ధర్మవిరోధంబు దీని మోక్షంబు గలుగు ననుట నాకుం జూడ సందియం బని
చెప్పె ననవుడు నయ్యజాతశత్రుండు పురుహూత పుత్రున కిట్లనియె. 137

మ. శ్రుతివాక్యంబులు కర్మనిష్ఠ [1]వినుతించుఁ జుమ్మీ నిష్క్రియత్వంబు స
ద్గతిఁ గావించుట యూఁది చెప్పు నిటు చిత్తప్రక్రియల్ రెండుఁ జో
దితముల్ వానిని వింటి మన్నకలుచల్ దీపించునే తత్త్వసం
గతబోధంబు సుకర్మతం గలుగు నాకం బాత్తవీరవ్రతా. 138

తే. తత్త్వబోధంబు గలుగునతండు నన్నుఁ, దెగడనేరఁడు నీవు భ్రాతృత్వసాహ్లా
దమునఁ గర్మంబు విడుచుట ధర్మ మనిన, పలుకు ప్రియము జగన్న్యాయపథము గనుట.

సీ. వడముడియును నీవు వాయువాసవులకు, క్తులు ధరియించిన దుర్జయులరు
హరికరుణాతిశయమునఁ దత్తేజంబు, మీయందుఁ దగ సంక్రమించి యుండు
మీరు సంగరశాస్త్రసారపారగులరు, గాక తత్త్వజ్ఞానఘనమతులరె
యనఁటికంబమునట్ల యనిరి నిస్సారత, సంసార మనఁగ నిస్సంప్రబుద్ధు

తే. లది ప్రసిద్ధము విను తృష్ణ యడఁచి కర్మ, వృత్తి విడిచి నిరాలంబచిత్తుఁ డైన
యాతఁడో సుఖదోషదుఃఖాకరంబు, లగు ధనంబులు గోరెడునతఁడొ చెపుమ.

ఉ. ఆదటఁ బూర్వశాస్త్రములయర్థము లారఁగఁ గ్రోలి తత్త్వసం
వేదసుధారసంబునచవిం జిరసౌఖ్యముఁ బొంద నేరకి
మ్మేదిని నెంచునుం దిరిగి మే లని కర్మము [3]చెల్లఁ జెప్పుచుం
గా దని శాంతి యొప్పనిది గాఁ జెడ నాడుదు రల్పబోధనుల్. 141

క. విమలజ్ఞానులు శమమును, దమమును ద్యాగంబు శాశ్వతప్రచురానం
దమునకు మూలము లండ్రు ని, జముగాఁ గైకొందు రవిప్రసన్నవివేకుల్.

వ. అనిన విని దేవస్థానుం డమ్మానవపతి కిట్లనియె. 148

— దేవస్థానుం డను ముని ధర్మజునకు హితోపదేశంబు సేయుట. —

సీ. ధనము లుత్క్రిష్టంబు లనుధనంజయుమాట, పాటిగాఁ గొనుము సోపానభంగి
నున్నది మార్గంబు యోగసమారోహ, ణమునకు దానన నడచి కాక
వడి నుల్క పడ నీకు వచ్చునే ధనసంగ్ర, హంబు భోగార్థకృతంబు దుష్ట
మగుటయుఁ గలదు యజ్ఞార్థకృతం బైన, నదియ నిచ్చెన బ్రహ్మపదము నొంద

తే. యజ్ఞపరిశిష్టధనభోగమాత్మకలఁక, యుడుపు నమ్మయి శమదమయుక్తి గలుగు
శమము దమమును దత్త్వవిజ్ఞానదములు, గాన దక్షిణాధికయజ్ఞకర్త వగుము.

చ. హరుఁడును సర్వమేధ మనుయాగమునం బ్రచురప్రకాశతం
బొరయఁగ వేడ్కఁ జేసె విధిపూర్వదిగీశముఖామరుల్ మహా
ధ్వరములఁ గాదె పేర్కనుట ధాత్రి సధర్మత నేలి యజ్ఞత
త్పరత వెలుంగరే నృపులు పార్థివముఖ్యమురుత్తముఖ్యులున్. 145

1. చ. వినిపించుఁ. 2. గ. పదము నగుట. 3. జ. యూఁది.

వ. వినుము దివస్పతి యడుగ బృహస్పతి సన్మార్గనిర్దేశకుం డై చెప్పిన [1]మార్గంబు.

ఉ. కామముఁ గ్రోధమున్ మనసు గాఢముగాఁ బాఱుట మాన్చి యింద్రియ
స్తోమవిమార్గవర్తనము ద్రుంచుచు నెవ్వగ లేక రక్షణం
బేమఱ కెవ్వరిం జెనకి యించుక నొంపక లోక మేలఁగా
నామహితాత్ము సర్వమహిమాతిశయంబును జెందు వాసవా. 147

వ. అనియె మఱియు నాకర్ణింపుము. 148

ఉ. కర్మము మేలు నా విగతకర్మము మే లన రెండు నొప్పునే
కర్మఫలంబు నర్పితము గాఁ దగ నీశ్వరునందుఁ జేత స
ద్ధర్మము గాక నంగ [2]వివిధం బగుధర్మపథంబులోన మేల్
ధార్మికవర్య యేర్పఱుపఁ దా వశమే వగ బుద్ధి గుందఁగన్. 149

ఉ. కావున సిద్ధ్యసిద్ధుల వికారముఁ బొందక ద్రోహ మెయ్యెడ
న్నావిరిఁ జేయ కేలి భువనంబు భవత్కులధర్మరక్షి వై
భూవరు లిట్లు సేసి తుదిఁ బుత్రుల గద్దియలందు నిల్పి కా
దే వనవాసు లైరి దృఢదీప్తనిరంజనబోధసంపదన్. 150

వ. అనిన విని నిర్విణ్ణమానసుం డై యున్నయన్నకు నర్జునుం డి ట్లనియె. 151

సీ. క్షత్త్రియధర్మనిష్ఠాపరత్వంబున, సమరంబు సేసితి శస్త్రనిహతిఁ
బూతాత్ము లై రిపుల్ వోయిరి సద్గతి, కమ్మెయి [3]రాచకర్మ మ్మొనర్చు
విప్రున కైనను సుప్రశస్తం బది, రౌద్రం బగుట బాలురకును దెల్ల
మైనను ని ట్లుండు నార్యోక్తినృపనీతి, దురితంబు సేయునే యొరుఁడు వెట్టఁ

ఆ. గుడువ నృపతిమాత్రకున్నను గా దన్నఁ, గౌరవాన్వయాగ్రగణ్యుఁ డైన
నీకుఁ దగునె విడుపు శోకంబు వజ్రసన్నిభము గాదె నృపులకెమ్మనంబు. 152

వ. అట్లుం గాక. 153

ఉ. వైరివధంబు నీకును నవశ్యముఁ జేయక పోవరాని దై
వైరులకున్ భవత్సమరవాంఛన సద్గతి కేఁగఁ బాలి దై
చేరె విధాతృసంఘటనఁ జింతకుఁ గారణ మేమి ధర్మవి
స్తారవిదుండ వీ వకట ధైర్యసమగ్రుఁడ వై వెలుంగవే. 154

వ. రాజధర్మపాత్రం బై భవదాయత్తం బైనపూజ్యసామ్రాజ్యంబుఁ బరిపాలించుచుఁ బుణ్యక్రియానుష్ఠానపరుండ వగు మని పలికిన మఱుమాట వలుక కున్నయన్నరేంద్రునకు మునీంద్రవర్యుం డగుపారాశర్యుం డి ట్లనియె. 155

సీ. అర్జునుపలుకు సత్యంబు సమీచీన, మార్యజనంబు గృహస్థధర్మ
ముత్తమం బని చెప్పు నుర్వీశ పశుపక్షు, లాదిగా జీవుల కాశ్రయంబు
నృపులకు నది దక్కఁ దపమును దమమును, బ్రహ్మచర్యమును ధర్మములు గావు

1. చ. వాక్యంబు. 2. గ. విదితం; జ. ద్వివిధం. 3. గ. రాజకర్మ.

ధనములఁ దనియుట యని కోపాటించుట, ప్రజల రక్షింపమి రాజకోటి

ఆ. కరయఁ బాతకంబు లందురు సీ వక్కట, వేదచోదనాప్రవీణ మయిన
మనసు నేల యిట్లనమార్గవృత్తికిఁ జొర, నిచ్చె దోపి ధరణి యేలు మనఘ.

క. నీ వార్యబోధితుండవు, గావే వర్ణాశ్రమప్రకారములు వినం
గా వలయునె ధర్మంబులు, భూవరునకు దండనీతిఁ బోలం గలవే. 157

వ. సుద్యుమ్నుం డనుధరణీశుండు దండనీతిన కాదె యపవర్గంబు వడసె ననుటయు నజాతశత్రుండా సుద్యుమ్నువృత్తాంతంబు విన వలతు నాన తిమ్మనిన నమ్మహీపతి కమ్మునిపతి యిట్లనియె. 158

—◆ పారాశర్యుండు సుద్యుమ్న చరితంబు ధర్మజునకుఁ జెప్పుట. ◆—

క. విను శంఖుండును లిఖితుం, డన నిరువురు విప్రవర్యు లన్నయుఁ దమ్ముం
డును గలరు బాహుదాతీ, రనివాసులు ధర్మతత్పరమనోవృత్తుల్. 159

సీ. వారియాశ్రమముల భూరిపుష్పఫలాభి, వృద్ధి నొప్పారెడి వివిధభూరు
హంబులు గల వొక్కయపుడు శంఖుండు గృహమ్మున లేకుండ ననుజుఁ డచటి
కరగి యందొక మ్రాన నారఁ బండినపండ్లు, గని వేడ్కమైఁ గోసికొనితినంగ
నయ్యన్న యేతెంచి యనుజ యీఫలము లెక్కడియవి చెప్పు నావుడును వార్చి

తే. ప్రణతుఁ డై యిచ్చటివ యని పలికె లిఖితుఁ
డాతఁ డనుమతి లేక కోయంగఁ దగునె
ముచ్చిమియ కాదె యిది పాప మచ్చుపడియె
నృపతిచే దండితుండ వై నీఁగికొనుము. 160

వ. రయంబున రాజసన్నిధికిం జని భవత్కర్మం బుపన్యసించి దండించుట వేఁడు మని పలికినం దెలిసి యట్ల కాక యని లిఖితుండు సుద్యుమ్నుఁ గానం బోయి నగరివాకిట నిలిచినం బ్రతిహారు లమ్మహాత్మునరుగుదెంచుట యమ్మహీపతి కెఱింగించిన నతండు సంభ్రమంబున సామాత్యుం డై యాసంశ్రితవ్రతుం డున్నయెడకుం జని వినయంబు సేసి మీర లిచ్చటికి [1] వేంచేసిన ప్రయోజనం బేమి యానతిందు మీ చెప్పినట్ల చేసెద నని విన్నవించిన నావిప్రవర్యుం డాతని కిట్లనియె. 161

ఆ. చెప్పినట్ల యేను జేసెద నని యొడం, బడిన వాఁడ నింకఁ బలుకు దిరుగఁ
గామి మఱవకుండఁ గా నీకు వలయు జు, మ్మయ్య దండధారకాగ్రగణ్య. 162

వ. అని యూఁడి పలికి మద్గురుని యనుమతి లేకఁ దదీయతరుఫలంబులు గోసికొని యుపయోగించితి నది ముచ్చిమి ముచ్చుల దండించు తెఱంగున దండించి నన్ను గత[2]కల్మషుం జేయుము రాజదండితునకు యమదండంబు లే దని పెద్దలు సెప్పుదురు నిన్నును దండధారణవైకల్యకిల్బిషంబు వొరయకుండ వలయు నని తేటపడ

1. గ. విజయంచేసి. 2. జ. కిల్బిషం.

నాడిన యమ్మాటలకు మనంబున విషాదంబు నొంది యమ్మేదినీవరుండు భూసుర
వరుం బ్రార్థించి. 163

ఆ. అనఘచరిత యిట్లు నను నియోగించుట
యుడుగు మని యమాత్యయుతము గాఁగ
భక్తి మెఱసి యొన్నిభంగులఁ జెప్పిన
నియ్యకొనక యున్న నట్ల కేని. 164

— లిఖితుండు సుద్యుమ్నునిచేత నికృత్తకరుం డగుట. —

వ. నిశ్చయించి[1] సముచితదండనీతివ్రతశీలుండగు నన్నరపాలుం డమ్మహాద్విజునిం గర
యుగచ్ఛేదనంబున దండితుం జేసిన నతం డతని దీవించి మగిడి చని శంఖునిం గని
నికృత్తంబు లైనహస్తంబులు సూపి సమ్యగనుభూతదండితుండ నైతి ననిన
నాతండు బ్రీతుం డై. 165

తే. ధర్మమార్గ ముల్లంఘింపఁ దగదు గాన
వలసె నిష్కృతి కుల మెల్ల వెలసె నీక
తమున సురమునిపితృతర్పణములు సేయు
మరిగి బాహుదాపుణ్యతోయముల ననఘ. 166

వ. వినుము. 167

తే. కల్లు ద్రావుట గురుపత్నిఁ గవయుటయును
విప్రుఁ జంపుట బ్రహ్మస్వవిషయ మైన
మ్రుచ్చిలుటయును నివి గలక్రూరజనులఁ
బ్రీతిఁ బొందుటయును మహాపాతకములు. 168

వ. ఇమ్మహాపాతకంబు లేనింటిలోన నెద్ది సేసిన నేజాతివాఁడును దండనీయుండ
విశేషించి తస్కరుండు శారీరదండయోగ్యుండు రాజదండితులు సుకృతవంతుల
భంగిఁ బుణ్యలోకప్రాప్తు లగుదురు నీ వమ్మహారాజుచేత దండింపంబడుటం బుణ్యా
త్ముండవును వంశోద్ధరణసమర్థుండవు నైతివి సంతోషింపుము పొమ్మనినం బోయి
లిఖితుండు. 169

తే. బాహుదానదియందు దవగాహనంబు, సేయఁ బ్రభవించె నాతనిచేతు లపుడు
విస్మయం బంది యతఁడు వేవేగ వచ్చె, నన్నపాలికి మగుడఁ బ్రహర్ష మెసఁగ.

వ. వచ్చి యరుణకమలంబులం దెగడుతనకరంబులఁ జూపిన నతండు దీనికి నచ్చెరు
వడ నేల యిది మదీయతపోవిభవంబున దైవకృతం బైనవిశేషంబు నీవు శుచి
వగుట దైవంబున కెక్క సుద్యుమ్నుండును నీపుణ్యానుష్ఠానంబున నిజపితృవర్గ
సహితంబుగా నిర్మలాత్ముం డయ్యె ననియె న ట్లగుటం జేసి. 171

చ. జనసుత నీవునుం దగఁ బ్రజాపరిరక్షణ మాచరింపు నీ

1. క. సముంచితదండ.

యనుజునిమాట వేదవచనార్థనిరూఢము రాజనీతి దం
డనమునఁ గాని [1]యొండున నొడంబడ దెన్నఁడు నార్యకోటియుం
దును వగ దక్కు మేలు మిలఁ దుష్టిగఁ జేయుచు మేటిజన్నముల్. 172

వ. అని చెప్పి మఱియు నిట్లనియె. 173

సీ. అడవుల మీ రున్న యపుడు నీతమ్ములు, వివిధమనోరథావేశకలిత
హృదయులై యుండుదు రదయత వీరి ను,పేక్షింప కిల యేలి యెల్లభోగ
ములకును భాజనంబులఁగా నొనర్పుము, తురగమేధాదిక్రతుప్రయుక్తిఁ
బరఁగుము వీరలు బహుయజ్ఞములు సేయు, వా రటమీఁద నిర్ద్వంద్వవృత్తి

తే. వెడలెదవు గాక విను మేము వెట్టివార, మే మహీశ్వర నీమది మేలుగంటి
మతిథిసురపితృవిషయము నప్పు[2]త్రిక్కు, గలిగియుండంగ నది నీకుఁ గాదుగాని.

ఆ. న్యాయశాస్త్రవేది వై యింగితాకార, చేష్ట లెఱిఁగి జనుల శిష్టదుష్ట
తావిశేష మరసి దండనీతి యొనర్చు, పతికి నెల్లమేలుఁ బడయ వచ్చు. 175

క. అరి యాఱవపాలు గొనుచుఁ, గరుణ గలిగి ప్రజలఁ దండ్రిగతి మధ్యస్థా
చరణంబునఁ బాలించుట, పరమపదముఁ జేర్చు విడుచు భయసంశయముల్.

ఆ. ఇవ్విధంబు గాక క్రొవ్వి కామక్రోధ,కలితచిత్తవృత్తిఁ [3]దాలఁగ నడచు
పతికి నగుఁ జతుర్థభాగంబు ప్రజసేయు, పాపములఁ గులప్రదీపచరిత. 177

చ. క్రమమున నైన శాత్రవుల గ్రమ్మన నైనను జావఁ జేత ధ
ర్మము విను పాపకర్మ లగు రాజులతోఁ దగ సంధి సేత దో
షము విభుఁ డుర్వి [4]యమ్ముకొని సంగరముం దొలఁగింపఁ గూడునే
సమరజితావనీభరణశాలితఁ బోలునె యొండుధర్మముల్. 178

వ. కావున. 179

క. పో రుడుగను సమకూరద, కౌరవపతి యపుడు సంధి గావింపక హిం
సారుచి నైతి ననుట యవి,చారత నృపవంశకలితజని యగునీకున్. 180

శా. భూవిస్తారము నాక్రమించి ప్రజలం బ్రోవంగ దండింపనుం
గావన్ నేర్చి మఖక్రియల్ నడపి సంగ్రామాగ్ని రాజ్యాహుతుల్
గా వైరిక్షతజంబు వ్రేల్చి తనువుం గక్షేపకుం డై హయ
గ్రీవుం డుత్తమసిద్ధిఁ బొందె రణముల్ [5]గీడే నృపశ్రేణికిన్. 181

వ. సంగరంబునం జంపుటయుం జచ్చుటయును బ్రజాపరిపాలనంబును దగిన తెఱంగున దండించుటయును నుత్తమక్షత్త్రధర్మంబులు గావున హింసాశంక విడిచి యాన్వీక్షికీ త్రయీ వార్తా దండ నీతు లనురాజవిద్యలయందును బ్రవీణు లగు సహాయులతోడం గూడి సర్వవ్యవహారంబులు నిర్వహింప నిర్యాణం బన తిమారం బగుఁ గలంక దక్కు మని పలికె సకలలోకగ్రాహ్యవచనుం డగునమ్మహాముని

1. జ. ముండోగ నొడంబడ 2. గ. చిక్కు. 3. క. గలుగ. 4. చ. దొరఁగొని. 5. క. క్రీడల్

ఇట్లు చెప్పం దెలివొందక యున్నధర్మనందనుం గనుంగొని పురందరనందనుం డుల్లంబునం గోపంబు గదుర మొగంబునం దోప నీక యుండ నప్పాండవాగ్రజుం డత్తపోధనవర్యువదనంబునం జూడ్కి నిలిపి నిభృతంబుగా నిట్లనియె. 182

క. పతులు మృతులైనఁ బొగిలెదు, సతులవిలాపములు శోకసంతాపం బు
ద్ధితపుఁగఁ జేయఁగ నేవను, మతి యేలినకలుచఁ గలఁక మానుసి బుద్ధిన్.

వ. అనుటయు నమ్మునివరుం డతని కిట్లనియె. 184

సీ. దుఃఖంబుఁ బొమ్మని త్రోవ సుఖంబు ర, మ్మని తెచ్చికొనవశ మయ్యవానిఁ
దొలుబొము నందలిదుష్కృతంబును సుకృ, తంబు హేతువులుగఁ [1]దగిలిచేయుఁ
బురుషునికాలంబు దిరములు గా వవి, పొరిఁ బొరి వచ్చుచుఁ బోవు చుండు
నర్థముల్ దుర్బుద్ధి కైనను సిద్ధించు, నగుకాలమున నార్యు లయ్యుఁ గాని

ఆ. కాల మవి ఘటింపఁ గా నేర రనిలవ, రాతపేందురుచులు నధిప కాల
కల్పితములు మంత్రశిల్పౌషధంబులు, మేలు సేత కాలకీలితంబు. 185

క. కమలంబులుఁ దొవలు వికా, సముఁ బొందుట లతలుఁ దరులు సకుసుమఫలభా
వముఁ బొందుట పక్షులును మృ, గములును మదకలము లగుట కాలకలితముల్.

వ. మఱియు జననమరణంబులును హానివృద్ధులును లోనుగా సకలంబును గాలాధీనంబ కావున నీకు శోకింపం బనిలేదు తొల్లి సేనజిత్తనుమానవపతి శోకార్తుండై యుండి తనలోనన తెలిసి సజ్జనసన్నిధి నుపన్యసించినవాక్యంబు లాకర్ణింపుము.

— పారాశర్యుఁడు ధర్మజునకు సేనజిత్తువాక్యంబు లుపన్యసించుట. —

సీ. తారు గొందఱకు బాధకు లయి నడచుట, పరులచే బాధలఁ బడుట గలుగు
నవి కాలభావ్యంబు లెఱుక గలిగినవారుఁ, బఱిచితి నొరునిచేఁ బడితి నను చు
బురుషుండు ప్రియశోకములఁ బొందఁ డర్థదా, రాపత్యబాంధవహాని కాత్మఁ
గుందంగ వడలుట మందబుద్ధిత్వంబు, వగఁ గీడు మానునే వలవ దడల

తే. శోకభయకారణంబులు లోకమున న
నేకములు, దానఁ దలసూపు శోకములకు
భయములకు బుద్ధి నెడ యీఁడు పండితుండు
మూఢుఁ [2]డవి త్రోవ నేరండు మునుఁగు వగల. 188

క. వినుఁడీ సుఖమును దుఃఖము, ననిత్యములు గాన వానియాగమకాలం
బున ముదమును శోకము మొగ, కొనమియుచు మ్మఱవు శాంతిగోరుజనులకున్.

తే. మూఢతనుబుద్ధు లగువారుఁ బ్రౌఢతమని, వేతలును సుఖులట్టులుగాక కొంత
ప్రజ్ఞ గలవారలై యపప్రతిభులైన, జనులు దుఃఖార్తు లగుట నిస్సంశయంబు.

వ. అనియె నాసేనజితుం డుదాత్తవివేకనిరూఢుం డతనివచనంబులు విద్వాదరణీయంబు లిందలియర్థంబులు నీచిత్తంబున నలవరింపు మనఘ యుజ్జగింపు మని వెండియు.

1. చ. దాను జేయుఁ; జ. దగులఁ జేయుఁ. 2. చ. డిత్రోవ.

తే. వర్ణముల నాశ్రమంబుల నవలను మెఱసి, యరసి చక్కని తెరువున నరుగఁ జేసి
ధరణిఁ బాలింపు సముచితదండధరణ, మాచరింపుము నీ కిది యర్హవృత్తి.

క. దివికిం జనినను నెన్నని, వివిధగుణము లఖిలజనులు వినుతింతురు వాఁ
డవనీశ్వర సత్పురుషుం, డవు నని కయికొంద్రు బుద్ధి నార్యజనంబుల్. , 193

వ. కావున సకలజనప్రియహితం బగు పృథ్వీపరిరక్షణంబు నీకుం గులధర్మం బై కర్తవ్యం బగుట యుఱవుగా దె యనినయమ్మునీంద్రునకు నమ్మనుజేంద్రుం డిట్లనియె.

తే. మఱవ వచ్చునె నా కభిమన్యు ద్రౌప, దేయులను గర్ణ మత్స్యభూనాయకుం ద్రుపదనృపతియు ధృష్టకేతుండు మాన, సమునఁ బాయుదురే మెట్లు శాంతి గలుగు.

సీ. తొడలపై నక్కిలి నిడికొని నన్నప, లాలించుచుండు బాల్యమున నట్టి
భీష్మునిఁ జంపితి బీభత్సుభల్లముల్, దనువు సెక్కంగ నాతఁడు శిఖండిఁ
జూచుచు నుండుటఁ జూచితి నది యుల్ల, ములమటఁ బెట్టెడి నట్లు గాక
యాభంగి నున్నప్పు డాతఁ డా ద్రుపదజు, నేఁడిమిఁ దలఁచిన నెరియు మనసు

తే. పరశురాముని నోర్చిన బల్లిదుండు, కాశిరాజకన్యకలకుఁ గాఁగఁ బుడమి
నరపతుల నెల్ల గెలిచిన బిరుదు [1]గలన, నాజడియ పడు టూహింప నడలు గమురు.

ఆ. అల్పకాలభోగ్య మైనరాజ్యమునకుఁ, గా ననల్పకీర్తి ఘనుని జరఠ
సింహకల్పు వంశశేఖరజన్ముఁ ద్రుంచితి మనంబు వగలఁ జివుక కున్నె. 197

మ. జనసంపూజ్యపదారవిందుఁ డగు నాచార్యుండు శోకించి నం
దనుచొప్పారయ వేఁడి పెద్దయు ననుం దా నమ్మి యర్థింపఁ బా
పనివానిం గరిచావు బుద్ధి నిజ యశ్వత్థామ సచ్చెన్ నిజం
బని యే బొంకితి మేదినీభరణ మర్హంబె గురుద్రోహికిన్. 198

ఆ. రాజ్యలాభలోభరతుఁడ నై కడుఁ బాప, మైన బొంకుమాట లాడి గురునిఁ
గూల్ప నేర్చినట్టి క్రూరాత్ముఁ డేఁ గతిఁ, బోవువాఁడు సెపుమ బుధవరేణ్య. 199

క. భ్రాత మహాత్ముఁడు గర్ణుం, డాతనిఁ జంపించి యేలు నవనీరాజ్యం
బాతురత సేయుఁ గాక సు, ఖాతిశయము మతికి నొసఁగు నయ్య మునీంద్రా.

చ. కడిఁదిమగండు కుంభజుఁడు గావఁగ [2]నొడ్డినమంటవోలె నం
డపి మొనఁ జూచి చూచి యిది డప్పర మన్వగ లేక పంచితిం
గొడుకుఁ జొరంగ నత్తెఱఁగు క్రూరత సైఁప సుభద్ర యట్లుఁ గం
వ్వడిక్రియ నేర్తురే యొరులు వల్లభుఁడే లగు [3]నట్టిఁ దుర్విఁకిన్. 201

చ. [4]అడలెడఁ బొందఁగాఁ దగనిక్కయట్టిరి ద్రోవది మేరుకల్పులం
గొడుకుల నేవురన్ జమునుఁడు గొన్న నలంతురఁ జూడ నేర్తునే
పుడమి గిరీంద్రపంచకము [5]పాల్సినఁ బా డఱినట్టు లున్నయ
ప్పడఁతుక మెట్టు లోర్చు గృహభారము నెమ్మది నిర్వహింపఁగన్. 202

---

1. జ. మగఁడు. 2. గ. నొట్టినమంట. 3. క. కట్టిఁ దుర్వికిన్ 4. క. అడజడి. 5. గ. నోయిన.

సీ. పరఁ డసంగుఁడు ధర్మపాలుండు ధర్ముండు, విజయుండు శాస్త్రంబు విశసనుండు
గ్రహ మక్షరుఁడు ప్రజాగరము దురాసదుఁ,డసి సత్యగుండు నిత్యగుఁడు శాస్త
ప్రాగ్వ్యచనుండు శస్త్రంబు బ్రహ్మము తీక్ష్ణ,వర్ముండు మనువు శివంకరుండు
కౌమారిసుతుఁడు శ్రీగర్భుండు వ్యవహార,తంత్రంబు సంగుప్తమంత్ర మనఁగఁ
తే. బరఁగుపేళుల నొప్పి యధ్వరమయాత్ముఁ, డై నవిష్ణుండు దండమై యావహిల్లు
శ్రీ సరస్వతి యనునివి । శిష్టదండ,నీతినామాంతరంబులు । నృపవరేణ్య. 110

వ. ధర్మాధర్మంబులు సుఖదుఃఖంబులు నయానయంబులు నర్థానర్థంబులు బలాబలం
బులుఁ బ్రమాదాప్రమాదంబులు మొదలైనసకలావస్థలును దండంబున సమ్య
గసమ్యక్ప్రకారంబులం గలుగుం గావున సమ్యక్ప్రకారంబుచేత దండంబున
రక్షింపంబడినప్రజ రాజు నభివృద్ధి నొందించు నట్లగుట దండంబు రాజునకు
బరాయణంబు. 111

క. సత్యప్రకారధర్మము, నిత్యానుప్రేయ మది సునీత మగుచు నా
దిత్యపతిఁ బ్రీతుఁ జేయఁగ, నత్యున్నతి నెసఁగు నాతఁ । డన్నప్రదుఁ డై. 112

వ. దానంజేసి దండంబు ప్రసన్నంబై వెలుంగుఁ దదీయాభిధానంబులు మఱియునుం
గల వాకర్ణింపుము. 113

ఆ. పురుషుఁ డీశ్వరుండు । భూతాత్మకుండు జీ,వుండు ప్రాణుఁ డక్షయుండు సత్త్వ
మనఁగ నేడుపేరు । లష్టమంబు ప్రజాప,తి యనఁ బరఁగు దండదేవుపేరు. 114

—◆ వసుహోముఁడు మాంధాతృనకుఁ జెప్పినదండోత్పత్తిప్రకారము. ◆—

వ. దండంబు సాక్షాద్దేవుం డట్లగుటఁ దెలిపెడునది యొక్క యితిహాసంబు గల
దంగదేశాధీశుండు వసుహోముం డనురాజు హిమశైలంబున ముంజపృష్ఠం బనం
బ్రసిద్ధం బగుశృంగంబునకు దేవీసహితంబుగాఁ జని యందు వసియించి ముని
గణపూజితం బగువృత్తంబున నుదాత్తుం డయి యుండు నమ్మహీపతికడకు
మాంధాతృండు సనుదెంచి సవినయంబుగాఁ బ్రణమిల్లిన నబ్భూవల్లభునకు నతం
డర్ఘ్యపాద్యాదు లగునుపచారంబు లాచరించి వచ్చినపనియేమి యని యడిగిన
నప్పుడమిఱేఁడు సవిస్తరంబుగా దండప్రకారంబు వినుటకై నిన్నాశ్రయింప
వచ్చితి ననవుడు నమ్మహాత్ముం డతని కిట్లనియె. 115

సీ. అజుఁ డధ్వరంబు సేయంగఁ దలంచి ఋ,త్విజు నాత్మసదృశుని । వెదకి యెందు
గానక తా నొక్కగర్భంబు ధరియించి, వేయేండ్లకును దుమ్మి । వెలువరించె
క్షుతసంభవతఁ జేసి । క్షుతుఁ డనుపేరిటఁ, బరఁగెడునా ప్రజాపతియు ఋత్వి
జుండుగఁ గ్రతువొనర్చుచునుండ నంతర్హి,తం బయ్యె వలచుచందమున నడచు
ఆ. సట్టి యగుట దండ । మధప కార్యాకార్య,తంత్రభేద మెడలె । దానఁ జేసి
మహి గలంగెఁ గడు నసమర్యాద వర్తించెఁ, గమలజుండు విష్ణుకడకుఁ జనియె.
క. చని సంప్రార్థించి యతనిఁ, గొని రుద్రునిఁ గాంచి నీసఖుం డితఁడు వ

చ్చిన కార్యము గృపతోడను, విను మని దండంబు తెఱఁగు వినిపించెఁ దగన్.

వ. అట్లు లోకరక్షకుం డగుపుండరీకాక్షు దండగొని దండాభావంబున జగంబు గలంగు టెఱింగించిన నవ్విరించిపలుకులు మనస్కరించి మహాదేవుండు నిజప్రభావంబు దండంబుగాఁ గల్పించి దండనీతి కాశ్రయుం డై పరఁగు చుండె. 118

సీ. వినుము ఋగ్వేదాదివేదముల్ నాలుగుఁ, గల్పాదు లైనయంగంబు లాఱు
బెరసి విద్యలు పది పేర్చుపురాణంబు, లనియును నొకవిద్య యధిప ధర్మ
విదులు సెప్పెడుశాస్త్రవితతి యంతయు నొక,విద్య సర్వన్యాయవిస్తరంబు
నొకటి మీమాంస దా నొక్కటి యిట్టులు, వివరింపఁ బదునాల్గువిద్య లయ్యె

తే. వైద్యకోదండగాంధర్వవిద్య లర్థ,శాస్త్ర మగునీతివిద్య తత్సహితవృత్తి
వెలయఁగాఁ బదునెనిమిదివిద్య లభవుఁ, డేర్పరించె జగత్త్రయహితముపొంటె.

వ. ఇట్లు సమకట్టి దండంబును దండనీతిప్రపంచంబు లయినయవ్విద్యలను విష్ణువశగతంబులు సేసె నాసర్వేశ్వరుం డత్తమ్మిచూలికిఁ దుమ్మి ఘటించి యీభంగిం బ్రజాపతిప్రసవంబు గావించె దండనీతి సమగ్రరూప యై చెల్లె నెల్లజగంబులుం బ్రియం బందె నరవిందభవునియాగంబును సుప్రయోగం బై నడచె విష్ణుండు దండనీతిశాస్త్రంబు సకలంబు నాంగిరసున కిచ్చె నాంగిరసుం డింద్రమరీచులకు మరీచి భృగునకు భృగుం డనేకమునులకు నిచ్చె నీక్రమంబున నది జగంబులం బరఁగె దండంబుజాగరణంబున లోకంబు మర్యాదామహితం బై వర్ధిల్లెఁ గపర్ది శంకరుండు రుద్రుండు భవుండు స్థాణుం డుమాపతి యనుపేళ్లం బరఁగునద్దండదేవుని నతులధర్మంబున నియమించుభూపాలుం డైహికాముష్మికసిద్ధులం బొందు.

క. అని వసుహోముఁడు సెప్పిన, విని మాంధాతృండు దండవిభవజ్ఞుం డై
యనఘ మహీపరిపాలన, మొనరించెను నీతి దండయుక్తి వెలయఁగన్. 121

క. ఈయాఖ్యానము విని భూ,నాయకుఁ డెవ్వం డిలాజనంబుల నతుల
న్యాయంబునఁ బాలించుఁ జి,రాయుస్స్థిరపుణ్యభాగి యగు నతఁడు నృపా. 122

—భీష్ముఁడు ధర్మరాజునకు ధర్మార్థకామంబుల తెఱం గెఱింగించుట.—

వ. అనిన విని ధర్మనందనుండు ధర్మార్థకామంబులనడవడి యెట్లయిన మేలై చెల్లు నని యడిగిన భీష్ముం డిట్లనుఁ దొల్లి యాంగరిష్ఠుం డనునరవరుండు కామందకనాముం డైనముని నిట్లని యడుగ నతం డతనికిఁ జెప్పినభంగిం జెప్పెద నాకర్ణింపుము.

చ. అనయముఁ బేర్చుకామమున నర్థము ధర్మముఁ గ్రాఁగుఁ గామతం
త్రనిరతుఁ డైనవాఁడు సుపథప్రతిపన్నుఁడు గాఁడు దుష్టదం
డన మొనరింపఁ డట్టిపతి డాయరు సాధులు నార్యులుం సుహృ
జ్జనులును దానఁ జేటు నగుఁ జావును బాటిలు నెల్లభంగులన్. 124

ఉ. కావున ధర్మసిద్ధికి ముఖం బగునర్థమునందు నిష్ఠమై
నేవిధి నైన ధర్మరతి యెక్కుడుగా మది జొన్పు టొప్పఁ గా

దూవిలబుద్ధిగాక యుచితాగతసౌఖ్యము లాచరించుచున్
భూవిభుఁ డెప్డు భూమిసతిఁ । బొంది రమింప మహోన్నతుం డగున్. 125

క. అన విని ధర్మతనూజుఁడు, జనమ్ము శీలమ్ము నధిక। సంస్తుత్యముగాఁ
గొనియాడుఁ దత్స్వరూపం, బనఘా వివరింపవే దయారతి నాకున్. 126

వ. అనుటయు నాపగాతనయుండు వినుమని యతని కి ట్లనియె. 127

క. మున్నింద్రప్రస్థంబున, నున్నతిమెయి ననుజతనుజయు క్తంబుగ నీ
వున్న తెఱఁగు దుర్యోధను,కన్నులు గమరింప నతఁడు । గడు నగ నొందెన్. 128

వ. భవదీయసభయొప్పునకును రాజసూయంబు చెల్లినయుల్లాసంబునకును నట్లసహ్య
పడి ధృతరాష్ట్రునితో భవద్గృహంబున నిచ్చలుం బదివేవురు భూసురులు పసిండి
పళ్లెరంబులం బాయసాహారంబులు గొనుట మొదలు గాఁగ లక్ష్మిపెం పుగ్గడించి
తనవగపు దోఁపం బలికిన నతం డతని కిట్లను మధురాన్నపానమణిభూషణవరవా
హనాదులంజేసి యుజ్జ్వలం బై యున్నది గాక నీయైశ్వర్యం బసదే పాండవా
గ్రజుం డెక్కుడు మెఱసి యునికియుం గలదు వినుము చెప్పెద. 129

ఆ. శీలవంతు లైన । సిరిఁ బొందుదురు ధర్మ,తనయునింటిసిరికి । నైన యనంగ
నెక్కు డనఁగ లక్ష్మియెసకం బెసఁగ నీవు, శీల మలవరింపు । చిత్తమునను. 130

వ. మాంధాతృండు నాభాగుండు మొదలయిన మేదినీపతులు శీలంబునం గాదె యీ
లోకంబునం బెంపు వడసి రివ్విషయంబునకు నొక్కయితిహాసంబు గల
దాకర్ణింపుము. 131

క. దనుజవిభుఁడు ప్రహ్లాదుం, డనిమిషపతిరాజ్యలక్ష్మి । యతులితశీలం
బునఁ గొని త్రైలోక్యంబును, దనకు వశగతంబు సేసె । ధర్మం బలరన్. 132

క. దానికి రోసి బృహస్పతి,తో నమరేంద్రుండు మేలు । దొరకొనువిధ మె
ట్లో నావుడు భార్గవునిం, గానఁగఁ జను మతఁడు సెప్పుఁ । గరుణాన్వితుఁ డై.

క. అని గురుఁడు పంప నింద్రుఁడు, సని భార్గవుఁ గాంచి మేలు । సమకూరు తెఱం
గనఘా యుపదేశింపవె, యనినం బ్రహ్లాదుఁ జెందు । మతఁ డెఱిఁగించున్. 134

ఆ. అతని నాశ్రయించి । యవ్వేర విప్పించి,కొనిన మేలు వొందు । దనిమె భార్గ
వుండు వజ్రి బ్రాహ్మణుం డయి ప్రహ్లాదుఁ జేరి శిష్యవిధులు । సేయుచుండె.

వ. అంత నద్దానవేంద్రుండు ప్రసన్నుం డై భూసురాకృతి యయినసురపతితో
సంభాషించిన నతండు నీకుఁ ద్రైలోక్యరాజ్యంబు సంప్రాప్తం బైనకారణం బేమి
యెఱింగింపవే యనుటయు. 136

ఆ. దనుజనాథుఁ డిట్లు । లను రాజ ననుగర్వ,మున ధరామరులకు । మనసు గందఁ
జేయ నెపుడు నే నసూయాదు లమ్మహా,త్ములకు ధనము లిత్తు । నెలమితోడ.

వ. వారలు మెచ్చునట్టిశీలంబునం బ్రవర్తిల్లుదు దానం జేసి మహోన్నతుండ నైతి. 138

క. అనవుడు నీశీలము నా, కనఘా దయ నొసఁగవే మహాత్ముల నగఁ జెం

ధనవారు బ్రదుక నలదే, యని దీనత నొంప ననిమిషాధిపుఁ డడిగెన్. 139

క. విని ప్రహ్లాదుఁడు గృప దన, మనమునఁ గదురంగ విప్రమాత్రుఁడు గాఁ డీ
తనిభంగిఁ జూడ ననువెలి, పును బుట్టఁగ నిచ్చె శీల ముం బెం పెసఁగన్. 140

తే. పడసి యింద్రుండు శీలసంపన్నుఁ డగుచుఁ
జనియెఁ దదనంతరంబ యద్దనుజవరుని
తనువునందుండి తేజిష్ఠతనువిలాసుఁ
డైన పురుషుండు వెడలిన నతఁడు సూచి. 141

వ. నీ వెవ్వండ వన నప్పురుషుం డేను శీలంబ నీ విచ్చినయవ్విప్రుపాల వసియింపం జనియెద నని చెప్పి పోయెం దదనంతరంబ క్రమంబునం దేజోమయ రూపంబులు నిజదేహంబులనుండి నిర్గమింప నద్దానవేశ్వరుం డడుగుచు. 142

క. ఉత్తమధర్మము సత్యము, వృత్తంబు బలంబు నగుట వినఁబడి బడిఁద
చ్చిత్తము విషాద మంద మ, హోత్తరమూర్తి యొకవారి జానన వెడలెన్.

క. వెడలిన నీ వెవ్వతె వని, యడిగిన నాతనికి నిట్టు లను దీనత న
ప్పడఁతి సిరి నేను బల మె, క్కడకు నరుగు నందుఁ బోవఁ గడఁగి వెడలితిన్.

చ. అనిన భయంబు నొంది యతఁ డాసతితోఁ బరమేశ్వరీ మహా
వినయమతిన్ ననుం గొలిచె విప్రవరుం డతఁ డెవ్వఁ డన్న న
వ్వనిత సురాధినాథుఁడు భవద్ఘనరాజ్యవిభూతి యింతయుం
గొనుటకు నిన్నుఁ జెందె నిటు గిల్పడి తీవును నీదుశీలమున్. 145

వ. వినుము చెప్పెద శీలంబున ధర్మంబు వెలయు ధర్మంబున సత్యంబు దొరకొను సత్యంబున వృత్తంబు సొప్పడు వృత్తంబున బలంబు వాటిల్లు బలంబున నేను గలుగుదుం గావున సమస్తంబునకు మూలంబు శీలం బని చెప్పి సిరి పురందరు పాలికి ధర్మాదులతోడఁ గూడం జనియె ననుటయు దుర్యోధనుండు శీలం బెట్టి దనిన ధృతరాష్ట్రుం డతని కి ట్లనియె, 146

క. ఒలసి మనోవాక్కాయం, బుల ద్రోహాభాన మఖిలభూతములయెడం
గలిమి విను శీల మది మే, లొలయించును దాన నుల్లమూన్పుము పుత్రా.

క. పరహితము సిగ్గుపాటుం, బొరయక యుండంగ నెదిరి బోధించుటయున్
నరసముదయంబు వొగడెడు, చరితము శీలమున కంగసంపద వత్సా. 148

క. అనియె నని చెప్పి భీష్ముం, డను ధర్మజుతోడ నీకు నది నైజమ యే
నును బోధించితి శీలము, మనమ్మునం దిరము సేయు మనుజాధీశా. 149

వ. అనిని విని యజ్ఞనపతి భీష్మునితోఁ నాశ యనునది యనంతమై యుండు నది నిరర్థక మైన నయ్యెడుదుఃఖం బధికం బది దుర్యోధనుం బేర్చి కలిసియుండఁ జూచితి నమ్మహాత్ముండు దేలక మదీయాశఁ గుంఠితంబుఁ జేసి నన్ను దుర్బుద్ధిం గావించె నది విషాదంబు సేయు నాశ నడంచుట యరిది గదే యనుటయు నాశాదోష

నిరాసకం బైనయొక్క యితిహాసంబు గలదు విను మని యక్కురుసత్తముం డి
ట్లనియె. 150

భీష్ముఁడు ధర్మజునకు సుమిత్త్రుఁడను రాజు చరిత్రంబు సెప్పుట

సీ. హైహయుండు సుమిత్త్రుఁ డనురాజు వేఁటవోఁ, యినఁచోట దనచేత నేటువడిన
మృగ మమ్ముతోఁ బాఱెఁ దగిలె వెన్వెంటన, యదియును నొకమరి యుగ్గమయ్యు
నొకమరి దవ్వయ్యు నొకమరి దృష్టికి, గోచరం బయ్యును ఖురపదంబు
లరసి పాఱిన నింతనంతఁ దోఁచియునాశఁ, బెనుచుచుఁ జని మహావనముసొచ్చె

ఆ. నవ్విభుండు డస్సి యచ్చట నొకముని, పల్లెకేఁగి మునులు ఫలజలములఁ
దృప్తుఁ జేయ డప్పి దేఱి యున్నెడ ఋష, భాఖ్యుఁ డైనతపసి యతనితోడ.

క. వనమున నెక్కటి నీ వే, పనికై చనుదెంచి తేల పరమవిషాదం
బునఁ బొంచె దనిన నాతం, డను నొక మృగ మమ్ముతోడ నరుగఁగ వెనుకన్.

క. ఆసాసల వచ్చితి నను, గాసిం బెట్టి యది యడవిఁ గలసెను మృగయా
వ్యాసక్తుఁడు వగచుం దన, యేసినమృగ మనఘ తప్పి యేఁగుటకుఁ గడున్.

వ. ఆశ యింత దుర్నివార యగునే యనిన నమ్మునిపతి యమ్మనుజపతి కి ట్లనియె.

క. విను తీర్థయాత్ర సని యే, ననుత్తమం బైనబదరి కాశ్రమమున నొ
క్కనిఁ గాంచితిఁ గృశగాత్రునిఁ, దనుఁ డను పేరింటివానిఁ దాపసవర్యున్. 155

క. కని భక్తిం బ్రణమిల్లుడు, ముని యాతిథ్యం బొనర్ప మోదంబున నా
తనిపాల ధర్మఫణితులు, విను చుండఁగ నొక్క ధరణి విభుఁ డేతెంచెన్. 156

వ. విషాదవివర్ణుం డగుచు సపరివారంబును సదారంబునుగాఁ జనుదెంచి యజ్జనపతి
మునిపతి గాంచిన నతం డతిథిపూజాసత్కారంబులఁ సేసి యాగమనకారణం
బడిగిన నన్నరనాథుండు. 157

చ. తనయుఁ డొకండు వాఁడు గుణధాముఁడు క్రీడనవాంఛ సాంద్రకా
ననమున కేఁగి కాడుపడి నం దడవం జనుదెంచి యెందుఁ గా
నన మదియాశ ద్రిప్పికొని నట్ల వెగ డందుచు వచ్చినాఁడ న
న్న నతఁడు వల్కకుండె వదనం బొకయించుక వాంచి చింతతోన్. 158

క. చింతించు నతనితో భూ, కాంతుం డి ట్లనియె మఱియు గాఢతరాశా
క్రాంతత దుర్లభఫల యగు, టెంత యసహ్య మగునయ్య యెడఁదమునీంద్రా.

వ. అనుటయు నత్తాపసోత్తముం డమ్మహీపతి యాననం బాలోకించి. 160

క. ఏనరుఁడు మానసము ధృతి, నూన నుచితవృత్తి నుండు నుదిలగానక యెం
దైనను నెయ్యది యేనియు, వానికి దుర్లభము లేదు వసుధాధీశా. 161

క. అర్థాదు లగుఫలంబులు, ప్రార్థించినచోట సిగ్గు వఱుపక తగ న
య్యర్థి సులభార్థుఁ జేయు కృ, తార్థుఁడు దుర్లభుఁడు దలఁప నఖిలజగములన్. 162

వ. అని పలికి పూర్వాచార స్మారకత్వంబున ని ట్లనియె. 163

క. వినుము గుణవంతుఁ డోకరుఁడు, ధనవంతుం డైనయొక్క ధరణీనాథుం
దనకూఁడుసీరకై కాంచన మడిగి తదీయశాలిత్వముపేర్మిన్. 164

క. విహతాశుం డై లజ్జా,మహితం బగునాశ దొఱఁగుగ్రమదిశ్రో సకల
స్పృహాయును నెవ్వనియందును,వహింప నని యతుల మైనవ్రతముంబూనెన్.

వ. అని చెప్పి యప్పార్థివుం దొల్లి తాను ధన మర్థించి యఫలితప్రయత్నుం డై తత్కాలజనితవైరాగ్యంబునం దపస్వి యగుట దేటపఱిచి వెండియు. 166

చ. ఒడఁబడి యీనివానియెడ నుల్లమునందుఁ గృతఘ్నుతం గడుం
జెడు గగు దుర్వినీతునెడఁ జిత్తము కోర్కికిఁ బట్టు సేసి లే
వడి యగునీచకాంతయెడ వారక యాసలు సాఁగునిట్లు పె
క్కెడలను బాఱు నాసగమి యెల్లఁ దొఱంగుము సౌఖ్య మొందెడున్. 167

వ. అని యాసపఱ్జం బోవమి సుఖకర్థం బగుటం దెలిపి యవ్విరద్యుమ్నునకుం గరుణించి యతనికొడుకు భూరిద్యుమ్నుం దనతపోమహిమ నాకర్షించి వీడుకొలిపె నని చెప్పి ఋషభుండు సుమిత్రునిచిత్తంబు మృగయాశాయత్తంబు గా కుండునట్లుగా బోధించెఁ బాండవాగ్రజా నీవును నివ్వాక్యంబు లాదరించి సుస్థిరుం డవై నిరాశత్వంబున సంతాపంబు దక్కి సుఖవి గ మ్మని పలికిన భీష్మునితో న బ్భూపతి భవదీయవచనామృతాస్వాదనంబున మనంబు దృప్తి సన దింకను ధర్మప్రకారంబులు వివరింపు మనిన నతం డతని క ట్లనియె. 168

క. తనభూమిఁ బరులభూమిని, ధనము లుపార్జింప వలయు ధరణీశునకున్
ధనములు మూలము రాజ్యం,బునకును మూల మగు ధర్మమునకు నరేంద్రా.

క. అది బెట్టిదంపువెరవున, మృదుభూతోపాయమునను మెయికొనద ప్రజం
బాదువ వలయు నాజ్ఞాసం,పద [1]గలసాకతముతోడఁ బతి యవహితుఁ డై.

క. విను బండారము వెరుఁగని,జనపతికి బలంబు మిత్రసంపదయును గ
ల్గును బలమిత్రవిహీనున, కొనరునె రాజ్యంబు విభవ మున్నత మగునే. 171

ఉ. కావున నర్థసంపదలు గల్మియ యింతకు మూల మైన ను
ర్వీవరుఁ డాత్మశక్తి కతిశరిత్తము లై నసముద్యమంబులం
దా వలియం దలంచి సమగ్రత, గై కొను టొప్పు దవ్విధం
బావిభుతొంటికల్మికిని హాని యొనర్చు హరించుఁ బ్రాణముల్. 172

క. లేసకొలఁది నుపాయంబులు, వొనరిచి ధనవంతుఁ డగుట భూపగుణము ని
ర్ధనుని నిజప్రజయును గై,కొనదు విరోధులును సరకుగొనరు కుమారా. 173

క. తెరవాటున మ్రుచ్చిమి నుద్ధుగు లగుక్రూరులను మూఁక దోరం బగు న
వ్వైరనరిదారల బలంబుగ,ధరణీశుఁడు గూర్చుకొనుట దైన్యము దెచ్చున్.

క. అన్యాయంబునఁ బాదలిన, సైన్యముచే సమరజయము సమకూర దనూ

1. ఖ. గలసాఁగతముతోడ.

న న్యాయపరులు గాంతురు, మాన్యత్వము దస్యు లైన ◊ మనుజాధీశా. 175

వ. ఇట్లగుటకు నుదాహరణం బగునొక్క యితిహాసంబు గల దాకర్ణింపుము. 176

◆ భీష్ముఁడు ధర్మజునకుఁ గాపవ్యోపాఖ్యానము సెప్పుట. ◆

సీ. అవనిశ పారియాత్రాచలంబున నుండు, నొకబోయ ధర్మసంశ్రయుక్తబుద్ధి
వింట నేర్పరి మృగావలితతిప్రకారజ్ఞుఁ, డారణ్యదేశసంచారశాలి
తల్లికిఁ దండ్రికి ◊ దద్దయు భక్తుఁ డై, ఫలమూలమధుమాంసములును మేలి
కూడుగూరలు దొరకకొల్పి వారికిఁ దృప్తి, యొనరించుచు శయ్యనాసనాదు

తే. లగుపదార్థముల్ హృద్యంబులుగ నొనర్చు
వలయునాహారములు మునివరుల కిచ్చుఁ
బగఱఁ దోఁచినఁ బరిమార్చు ◊ భండనమున
నొకఁడు వేవుర నైన మహోగ్రగతుల. 177

క. కాపవ్యుం డనుపేరను, దీపించినయతనిభూరితేజము గని ర
తోపరుఁడు వలయు మన కని, యాపాలమునఁ గల్లుదస్యులందఱుఁ దమలోన్.

ఆ. అతనిఁ దమకు నెల్ల ◊ నాధిపత్యము సేయు,వానిఁగా వరించువారు గాఁగ
నిశ్చయించి కూడి నెమ్మి మైఁ జను దెంచి, కాంచి యిట్టు లనిరి ◊ గారవమున. 179

క. బలవిక్రమసంపన్నుఁడ, వలఘుచరిత్రుఁడవు మమ్ము ◊ నందఱఁ బ్రభు వై
తలకొని రక్షింపుము నీ,వలచినపని గొనుము పుత్రవర్గముఁబోలెన్. 180

వ. అనిన విని యతఁడు వారల కి ట్లనియె. 181

సీ. శిశుజనమునిజనస్త్రీజనంబులఁ జంపఁ, గా దెట్టివా డైనఁ ◊ గడఁగి మీఁదఁ
గవియక పోడుచుట ◊ కల్మషం బంగనఁ, జెఱపట్టఁ దగదు విశేష మొకఁడు
వినుఁ [1]డెల్లసత్త్వంబులను బెంటిఁ జంపుట, పాపంబు గోవుల ◊ బ్రాహ్మణులను
సంకటపెట్టంగఁ ◊ జనదు తదీయహి,తము గోరి పూని యుద్ధంబు సేఁత

తే. యధికపుణ్యంబు సస్యక్రియావిఘాత
మాచరించుట గడుదోష ◊ మవని ప్రజకు
బాధ గావించి కుడిచి శవంబు దొలుచు
ప్రవ్యగతి నది వొలియంగఁ ◊ బూలియు నతఁడు. 182

వ. అని చెప్పి మీర లీధర్మాధర్మంబు లెఱింగి నాపంచిన తెఱంగున బ్రదికెద రేని మీకు ముఖ్యుండ నయి సఖ్యంబు సౌఖ్యంబుఁ బెనుప మీయోగక్షేమంబు లరసెద ననియె దానికి వారు లంగీకరించి ప్రీతింబొంది యాతని [2]వశంబున వర్తించి వర్ధిల్లి రిట్లు కాపవ్యుండు సాధులకు హితం బగునట్లుగా దస్యులం బాపంబులకుం బాపి తానును వారును నిహపరసిద్ధులం బ్రశస్తి వహించె. 183

క. కాపవ్యోపాఖ్యానము, పాపహరము దీనిశ్రవణపఠనము లటవీ

1. క. డెట్టసత్త్వజాతిని జెంటి. 2. ఖ. వచనంబున.

వ్యాపారక్షేమంకర,రూపము లగు దస్యుమృగవిరోధము లడఁచున్. 184

—భీష్ముఁడు ధర్మజునకు దీర్ఘదర్శి మొదల గుమత్స్యముల తెఱం గెఱింగించుట.—

వ. అని చెప్పి భీష్ముండు వెండియు నిట్లను దీర్ఘదర్శియుఁ బ్రాప్తకాలజ్ఞుండును దీర్ఘసూత్రుండును ననుమత్స్యంబులు మూఁడు జలచరబహుళం బగునొక్కయేటి మడువునఁ దమలోనం బొందు గలిగి యుండునవి వేసవి సొచ్చిన దీర్ఘదర్శిదక్కటి రెంటిని గూడం బిలిచి. 185

క. మడు వింకఁగఁ బాటెడు నీ, రెడ త్రెవ్విన నొండుసోటి । కేఁగఁగ రాదె
ప్పుడు నింకనినీళ్ళులు గల,మడువునకుం బోవ వలదె । మన కిట్టియెడన్. 186

తే. అనినఁ బ్రాప్తకాలజ్ఞుఁ డిట్లనియె నేది, ప్రాప్తమయ్యెనక్కార్యంబు । భంగి నెఱిఁగి
యప్పటికిఁ దగునట్టు సేయంగ వలయు, మానితోపాయవృత్తి నేమఱుట లేక.

వ. అనిన నయ్యిరుదెఱంగులపలుకులు విని దీర్ఘసూత్రుం డిట్లనియె. 188

క. జడనిధిచందంబున ని,మ్మడు వొప్పఁగ నిప్పుడేమి । మాఁడెనె యిమ్మై
నడిచిపడ రిత్తనవ్వఁగ, లుడుగుఁడు మఱి చూచికొంద । మొయ్యన తఱితోన్.

క. అనుటయు నిది కర్జము గా, దని పల్కుచు దీర్ఘదర్శి । యంబుస్రోతో
జనితాభయ మగుపథమునఁ, జని చొచ్చెం బెద్దమడువు । సమ్మదలీలన్. 190

వ. తక్కినరెండును నంద నిలిచె నిట్లు నిలిచినయమ్మత్స్యద్వయంబునకు భయంబు జనియింపం గతిపయదివసంబులకు. 191

క. పాటెడునీ రెడ త్రెవ్వఁగఁ, దాఱ బెడిద మైనయెండ । దనుకఁగ నివురం
బాఱె మడు వంత వేడుక, కాఱులు జాలరులు సొచ్చి । క్రందుకొనంగన్. 192

క. వెరవున నూఁతల నెత్తెలఁ, గరముల మత్స్యములఁ బట్టి । కడుసంతసముం
బొరయుచుఁ దాళ్లం గ్రువ్వఁగ,గర [1]మూహించిమదిఁ బ్రాప్త[2]కాలజ్ఞుండున్.

క. ఇం దొకత్రాడు గఱచి యే, నొందం గా గ్రుచ్చినట్ల । యుండెద నీ రీ
క్రందుకొనుట మానంగ న,మందత నది మెడల విడిచి । మడువు దఱిసెదన్.

క. అని యొకగుదిమీలనడుమ, నెనయంగా, దూఱి కఱచి । యిరుదాడలఁ ద్రా
ఢోనరంగఁ బట్టుకొని గ్రు,చ్చినచందము దోఁప మూర్ఛఁ । జెందినభంగిన్.

వ. ఉన్నంత వేట దీఱి యగ్గుది గలయతండు. 196

క. తెలినీట రొంపి బోవం, [3]దొలుచునెడం ద్రాడు విడిచి । దురితంబునకుం
దొలఁగి పొరదప్పి యం దొక, జలచర మున్నయెడ కేఁగె । సంభ్రాంతగతిన్.

క. ముట్టఁబడి దీర్ఘసూత్రుం, డిట్టట్టరుగఁగ నుపాయ । మేది యొకనిచేఁ
బట్టువడె, దనదుడెందము, పట్టు [4]వదలి చకితవికల । భావేంద్రియుఁడై. 198

క. విను దాడవ్వలఁ గార్యము, గనికొని వలయుపని మున్న । కావింపఁగ నే
రనిజడుఁడు దీర్ఘసూత్రుం, డనునమ్మత్స్యంబుభంగి । నాపద నొందున్. 199

1. చ. మూహించుకొని. 2. గ. కాలజుఁ డనున్. 3. గ. దొలఁచునెడం. 4. చ. గదల జనితవికల.

తే. అప్పటికిఁ దోఁచినట్టులు ✱ దప్పకుండ, ననువుతో ధృతి గల్గి కార్యంబు నడపు
నతఁడు ప్రాప్తకాలజ్ఞాఖ్యుఁ✱ నట్లపోలెఁ, బరమసంశయ మయ్యెడుఁ✱ బ్రదుకు గాంచు.

క. ధుర్యతే ననాగతము లగు, కార్యము లూహించి పని తగఁ జేయునయా
చార్యుఁడు సౌఖ్యముఁ బొరయును, సార్యస్థితి దీర్ఘదర్శి ✱ యనుమీను క్రియన్.

—◆పలితరోమశు లనుమూషికమార్జాలంబులసంవాద ప్రకారము.◆—

వ. అనిన విని ధర్మనందనుండు పెక్కండ్రు పగఱకు నగ్గమై హీనబలుం డైన నర
పతి యెప్పరుసున నాపద నిస్తరించువాఁ డని యడిగిన నప్పుడమిఱేనితో భీష్ముండు
మార్జాలమూషికసంవాదం బనునితిహాసంబు గల దది నీ దగు ప్రశ్నంబునకు సదు
త్తరం బగు విను మని యి ట్లనియె. 202

సీ. అడవిలో నొకమఱ్ఱిసయిదుగున లాఁగలఁ, బలితుండు నా నొక్క ✱ యెలుక యుండు
నమ్మహీజముమీఁద ✱ ననిశంబు రోమశుం, డనుపిల్లి వసియించు ✱ నాసమీప
మున సంజకడ నిత్యమును మృగంబుల కురు,లొడ్డి వేకువ వచ్చి ✱ యొక్కమాలఁ
డగపడ్డవానిఁ గొం ✱ చరుగు నొకప్పు డా,హారంబునకుఁ బిల్లి ✱ యచటఁ దిరుగఁ

తే. బోయి యురిఁ బడి యుండఁగఁ ✱ బొంచి చూచి
భయము దక్కి యచ్చోటన ✱ పలితుఁ డెరకుఁ
గ్రుమ్మరఁగఁ జంద్రకుం డనుఁ ✱ గూబ ప్రులుఁగు
హాలికుఁ డనుముంగిసయు నింత ✱ నంతఁ దోఁచె. 203

వ. ఎరలకై వచ్చి యిట్లు దోఁచిన నయ్యెలుక యారెంటిబారికిం దప్పి పోవ రామి
దలంచి బెగ్గలించియు ధైర్యంబుకలిమిం గార్యం బూహించి యప్పిల్లిం గొండొక
సేరం జనుచు దానితో నిట్లనియె. 204

క. ఉరి ద్రెవ్వఁ గొఱికి యిప్పుడ, వెర వారఁగ నీకు నేను ✱ విడుగర సేయం
దొరకొనుట నీదుభాగ్యం, బరిత్వముదొలంగి మైత్రి ✱ యలవఱుపు మదిన్. 205

క. ముంగికి గూబకు నగపడి, యంగంబులు వడఁకుచున్నయవి నాకిమ్మై
సంగతి గలిగిన నీయు,త్సంగబున నుండి భయము ✱ దక్కెదు నేనున్. 206

చ. అనవుడుఁ బిల్లి యిట్టు లను ✱ నార్తశరణ్యుఁడ వయ్యె దిట్టినీ
కనఘ హితంబు సేయ వల దయ్యె జగత్పతి సాక్షి గాఁగ ని
ప్పని దగఁ బూనితిఁ జెప్పుఁ ✱ బాచి ననుం గదియంగ రమ్ము వ
చ్చిన నకులంబు గూబయును ✱ జేరఁగ నేరవు నాకు నోడుటన్. 207

ఆ. అనిన నట్ల యగుట ✱ నాత్మ నెఱింగియు, కాదె సంధిమైన ✱ నాదు బ్రదుకు
నిదుపిడుగి రయును ✱ సిడ మగు నూహించి, నిన్నుఁ జెందె బుద్ధినిశ్చయంబు.

క. అని పలికి పిల్లి పొదిగిట నభయము నిశ్శంకవృత్తి ✱ నయ్యెలుక వసిం
చినఁ జూచి యయ్యులూకంబును నకులము నచటు వాసి ✱ పోయె నిజేచ్ఛన్.

క. నకులము నులూకమును బోఁ,కకు సంతస మంది యుండి ✽ గ్రక్కున నమ్మా
షిక మయ్యురిచేరులు గొఱుఁ,కక యలసత వల్ల నల్లఁ ✽ గఱచుచు నుండెన్.

వ. అమ్మెయిఁ బలితుండు గొనకొని యయ్యురిం గొఱుకకుండుట లోమశుం
డి ట్లనియె. 211

క. తగునే యిట్లు కృతార్థుఁడ, వగునీ కురి గొఱుక కిట్టు ✽ లాలస్యము నేఁ
త గటా కృతఘ్నతకు నెల, వగు టొప్పునె కొఱుకు కడఁక ✽ నద్రోహుఁడవై.

చ. అనుటయు నెల్క యిట్టు లను ✽ నాశ్రితరక్షణశీలు నిన్నుఁ గీ
డునఁ [1]బొరయింతునే యిది యొకండు జెడుగుందన మేను భీతి నా
నినమదితోడ నమ్మమిన ✽ నెట్టన యియ్యురిఁ ద్రెంప [2]నయ్యెదన్
మనమున నెగ్గుగాఁ గొనకు ✽ మాలనిఁ గాంచినయప్డ త్రెంచెదన్. 213

క. ఉరిఁ బాసి యేమి దలఁతో, యరిత్వమున వినుము ప్రబలుఁ ✽ డైనయతనితో
వెరవున సంధి యొనర్చియుఁ, గరంబు నమ్మమియ నీతిగాఁ గొందఱు బుధుల్.

ఉ. మాలనిరాక చూచి భయసమ్మర్దిత మైనమనంబుతోడ న
క్కాలమునందు నీకుఁ జనఁగా వలయున్ వెస మ్రానిపైకి నా
యాలయమున్ జొరన్ సమయ ✽ మప్పుడ నాకును గాన యత్తఱి
న్మేలొనరింతు నమ్ము మిది ✽ సక్కము గర్జము నీ వెఱుంగవే. 215

క. అనవుడు నల్లల తలఁప, వినుము భవత్ప్రాణరక్ష ✽ వెసఁ జేసితి నే
ననఘా నీవును నమ్మెయి, నను నాపదఁ గావ వలదె ✽ నమ్మి రయమునన్. 216

ఆ. అనినఁ బిల్లి కిట్టు ✽ లను నెల్క వేగిర,పడకు ముచితకాలసాధ్య మైన
యత్నవిధిగదా సమగ్రఫలత్వంబు, నొందు నొండు దలఁప ✽ కూరకుండు. 217

వ. అని యిట్లు పలితుండును లోమశుండును నొండొరులతో మాటలాడుచుండ
వేకువ యయ్యె నట్టియెడ. 218

క. తనతోఁ గొందఱు కుక్కలఁ, గొని యేతేరంగఁ గేలఁ ✽ గ్రూరకృపాణం
బును భీకరభంగిగ వెసఁ, జనుదెంచెన్ మాలఁ డధికసంరంభమునన్. 219

ఆ. పరిఘనాముఁ డైన్యపాపాత్ముఁ గని భయ, మడరఁ బిల్లి యిట్టు ✽ లనియె నింక
నేమి సేయువాఁడ ✽ నిదె వచ్చె జముదూతఁ,బోలె సత్వరముగ ✽ మాలవాఁడు.

క. అనిన విని యోడ కొడకు, మనుచుం దెగఁగొఱికె వేగ ✽ మయ్యురిఁ బలితుం
డనయముఁ జకితాత్ముం డై, చనియెన్ రోమశుఁడు నసనిజముపైకి వెసన్. 221

చ. ఎలుకయు [3]బొక్కలోపలికి ✽ నేఁగి ముదంబునఁ బొంచి చూడ సం
కులముగ నేఁగుదెంచి పరిఘుం డురి నుగ్గగు టెల్ల జూచి ని
ష్ఫలతకుఁ జిత్త మెంతయు విషాదము నొందఁగఁ బోయెఁ బిల్లి య
య్యెలుకకు నిట్లనుం జెవికి ✽ నింపగురీతి నుదాత్తభంగిగన్. 222

1. క. బొరయంగ నిత్తునె కడుం. 2. జ. నియ్యెడన్. 3 క. గ. చ. బ్రొక్క.

ఆ. మేలు సేసి తగిన|మిత్త్రునిఁ బడసి త,త్సుచరితముల వచ్చు|సుఖము లనుభ
వింపఁ జూచు టుడిగి | వేర్పడి యుండుట, యరయ నీతివిదుల|తెరువు గాదు.

చ. అనఘ భయంబు నొందు టిది | యారయ బేలదనంబు నెమ్మిమై
మును నను నమ్మి చెంది భయ|మోక్షణముం గని నాకుఁ జాలమే
లొనరఁగఁ జేసి తీవు దుది | నుల్లమునం దగ విశ్వసింప కి
ట్లునికి సుఖంబె నాదుసిరి | [1]కుత్తుఁడ నయ్యెదు రమ్మ ప్రీతితోన్. 224

క. బలవంతు లైనచుట్టం,బులు నేనును నీకు మేలు | వొనరింపఁగ ని
మ్ములఁ మనుటయొప్పదేననుఁ, గలసి మెలఁగు విడువు శంకఁ|గను మభిమతముల్.

వ. అనిన విని యప్పలితుండు రోమశునితో నీపలుకు లుచితంబులు నామాటలు
విను మని యి ట్లనియె. 226

చ. అసలను మిత్త్రులం దెలియ | నారయ నెంతయు సూక్ష్మకృత్య మ
వ్వైర వతిదుర్లభం బరులు | వీ రన నుండియు మిత్త్రభావముం
బొరయుటయుం సుహృజ్జనుల|పోలికి గల్గియు శత్రుతాగుణ
స్ఫురణ మొకప్డు సూపుటయుఁ | జూతుము గాదె ధరిత్రి నెల్లెడన్. 227

వ. కావున నిన్నుఁ బెద్ద గదియుట గర్జంబు గాదు నీవును మద్వాశగతిం బొందుటఁ
జూచి తేనియు నేమఱం జన దె ట్లంటేని. 228

క. బలవద్రిపులు ప్రయోజనములకై కోఁబడుట గల్గుఁ | బాలముల నేనుం
గాలు దీపంబులపజ్జఁ ద,గిలి నెట్టన పట్టువడిన|క్రియఁ జతురమతీ. 229

చ. అరియెడ మిత్త్రభావ మొక|యప్పుడు కార్యముపొంకుఁ గల్గిన
న్వైరవునఁ బాముఁ బట్టునెడ | నిక్కము నమ్మక దానివాతికిం
గరము దొలంగఁ జేయునరు|కర్జము పట్టి చరించు టొప్పదే
పొరుగున నుండి నీకు హిత|ముం దగఁ జేసెద నెప్డు పంచినన్. 230

మ. విను నీ కామిష మేను నీయెడఁ గదుర్ | విశ్వాసముం బూనిచే
రిన నీచిత్త మొకప్పు డుద్గతవికా|రీభూత మై దుర్వినో
దనహింసా[2]రుచి నొందు నీసుతసుహృ|ద్బంధువ్రజం బేని మున్
ననుఁ గన్నన్ సహియింప దాత్మఁ గరుణ | న్మన్నింపు మి ట్లుండెదన్. 231

వ. అని యంత నిలువక. 232

క. [3]బలుపుటెరిఁ జిక్కి పేరాఁ,కలిఁగో రే మెల్ల నున్న|కతమున నీకుం
జలిది వలసి పిలిచెద విటు, వలయునె నీపలుకు నమ్మి | వత్తున చేరన్. 233

ఆ. అనుడు నిట్టు దలఁప | నగునె మత్ప్రాణర,క్షకుఁడు వైననిన్ను | శత్రుఁగాఁగఁ
దలఁతునే కృతజ్ఞ|తయుఁ బౌరుషంబును, గలుగ నేను వెఱవ | వలవ దనఘ.

వ. అనిన రోమశునకుఁ బలితుం డి ట్లనియె. 235

---

1. 'కుక్కుఁడ' యనియే పెక్కుప్రతులు. 2. న. గతి 3. క. బలితపుటురిఁ బడి పేరాఁ.

క. నీవలన నేను బ్రదికితి, నీవును నాకతన మాల్యనికి నగపడ వై
తీవిధమునఁ గల్గుసుహృద్భావము చాలు నినుఁ జేరఁ దగ దిటమీఁదన్. 236

వ. ఇవ్విధంబునకు శుక్రవాక్యంబులుం గల వాకర్ణింపుము. 237

క. బలవంతుఁ డైనశత్రుని,వలనఁ బ్రయోజనము గలిగి వలను కలిమిఁ దాఁ
గలసియు నది గడచనఁగాఁ, దొలఁగ వలయు నమ్మ నేనిఁ దుదిఁగీడౌలయున్.

ఆ. నమ్మఁ దగనివారి నమ్మక యున్నది, తగినవారి నైనఁ దద్ద నమ్మ
యుండఁ దగదు తన్ను నొరులు నమ్మెడునట్లు, నుండి యొరుల నమ్మకనుని [illegible].

వ. ఇట్టి బ్రదుకుఁ దెరు వగుటం జేసి. 240

క. నినుఁ గోంట్లను నమ్మక యేనును బ్రదికెద ననఘ నీవునను గని చండా
లునియట్టివారిమాయలు, నినుఁ బొందక యుండ బ్రదుకు నెట్టేఁ బొమ్మింకన్.

క. అనిన విని సిగ్గువడి తన,చనుచోటికిఁ జనియెఁ బిల్లి నమ్మితిఁ బలితుం
డును వేఱొకతగులాఁగకుఁ, జని సముచితవర్తనమున సౌఖ్యముఁ బొందెన్.

క. బలుపగఁ బవలని యాపద, దలఁగుటకును రిపుని హీనతరు నైనఁ దనుం
గలపికొని బ్రదుకుటకు ని,య్యెలుకయుఁ బిల్లియును వెరవు లెఱిఁగించెదగన్.

వ. అనిన విని కౌంతేయాగ్రజుండు శాంతనవునితో నెవ్వనియెడ విశ్వసింప కున్నం జిత్తంబునకు విశ్రామంబు గల్గదు విశ్వసించిన దురితంబులు పొడచు నట్లగుటం జేసి విశ్వసించుటయు విశ్వసింపక యుండుటయు నను రెంటిలోనను బరమకర్తవ్యం బెయ్యదియో నిశ్చయింప నేర ననుటయు నమ్మహీపతి యమ్మహాత్ముం డిట్లనియె నీయర్థంబు దేటపఱుచునట్టియితిహాసంబు సెప్పెద నాకర్ణింపుము. 244

• బ్రహ్మదత్తునితోఁ బూజని యనుశకుని కైనసంవాదప్రకారము •

సీ. బ్రహ్మదత్తుం డనఁ బరఁగిననరపతి,నగరఁ బూజని యనునామ మొప్పఁ
జతురభాషిణి యొక్కశారిక వర్తించు, నది పిల్లఁ బెట్టి యిం[illegible]
దెచ్చి యర్మిలి దానికిచ్చుచో మేలేటి, యధిపుపుత్త్రున కిచ్చునందుఁ గొన్ని
వాఁడును మచ్చిక వచ్చి యప్పిల్లతోఁ, జర్లాట మాడును సంచరించు

ఆ. నొక్కనాఁడు దాది యొద్ద లేకుండ న,ద్దారకుండు పిల్ల తల నొగిల్చి
చంపె దానితల్లి సనుదెంచి కని మది, నిట్టు లనియె శోక మెసఁగ మెసఁగ.

తే. అకట కూడి మెలంగి యేకమొకట్టియైన, నర్థి నిదియును దాను నమ్మనుభవించు
బట్టి యాడుచు నుండు నీపాపజాతి,పడుచు [illegible]

ఆ. రాచకొడుకు గాఁడె రాచవారికి నేటి
పరిచయంబు వేగ కరుణ విడుచు
హితవు మఱచు రాజు లెందు నమ్మికకుఁ బా
త్రములె సుమనస్కులు క్రౌర్యరతులు. 247

వ. అని నిందించి. 248

క. ఊపగ దీర్చెద నంచుం, గోపంబున రాజు కొడుకు గ్రుడ్లులు రెండుం
బోపడునట్లుగ గోర్లన్, వే పెఱికి రయమున గగనవీథికి నెగసెన్. 249

వ. ఎగసి యచ్చోట నిలిచి బ్రహ్మదత్తుండు విన ని ట్లనియె. 250

క. చేసె నఘము దత్ఫలముం, జేసేతం గుడిచెఁ గాని శిశువు నెడఁ నా
చేసిన క్రౌర్యము లేదే, జేసితి మాఱొందుగీడు సెందదు నన్నున్. 251

చ. అనవుడు బ్రహ్మదత్తుఁ డది యట్టిద నీ దెసఁ గీడు లేదు నీ
తనూజకు నామనం బటిమి పాదముఁ బొందెడుఁ దొంటియట్ల నె
మ్మనమున నిలు మన్నఁ బూజని శ్రమించున యొండొరు చేతఁ బడ్డయీ
పెనుపగ నొంచి మాటపస పెల్పడి క్రమ్మఱఁ జేరు టొప్పునే. 252

వ. అనిన విని యతండు. 253

క. చేసినదానికి మాఱుగఁ, జేసినఁ బగ యంతతోడఁ జెడుఁ గాక గుణుల్
జేసిన నమ్మలు విడిచి, దోసముఁ బట్టుదురె మెట్టితుచ్ఛులుఁ జతురా. 254

వ. అనిన నతనికి శారిక యి ట్లనియె. 255

క. నెయ్యము సెడినను మాటల, తియ్యదనము వట్టి పగ మఱచినఁ జా
వయ్యెం జే టయ్యెఁ గలఁక, యయ్యె నొకటి మూఁడుఁ గాక యది మే లగునే.

ఆ. వినుము నేల [2]దోఁచికొనినను దాయాదు,లైన మాటమాట కేని నాఁడు
వారి యెడను గీడు వారక చేసినఁ, బగ జనించు నిట్లు భంగు లైదు. 257

ఆ. [3]పగయుఁ గల్గెనేని పాయునె గూఢ మై, ప్రాన నగ్ని యున్నమాడ్కినుండుఁ
గాన నమ్మ బేల కాలాంతరంబున, నైనఁ జెడును సంధియంబు వలదు. 258

క. జననీజనకసహోదర, తనూభవుల సఖుల నమ్మఁ దగ దనినను నె
మ్మనమునఁ బగ గలవారలఁ, జనునే నమ్మంగ విడువు చతురవచనముల్. 259

వ. అనుటయు బ్రహ్మదత్తుం డి ట్లనియె. 260

క. కాలవశంబునఁ గీడు, న్మేలును జనులకును మూఁడు నేకును నాకుర్
నాలి యవి సేయ వచ్చునె, బేలనె యే నంత యేల పెడఁబాయంగన్. 261

వ. అనిన విని శారిక యతని మొగంబు దేఱకొనం జూచి. 262

క. వినఁ జల్లనిమాటలలోఁ, మునిఁగి యలుక [4]గుబ్బతిలు సముద్ర జలములో
నన యుండి యూఱఁ జెప్పుదు, గనగన మనుబాడబాగ్నికరణి నరేంద్రా. 263

క. అని పలికి యవిశ్వాసము, మనమున నెలకొల్పి రాజుమాటలకుం దే
లని నావృత్తోక్తి నాప్రజ. జని దన కిమ్మైన యెడకుఁ జనియెఁ గుమారా. 264

వ. అదియునుం గాక. 265

క. జననాథునకు నవిశ్వా, సనిరూఢత వలయు నెల్లజనములయందుం
దనునిఁ దనసిరిఁ గాచుటకై, యని నీతులు సెప్పుదురు బృహస్పతిముఖ్యుల్. 266

1. చ. డాసినయమ్మలు. 2. క.న.జ. ద్రోచికొనినను. 3. క పగయు నిలుగు నేని. 4. క. గుబ్బటిలు

⟶ కణికుఁడు శత్రుంజయున కుపదేశించినహితవచనములప్రకారము. ⟵

వ. అవ్వాక్యంబు లాదరింప వలయు నని పల్కి వెండియుభీష్ముండు పాండవాగ్రజుతో సౌవీరపతియగుశత్రుంజయునకు భారద్వాజవంశవర్యుండైన కణికుండుపదేశించిన హితవచనంబులు గలవు వానిం జెప్పెద నాకర్ణింపు మని యిట్లనియె. 267

క. వికచముఖుఁ డగుచు శాత్రవు, లకు హితు లగునట్టివారలం గని భూపా
లకుఁ డెక్క కత్తెరయు నా, లుక బెల్లము నై [1]మనంబులం గనవలయున్. 268

ఉ. జ్ఞాతుల [2]సమ్మి తోడుకొని శత్రుల నోర్చి యహీనరాజ్యముం
బ్రీతి మెలర్పఁ జేకొనినవిమ్మట సౌఖ్యసమృద్ధితోషిత
జ్ఞాతినికాయుఁ డై మది నజస్రము నమ్మక సర్పసంయుతం
బై తనరాఁ సురమ్యనిలయంబున నున్నటు లుండఁగాఁ దగున్. 269

వ. అని మఱియును. 270

క. వినుము తఱి వేచి రిపుమూ, పున మోవఁగ వలయు సమయమునుం గని కాని గ్ర
క్కునఁ గడవ శిలాస్థలి నై, చినచాడ్పున నేప్పు మెఱయఁగ జెఱుచుట యొప్పున్.

క. పానము జూదము వేఁటయు, మానినియును భూపతులకు మధురవినోద
స్థానము లగు నైనను దగ, వైనవిధము [3]దకఁ దగులమాపద దెచ్చున్. 272

క. విని విననివాఁడపోలెం, గని కాననివాఁడపోలెఁ గావలయు విభుం
డొనరింపఁ దలంచినపని, కను వగునంతకు నభేద్యుఁ డై జనులయెడన్. 273

క. ఒల్లనికార్యం బాసల, నల్లన కాలగతిఁ గడపునది కాలముచేఁ
బె ల్లొదవు విఘ్నములు భూ, వల్లభునకు నెపము వెట్టవచ్చుం బిదపన్. 274

తే. బహుళ మగుగర్వమునఁ గార్యభంగియును న
కార్యసరణియు నెఱుఁగ కనార్యవృత్తిఁ
గాసి తెరువున నడచు చున్నేని గురుని
నైన శాసింపఁగాఁ దగు నండ్రు బుధులు. 275

క. తెగఁ దీర్పక [4]తెగ నార్పక, తెగటార్పక కడమ కొంత దిక్కఁగ నున్నన్
జగతీశ యప్పు నగ్నియుఁ, బగయును గడుఁ బెరుఁగఁగీడు వాటిల్లుఁ దుదిన్.

ఆ. మార్దవమున మృదువు మర్దింపఁగా వచ్చు, మార్దవమున ఖరవిమర్దనంబుఁ
జెల్లు మార్దవమున జెల్లనియది లేదు, గాన మృదువ తలఁప ఖరము సువ్వె.

వ. అనిన విని యజాతశత్రుండు ధర్మంబు నడనక యవగ్రహాదిదురితంబులు దుస్తరంబు లగుచున నాహారంబులు దొరకొననియట్టిచో ద్విజాతు లేమిభంగిం బ్రాణంబులు రక్షించుకొనువా రనుటయు నాపగానందనుండు విశ్వామిత్రచండాలసంవాదం బనునితిహాసంబు భవత్ప్రశ్నంబునకు నుత్తరం బై యుండు నాకర్ణింపు మని యిట్లనియె. 278

1. గ.ఘ.ఙ.నంబులు గలుంగ గనవలయున్. ... లుకఁ గావలయున్. 2.గ. నెమ్మి. 3.గ. దప్పు. 4.గ. తెగ

యేను విశ్వామిత్త్రుండ నని పలికిన వాఁడు వినయంబున శయ్య డిగ్గి కరుణం గన్నీ రొలుకం బ్రణమిల్లి కేలు మొగిడ్చి మహాత్మా నీతలం పేమి యని యడిగిన నతండు సాంత్వనవచనంబుల నిట్లనియె. 288

చ. దరికొనునాఁకలిం దనువి ✠ దాహము పుట్టినఁ బ్రాణహానికిం
బరిహరణంబు సేఁత కిది ✠ పాపమ మైనను గుక్కనంజు డే
భరపడి మ్రుచ్చిలించెద వి ✠ భావసుఁ డెంత శుచిత్వసంపదం
బొరసియు సర్వభక్షకతఁ ✠ బొందును నన్నును జూడు మట్లగున్. 289

వ. అనిన విని చండాలుండు. 290

తే. కుక్క మృగములలో నెల్లఁ ✠ గుత్సితంబు
దీనిఁ దిని ధర్మమున కేల ✠ హాని సేయు
నొం డుపాయంబు వెదకికొ ✠ మ్ముజ్జ్వలాత్మ
యనుడు వానికి ముని యిట్టు ✠ లనియె సఖిప. 291

క. విను బ్రహ్మవహ్ని నాకుం, బెనుఁబ్రాపై యుండ నేను ✠ నెఱితునె యెల్లి
ననుఁ బోవనీక ప్రాణము, దనువున నిల్పుటయ చూవె ✠ ధర్మం బరయన్. 292

ఆ. బ్రదికి యున్న నేఁ ద ✠ పంబున విద్యను, బాచికొనఁగ నేర్తుఁ ✠ బాతకంబు
నట్టు లగుట జీవి ✠ తాధార మైనయీ, నంజు డిప్పు డెట్లు ✠ నమల కుడుగ. 293

చ. అనుటయు నంత్యజుండు నగి ✠ యట్టివిధం బధమంబు గాక నె
ట్టన యది ధర్మమే కటక ✠ టా మిముబోంట్లకు నిట్లు సేయఁగాఁ
జనునొకొ యన్న నమ్మని ప్ర ✠ శస్తుఁ డగస్త్యుఁడు దైత్యమాంసముం
దినఁడె నశించెనే యతని ✠ తెజముఁ జెంపుచు నంతనుండియున్. 294

వ. అనవుడు-వాఁ డి ట్లనియె. 295

క. పరహితము సేయఁ బూనిన, పురుషుఁడు పాపంబు సేసి ✠ పొందఁడు కీడుం
బరమముని యగునగస్త్యుఁడు, పరోపకారార్థకృతి న ✠ భవ్యుం డగునే. 296

క. నావుడు మదాత్మ బ్రాహ్మణ, తావిద్వత్తాస్పదంబు ✠ దానికిఁ గా నే
నీవిధి యొనరించుట పా, పావేశము లేదు దీని ✠ కడ్డపడకువే. 297

క. అని ముని పల్కిన నంత్యజుఁ, డను మాంసము విడువనోప ✠ కనుటగఁ దలఁపం
జనునె భవదీయతేజో, ధనహానికిఁ గరుణ పుట్టు ✠ దా యెవ్వరికిన్. 298

వ. అనవుడు గాధినందనుండు. 299

తే. కరుణ గలవేనిఁ బ్రాణంబు ✠ గాచికొనఁగ
దలఁచునాకు నిమ్మాంసమి ✠ మ్మలఘుచరిత
యట్టు లైన మ్రుచ్చిమియు లే ✠ దనృత మెడలి
పడయునిస్తువు సేయదు ✠ పాతకంబు. 300

వ. అనిన విని చండాలుం డి ట్లనియె. 301

క. అతిశయితపుణ్యదీప్తులు, ప్రతిగ్రహము నీచనరుని ꠂ పాలం జేయన్
మతిఁ దలఁపఁ గూడునే వి, శ్రుతగుణ యే వెఱతు నింకఁ ꠂ జఱచుఁ బల్కన్.

వ. నీవలచినయట్లు సేయు మని సారమేయమాంసం బిచ్చినఁ బుచ్చికొని దాసం బ్రాణంబులు రక్షించుకొని విశ్వామిత్రుండు సనియె నింద్రుండు తదనంతరంబ లోకంబలవడ దేఱ వర్షించె నంత హర్షించి యత్తపస్వివస్యుండు దపోవిశేషం బున దోషంబు నీఁగికొని మనీషి జనస్తుత్యం బగునిత్యవ్రతంబున విలసిల్లెనాపత్సమ యసమాచారంబిట్టిదయని చెప్పిన భీష్మునితో భూవల్లభుండు ధర్మసూక్ష్మప్రకా రం బింతదురవగాహంబగునే యీయితిహాసంబాకర్ణించుటనాడెందంబు విషాదం బు నొందె ననవుడు నతండు ధర్మంబు బహుశాఖాసమన్వితంబై యుండు రాజులకు నెల్ల తెఱంగులు నెఱుంగవలయు విషాదం బేల యనవుడు నజ్జనవిభుండు. 303

◆◆ భీష్ముఁడు ధర్మజునకు శరణాగతరక్షణ సుకృతం బెఱింగించుట ◆◆

క. శరణాగతసంరక్షణ, పరులకు సమకూరు నెట్టి ꠂ పాటిఫలము ని
ర్భర కరుణాకర పరమా, దరమున నెఱిఁగింపు నాకు ꠂ దాని తెఱంగున్. 304

ఆ. అనిన భీష్ముఁ డిట్లు ꠂ లను ముచుకుందుండు, నాఁగఁ బరఁగుధరణి ꠂ నాయకుంగు
దనుజమంత్రి చేత ꠂ వినినది యొకకథ, యఖిలపాపహరణ ꠂ మాచరించు. 305

వ. అయ్యితిహాసంబు సెప్పెద దాన నీ యడిగినయర్థంబు దెలియు నవహితుండ వై యాకర్ణింపుము. 306

సీ. పాపాత్ముఁడొకబోయꠂపక్షుల వధియించి, తినియును బెక్కమ్మꠂకొనియునదియ
బ్రదుకుగా దానికి ꠂ బహుసాధనంబులు, సవరించుకొని మహా ꠂ టవిఁ జరింప
నొకనాఁడు పెనువానꠂయును గాలియును ముట్టి, సకల జీవులకు నాꠂశంబు పుట్టు
నట్టిది యై కాన ꠂ యంతయు జలమయం, బైన బెగ్గిలియన్న ꠂ రాధముండు

తే. [1]వేగ వట్టోడి యెల్లను ꠂ వెడలి మిఱుత, నొకవనస్పతి జొంపమై ꠂ యున్నదానిఁ
జెంది రాతిరి యగుటయుꠂశిలయ సెజ్జ, గాఁగ శీతార్తుఁడై యుండెꠂగారవేంద్ర.

క. ఆలుబ్ధకుఁ డత్తరువర, మాలోకించి కడుభక్తి ꠂ ననియె నిచటిభూ
తాలిం గొలిచెదఁ గరుణా, శీలత ననుఁ గాచుటకు వి ꠂ శిష్టవినీతిన్. 308

వ. అని యిట్లప్పక్షిధ్వంసకుండు శయనంబు ప్రాపించియుండ నమ్మహీరుహంబు కోట రంబున వసియించి యుండునది యొక్క కపోతంబు దనవల్లభ యెటయేని మేఁతకుం బోయి రాక తడసిన శోకించి. 309

సీ. ఎచట నున్నదియొకో ꠂ యింత ప్రొద్దొకచోట, నుండు నేననుఁబాసిꠂయుజ్జ్వలాంగి
యమ్మేను లేకున్న ꠂ నిమ్మేనికలిమి ని, రర్థకం బధికాను ꠂ రాగయుక్త
యగు సతిగుణముల ꠂ నైహికాముష్మిక, సుఖసాధనంబులు ꠂ సువ్వె పతికి
యేకారణంబున ꠂ నే మయ్యెనో నాన, యేపునఁ దెగియెఁ గా ꠂ నొప్పు నకట

తే. నేమి సేయుదు మందిరం * బిపుడు పాడు,వాఱుచున్నది యనఁగ న * ప్పలుకులెల్ల
బోయవలలోన నున్నక * పోతి విని మ,నంబు సంతోషపూర్వమ * గ్నంబు గాఁగ.

క. పతిమదికి నింతమెక్కిన,యతివ గదా పుణ్యవతి ప్రి * యాలాపము లీ
గతి వినఁ గాంచితి జన్మము, గృతకృత్యం బయ్యె నాకు * గెలిచితి జమునిన్. 311

వ. అని యుల్లంబునన యుగ్గడించి పతికిం దన తెఱం గెఱింగించి విధికృతంబునకు వగ
నం బని లే దని మఱియు నిట్లనియె.

చ. శరణము సొచ్చినం దగఁ బ్ర * సన్నతఁ గైకొని రక్షణంబు సా
దరముగఁ జేయు టత్యధిక * ధర్మముగా బుధకోటి సెప్పు నీ
వరసి మహార్తు వీని శర * ణాగతు నోపినభంగి నాపదం
బొరయక యుండఁ జేయుము ప్ర * భూతపుసీతునఁ గొంకు వోయెడున్. 313

క. అని యేర్పడ భాషించిన, విని శోకము డిగ్గ విడిచి * విహగము గరుణాం
దనజాతి సెప్పి తగ ని, ట్లనియె మనుజభాషణముల * నాలుబ్ధకుతోన్. 314

క. ఓయన్న డస్సినాఁడవు, మాయింటికి నతిథి వైతి * మసలక నీకుం
జేయ వలయు నాతిథ్యం, బేయది భవదీప్సితార్థ * మెఱిఁగింప వనా. 315

చ. అనవుడు నుల్ల మెంతయుఁ బ్రి * యంబు వహింపఁగఁ బక్షివైరి సీ
తున సకలాంగకంబులుఁ బ్ర * తున్నము లయ్యెడు దీనిఁ బాపవే
యనిన విహంగమంబు రయ * మారఁగ నచ్చటిపుల్ల లెల్ల ము
క్కున్న గొని తెచ్చి ప్రోవిడి య * కుంఠిత మైనదయాగుణంబునన్. 316

వ. ఆపొంతపల్లియకు రయంబునం జని పుల్లతఱి సంగతం బైనయింగలంబు. 317

క, కొని వచ్చి పుల్లప్రోవునఁ, దనుకంగాఁ జేసి నెమ్మి * దళుకొత్తఁగ ని
ట్లను బోయతోడ మేనీ,యనలంబునఁ గాఁచికొనుట * కై లెమ్మనఘా. 318

చ. అనవుడు వాఁడు గువ్వహృద * యం బలరం దనయంగకంబు ల
య్యనలశిఖాకలాపమున * నల్లన యల్లన కాఁచి శీతబా
ధన ముడుగంగఁ జేయఁగఁ బ * దంపడి యాఁకలి చాలఁ దోఁచెఁ దోఁ
చిన నెఱిఁగించె గువ్వ కది * సేయ నుపాయము లేక యాత్మలోన్. 319

వ. వగచి వెలువెలంబాఱి తలంచికొని వాని కిట్లనియె. 320

తే. ఖగములకు జీవనం బనఁ * గలదె సం,గ్రహించినట్టిది యాఁకలి * కేమి యైన
మాకు దొరకొన్నఁ దిందుము * గాక యైన, నీవు డస్సితి వాతిథ్య[1]నియఱ[2] వలయు

◆కపోతంబు దనశరీరమును బోయ కాహారంబుగా నిచ్చుట.◆

వ. నాశరీరం బాహారంబుగా నిచ్చెదఁ గొనుము. 322

క. అని పలికి యగ్ని వలగొని, తనదేహము దాసిలోనఁ * దడయక యిడినం
గని బోయ విస్మయంబున. మనమూనఁగఁ గొంతసేపు * మ్రాన్పడి యుండెన్.

1. చ. మెఱిఁగింపు తగన్. 2. గ. నీతి.

వ. పదంపడి. 324

మ. కలదే యిమ్మియుపౌరుషంబు జగతిం గారుణ్య మేపార ని
ప్పులుఁ గిట్లిచ్చునె మేను నాదుచరితంబుల్ నిందకుం బట్టులై
తలఁపఁగా వచ్చిన నింతకీడగునె యేతత్పూర్వకృతా ఘోరచే
ష్టలు మానంగలవాఁడ బక్షి గురు వై సంధించె సద్బోధమున్. 325

వ. అని యంతరంగంబున వైరాగ్యంబు నిరంతరం బగుటయు నంత నిలువక. 326

మ. ఇది యిట్లాలిని బంధులం దొఱఁగి తా నీయగ్నిలోఁ గూలె నే
ప్పిద మై యుండఁగ నిట్టి తెంప మెలయం బెంపారు వైరాగ్యసం
పద పాపంబుల నెల్లఁ ద్రుంపఁగ మహాప్రస్థానపుణ్యాత్వ మొం
దెద నే నిప్పుడ యంచు మానసము శాంతిం బొంద నిర్మోహుఁ డై. 327

క. వలలోన నున్నపులుఁగుల, వెలువడఁగా విడిచి వలయు వెండియుఁ దనకుం
గలపక్షినిహతిసాధన,ములు నచటనె యుండఁ బోయె బోయ నియతుఁ డై.

ఆ. అక్కపోతి నాథుఁ డగ్నిలోఁ బడుటకు, శోకవహ్నిఁ జిత్త మాకులముగ
నెలుఁగు రాలుపడఁగ నిట్లని పలవించె, నశ్రుజలతరంగితాస్య యగుచు. 329

క. నాయాకలి కోర్వ వెపుడు, వేయైనను నేఁ గొనంగ వెండి యనుభవిం
తామాసపడుటఁ గనుఁగొని, నోయుదు ననుఁ బాసి యిటు సన్నుట దగ వగునే.

వ. అని వెండియు. 331

సీ. ఇనుముజాంపంబుల నిం పావిరులను, బలు పైసపాదల క్రేవలకుఁ దార్చి
సెలయేఱులందలి తెలినీటఁ దనుపుసొం, పెలసినగిరుల [1]తెప్పలకుఁ జేర్చి
మావిమ్రాకల నెలదీవల, జెన్నొందు,తో టలకడ [2]నలితోడఁ జెంది
యలరు నెత్తమ్ములకలిమిఁ జెల్వగుడిగ్గి,యలతీరభూముల నల్లఁ బొంది

తే. నన్ను మనమునఁ దేల్చి యానంద మొందఁ, గేలి సలిపెడునీదగులీల మఱవ
నావశంబె ప్రాణేశ ప్రాణంబులిపుడ, నిన్నకూర్చి యే తెంగు నీకన్నకడకు. 332

వ. అట్లుం గాక. 333

క. జేనియనుమరణమునఁ దన, మేను విడిచినట్టికాంత మేలపదవికిం
దాను నతండును నరిగి య,నూనస్థిరసుఖము లందుచుండుట విందున్. 334

క. అని పలికి యపుడ యనలము, ఘనముగ [illegible] మది వికాసముఁ బొందం
దనవల్లభుఁ దలఁచుచు వల,నొని లీలం జొచ్చి యతనిఁ గూడం జనియెన్. 335

క, స్ఫురితవిమానముమీఁద న,మరతతి వేష్టింప [illegible]భూషణాసుం
దరదివ్యమూర్తి [illegible],వరునిఁ గలసి [illegible]సౌఖ్యవైభవ మెసఁగన్. 336

తే. [illegible] సచ్చరితలేమపిండు, బలసి యభినందనము సేయఁ బాలిచెనిట్లు
[illegible]యుగ్మంబువర్తనము [illegible], బున్యవర్తను [illegible] యకపుడు.

1. క. తెం[illegible]లకుఁ. 2. క. నలి[illegible]డఁ.

వ. తోఁచిన నతండు, 338

క. ఏనును ని ట్లగుదు ననుచు, నూనినకౌతూహలమున నుల్లము వొదలన్
మే నెల్ల ముండ్లు సింపఁగఁ, గానఁ దఱిసి గళితరక్తకలితాకృతి నై. 339

తే. అరుగు చుండువాఁ డొకచో దవానలంబు, గట్టెదిరికాననం బెల్లసముట్టి మండ
సంప్రమోదితచిత్తుఁడై చక్కఁ జొచ్చి, యొడలుదొఱఁగి దేవత్వంబు వడసియొప్పె.

ఉ. ఈయితిహాస మర్థిమెయి నెజ్జనముల్ వినినం బఠించినం
బాయు సుదాత్తగోహననపాతక మైనను భూరిసౌఖ్యముల్
వేయివిధంబులం బొరయు విన్కు తగన్ శరణార్థిఁ దోసితుం
జేయనివాఁడు కల్మషముఁ జెందు నొకప్పుడుఁ బాయ దేమిటన్. 341

వ. అని యిట్లు శరణాగతరక్షణఫల విశేష ప్రకటనంబగులుబ్ధకకపోతాఖ్యానంబు
సెప్పిన విని యప్పితామహునిమీఁదం బ్రీతివినయవిస్తారవిలోకనం బొలయ న
ప్పాండవాగ్రజుండు. 342

క. పాపంబు బుద్ధిపూర్వ, వ్యాపారము గాక తొడరినప్పుడు మనుజుం
డేపాట దాని నంతయుఁ, బాపికొనం జాలు సుజనబాంధవ చెపుమా. 343

వ. అని యడిగిన నయ్యార్యవర్యుం డాధరణీభరణధుర్యునకు ని ట్లనియెఁ దొల్లి పరి
క్షిత్తనయుం డగుజనమేజయుం డనుమహారాజు దన కబుద్ధిపూర్వక బ్రహ్మహత్య
వాటిల్లినం దత్కిల్బిషంబు వాపికొనియె నది పురాణకథ యై మునులవలన వినం
బడు నత్తెఱం గెఱింగించెద నాకర్ణింపుము. 344

క. పాపంబు దొడరుటయు నా, భూపాలకుఁ బ్రజయ విడిచె భూసురులును నిం
దాపాత్రంబుగఁ జేసిరి, తాపము మదిఁ గదిరి యతఁడు దల్లడ నొందెన్. 345

తే. అట్లు జనమేజయుఁడు వగ నారఁ గూరి
పురము వెడలి యొక్కరుఁడును బోయి కాన
నాంతరము సొచ్చి శౌనకుం డనుమునీంద్రు
నాశ్రమము రోసికొని చని యమ్మహాత్ము. 346

వ. కాంచి దండప్రణామం బాచరించి సవినయంబుగఁ గరంబులు మొగిచి నిల్చినం
జూచి యతండు. 347

చ. పెనుపాల నల్చుచున్నయది పీనుఁగుఁ జూచినయట్లు లయ్యెడన్
నినుఁ గనుఁగొన్న నీయెడను నీ విది యేటికి వచ్చె దెక్కడేఁ
జనుము శిరంబు క్రిందుగ నజస్రము వ్రేలఁ గలాఁడ వీభవం
బునఁ దుదిఁ గ్రూరకాకచయముల్ దొలువన్ నరకాధివాసి వై. 348

చ. అనుటయు గర్హకర్హుఁ డగునట్టిదురాత్మునిఁ బూజిత వ్రతుల్
గని యిటు లంట యుక్తమఁటు గాన కదా భవదీయపాద
దన మొనరించి మీనలస దారుణపాపము నాచికొన

ననుమది వచ్చినాఁడ సదయం బగుచూడ్కిఁ బరిగ్రహింపవే. 349

వ. అనిన విని కరుణాయత్తచిత్తుం డగున త్తపోధనసత్తముం డిట్లనియె. 350

క. విను కొంద ఱల్పబుద్ధులు, నను నెంతయు ధిక్కరింప నవ్వఁగ వారిం
గొనక బుధు లైన విప్రులు, ననిమిషులును మెచ్చుచుండ నని యెద నీతోన్.

క. హీనప్రజ్ఞుఁ డకార్యము, లైనవి సేసి తుది నగచు నతులప్రజ్ఞా
సానుమదారూఢుఁడు వగ, నూనఁడు దురిత మనువఁటితి కోడక యునికిన్. 352

వ. ప్రజ్ఞాకార్యంబు లై యనుష్ఠింప వలయువానిం జెప్పెద నీకుం బాపంబునెడ
ననుతాపంబు గలిగి ధర్మప్రవణుండ నై తే యనుటయు నమ్మనుజనాథుండు. 353

క. తాపసవర తీవ్రం బగు, పాపాగ్నిజ్వాలచయము పాలుపడి పరీ
తాపము నొందుచు ధర్మ, వ్యాపారజలాభిలాషి నై యున్నాఁడన్. 354

వ. భవదీయకృప నాశ్రయింప వచ్చితి నన్ను రక్షింపవే యనవుడు నమ్మునీంద్రుండు.

క. భీతి యొకటి గోరుటయును, నీతలఁపులలోన దీని కిది గతి మనఁగా
నే తెరువును గలుగవు మ, చ్చేతోగతి ధర్మవృత్తిఁ జక్కట దక్కన్. 356

క. ఆతురత నీవు నాకడ, కేతెంచినదానఁ జేసి యెలసినధర్మ
ద్యోతనకౌతూహలమున, నీతోఁ బడ వలసె వినుము నిశ్చలమతి వై. 357

క. భూవిబుధుల కెయ్యది హిత, మావిధమున నడచువాఁడ వగునది ద్రోహ
భావంబు ప్రతిజ్ఞాతం, బై వెలయఁగ వలయు నీకు నాజాతియెడన్. 358

చ. అనవుడు ధర్మవృత్తము మహాత్మకు నైజము దోషవృత్తికిన్
మునివర యేను భీతుఁడ సమజ్వలవిప్రకులంబు నాకు మ
న్ననలకు బాత్ర మెవ్విధమునం దెగి ద్రోహము దానియందు నా
మనము దలంప దింతకును మాన్య భవచ్చరణంబు లంటెదన్. 359

వ. అనుచుఁ దదీయపాదస్పర్శనంబు సేసి యవ్విధంబునం గృతశపథుం డగుటయుఁ
గని [illegible] చిత్తంబుతో న త్తపోధనసత్త్వుం డాదర మేదురావలోకనం బా
భూపాలునిమీఁద నొలయ ని ట్లను న ట్లనిం జెప్పెద నవహితుండ వయి యా
కర్ణింపుము. 360

సీ. శ్రీమంతుఁడును బలశ్రేష్ఠుండు నగురాజు, భోగంబు దర్పంబుఁ బోవ విడిచి
ధర్మంబుఁ గైకొని తపమును దానంబు, నధ్యయనంబును యాగవిధులు
నాచరింపఁగఁ జూచి యచ్చెరు వడి యను, గ్రహము సేయదె భూతరాజ యతని
కధిప యయాతివాక్యమునర్థ మెఱిఁగింతు, వినుము సరస్వతియును దృషద్వ

తే. తియును ననుపుణ్యనదులందుఁ దిరిగి తీర్థ, సేవ సేయుచు నధ్యయనావధాన
దానసిద్ధాతరాగత్వోదయలు గలిగి, పరఁగఁ బాపకళంకలేశంబు వాయు. 361

వ. అదియునుం గాక యొక్క పరమస్మృతి సెప్పెద వినుము. 362

చ. దురితము సేసి తాపమునఁ దూలిన నిం కిటు సేయ నన్మతిం

బొరసిన ధర్మసంచరణబుద్ధియ మే లని యూఁదినం గ్రియా
పరుఁడయి మేలు సేసినను బాదముపాదముగాఁ గ్రమంబునన్
విరియు సమస్తముం దదభివిష్టకళంకము నిర్భయంబుగన్. 363

చ. నరవర వాసవుం డడిగినన్ గురుఁ డిట్లని చెప్పె బుద్ధితోఁ
బొరయనిపాతకంబులు సుబుద్ధికపుణ్యములన్ నశించు నం
బరమునఁ బట్టినట్టిమలపంకము గారములోన నద్దఁగా
విరిసినయట్లు నమ్ము మిది వేదము సెప్పిన నేనుఁ జెప్పితిన్. 364

వ. అని యిట్లు బహుప్రకారంబులం గారుణికోత్తముం డగునత్తాపసోత్తముం డా భూవరుబోధించి తీర్థసేవాదిపురశ్చరణంబులం బరిపూతాత్ముం గావించి యశ్వమేధంబు సేయించిన నుజ్జ్వలుం డయి యజ్జనమేజయుండు నిజరాజ్యంబు పరిపాలనంబు సేసె నని చెప్పి వెండియు. 365

—♦ భీష్ముఁడు ధర్మజునకు గృధ్రజంబుకోపాఖ్యానము సెప్పుట. ♦—

సీ. గాంగేయుఁ డిట్లనుఁ గౌంతేయపూర్వజు,నకు విదిశాపట్టణమున నొక్క
బాలుండు మృతుఁడైన బంధులు ప్రేతభూ,మికిఁ గొనిపోయి యమేయశోక
వివశాత్ములై పలవింపఁగా గ్రద్దయొ,క్కటి వచ్చి మీర లిక్కడ భయంబు
దక్క యేడ్చుచునుండఁ దగ దిదె క్రుంకెడుఁ, బ్రొద్దురాక్షసులునుభూతములుఁ బి

తే. శాచములు వ్రచ్చి తిని నిప్పుడేచివచ్చు,జననమరణముల్ వింతలే చన్నశిశువు
తోన యందఱుఁ జనుటకుఁ బూని యుండు,వారలే పొందు పీనుంగు వైచి వేగ.

క. తెగి పోయినవా రేడ్చిన, మగుడుదురే వెఱ్ఱులార మానుఁడు మీరుం
దెగుదురు దడసిన నావుడు, నగు నట్టిద కర్జ మనుచు నందఱు భీతిన్. 367

వ. శవంబువిడిచి పోవంజూచిన నొక్కనక్క [1]బొక్కలోనుండి వెడలి వారలతోడ.

సీ. గ్రద్దమాటల కేల కడు భీతిఁ బొందితి, రక్కటా బాలుని నబ్జవదను
నిటు వైచి పోవఁగా నెట్లాడె నేర్చుఁడు శోకంబు వోవ నిచ్చోటఁ గొంత
ప్రొద్దంతలో విధి క్రూరుండు గాకున్నఁ, బ్రాణంబు గ్రమ్మఱ రాక గల్గు
నో యెఱుంగుదురే యినుండును నస్తాద్రిఁ, జేరఁడు వెఱవక మీరు నిలువుఁ

తే. డనిన వారును మనమున నాస పుట్టి, మగిడి వచ్చిన గ్రద్ద యిమ్మందబుద్ధి
యైననక్కమాటలు వినఁగనగునె వికృత, మయ్యెఁ బీనుంగు వచ్చునే యసువు లిఁక.

క. కనుబట్టి దుండు కాలుఁడు, మిడుకమిడుక నపహరించు మీ రీయాసల్
విడువుఁడు బాలునికి సుగతిఁ, బడయుఁడు దానాదు లైనబహుధర్మములన్. 370

వ. అని పలికిన నాగృధ్రంబువచనంబు లాక్షేపించి యజ్జంబుకంబు వారల నుద్దేశించి.

క. క్రూరంబు గృధ్రి మిట్టిను,మారకునిం జూచి చూచి మసలక పోవన్
మీ రెట్లోర్చెదరో కన్నీ రిటు నను బోటులకును నిలువ కొలికెడున్. 372

1. ఱ. గ. చ. బొక్క.

క. దయ మాలి పోవ నేటికిఁ, బ్రయత్నమునఁ బొదువ దైవబలమున మీఁకుం
బ్రియ మెసఁగ బ్రదుకు బ్రదుకం,డయినను మఱిపోవరాదె యని చెప్పుటయున్.

వ. గ్రద్ద యి ట్లనియె. 374

ఆ. ఏను బుట్టి వేయు నిన్నూఱు, మున్నూఱు, గలవు వత్సరములు గాన నెందు
బాలు యౌవనస్థుఁ బ్రౌఢుని వృద్ధునిఁ, జచ్చి పోయి మగిడి వచ్చువాని. 375

క. ఒకటి గలదె వత్తురు వే, ఱొకగర్భంబునకు మృతులు [1] నుక్కివ మాన
క్కకు నేటిబుద్ధి పీనుఁగు,నకు బ్రదుకఁ గలుగు నిట్టినవ్వులు గలవే. 376

సీ. అనవుడు [2]నెగ వెక్కి యాబిడ్డ నైచి పో,యెడువారలకు నడ్డపడుచు నక్క
వినుఁడు రాఘవుఁడు నేర్పున బ్రదికింపఁడే,మృతుఁడైన భూసురసుతుని మగుడ
సృంజయుకొడుకు సచ్చిన నారదుఁడు ప్రభా,వంబునఁ, గ్రమ్మఱ వానిఁ దేఁడె
యట్టుల యొకసిద్ధుఁడమరుండుమీయేడ్పు, లాలించి దయబాలునసువులొసఁగ

ఆ. నేని మేల కాదె యిది యేల పోయెద, రనిన వారు మగిడి యపుడు డెంచి
శిశువుశవముచుట్టుఁ జేరి పెల్లేడ్చిరి. పనవి పనవి యంత నినుఁడుఁ గ్రుంకె.

వ. ఆ గృధ్రంబును జంబుకంబును నాఁకలిచేత వందురుచుండి తాన తాన బాలశవంబు నాహారంబు గొనుటకై యివ్విధంబునం దమతమపల్కు నేర్పున నజ్జనంబుఁ గ్రమ్మఱించెఁ బ్రొద్దు గ్రుంకినం దా నచ్చోట నిలువ నేరదు గావున గ్రద్ద యట మున్న వారు వోవునట్టి తెఱంగుమాట లాడె రాత్రి యైనం దనకు మేలుగావున నక్క వారలు దడయుటకుం దగినచందంబుఁ జెప్పె నది వాని తెఱంగు ప్రేతవనవిహారనిరతుండగు శంకరుండు కరుణాకింకరుండు నగుట నప్పుడు. 378

ఆ. అట్లు పనవి యేడ్చు నజ్జనంబులకుఁ బ్ర,త్యక్ష మైవరంబు లడుగుఁ డనిన
సంప్రమోదభక్తిసంభ్రమభరితులై, చక్క ననిఁ జాఁగి మ్రొక్కివారు.

క. బాలమరణశోకంబునఁ, దేలక యుండంగఁ గావు దేవోత్తమ నీ
వాలించిన బ్రదికితిమి ద,యాళుహృదయ పార్వతీప్రియా చంద్రధరా. 380

వ. అనుచు లేచి నిలుచుటయు శివుండా శిశుప్రాణంబు లొసంగి వీఁడు శతాయుస్సంపన్నుం డగువాఁ డని యాన తిచ్చి యాగృధ్రజంబుకంబులకు నాఁకలి యెన్నండును లేక యుండం బ్రసాదించి యంతర్హితుం డయ్యె సంతోషంబున నంతరంగంబులు నింగిముట్టం బొదల నజ్జనంబులు బాలు నెత్తికొని పలుమాఱుం జూచుచుఁ గౌఁగిలించుచుం జనిరి గృధ్రంబును జంబుకంబును ముదంబునం బొంగుచుం బోయి తమతమకులంబులలోఁ బ్రఖ్యాతంబులై ప్రవర్తిల్లె నార్తజనబాష్పప్రమార్జనంబు ప్రభువులకుం గర్తవ్యం బగుటకును నిజకార్యార్థు లగుకపటులనేర్పుమాటల తెరువు తెలియంగొనుటకును నుదాహరణంబై నయీగృధ్రజంబుకోపాఖ్యానంబు. 381

1. క. యుక్తి వినా పసి; చ. యుక్తి నిజము. 2. గ. నెక్కి వెక్కి; చ. వెక్కి వెక్కి.

క. వినినఁ బఠించిన వ్రాసినఁ, గొనియాడిన దురితపీడ సుందొలఁగి నరుం
డనుపమధర్మములకు భాజన మగు నాయుఃప్రవృద్ధి సంపద నొందున్. 382

*** భీష్ముఁడు ధర్మజునకుఁ బవనశాల్మలీతరుసంవాదంబు సెప్పుట ***

సీ. అని వినతుండ గుసుతనాథధర్మసుతునకు, ముదమునఁ జెప్పి భీష్ముండు మఱియు
నిట్లను నిది యొక్క యితిహాస మధిప యాకర్ణింపు హిమవన్నగంబునందుఁ
గల దొక్క బూరుగు గడుఁబెద్దకాలంబు, ముదురు శాఖాశోభిమూలవృక్షము
నారదముని యొక్కనాఁ డత్తరువుపొంతఁ, జని చని వేడ్క నిట్లనియె సమ్మి

తే. బూరుగా యింతపలుపువ్వులు బొడవుఁ గల్గి, నీవు మృగపక్షిసంశ్రయణీయ మగుచు
నునికి గని ప్రీతి నడిగెద ననిలుచేతఁ, బడు[1] నొకప్పుడు తరులు నీపగిది యెట్లు.

క. పవనునకును నీకును బాంధవము గలదొ యతఁడు నిన్ను దయ రక్షింపన్
సవినయవృత్తిని బ్రదికితొ, చెవులకు నింపెసఁగ నిజము సెప్పుము నాకున్.

క. అనిన విని బూరు వి ట్లను, ననిలునిబల మస్మదీయ మైనబలముతో
నెన గా దేర్పడ విను పదు, నెనిమిది యగునంశమునకు నెనయఁ డది యుఁగన్.

వ. అని పలుకుటయు నమ్మునీంద్రుండు. 386

ఆ. అమ్మ చెల్ల యిట్టు లనకుము కొండలు
లోను గాఁగ బవనుచే సమస్త
మహిమ గలుగు వెలుఁగు సమాభూతములు చేష్ట
తములు వాయువశగతములు గావె. 387

క. అనుటయుఁ బెలుచని మెలుఁగున, ఘనమూలప్రబలశాఖకాదుర్జయుఁ న
న్నును దాఁకిన నతని ప్రభంజనుఁ డనునామంబునకు నసత్యత వచ్చున్. 388

వ. అని గర్వంపుమాట లాడినయాశాల్మలిం జూచి ఘనమునిప్రవరుండు. 389

చ. మఱవక యుండు నీబిరుదుమాటలు నీ విటు లంట మారుతుం
డాఱఁగెడు నెట్లు నంచు వెస నేఁగి సమస్తముఁ జెప్పి నాతఁ డే
డ్తెఱఁ జనుదెంచి నీ వటు కడిందినుగండవు నిన్నుఁ దాఁకినం
జెఱుతరు పేరు బూరుగ నశించితి గాఁకిట పల్కు లేటికిన్. 390

మ. అని కోపంబునఁ బల్క నవ్వనముతో నాభూరుహం బింత పె
ల్చన నీ వాఁడెదునంత తెక్కువనె బేలా లోకసామాన్యవృ
త్తునికాయంబును నన్ను నొక్కటిగ నిచ్చం జూచితే యన్న న
ల్లనిన వ్యాప్పెంగ నాసమీరణుఁడు హేలాస్ఫారుఁడై యిట్లనున్, 391

క. ఒకనాఁ డజుండు నీనీడకు డబ్బా టుడుగు దెంచుటయు నమ్మేలా
త్మకు ప్రేఁ గై మన్నించిన, మెకమెకపడి తిట్ల పలుకు మీ తగ రేఫున్. 392

వ. అని పలికి బలుమొగంబుతోడం బోయిన నబ్బూరుగు దలంకి. 393

1. చ. మహాజము లెల్ల నీ.

చ. మనుగడ దప్పనొక్కొ మునిమాటలు గైకొన నైతి నాబలం
బన నది యెంత యుగ్రత మహాబలు రాకకు నోర్వఁ జాల నా
తని నొకభంగి గెల్తు నని తాఁ దలపోసి హరించె నాకులుం
గొనలును జొంపములన్ నిడుదకొమ్మలు రే యగుడుర్ రయంబునన్. 394

వ. అట్లు తన్నుం దాన విఱుచుకొని యున్నంత వేగుటయు. 395

చ. ప్రతినకు నీడుగా భయదభంగిఁ బ్రభంజనుఁ డేఁగుదెంచి యా
క్షితిరుహముం గనుంగొని ఋసీ యిది నాపని నీవ చేసి తీ
ధృతి మతి సంతసింపు మిట తేజముఁ బొందుము నీదుబాంధవ
ప్రతతికి నివ్విధంబుసదుపాయము మే లెఱిగింపు పెంపునన్. 396

వ. అని యుల్లసం బాడి సముల్లసద్గతి నాసదాగతి సనియె నట్లు శాల్మలి పవనుచేత భంగంబు నొంది నగం గుండెఁ బ్రబలునితోడ దుర్బలుండు దొడరి మత్సరగ్రస్తుం డయిన నపాస్తవిభవుం డగు నని తెల్పునప్పవనశాల్మలీసంవాదంబు పుణ్యప్రదం బయిన యుపాఖ్యానం బని చెప్పిన. 397

ఆ. పాండవాగ్రజుండు పాపంబునకుఁ నధిష్ఠాన మెద్ది భరతసత్తమాగ్ర
గణ్య దాని నెఱుఁగఁగాఁ జెప్పుమనుడు నా,తనికి భీష్ముఁ డిట్టులనియెఁ బ్రీతి.

సీ. విను పాపముల కెల్లను నధిష్ఠానంబు, లోభంబ యది గావఁ లోలతయును
క్రోధంబు మత్సరద్రోహంబులును బర,ధనదారవాంఛలు దైన్యపాటు
విద్యాక్షమాసత్యవిముఖభావంబును, గలిగించి ధర్మంబు గలఁచి నరునిఁ
బ్రయి మాలి యెమిటికయినను [1]గధంచు,వానిఁగా సమకట్టుఁ గాన లుబ్ధ

ఆ. జనులఁ దొడఁగి లోభ మనుతిరిం బడనిసత్యవ్రతులను బరమధార్మికులను
బాపభీతమతులఁ బనిగొను లోభంబుఁ, జెందనీకు నీదుచిత్తవృత్తి. 399

వ. అనిన విని యజాతశత్రుం డజ్ఞానం బాపదలకును దుర్గతికిని మూలం బని విందు దాని తెఱం గెఱింగింపు మనిన నాపగాతనయుం డమ్మనుజపతి కి ట్లనియె. 400

క. రోషము శోకము రాగ, ద్వేషము లభిమానదర్పవేగాలస్య
శ్లేషను లజ్ఞాన మని మ,నీషిజనము సెప్పు మాననీయచరిత్రా. 401

క. విను లోభము నజ్ఞానం,బును సదృశఫలప్రదముల పుట్టును లోభం
బున నజ్ఞానము గావున, జననాయక లోభ ముడుగ సౌఖ్యము లొందున్. 402

ఆ. అనిన ధర్మపుత్త్రుఁ డనఘ ధర్మంబు నా,నాప్రకారగతి వినంగఁ బడు మ
దీయచిత్తమునకుఁ దేటపడంగ వి,శిష్టధర్మ మెద్ది సెప్పు మనుడు. 403

వ. ప్రియం బంది భీష్ముం డతని కి ట్లనియె. 404

◆ భీష్ముఁడు ధర్మజునకు దమంబుప్రభావం బెఱింగించుట ◆

క. తిమాత్రము కలవడువిజ్ఞా,సనముల తెరువు లాపరించి నానాగతులన్

1. అ. నథంచు.

సుమతులు ధర్మము దెలిపిరి, దమము పరాయణము ధీరస్తతమ యన్నిటికిన్. 405

తే. దమము నిశ్శ్రేయసము పుణ్యస్తతమము ధర్మ
సార మది వెలిగా ధర్మసంచయంబు
సిద్ధిఁ బొందునె దమముతో బుద్ధి పొందు
గనినఁ బొందని యున్నతుల్ గలవె యధిప. 406

క. దమముం గడచినసద్ధర్మము లే దని వింటు నాశ్రమము లన్నిటికిన్
దమవంతుఁడు గామముఁ గ్రోధము లోభము మత్సరంబు దర్పము గెల్చున్.

క. శీలంబు మైత్రి కరుణ య,లోలుపభావము తితిక్ష లో నగుమునిలో
కాలంబనీయసద్గుణ,యాలంబు దమంబురూపసంపద యధిపా. 408

క. గుహయందు నిహిత మనిమెడు,మహనీయబ్రహ్మపదము మహితదమతో
పహితుం డగువానికి స,న్నిహితం బని చెప్పుదురు మునీషిజనంబుల్. 409

వ. అని విశదంబుగా వివరించె. 410

ఆ. అట్లు దమముమహిమ యాదరంబున విని, యమృతసేవ సేసినట్లపోలె
హర్ష మయమనస్కుఁ డై భీష్ము నడిగె నా,ధర్మనందనుండు తపమువిధము.

వ. అడిగిన నతం డతని కి ట్లనియె. 412

—♦ భీష్ముఁడు ధర్మజునకుఁ దపంబువిధము సెప్పుట. ♦—

క. తపము నిదానము ధర్మ,ప్రపంచమున కెల్ల దానిఁ గ్రమమున వ్రతతం
త్రపరాయణులొనరింతు ర,ధిప ఫలమూలాంబువృత్తిఁ దృప్తిఁ బొరయుచున్.

క. విను మశనని గ్రహము దప, మనునభిధానంబు గలమహాధర్మము త
ద్ధనవంతుచిత్తవశగతిఁ, జను నఖలస్థావరములు జంగమతతులున్. 414

తే. పంచవిధవృత్తు లగుమహాపాతకములు
లోనుగాఁ గిల్బిషము లెల్ల లుంఠితంబు
లగుఁ దపంబున సత్యశౌచాదు లోలయు
నఖిలసిద్ధులు నలచేత నావహిల్లు. 415

వ. అనిన విని దేవపితృభూదేవగణంబులు సత్యంబు ప్రశంసించుఁ దదీయస్వరూపం
బును నది దొరకొను తెఱంగును నెఱింగింపు మని యడిగిన నజాతశత్రునకు
శంతనుపుత్త్రుం డి ట్లనియె. 416

—♦ భీష్ముఁడు ధర్మజునకు సత్యస్వరూపాదులు సెప్పుట. ♦—

క. సమతయు దమముఁ దితిక్షయు, నమత్సరము హ్రీయు ధృతియు ననసూయార్య
త్వములు నహింసాదాన,క్షమాత్యజనసూనృతములు సత్యముమూర్తుల్. 417

క. సత్యాకృతు లగుగుణములు, నిత్యానుష్ఠితసమగ్రనిర్మలయోగ
సితఁ భిముఖునకు సులభము, లత్యంతసుఖప్రదంబు లవి కార్యంబుల్. 418

చ. కుదురు సమస్తధర్మములకుం గుఱు వీను సత్యము యోగమోక్షస
త్పదములు సత్యకార్యములు । పాప మసత్యముకంటె నొండు లే
దు దలఁప నశ్వమేధములు । దొమ్మిదినూఱులు వెండి నూఱు నై
యొదవిన నీడు గావు భరతోత్తమ సత్యముతోడ నారయన్. 419

వ. అనిన విని ధర్మతనయుం డరిషడ్వర్గం బేమిట నుదయించు నెట్లు సమయు నెఱిం
గింపవే యనుటయు ననిమిషనదీనందనుండు ధర్మనందనున కి ట్లనియె. 420

—◆ భీష్ముఁడు ధర్మజున కరిషడ్వర్గాదులు దెలుపుట. ◆—

సీ. మనుజేంద్ర సంకల్పమునఁ బుట్టుఁ గామంబు, రూపఱు దేహనిరూపణమునఁ
బరులదోషంబునఁ । బ్రభవించుఁ గ్రోధ మక్షీణతమాయుక్తిఁ । జేసి పొలియు
భూతాస్థిరత్వంబు । బుద్ధిఁ గానమి లోభ, మనఘ జనించుఁ గాంచిన నడంగు
నజ్ఞానమున మోహ । మావహిల్లు నధర్మ, లేపవర్జనమున । లేక తక్కుఁ

తే. గులమునను విద్య ధనమునఁ । గలుగు మదము
మరలి వానిపెం పూహింప । మ్రంది పోవు
సాత్త్వికుఁడు గామిఁ బొడము మాత్సర్య మదియుఁ
జెడుఁ గురూత్తమ సాధుసంసేవనమున. 421

క. ఈ యాఱింటను సకలాపాయంబులు మానవులకుఁ । బాటిలు వీనిం
బాయంగ జడియ నోపిన, ధీయుతునకు శుభము సద్గతియు సమకూరున్. 422

క. ఇవి దోఁచెళులభంగిం, గవియుఁ బురుషుధైర్యహానిఁ । గనికొని ధైర్యం
బవలంబించిననరుఁ జేరవు వీనికి నిదియ తెఱఁగు । రాజవరేణ్యా. 423

తే. అధిప యివి ధార్తరాష్ట్రులయందుఁ జాలఁ
గలిగి యుండు నీబుద్ధి నొక్కండుఁ జొరదు
సారధీరతాసంపదుదారమతివి
గాన యింకను నిర్జింతు । వీని నెల్ల. 424

వ. అని వెండియు. 425

క. హింసావిహారి యైన నృశంసుం డీయాఱుఁ గలుగుజనుకంటెను గీ
డంసప్రదేశలలితోత్తంసీకరణోపలాల్యధరణీవలయా. 426

క. మే లనుభవించుఁ జుట్టము, లాలోకింపంగఁ గుజనుఁ । డదియు నృశంసా
శీలము మంచి నడుచునతఁ, డేలోకంబునకుఁ జేర్చి । యెసఁగ సుఖించున్. 427

వ. అని చెప్పి వెండియు. 428

ఆ. కిను కుటుంబభృత్యజనజీవనంబుఁ బ్రశస్తములకుఁ గల్గువాఁడు సధిక
మొదవినట్టియతఁడు । సర్వోశ యస్పలు, మాననీయసౌమ్యపానమునకు. 429

క. ప్రభువు లొనరించుభూసుర, తతికిఁ బ్రియాశేషమోగదానాదులు ము
దతిఁ గొఱఁతవడిన ధరణీపతి [illegible] నలయు నానిఁ । బరికించి తగన్. 430

దమరులు దప్పిం జేడ్పడి, కమలభవుని నాశ్రయింపఁ । గా నియతిమెయిన్. 338

వ. అతండు నారాయణు నాత్మయందు నిలిపి. 339

తే. భక్తవత్సల పరమాత్మ । పద్మనేత్ర, సర్వభూతమహేశ ఋ । క్సామయజురు
పాస్య సాధుసంరక్షణ । పరవిహార, సురలు రిపులచే నొఁగిరి । శరణ మగుము. 340

వ. అని సంస్తుతిపూర్వకంబుగాఁ బ్రార్థించి నట్టియెడ. 341

క. జలదస్వనసన్నిభమై, వెలుఁ గొక్కటి సదఁ జెలఁగె । నే నిదె మిమ్ముం
గలిపింపఁగ వచ్చితి నను, విలసద్వర్ణములఁ గాఢ । విశదంబులు గాన్. 342

వ. తదనంతరంబ యకుంఠితవిక్రముం డగువైకుంఠుండు. 343

క. గరుడారోహణలీలా, సరభసుఁడై చక్రగదలు । శార్ఙ్గముఁ జంచ
త్కరముల వెలుంగ నడరి య,సురగణములఁ ద్రుంచె సురలు । చోద్యం బందన్.

వ. ఇట్లు నిర్జించి తత్క్షణంబ యతం డంతర్ధానంబు నొందిన సంతసంబును నచ్చెరువును బెనంగొను డెందంబులతో బృందారకబృందంబు లిమ్మహాత్ముం డెవ్వం డేమి భంగివాఁ డెఱింగింపవే యని యడిగిన నజుం డితండు విష్ణుండు వైకుంఠాభిధానం బగుమూర్తివిశేషంబున విహరించె విష్ణునివిధం బిట్టి దని యెఱుంగను నెఱింగింపను శక్యం బగునే యయిన నొక్క తెఱంగునం దెలిపెడునట్టియితిహాసంబు గలదు వినుం డని పలికి వినిపించె ధర్మనందనా యా నిర్మలవాక్యంబు లుపన్యసించెద దాన నీయడిగినయర్థంబు దేటపడు నాకర్ణింపుము. 345

గరుత్మంతుండు మునులకు విష్ణుదేవునిమహిమాతిశయంబు సెప్పుట.

సీ. హిమగిరిమీఁద న । నేకమునీంద్రులు, సిద్ధులుఁ గూడి గో । ష్ఠీసుఖంబు
ననుభవింపఁగ లీల । నచటికి వచ్చి సు,పర్ణుండు వారికిఁ । బ్రణతుఁ డగుడు
వా రభినందించి । గారవంబున సుఖా,సీనుఁ గావించి య । ర్చించి ప్రీతి
నతనితో సల్లాప । మాచరించుచు నుండి, యొక్కటి యడిగెద । ముజ్జ్వలాత్మ

తే. యనిన నాతండు ధన్యుండ । నైతి మీర, లేది యడిగెద రేను నా । కెఱిఁగినంత
యతులమతులార చెప్పెద । ననుడు వార, లెలమి నవ్విహగేంద్రున । కిట్టులనిరి.

క. ప్రియభక్తుండవు భక్త, ప్రియుఁడును విష్ణుండు నీవు । ప్రియుఁడై భక్తుం
డవు వర్తింతా విభుకడ, దయ దెలియఁగ జెప్పవే య । తని తెఱఁ గెల్లన్. 347

వ. అనియడిగిన నతండు వారల కిట్లనియె. 348

క. స్థూలప్రకారమున నీ, త్రైలోక్యము గావఁ బూని । దయ నిగు రొత్తన్
లీలఁ బ్రవర్తింపఁగ మన, మాలోకింతు మది గనుట । యన వచ్చునొకో. 349

ఉ. ఏనును మీరు నేల మఱి । యెవ్వరు దక్షులు విష్ణుచందముం
బూని యెఱుంగ నవ్విభుఁడు । భూరిదయారతి నాకు నేర్పడం
దాను మహాద్భుతంపుజరితంబులు సూపుచు భాషణామృతం

బానంగ జేసి నా చెవులు * నవ్విధముం దెలియంగఁ జెప్పెఁగన్. 350

సీ. అమరేంద్రు నిర్జించి * యమృతంబు గొనిపోవు, నప్పుడు వీతెంచె * నాకసమున
మెచ్చితి విహగేంద్ర * యిచ్చెద వరము, నీ కనుమాటయది విని * హర్ష మెసఁగ
నెవ్వరో యెఱుఁగ నిశ్చిన్నెఱిఁగించి మఱి వర, మిమ్మంటి దానికి * నెలమి నగుచుఁ
గాంచంబులోఁ గూడఁగా నెఱింగెదవు వా, హనమవు గమ్మనా * కనుచుఁ బురుషు

తే. డొకఁడు దుజ్జ్వలతేజోమయుండు దోఁచి, జరయు మరణంబు లేక యసురలసురల
నోర్వఁ జాలినబలముతో * నల్లసిల్లు, మని వరం బిచ్చెనిచ్చిన * నధికభక్తి. 351

వ. ఏను దండప్రణామం బాచరించి. 352

క. నీవాహన మయ్యెద రథ, మీా వెక్కినఁ గేతు వై వహింతుఁ జెనువు నా
కీ వరము నిచ్చి మనుపుము, నావుడు నవుఁగాక యని ముకుందుఁ ప్రియ మెసఁగఁగన్.

వ. పలికి యంతర్హితుం డయ్యె నంత సంతసంబు నచ్చెరువుఁ బెరయుమనంబుతో మదీయజనకునిపాలికిం జని యీ వృత్తాంతం బెఱింగించిన నతండు వికసిల్లుచు నా వదనంబు వీక్షించి ధన్యుండ వైతి వమ్మహాత్ముండు నారాయణుండు నీవలనియను గ్రహంబున సల్లాపసౌఖ్యంబుఁ బ్రసాదించెఁ దపంబున నేక యోగసమాధినవలం బించి యేను దన్నెఱుంగుటం గోరి యారాధించిన నాకు నీలశ్వేతపీతారుణలింగ శంబును బహూదరపాదపాణిశిరోనేత్రంబును నైనదివ్యగాత్రంబు నూపిసంగంబు గలయంతరంగంబున నన్నెఱుంగ వచ్చునే నిస్సంగుండ వై యెఱింగెదవుగాక యనియె నట్టియవ్విశ్వరూపునకు శాశ్వతపరిచర్య సేయుం గలవాఁడ వగుటం గృతార్థతంబొందితి బదరికాశ్రమంబున కరిగి యచ్చట సకలలోకసేవ్యుం డగునా భవ్యమూర్తి సేవింపు మని యాన తిచ్చిన నయ్యెడకు ముదంబునం బొదలుచుం బోయి. 354

సీ. అచట నారాయణు * నచ్యుతు హరిఁ బుండరీకాక్షు గోవిందు * లోకజనకుఁ
గని భక్తిఁ బ్రణమిల్లి * వినుతి సేయుంగఁ బీతాంబరకలిత మై * యష్టభుజము
శంఖచక్రగదాసిశార్ఙ్గధరంబును, నైనరూపము దాల్చి * యవ్విభుండు
సిఱునవ్వులోడ వచ్చితి షేలు సేసితి, ర మ్మంచుఁ దాను త్తరంపుఁదూర్పు

తే. దెసకు నల్లన పోవఁ బెంపెసఁగఁ గడఁగి, పాఱవలయు నాకెమ్మెయి బహుసహస్ర
యోజనంబులు నని వితతోజ్జ్వలాగ్ని, యద్భుతముగ ననింధన * మై వెలుంగ.

వ. కని యప్పావకుం బావకద్యుతి యగునమ్మహాయోగి ప్రవేశించి యందు శివా సహితుం డై శివుండు తపంబు సేయుఁ దదీయసంవిత్సౌఖ్యం బనుభవించి య య్యనలంబు గడచి యరుగుచుండ నేనును బథిశ్రమాభిభూతుండ నగుచువిదునిఁ వెనుకఁ బోవుచుండితి నిట్లు మఱియునుం బెద్దయు దవ్వు సని యద్దేవుండు భాస్కరకిరణంబులకుం బ్రవేశంబు లేనిమహాతమంబు సొచ్చె నచ్చటం జూడ్కి సెడి మూఢత్వంబు నొందితి. 356

క. ఆదేవుఁ జిత్తమున నిడి, యాదిపురుష కరుణ నన్ను నరయుము[1] మెచటికో
యేది గతియొ నాకనఁగా, నీదెస రమ్మనుచుఁ దీవ్రవెలుఁగుం జూపెన్. 357

క. మది ఖేదము పై దప్పియుఁ, గదిరిన నే శరణు వేఁడఁగాఁ దమ మొల్లం
దుది వోయి లేక తక్కెను, హృదయానందకర మైనయెడ మై యుండెన్. 358

తే. పట్టపగలింటిసూర్యునిపగిది సతఁడు, దోఁచె సూర్యేందుతారకద్యుతుల కచటు
గోచరము గాదు దేవతాకోటి యాది, యైనజంతువులకు నగమ్యస్థలంబు. 359

క. దుందుభినిస్వనములు నా,నందనమృదుమధురగీతనాదములుఁ జెవిం
బొందె మకరందబిందు,స్యందికమలసుభగనదులు నచ్చటఁ దోఁచెన్. 360

క. సురలకు నిమ్మెయిఁ దేజ,స్స్ఫురణము లే దన్నయట్టిపొలుపున వెలుఁగర
నర్హులం గొందఱఁ గాంచితిఁ, దరుణులనుం గంటి నద్భుతతమాకృతులన్. 361

తే. వారు పూజ లొనర్పంగ గారవంపుఁ
జూడ్కి నద్దేవుఁ డందఱఁ జూచు చరిగె
మఱియు నట తత్ప్రదేశంబు మహితవహ్ని
మయతఁ జేసి భయంకర మయి వెలింగె. 362

వ. అచ్చట నే నతనిం గానక. 363

క. భ్రమ గొని యద్దేవునిఁ జిత్తమునం దిడి శరణు శరణు దయఁ గావుము న
న్నమితైశ్వర్య యనుచు శీతమధురలలితాక్షరముగఁ దా నిట్లనియెన్. 364

క. నిను నే మఱతునె నీ దగు,జనకునిచే నన్ను విని సుసంగతమతి వై
చనుదెంచు టే నెఱుంగనె, వినతాసుత యుండు రమ్ము విడువుము భయమున్.

వ. నన్నుం గానమికిం గలంక వలవదు. 366

క. మమకారాహంకారము,ల మతిం జొరనీక నిశ్చలం బగుచూడ్కిన్
సమవేతరూపు నన్నున్, శమభరితాత్మకులు గందురు సారవిచారా. 367

తే. నీవు నామీఁదివేడుక నెఱయ నిమ్మలోఁ దలఁచుట మామకస్థూలరూప
దర్శి వై యుండు దనినన్ను దయదలిర్ప, గారవించిననసలంబుగ క్రందువాసె. 368

వ. ఇవ్విధంబున సుఖం జేసి ననుం గొల్పించుకొని మఱియు దవ్వు సని యాకాశంబున
నేగసిన నేనుం దోన తగిలి పోవ నంతర్ధానంబు సేసె నిట రమ్మని సెలుంగ యాధా
రంబుగా నాచక్కటికిం బోయి. 369

క. కమనీయహంసకులసం,గమశోభిత మైనయొక్క కమలాకరముం
బ్రమదమున దానఁ జవగా, హోము సేయుచు నున్నతన్ను నచటం గంటిన్. 370

క. నాదిక్కు గనుంగొని తా, నాదరమునఁ బిల్చె నేను నచటికిఁ జని యం
దా దేవునిఁ గానమికి వి,షాదం బందుమదిలోఁ దలంచలదృష్టిన్. 371

చ. కలయఁగఁ జూడ నద్భుతము గాఁగ ననేకశతాగ్నిహోత్రముల్

1. గ. మెచటికిం బోదు గతి యెద్ది యనఁగా. 2. ఙ. సమాహితాత్ము. 3. చ. సరిగితిఁ జని.

వెలుఁగుట గాన వచ్చె బహుశ్రావేదరవంబులు వింటిఁ దత్ప్రవ
క్తలఁ బొడగాన నట్టియెడ ♦ దారుణరూపసుపర్ణసంఘముల్
బలువిడి నాపయిం గవిసె ♦ భ్రాంతుఁడ నైతి భయంబు పెంపునన్. 372

ఆ. అట్లు భయముఁ బొంది ♦ యచ్యుత శివ సహస్రాక్ష వేదమయ యనాదినిధన
త్రిభువనైకనాథ ♦ త్రినయన గోవింద, పద్మనాభ హర కృపావిధేయ. 373

క. అని మఱియుఁ బెక్కుపేర్లఁ, గొని నుతించుచు శరణు వేఁడి ♦ వినతశిరస్కుం
డును ముకుళీకృతహస్తుండును నై యే నుండ దేవుఁడను ప్రసాదమునన్. 374

క. తనుఁ జూపి యోడ కోడకు, వినతాసుత యనియె నపుడు ♦ విను డే మొదలం
గనినబదరికాశ్రమమ్ము,నయ్యె నచటు విష్ణుని ప్రభావ ♦ మే మన వచ్చున్. 375

ఉ. అప్పరమేశ్వరుండు లలితాష్టభుజం బగురూపు దాల్చి తా
నెప్పటియట్ల నిల్చెఁ గని ♦ యేను మనంబున నద్భుతంబుతో
ముప్పిరి యైనకౌతుకము ♦ మోదము నెక్కొన నాకు సత్కృపం
జెప్పెదుఁ గాక యెట్లు నని ♦ చేరితి నంజలి మౌళిఁ జేర్చుచున్. 376

వ. చేరి వినయావనతుండ నయి దేవా యేను భవత్పాదభక్తుండ నేని నీదయకు
భాజనంబ నేని నాకు వినం దగు నేని దురధిగమసారం బైన భవదీయ ప్రకారం
బిట్టిదని యెఱుంగునట్లుగాఁ జెప్పవే యనిన నాసర్వలోకశరణ్యుండు కారుణ్యా
మృతమయం బైన చూడ్కి నామీఁద నొలయ నిట్లనియె. 377

విష్ణుదేవుఁడు గరుత్మంతున కుపదేశించిన యాత్మతత్త్వప్రకారము.

సీ. అనిమిషగంధర్వదనుజు లాదిగ నెవ్వరును విను నాయు[illegible]రూ పెఱుంగ
నఖిలభూతములు నాశ్రయం బుద్భవించు వర్తించు [illegible] వర్తింప నేను
వానివశంబున ♦ వసియింతు సర్వంబు,నందును నాతత్త్వ ♦ మధిగమింప
నగు నగ్ని యాత్మ సర్వహితంబుగఁ జేయఁ, గామవర్జిత మహంకార విముఖ,
తే. మజడ మపరిగ్రహం బహింసానుమోద,క్రోధరహితంబు నిర్మలప్రబోధయుతము
నిత్యతృప్తంబు శాంతంబు సత్యభక్తి, యైనచిత్తంబు గలసంయతాత్మకులకు. 378

వ. సాంఖ్యయోగయుక్తులు బహిర్దర్శను లై నిశ్చయరహితు లై రేని నస్మదీయ
తత్త్వంబు గాన నేర రది మోహపంకమగ్నులగువారికి నుపవాసంబుల
నియమంబుల వ్రతంబుల నెఱుంగ శక్యంబు గా దేకాంతికధ్యానపరుల కెఱుం
గుట గలుగు రజస్తమోదూషితంబు గాక కేవలసత్త్వాధిష్ఠితం బగు సజ్ఞానం
బున నన్నవలంబించునది సూక్ష్మసరణి వాసుదేవసంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధ
నామంబులం జతుర్విధంబుల విభక్తుండ నై ప్రాణులకు దాత్మబుద్ధ్యహంకార
మనోరూపవ్యాపకత్వంబు నొంది యుండుదు నిట్టిది మదీయస్వరూపప్రకారంబు
కశ్యపనందనా నీవు మన్మనస్కుండవు మద్భక్తుండవు మత్పరాయణుండవు నై
మత్స్వరూపవేది వగు మనియె నని చెప్పి సుపర్ణుండు. 379

క. పురుషవరులార యద్భుతతర మగుహరిదివ్యచేష్టితము నాకుం ద
త్కరుణం దోఁచినయట్టిది, పరిపాటిని మీకుఁ దేటపఱచితి భక్తిన్. 380

వ. అనిన విని యమ్మునిసిద్ధజనంబులు పరమాదరంబున నప్పుష్టిచేవు దీవించి యా
మంత్రణంబు సేసి హర్షోత్కర్షంబునం జిత్తంబులు జొత్తిల్లఁ దమలోన. 381

సీ. అక్కజం బగుచున్న యీకథ యితనిచే, విని కృతార్థులమైతి మనిరి మఱియుఁ
బుణ్యమాయుష్యంబు భూతిప్రదము భక్తి, వినినవిప్రుఁడు వేదవిద్య పెంపు
నృపవైశ్యశూద్రుల కనుపమానజయధన, సౌఖ్యంబులను గండ్రు సర్వజనుల
కిహపరసిద్ధుల కిది సాధనం బగు, నని పల్కి యాత్మేచ్ఛఁ జనిరి దీని

తే. బ్రహ్మ సురలకుఁ జెప్పినభంగి వసువు, లవనిసురు లయి వచ్చి మా కుమ్మపాల
నున్న నాకర్థిఁ జెప్పి రయ్యున్నరూప, నీకుఁ జెప్పితిఁ గురుకులనృపవరేణ్య. 382

వ. అని చెప్పి దేవవ్రతుండు వెండియు నిట్లనుఁ బాండవాగ్రజా వైకుంఠపుణ్యసంవా
దంబగు నీయాఖ్యానంబునకు నభిప్రాయం బాకర్ణింపుము. 383

తే. వివిధసంకల్పయజ్ఞముల్ విడిచి యాత్మ, యందు నిష్ఠ మెనగ్ని సమాహితముగఁ
జేసి నిస్పృహుఁడై విష్ణు చిత్తవృత్తిఁ, జేర్చువాఁ డవ్యయస్థితిఁ జేర నేర్చు. 384

వ. అని యిట్లు భీష్ముండు విష్ణుస్వరూపజ్ఞాన ప్రకారం బితిహాసరూపంబున ధర్మజు
నకుం జెప్పె నని చెప్పిన నవ్వాగుపవగులయడుగుటలును జెప్పుటలును లోక
హితంబులై యింత యొప్పి యుండునే యటమీఁదిసంభాషణవిశేషంబులు సెప్పు
మని యడుగుటయు. 385

చ. మునిహృదయాబ్జశాంతిమధుమోదవినోదిమరాళ గాఢచ
క్రనిహతశూలనిర్మథితరాక్షసయూథ నితాంతభక్తిభా
వనరమణీయ [1]వేదపరివాదనిరర్గళసేవనీయ ని
త్యనిరుపమాననిర్మలనిరందనఖేలనధర్మపాలనా. 386

క. సదయాపాంగా పరిణామదశాసంగమనిరాస మధురతమాంగా
మదశోకరహితచేతస్సదనా సంజనితసముపసంహృతమదనా. 387

మాలిని. గరుడవృషపతాకా కల్పితాశేషలోకా
సురపరిషదుపాస్యా శుద్ధసంవిద్విలాసా
పరమమహిమసీమా భవ్యకారుణ్యధామా
నిరతిశయగుణాలీ నిష్కలానందశాలీ. 388

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజి ప్రణీతంబైన శ్రీమహాభారతంబున యానుశాసనిక పర్వంబు
నందుఁ బ్రథమాశ్వాసము. 389

---

1. గ. వేదపరిపాఠనిర్గళ—చ. దేవపరివాదనిర్గళ. 2. గ. సదయాపాంగపరీణామతళా.



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆనుశాసనికపర్వము, ద్వితీయాశ్వాసము.



మయువక్షస్స్థలగా
రీమయవామార్ధ బంధురీకృతసౌంద
ర్యామృతరస కీర్తనవి
ద్యామయ నిగమాంతవేద్య హరిహరనాథా. 1

### అష్టావక్రుండను మునికుమారునిచరిత్రము.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు నారాయణస్వరూప నిరూపణప్రకారంబు విని యజాతశత్రుండు సంజాతప్రీతుండై పితామహునిం గన్యాదానంబునకు వరుం డెట్టివాఁడు గావలయు ననుటయు నక్కురువంశవరుం డీ విషయంబున నొక్క యితిహాసంబు గలదు విను మని యమ్మానవపతి యాననం బాలోకించి. 2

సీ. అనఘ యష్టావక్రుఁ డను బ్రహ్మచారిసత్తముఁడు వదాన్యుఁ డన్నతాపసోత్త
మునికూఁతు సుప్రభ యను కన్యఁ బెండ్లి గాఁ, గోరి యాతని నడుగ నతఁడు
నీవు యోగ్యుండవు నీ కిత్తు నాపుత్త్రి, నంతకు నుత్తర మరిగి రమ్ము
నావుడు సంయమీశనందనుం డెందుల, కరుగుదు నేపని యాచరింతుఁ

తే. బనుపు మనుడు వదాన్యుండు ధనదుపురము
గడచి హిమగిరి కరుగుము మృడునిగుఱిచి
గిరిజ తప మొనరించె నగ్గిరితటమునఁ
దత్ప్రదేశంబు పుణ్యంబు దానియందు. 3

క. ఆడుచుఁ బాడుచు గణములు, గూడి చరింపంగ గిరిజేశుం బ్రియముగఁ దా
వేడుక నమ్మృడుఁ డెప్పుడుఁ, గ్రీడించుచు నుండు మునులు కీర్తింపంగన్. 4

ఆ. అది పవిత్రదేశ మచ్చోటు సూచుచుఁ, గడచి చనఁగ నీపక కాననంబు
గాన వచ్చు నందు గటిప్రాయమునది, పుణ్యమూర్తి యనుపమబుద్ధి యొకర్తు. 5

క. వసియించు నమ్మందిరిం బ్రియ, మున లారఁగఁ గాంచి వచ్చునప్పుడ ప్రమదం
బెసఁగంగఁ బెండ్లి సేసెద, నసదృశరూపగుణవర్తనాన్వయవిద్యా. 6

సీ. అనిన నష్టావక్రుఁ డట్ల కాకని చని, బాహుదాతీరభూభాగవర్తి
యై రాత్రి గడపి ధనాధీశుప్రోలికి, నరుగంగ నతఁ డమ్మహాత్ము రాక
విని యెదురేతెంచి వినయంబుతోడఁ దోడ్కొనిపోయి మహితపూజన మొనర్చి
యూర్వశి రంభ తిలోత్తమ మొదలగు, నప్సరోవనితల యాటపాట

తే. లాదిగాఁ గలవివిధవినోదకృతుల, ననుదినంబు నారాధింప నందు నిల్చె
నమ్మునీంద్రుండు దగులు లేక యభిమతప్రవర్తనంబుల నొక్కసంవత్సరంబు. 7

వ. పదంపడి ధనదుండు నీ కేమి సేయవలయుం జేసెదం జెప్పుమనిన నతండును సర్వాం
బును సంపన్నంబ నీవు నిత్యసంపద నున్నతుండ వై యుండు మే నొక్కమునిపతి
సెప్పినపనికై పోయెద నీతోడివేడుక నిల్చితి నింతియ కాని నా కభ్యర్థనీయం
బొండు లే దని పల్కి యట వోయి. 8

సీ. హిమశైలతట మెక్కి యీశ్వరక్రీడనస్థలిఁ గాంచి మ్రొక్కి ప్రదక్షిణముగఁ
జని యట యరుగంగ మునివరు చెప్పిన, కడిమి లేమ్రాకులయడవి దోఁచె
దానిఁ బ్రవేశింపఁగా నందు మణిహేమమయచిత్రరమ్యహర్మ్యములనేక
ములు గానవచ్చె నుజ్జ్వలసమున్నతరమ్యహర్మ్యంబు వానిలో నధికవిభవ

తే. సార మై యున్నఁ జూచి తద్ద్వారభూమిఁ, జేరి లోనికిఁ దనపేరు సెప్పి పుచ్చఁ
గన్యకలు పఱతెంచిరి కాంతిరూపవిలసనము లొప్పఁ గ్రొందళుకు వినయ మెసఁగ.

వ. పఱతెంచి పరమాదరంబునం దోడ్కొని పోవునప్పు డప్పొలఁతులయొప్పునూపుల
కుం జిత్తంబునకు వేడ్కలు సేయం జాలినను లోలత్వరాహిత్యంబున నత్యుదా
త్తుం డగుచుం జని యభ్యంతరమందిరంబున వివిధరత్నరశ్మి విరాజితం బైనపర్యం
కంబున నార్యమూర్తియు ధవళవసనాంగరాగయు రుచిరాభరణభూషితయుం బ్రౌ
ఢవయస్కయు నగు నొక్కవనితం గని మీ లయ్యేదు మనుచు నిలిచిన నయ్యిందు
వదన యిందు రం డని పలుకుచుం బ్రత్యుత్థానంబు సేసి. 10

క. అమ్మునివరు నాపర్యం, కమ్మునఁ బ్రీతి నునిచి గారవమునఁ బా
ద్యమ్మును నర్ఘ్యము శ్రుతివిహితమ్మైనవిధమున నిచ్చె తాత్పర్యమునన్. 11

వ. వేఱొక్క సెజ్జం గూర్చుండె నమ్ముని గలయం గనుంగొని యక్కన్నియలవిభ్ర
మవికారంబులు దనలోచనంబులకు గోచరంబు లగుటకు నొ[illegible] యిమ్మందవతీజనం
బు లిచ్చట నేల యునిన నక్కాంత యక్కన్యల నెల్లం బోవం బనిచి సముచిత
సల్లాపంబులు సేయుచుండ రాత్రి యగుటయు. 12

ఉత్తరదిశ యష్టావక్రునిచిత్తశుద్ధిఁ బరీక్షించుట.

క. సీ తయ్యె ననుచు నల్లన, యాతనిశయనమున కరిగి యతఁ డెన యొంగా
[illegible]గంబున నొకదెసఁ, భీతహృదయ యై శయించె బృష్ణినాథా. 13

క. పదపడి నయ్యమున మెయిమెఱుఁగ, గదియించి లతాంగి చిక్కఁగ గౌఁగిటఁ జేర్పం
[1]గదలనిచిత్తము గలిగియు, మద మేమియు లేక యుతఁడు మ్రానై యుండెన్.

ఆ. అట్టు లున్నఁజూచి యత్తన్వి మగవారు, భోగపరులు దాస్మి పొలఁతులందుఁ
గలుగుఁ నవ్విధంబు గాక యేఁ గోరంగ, ననుభవింప కునికి యగునె నీకు. 15

క. సంపదయు దివ్యభోగము, నింపారఁ బరిగ్రహింపుఁ డే మీయధనమై
పం పొనరించెద ననుఁ గ్కారింపక కైకొని [2]వరింపఁ దగు జూచ్చుటన్. 16

సీ. అనిన సప్తావస్థ లతిదుర్లభ్య మగుపర, దారాభిగమనంబు దగదు శూద్ర
సతి యైన నధికదోషంబు బ్రాహ్మణపత్ని, యగు నేని పాతక మప్రమేయ
మదియును గాక నే నస్ఖలిత బ్రహ్మ,చర్యంబునం దుండి భార్యఁ గోరి
యున్నాఁడ ననుడు నీవయొప్పున దగిలితి, వనితలు కామార్తివశతఁ బొంది

తే. వంశహాని దలంపరు వరున కలుక, రాత్మజులఁ జూడ రగ్రజ ననుజుఁ గోనరు
పురుషశతకంబుసంగమంబునను దృప్తి,సనరు దీని విచారింపు మనిమె నువిద. 17

వ. అనిన నమ్మునివరుండు. 18

క. ఇది యేటికార్యముగ నామది కెక్కఁగఁ జెప్పి దిట్టమాటలుఁ గలవే
మదవృత్తి మాసు మేఁ బో,రెద నావుడు నామృగాక్షి యెలన వ్వాలయున్. 19

తే. కార్య మగుటయు నరిగెడు నగాలి పిదప, నిల్పు మంతకు ననుటయు నీవు నన్నుఁ
గదియ కుండెద వేని నిశ్చలచిత్ సధర్మ,వృత్తి వగు మని వారించె నత్తపస్వి. 20

వ. ఇట్లు వారించి యిది శాపంబున [3]ముదుకుదనంబు నొందినబృందారకసుందరి
గావలయు నట్లయ్యుంగా కుండె దీని తెఱంగు నా కెఱుంగ జాలిం బడ నేల
యని యాత్మ నూహించి యూర కుండె నంతఁ బ్రభాతం బైనం గాలోచిత
కృత్యంబులు దీర్పు మని పలికి యప్పొలంతి యుత్తమస్నానీయద్రవ్యంబులు
దెచ్చి యమ్మునియనుజ్ఞ వడసి మృదుకరతలంబుల మేను వొడసి కృతస్నానుం
జేసి యతండు సంధ్యావందనాగ్ని కార్యంబు లాచరించిన నమృతోపమానంబు
లగునన్నపానంబుల నతనిం దృప్తునిం గావించి యుచితసంభాషణంబులం బ్రొద్దు
పుచ్చి నిశాసమయం బగుటయు శయనంబునకుఁ బిలిచిన నాసుశ్లోకుండు రాకున్న
నేనుం గన్యక నస్ఖలిత బ్రహ్మచర్యంబుననున్నాను పరిణతవయస్క నయితి స్వతం
త్ర నై యుండుదుం బాణిగ్రహణమహోత్సవం బనుభవింపుమని పలికిన
నమ్మహాత్ముం డి ట్లనియె. 21

తే. బాల్యమునఁ దండ్రి యౌవనప్రాప్తి మగఁడు
వార్ధకంబునఁ దనయుండు వామనయన
నరసి నడపన కాం కెందు నంగనలకు
వలసినట్టులు సేయఁగా వచ్చు నెట్లు. 22

1. గ. గఁదలనిచిత్తముతోడుత. 2. క. వరింపలే. 3. ఙ. ముదుకుదనంబు.

వ. కావున నీవు నిన్నిచ్చినం బరిగ్రహించుట పాడిగా దనుసమయంబునం జూడఁ
జూడ నచ్చేడియ సుభగయౌవనసుందరాంగియు మనోహరవిలాసభంగియు నయ్యె
నైనను దానియందుఁ దగులనిచిత్తంబుతో నత్తపోధనకుమారుండు. 23

క. ఈ యనృతవర్తనము, లేలా యన్ననిజంబు నీతలంపును విన్నం
దోయజలోచన చెప్పుము, పోయెదఁ బనులు గల వనిచికపుచ్చుము నన్నున్. 24

సీ. అనవుడుఁ బ్రీతయై యనఘ నిన్నారయఁ, దలఁపునఁ జూచె వేదాస్యుఁ డిందుఁ
బుత్తెంచె నేను నీకయుత్తరదిశఁ జుమ్మ, నీసృష్టిఁ గాంచితి దీన నలఁడు
నినుమెచ్చ నాదెస్యమనము సంబ్రయమొందు, మరుగుమా సు ప్రథ్యోపరిణయమునఁ
కనిన నద్దేవికి వినతుఁడై వీడ్కొని, యరిగి యమ్మునిపతి యాత్మఁ గనియె

తే. దన్ను నడుగంగ సకలవృత్తాంతంబుఁ జెప్పి
యతనిపుత్త్రికఁ బెండ్లియై యతులధర్మ
భోగగౌరవకీర్తులఁ బొంది జగతి
నతిశయిల్లె నష్టావక్రుఁ డధిపముఖ్య. 25

వ. అని యష్టావక్రదిశాసంవాదంబు సెప్పిన విని యప్పాండవాగ్రజుండు మునుల
వలన శూద్రజాతిభామలయందుఁ బ్రభవించినవారికి బ్రహ్మర్షిత్వంబు గల్గుట
యది యెట్లొకో యని విత్కరింతు నత్తెఱంగు నాకెఱింగింపవే యని యనిమిష
నదీనందను నడుగుటయు నక్కురుపతికిఁ గురుపితామహుం డిట్లనియె. 26

సీ. నాలుగుజాతులకు నాతులు విప్రున, కాండ్రుగాఁ గ్రమమున నగు నృపునకుఁ
దనకులంబున నట తక్కువకులములు, రెంటను బరిణయింపఁ బ్రవహింపఁ
జను వైశ్యునకు నాత్మజాతిశూద్రాన్వయుంబునఁ బెండ్లిగాఁ దగు భూపవర్య
శూద్రున కర్హంబు శూద్రకన్యకఁ బెండ్లి, యగుటయు నిది వివాహప్రకార

ఆ. కథితధర్మ మిట్టి గతి దప్పి ప్రతిలోమ,సరణి నైనఁ గల్గు సంకరంబు
తల్లి యెట్టికులము దానికులంబ యౌ, నన్నుతానులోమ సంభవునకు. 27

వ. ఇది సకలజనసామాన్యంబయిన తెఱంగు విశేషించి మునిసత్తములయుత్తమతపో
జ్ఞానవిజ్ఞాన ప్రభావంబులం జేసి తదీయబీజసంజాతులు యోని యెద్దియైనను
బ్రాహ్మణుల యగుదురు మహాక్షత్త్రియులు ననులోమవృత్తి నాత్మప్రభావంబుల
నిజబీజసంజనితులకుఁ దమకులంబ కలిగింపం జాలుదురు నీవు వియోనిజాతు లని
శంకించి యడిగితివి వారల యోల పశుయోనిజాతులు నరయోనిజాతులును లోను
గా సద్ద్విజులును రాజవరులు నగుట గన్నది గాదె కావున మునివరుల నృపవరుల
వలనం గలిగినజన్మంబు లెల్లను బీజప్రధానంబులై యతిశయిల్లు వినుము
వసిష్ఠుండు ఋశ్యశృంగుం డగస్త్యుండు సత్యవత్యుద్భవుం డగుకృష్ణద్వైపాయ
నుండును మందపాలనందనులు మఱియు ద్రోణకృపాదులుం బ్రభవించినభంగులు
వినుము కాదె వారలెట్టెట్టివా రయి రెఱుంగవే యివ్విషయంబున మను

వాక్యంబు గల దాకర్ణింపుము. 28

క. మునిజనుల నదుల సిద్ధుల, జననంబులు బుద్ధివృత్తిఁ జర్చింపఁగ నె
వ్వనికిని వశంబు గావవి, దనతనయైనట్లయై యుక్తదాత్తతఁ బొందున్. 29

వ. అనిన విని యుధిష్ఠిరుండు. 30

ఆ. అనఘ దానపాత్ర మగుటవిప్రుఁడు లింగి, యైననో యలింగుఁ డై చరించు
టహొ యెఱుంగఁ జెప్పు మనవుడు గాంగేయుఁ, డిట్టు లనియె నమ్మహీశ్వరునకు.

— భీష్ముఁడు ధర్మరాజునకు దానపాత్రభూతుల తెఱం గెఱింగించుట. —

క. విను సద్ద్విజుండు నిజవ, ర్తనమునఁ జరియించుచున్న దానార్హత్వం
బున వెలుఁగు లింగి యైనను, మనుజేంద్ర యలింగవృత్తి మహితుం డేసన్. 32

వ. అనుటయుఁ బాండవాగ్రజుండు. 33

తే. శ్రద్ధ సాంగఁ గల్గినజనము లిచ్చు, భూరిదానముల్ దురితంబుఁ బొంద నేర
వేమొడల నని తలఁచెద నేను బుద్ధి, ననుచు నాతని కతఁ డిట్టు లను నృపాల.

క. నరవర దుర్దాంతు లయినఁ, బరిపూతులు శ్రద్ధ గల్గుభవ్యులుఁ దారా
దర మొప్ప నిచ్చుదానము, దురితహరము గాక కీడు దొడరునె యెందున్. 35

సీ. అనుడు ధర్మాత్మజుఁ డతనితో దైవకా, ర్యమునఁ బ్రవిప్రుని నతిపరీక్షి
తుని జేయ వలయునే యనఘ పైతృకమునఁ, దంబున నన్న నాతఁ డను నీవు
దలఁచినయట్టిద తగవు నావుడు నాన్న, పాలుం డపూర్వసంబంధిసూరి
యాఢ్య తపోనిత్యులంకు సత్పాత్రము, లెవ్వార లనుటయు నింతవట్టు

తే. వారు సత్పాత్రముల వంశపర్య ధర్మ
భాషణము గాని తత్క్రియాపరత లేని
యట్టివానికి నరుఁడు హేమాదు లిచ్చి
పొరయఁ బడియెండ్లు నరకానుభూతి ననియె. 36

వ. అని భీష్ముండు వెండియు. 37

క. ధరణియుఁ గాశ్యపవైశ్వా, నరమార్కండేయ లోమశ జగదితవా
క్పరు లై రొక్కెడ వారల, మరి గోష్ఠినిరతి నుండి మనుజాధీశా. 38

వ. అవ్వాక్యంబు లాకర్ణింపుము.

క. ఘనతర మగుహ్రీగౌరవ, మున మునిఁగినఁ బాప మఖిలమును రూపుసెడుం
బెనుపున నుగ్గలికఁ బొగడు, గనినపయోరాశిఁ జిద్దగడ్డయుఁ బోలెన్. 40

తే. సత్కులంబునఁ బుట్టుట సకలవేద
ములుఁ బురాణంబులును శాస్త్రములును జదువు
టయును సద్గతిఁ జేయఁ బ్రత్యర్థములు గావు
శీలసామగ్రి లేనిదుశ్చేష్టితునకు. 41

ఆ. పలుసదువులు సదివి పండితమాని యై, తనదువిద్య నొరు [illegible]

దూలపుచ్చునట్టియనుష్ఠాత్మకుని బ్రహ్మహత్యవోవును సందియంబు లేదు. 43

తే. వాజిమేధముల్ వేయొక్కవలనఁ బెట్టి యలఘుసత్యంబు దక్కటివలని యందు
నిల్పి తులఁ[1] దూఁపఁగా సత్యనిష్ఠలోని యర్థమున కెత్తు వచ్చె నయ్యధ్వరములు. 44

వ. అని యిట్లు వర్తిల్లు నాలుగువాక్యంబులుం జెప్పి.

తే. బ్రహ్మచర్యంబుకంటెను బరము మద్య
మాంసములు రెండు నుడుగుట మనుజనాథ
లోకయాత్ర వాటించు[2] చపలోలుపతయు
శమముఁ గల్గి వర్తించుట శౌచవిధము. 45

వ. అనిన విని యజాతశత్రుండు ధర్మంబు నర్థంబును గామంబును నాచరించు కాలంబు 46
లెఱింగింపవే యనుటయు నాపగేయుం డతని కిట్లనియె.

తే. రేపకడయును బగలును మాపు వరుస, నర్థధర్మకామంబుల నాచరింప
వలయు వానియం దాసక్తి వలదు సక్తుఁ డయ్యె నేనియు మేలు ధర్మాభిరతిని. 48

వ. అని మఱియును.

క. విను గురుపూజనవిప్రా,ర్చనము లధికపుణ్యములు ధరావల్లభ వి
ప్రుని నిందించుటయును న,గ్నిని వేదము విడుచుటయును గిల్బిషతమముల్. 49

సీ. అనుటయు ధర్మనందనుఁడు దానంబుల, కెవ్వరు పాత్రంబు నేర్పరింపు
మనిన సద్ధర్ములు నక్రోధనులు సత్య,రతులు దాంతులును ధీరత్వయుతులు
నిజకర్మనిరతులు విజితేంద్రియులు సర్వ,భూతహితులు నలుబ్ధులును శుచులు
దానపాత్రములు వేదంబు సాంగంబుగాఁ, జదివి షట్కర్మనిష్ఠులఁ దొడంగి

తే. తత్త్వవిదులైన బ్రాహ్మణోత్తముల కీగి, విడు సహస్రగుణం బగు నవిశ్రుత
తంబుఁ బ్రజ్ఞయు శీలవృత్తములుఁ గలుగు, వారి కిచ్చుట వంశవిస్తారకంబు. 50

51
వ. అని నిర్దేశించి భీష్ముండు వెండియు.

ఆ. యోగ్యుఁ డైనవిప్రుఁ డొకరుండు సంతృప్తిఁ, బొంద నధికతృప్తిఁ బొందు దేవ
వితతి ఋషిసమూహపితృసమాజములు న,ట్లగుట వెదకి తెచ్చునది విశిష్టు. 52

వ. అనిన విని కౌంతేయాగ్రజుం డతనితో దేవపితృమనుష్యపూజలకాలంబు లెఱిం 53
గింపవే యనుటయు నతండు.

క. నృపవర పూర్వాహ్ణంబును, నపరాహ్ణము దేవపితృసమారాధనవి
ధ్యుపదిష్టకాలములు మ,ధ్యపుసమయము మానుషార్చనార్హం బరయన్. 54

55
వ. అని చెప్పి మఱియు నిట్లనియె.

సీ. నరనాథ కాలహీనంబును నశుచిసం,స్పృష్టంబుఁ బరిభుక్తశేషమును న
మంత్రకంబును నీతతంత్రంబుఁ గీటకే,శప్రదుష్టంబు రాక్షసులు గొంద్రు
మానని యద్రవ్యమేని యీ సురపితృ,క్రియల దురాత్మకు లయినవారు

1. క. చ. జ. మూన్నఁగా. 2. గ. చ. జ. చలోలుపత్వశమము

గుడిచిన నట్లు యుక్తకృదంబులఁ జొనుపక, మత్తుని జదుని మన్మత్తుఁ బతితుఁ

తే. గ్లిబుఁ గుష్ఠి, దేవలకుఁ జికిత్సకుసని, పీతసియము నపస్మారి శ్విత్రి రాజ
యక్ష్మయుతుని నక్షతుని గాయకుని సోమ, విక్రయుని వేదవిక్రయ విదుని వలయు.

ఆ. వడ్డి కిచ్చి కుడుచువాఁడు ననగ్నియుఁ, బ్రాణివిక్రయమున బ్రదుకువాఁడు
దైవపిత్ర్యములకుఁ దగరు సంధ్యోపాసనములు లేనివాడు నరవరేణ్య. 57

వ. అనిన విని ధర్మనందనుండు శంతనునందనునితో దైవపిత్ర్యంబులగు దానంబులకు
నుత్తమపాత్రంబు లెవ్వారెఱింగింపవే యని యడుగుటయు నతండతని కిట్లనియె.

దైవపిత్ర్యంబులగు దానంబులకుఁ బాత్రభూతుల నిరూపించుట.

సీ. భోజనార్థులఁ దుష్టిఁ బొందించునతఁడును, దెరువాటువలనఁ దస్కరులచేతఁ
జేటొంది ధనము వాంఛించునతండు, వ్రతంబున విద్యాపఠనంబు సేయఁ
దలఁచి యర్థించునతండును, గురుఁ దల్లి, దండ్రుల సంకిల్లిపడి దారపుత్రు
లను బ్రోవఁ బడనతండును, మహావ్యాధిని, రాసంబు సేయంగ నాసనేయు

తే. నతఁడు, నిష్పాపుఁ డైనధర్మరాముండు, నెపుడు భిక్షయ భ్రమణగురుండు నట్టి
యతఁడు, దైవపిత్ర్యములకు నతిశయంబు, గల్గుపాత్రంబులగుదురు కౌరవేంద్ర. 60

వ. అని చెప్పి మఱియు నిట్లనియె.

సీ. సత్రంబు సాలయుఁ [1]జలిపందిరియు రచ్చ, కొట్టము వచ్చుటగురుజనముల
నిందించుటాగమనింద తదీయవిక్రయవిధి తద్విలేఖనము గొంకి
యము సంధిభేదన మన్యకర్మోపజీవన మకృతజ్ఞత [2]పాసదార
వృత్తి మంత్రసుశాస్త్రవిధ్వంసనము మద, లోల ననాథుల బాలవృద్ధ

తే. తాపసిని భీత వంచనఁ దలరఁ జేయు
టతిథిపుత్త్రభృత్యులకు నాహారకలన
మాచరింపక కుడుచుట యార్యకోటి
నిరయహేతువులుగఁ జెప్పు నృపవరేణ్య. 61

సీ. విషశస్త్రకేశముల్ విక్రయించుట శత్రు, ములచేత కన్యాదూషణలను విప్ర
తతిని గోగణమును దఱిసి పోవుట యుపాధ్యాయసభక్తికుం డైనభృత్యు
విడుపు మార్గము గ్రంపనడచి కొయ్యలుప్రాఁతి, చెఱుచుట నరకంబు సేయునందు
నెరవు లేకయు నెప మిడి యర్థంబు, గొను రాజుఁ బ్రజరక్ష విడిచి కలిగి

తే. యాచరింపని విభుఁడును నప్పనంబు, పలుకుబడి దప్పి కొనియెడుపతియు గోవు
ముక్కు గ్రుచ్చెడువాఁడుఁ దస్మృపక్షఘాతి, యగునతండు నధోగతిఁ గరుగువారు.

సీ. ధర్మంబు భయమునఁ దారిద్ర్యసంబాధమున రోగమునను బాపములఁ దొలంగఁ
జేతకు నైనఁ జేసిన దేవకార్యార్థపశుహింసనంబును బరమతపము
శుశ్రూషయును గల్గి శ్రుతము సంపాదించి, యప్రతిగ్రాహకుఁ డైన మద్య

1. క. జ. జలివిందిరయు, 2. గ. పారదార.

మాంసపరస్త్రీ|సమాగమవైముఖ్య, మున నాశ్రమస్థులఁ | దనకులంబు

తే. వారి భరియించినను హేమ|వస్త్రమంది
రాన్నపానంబు లొసఁగిన | నాశ్రయంబు
దీనులకు నిచ్చినను హింస | మానినను స
ముంచిత స్వర్గలక్ష్మి సిద్ధించు నండ్రు. 63

సీ. రచ్చకొట్టంబు నారామంబుఁ గూపంబుఁ, బ్రపయుఁ గావించుట|భయభరార్త
కోటి గాచుట కన్య | గోవు వాహనము దాసుని దాసి నిచ్చుట | దనకుఁ గీడు
సేసిన సైఁచుట | సెలువుల జుట్టంబులఁ, బ్రోచుట పెక్కండ్ర|పొంపెఁ గార్య
మునఁ బరాక్రమమున|ధనమునఁ దాఁ సల, జడిపాటు దుష్కర్మ|సరణిఁ బొరయు

ఆ. కునికి నాకలోక|మునకు నిచ్చిన లగు, నెక్కలమునఁ బుట్టి|రేని బహుశ్రు
తుండు నతికృపాన్వి|తుఁడు వేయునెలలపై, బ్రదికినతఁడుఁ గండ్రు|త్రిదశపదము.

వ. అని నిర్దేశించి. 65

ఆ. నరకవాసకార|ణము నెఱింగించితిఁ, బుణ్యలోకహేతు|భూతములును
దేటపడఁగ జెప్పి|తిని కురుసంతతి, శ్రేష్ఠ యింక నేమి | చెప్పవలయు. 66

వ. అడుగు మనినం గాంగేయు పూర్వజుండు శాంతనవుతో బ్రహ్మహత్యాసమంబులని కొందఱు గొన్ని కర్మంబు లుగ్గడింతురు హింస లేకయు నట్లయ్యెడు నవి యెయ్యవి వాని నేర్పడ నెఱింగింపవే యనుటయు నతం డతని కిట్లనియె. 67

సీ. దివ్యబోధాఢ్యు వేద|వ్యాసమునినాథు, నడిగితి నొక్కనాఁ | డధికభక్తి
నిట్లని యా సంయ|మీంద్రుండు కృప నాకు, నెఱిఁగించె ననఘ నా|కెఱిఁగినట్టి
విధము లెఱింగింతు|వినుము విప్రునిఁ గృశు, నాహూతుని జేసి|యతఁడు గుడువ
వచ్చినఁ బెట్టమి | వరకులంబును సార, విద్యయుఁ గలవిప్ర|వృత్తి గొనుట

తే. నీరు ద్రావంగ గోవు లే|తేర విఘ్న, మాచరించుట బధిరపం|గ్వంధధనము
లపహరించుట వేదశా|స్త్రాదినింద, బ్రహ్మహత్యలె యిట్టుల | పౌరవేంద్ర. 68

తే. అలుకఁ బురి నూర వనమున|నగ్ని యిడుట, పాపశీలతమై బొంకి | బ్రాహ్మణునకు
నధికతర మగుశోకంబు|నావహించు, టంచితాచార బ్రహ్మహ|త్యాసమములు.

తే. రూపగుణశీలముల సను|రూపుఁ డైన, వరున కీక కన్నియఁ దన|వలసినట్ల
తగనివానికి నిచ్చుట | ధర్మదేవ, తాతనూభవ బ్రహ్మహ|త్యాసమంబు. 70

### భీష్ముఁడు ధర్మరాజునకుఁ బుణ్యతీర్థవిశేషంబుల నెఱింగించుట.

వ. అనిన విని యజాతశత్రుండు గంగాపుత్త్రుతోఁ బుణ్యతీర్థవిశేషంబులు వినవలతుం జెప్పవే యనుటయు నమ్మహీపతికి నమ్మహాత్ముం డిట్లనియెఁ దొల్లి గౌతముం డడుగ నంగిరసుండు తీర్థంబులు గొన్నింటి ప్రకారంబు సెప్పె నప్పరిపాటి సెప్పెద నాకర్ణింపుము. 71

సీ. సప్తదినంబులు | చంద్రభాగను నిత, స్సను నూర్మిమాలినిఁ | దగ వసించి

యాఘోరవిరహితుం డై యుండ మునిసమ్మానం డగుఁ గాశ్మీరకమండలమున
నదులు గొన్నిఁ మహోవకనము సొచ్చి పాఱు దివంబు సిద్ధించుఁ దకదంబుసేవ
బుష్కరమ్ముఁ బ్రభాసకమును నైమిశము నింద్రమార్గంబు దేవికాస్వర్గబిందు
తే. లును సమవగాహనంబున ఁ జనుల నప్సరస్సమేతవిమానవర్తనలఁ జేయు
నవనినాథ హిరణ్యబిందుదువుఁ గుశేశయంబు నెల్ల పాపంబుల నపనయించు. 72
వ. గంధమాదనసంగతకైనయింద్రతోయయుం గురంగదేశగతజుగుకరతోయయుం
ద్రిరాత్రోపవాసోపేతస్నాతకులకు నశ్వమేధఫలంబు గలుగంజేయు. 73
తే. కనఖలమున గంగాద్వారకమునను నీలభూధరమునఁ గుశావర్తకమునను బి
కమునసుస్నాతుఁడై పాతకములు దొఱఁగి, నాకలోకవిహారంబునరుఁడు వొందు.
క. భాగీరథి మెచట నుద, గ్భాగమునను శివుని నెలవునప్రాంతమునఁ జనుఁ
ధీగణ్య [1]యచట నెలకు స, మాగతు లగునుకలఁ గం డకనాహారవిధిన్. 75
సీ. ఆహారముడిగి [2]మహాశ్రమంబున నగ్నిహోత్రి యై యొకమాసముండినరుఁడు
సకలసిద్ధులు మహైశ్వర్యంబుగాఁ గను, జననాథ భృగుతుంగ మనుమహాహ్ర
దమ్మున వాసరత్రయ ముపవాసి యై, బ్రహ్మవధంబుపాపంబుఁ దొఱఁగు
వినుము కన్యాకూపమున సాగ్నిహోత్రత, నున్నఁగీర్తితుఁడగు నుభయలోక
తే. ములను సుందరికాహ్రదంబునను దగఁగ
సకృదుపస్పర్శనము సేసి చారుమూర్తి
యై జనించు వైమానిక మనఁగఁ బరఁగు
భవ్యతీర్థంబు సేవించి పడయు దివము. 76
తే. కృత్తికాంగారసంసేవ కిల్బిషములఁ
బాపి నాకంబుఁ జేర్చు విపాశఁ ద్రిదివ
సములు కాలికాశ్రయ బ్రహ్మచర్యనియతి
తోడ సేవింప జన్మంబు దొఱఁగు నరుఁడు. 77
క. స్నానముఁ బితృతర్పణమును, మానితగుణ కృత్తికాశ్రమంబున నియతి
మానవులు సేసి శిఖిఁగొలు, వానందాత్మకతఁ గాంతు రండ్రు మునీంద్రుల్. 78
తే. ద్రోణశర్మపదంబున రూఢ మైన, తీర్థమునఁ శర స్తంబంబు దేవదారు
వనముఁ దమ్ము సేవించినమనుజు నెట్టి, వాని నైనను నప్సరోవరునిఁ జేయు. 79
తే. చిత్రకూటజనస్థానసేవనములు
రాజలక్ష్మి నొసఁగు పితృభోజనత్వ
మహితవృత్తుఁ డై శ్యామాశ్రమమున నొక్క
పక్ష మున్న [3]సంతర్ధ్యానఫలము గలుగు. 80
క. విమలమణిం గౌశికినా, లమున ననాహారమానసలంపటుఁ డై యు

1. అ. యట నెలకు జగ్గు, లాగ. 2. క. చ. బింబాశ్రమంబున. 3 క ...

న్న మనుజుఁ డిరువదియొక్కదినములం బరమగతిసాధక శ్రీ నొందును. 81

సీ. పేర్చుమతంగవాపిక నేకరాత్రంబు, నిలిచి సిద్ధుం డగు నెల వసించి
నైమిశంబునఁ బొందు నరవర పురుషమేధఫలంబు నట్టివిధంబ యుత్ప
లావనంబునఁ జేయఁగా విను మశ్వమేధంబుఫలంబు నర్థంబుఁ బడయుఁ
నరుఁడు గంగాయమునాసంగమమ్మునఁ, గాలాంజనం బనుశైలమునను

తే. నియతి నాచరితస్నానుఁ డయి విముక్తి, తెరువు గాంచు వైవస్వతతీర్థసేవఁ
దీర్ఘభూతత్వ మొందు విధేయచిత్త, వృత్తిఁ గౌరవవంశపవిత్రచరిత. 82

ఆ. విను ప్రయాగమునకుఁ జనుదెంచుఁ గోటిత్రయంబు దశసహస్రకంబు దీర్థ
ములు నరేంద్ర దర్శమున నందు నెలనాళ్లు, లున్న నరుఁడు ముక్తిఁ గోడయఁ డండ్రు.

క. విను గంగను బ్రహ్మసరం, బనుతీర్థమునందు నెల నిరాహారతమై
సునికిని మర్త్యుం డమృతాం, శునిలోకంబున మహాయశుం డై యుండున్. 84

సీ. అనఘ యష్టావక్రమును [1]గలవింకము, దేవహ్రదము బ్రహ్మభావ మొసఁగు
నాచరితస్నానుఁ డగుమర్త్యునకు నుర్వశీకృత్తికాయోగసిద్ధకీర్తి
దైనలౌహిత్యంబునందు సుస్నాతుఁ డై, పుండరీకాధ్వరమునఫలంబుఁ
బొందు రామహ్రదంబున నిరాహారుఁ డై, పరఁగ్రెండుదినములు భరితనియతి

తే. మున్న సకలకల్మషములు నుజ్జగించి, నరుఁడు నిరోధ్భజనత నెలనాళ్ళు దామ
హాహ్రదావాసియై జమదగ్ని గన్న, పుణ్యలోకంబుఁ గను మునిగణ్యుఁడగుచు.

క. విను వింధ్యంబున నొకనెల, తనుతాపము నోర్చి చేయుతపమున జనరం
జన సర్వప్రాయశ్చిత్తనిరూఢిం బొంది నరుఁడు ధర్మజ్ఞుఁ డగున్. 86

సీ. నర్మద నాడి భూనాథనందనుఁ డగు, జంబుమార్గంబున సంయతాత్ముఁ
డైమాసములు మూఁడు నట యొక్కనాఁడును, నిలిచిన సర్వసిద్ధులను బొందుఁ
గోకాముఖమునీరఁ గ్రుంగి తండులికాశ్రమమునకుఁ జని వల్కలము ధరించి
శాకభోజనుఁ డయి శాంతిమై నున్న న, న్నెలవున నున్నకన్నెలు పదుండ్ర

తే. కధిపుఁ డై యజరామరుం డయి సుఖించుఁ
గుల్యయందుఁ ద్రిరాత్రమ్ము గుడుపు దక్షి-
శాచి మై యఘమర్షణజపము సేసి
యశ్వమేధఫలమ్ముఁ బొందు ననఘ నరుఁడు. 87

వ. ఆర్ష్టిసేనాశ్రమంబున నుజ్జానకస్నాతుండై మర్త్యుం డఖిలపాపంబులం బొఱంగు
పిండారకంబున [2]నేకరాత్రంబు నిలిచి యగ్నిష్టోమఫలంబుం బడయు ధర్మారణ్యం
బున బ్రహ్మసరస్సు సేవించి పౌండరీకఫలప్రాప్తిఁ గాంచు. 88

చ. జనకుఁడు గౌరికిన్ వినుము శంకరుమామ హిమాద్రి సర్వర

---

1. జ. గపోతంబును. 2. జ. ద్రిరాత్ర బు.

త్మనికరవిశ్వపుణ్యాభివర్ధనంబు ప్రశాంతత నందు నిల్చి స
న్మునిగణసేవనంబునఁ దపస్సముఖ సదపంగ నరుండు సిద్ధుఁడై
వినుతికి నెక్కుఁ బొందు నరవిందభవాంతికవాససంపదన్. 89

క. విను తీర్థసేవ కామం, బును గ్రోధము మదము లోభమును జేరనిన
మ్మనము గలిగి నడప వలయుఁ, దనఘా ఫలసిద్ధి దాన నగుఁ బురుషునకున్. 90

క. *దమమును దపము నహింసయు, శమమును దీర్థముల వాన శౌచాదికయుం
బమలగుణ కల్గి రిత్తజ,లములం దోఁగిన శుచిత్వలాభము గలదే. 91

క. *దొరకొనని వానిఁ గోరక, దొరకొనినందున మమత్వము బుట్టన్ హృదయుతం
బొరయక విగలిస్పృహులు లగు, పురుషులు శుచు లేల తీర్థములు వారలకున్. 92

ఆ. అరయ దుర్గమములు నతివిషమంబులు, నైనతీర్థములు ధరాధినాథ
యధికభక్తియుక్తి నాత్మఁదలంచినఁ, జాలు నరులకల్మషములు వాయు. 93

క. జనవర తీర్థవిధానం, బన మగుసిపుణ్యావాక్యచయము పవిత్రం
బనుపమము మాననీయం, బనిమిషపదవీప్రదము రహస్యము సుమ్మీ. 94

క. అనుగతుఁ డగు శిష్యునకుం, దనసుతునకుఁ జుట్టమునకు ధరణీసురము
ఖ్యానియతిపరద్విజాతుల, కును దగ నెఱిఁగించునది యకుంఠితకరుణన్. 95

క. నరవర గౌతమునకు నం,గిరసుఁడు సెప్పినది యిది యకిల్బిషబుద్ధిం
బరిపాటిఁ జదివినఁ, దత్పరత విని నపుడ పాయుఁ బాపము లెల్లన్. 96

క. మునులకు జప్యం బిది సద్వినుతము నిత్యముఁ జదివెడు విమలాత్ములకున్
విను జాతిస్మరణము తో, జననం బతిపుణ్యపురుషసంతతిఁ గలుగున్. 97

అత్రిప్రముఖమహర్షులు శరతల్పగతుఁడైనభీష్ముఁ జూడ వచ్చుట

వ. అని చెప్పి నయ్యవసరంబునం బుణ్యవిశేషగణ్యుం డైనయగ్గాంగేయుం డట్లు
గాండీవిశరంబులు శయ్యగా వీరశయనంబున నునికి నతని నీక్షింప నత్రియు
వసిష్ఠుండును భృగుండును బులహుండును బులస్త్యుండును గ్రతువు నంగిరసుం
డును నగస్త్యుండును గర్గ్యుండును గౌతముండును విశ్వామిత్రుండును జమద
గ్నియు మొదలయినమహామునులు శిష్యవ్రాతంబుతో నేతెంచి తపఃప్రభావ
స్ఫురితప్రభాపూరంబు భూనభోంతరంబున సంతతంబు లగుచుండ నిలిచి య
దేవవ్రతునియున్న తెఱంగు గలయం గనుంగొనిరి పాండవు లాశ్చర్యభరిత
చిత్తు లగుచు నత్తపోధనవర్యులం బ్రస్తుతించుచుం బ్రణమిల్లి రప్పు డప్పరమ
సంయములు లంతర్ధానంబు సేసి రక్కౌరవుల్కు నక్కురుపితామహుండును దారును
వారలమాహాత్మ్యంబు లుగ్గడించుచుఁ దద్విషయం బైనసంభాషణం బొనర్చిరి
తదనంతరంబ. 98

తే. తాతపాదపద్మములు మస్తకము సోఁక, వినతుఁడై ధర్మతనయుఁ డేజనపదంబు

* ఈరెండుపద్యములును వ్రాఁతప్రతులం గనుపట్టవు.

లేనగంబు లేనదులు పుణ్యానుభావ, సమధికత్వంబు గలయవి జనవరేణ్య. 99

వ. అని యడుగుటయు. 100

భీష్ముఁడు ధర్మరాజునకు గంగా ప్రభావంబు సెప్పుట.

సీ. అతనికి నాతఁ డి ట్లను నివ్విషయమునఁ, గల దితిహాస మొక్కటి దాని
వివరింతు నీ కుంఛవృత్తిపరుం డగు, నొకవిప్రు నింటికి నొక్క సిద్ధుఁ
డతిథి యై వచ్చిన నాతిథ్య మొనరించి, యతనితో సల్లాప మాచరింప
నమ్మహాత్ముండు నీ యడిగిన యట్టుల, యా సిద్ధు నడిగిన నతఁడు సెప్పె

తే. ననఘ యెవ్వానినడుముగా నరిగెఁ బావ,నాంబుపూర భాగీరథి యట్టిదేశ
భూధరాదిపదార్థముల్ పుణ్యతమము, లట్లు గాఁగయు గంగమహత్త్వ వినుము.

తే. త్రిపథగాసేవనమున సిద్ధించునట్టి, గతి జనములకు నియుతతకల్పితము లయ్యు
నధ్వరంబును బ్రహ్మచర్యంబుఁ దపము, సంపరిత్యాగమును జేయఁ జాల వనఘ.

క. మును పాపము లెన్ని యొనర్చినఁ బిదపను గంగ నాడఁ జీఁకటి రవి డోఁ
చిన విరియుగతి విరియు న,య్యనఘుఁ డిలాతలము దొఱఁగి యమరత నొందున్.

క. మే నించుక సోఁకిన గం,గానదితోయములు జనులకల్మషకోటిం
బో నడిచి పురందరలో,కానందముఁ బొందఁ జేయు నాగమవేదీ. 104

తే. ఎన్నియేఁడులు మనుజుని యెమ్ము గాంగ,వారియం దుండు నన్ని వేల్వత్సరములు
నాకలోకమహాసుఖశ్రీకి నాతఁ, [1]డుత్తుఁ డై యుండు నిర్మలశుచిత్తవృత్తి. 105

సీ. అనఘ సోమము లేనియధ్వరంబును శశి, లేనిరాత్రియు రవి లేనినభము
నాత్మధర్మము లేనియాశ్రమంబును బువ్వు, సంపద లేనిభూజమును బోలె
హీనత నొందు గంగానది లేనిదేశంబు చాంద్రాయణశతములైన
గంగాపయఃపానకరణంబు గావించు, నిర్మలత్వముఁ జేయ నేర వగ్ని

ఆ. యందుఁ బడినతూలి యట్లగు గంగావ,గాహనమునఁ బాతకంబు లఖిల
భూతములకు దుఃఖములు వాపికొనుటకు, నేవిధములు గంగ కీడు గావు. 106

క. శరణంబు లేనిజనులకుఁ, బరమశరణ మండ్రు మునులు భాగీరథి ని
ర్జరులకు నమృతమునట్టుల, నరులకు గంగాజలం బనఁగ నే విందున్. 107

క. తలపై జాహ్నవివాలుక, యలికికొనిన ఫాలతటిఁ దదంతర్స్ఫురత్సం
కలితముఁ జేసినఁ బాపం,బులు దొలఁగుసుపర్ణుఁ గనినభుజగముల క్రియన్. 108

క. గంగాతరంగశీకర,సంగత మగుమారుతమునసద్యస్స్పర్శం
బంగీకరించు నెవ్వఁడు, భంగపఱచు నతఁడు ఘోరపాపచయంబున్. 109

తే. ఇవ్వుల నేడుదరంబుల నవ్వుల నేడు
దరములను బితృవర్గంబు నరుఁడు గంగ
నాడి శుచిఁ జేయఁజూచిన యంతమాత్రఁ

1. క. గ. చ. డుత్తుఁడై...నిర్మలయుశుచిత్త.

బాచు వాఙ్మనఃకాయజపాపతతుల. 110

తే. వినిన వేడుక సేసినఁ గనినఁ జేత, నంటినను రెండుకులములయందుఁ గలుగు
పితృగణంబుల నెల్ల సద్గతికిఁ బుచ్చు, గంగ యొటు సేయునో యవగాహనమున.

క. విను గంగ గంగ యనుకీర్తనములతో నొంపునిటఁ దగ మునిఁగిన యా
జ్జనులు దురితములఁ దొఱఁగుదు, రని యార్యులు సెప్ప విందు సంచితచరితా.

సీ. అనఘ చూడ సమర్థుఁడగువాఁడు జాహ్నవిఁ, జూడక యున్నఁ బసు ప్రతిముఁడు
నంధసమానుండు నగు నింద్రుఁడాదిగా, సురలు గోరెదు గంగ నరులు గోర
వలదె చేకుఱు నపవర్గ ముత్కృష్టమణి కాలంబున గంగఁ దలంచిరేని
రాజభయంబుఁ జోరభయంబుఁ బాపభ, యంబును భూతభయంబు లోను

ఆ. గాఁగఁ గలుగుభయనికాయంబు గంగాప్ర, శంసనమునఁ బాయుశంభుఁ డర్థి
నతులపుణ్య మైనయద్దేవి దివినుండి, రా ధరింపఁడే శిరస్తలమున. 113

తే. మూఁడుపథములఁ జని లోకములకు మూఁటి
కుజ్జ్వలాలంకృతియుఁ బెంపు నొసఁగినట్టి
యమలతరమూర్తి యగుదేవి నాశ్రయించు
వాఁడు కృతకృత్యుఁ డిది నిక్కువము కృతాత్మ. 114

క. జనులకు నింద్రుఁడు గ్రహముల, కినుఁడును[1] బితరులకు సోమధీశుఁడుఁ బోలెన్
మనుజోత్తమ కడు నెక్కుడు, వినుము నదుల కెల్ల జాహ్నవి మాహాత్మ్యమునన్.

ఆ. సగరనృపతిపుత్రచయము మునీంద్రశా, పమున భస్మ మైన యపారదురిత
కల్మషంబుఁ బొందఁగా గంగ నిజజల, సేక మొసఁగి యనిచె నాకమునకు. 116

తే. దేవతలఁ జిత్రతపమునఁ దెలచి గంగఁ
బ్రచురపౌరుషుఁ డగుభగీరథుఁడు దనదు
పూర్వులైనసగరనృపపుత్రులకు ను
దాత్తగతికయి తెచ్చె నిద్ధరణి కనఘ. 117

ఆ. విష్ణుపదమువలన విధునివలన సూర్యు, వలన మేరుపూవకలితుఁ డైన
విష్ణువలనఁ ద్రిపురవిజయమౌళివలన, నుండి హిమనగమున నొలసె గంగ.

క. విను తత్పరభావంబున, మనంబు నిశ్చలత పొంద మనుజుఁడు శరణం
బని యాశ్రయింప జాహ్నవి, సనాతనపదోపలబ్ధిసంపద నొసఁగున్. 119

వ. అని చెప్పి సిద్ధుండు వెండియు. 120

క. ఏ నెఱిఁగినంత సెప్పితిఁ, గాని యనంతమహిమంబు గంగాగుణానం
తానంబు శతానందము, ఖానిమిషప్రవరకీర్త్య మనఘచరిత్రా. 121

క. మేరువుమణులును వారిధి, వారికణంబులును నెన్నవదు వగు గంగా
స్ఫారగుణంబులు దగు సం, ఖ్యారూఢంబులుగఁ జేతఁ యతులవివేకా. 122

---

1. క. గ. చ. దారలకు.

వ. అని పలికి యి ట్లనియె. 123

ఆ. వేడ్క నీకు నేను వివరించినట్టి యీ, జాహ్నవీగుణములు సంతతంబు
మనసు వాక్కు దనువు నను గలసాధనములఁ భజింపు భక్తిపూర్వకముగ.

తే. అట్టులైన గంగా ప్రసాదాతిశయము వలన సిద్ధుండవై త్రిభువనములందు
నర్చనీయసంక్రీడన మవిహతముగ, సంచరించుమాహాత్మ్యంబు సంభవించు.

క. నిజధర్మనిరతుఁడై తను, భజించుసజ్జనునిచిత్తపద్మము కృపఁ దా
భజియించి గంగ యతనిం, బ్రజనితచిరసౌఖ్యుఁ జేయుఁ బావనచరితా. 126

వ. అని యిట్లు గంగాగుణంబు లమ్మహాద్విజునకు వివరించి యాసిద్ధుండు గగనగమనంబునం జనియె నవ్విప్రోత్తముండు నియతచిత్తుండై గంగాసంసేవనం బాచరించి యనన్యసులభ యగుసిద్ధిం బడసెఁ బాండవాగ్రజా నీవును గంగాభజనంబునం బరమశుభంబు నొందుము. 127

క. అని చెప్పి శాంతనవుఁ డి, ట్లను గంగాస్తోత్రసహిత మై పరఁగిన యి
ప్పావనేతిహాసముఁ బఠించిన వినినను రుజలు వాయుఁ జెంద వఘంబుల్. 128

క. అనిన విని యన్న రేంద్రుం, డనుజసహితముగఁ బ్రభూతహర్షసముల్లి
లనకలనాసంవేశితమనస్కుఁ డై యాతనికి నమస్కృతి సేసెన్. 129

వ. ఇట్లు పరమహర్షంబునం బ్రణతుండై ధర్మజుండు మందాకినీతనయుతో నెవ్వరు సర్వజనపూజ్యు లెఱింగింపవే భవద్వచనామృతంబునఁ దృప్తిసనక యుడిగెద ననిన నమ్మహాత్ముండు వాసుదేవనారదసంవాదం బనునితిహాసంబు వినుము నీయడిగిన యర్థంబు దేటపడియెడు నని పలికి యతని కి ట్లనియె. 130

—○● వాసుదేవనారదసంవాదప్రకారము. ●○—

క. తనకడకు నారదుఁడు వచ్చిన సత్కారము దగంగఁ జేసి ముకుందుం
డను సమధికబహుమానంబున నెవ్వారలకు నీవు మ్రొక్కుదు చెపుమా. 131

వ. అనిన నద్దేవముని యద్దేవకీనందనున కి ట్లనియె. 132

సీ. వరుణు సమీరణుఁ దరణిఁ బర్జన్యుని, సప్తార్చి నీశానుఁ షణ్ముఖుని మ
హాలక్ష్మి విష్ణుని నజుఁ బృహస్పతిఁ జంద్రు, జలముల భూమి సజ్జనము లెపుడు
నతిభక్తి సేవింతు రట్టివారలకు నే, మ్రొక్కుదు వేదపరులుఁ దపోధ
నులు దేవతాపూజకులు భూమిధనధాన్య, గోదానశీలురు నాదరంబు

ఆ. గల్గి యతిథిపూజ గావించువారలుఁ, బితృసమర్చకులును భిక్షితాన్న
పూతశాంతభావములు గలవారు సత్యవ్రతులును బూజ్యు లనఘ నాకు. 133

క. వినుతత్రివర్గనిరతులు, నిరహంకారమమకారు లగుజనులు సువ
[1]ర్తనయుతులు నలోలురు బోధనులు నమస్కార్యు లద్రిధర విను నాకున్.

1. 'ర్తనయుతులు నలోలురు, సదమలచరితులు వందనీయు లగుదురు నాకున్' ఆ. ప్ర.

క. నీవును మిత్సంపూజ్యాజ,నావలిఁ జిత్తమున నెఱిఁగి యర్చనమును సం
సేవనము నడపు భూరిష్ఫ,భావహ మగు నవ్విధంబు యాదవసింహా. 135

క. అనిమెం గావునఁ గుంతీ,తనయా గ్రజ నీవు సర్వసద్ధములజనముఁబం
గొనియాడుము వారలు లో,భనము లొసంగుదు రఘుంబుఁ బాపుదురు కృపన్.

వ. అనిన విని యమ్మహీశ్వరుం డమ్మహితాత్మున కిట్లనియె. 137

క. జనపతులకుఁ గర్తవ్యము, లనేకములు గలవు వానియన్నిటిలోనన్
వినుత ప్రధానకృత్యం, బనఘచరిత చెప్పవే దయయం దెలియంగన్. 138

క. అనుటయు నతనికి నతఁ డిట్లను సామ్రాజ్యాభిషిక్తుఁ డైనన్పతికిన్
వినుకర్తవ్యతమం బఖ్యపని బ్రాహ్మణపూజనంబు భవ్యవిచారా. 139

క. భూనాథ విప్రులు సమాధానంబున నన్నుఁ బొదలు ధరణికి శుభముల్
మానార్హు లగుట వారికి, మానన లేకున్న నలుఁగు మనుజాధీశా. 140

క. దైవంబు నదైవముగ నదైవము దైవముగఁ జేయ ధరణీదివిజుల్
భూవర శక్తులు విను వారేవానికి గూర్తు రతఁ డధీశత నొందున్. 141

క. కోపమునఁ బ్రసాదంబున, నాపదయును సంపదయును నప్పుడ తేవా
రోపుదు రిందున కైనను, శాపానుగ్రహము లా సుచరితులలీలల్. 142

క. ద్రవిడ కళింగ కాశీనర, యవన శక పుళింద నృపతు లవనిసురపరా
భవమునఁ గాదే ధరణీధవ పొందిరి తొల్లి శూద్రతాదైన్యంబున్. 143

క. సోమాత్మకు లీశ్వరతా, శ్రీమహితులు సర్వసౌఖ్యసిద్ధిపదులు గో
త్రామరులు వారి నెప్పుడు, భూమీశ్వర పూజనములఁ బోషింపు తగన్. 144

క. వినుతాచారుం డగువిప్రునకు సభక్తికము గాఁగ భోజన మిడినన్
విను దేవపితృసమూహము, లనూనపరితృప్తిఁ బొందు నతులచరిత్రా. 145

వాసుదేవభూదేవీసంవాదప్రకారము.

వ. అని చెప్పి భీష్ముం డాభూపతితో వెండియు నిట్లను భూసురవిషయం బైవాసు
దేవునకుం బృథివికి సంవాదంబు గలిగె నది యితిహాసరూపంబునఁ జెల్లు దానిఁ
జెప్పెద నాకర్ణింపుము వాసుదేవుం డొక్కసమయంబునం బృథ్విఁ నాలోకించి. 146

క. లోకజనని వగుటను నిను, నొక్కాల్యపి యడుగవలయు నొక్కటి దెలియన్
నాకుం జెప్పుమా పాపము, లేకృత్యము సేసి గెలుతు రెల్లజనములున్. 147

ఆ. అనినఁ బృథివి యిట్టు లను విప్రసేవను, విప్రపూజనమున విప్రహితవి
ధానమునను బాపతతి నోర్చు మానవ, ప్రతతి యొండు నిన్నృపాలుపనులు. 148

ఆ. అమరవిభుని భగసహస్రచిహ్నునిఁ గాఁగ, జేసినదియు నేత్రభాసురుంచు
గా నొనర్చినదియు గౌతములాతఁ డిప్పున, లకయుఁ బ్రసాదసంపదయు నుగావి. 149

క. అనిన విని మెచ్చి పృథివిం, గొనియాడె రథాంగపాణి కనునృపవర నీ
వనిశంబు మిగులనుతిమ,న్ననలను విప్రులకుఁ బ్రీడు మొక్కనప్పను కృపతోన్. 150

క. అని మఱియు శాంతనవుఁ డి, ట్లను జననంబునన విప్రు నధిప మహాభా
గునిఁ గాఁ జెప్పుదు రార్యులు, జనులకు వంద్యంబు లతనిచరణాంబుజముల్. 151

వ. బ్రాహ్మణుల సృజియించి బ్రహ్మ వారలతోఁ జెప్పినవిధం బాకర్ణింపుము. 152

ఆ. అరయ మీకుఁ గృత్య మన్యంబు లే దాత్మ, కర్మ మాది యుక్తధర్మనిరతి
బ్రహ్మగోపనంబుఁ బాటింపుఁ డవ్విధ, మధికశోభనంబు నావహించు. 153

వ. బ్రాహ్మణ్యం బెల్లవర్ణంబులకుం దారకంబు బ్రాహ్మ్యమైనశ్రీఁ దపస్స్వాధ్యాయంబుల వెలుంగం జేయుం డనియె నట్లు గావున రాజులకు [1] బ్రహ్మవచనపరిపాలనంబు ప్రధానకర్తవ్యం బని చెప్పి వెండియు. 154

ఆ. అగ్ని నంట హిమపదచలంబుఁ గదలుప, గంగఁ గట్ట వచ్చుఁ గాని విప్ర
రాజిఁ బరిభవింపఁ రాదు విప్రులకొల్వు, కల్పవృక్షసేవ కరణి యధిప. 155

వ. ఏతద్విషయం బైనది శక్రశంబరసంవాదం బనునితిహాసంబు గలదు వినుము శక్రుండు జటాసురనందనుం డైనశంబరుకడకుం బోయి తదీయగోష్ఠి నుండి యతనితో నీ వేమిట నున్నతిం బొంది యుండుదు వనిన నతం డతని కిట్లనియె. 156

క. అలుకయు నసూయయును వి,ప్రులయెడ లే వనఘ వారిఁ బ్రోతుం గాతుం
సొలయుఁ దదీయారాధన,ముల కట్టులు గావునన్ విభూతి వహింతున్.

వ. దేవాసురయుద్ధంబున విప్రానుగ్రహంబు దేవతల గెలిపించుట గని మజ్జనకుండు సోమునితో భూమిసురులు మహానుభావులుగదే యనుటయు నమ్మహాత్ముం డతని కిట్లను వారలు తపస్స్వాధ్యాయసిద్ధులై యుండుదురు వారి తెఱం గాకర్ణింపుము.

ఆ. అప్రవాసి యైనయవనిసురుని యుద్ధ,శాలి గానిధరణిపాలు నురగ
ముల బిలాంధకారమున నడంచినయట్లు మెఱయనీక భూమి మ్రింగు నండ్రు.

క. దాసి నెఱింగి గృహంబున, మానిత మగుచదువునందు మనసు గొలుప కెం
దేనిఁ జని చదువుదురు శ్రుతు,లానంత్యమునకుఁ దపస్వు లగుదురు విప్రుల్. 160

వ. కావున వారలు సర్వాధికులు వారలయెడ బహుమానావమానంబు లెట్టివారికి శుభాశుభంబుల నొందించుటకు సందియంబు లే దనిన సోమునివాక్యంబులు పాటించి మజ్జనకుండు విప్రజనంబులం బూజించి తేజిష్ణుం డయ్యె నేనుం దదాచారంబునం బెంపు వడసితి నని పలుకుటయు నయ్యసురేంద్రునివచనంబు లాది సురేంద్రుండు భూసురులకుం బరితోషంబు గావించి సవిశేషసమున్నతిం బొందె నని చెప్పిన విని గాంగేయునితోఁ గౌంతేయాగ్రజుం డపూర్వచిరసమాశ్రితమార్గాగతులలోన నధికతమం బగుపాత్రం బెవ్వ రని యడిగిన నప్పుడమిఱేనికి నప్పురుషవరుం డిట్లనియె. 161

క. చెలులుం జుట్టలు సంబం,ధులు ఋత్విజులును బురోహితులుఁ దగుపాత్రం
బులు హింసాక్రోధేర్ష్యా,దులు లేనిజనంబు లైన దురితవిదూరా. 162

---

1. క. బ్రహ్మవాక్యాదర.

క. దూరాగతులు నపూర్వులుఁ, గౌరవకులముఖ్యు పూజఁ ॥ గనుటకు నర్హుల్
సారాచారము విద్యా,గౌరవమునుం గలుగఁ జూపు ॥ కరణీయ మగున్. 163

క. ఈ సూఁడు దెఱంగులజను, [1]లా మెయిఁ జూచినను నసుచు ॥ లైనను శాస్త్ర
శ్రీమహితుల నిజభృత్య,స్తోమముజీవనము నడపి ॥ చుమ్మీ యాగుల్. 164

క. అనిన విని ధర్మసుతుఁ డి, ట్లను శంతనుసుతునితోడ ॥ నఘకోటికి నె
ల్లను మూలము వనితలయు, జ్జనముల తెఱఁ గెఱుఁగఁ జెప్పు ॥ చాతుర్యనిధీ. 165

నారదపంచచూడాసంవాద మనునితిహాసము.

వ. అనుటయు నతం డ(తని కి ట్లనియె న)తివలు నీచెప్పినట్టివార దీనికి నారదపంచచూడాసంవాదం బనం బరఁగు నితిహాసంబు గలదు వనితాస్వభావవిషయంబయి యుండు దాని నాకర్ణింపుము దేవమునివరుం డగునారదుం డొండునుం జరించుచుం బంచచూడ యనునచ్చరలేమ నొక్కెడం గాంచి 166

క. ఏ నొక్కటి యడిగెదఁ జెపు,మా నలినదళాక్షి యనుచు ॥ మాకొలఁదులప
లైకొనఁ డుత్తర మిచ్చెద, నానతి యిమ్మని యొవది ప్రియం బెసఁగంగన్. 167

వ. అనుటయు. 168

క. వనితాస్వభావ మిట్టిది, యని తెలియంఁ జెప్పు మనుడు ॥ నల్ల నగుచు న
వ్వనిత దగునయ్య వనితకు, వనితలదుశ్చేష్టితములు ॥ వాక్రువ్వంగన్. 169

క. అనిన విని నిక్క మాడిన, వినుత ప్పించుకయు లేదు ॥ వివరింపు నిజం
బని ముని పల్కిన నయ్యం,గన యతనికి నిట్టు లనియెఁ ॥ గౌరవముఖ్యా. 170

వ. స్త్రీస్వభావంబులు నీ వెఱుంగనియవి లే వైననుం జెప్పెద నవధరింపుము. 171

క. కులమును సమ్యాన్యతయును, గలిగి యొకనిభార్య యై సగౌరవలీలన్
మెలఁగుచు నెలిఁ జరియించు, న్గలన వలసినట్ల యే మగనం గల దనఘా. 172

వ. అని పల్కి వెండియు. 173

సీ. యోషిజ్జనంబులు ॥ దోషంబులకు నెల్ల, మూలంబు వారల ॥ నేల చెప్ప
నగిగితి గాన కసన్నంత సెప్పెద విను, పురుషుల మేలిమి ॥ పొలఁతు లెఱుఁగ
రది గాక నిర్లజ్జ ॥ లై కుత్సితుల భజి,యింతురు కదిసినయంతఁ జేసి
వర్జనీయులు లేరు ॥ వారల కెవ్వరు, దండభీతిన పాడి ॥ దప్పకునికి

ఆ. యగ్ని కాష్ఠముల మహావాంబుధి యేఱుల, నంతకుండు భూతసంతతులను
వనజముఖులు పురుషులను దృప్తిఁ బొందుట, గలుగ దండ్రు కోవిదులు మునీంద్ర.

క. కల [2]దొకరహాస్యగోపన, మలఘుమతీ వినుము పురుషు ॥ నన్యం గనినం
బొలఁతులకు నేమి సెప్పుదుఁ, గలుగుఁ బదనుతోడ [3]కళలు ॥ కామగ్రహమునన్.

వ. అని వెండియు. 176

1. గ. జ. లేమెయిఁ..నసుచులేనియు. 2. గ. చ. దొకహాస్యదోషం, బల. 3. క. కడలు, చ. కడలు

క. కుడుచుట కట్టుట పూయుట, తొడుగుటయును వివిధధనవిభూతులు గూడుట యె
క్కుడు వేడ్క సేయఁజాలవు, పడఁతికిఁ బరపురుషుఁ గవయఁ బాటువోలెన్. 177

వ. అని చెప్పిన (విని నారదుండు నిజంబ పల్కితని పంచచూడ ననిపిని జెచ్చెంజని
యె) నని చెప్పిన విని ధర్మజుండు సుందరీజనంబులం గాంచు తెఱం గెఱింగింపవే
యని యడిగిన నాపగాతనూజుం డతని కిట్లను వారు మయశంబరాదిరాక్షసుల
మాయలం గడచినమతకంబులు గలిగి నిరూపింప రాక యుండుదు రదియునుం
గాక వేఱొక్కవిశేషం బాకర్ణింపుము. 178

తే. తొల్లి నిర్దోషచిత్తత నెల్లజనులు
వలచినప్పుడ దేవత్వవైభవంబు
నొందఁ జాలి యుండుదురు మోక్షరూపయుక్తి
వనితలకు లేక సాధ్వులై యునికిఁ జేసి. 179

వ. దానికి దివిజు లసూయాగ్రస్తులై కమలయోనిం గానం జని నిజచిత్తప్రకారం
బెఱింగించిన నతం డతివల మాయావనతులం గావించి వారికిఁ గామం బగ్గలంబు
గాఁ జేసినం బురుషులు వారిచిక్కులం బడి రోషాదిదుర్గుణదూషితు లగుటం జేసి
విగతానుభావులైరి దేవతలును బ్రియం బంది రట్లు గావున. 180

క. వనితలు మాయావినులై, యసిరూపితచిత్తవృత్తి నంచితరక్షం
బనుపడ కుండుదురైనను వినినది కథ యొకటి నీకు వినిపింతుఁ దగన్. 181

దేవశర్మ యనుమునివరు భార్య రుచి యనుదానిచరిత్రము.

వ. దేవశర్మయనుమునిభార్య రుచి యనునంగన సర్వాంగసుందరియై యుండుఁ దదీ
యరూపాతిశయంబు దేవగంధర్వాదులకును లోభనీయంబు. 182

క. అతఁ డొకనాఁ డొకయెడ కొక, క్రతువున కుపదర్శనంబు గావింపఁగఁ బో
వుతలంపు పుట్టి వికస, న్మతి యగుతనశిష్యు విపులకనామకునిఁ దగన్. 183

వ. పిలిచి యేకాంతంబున నతని కిట్లనియె. 184

క. రుచి నెపుడు వేచి తిరుగును, శచీవిభుఁడు దాని నెఱిఁగి సంరక్షణ మే
నుచితంబుగ నొనరింతు వికచకమలనిభాస్యఁ జేరఁ గానఁ డతండున్. 185

తే. నాకుఁ గ్రతువు సేయింపఁ జనంగ వలసి, యున్న యది పరదారసక్తముత్సుకుండు
శక్రుఁ డటు గాన రుచికి రక్షావిధాన, మాచరింపుము నీవు దృఢావధాన. 186

క. అనిన విని యట్లు సేసెద, నని విపులుఁడు గురుసితోడ నమరవిభుం జే
యనువునఁ జొచ్చునొకో పర, వనితాహరణమున కనియె వసుధాధీశా. 187

క. అనుటయు ననేకమాయలు, పొనరుపఁగా నేర్చు రూపములు పెక్కులు గై
కొనుఁ బక్షిమృగాదిత్వము, లొనరఁగ నవి నిజుతి నరసి యుండఁగవలయున్.

క. *రుచిమీఁదం గన్నిడి యా, శచీవిభుఁడు దిరుగు విను మసంశయముసుమీ

* ఈపద్యము పెక్కుప్రాఁతప్రతులం జూపట్టదు మఱియు నిది యిట యనవసరము.

యిచటికి నాతఁడు వచ్చుట, యచలితమతి నమ్మృగాక్షి కనరయఁగ వలయున్. 189

క. అని యొప్పగించి యోగం, బున కమ్ముని సనియె నవ్విపులుఁడును జిత్తం
బున నవధానము దృఢముగ, వనితం గాచికొని యుండె వసుధాధీశా. 190

వ. అట్లుండి యొక్కయనువు విచారించుకొని. 191

క. ఆవేశించెద యోగ, ప్రావీణ్యంబున మునీంద్రభార్యం దప్పై
యా విప్రుకాత్మమనమున, కీ విజ్ఞానంబు దోఁచునకే వెఱ పేలా. 192

వ. అని వితర్కించి యమ్మునిచాతుర్యకారుణ్యంబు లూఁది శంక దక్కి యక్కొమ్మ కింత నంత నాసీనుండై యుచితకథ లొక్కింతసేపు సల్లించి యోగమాయా బలంబునం జేసి నడపుటయు. 193

ఆ. పవనుఁ డాకసమునఁ బరఁగువిధంబున, నమ్మృగాక్షితనువు నందుఁ గలయ
విపులునాత్మదగఁ బ్రవేశించె నవ్వధూ, రత్నమునకు నెఱుఁగరాక యుండ. 194

వ. ఇట్లు ప్రవేశించి యయ్యోగివరు నాత్మయన్నాతిచైతన్యంబు జడంబుగాఁ జేసికొని యుండె నట్టియెడం బురందరుండతిసుందరంబగునాకారంబు దాల్చి యచ్చటికి వచ్చి విపులునిశరీరంబు సూచి నిద్రితునిగాఁ దలంచుచు నున్మదుం డగుటం జేసి యొండు పరికింపక మునిపత్నిం జేర వచ్చి. 195

క. నీవు కతంబుగ నా దగు, భావంబును భావభవుఁడు వఱచుట యరయం
గా నలదే యని పలికిన, భూవర యప్పొలఁతి మూఢబుద్ధిత్వమునన్. 196

క. సముచితముగఁ బ్రత్యుత్థానము సేయను దగినపలుకు నకుఁ జొరఁగను నే
రమి మూర కున్ననుం దమ్మకము పెంపున నతఁడు మఱియుఁ గమలాననతోన్.

క. ఏ నమరేంద్రుఁడ నా దగు, మానముఁ గామశిఖి గ్రాచె మానిని దడయం
గా నేల నన్నుఁ దగ స, మ్మానింపుము నీకు సిగ్గుమాటిం కేలా. 198

వ. అనుటయు నత్తన్వితనువున నున్న విపులుండు దనయోగమాయం జేసి యవ్వనిత వాసవునితో నీకు నిందు రాఁ బని యేమి యని పలికి పరవశ యగునట్లుగాఁ జేసినం జూచి యతండు వ్రీడాభయభరితచిత్తుం డయ్యె నయ్యవసరంబున. 199

ఉ. అమ్మునిశిష్యుఁ డయ్యువిదయంగము వాసి నిజాంగవర్తియై
యమ్మరుదీశుతో మఱచితా మును మూఁడినయబ్భగాంకిత
త్వమ్మొకభంగి నీఁగు టిది దైవతసంయమిసేవనీయభా
వమ్ము గలట్టి నీకుఁ దగవా యిసిరో యని పల్కె వెండియున్. 200

తే. అవిజితేంద్రియబల కుత్సితాత్మ నీచ, యెట్లు పాపంబు దొడరుట కియ్యకొంటి
నాదుగురునింటఁ బాగ్లి చేసెనీదు దేవ, గణవిభుత్వమహోన్నతి గ్రాఁగిపోదె. 201

వ. అనిన విని దివ్యబోధంబున విపులునియోగబలంబు తెఱంగెఱింగి వెలవెలం బారు నబ్బలవైరి నాలోకించి యత్తపోధనుండు. 202

ఏ నొల్లఁ గాక భస్మము, గా నిన్నుం జూతునే వికారీ యనుచుం

దా నెదురుపలుక కంతర్ధానము వెసఁ జేసె నతఁడు ధరణీనాథా. 203

వ. తదనంతరంబ విపులుండు రుచిం బ్రబుద్ధం జేసెఁ బదంపడి దేవశర్మ వచ్చిన నా శిష్యోత్తముండు వినయాచారంబు నడపి యేకాంతంబున నమ్మునితోడ. 204

తే. నాకపతి యిచ్చటికి వచ్చె నాకతమున, జిక్కువడి మది భయమును సిగ్గు గదురఁ
జనియె ననవుడు నాతఁడు సంతసిల్లి, యభిమతం బగువర మిచ్చె నధిపవర్య. 205

వ. ఇచ్చినం బ్రీతుండై యవ్విపులుండు విపులతపం బాచరించె దేవశర్మయును దేవేంద్రువలనిశంక దక్కి సుఖం బుండె నొక్కనాఁ డయ్యాశ్రమంబు చక్కటిపడల దేవాంగన యొత్తు వోవ దానిచేతనుండి ప్రిదిలి భూరిపుష్పదామంబు. 206

ఆ. దివ్యపరిమళంబు నవ్యవికాసంబు, నుల్లసిల్ల వచ్చి యుర్విఁ బడినఁ
గాంచి రుచి యుదీర్ణకౌతుకచిత్తయై, దానిఁ బుచ్చికొనియె మానవేంద్ర.

వ. తదవసరంబున సంగాధీశ్వరుం డగు చిత్రరథుం డయ్యాశ్రమంబున కరుగుదెంచె నతని దేవియు రుచియుం దోడంబుట్టువు లగుటం జేసి నిజగృహంబున సంగలిగిన యుత్సవంబున కతండు రుచిసహితంబుగా దేవశర్మం బ్రార్థించి పిలిచినఁ జంపానగరంబున కరుగుచుండి రుచి గైసేసి యద్దివ్యకుసుమదామంబునం గేశకలాపం బలంకరించి కొనినం దత్సమాగమ సమాచారంబు నడపి తద్భగిని తదీయకుసుమపరిమళంబునకు నచ్చెరు వంది. 208

ఆ. ఇట్టిసౌరభంబు నెన్నఁడు నెఱుఁగ నీ, పువ్వు లెచటఁ గలిగెఁ బువ్వుఁబోఁడి
యనినఁ గలిగె నస్మదాశ్రమంబున నని, పలికి దేవశర్మ పాలి కరిగి. 209

వ. రుచి యప్పువ్వులకుం దనచెలియలు వేడుకపడుట యెఱింగించిన నమ్మహానుభావుండు విపులు రావించి యత్తెఱంగు దేటపడం బలికి యిట్టికుసుమంబులు గొని రావలయు నని పలికిన నతం డప్పువ్వులు గనినచోటు రుచి నడిగి చెప్పించికొని గురుప్రభావంబును నిజతపశ్శక్తియు నూఁది యప్పని పూని చనియె దైవికం బయి యచ్చట నెప్పటిచందంబు పుష్పదామం బున్నం బుచ్చికొని వచ్చునప్పు డొక్కయెడ నారీపురుషు లొండొరులచేతులు పట్టికొని చక్రభ్రమణభంగిఁ దిరుగుచుండి యొకళ్లొకళ్లగతి యొప్ప దని పలికి కాలుదొడరితి కడువేగ తిరిగి తనవివాదంబు పుట్టి యం దొకండే నట్లు సేసితి నేని పరలోకంబున విపులునిచన్నగతిం జనుదు నని శపథంబు సేసిన నమ్మాట వినుచు విపులుం డట సనం జన మఱియు మార్గంబున నార్వురు జూదం బాడుచుండ నా దైన నొకం డట్ల యొట్టిడిన నప్పలుకు నాకర్ణించి యత్తపోధనుండు చిత్తంబున విషాదంబు గదుర నే నేమిదోషంబు సేసితినో యని విచారించి రుచి శరీరంబునందుఁ బ్రవేశించుట గురునకు నెఱింగింపమిగా నోపు నని తలంచుచు నరుగుదెంచి యక్కుసుమమాలిక యొప్పించినం గైకొని యమ్మునివరుండు మఱఁదలి కొసంగి సంతోషం బాలుంచెఁ దదనంతరంబ తమ యుంత నున్నయవసరంబున నగ్గురుం డా శిష్యునితో ని ట్లనియె. 210

క. తెరువున నొకమిథునము మ్రాదరులను గనుఁగొంటి నీ వనఘ ధర్మము నీయం
దరసి కనినవారై పలికిరి వారల నెఱుఁగుదే యకల్పితచరితా. 212

తే. నీవు రుచిఁ గాచు నప్పటినిపుణవృత్తి, నాకు నెఱిఁగింపకునికి యన్యాయము గద
లంచిరో కాక దానిఁ గల్మషముగాఁగ, నేను దలఁచిన శాపమిా నెట్లు నీకు.

వ. అప్పని పాపంబు గాకుండ వరం బిచ్చితి నది మఱవు మమ్మిథునంబు బహోరా
త్రంబు లయ్యె ఋతువు లని పలికిన గురునిబోధంబునకు నాశ్చర్యంబును
బ్రసాదంబునకుఁ బ్రమోదంబునుం బొందుశిష్యునితో నతండు వెండియు. 213

తే. దినము రాత్రియు ఋతువులు మనుజచేయు
సుకృతమును దుష్కృతంబును జూచుచుండుఁ
గాన యెంతరహస్యంపుఁ గార్యమైన
నోరు లెఱుంగరు నన్నని యునికి మోస. 214

వ. అని మఱియును. 215

క. స్త్రీకతిసూక్ష్మ విద్యా వ, శ్లీరూపున నైన వంశహీనత మమ్మం
జేరక యుండం దగఁ బరిహారము సేసి తడి యేల యవగుణ మయ్యెన్. 216

వ. దాని తెఱంగు నా కెఱింగింపకున్న నేమి యనుపలుకు వలికి దేవశర్మ విపులు
నుల్లం బూఱడిల్లం జేసె నవ్వధూవరులును విపులుండును బుణ్యలోకంబులు వడసిరి
పాండవాగ్రజా తెఱవల తెఱం గెఱింగించితి వారి రక్షించుట యిట్టిది యై
యుండు నని చెప్పి భీష్ముండు. 217

క. పలువురు క్రీడింతురు భూ, వలయాధిప యరయ మంచివారును గలర
కులధర్మవతులకతమున, నిల నిరపాయత్వ మొందు నెసకం బెసఁగన్. 218

క. పాతివ్రత్యము గలిగిన, నాతి యనఁగ దైవమన జగనస్తుత వేత్తే
యాతతధర్మార్థసుఖ, ఖ్యాతులు సద్భార్యవలనఁ గాదే కలుగున్. 219

భీష్ముఁడు ధర్మజునకు గాంధర్వాదివివాహంబుల తెఱఁ గెఱింగించుట.

వ. అనిన విని యజ్ఞపతి జాహ్నవీనందనుతోఁ గన్యావరణప్రకారంబు విచారణీయం
బైనకృత్యంబు దాని తెఱం గెఱింగింపవే యనుటయు నతం డతని కిట్లనియె. 220

క. కులమును శీలము విద్యయుఁ, గలవానిం బిలిచి ప్రీతిఁ గన్నియ నీఁగా
వలయు నుదకప్రదానా, కలితంబుగ బ్రాహ్మకర్మగతి యిది యధిపా. 221

ఆ. క్షాత్త్ర మండ్రు బుధులు కన్యవుగుఘుఁ గోర. నతఁడుఁ గన్యమీఁద నాసనేయు
నచల మగుపరస్పరానురాగము గని, ప్రమద మెసఁగఁ జేయుపరిణయంబు. 222

క. కన్నును మనంబును దనిసినఁ, గన్నియ యెవ్వానిఁ గోరు గాంధర్వం బా
యన్న నతని కిచ్చుట వెల, వన్నట యాసురము నూవె భోగవముఖ్యా. 223

క. బలిమిమెయి వరుఁడు గన్నకుఁ, గలవారిం బాధించి కరము క్రౌర్యంబున న

ప్రాలంతుక దుఃఖింపఁగ వ్రారలు పోగులఁగఁ దెచ్చికొనుట § రాక్షసము నృపా. 225

వ. ఇట్లు సెప్పంబడునట్టి.

ఆ. అయిదు దెఱఁగులందు § నారయ మూఁడువిధములు ధర్మ్యకృతులు § ధర్మపు త్రి
యాసురంబు రాక్షసప్రాయంబును ధర్మ, దూరసంవిధాన § దూషితములు. 226

తే. మాతృపితృహీన మైనను § భ్రాతృరహిత, భావ మొందిన నబ్బాల § పరిణయార్థ
వరణమున కర్హ గా దని § కురుకులాగ్ర, గణ్య చెప్పుదురు పరిణయ § కల్పవిదులు. 227

ఆ. ఆత్మజాతియందు § నవులజాతులు రెంటఁ, గ్రమవివాహ మొప్పు § బ్రాహ్మణునకు
ననఘ శూద్రవనిత § యందు నాతని కపత్యంబు గలిగిన పాప § మనియెఁ గలదు.

తే. రాజునకు రాజవంశజ § రమణి యైన
వెనుక వైశ్య వరించుట § విహితవిధము
వైశ్యునకు శూద్రునకుఁ దమ § వంశములన
పరిణయంబు గాఁదగు నర § పాలవర్య. 229

వ. రాజునకు వైశ్యునకును శూద్ర కన్యావరణంబు సేయుటయును గలిగి యుండు నని
చెప్పిన విని యక్కౌంతేయాగ్రజుండు శాంతనవులో బ్రాహ్మణునకు శూద్రజాతి
యందు భార్యాపరిగ్రహంబు సేయందగు నని విందు నతనికి భార్యలు మువ్వురని
నిర్దేశించితి రది యెట్లొకో యనుటయు నతం డమ్మహీపతి కిట్లనియె. 230

ఆ. అనఘ విషమ మైన § యట్టికార్యంబు వ్రాటిలినఁ జూచి పెద్ద § వలచి యైన
లోభమునను శూద్రఁ § దా భార్యఁగాఁగొను, విప్రుఁ డధికపాప § వృత్తిగామి. 231

వ. అవ్విధంబు నొక్కొక్క యెడం గల్గి దూష్యంబు గాక చెల్లు నని చెప్పి వెండియు.

క. ధరణీసురరాజవణి, క్తరుణులకును విప్రువలనఁ § గల్గినతనయుల్
కురునాథా ద్విజు లనఁగాఁ, బరఁగుదు రది లేదు శూద్ర § భామాసుతులకున్. 233

వ. అనవుడు ధర్మపుత్త్రుండు భూసురునివలన నాలుగుజాతుల నాతులకును బ్రమాతు
లైన సుతులకు నతనిధనంబునందు భాగం బె ట్లుండు నని యడిగిన. 234

సీ. విను జనమేజయ § మనుజేంద్ర యమ్మేది
నీశ్వరుతో భీష్ముఁ § డిట్టు లనియె
బ్రాహ్మణునర్థంబు § పదిపాళ్లుగాఁ జేయ
నాలుగు బ్రాహ్మణీ § నందనుండు
క్షత్త్రియాత్మజుఁడు భా § గములు మూఁడును వైశ్య
తనయుండు రెండు శూ § ద్రాతనూజుఁ
డొకపాలు గొనుటకు § నొడయులు దుదివాఁడు
వలచి పెట్టఁగఁ గొను § వాఁడు గాని

ఆ. తండ్రితోడఁ ద్రివిధ § తనయులతోడను, దనదుభాగమునకుఁ § దెనఁగి కొనఁగఁ
దగదు వారలకును § దగదు నిర్దయులఁ ద, ద్దశమభాగ మీక § తారకుడువ. 235

తే. వెండ్రుకలయుం దనుష్ఠానవితతి దోఁక
ధర్ముఁ డస్థుల సూర్యుండు చర్మమునఁ ద
పంబు సిద్ధి తేజము సంధిపట్ల సిద్ధు
లునికి గలదట గోవు సేమనఁగ వచ్చు. 60

వ. మఱియు నొక్కటి యక్కజం బగునది గోమహానుభావప్రకటం బయినయితి
హాసంబు సెప్పెద వినుము. 61

సుమిత్రుఁ డనుమునిచేఁ బోషింపఁబడినగోవుల ప్రభావము.

తే. త్రిశిఖరం బనుపేరిధాత్రీధరము నుపాంతమున రుద్రకల్పితంబై నకూల
హాభిధానకల్లోలిని శోభితోపకంఠ మై యొప్పుఁ దత్తీరకాననమున. 62

వ. భృగువంశసంభవులగుసంయమీశ్వరులు గొంద ఱాశ్రమంబులు గావించుకొని
తపఃపరులై యుండుదు రందు సుమిత్త్రుం డనుపేరం బరఁగి పరమాచార
భవ్యుం డగునొక్క భార్గవునకు నంగిరసుం డనునొక్క మహాద్విజుండు సఖ్యంబు
నను సౌజన్యంబునను గోశర్కర యొసంగిన నమ్ముని తనగోవు నత్యావధి
మేపి పోషించిన నది సుపుష్టయు సుస్వరయు సురూపయు నై యొక్కవృషభంబు
పొందు వడసి గర్భిణి యై మిథునంబు నీనిన. 63

క. అమ్మిథునము బహుసంతా, నమ్మయ్యెం బెరిఁగి క్రమమునను గోనిచయం
బిమ్మెయిఁ బెక్కుసహస్రము, లమ్మునికిం గల్గె గోవు లతఁడును వానిన్. 64

తే. వేడ్కఁ జూచుచు నెప్పుడు వెనుకఁ దిరిగి
మేపు నీరును గలచోటి కోపి వెలిచి
పాలు గ్రేపులు గుడువ నప్రమదుఁ డగుచుఁ
దాను గోస్తనఫేనంబు ద్రావి యుండు. 65

క. దానఁ జేసి యతనికిన్, ఫేనపుఁ డనునామ మెసఁగెఁ బ్రియమున మునిస
మ్మానితుఁ డగుగౌతముఁ డి, ట్లా నిర్మలబుద్ధి గోసమారాధకుఁ డై. 66

వ. వర్తిల్లుచుండ నొక్కనాఁడు కామరూపిణు లగుగోవులు గొన్ని కాంతాకారం
బులు గైకొని కమనీయం బగుకొలన జలక్రీడలు సలుపుచుండఁ దోడిధేనువు
లచ్చట తొలంగి కనుంగొని మీ రెవ్వ రని మానుషభాషణంబుల నడిగిన
నయ్యంగనాజనంబులు. 67

తే. ఏము గోవుల మనవుడు నిట్టియద్భు, తానుభావంబు మీ కెట్టు లావహిల్లె
ననిన విని వానితోడ నయ్యతివ లిట్టు, లనిరి మా తెఱఁ గేర్పడ వినుఁడు మీరు.

వ. హవ్యకవ్యంబులకు నతిథిపూజనంబులకు నిజాహారంబులకు సద్ద్విజావలి సంతో
షింప నింపారుపాలు వారికిం గురియుదుము కృషిక్రియాసర్వనిర్వర్తనంబులకు
మాపుత్త్రులం బనుతుము మాసుకృతంబుల నిర్విశేషంబులు గలిగి మాకును గోలో
కంబు సులభంబు మీ రాసుకర్మంబులు సూచి యసూయ సేయుదురు గావున. 69

క. క్రేవులు దోరా దుర్గతిఁ, బ్రాపింపఁగలార యిట్టి భావిచరితము
దీపితబోధమునం గని, మీపై కృపఁ జెప్పవలసె మీకుం దెలియన్. 70

వ. అనుటయు నగ్గోవులు దీనాననలై. 71

క. గోవులకును గోవులు గతి, గావున మీ రరసి సుగతి గలుగు తెరువు మా
కేవిధి నైనను జెప్పంగా వలదే యనిన నట్ల కాకని వారల్. 72

తే. రంతిదేవుండు వేవత్సరములు సేయు
నధ్వరమునకు బశువులై యరుగఁ డతఁడు
విశసనము సేయ గోలోకవిభవ మొందఁ
గాంతు రని నమ్మి బల్కిన సంతసిల్లి. 73

సీ. అగ్గోవు లవ్విభునధ్వరంబునకుఁ బోఁ, నుత్సహించుటయు నం దొకట గోవు
మనము సుమిత్రుసిద్ధన మాతఁ డనుమతి, సేయక యెట్లు వోఁ జెల్లు ననిన
నాతనిఁ జంపుద మతఁడును గోలోకమున కేఁగుదెంచుఁగా కని కడంగి
చని మునిఁ జేతి చూకడను జాల కంతంత, నతిభీతిఁ గ్రమ్మఱి యరుగుటయును

తే. గొన్ని కపిలధేనువులతిక్రూర చిత్త, లేము వధియించెదము మాకు నేమి మేలు
సేయువారలు దగ మీరు సెప్పఁ డనిన, నన్ని మొదవులు నేకవాక్యత్వ మొంది.

ఆ. సకలవర్ణ ధేనుసమితికి నెల్లనుఁ, గపిలగోవు శ్రేష్ఠ గాఁగఁ గపిల
నీకి గోశతంబు నిచ్చినయట్లుగా, వరము మీకు నిచ్చువార మనియె. 75

వ. అనిన విని కరంబు ప్రియంబునం గామరూపిణులైన యగ్గోవులు రూపాంతరం
బులు గైకొని యా భృగువంశవర్యుపాలికిం బోయి యేము గోమాతలము నీ దగు
గోసమారాధనంబునకు మెచ్చి వరం బిచ్చువార మై వచ్చితి మిష్టం బెయ్యది
యడుగు మనుటయు నమ్మౌని యిప్పటియట్ల యెల్లప్పుడును గోవులవలన భక్తి
స్నేహంబులు గలుగ నిం డనియె నమ్మాటకు నవి యట్ల యయ్యెడుఁగాక యని
పలికి వెండియు ని ట్లనియె. 76

క. ఈ లోకం బేటికి మన, గోలోకంబునకు రమ్ము కులవర యనుడుం
జాలుదునే మద్ఘోర, త్నాలి విడిచి యోడు రాక కని ముని వల్కెన్. 77

క. విని యా ధేనువు లాతని,తను వాకసమునకు నెత్తి తమ యోగబలం
బునఁ జైతన్యముఁ బాపి య,వనిమీఁదఁ గళేబరంబు వైచి రయమునన్. 78

క. కొమ్ములఁ గాళ్లం బెండిగఁ, గ్రుమ్మి మగిడి పోయి పూస గ్రుచ్చినగతి మూర్ఛ
దమ్మాం బడిచినగోవులఁ, నమ్మని తెలఁ గొల్లఁ జెప్పి హర్ష మొనర్చెన్. 79

వ. గోలోకంబునకు ముఖ్య లగు గోమాత లంతయు నెఱింగి తమకడకుం జనుదెంచిన
సుమిత్రుని నాదరించి సుదతులై విహరించినగోవులు మొదలు గా సకలగోవుల
తెఱంగు నతని కెఱింగించి యిను విది సేల కాక యని పలికి యతనిం బ్రీతునిం

జేసి బ్రహ్మఘాతుక లయినయన్నిగోవులకును మీవంశం బసుదివదనం బయ్యెడు
మని శాపం బిచ్చిన నాధేనువులు రంతిదేవునికడకుం బోయి సుగతి వేఁడి తమ్ముం
బశువులుగా విశసింపు మని మానుషభాషణంబులం బ్రార్థించుటయు. 80

క. మిమ్ముం దెగఁ జూచి సద్గతి, కెమ్మెయిఁ బోవంగ నేర్తుఁ ✽ నే నని వినయా
ర్ద్రిమ్ముగ మ్రొక్కుచుఁ బలికిన, నమ్మానవపతికి నిట్లు ✽ లను నగ్గోవుల్. 81

క. జ్ఞానుల యీపనికై నినుఁ, గానఁగఁ బుత్తెంచి రట్లు ✽ గావున సుమనో
మానితగతి నీకును నగు, భానునిభా నీయశంబుఁ ✽ బరఁగు జగములన్. 82

క. నావుడు మీలోపల నొక, గోవైనను మోహవశతఁ ✽ గూయిటయు మఖం
బావేళఁ బరిసమాప్తము, గావలయును విభుఁడు సమయ ✽ కల్పన దెలియన్. 83

క. అని యవ్విభుండు పలికిన, విని గోవులు సమ్మతింప ✽ విశసించుచు వే
ల్చె నతఁడు యజ్ఞానలమున, ననేకగోచయములం ✽ గ్రమాకలనమునన్. 84

క. ఒకనాఁడు గో వొకటి, లేఁగకుఁ జన్నిచ్చుచును దానిఁ ✽ గనుఁగొని నీ విం
కకటా యెక్కడఁ జేరెద, వశ్రువులు వచ్చెద్దరు సంప ✽ నని వల్కుటయున్. 85

గోవులు రంతిదేవుని యజ్ఞపశువులై గోలోకంబునకుఁ బోవుట.

వ. మహానుభావుఁడు గావున నప్పలుకులు విని రంతిదేవుం డయ్యాగంబు సుప్రయో
గంబుగా సమాప్తంబు గావించెఁ గొన్ని గోవులు గడమవడి పుడమిన నిలిచె నధ్వ
రోపయోగంబు వడసినగోగణంబులు గోలోకంబునకుం బ్రమోదంబునం బోయెఁ
దదీయచర్మాస్థిశ్రేణులు తటంబులై తనరం బ్రభూతరక్తమేదఃక్లేదంబు లేఱై
పాఱె చర్మణ్వతి యను పేరం బరఁగె నా రంతిదేవభూపతి యును యజ్ఞసమృద్ధుండై
వృద్ధశ్రవునితోడిసఖ్యంబునం బొలిచి యక్షయనాకంబున సుశ్లోకుండై యుండె
ఫేనపాఖ్యుండను గోలోకంబున శాశ్వతుండై వసించె నని చెప్పి భీష్ముండు
వెండియు. 86

సీ. మానవనాథ యీఫేనపాఖ్యానంబు, బదరికాశ్రమమున ✽ బాదరాయ
ణుఁడు ప్రీతి నారాయణునకుఁ జెప్పిన, నమ్మహాత్ముఁడు గోయజనార్థియగుచు
నిది గొనియాడంగ ✽ విదితమై జగమునఁ, బరఁగెఁ బుణ్యతమంబు ✽ పావనంబు
దీనిఁ బఠించిన ✽ వినఁ దలంచిన, దురితవర్గంబులఁ ✽ బొరయ వలదు

తే. పూరునృపకులభూషణ ✽ పూతచరిత, నీవు నతిభక్తి గలుగుము ✽ గోవులందుఁ
బరమనియతి నీశంత్రంబు ✽ పఠనవిధియు, నేతదాకర్ణనంబును నెపుడుఁ జలుపు.

క. అనిన విని యట్లు చేసెద, ననఘా గోమహిమ యిట్టు ✽ లాకర్ణింపం
గనియెడు దనివి సనదు నా, మన మింకను జెప్పు నీవిమలవాక్యములన్. 88

క. అని ధర్మతనయుఁ డడిగిన, ననయంబుఁ బ్రియంబుఁ బొంది ✽ యమరనదీనం
దనుఁ డిట్లను సత్యవతీ, తనయునివాక్యములు సెప్పెదను వినుము నృపా. 89

ఆ. గోవిశేష మర్థి ✽ నీవు న న్నడిగిన, యట్లు శుకుఁడు దండ్రి ✽ నడిగె దాని

కాత్మఁ బ్రియముఁ బొంది ♦ యామహాసంయమి, యానుబుద్ధి ♦ కిట్టులని యె నధిప.

సీ. స్థావరజంగమాత్మక మైనభూతజా,తంబుసుస్థితి గోగణంబునాశ్ర
యమునన తత్సంభవమును గోవులయంద, యవి మూలసంతానమజున కట్లు
గాక సిద్ధులసాధ్యగణములమాత లి,ట్లగుట మొలఁగినయట్లేదు బ్రహ్మ
లోకగోలోకాదిక[1]లోకాంతరములకుఁ, దనయింటి కరుగుచందమున నరుగుఁ

తే. బరమగతిఁ గోరువారలు ♦ పాదముష్టి,యష్టివాక్పిత్తముల గోవు నభిభవింప
కుండ వలయు నివ్విధ్యఁ బద్మోద్భవుండు, సెప్పె నది యాత్మపావనశిష్టసేవ్య. 91

క. పావన మని శ్రుతి సెప్పిన, దేవస్తుతు నాశ్రయించి ♦ యెక్కుడయిరి భూ
దేవులకు సురలట్టిది, గోవు తదీయ మగుమహిమకును గుఱి గలదే. 92

క. వీణాకాహళవేణు, క్వాణప్రతిమములు ధేనువర్గధ్వాను ల
క్షీణసుకృతంబు నిర్మల, వాణి తదాకర్ణనంబు ♦ వర్ణనవిధమున్. 93

క. క్షీరము దధియును ఘృతము సు,ధారూపము లగుట దేవతాప్రీణనయ
జ్ఞారంభంబులు విమలా,చారా గోదోహనైకసాధ్యము లయ్యెన్. 94

ఆ. శ్రుతులు నాపనిషదనూక్తులు గోస్వరూ,పంబు లని సరోజభవుఁడు సెప్పె
ధర్మపరత పరమతపము మహాధ్వర, మనఁగఁ బరఁగు గోసమర్చనంబు. 95

క. ఈ వాక్యంబులు భూదే,వావలిసన్నిధిఁ బఠించునాతఁడు పుణ్యుం
డై వెలయు విన్నవారలు, పావనగుణ తత్క్షణంబ ♦ పాతు రఘములన్. 96

తే. గోఘృతంబు ప్రాశించియు ♦ గోకరీష
సువిహితస్నానుఁ డయ్యు భూసదివిజుఁ డధిక
భక్తినిత్యంబు గోమతీజపరస మాచ
రించియును గల్మషముల నిర్జించు ననఘ. 97

చ. అసమిషులైన మహామునులు ♦ నయ్యుయి పెంపులు గోమతిం బఠిం
చినసుకృతంబునం గసిరి ♦ శ్రీయును శత్రుజయంబుఁ బేర్మియుం
దనయసమృద్ధియుం గలుగుఁ ♦ దత్పఠనంబున బంధుకోటి బం
ధనమునఁ బాయు మార్గమునఁ ♦ దప్పు మృగార్తియుఁ జోరబాధయున్. 98

వ. అనిన విని యమ్మునిపతికి శుకుం డిట్లనియె. 99

వేదవ్యాసముని శుకునకుఁ జెప్పినకపిలగోమహానుభావము

క. తమజాతికిఁ దగుకర్మ, క్షమతలు లేకున్నయట్టిజనములు కపిలా
సమధికపూజనతద్దానములు లోపరింతు రవి వాచు ♦ నాదురితములన్. 100

సీ. అనఘయు సందియము ♦ బది యేల కపిలఁ బూజించినఁ బ్రీతి నిచ్చినను జెడని
యఘములు లేఁ గల్గునే ♦ యనుచు మెఁ బరాశరతనయు, డవ్వాక్యంబు ♦ విని తదీయ
తనయునకు కపిల కంతటి పెంపు రాఁ గతం, బేమి నావుడు నమ్మునీశ్వరుండు.

1. క. లోకోత్తరములకు

విను మని యిట్లను § ననిమిషసంఘంబు, శోకకారణమునఁ బొక్కవఁడుకు మొఱఁగి

ఆ. యరిగి తనడుగుత్తి § యర్థించి గోవుల, నాశ్రయించె నవియుననగ్నిగోప
నంబు సేసె నవ్విధంబున శిఖయున్కి, సుర లెఱింగి రెల్లచోటు నరసి. 101

వ. ఎఱింగి కూడుకొని గోవులకడకు వచ్చి వానిలో నగ్ని డాఁచుట యఖిలజగజ్జనం
బులకు నహితంబు సేయుట గాదె చూపకుండుట దగ దని పలుకుటయు బుధు
లోడ్ గోవు లప్పావకుం జూపిన నాసుపర్వులు సంతోషించి వానికి వరంబీవలయు
నని యవ్వాయుసఖుం బ్రార్థించిన నతండు దా నగ్గోవులయందు డాఁగియుండనవి
కపిలచ్ఛాయుం బ్రాపించి యునికిం గనుంగొని గోవుల కెల్లను గపిల యొక్కఁడగు
టయుం దదీయారాధనంబునుం దద్దానంబునుం బుణ్యతమంబులై దురితంబుల
దమియించి యుత్తమలోకంబుల నిచ్చుటయు వరంబులుగా నిచ్చె నని చెప్పి 102
వెండియు.

తే. కపిల యిచ్చినవానిన § కాదు నిజము, కొన్నవానిని బుణ్యాత్మకునిఁగఁ జేయు
నీవుఁ గపిలాసమర్చనాసక్తమాన, సుండవగు మెంతయును మేలుకను వ్రతాత్మ.

వ. అని చెప్పుటయు నప్పరమమునీశ్వరుతో నమ్మనికుమారవరుండు కపిలాలక్షణం 104
బెఱింగింపవే యనిన నతం డతని కిట్లనియె.

తే. కర్ణశృంగాక్షిఖురనాసికాపుటములు
కపిలములు గుత్తుకయును ముష్కములు గవిల
[1]పట్టు లొండు నెం డే నొకపట్టు కపిల
యైన గపిలాత్వగుణమున § కదియు చాలు. 105

క. మే నెల్లఁ గపిల యైనను, దానిం జెప్పంగ నేల § తగము కపిలలన్
మానితగుణ పిదికి కుడువఁ, గా[2]చి నేబలి కైనఁగాక § కట్టఁ బెఱికెకునన్. 106

ఆ. కాలఁ గేలఁ గోలఁ గపిల దండించిన, నరకవాసమునకు § నరుగవలయుఁ
బూరి నీరు లెస్స § యారసి యగ్గోవు, సత్కరింప సుగతిసంభవించు. 107

క. అనఘ కపిలాప్రదానంబునకు ఫలం బిట్టి దనఁగ § బోలునె కమలా
సనుఁడు మహానందప్రద, మని పొగడుచుఁ జెప్ప దానికనట యేమందున్. 108
109

వ. అని వెండియు.

క. వసుధామరగాయత్రీవసంతములు సత్యగోసువర్ణంబులు నే
కసముద్భవంబు లని తాపసవర్యులచేత విందుఁ § బావనచరితా. 110

క. కావున భూమియుఁ గనకము, గోవును దానార్హవస్తుకోటికి నెల్లన్
ధీవినుతా యొక్కఁడగుట, నీకడులోదాత్తబుద్ధి § నెలవుగొలుపుమీ. 111

క. అని మునిపతి సెప్పినఁ ద, త్తనయుఁడు ప్రియ మందె ననఘ § ధర్మసుతుం డే
విని యుందుదు సిరి గోమయమున నుండుట దాని కెట్టి § మూలం బనుడునో.

1. చ. పట్టు లెండు కేశయుఁ డొకపట్టు. 2. చ. జ. సపరికైనఁ గాచిన(లు) బెడెడన్.

## — గో శ్రీసంవాదము —

వ. అనుటయు గాంగేయుండు గోశ్రీసంవాదం బనుసితిహాసంబు విను మయ్యర్థంబు దేటపడు నని పలికి యిట్లనియె. 113

సీ. సిరి ధేనువులలోని కరిగిన నెవ్వత, వని యవి యడిగిన నమ్మహాత్మ
శ్రీ నేను మీలో వసియింపఁగా వచ్చితి, ననవుడుఁ జంచల వైన నిన్ను
నొల్లము మాలోన నునుపఁగా ననియె నగ్గోవులు దాని కద్దేవి వగచి
యేను బాసిన సర్వదానవకులముఁ గీడ్పడియెఁ బొందినసురల్ ప్రభుతనొంది

తే. నేను వచ్చుట గోరి కాదే తపంబు, లాచరింతురు నన్నట్టు లభిభవించు
టుచిత మీకన్న నధునివ మొల్ల మనుట, యభిభవము నీకుఁ బోలిన యచటికరుగు.

క. అని గోవులు పలికిన సిరి, విని మీచే నిట్లు పరిభవింపఁగఁబడి యేఁ
జనిన నను నెవ్వరును గైకొనరు శరణ మగుఁడు వేఁడెదఁ గొసరెద మిమ్మున్. 115

తే. మీసమీపమునం దుండి మేలు దాని, నిందు నా కని యడిగిన నంతయేని
నాదరంబున నగ్గోవు లంతవట్టుఁ, గూడి యిట్లను లక్ష్మికిఁ గురువరేణ్య. 116

క. మామూత్రపురీషంబులు, భామా వేదంబు లెఱుఁగు పావనములు నీ
వీమేలివస్తువులు ప్రియ, ధామములై యుండు మింపు దలకొన మాకున్. 117

తే. అనుటయును సిరి నాదుపుణ్యమునఁ జేసి
కంటిఁ బడయుంగ మీయనుగ్రహము ననుచు
నట్లు వసియించె నిది గోమయప్రభావ
మూల మిట్టిది గోవుల మోఘమహిమ. 118

వ. మఱియు నొక్కవిశేషంబు సెప్పెద నాకర్ణింపుము. 119

ఆ. సురభి తపము సేయ సరసిజాసనుఁడు ప్రత్యక్షమై మనోరథంబు సెప్పు
మిచ్చు కౌతుకమున వచ్చితి ననవుడు, నిట్టు లనియె నది మహీశవర్య. 120

క. మీ రిట్లు ప్రసన్నమూర్తి, గారవమున వచ్చినంతకంటెను మేలేఁ
గోరంగ వలయునట్టిది, కారుణిక ప్రథమగణ్య కలదే నాకున్. 121

వ. అనిన నత్యంతసంతుష్టస్వాంతుం డై సురజ్యేష్ఠుండు సురభిం జూచి సురలోకాది దివ్యలోకంబుల కెల్లను గోలోకంబు మీఁదుగా వరం బిత్తుంగాక యని తలంచి యవ్విశేషంబు మున్న తనవలన సిద్ధం బగుట సంస్మృతిగోచరం బగుటయు. 122

తే. గోవులకు మేలు సేయుంగఁ గోరు నాడు, చిత్తమున మద్వరంబున సిద్ధమైన
తెఱఁగ రొలసెదై వికమయి దీని పెంపు, యావహించెద నని యిచ్చె నవ్వరంబు.

క. వనరుహసంభవుఁ డట్లెల్లఁ గుసఁ దమలోకంబుకంటె గోలోకము స
జ్జనవినుతచరిత మీఁదై, యునికి వెలుఁగఁ జేసెనది మహోజ్జ్వల మయ్యెన్. 124

వ. అని చెప్పి. 125

క. గోవిషయవాక్యపఠనశ్రావణసంశ్రవణములు ధరావర యాయు
శ్శ్రీవిభవకీర్తిసుగతిసమావహములు తత్పరుండ కగు మిక్కిలి ఫలమ్. 126

వ. అనిన విని కౌంతేయాగ్రజుండు శాంతనవునతో మహాత్మా గోవులమాహాత్మ్యంబు చేటపడం బెక్కుభంగులం జెప్పి నన్నుం గృతార్థుం జేసితి సర్వయజ్ఞంబులందును దాతవ్యం బత్యంతంబు సువర్ణం బని యిందు వేదంబులు 'సువర్ణ దక్షిణ సేరిష్టై' యని చెప్పెదు భూమియు గోవులుఁ గాంచనంబును నీవిషయంబు లైనదానంబులు నుత్తమంబు లని వేదవ్యాసువచనంబులకలిమి నీవ చెప్పితి సువర్ణవిశేషంబు విన వలతుం జెప్పవే యనుటయు నతం డతని కిట్లనియె. 127

భీష్ముఁడు ధర్మరాజునకు సువర్ణదానమహిమాతిశయంబు సెప్పుట.

సీ. శంతనునృపతి లోకాంతరగతుఁ డైన, విను తదీయశ్రాద్ధకవిధి యొనర్పఁ
బూని గంగాద్వారకమున కేఁగి మాతల్లి, గంగ సాహాయ్యంబు కగాఁగ నమున
నాచరింపంగఁ గ్రియాకలాపం బెల్ల, నడపఁ బిండప్రదానంబుసమయ
మగుటయు దర్భవిన్యాస మొనర్పనం, దంగుళీయకకంకణాంగదములఁ

ఆ. గాంత మైనయొక్కకరము వొడమి యటు, చేయి సాఁచుటయును జిత్త మద్భు
తంబుఁ బొంద దానిఁ దప్పక చూచి యయ్యధిపు బాహు వగుట యెనాత్మ నెఱిఁగి.

క. జనకుఁడు వేడుకఁ జే సాఁచిన యంతన సంతసిల్లి చేతం బిండం
బనుమానింపక యీఁ బెట్టిన శాస్త్రవిధానగతి ఘటింపమి వచ్చున్. 129

తే. పితృకరంబునఁ బిండంబు పెట్టు మనదు
శాస్త్ర మంచిత మగుకుశాస్తరణమునన
పెట్టఁ జెప్పె న ట్లగుట నే బెట్టఁ జేత
నని మనంబునఁ దలఁచి వంచనము సేసి. 130

క. అమలం బగుకుశసంస్తరణమునం బిండంబు వెట్టినం దోఁచినహ
స్తము దృశ్యమయ్యె మత్పితృ,సమితిముదముమోదములం దెసఁగఁ బొడసూపెన్.

క. పొడసూపి ధర్మమార్గం, బెడపక నీ విట్లు పింరమిమికుటకు హర్షం
బడలినఁ జనుదెంచితి మొక్కుడుతృప్తిం బొందితిమి ప్రగుణ్యాచరిత్రా. 132

వ. అని పలికి వెండియు. 133

క. భూమికి గోవులకును నై, హేమ మికుట యస్మదీయహితమును దేవ
స్తోమప్రియమును బావన, తామహనీయంబుఁ జుమ్ము ధర్మవిధిజ్ఞా. 134

క. పావనము సువర్ణము వంశా,వలికిం దనసు నిర్మలత్వము నిచ్చున్
నీ వది యొసఁగి సకలయజ్ఞావసరములను సువర్ణపూజితము గుమీ. 135

క. అని చెప్పి చనిన నా దగు, మనము సువర్ణప్రదానమహిమ తెలియఁ ద
ద్వినుతానుష్ఠానపరత్వనిరూఢుఁడ నైతి నేను ధర్మతనూజా. 136

వ. అని పలికి యా భూవల్లభునితో భీష్ముండు వెండియు నిట్లను నిది యేను గనినది

సువర్ణదానంబుమహిమ మఱియును వినినదియునుం గల దాకర్ణింపుము. 137

సీ. పరశురాముఁడు గిన్క (నిరువదియొక్కమా, ఱదయుఁడై రాజుల (వెదకి వెదకి
వధియించి కృప పుట్టి వాజిమేధంబు ప్రాయశ్చిత్తముగఁ జేసి (యంతఁ దనివి
సనక వసిష్ఠాదిసంయమివరేణ్యులఁ గూర్చి, కల్మషపంకంబు (గడిగి పురుషు
నత్యంతవిమలుఁ జేయఁగ నెయ్యది యుపాయ, మనిన వసిష్ఠుఁడి (ట్లనియె నతని

ఆ. కనఘ విను సువర్ణ (మగ్నిమయంబు దేవతలు నగ్నిముఖుల (నతిశయిల్లు
వారు గావునను సువర్ణదానంబు దేవతల నీగియట్ల (శ్రుతులు సెప్పు. 138

క. కావున సువర్ణ మసదృశ,పావనతాస్పదము దాని (భక్తిమెయిన్ వి
ప్రావలి కిచ్చినయతనికిఁ, బావనతం గొఱఁత గలదె (పావనమూర్తీ. 139

వసిష్ఠుఁడు పరశురామునకుఁ జెప్పిన సువర్ణమహిమము.

వ. ఏను బ్రహ్మముఖంబున వినినది సువర్ణవిషయం బైనవిశేషం బొక్కటి యెఱింగిం
చెద నవహితుండ వై వినుమని పలికి యమ్మునిపతి యమ్మాహాత్మ్యం బిట్లనియె.

క. గిరిజయు గిరిశుఁడును నొం,డొరువులకై తప మొనర్చి (రొకట లోకశ్రీ
బెరయఁగ బడసి పరమసుఖ,భరితాత్మకు లైరి జగము (ప్రమదం బందన్. 141

వ. కొండొకకాలంబునకు నయ్యాదిమగృహస్థుని తేజం బాపరమగృహిణినిమిత్తంబుగా
రేతోధాతురూపంబునం బ్రస్కన్నం బై యమ్మహేశ్వరుమానసవృత్తిం జేసి యగ్ని
యందు నిలిచియుండ నత్తఱిం దారకుం డను నొకరక్కసుచేతం బెక్కువిధంబుల
బాధలం బడి యనిమిషులును మునులును గమలయోనిం గానం జని యద్దాన
వుండు దమ్ముం బఱచిన పాటెల్ల నెఱింగించిన నద్దేవుండు వారితో దీని నెఱింగి
యేను మున్న మీకు శోభనం బయ్యెడు తెఱంగు సమకట్టినవాఁడ మీ రగ్నినాశ్ర
యించి మాకు శుభంబు సేయవలయు నని సంప్రార్థనంబు సేయునది యతండు
కర్తవ్యం బెఱుంగు నరుగుం డని నియోగించిన సంతోషించి యట్ల చేసెద మని
యవ్విధాత వీడ్కొని వార లగ్నికడకుం బోవ నుత్సహించి. 142

సీ. అతని యున్నెడ (యారసికొని చను,నప్పుడాతండు నిద్రాతిశయము
నూని ప్రచ్ఛన్నుఁడై (యుండుట వారలు, గానక యున్నంతఁ (గప్పయొకటి
యగ్ని పాతాళంబునం దునికి యెఱిఁగింప, నప్పావకుఁడు దాఁగి (పిప్పలమున
కేఁగెను నెడ శాప (మిచ్చె జిహ్వాస్ఫూర్తి, లేక రసాలివివేక మెడలి

తే. యుండెడును గప్పలని బొక్క (లెండ నెండి
చచ్చియును నీరు వచ్చినఁ (జావు బొందకు
నేసి యెలుఁగులు సెలఁగఁగఁ (జెలఁగ వరము
వారు గప్పల కిచ్చి రనివార్యతేజ. 143

వ. ఇవ్విధంబున విబుధులు మునులు నమ్మండూకంబుల నుడువ విడిచి మఱియును.

క. అనలుని నన్వేషింపఁగ, వనగజ మొక్కండు రావి (వలను చతురతం

గను గీటి చూపవా రవ్వనస్పతిం జేరఁ జనఁగన్ వారనియులుకన్. 145

వ. అయ్యగ్నిదేవుండు గజంబులకు జిహ్వా దిరుగంబడ శపించుచు శమీగర్భనివాసి
యయ్యె నది మొదలుగా నగ్నికి శమీగర్భంబునం దుత్పత్తి గలిగె నద్దివిజులును
దాపసులును గజంబులు బ్రతీపజిహ్వంబు లయ్యును సర్వరసజ్ఞానంబు గలిగి మాన
నీయంబులగువరంబులం జేసి రాజితంబులగునట్లుగా ననుగ్రహించి యగ్గజంబువిషా
దంబు మాన్చి రంత నొక్క శుకం బెఱింగింప శమీగర్భంబున నగ్ని యునికి
యెఱింగి యందఱుం గ్రందుకొనం గడువేగంబునం బాదివికొనిన నిదురి సెకుట
కుంగోపించి. 146

ఆ. జిహ్వ మరలఁబడఁగన్ జిలుకల నగ్ని శపించె సురలు సెవులన్ గించునట్టి
పలుకు వాని కొసఁగిన్ జిలుక నానందింపఁ, జేసి యా కృశానున్ జేరఁజనిన. 147

వ. అతండు వారి నాలోకించి మీవచ్చినకార్యం బేమి యని యడిగిన వారుఁ దారక
దైత్యుచేయు బాధ లెఱింగించి వాఁ డేమియుపాయంబునం దెగటాఱు నత్తెఱం
గాపాదింపు మని నిన్నుం బ్రార్థింప వచ్చితి మని పలికి వెండియు. 148

క. మాకుం గుశలము గోరుము, నీకును, మే లివ్విధంబు న్నీదుమహిమ యీ
లోకంబు లెల్ల మనములఁ, జేకొని కీర్తించునట్లు న్సేయుము కరుణన్. 149

సీ. అనినఁ బ్రసన్నతన్ నట్టులు సేసెద, నూఱడుం డని వారి న్నూఱడించి
తనయందు వెలుఁగుశంభునివీర్యమిడిమె గం,గాగర్భరూపంబు న్గాఁగ నాలఁ
డది యతిపరివృద్ధన్ మగుటయు ధరియింప, నోర్వక నిర్జరపర్వతంబు
తటమున శరవణస్తంబుగా గంగ యుత్సృష్ట మొనర్ప నాశిఖరి సతరు

తే. వల్లరీగుల్మకమ్ముగ సువర్ణమయులు, వెలుఁగ బోలుఁ డై వెలిఁగె నన్వీరగర్భ
మచ్చటికి వచ్చికృత్తికలార్వురును మ,దీయపుత్రుఁ డనుచు నెత్తికొనిరనఘ.

వ. ఇత్తెఱంగున నొక్కట నెత్తికొనుటయు నప్కుమారుండు షణ్ముఖుండై యొక్క
పెట్ట సకలకృత్తికా స్తన్యపానం బాచరించె నట్లగ్నిసంభవగాంగేయ కార్తికేయ
త్వంబు లొందినయయ్యిందుమౌళి తేజంబు పదంపడి బ్రహ్మాది దేవతలు పూజింప
దేవసేనాధిపతిత్వంబునం జేర్చి యర్చితమహిత యయినమహాశక్తిం దారకుం బరి
మార్చి బృందారకమునిబృందంబుల కానందం బొనర్చె నని యిట్లప్పరమముని
పరశురామునకుం జెప్పి పురహరుం డగునప్పురుషుండు హిరణ్మయుం డగుటయు
నద్దేవదేవుండు దాన తనూభవుండై తోఁచుటయుం దథావిధరేతోధారణంబున
వహ్ని హిరణ్యాత్మకరేతోమూర్తియై హిరణ్యరేతుం డనం జనుటయు నతండు
తద్రేతఃఖలనంబునం దన్మయుం డగుటం జేసి పురహరునకు వహ్ని రేతుం డనునభి
ధానంబు గలుగుటయుం దేటపఱచి యవ్విధంబున రూపవంతం బైనది గావున
సువర్ణంబు జాతరూపనామకం బై పరఁగుటయు నెఱింగించి. 151

క. మహితాత్మక యేతాదృశ,మహిమంబు సువర్ణ మది సమంచిత తేజో

మహనీయము తద్దానము,మహత్త్వ మాశిష్టుఁడ మెఱుఁగు కమ్మా కుంభజుఁడన్.

వ. అవ్విశేషంబున నశేషకల్మషంబులం బాసి నరుండు విధూమకల్పంబున వెలుంగు నని యుపదేశించె నవ్వా 153
సిష్ఠమునివరు వచనంబు లాది యమరేంద్రాదరవర్ణనీయుం డై సువర్ణదానపరంపర లాచరించి.

క. ఆ రాముండు శుచిత్వ,శ్రీ రాజితుఁ డయ్యె నట్లు కావున నీవుం 154
గౌరవముఖ్యా యది భవ,పారావారఘనతరణసపాత్రము సుమ్మీ.

క. అని యనిమిషతటినీప్రియ,తనయుఁడు సెప్పుటయు ధర్మతనయుఁడు హృదయం 155
బునఁ బ్రమదము నిండార న,తని తో నతిభక్తివినయసంభాషుం బగుచున్.

వ. పితృయజ్ఞప్రకారం బెఱింగింపవే యనుటయు నక్కురువరుఁ డన్నరనాథున 156
కి ట్లనియె.

క. పితృపూజ సమగ్ర్యము దై,వతపూజనమునకు మనుజవల్లభ పితృదే 157
వతలఁ గొనియాడుదురు దే,వత లాదిగఁ గల్గునెల్ల వారును భక్తిన్.

వ. విశేషించి మనుష్యులకుఁ బితృసమారాధనంబు సర్వశుభసాధనంబు. 158

భీష్ముఁడు ధర్మజునకుఁ బితృపూజావిధానం బెఱింగించుట.

క. అమవసనమవసఁ బితృయజ్ఞముఁ దగఁ బిండప్రదానసహితముగా భ 159
క్తి మెయిం జేయునతఁడు ని,త్యముఁ జేసినవాఁడ యగుఁ బ్రశంసితచరితా.

వ. పితృయజ్ఞంబునకుఁ దిథివిశేషంబు సెప్పెద. 160

సీ. పాడ్యమిఁ బితృయజ్ఞపరుఁ డైనఁ జారుకాం,తాపతి విదియఁ గాంతలకుఁ దండ్రి
దదియను జవితిని గదా [1]వాజిధనకుండు, పశుభాగి పంచమి బహుసుతుండు
షష్ఠి [2]భానాత్ముండు సప్తమిఁ గృషిభాగి, యష్టమి వాణిజ్యపుష్టుఁ డిదు వసు
గజధర్మవిష్ణుదిక్తత్తిథులం దేక, శఫజంతువులును గోచయముఁ గుప్య

తే. ములును దగ బ్రహ్మవర్చస్విపుత్రికులును
ధనము గలవాఁడు విను చతుర్దశి రణైక
భాగి పున్నమ నమవస భవ్యసర్వ 161
కామ్యఫలభాగి యగుఁ జువ్వె కౌరవేంద్ర.

క. అపరం బగుపక్షంబును, నపరాహ్ణము మేలు పితృసమర్చనమున కా 162
ద్యపుఁదిథి దశమి చతుర్దశి, నృపవర యప్పక్షమునను నింద్యలఁ బొరయున్.

క. అనిన విని ధర్మనూనుం, డనఘా యెద్దానఁ బితృసమర్చన మొనరిం 163
చిన నధికఫలం బగు న,ద్దానిఁ దద్ద్రవ్యములఁ జెప్పవే తెలియంగన్.

వ. అనుటయు దేవవ్రతుం డతని కి ట్లనియె. 164

1. ఛ. పంచిజనకుండు 2 చ. హీనాత్ముఁడు. 3. చ. జ. దునక, ధర్మశివార్కచి త్తిజతిథు.

క. తిలపాయసఘృతములు పితృ, కలనములకు నుత్తమములు గవ్యంబు మహా
ఫల మొద్దిదైన మత్స్యాం, బులు మాంసము విహితవిధిఁ బ్రభూతఫలంబుల్. 165

తే. గొఱియనంజుకు ఖడ్గంబు నెఱిచి గంక, మృగమునందలి పలలంబు మేఁకమాంస
మొక్కటఁ దొరకటికి ఫలమునకు నెక్కుడండ్రు, పితృసమర్చనవిదులైన పెద్ద లధిప.

వ. నక్షత్రవిశేషం బాకర్ణింపుము. 167

సీ. [1]కార్తిఁ బైతృక మగుకర్మ మొనర్ప నిశ్చత్త్రిత రోహిణిఁ బుత్త్రలబ్ధి
శశితారకమున నోజఃప్రాప్తి యార్ద్రఁ గ్రూరపువర్తనము పునర్వసువునందుఁ
గృషిఫలోదయము మనిశమిషగురుతార సుపుష్టి యాశ్లేష నుత్కృష్టవీర
తనుజలాభము మఘఁ దనకులమున పెంపు, పుబ్బ సౌభాగ్యవిస్ఫూర్తిసిద్ధి

తే. యర్యముని తారఁ బెక్కుపశ్వత్యములపుట్టు, హస్తమునఁ గర్మసఫలత్వ మపుల తార
సుందరాకారయుతు లగుసుతులకనుట, యనిలతార వాణిజ్యవర్ధనము గలుగు.

సీ. వినుము విశాఖ సత్తనయబహుత్వ మ
నూరాధ రాజాధికార మైంద్ర
మునఁ బ్రభుత్వము పెంపు మూలఁ బూర్వాషాఢ
నారోగ్యమును నుత్తమాతిశయము
నుత్తరాషాఢ శోకోదయరహితత్వ
మభిజిత్తునందు విద్యాభియుక్తి
శ్రవణకాలమునఁ బరమగతిసిద్ధి ధ
నిష్ఠ రాజ్యము జలనిధిపతార

తే. మొదలుగాఁ దారకంబులు మూఁట నగద
కార్యఫలములు సదజావికములు గోవు
లవులమూఁటను గుప్యవృద్ధ్యశ్వకాయు
వులు శుచిశ్రాద్ధకర్తకుఁ గలుగు నధిప. 169

వ. అనిన నవ్వాడమితోఁ డప్పురుషవరునిం బితృపూజనంబులకుఁ బాత్రంబు లెట్టివిగా
వలయు నని యడిగిన నయ్యమరనదీనందనుం డిట్లనియె. 170

క. దైవికకృత్యంబులకును, భూవర భూసురుల నాత్మ్యముగ శోధింపం
గా వలదు గాని పితృపూ, జావిధికిఁ బరీక్ష వలయు సమ్యగ్భంగిన్. 171

వ. కావున నీ వడిగి మేలు సేసి తాకర్ణింపుము. 172

తే. [2](కులవయోరూపశీలవిద్యల నుదాత్తు, లనఁగఁ దగువారు పంక్తిపావనులు తద్గు
ణమ్ము లారయ లేనిజనములు పంక్తి, దూషకులు పైతృకమునకు దోషదూర.

వ. మఱియునుం బంక్తిదూషకులం జెప్పెద నాకర్ణింపుము.) 174

సీ. జూదరి గరదుండు వేదంబు సమువని, వాఁడు వడ్డికి నిచ్చువాఁడు గాయ

1. క. చ. కర్తి. 2. గ. ద్యుతిశయాయు. 3. ఈకుండలీకరణములోనిది కొన్నిప్రతులఁ గానిపించదు.

కుండు గ్రామము పనిగొనుచునాతఁడు గృహదాహి కుమతము గలతనువునాతఁ
డఱుఁ దెవుల్ గొన్నాతఁ డఖిలవస్తువులును, నమ్మెడునతఁడు సోమము మ్మ విక్ర
యించినయతఁ డబ్ధిసంచారలాభోపజీవకుం డుర్వీశసేవకుండు

తే. భార్యయును దాను బుత్త్రిలఁ బంచికొన్న
వాఁడు పసులఁ బెక్కిటి నేలుచు వాఁడు కపట
కృత్యముల ముచ్చుమిని శిల్పకృతుల బ్రదుకు 175
వారు పంక్తిదూషకు లండ్రు పౌరవేంద్ర. 176

వ. అని చెప్పి వెండియు.

క. తలఁ జీర సుట్టియును జెప్పులు దొడగియుఁ జేసినట్టి భోజనము ఫలం 177
బలఘుచరిత పద్మజుఁ డసురలభాగం బని విధించెఁ బ్రకటఫణితులన్.

తే. పలు దెఱంగుల వంటకంబులఁ బ్రమాద
జాతమై యశుచిత్వంబు సంభవించి
నప్పు డసురలు గొందురు క్రియాఫలంబుఁ 178
దిలలు పైఁ జల్ల నశుచిత దొలఁగు సండ్రు.

క. శాంతుఁడు సువ్రతశీలుఁడు, దాంతుం డధ్యాపకుండు దయగలవాఁడ 179
త్యంత ప్రబోధసంపన్నాంతుఁడు పావనులు భూపవర పంక్తులకున్.

క. వ్యాకరణధర్మశాస్త్రవివేకములుఁ బురాణజాతవేదిత్వము బ్ర 180
హ్మైకత్వబోధనము నధిపా కలిగినవారు పంక్తిపావనులు గదన్.

తే. మేలిగుణములు గనియును నరమిత్రజనము
శ్రాద్ధపాత్రంబుఁ జేయంగ జనదు మిత్ర
దత్తమైనది భస్మహుతంబుఁ జేట 181
నిడిన విత్తును బోలె నైచెను నృపాల.

క. మునుమట్ల నెఱిఁగి శ్రాద్ధంబునకుం గైకొనుట మేలు భూమిపునిం గై 182
కొని యరసి గాఁ డసిన నాతనియు మ్మలికంబు సెఱుచు ధార్మికు నైనన్.

క. ఈ తెఱఁగు లెల్ల నెఱిఁగి సునీతంబుగ శ్రాద్ధ మధికనియతి నడపుని
ర్ధూతమురితుండు నడచుఁ బ్రియాతిశయుం బెసఁగ దేవయానమున నృపా. 183

వ. అని చెప్పి శాంతవప్రుండు గాంతేయాగ్రజుతో మఱియు నిట్లను బ్రహ్మమానస
పుత్త్రుం డగు నత్రిమునీంద్రు వంశంబునకుం దొడవగు దత్తాత్రేయు నందనుండు
నిమినామధేయుం డగు సంయమికి సుతు శ్రీమంతుం డను పేరివాఁడు మృతుం 184
డగుటయు.

క. నిమి యక్కుమారునకు శ్రాద్ధము సేయుచు నుండి భక్తిఁ దలఁచిన గృప న
త్రిమునీంద్రుఁడు వచ్చి క్రియాపరిపాటీగుణము సేసె మది నెసఁగు నమ్మలితోన్.

వ. అట్లు పావక క్రియాకలాపం బనుసంధించి యా సంయమివరుండు. 186

సీ. ఒకతఱి మునివర్యులొక్కటఁ జెక్కండ్రు, శ్రాద్ధముల్ సేయ భోజ్యములు పెక్కు-
లనుభవించుటఁ దమ కఱుగమి వుట్టుట, యును బితృదేవతల్ సనిరి సోము
కడ కట్లు సని తమకాఁతియు సెప్పిన, నతఁడు పద్మజుపాలి కరుగఁ డనిమె
వా రట్ల కా కని పోరన నరిగి పద్మజునిఁ గాంచి యజీర్ణదశ యెఱుంగ
తే. విన్నవించినఁ దనయొద్ద వెలుఁగు చున్న
యగ్నిఁ జూపి యిక్కడితఁ డపహరించు
ననిన నగ్ని మత్సహితులై కొనిన నఱుగఁ
జేయువాఁడ నాహారముల్ సిద్ధమిదియు. 196

క. అని పలికినఁ బితృదేవత, లనలుఁడు ముఖ్యుఁడుగ నెప్పుడు నాహారంబుల్
గొని సుఖజీర్ణానందం,బు నొందుదురు సూవె భరతకులభూపవరేణ్యా 197

క. కావున సాగ్నికుఁ డయి తగ, నేవాఁ డొనరించు శ్రాద్ధమిూడ్యం బది సం
భావింతురు పెద్దయుఁ బితృ,దేవత లసురులకు రాదు తెలియఁ జూడన్. 198

ఆ. అనఘ పితృపితామహ ప్రపితామహ, పూజనములు శిష్టపూర్వకముగఁ
జేయవలయు నియతి దాయ దొడ్డినజన్మ,దంబులోడ భక్తిధాముఁ డగుచు. 199

తే. పిండసంబంధమునఁ బాయఁ బ్రేతభావ
మది సుగతి నిచ్చు గయఁ బిండ మట్లు గాన
యరుగునో గయ కొకఁడైన ననిక దా య
నేకపుత్త్రులఁ గోరుదు రిద్ధచరిత. 200

క. గౌరి యగుకన్య వరదా,నారూఢం జేత నీల మైనవృషభమున్
గారవమున విడుపు ముదం, బారంగఁ జేయుఁ బితృచయముచిత్తములన్. 201

క. శ్రాద్ధంబు ప్రకారంబును, వృద్ధాచార్యోక్తభంగి వివరించితి నీ
బుద్ధిం దోఁచినదాని స,మిద్ధగుణోదార యడుగు మిత్యాది యైనన్. 202

క. అని నిర్జరాపగానం,దనుండు వలుకుట యుఁ బ్రియము దళుకొత్తఁగఁ బాం
డునృపాలునగ్రనందనుఁ, డనూనవినయమున నమ్మహామతితోడన్. 203

క. తప మని యార్యులు సెప్పుదు, రుపవాసవ్రతము నదియ యొండు గలదొ సా
రవుఁ దపము తెలుఁగు నాకుం, గృప సెలఁగింపుము విధూతకల్మష యనుడున్. 204

ఆ. అమ్మహాత్ముఁ డిట్టు లనుఁ బెక్కుదివసంబు
లుపవసించి యొసఁక తపము చొప్పె
దాన విను తపస్వి గా నేరఁ డదయాత్మ
ఘాత మగుట నరుఁడు కౌరవేంద్ర. 205

క. సత్యంబు బ్రహ్మచర్యము, నిత్యశుచిత మౌన మతులనియమము దయయు
ధృత్యాగంబుఁ దపస్సం,పత్త్యాకృతు లండ్రు బుధులు పౌరవముఖ్యా. 206

చ. అనిన వి[illegible] కురుపతి కురుపితామహుతో మహాత్మ దానశీలుని యప్రతిగ్రాహ

కునివిశేషం బెట్టిది యొఱింగింపు మనవుడునా దేవవ్రతుం డీవిషయంబునకు సప్తర్షి వృషాదర్భిసంవాదం బనునితిహాసంబు గల దని చెప్పి యమ్మనుజపతి కిట్లనియె. 207

సప్తర్షి వృషాదర్భిసంవాదం బనునితిహాసంబుప్రకారము.

తే. కశ్యపాత్రి విశ్వామిత్ర గౌతములును
వినుభరద్వాజ జమదగ్నులును వసిష్ఠుఁ
డును జగంబుల నెల్లఁ [1]బేర్కొనినఋషులు
వారి సప్తర్షిగణ మండ్రు కౌరవేంద్ర. 208

వ. వసిష్ఠునిదేవి యగునరుంధతి యొండును నతనితోడన తిరుగు నయ్యిందఱకుం బరిచారిక యై [2]గండ యనుచేడియ వర్తించుఁ దద్వల్లభుం డగుపశుసఖుండును వారలకుం బరిచారకత్వం బాచరించు నప్పు డండ్రును దపశ్చరణపరులై ధరణిం జరించుచుండ నత్యంతఘోర యగుననావృష్టి దోఁచి జీవనసాధనంబులగు పదార్థంబులు దుర్లభంబు లై జనంబులకుఁ బ్రాణంబులు రక్షించికొనుట దుష్కరం బై యెల్లం గశ్యపాదులు నతిక్షుధార్తులై యాహారం బన్వేషించునెడ శిబిసూనుం డైనయాజ్యనామధేయుండు దొల్లి యజ్ఞదక్షిణార్థంబుగాఁ దనకొడుకు నీలుం డను వాని ఋత్విగ్జనంబుల కిచ్చినం దద్వ్యాళగతి నుండి కాలంబగుటయు మృతినొందినం దదీయశవంబు. 209

క. పొదపై నుండఁగ వారలు, పదుండ్రునుం జూచి దాని భక్షింపంగా
మదిఁ గోరి చేరి చుట్టుం, బొదివినసమయమునఁ గాటిసపొంత తెరువునన్. 210

ఆ. వేఁట బోయి మరలి శివిభూఁడొక్కరుఁడు వృషాదర్భినాముఁ డతులదానపరుఁడు
పోయి పోయి కాంచి పోవక నిలిచి యమ్మునులతోడ నధికవినయ మెసఁగ. 211

క. మీ రాఁకలి పెల్లున నాహారంబుగ శవముఁ గొనుట కడరితి రిల్లే
లా రం డిచ్చెద మీ కాహారంబులు వలసినట్టి వని తా మఱియున్. 212

క. బహువిధములధాన్యములును, బహురసవర్గములు మీకు భక్తి నొసఁగెదఁగా
బహుతురగశకటగోగణ,బహులిబహుగ్రామములును బహుమతినిత్తున్. 213

వ. అనిన వార లతని కి ట్లనిరి. 214

తే. రాజవర రాజు దెసఁ బ్రతిగ్రహము విషముఁ
గల్లుఁ గా జాతు మిట్లు గాంచి యున్న
యట్టిమాకు నీ విచ్చెద ననుట మావి
ధం బెఱుంగమి యింతియ తప్పు గాదు. 215

క. అనుడు విషాదముతోడం, జనికృత్రిమవనఫలములు సమకట్టి తగన్
జనపతి మంత్రుల ఋషులకుఁ, గొని పొం డని పంప వా రక్షుంఠితభక్తిన్. 216

1. క. గ. బేర్కొనిన. 2. చ. జ. చండ

వ. వానిం దెచ్చి యమ్మహాత్ములకు సమర్పించిన. 217

ఆ. వారు పట్టి చూచి వాని వ్రేఁగున హేమగర్భకంబు లగుట గాంచి [1]నవ్వి
వుచ్చుకొనక యున్నఁ బోయి భూపతికి నత్తెఱం గమూల్యకోటికయి మొఱఁగఁ జెప్పె.

క. విని యతఁడు రాజసంబునఁ, గనలు వొడమి కృత్తి వేల్వఁగాఁ దగువారిం
బనిచిన నప్పుడ హోమంబున రాక్షసి యొకర్తు పుట్టె భూపవరేణ్యా. 219

వ. పుట్టి యప్పుడమిఱేని ముందట నిలిచి పని యేమి పనుపు మనిన నతండు ప్రీతుండై కశ్యపాదులం గనుపుగొట్టు మని పనిచిన నది వారలున్నెడ రోసి పోయె నంతకు మున్న వారు వనంబున మూలంబులు ఫలంబులు వెదకి తిరుగుచుండ శునస్సఖుం డను పరివ్రాజకుండు వచ్చి వారిం గని వందనంబు సేసిన వార లభినందించి రతండు నమ్మునులం గలసి యేకార్థుం డై సంచరించె నట్లు చరించు నమ్మహాత్ము లతిక్షుధాన్వితు లై తామరతూండ్లు పుచ్చికొని సమలుట కై యొక్క నలినాకరంబునకు సత్వరగతి నరుగుచు నున్న నారక్కసి యక్కొలని కడ్డంబుగాఁ బోయి పాదనూపి నిలిచిన. 220

క. ఈ కమలవనము చేరువ, నే కార్యము సేయఁ జూచెదీ వెవ్వత వం
చాకొలను సొరఁగ నమ్మునిలోకము సేరుటయు నమ్మకలుకఁతె మొఱఁగె నెసఁగన్. 221

—◦◦ వృషాదర్భి పుత్తెంచిన కృత్తి శునస్సఖునిచే మృతిఁ బొందుట. ◦◦—

వ. ఏ నెవ్వత నైతి నేమి యిక్కొలని కావలి యున్నదాన నమటయు నమ్మునులు నెల్ల నైయాఁకట నలందురి యుపజీవింప నొండేమియు లేమిం జేసి యీసరోవరంబున బిసంబులు పెఱికికొని భక్షించువార మై వచ్చితి మనిన నవ్వనిత మీమీపేళ్లు సెప్పి మఱి పద్మవనంబుఁ బ్రవేశించువా రని పలికిన నప్పరమమునులు నన్నాతి యాతుధాని యగుటయుం గృత్తి యగుటయు వధింప వచ్చినది యగుటయు నెఱింగి కశ్యపాదు లగు పదుండ్రును దానికి దుర్బోధత్వంబు తోఁచునట్లుగా నిర్వచనసహితంబుగాఁ దమ నామంబులు సెప్పి రప్పాపవర్తన వెఱఁగుపడి యుండ శునస్సఖుండు దనయభిధానం బభివ్యక్తంబుగా నుగ్గడించినం గృత్తి నీపేరు దెలియం జెప్పవిది యేమి యనవుడు నతండు చేటపడం జెప్పి యుండం జెప్పవని మొద విట్లంట దప్పు గాదె యిట్టియుద్దండవు మత్త్రిదండంబు పాలు వడు మని బ్రహ్మదండనిభం బగు నిజహస్తగతదండంబున దానిశిరంబు బెట్టు వ్రేయుచుఁ బాపకర్మురాలా పడుము భస్మంబ వగు మని నిష్ఠురాక్షరంబుగా నిర్దేశించిన దుర్దశ యగుచుం బడి యారక్కసి భస్మీభూత యయ్యె నప్పు డప్పదుండ్రు నం బ్రమోదంబునం బయోజషండంబు సొచ్చి. 222

తే. బిసము లాదట నందఱుఁ బెఱికి రొంపి
వోవ నీటఁ [2]దెమల్చి మోకవుగ నమర్చి

1. ఆ. యవిము. 2. గ. విదిల్చి. కోవుగ.

శిరమునఁ బెట్టి నియమములఁ దీర్పఁ జొచ్చి
తీర్చి యాకలి [1]దముఁ గోసి తినఁగఁ జూచి. 223

క. కొలను వెదకి బిసము లిడిన, పలవునకుం బోయి యచట నిగిడించినచూ
పులకవి దోఁపక యున్నను, గలయం బరికించి యెట్లుఁ గానక తమలోన్.

వ. ఒండొరులఁ శంకించి శపథంబులు వలుకుదము గాక యని నిశ్చయించి మున
స్సఖుని విను వానింగాఁ జేసికొని రప్పుడ త్రి యిట్లనియె. 225

తే. ఋతువుఁ దప్పుట రవియభిముఖత దనకుఁ
గలుగ మూత్రపురీషమోక్షణము సేఁత
యధ్యయన మనధ్యాయనమునందు నడవు
టగు బిసంబులు మ్రుచ్చిలినట్టి వైన. 226

వ. అనుటయు వసిష్ఠుండు. 227

క. శ్రుతి పఠనము సన్న్యాసస్థితిఁ గాముకుఁ డగుటఁ గుక్కఁ జేకొని తిరుగన్
మతి రోయమి వయ్యేమనుఁ, గ్గతి మాఁకులు మ్రుచ్చిలించునట్టినకు నగున్. 228

వ. అని పెండియు. 229

క. సుత నమ్మికొనుట శరణాగతుఁ జేకొన కునికి నిచ్చు కారుణికుదరి
ద్రతఁ జూదియు వేఁకుటనగు, గతి బిసములు దాఁచికొనుట గల్గినఁ గల్గున్. 230

వ. అనిన నదనంతరంబ. 231

చ. పలలమృథోపభుక్తి [2]సభఁ బల్కుటఁ బల్కుట దుష్టదాన ము
గ్మలి దివసంబునం గవయుటకిష్టత విప్రవచనంబు లుబ్ధతా
కులితముఁ జేత యెల్లసరకుం గొని యమ్మట కాదె తూఁడులీఁ
గలపొది మ్రుచ్చిలించు టని కశ్యపసంయమి పల్కె భూవరా. 232

వ. పదంపడి. 233

క. జ్ఞాతులమొఱ గోవులమొఱ, [3]గోతులమొఱ ధర్మ మెడలి క్రూరుఁ డగుట కా
ర్యాతురవిప్రోపేక్షానీతి బిసము లపహరించు నిపుణున కయగున్. 234

క. అని పలికి భరద్వాజుం, డను మఱియు హవిస్సు గ్రంపయగ్ని నిడుట యా
జ్ఞ నధఃకరించి చదువుట, యనునివి సరి యా బిసాపహరణంబునకున్. 235

వ. అని పలుకుటయు. 236

తే. మెట్టునను భార్యఁ గవయుట మూత్రమును బు
రీషమును నీర విడుపు విద్వేషముక్తి
యాషిడుపజీవనము మృణాళోత్కరంబు
మ్రుచ్చిలుటఁ బోలు కల్మషమునఁ తలంప. 237

క. అని జమదగ్ని మఱియు ని, ట్లను సర్వేన్యాతిథిశ్వ మసహాయవుఁ వై

1. క. దముఁ గొని తినఁగ; జ. దప గొని తినఁగ. 2. ఇ. కరిపక్షము. 3. గ. చ. జ. గోఁతులమొఱ.

కనిరూఢి పొందిమెదవుఁ, గనని యడుచుటీ బిసనికరచోరతకున్. 238

వ. అనవుడు గౌతముండు. 239

క. ధృత వేదత్యజనానల, వితతివృథాత్యాగసోమవిక్రయవృషలీ
పతితా[1]దుర్గ్రామాక్షీ, వితతులు బిసస్తైన్యకర్తవృత్తికి నెనయు. 240

వ. అని నిర్దేశించిన విశ్వామిత్రుం డిట్లనియె. 241

క. తగుభృత్యులఁ బ్రోవ కసికి, దగనిభటులఁ బ్రోపు కపటధార్మికవృత్తిన్
జగతీపతిఁ గొల్చుట లెస్సగఁ బోలఁగ నేర్చునే బిసస్తైన్యంబున్. 242

వ. నావుడు నరుంధతి యల్ల నవ్వుచు. 243

క. సతతంబు నత్తదూఱుటఁ బతియెడ దుశ్చిత్త యగుటఁ బరమాన్నము నొ
క్కతె సేవించుట నగుదు,ర్గతి బిసములు దాఁచికొన్నకష్టకుఁ గలుగున్. 244

సీ. అనుఁడు వంటకము సేసినయింతిదా మున్ను, గుడుచుటపనియొకఁ డగుటలయుగుట
బొంకులు పలుకుట పుత్త్రిక వెల గొని, యిచ్చుట సుజనుల కెగ్గుసేఁత
యెట్టిదుర్గతిఁ దెచ్చు నట్టిద కల్గు బిసావలి ముచ్చిలినట్టు లైన
నిట్లు గాకయుఁ బుట్టు నెల్ల దాస్యంబు నీఁ,గక పోవు నక్కట గలనికృష్ట

తే. యనియె [2]గండ యసంతానుఁ డగుట గర్భ
దాసుఁ డగుట దరిద్రత్వాప్తుఁ డగుట
చెందుఁ దూఁడులకట్ట ముచ్చిలినకష్ట
నరుని కని పల్కెఁ బశుసఖనాముఁ డధిప. 245

వ. అని యిట్లందఱుం దన కభిముఖు లై పలికిన వారితో శునస్సఖుం డిట్లనియె.

క. ఛందోజ్ఞను లైనను దన,నందన నధ్వరధురీణులకు నైనను నా
నందముగ నిచ్చుటం బోలుదు మూఁడులకట్ట ముచ్చిలుట దలపోయన్. 247

తే. అనిన నయ్యందఱును బుణ్యమైనకర్మ, మనఘ శపథంబునకు విమ్మయము గనీవు
పలికి తటు గాన బిసలతాప్రతతి నపహరించినాఁడవు మమ్ముఁ గాఁకరింపకిమ్ము.

సీ. అనిన నక్కంబిది యందఱు నొండొరు, నే మనియెదరొ వీరి బిసముల
బొది యేను దాఁచి చూచెదనని దాఁచితి, నిదె కొనుఁ డని దానినిచ్చి మీకు
నలిగి వధించుటకై హోమవహ్నిఁ బుట్టించి వృషాదర్భి పంచెఁ గృత్తి
నది మున్న కాంచి రక్షార్థ మై వచ్చి యా,రక్కసిఁ దంపితి నిక్కమునకు

ఆ. వాసవుండ లోభవర్జనముఖధర్మ,తన్నుగుణములఁ జేసి శాశ్వతంపు
నెలవు గలుగ రండు నెగయుండు పుణ్యలోకముల కని సమాదరమునఁ బలికె.

వ. అట్లు పలుకుటయు. 250

చ. అనయముఁ బ్రీతిఁ బొంది మును [3]లట్టుల చేసిన యాచు నింద్రప
జ్ఞన లగి నేఁగ దేవపరమర్షిపూజ్యపదస్థు లై వెలిఁ

---

1. క. జ. మహాకప...బిస స్తైన్య కష్ట. 2. గ. (జండ. 3, క. గ. లట్లన చేసెద.

గి నిఖిలలోకనిత్యపరికీర్తితమూర్తుల నొప్పి రింతయు
న్నీను మపరిగ్రహంబుమహనీయత నైనదినూవె భూవరా. 251

క. కావున లోభము విడుచుట, కేవియు సరి గావు గుణము లీగుణము మహీ
దేవునకు వలయుఁ బెద్దయు, నీవిధమున శమరసంపు లెంతయు మెచ్చున్. 252

వ. అని చెప్పి భీష్మునకు వెండియు. 253

ఉ. ఈ యితిహాస మార్యసభ నెవ్వఁడు సమ్మతిఁ జెప్పు వాఁడు దీ
ర్ఘాయువు శ్రీయు ధర్మము సశంచితకీర్తియు వృద్ధిఁ బొంద సౌ
ఖ్యాయతనాత్ముఁడై మను సురావలియుం బితృకోటియుం బ్రియ
శ్రీయుతులారఁ గీడతనిఁ జెందక యుండఁగఁ జేయు నెయ్యెడన్. 254

ఉపానద్దానవిషయమునసూర్యజమదగ్ని సంవాదము.

వ. అనిన విని యజాతశత్రుండు శంతనుపుత్రునకుఁ బితృకార్యాదులయందు గొడుగులుఁ జెప్పులు నిచ్చుట యుత్తమ ప్రకారం బని చెప్పుదురు వానివిశేషంబు తెలియంగొఱంగింపవే యనుటయు నమ్మహాత్ముం డమ్మహీపతి కిట్లను సూర్యజమదగ్ని సంవాదం బనునితిహాసంబు వినుము దాన నీయడిగినయది తేటపడు జమదగ్నిమహాముని క్రీడార్థి యై శరాసనంబు ధరించి రేణుకాదేవి బాణంబులు పట్టగొని తనతోడం జనుదేర నివాసంబు వెడలి యొక్కబయల నయ్యంపపొదినిలువ వైపించికొని దూరాపాతనం బాచరింప నక్కుసుమకోమలి సని యమ్ములు తెచ్చికొని వచ్చి యిచ్చుచుండు. 255

తే. ఇవ్విధమున వినోదింప నినుఁడు గగన
మధ్యగతుఁ డయ్యె నప్పు డక్కమ్మగుప యమ్ము
లేటి తెరంగఁ బోయి యొక్కెంత దడసి
యరుగుదెంచిన నాతఁ డక్కయ్యబలతోడ. 256

క. లోలాక్షి యిచట నిమ్మెరి, యేల తడసి తనుడుఁ బేర్చెనిను తేజమునన్
నేలకు వేఁడిమి దనికినఁ, గాలన వెసఁ ద్రొక్కఁదలయుఁ జాలఁ దపించెన్. 257

క. ఇమ్మెయి నలంగి యొకవృక్షమ్మునకీనీడ నిలిచి చనుదెంచుట నా
కిమ్మెరి దడయఁగ వలసె నని, యమ్ముద్దియ సెప్పెఁ జెమట యడరఁగ మేనన్. 258

క. విని యేమేమీ నొంచెనె, యినుఁడు నినుం దత్ఫలంబు నిప్పుడ కుడువం
గనియెదుఁ గాక శస్త్రానలమునఁ బాదివెద నతని ననిరొ మునికోపమునన్. 259

ఉ. దాని నెఱింగి భూసురతిఁ దాల్చి వెసం జనుదెంచి యర్కుఁడ
మ్మానితసంయమింగని యమత్సరభావము దోఁప రోషమున్
మానుము నాపుపుం బలుకు మానుము నీవటు వాయు మేసెదన్
భానుని నేలఁ గూల నని పల్కె మునీంద్రుఁడు శోణితాక్షుఁడై. 260

చ. పలికిన బ్రాహ్మణుం జూచుఁగఁ బాఱక నిల్చి మునీంద్రయట్టు లి

ట్లల మగుడూరవృత్తిఁ గడఁగుదురే సవిత్రుండు రశ్మిఁ గ్
జల మొసఁగంగ నోషధులు సంపద[1]హవ్యమహత్త్వ మొందె వే
ల్పులకు బలంబు నిచ్చు నది యుత్తము గాదె యతండు నొచ్చినన్. 261

చ. అనినను శాంతి లేమిఁ బ్రకయం బెడఁ గూరఁగ మ్రొక్కి యోగిఁ డే
నినుఁడ సహింపు నావలన నెగ్గులు గల్గెనయేని నీకు నె
మ్మనము దయామయం బని సమస్తజగంబులు సంస్తుతింపఁగా
విని ముద మందుదుం శరణు వేఁడెదఁ [2]గావుము నన్ను నీశ్వరా. 262

చ. అనినఁ బ్రశాంతుఁడై తపసి యా భృగుముఖ్యుఁడు ప్రీతి గారవిం
చినఁ బ్రమదంబునం గొడుకు చెప్పలు మానసవృత్తిఁ దెచ్చి య
మ్మునికడఁ బెట్టి యుత్తరణి మున్నివి లే వని పల్కి దీన మైఁ
దనుకదు వీనఁ బాదములఁ దాఁకదు నా దగు వేఁడి యేమియున్. 263

మ. నయ మిట్లారఁగ నాతపత్రము నుపానద్ద్వంద్వముం జూపి చె
ప్పి యపూర్వం బగుసృష్టిఖేలనమునం [3]బెంపారునవ్వస్తువుల్
దయ సద్విప్రున కిచ్చి యైహిక సుఖోదాత్తంబు నాముష్మిక
ప్రియముం దాతకుఁ సుస్థిరంబులుగఁ గల్పించున్ మునీంద్రోత్తమా. 264

ఉ. అనినన్ మోమలరన్ దినేశ్వరునిఁ దా నామంత్రితుం జేసి య
మ్మునిశార్దూలుఁడు వల్లభాసహితుఁడై మోదంబునం దేలుచుం
జనియెన్ నాఁడు జనంబు లెల్లను బ్రహర్షం బందుచున్ వానిఁ గై
కొని రవ్వస్తువు లిట్టు లేర్పడఁగ నీకుం జెప్పితిన్ భూవరా. 265

చ. దినకరచిత్రసృష్టములు దివ్యమునీశ్వరలాలితంబు లీ
వినుతపదార్థముల్ కరుణ విప్రులకున్ యతిసాధువృద్ధస
జ్జనులకు నిమ్ము నీ వది సుసారపుధర్మము నావె దానఁ గ
ల్గును విను గోకులాకలితలోకము లోనగుపుణ్యలోకముల్. 266

క. దానప్రవణ యుపానద్దానంబును నాతపత్రదానము సురస
ద్మాననభాజనము లగుట, నానాబుధజనులచే వినఁబడు నృపుడున్. 267

క. అనిన విని పాండుభూవర, తనయోత్తముఁ డిట్టులనియె దాతకు శూద్రుం
డనఘా యెమ్మెయిఁ జరితం, బున నిహపరపరమసౌఖ్యములఁ జెందఁ గనున్. 258

వ. అనుటయు నతం డతని కిట్లనియె. 269

శూద్రున కకల్మషం బైనధర్మంబు నిరూపించుట.

క. లోకహితార్థంబుగ ముని, లోకోత్తముఁ డాత్మశిష్యలోకమునకు సు
శ్లోకుఁడు పరాశరుఁడు ధ, ర్మాకారము తెలియఁగఁ జెప్పె నంచితచరితా. 270

ఉ. అవ్యాకృతంబులు సెప్పెద నందు భవత్ప్రశ్నవిషయం బగునయర్థంబు నవగతం

1. క. హవ్యమహత్త్వ. 2. క. గావుము నన్ను మునీశ్వరా. 3. క. బెంపారి యవ్వస్తువుల్.

బగు నాకర్ణింపుము. 271

సీ. కరుణాఢ్యుఁ డగు పరాశరమునివరుఁడు శిష్యులకు నిట్లను నింద్రియోత్కరంబు
గెలిచి యంతశ్శత్రువుల నైన కామాదివర్గంబు నోర్చి గర్వంబు వదలి
త్రైవర్ణికులయెడ భావంబు భక్తిమయంబుగా శుశ్రూష యాచరించి
శూద్రుఁ డైహికసుఖానుగతులఁ బడయు వేదాధీతపముల నాచరించె

ఆ. నేని యుభయలోకహితాత్ముఁ డగు భూమి, సురనృపాలవైశ్యశూద్రులకును
నధ్యయనము బలసమగ్రత వాణిజ్య, మనుచరత్వ మధికధనము లరయ. 272

క. ఇవి శాస్త్రదృష్టమార్గము, లవనిసుర ప్రభృతు లీసదాచారంబుల్
సువిహితములుగా నడపిన, భువనద్వయమునను బడయుదు రభోగం బెంపుల్. 273

తే. ఇట్లుగా నాత్మధర్మంబు లెడల విడిచి
వర్ణములు నాలుగింట నెవ్వార లైనఁ
దొలఁగ ద్రొక్కనఁ బాటిల్లు దుష్టగతులు
మన్నకాలంబు పదపడి చన్నయపుడు. 274

వ. అని పలికి శౌచవిధి యెఱింగింపం దలంచి యిట్లనియె. 275

క. మూత్రపురీషోత్సృష్టికి, రాత్రి పగలు దక్షిణోత్తరదిశాముఖతా
సూత్రణము వలయునది సంధ్యాత్రయమును నుత్తరంబ యగు నప్పనికిన్.

క. పలుకవలదు శౌచక్రియ, సలుపకమును సలుపునపుడు జలములు దొడలం
జిలుకుట యొప్పదు మృత్తిక, వలయు నపానంబునం ద్రివారంబు లిడన్. 277

క. గుదతలము నొవ్వఁ దోమినఁ, గదురును రోగంబు లేపగంధాపగమ
ప్రద మగు కొలఁదిన శౌచము, సదురుగ నాచెప్పినట్ల సలుపఁగ వలయున్. 278

తే. అంబరంబున శౌచజలంబు వడుట, చెట్ట శౌచ మల్లలన చేత మేలు
వామకరశుద్ధి దొల్తఁ ద్రివారమృత్తి, కాకలనమునఁ దద్దచేయంగ వలయు.

క. కుడిచేతఁ బిదప డాచేఁ, గడిగి యూరున్ సప్తమృత్తికాకలనమునం
గడుగునది కరయుగము మఱి, కడుగ వలయు గుహ్య మల్పకమృదాకలనన్.

క. ఇమ్మెయి గుహ్యతలము శుద్ధమ్ముగ నొనరించి కేల్ పదంపడి జలధా
తమ్ముగఁ జేసి సముత్థానమ్ము పిదపఁ బాదశోధనము సేయఁ దగున్. 281

క. జనములు సూచుచు నుండఁగఁ, జనదు మలము మూత్రమును విసర్జింపఁగ న
ప్పనులకు శౌచాచరణం, బునకు నవశ్యంబు నోలములు గావలయున్. 282

క. ఆపత్సమయంబున శౌ, చాపాదన మిట్టిభంగి నబ్బమి మలసం
లేపనగంధము వోవఁ గ్రి, యాపరుఁ డై చేయునది మృదాకలనంబున్. 283

సీ. బుద్బుదవిరహితంబుగ వారి గరమున
[1]గొనకొని పోరి డెందమునకుఁ జేరు

1. చ. గొని కొన్ని పోపి డెందమునఁ జేరు; జ. మినుపగిఁ జొగి నున్గుతు పు దోఁచు.

నట్లుగ నిశ్శబ్దుఁ డై యుండ ముమ్మాఱు
ద్రావి యిన్మాఱు తీర్థ్యగ్విధమున
నాస్యంబు దోఁడసి నీ రంధ్రముల శిరమునఁ
బ్రోక్షించి యోష్ఠసంపుటము ముట్టి
నాసికాపుటములు నయనముల్ సెవులు మూఁ
పులు హృదయము నాభితలము మౌళి

ఆ. ముట్టవలయు హస్తములఁ బాదయుగమధ్యగతములుగ నుదఙ్ముఖత్వ మొందెఁ
బ్రాఙ్ముఖత్వ మొందెఁ బ్రాపించి యిమ్మెయి, నాచమనము సేయు టార్యమతము.

సీ. ముమ్మాటి జలపానమున నోలి ఋగ్యజు,స్సామవేదంబులు సంతసిల్లు
దొలితొలి వక్త్రంబు దొడయ నథర్వాహ్వర్షంబును రెండవసారి ధర్మ
శాస్త్రములో నేతిహాసప్రమోదపురాణ,సంప్రీతులును గల్గు సరణముగను
బ్రోక్షింపఁ బుండరీకాక్షుండు ప్రియమందు, నయనంబు లంటిన నలినహితుఁడు

తే. సన్ముదంబునఁ జేలు నాచమనసంప్ర, యోగ మిట్టిది వస్త్రయజ్ఞోపవీత
ధరణముల నన్నపానతంత్రముల మున్ను, సేసి పిదపను నిది యనుష్ఠింపవలయు.

తే. ఆస్యశుద్ధి యొనర్చిన[1]యప్పుడు వోక, భక్ష్యభోజ్యాలనంబులు [2]పండ్లనడుమ
నిలిచి పదపడి పోవుట గలిగెనేని, నాచమన మాడణంబ చేయుంగ వలయు.

వ. శౌచవిధి సమస్తవర్ణసామాన్యధర్మంబు శూద్రునకు నాచమనం బోష్ఠపుటం
బాకమరి ప్రోక్షించుకొనుటయు దానిం గరంబున నడ్డం బాకమరి తొడయుటయు
నింతియ. 287

క. తాను శుచిత్వం బేమిట, నైనను నేమఱక నియతి నతులితశుశ్రూ
షానిరతుం డై శూద్రుఁడు, మానితవిప్రులకు నోడి మనఁగా వలయున్. 288

సీ. అవనీసురుఁడు జపయజ్ఞుఁ డధ్యయనోప, జీవి తపశ్శోభి భూవరుండు
ప్రారంభయజ్ఞుండు పరమదండోపజీ,వకుఁడు పావనశోభి వైశ్యుఁ డమల
హవ్యయజ్ఞుఁడు విక్రయాజీవి యాతిథ్య,పరిశోభి శూద్రుండు పరిచరణ
యజ్ఞుండు శుశ్రూషణాజీవి దక్షత్వ,శోభి యట్టులు గాని చొప్పు లఖిల

ఆ. వర్ణజాతులకు నవశ్యంబు నాలవ,వాని కెమ్మెయిం ద్రివర్ణభక్తి
వలయు నడప యతులవలన విశేషించి, నిత్యభజనపరత కృత్యమయ్య. 289

క. యతి సర్వాశ్రమచరణస్థితులకు నుత్కృష్టుఁ డతని తెఱుఁ బూనిన శ
క్తత గలిగినవారు శ్రుతిస్మృతివిహితాచారులకుట మే లరయంగన్. 290

సీ. ప్రియవాదితయును శాంతియును దాంతియును స,త్యాలస్యంబునశులశీలంబుఁ గలిగి
నాఁటికి వలయు దీనసుమనస్తరంబును, ఘోరంబు నైనసంసారజలధిఁ
గడతు నే నని భీతిజనంబులకు నెప్పొ, హితము లప్పనులు సంతతము జేయు

1. క. యప్పుడు భక్ష్యభోజ్య. 2. గ. పండ్లమొదల.

చదువుగు లోత్తుచు [1]నిష్ఠ మడుఁగుచు నీచత,నను చరించుచు ధర్మయున నుపార్జి
ఆ. తంబు లైనయట్టి ద్రవ్యసంచయములఁ, దృష్టి సేసి దేహగుప్తి నడపి
పగలు రేయు నార్కపరిచర్యలొనరించి, శూద్రుఁ డిహపరములసుఖము వడయు.
క. దానోపవాసముల, సన్మానితగతి లేదు శూద్రునకు యతిదెస స
మ్మాననమునఁ దత్పూజాధీనరతిం గాని యెన్ని తెరువులఁ జూడఁగా. 292
తే. తెరువుఁ దప్పి తూఁగాడుచు నరుగుడెంచు
యతిఁ గనుంగొని మనమున [2]నడలు వొడమ
నెదురుగొని దప్పి దీర్చి సమ్మదము సేత
శూద్రునకు ధర్మవిధి యని శ్రుతులు సెప్పు. 293
చ. యతి రుజఁ బొందినం దొలఁగ నౌషధకృత్యముఁ బథ్యమై సమం
చిత మగునట్టి భోజనము సేర్చుటయున్ మలమూత్రముల్ జుగు
ప్సితములు గానిభంగి గలచిత్తముతో జలకార్య మొప్పి వ
ర్ణితముగఁ జేతయుం గలచరిత్రము శూద్రున కిచ్చు సద్గతిన్. 294
క. ఏవిధమున నోపిన యతి,భావముదుఃఖంబు వాపునని సాదరచే
తోవృత్తిఁ బూనిచేయుం,గా వలయును శూద్రుఁడది సుగతి నొందించున్. 295

సర్వవర్ణసామాన్యధర్మ నిరూపణ ప్రకారము.

వ. అని చెప్పి సర్వజాతిసామాన్యంబు లగుధర్మంబు లెఱింగించు నాదరంబున నమ్ముని
వరుం డిట్లనియె. 296
సీ. పరధనంబుల కాసపడక యొండ్లను దన,యట్ల కాఁ జూచుచు నఖిలవస్తు
వులుఁ దోఁచునడఁగువీచుల చందమున మెఱుఁగు, గులభంగి నని కనికొనుచు నెందు
నాసక్తి లేక భూతాలిపై దయ గల్గి, నడచుట హితము దో నడచుఁ జేసి
నది మేల చేయుట చదురు గీడవతఁ, దొడరఁ బ్రాయశ్చిత్తదోషములను
తే. వేగ తొలగించుటొప్పెడునెరవ యెమ్మ, లేసి జంతువుఁ జంపి త్రిస్నానములను
ద్వాదశప్రాణసంయమినాదరమున, నొక్క-యుపవాసమునఁ బాపయుక్తివాయు.
ఆ. అస్థి గలిగి హీనమగుజంతువైన దద్ద్విగుణావృత్తి వలయుఁ బ్రగుణజంతు
వునకు నలుమడించుకొనునది సరమాత్ర,హింస యష్టగుణకృతినొఁ బాయు.
క. హీననరునట్ల గుఱ్ఱము, నేనుగును మనుష్యవధ మనసె కాబ్దికభి
తోనిరతి ప్రభృతిసుకర్మానుష్ఠానములఁ గాని యణుఁగ దంఁతులన్. 299
తే. కల్లు ద్రావుట గురుతల్పగమన మధిక,పాతకము లివి ప్రాణముల్ వాయఁ బెట్టి
చేయు ప్రతికారములఁగాని చెడవు గోధ, రాజ్యాధిక దానములనైన సనఁగవండ్రు.
క. ఇవి యెఱిఁగి యెపుడు బరలో,కవిభీతి మనంబునందుఁ గల్గి సకలభూ
తవిషయదయ నూనినయట్టివాఁడు గీడెల్ల బోనడిచి మేలొందున్. 301

1. జ. నిష్ట మడుగుచు. 2. జ. నరలు వొడమ.

క. ఈ నెఱిఁ గనికొని శూద్రుం, డైనను గ్రమవృత్తి నవ్య యంబగుపదముం
గానం బడయుట గల్గును, వానికి నియమములతోడ వలవక యునికిన్. 302

వ. అని నిర్దేశించి యరిష్టంబు లెఱిఁగింప ననుకంప వుట్టుటయు. 303

సీ. పురుషు హిరణ్మయు నరుఁ డెవ్వఁడు తత్రమునఁ గాంచుదర్పణాద్యుఖలత నుండ
నతనికి వర్షత్రయమున మృత్యువు వచ్చు, రవిమండలంబు నిష్ప్రభముగాఁగఁ
గనిన రెండేఁడులఁ గౌముదిఁ దననీడఁ, దూఁటు నూచిన నొక్కట యేఁట నది వి
హాళిమై యున్న షణ్మాసమాత్రంబునఁ గర్ణముల్ కరములఁ గదియమూసి

ఆ. కొనినపుడు మ్రోఁత వినకున్న నెలనాళ్ళఁ, గర్ణములును నాసి కయునుబట్టు
గదల వికృతివర్ణ కత పండ్లఁగన్నులుఁ, గలుగనాఁడ మరణ మొలయు నండ్రు. 304

వ. అట్లు వర్తిల్లునరిష్టంబులం దెయ్యవి దోఁచినం గలంకం బొరయనియంతరంగంబు
తోడఁ దృష్టాకలితంబైనసంసారంబునందలియాసంగంబు వదలి హృదయం బేకా
గ్రంబుగావించి మునీంద్రనిర్దిష్టనిర్మలధ్యానకర్మంబులం దగిలియుండెనేనింగాలాం
తకప్రసాదంబునవడయుం దెలివికొఱంతం గాలగోచరత్వంబు నొంది వైశ్యరాజన్య
విప్రకులంబులం దత్త్రివిధసంపత్సమృద్ధంబులుఁ బ్రబుద్ధంబులు నగు వంశంబులం
గ్రమంబున జన్మించి. 305

క. అర్హ్యైకర్మంబులదెస, నెయ్యం బెసలారఁ గలిగి నియమనిరూఢుం
డియ్యన యన సుకృతంబుల,నయ్యెడుసౌఖ్యంబునిహాముత్రనందుఁ బరమునన్. 306

తే. అనుభవించుచు గతునంబు నాగమనమ
నాచరించుచు బ్రహ్మస భ్రాంతమైన
పుణ్యలోకనికాయంబుఁ బొంది యెల్ల
నెఱిఁగి యూహించి యిట్లని యెదఁ దలంచు. 307

క. ఇవి యెల్ల నశాశ్వతములు, భవమరణాకలితములును బటుసంసారో
ద్భవదుఃఖయుక్తములు సుఖ,లవయుతములు వీనియందు లౌల్యం బేలా. 308

వ. అని తలంచి యపునర్భవకారియు ననధికంబును నచలంబు నగు ధర్మంబునుగోరు
చుండు నకృతకర్మఫలంబు నొందను గృతకర్తృఫలంబు దొఱంగను నెవ్వరికిపశంబు
గామి ధ్రువం బగుటంజేసి కృతకర్మవిశేషంబున నతండు వాసవాదివరిష్ఠసహవా
సంబున వర్తించి. 309

తే. పుణ్యఫలకాలమునయంతరమున నితాంత 309
సంప్రబుద్ధజనంబువం శమునఁ బుట్టి
బ్రహ్మసంస్కారముల నెల్ల బడసి యతిథి
దేవపితృకోటులకుఁ బరితృప్తి సేసి. 310

తే. భార్య పుత్త్రు లాదిగఁ గలత్రపాశసంచ
యంబు నిరసించి యతిధర్మ మాచరించి

యిలు వెడలి గురుశుశ్రూష సలఘుసాంఖ్య
యోగశాస్త్రరహస్యైకయోగ మొంది. 311

సీ. పుణ్యంబు లైనయరణ్యంబులను శూన్యగృహముల దేవతాగృహములందు
గుహలను నిలుచుచుఁ గుడుపు భిక్ష నొనర్చి, యొకచోట మరగక యొల్లమియును
వలపును వెడలి నిర్ద్వంద్వత వాటించి, మమత యహంకృతి మాని నిత్య
తృప్తాత్ముఁడును జనాధీనత్వరహితుండు, నై గమ్యదిశ యొకటఁ దవులఁగ లేక

ఆ. మెలఁగుచుండి పక్వఫలము దొడిమఁ బాయు, పగిది గుణచయంబుఁ బాసి యక్ష
యంబు నచలమును నిరామయంబును నగు, పదముఁ జెందు శుద్ధభావ మెసఁగ. 313

వ. అని చెప్పి.

క. భిక్షుకుఁ డిట్లయి నిడుముఁ, బక్షి విడుచునట్లు మాయఁ బాసి యభేద్యం
బక్షర మనుతత్త్వంబును, సాక్షాత్కృతిఁ గూర్చి నిలుచు శాశ్వతపదవిన్. 314

వ. అమ్మహానుభావుండు సంసారసాగరంబు గడచుటయ కా దాశ్రితులనుం గడపం
జాలి యుండు. 315

ఉ. కావున భిక్షుఁ జెంది ప్రియకారిత శూద్రుఁడు గొల్చునేని సం
భావితుఁ డైనయాతనికృపారస మాని తదీయసంగవి
ద్రావితకల్మషుం డయి చిరక్రమవృత్తిత నూయి గ్రొచ్చి నీ
ర్వావిరి గన్నయట్టులు శివం బగుతత్త్వము గాంచు నెమ్మయిన్. 316

తే. అఖిలజనులకుఁ బరమపదాభిలాష
వృత్తి సామాన్య యది యొందు వెంట శూద్ర
జనములకు నెట్లు వొరలిన సఫల గాదు
దాని భిక్షుకసేవ సత్ఫలతఁ గూర్చు. 317

పరాశరమునిప్రణీతధర్మవిశేషంబు భీష్ముండు ధర్మజునకు జెప్పుట.

తే. వర్ణముల కెల్ల నింద్రియవ్యాప్తినిగ్ర
హంబు దలఁగ నియ్యది గన్నయంతఁ దృప్తిఁ
బొంది యొం డాసపడకున్న నొందు సాధు
జనులు వెదకునానామయసత్పదంబు. 318

తే. పరమ మైనయీధర్మంబు పట్టి పాప
యోను లగుకామినులును వైశ్యులును శూద్రు
లును సుగతి గాంతు రనిన సజ్జనతఁ బరఁగు
బ్రాహ్మణులకు రాజులకును బ్రాఁతె సుగతి. 319

వ. అని చెప్పి వెండియు. 320

సీ. బోధ మక్షీణపాపునకుఁ గల్గదు సద్గు,రుండు చెప్పంగ సంశ్రుతము లైన
పనులఁ బాపంబులు వాసిన నిర్మల,జ్ఞానోదయం బగు దాన గర్వ

ముదయింప వచ్చిన సుధపంగ వలయు గర్వంబున గురుసమారాధనంబు
వదలిన నాబోధవైభవ, మెడలిన, యంతటఁ బోక కీడావహిల్లుఁ

ఆ. పరమబోధమునకు ఫల ముపశాంతిగా, నెఱిఁగి యెంశబోధ మొకఁడ యయ్యె.
నంతశాంతుఁడగుచు ననవరతంబును, గరుని గొలిచి మేలు పురుషుఁ డొందు

సీ. రక్షించునది యుదరంబు శిశ్నము ధృతిఁ, బాణిపాదములు దృక్పాటవములు
వినుఁ డింద్రియంబుల మనమును మనమున, బుద్ధిఁ, నిర్మైనఁ బ్రహ్మబోధవికచ
హృదయస్థుఁ డై ధూమమెడలినశిఖివోలె, వెలుఁగు జీవుఁ డిట్టు చూచు వెరవుగలుగు
యుక్తుండు గా కేలయొందవు మహేశ్వరుఁ, గనుట యుక్తాత్ముండు గనుసుభక్తి

తే. నట్టిభంగికిఁ జాలినయట్టిఁ డైన
వికృతిషోడశకంబును బ్రకృతిసప్త
కంబు మూల ప్రకృతిఁ జిత్త కలన నరయ
వికృతియును బ్రకృతియుఁ గానివిభునిఁ గాంచు.

క. ఇది సాంఖ్యానము దీనిని, మది కలవడఁ జేసికొనుచు మఱవక గురు ని
ర్మదుఁ డై కొలువఁగఁ గేవల,పదము నతనికరుణ పెంపుప్రకటము సేయున్. 323

తే. భిక్షుభావంబుఁ బొంది మోక్షశిక్ష యూఁది
మెలఁగునవ్రత త్రైవర్ణికులకుఁ గలదు
శూద్రునకు భిక్షుసంసర్గసులభ మమల
పదము వానికి భిక్షుతఁ బరఁగఁ జన్నదు. 324

క. పరమజ్ఞానులయొద్దను, బరఁగిన నజ్ఞుఁడును బోధభరితుఁ డగు నిరం
తరమేరుసమీపస్థితి, హిరణ్యరుచిఁ గాక మొసక మొసఁగినపగిదిన్. 325

క. గురుశుశ్రూషామహిమం, గరుణఁ జతుర్వర్ణహితముగా నిమ్మార్ద్కిం
బరివర్ణితంబు సేసెం, బరాశరమునీశ్వరుండు పౌరవముఖ్యా. 326

వ. అని సకలధర్మోపదేశధుర్యం డైనభీష్ముండు పరాశరమునివర్యవాక్యసంచయంబు
సెప్పినం బరితుష్టుండయి పరమవినయంబునం బాండవాగ్రజుండు కురుకులాగ్ర
గణ్యుతో నరులు సురలకు వంద్యు లగువారును గల రని వింటి వారలవర్తనం
బెట్టి దెఱింగింపు మనిన నతం డతని కిట్లనియె. 327

సీ. ఇట్లు మాతలి యమరేంద్రుని నడిగిన, ధర్మార్థకామముల్ ధర్మచరిత
వర్తనఁ జెల్లించువారు వామాక్షులు, గోరఁగాఁదగురూపగుణసమృద్ధి
గలిగియు వర్జితకాము లయ్యెడువారు, విద్యాధనైశ్వర్యవిషయగర్వ
విరహితు లగువారు విజితేంద్రియులు నిజ, దారతృప్తులుఁ దపోధనము గాధ

తే. తత్పరతఁ బూర్ణుమునులు సత్యవ్రతులును
బరమశౌచులు బహుకార్యపరత సేసి

గూఢధర్మములు సన్న్యాసక్రమవిధులును
దనకు నభివంద్యు లగుట యక్కతండు సెప్పె. 328

వ. అనిన విని ధర్మతనయుండు తటాకనిర్మాణరూపం బగుధర్మంబువిశేషంబు వినవల
తుం జెప్పవే యనుటయును నదీనందనుం డాదరభరితుం డై. 329

భీష్ముండు ధర్మజునకుఁ దటాకనిర్మాణఫలవిశేషంబు సెప్పుట.

సీ. దేవతిర్యఙ్మనుష్యస్థావరాశ్రయము తటాకంబు విను మట్లఁ గాక యందు
గోకులంబులు నీరు గొని దానికర్తకు నెల్లఁ బుణ్యలోకమున కనుచుఁ
నీలోకమునఁ శ్రీయు నెక్కుడు కీర్తియు, నతనికిఁ జేయు వర్షాగమమున
నీతున వేసవిఁ జెఱువులో నీ రున్న, నగ్నిహోత్రాదిమఖయజ్ఞవాజి

ఆ. పేయఫలము లోలి నాయన కగుఁ గట్టఁ, దగినతరువు లిడిన సుగతి గలుగు
నిహసుఖంబుఁ బొందు విహగాదిబహుభూత,వాససౌఖ్య మతఁడు సేసెఁ గాన.

క. సలిలాశయములు సేసిన, నలఘు ప్రియమందుఁ బితృచయము లూర్ధ్వగతుల్
గలుగును దానం దమ కను,తలఁపున నది గోరుచుండు ధర్మతనూజా. 331

తే. ఛాయ నతిథివర్గంబుఁ బుష్పముల సురగ
ణంబుఁ బండులఁ బితృనివహంబుఁ బ్రమద
మొందఁ జేయు వృక్షంబు లట్లగుట వృక్ష
రోపణక్రియ మేటిధర్మువు కుమార. 332

క. అనిన విని ప్రీతుఁ డై యు,జ్జనవిభుఁడు గృహస్థధర్మసాకల్యజ్ఞా
ననిరూఢి నాదుచిత్తం,బున నొలయింపు భవదీయపుణ్యఫణితులన్. 333

క. అనవుడుఁ దాత యలరి యు,మ్మనుమనితో నిట్లు లనియె మహియును విష్ణుం
డును జేసినసంవాదము, విను మది నీకోర్కిఁ దీర్చు విశ్రుతకీర్తీ. 334

తే. నన్ను నీ వడిగినయట్లు వెన్నుఁ డర్థి
బుజ్జనంబులు మున్నుగ భూమిదేవి
నడిగె దానికిఁ బ్రియ మంది యమ్మహాను
భావు డిట్లని చెప్పెఁ దద్భావ మలర. 335

క. దేవాహుతవహపరిచ,ర్యావిధి యొనరించి బలిసమాచరణము భ
క్త్యావేళంబునఁ జేయఁగ, దైవతసంఘంబు సమ్మదంబునఁ దేలున్. 336

తే. అన్నమున దుగ్ధమునఁ బండ్ల నైన మూల
కోటి నైనను దను పారుసీట నైన
నిత్యమును జేయునది పితృకృత్య మూని
వైశ్వదేవ మవశ్యనిర్వాహ్య మనఘ. 337

క. అచేతపిదప దానం, బాచరణీయంబు శక్తి కనుగుణముగ భి
క్షాచర్య సేయువిప్రుల, వేచి యిడఁగ వలయు నెపుడు వేగము క్షితిపా. 338

తే. అప్పటికి వారు లే కున్న ¶ [1]నగ్ర మగ్ని
ముఖమునం దైన నిడునది ¶ సఖుల బంధు
జనుల నతిథుల గురుల భోజనవిధాన
తృప్తులుఁగఁజేసి బలివిధిఁ ¶ దీర్పవలయు. 339

వ. బలు లుభయప్రకారంబులు వానియందు [2]ధర్మార్థకర్మానుధీనులకు భోజనాదివిషయం బైన శ్రౌతబలి యేను మున్న నిర్దేశించినయది యిప్పుడు సెప్పినయది పశుపక్షి చండాల ప్రభృతిగోచరం బగుస్మార్తబలి యని నిర్దేశించి పెండియు. 340

ఆ. విను గృహస్థధర్మవిధ మిది యీ భంగిఁ నడపి విదప భోజనంబు సేయ వలయు విప్రుఁ డిట్టివాఁ డొందు నిహపర, సౌఖ్యసంపదలఁ బ్రశస్తచరిత. 341

క. అని చెప్పినఁ గృష్ణుఁడు నెమ్మన మలర గృహస్థవిధిసమాచరణము ని
ష్ఠ నడపెఁ గర్మశ్రద్ధా, ఘన నీవును నట్ల నడవు ¶ గార్హస్థ్యంబున్. 342

క. అది దురితనిరాసము నభ్యుదయానందంబుఁ జేయుఁ ¶ బుణ్యాయుశ్శ్రేయం
పద నిచ్చు నూర్ధ్వలోకప్రద మగు దానిఁ గొనియాడు ¶ భరతవరేణ్యా. 343

వ. అని యిట్లు భీష్ముండు భీమాగ్రజునకుఁ గృహస్థధర్మప్రకారం బెఱింగించె నని చెప్పుటయు నప్పౌరవకులోత్తములసంప్రశ్నోత్తరంబులు మఱియుం దెలుఁగునం జెల్లం జెప్పవేయునుటయు. 344

ఉ. అపగత కామరోషహృదయాంతరఖేలనకల్య నిర్జపా
జపమహిత వ్రతైకపరసంగధురాధికలోల్య చంద్రమ
స్తపనమయాక్ష కౌస్తుభనికేతాంతరుచిస్ఫురితాస్థిదామదీ
ప్తిపటలచారువక్ష మునిసద్ధీస్ఫుటభావిత దేవసేవితా. 345

క. సత్త్వాధిష్ఠాన కృతసద్భక్త్వప్రకటాభిధాన ¶ భక్తాధీనా
తత్త్వంపదార్థరూపా, తత్త్వసదనదీప ధూతదైత్యాటోపా. 346

మాలిని. జగదవనవినోదా ¶ సత్యజాతప్రమోదా
సగుణవిగుణభంగీ ¶ సంయమారామసంగీ
విగతవికృతమూర్తీ ¶ విశ్వభూతప్రవర్తీ
సుగమగహనభూమా ¶ సోమఖింఛాభిరామా. 347

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం బైన శ్రీమహాభారతంబున యానుశాసనికపర్వంబు పంచమఁ దృతీయాశ్వాసము. 348

---

1. గ. నున్న మగ్ని. 2. ఛ. ధర్మార్థకర్మోపజీవనరక్షో.



హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆనుశాసనికపర్వము, చతుర్థాశ్వాసము.



పరమమహిమనిశ్చల
తాపాదన కేళికౌతుకాతిశయమనో
వ్యాపారనిరూఢ స్తు
త్యాపాంగవిలాసలలిత హరిహరనాథా.

—ధూపదీపనైవేద్యంబులఫలవిశేషము భీష్ముఁడు ధర్మజునకుఁ జెప్పుట.—

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

తే. అట్లు గృహమేధిధర్మతత్త్వావగమము
దనకుఁ గలుగంగఁ జేసినతాత కెలఁగి
మనుమఁ డూర్జితభక్తియు వినయగౌర
వంబు సమధికతావైభవంబుఁ బొంద. 3

వ. మహాత్మా సుమనోధూపదీపనైవేద్యంబు లుత్తమంబు లగుపూజాసాధనంబు లని వానిం గొని దేవతలం బూజింతురు తద్విశేషం బెఱింగింపవే యని యడుగుటయు నతం డాదరభరితుం డయి దీని శుక్రుండు బలిదానవేంద్రునకు బలి మనువునకు మనువు సువర్ణుం డనుతపోధనునకు సువర్ణుండు నారదునకుం జెప్పి రప్పరమముని నాకుం జెప్పె నత్తెఱంగు సెప్పెద నాకర్ణింపు మని పలికి యప్పుడమిఱేని కిట్లనియె. 4

సీ. ఓషధు లమృత మయ్యుత్తమవస్తుసం, తతిలోనఁ బుష్పవంశతములు మేలు
పుష్పముల్ గొని సురపూజ లొనర్చిన, మానవులకు మంచిమనసు గలుగు
నట్లు గావున సుమనోభిధానము పుష్పముల కయ్యెఁ దద్ద్రవ్యపూజ లిచ్చ
నరులకోర్కులు సుమనస్కతఁ దీర్చుట, నమరులు సుమనస్కు లనఁగఁ జనిరి

ఆ. కంపు రూపుఁ దెలుపుఁ గలిగి యకంటక, భూరుహాదులందుఁ బుట్టినట్టి
పుష్పముల ప్రియంబుఁ బొంది కైకొందురు నిర్జరులు పూజనములఁ గురువరేణ్యా. 5

క. నలినంబులు జాజులునుం, దులసీదళములుఁ బ్రభూత§తోషము గీర్వా
ణులకుం జేయును యక్షా,దులకు జలోద్భవము లెల్లఁ § దుష్టి యొనర్చున్. 6

క. అరుణంబులును సకంటక, తరుభవములుఁ గటుకగంధ§ధామములు నొన
ర్చురు శాత్రవాభిచారిక, కరణమున నథర్వమాంత్రి§కతఁ గుసుమంబుల్ 7

తే. భూతరక్షోగణములకు § ధూపవర్య
తీక్ష్ణగంధపుష్పంబులు § తృప్తిఁ జేయు
నలఁప దీపు[1] వలచి పరిమళసుకాంతి
భరితములు నగుపువ్వులు § నరుల మెచ్చు. 8

క. విను దేవాలయమునఁ బిత్రు,వనమునఁ బుట్టుకుసుమములు § వలదు వివాహం
బునకును శాంతికపౌష్టిక,పవిత్రాజనరంజనాది§వర్తనములకున్. 9

తే. కుసుమములగంధమున దేవ§కోటి వాని
దర్శనంబున యక్షులు § తదుపభోగ
మున భుజంగ ప్రతాన మీ§మూఁడు దెఱఁగు
లను మనుష్యులు ప్రియ మందు § టనఘ కలుగు. 10

క. దేవత లర్వకుసుమపూ,జావిధిఁ బ్రియ మంది యపుడ § జనులమొదల సం
భావించి వారికోర్కులు, గాపింతురు సఫలములుగఁ § గౌరవనాథా. 11

తే. సల్లకీజాతనిర్యాస § మెల్ల దేవ
తలకు మే లంతకంటె [2]గుగ్గిలము లెస్స
యగరు గంధర్వయక్షోరగాదులకుఁ బ్రి
యంబు ధూపదానమునెడ § నధిపవర్య. 12

వ. ధూపదానంబులయందు నధికతరంబు కర్పూరధూపం బని చెప్పి మఱియును. 13

క. సమధురమును గటువును దీ,క్ష్ణము నగుగంధములధూప§కలన వరుసహృ
ద్యములు సురయక్షరక్ష,స్సమితులకును దత్ప్రికార§జాతులకు నృపా. 14

తే. తగినయట్టి ధూపము దేవ§తలకునిచ్చి
పరమపుష్టియు నాయువుఁ § బడయుఁ గర్త
యక్షగంధర్వపన్నగ§రాక్షసులును
ధూపమున మెచ్చి కోర్కె లి§త్తురు కుమార. 15

క. మలయజము నగరు మఱియుం, గలుగుసురభివస్తువులు ని§కామప్రియదం
బులు వైహారికధూపం,బులయెడ మానవులచిత్త§ములకు నరేంద్రా. 16

ఆ. [3]దైవతార్చలపుడు § తామసభూతర,క్షోముఖంబు లైన§కుత్సితంపు
జాతు లెల్ల దీప§సన్నిధి నడఁగు న,ట్లగుట దీపదాన § మధికఫలము. 17

క. ఆలోకదాన మన భూ,పాల పరఁగు దీప మీగి § భావము సద్ధ

---

1. గ. గలిగి. 2. గుగ్గులము. 3. క. దైవతార్చనపుడు.

ర్మాలోకనశీలం బగు, నాలెస్స దెయొనర్చినట్టియతనికి నధిపా. 18

తే. ఘృతము సాలమి వర్తి నిష్కృష్ట యగుట
దగ సమర్పించి పెంచుట ధరణినాథ
కానియవి దీపదానవిధానమునఁ బ్ర
కాశవస్తువు దృఢదీప్తికముగ వలదె. 19

వ. అని వెండియు. 20

క. ఒరు లిచ్చినదీపం బప,హరించి తత్పాతకమున నంధుం డగు భూ
వర రథ్యాసభ గుడిపై, గిరి దీపం బిడి విభూతికిం బాత్ర మగున్. 21

తే. ఆలనేయి ముఖ్యము మహిషాది మేష
జనితఘృతములఁ దైలంబు మనుజనాథ
మధ్యమము లగు మేదోస్థిమాంసరసము
లరయ నింద్యముల్ దీపసమర్పణమున. 22

క. జ్యోతిస్సాలోక్యకులో, ద్ద్యోతనమహిత ప్రకాశయోగంబులు పు
త్రాప్తి తెచ్చు దీపదానము, దాని కొసఁగు సమరపూజితసుఖత్వంబున్. 23

క. దేవతలకు నగ్రపుసం, భావన నుపహార మిచ్చి పదపడి కుడువం
గా వలయు నల్లు నేయుని,ధీపరహితుఁ డసుర యగుట దెల్లం బధిపా. 24

వ. కావున. 25

క. తనయింటఁ గలుగునన్నము, మును దేవతలకు నివేద్యముగఁ జేసి ప్రణా
మనియమసహితసమర్పణ,మునఁ గృతకృత్యుఁడుగ వలయుఁ బురుషుం డనఘా. 26

వ. పూజకుండు శక్తిసంపన్నుం డయి యొనర్చిన. 27

క. తిలపిష్టము దధిదుగ్ధం,బులు మఱియును ధూపములును బుణ్యపరిమళం
బులు నగుపదార్థములు విబు,ధులకుం బ్రియ మొసఁగు బలివిధులఁ గురుముఖ్యా.

క. ఉపహారసమర్పకుఁ డగు,సుపురుషు గృహార్థివతములు శుభములఁ గూర్చున్
నృపవర తత్కర్మరహితుఁ, గృప లేక నితాంతవిఫలకృత్యుం జేయున్. 29

ఆ. రక్తమాంససహితభక్తపిండములను
ల్లసితలోహితాక్తలాజములను
సురను బలి యొనర్చ నురగయక్షాసుర
ప్రముఖభూతములు శుభంబు లొసఁగు. 30

క. సౌమ్యాసౌమ్యబలులు విను, సౌమ్యాసౌమ్యప్రకారజనకృత్యంబుల్
సౌమ్యనృపోత్తమ యయ్యై, కామ్యముఁ దత్తత్ప్రపూజ్యకరణిం జేయున్.

క. అగ్రప్రదాయి వర్ణస,మగ్రుఁడు బలయుతుఁడు బుద్ధిమంతుఁడు లోకా
నుగ్రహపాత్రము శాక్రవ,నిగ్రహశక్తుండుఁ దత్ప్రవిష్టుండు నగున్. 32

వ. అనిన విని యజాతశత్రుండు గంగాపుత్త్రునితో సుమనోధూపదీపబలిప్రదానం

బులఫలవిశేషంబు లింకను వినవలతుం జెప్పవే యనుటయు నప్పురుషవరుం
డా కురువంశవరున కిట్లను నహుషువృత్తాంతంబున నది విస్పష్టం బగు విధము
చెప్పెద. 33

భీష్ముఁడు ధర్మజునకు నహుషునిధూపదీపదానవిశేషంబు సెప్పుట.

సీ. నహుషుఁడు భూపాలనము సేయు చుండి రాజస మించుకయు లేక సత్త్వనిష్ఠఁ
బుష్పంబులను ధూపములఁ దీపముల నివేద్యంబుల నమరుల నర్చలిచ్చుఁ
బితృసంతతికి వీనఁ బ్రీతి యొనర్చు రాక్షసయక్షభూతభుజంగమాది
తర్పణంబులు నర్ధ్యతానిరూఢములుగా నివి గొని యొనరించు నిట్లు నిత్య
తే. నిరతిఁ జెల్లించి తత్ఫలపరిణతి ప్ర
దీప్తతేజోవిశేషసంప్రాప్తదేవ
రాజ్యుఁడై సురమునిగణపూజ్యభావ
మహిమఁ బొందియు దీనిఁ బాయ మఱవఁ డధిప. 34

క. సురలఁ బితృదేవతలఁ దత్పరతను ము న్నెట్టు లట్ల పను పగ సమ్య
క్పరితృప్తులుఁగాఁ జేయుం, బరమకుసుమధూపదీపబలిదానములన్. 35

తే. దానఁ జేసి తదీయమహానుభావ, మంతకంతకు నగ్గల మగుటకతనఁ
దగిమె మునివరవాహనత్వంబు నమ్మహాభోగ్యతికి వేయు నేల యవద్యరహిత.

క. విను మనుజేంద్రుల కెవ్వరికిని లేనివిశేష మతనికిం గలుగుట గ
ర్వనిరూఢి నొంది దుర్వృత్తనపరుఁడై యాతఁ డజగరత్వముఁ బొందెన్. 37

వ. అట్టియెడను బూర్వంబుననుం జేసినపుష్పాదిదాన పుణ్యవిశేషంబుల మహానుభావంబు
వలన నవ్వసుమతీశ్వరు శపించినమునీశ్వరుండు సదయుం డయి శాపమోక్షంబు
నిర్దేశించెఁ దత్ఫలవిశేషంబునన యశేషదోషనిరసననిపుణుండ వగునీవప్పుణ్యాను
ష్ఠానంబున కొదవి తని చెప్పి వెండియు. 38

తే. పాండవాగ్రజ నహుషుండు బ్రహ్మసభకు
నాత్మగృహమున కరిగినయట్ల యరిగె
నట్టిపెంపును జనవిభుం డవ్విశిష్ట
దానఫలమునఁజూవె పొందఁగఁ బడసె. 39

క. అని పలికి భీష్ముఁ డిట్లను, విను మొందును దీపదానవిధి నే లనిశం
బును జేయ నూర్ధ్వలోకంబును నగ్రకుఁ బరమదివ్యబోధము నిచ్చున్. 40

క. ఎన్నిమిషములు దైవతసన్నిధి వెలుఁగంగఁ జేయు జనుఁడు ప్రదీపం
బన్నిసురవత్సరములు సుఖోన్నతి సన్నుతుల నాతఁ డొప్పు దివమునన్. 41

క. అనిన విని ధర్మజుఁడు శంతనుతనయునితోడ విప్రధనము నపహరిం
చినయాతఁ డేగతిం జను, ననుటయు నతఁ డిట్టు లనియె నన్నరపతికిన్. 42

క. దురితము లనేకములు గల, వరయఁగ లోకమున వానియన్నిటికంటెన్

ధరణిసురధనము పాపపుఁ, జెరువునఁ గొను టధిక మండ్రు ధీరవిచారా. 43

క. భూసురధనాపహరణము, సేసినఁ గులనాశ మగుట సిద్ధము దానం
జేసి యగుదు చండాల, [1]త్వాసంగము నపరభవముల నందు నరేంద్రా. 44

వ. ఒక్కయితిహాసంబు సెప్పెద నాకర్ణింపుము. 45

ఆ. క్షత్త్రబంధుఁ డనఁగఁ గలఁ డొక్కనరపతి, యతఁడు మాలవాని నధికదుఃఖ
భాగిఁ గాంచె గాలిఁ బఱచు విప్రక్షేత్రతలము రేణువునకుఁ దలఁచి చనఁగ. 46

క. కని యీధూళికిఁ గడు రోసిన కారణ మేమి యనుడుఁ జెప్పె నతని కి
ట్లని యమ్మాలఁడు తొలుబ్బాముననే నొకవిప్రుఁ డుక మునులు నుతింపన్. 47

ఆ. పరమనిష్ఠతోడ బ్రహ్మచర్యవ్రత, మాచరింతు భిక్షితాన్న మొక్క
నాఁడు వేడ్కఁ బుణ్యనదితీరమున భుజింపఁగఁ దలఁచి చనఁగ బాప [2]మడరి.

క. ధరణీదేవక్షేత్రము, పరాగపటలంబు బహుళపవనంబుగతిం
బఱఁగి నరనాథ నా దగు, కరంబునన్నమునఁ బట్టెఁ గడు సాంద్రముగన్. 49

క. ఆ ధూళితోడఁ గుడిచిన, నీదుర్జన్మంబు వచ్చె నిది యెఱిఁగెదు సం
వేదనము పూర్వపుణ్యఫలోదయమునఁ గలిగె నిన్న యొకకల గంటిన్. 50

వ. దానిం జెప్పెద నవధరింపుము. 51

క. ఒకవిప్రవరుఁడు ననుఁ గని, యకటకటా యనుచు నిలిచి యడలకు మీదుః
ఖకలాప మెల్ల వాయును, సకలంబును క్షత్త్రబంధుసంవాదమునన్. 52

క. అదియె యని చెప్పి వీడ్కొని, చని మృతుఁడై తొంటిబహుళసత్కర్మంబుల్
దను నుత్తమపదమునకుం, గొనిపోయిన నిత్యసౌఖ్యకరుండై యుండెన్. 53

వ. అనిన విని యజాతశత్త్రుండు గంగాపుత్త్రుతో నాకలోకం బేకప్రకారమనోహరి
యైయుండునో బహుప్రకారప్రమోదిమై వెలుంగునో యెఱింగింపవేయనుటయు
నతండు పుణ్యకర్మంబు లనేకవిధంబులు గావే కావునం దత్తదనురూపానేకస్థానం
బై నాకంబు నిశ్శోకంబును నస్తోకసుఖకరంబును నైకరం బొప్పుచుండు గౌతమ
శతక్రతుసంవాదం బను నితిహాసంబు విను మది భవదీయప్రశ్నంబునకు బ్రాదేశ
విశదీకరణం బగు నుత్తరంబై యుండెడు గౌతముం డను మహాద్విజుండు వనంబు
నం దపంబు సేయుచుండి శుండాలశిశువుం దల్లి లేనిదాని నొక్కెడం గని
కారుణ్యంబు వొడమి పుత్త్రునింబోలెఁ బెనిచె నయ్యేనికకొదమ కాలక్రమంబున
మేటియేనుం గయి మెలంగుచుండె నక్కాలంబున భూపాలనంబు సేయు ధృత
రాష్ట్రుం డను రాజు నాకారంబు దాల్చి నాకపతి యయ్యెడకు వచ్చి యవ్వారణ
పతిం బట్టి తనకుం గొనిపోవువాఁడై దీని నా కిమ్మని యమ్మునిపతి నడుగుటయు
నతండు. 54

తే. ధర్మములు దెచ్చి యిచ్చు నేని చట లేని, సమయమునఁ గాచు నీపర్ణశాల మర్త్య

1. గ. త్వాసంగతి యపర. 2 క. పెడబి.

బుద్ధియుతిఁ బెంచి యీ దంతిఁ ✽ బుత్త్రుఁబోలెఁ బెనిచినాఁడ నీకీఁజాల మనుజనాథ.

ఇంద్రునకు గౌతమమహామునితో నైనసంవాదము

వ. అనుటయు నాధృతరాష్ట్రమనుజవిభుండు. 56

చ. మునులకు నేనుఁ గోటికి నశ్వమూల్యపుగోవులఁ బుచ్చుకొమ్మ వే
యునఘ పసిండి నీవలసినంతయు నిచ్చెద నన్న శైశవం
బున నిది దల్లి లేక కునికిఁ ✽ బుట్టిన యక్కటికంబు పెంపునం
బెనుచుటఁ జేసి దీనిపయిఁ ✽ బ్రేమము నామదిఁ గల్గు భూవరా. 57

క. కావున నొల్లను, బదివేల్గోవుల నిచ్చినను నిమ్మెకోటి దూసఁగినం
బోవయ్య యేను మొదలు యిడఁగా వానిరిఁ గొనఁగఁ దగు నిక్కరిపతి నీకుఁ. 58

క. అని మునిపతి పలికిన నృజసమతి వాహనము గాఁగ ✽ సామజముం గై
కొనఁ దగదె రాజులకు నిట్లనఁ దగునే నీకు విడువు ✽ హాస్తిఁ బ్రియమునన్. 59

వ. అని రాజసంబు దోఁపం బలుకుటయు నప్పరమద్విజుండు పుయిలోట దక్కి యి
ట్లనియె. 60

తే. పుణ్యకర్ములు స్వర్గంబుఁ ✽ బొందఁ గనుట, పాపకర్ములు ఘోరార్తిపాలుపడుట
చూచుటఁ గల్గు నజ్జముసభ ✽ కేఁగుదెమ్మ, దంతి నచ్చట నిచ్చెద ధరణినాథ. 61

వ. అనుటయు నతండు. 62

సీ. వినుము నాస్తికు లగుజనులుఁ బాపాత్మకులును గాక యేను వత్తు ముసీంద్ర
యచటికి నన్న నయ్యముఁడు పుణ్యుఁడు లేడీ, యాదరం బొప్ప దేయుని యెవిప్రుఁ
డమ్మాట కవ్విభుం ✽ డప్పఁ బ్రోచు నతండు, దల్లికిఁ దండ్రి ✽ కత్యంతభక్తి
గలవాఁడు నమ్మెలు ✽ గను నందు రా నొల్ల, నని పల్కెఁ బల్కిన ✽ నత్తపస్వి

తే. రమ్ము మందాకినికిఁ దత్త్రటమ్ము పొంత, హాస్తి విడిచెద ననుమాట యాడ నాతఁ
డతిథిశిష్టాన్నభోజులు నప్రతిగ్రహులును గంద్రది సరికి నేయుదు నెయ్యుఁగాటు.

క. అనినను ముని మేరువనంబున నీ కొప్పింతు గజముఁ ✽ బొంద మనుడు న
జ్జననాథవరేణ్యుం డాతనితో నిట్లనియె నిగుడ ✽ దరహాసముతోన్. 64

క. మృదువులు సత్యోపేతులు, సదయులు భూతహితు[1] లందుఁ జనుజనములు నా
కది యేల పెద్ద నిదె వచ్చెద నొండొకమంచిచోటు ✽ సెప్పు మనఘునన్. 65

క. నారదమునినాయకునివి, హారస్థల హైనవనము నందు దిచ్చెద నీ
వారణము నచటు కిన్నరధీరమ్యం బప్సరోమ్యతి ప్రియ మనఘా. 66

సీ. అనిన గౌతముపల్కు ✽ విని గీతనృత్యాది, చతురులై దేవకాంతానమ్మనీంద్ర
హర్షంబు గావించు నట్టివా రచ్చటి, కరుగఁదు రే నొల్ల ✽ నచ్చ టనియె
నరపతి యుత్తరకురుభూము లనిమిష, కమనీయములు సర్వకామ్యవర్షి
యగు నందు పాసవుఁడట వచ్చి కరి నొప్పఁ, గొనుమని పలికె నక్కమ్మునివరుండు

1. గ. అందు ✱ జనుజనములు.

తే. కామహింసారహితులకుఁ § గాక నాకుఁ
దరమె తత్ప్రదేశం బని § దర్పకారి
నాఁడెఁ బలి దాని కాభాసురా § గ్రగణ్యు
డిందుగృహమున నిత్తుర § క § మ్మిభము ననుడు. 67

క. ధ్యానరతులు సత్యము లా, దానవిముఖు [1]లందుఁ బోవ్రుక్తరముజనులు నా
కానెలవు [2]నెలవు లే దని, మానవపతి పలికె ముని సమధురవచనుఁడై. 68

వ. అన్నరనాథుతోఁడ. 69

సీ. రవిపాల నిచ్చెద § రమ్మ కుంజరముఁ జే
కొనుటకు ననిన నక్కజ్జనవిభుండు
సుతతపస్స్వాధ్యాయ § రతులకు గంతవ్య
మచ్చోటు నా కేల § యనుటకు వరుణు
పురిఁ గుంభిఁ § గై కొనుపోద మన్న మునిఁ జూచి
యగ్నిహోత్రము నిష్టక్రియజనములును
గలవా రరుగుదురు § గాక యన్నెల వొల్ల
నని యాడె భూపతి § యతని కాతఁ

తే. డింద్రుకడ మర్త్యకోటికి § నిష్ట మచట, గారు నీ కిత్తునని చెప్పె § కౌరయాణి
వేదిశతవర్ష పురుషులు § పోదు రందు, దాని నేఁ గోర నని పల్కె ధరణివిభుఁడు. 71

వ. పలికిన నప్పరమతపోధనుండు.

క. కదిఁ గొను మచ్చోటను వే, పోద ప్రాజాపత్యలోకమున కనవుదు నా
కది యేల యశ్వమేధుల,పద మనిరెం బలికె తపస్విపతి యాతనితోన్. 72

చ. అపగతమోహశోకమగునట్టిది గోగణలోక మిత్తు మ
ద్విపవరు నందు నీకనినఁ దీర్ఘనిషేవులు గోప్రదానపు
ణ్యపరులు బ్రహ్మచర్యనియమాఢ్యులు నచ్చటి కేఁగువారు దా
నిపయిఁ బ్రియంబు నాదుమది § నెక్కదు నక్కడ కేల వచ్చెదన్. 78

సీ. అని ధృతరాష్ట్రుఁ డాడిన ముని శీతోష్ణ,సుఖదుఃఖమిత్రారిముఖములైన
బహువిధద్వంద్వముల్ పరఁగవు బ్రహ్మలోకమున నయ్యెడ పామజము హరింతు
గాని రమ్మనుడు నమ్మానవపతి యసంగులుఁ గృతాత్ములు వ్రతాచలితమతులు
నధ్యాత్మనిరతులు § నందుఁ బోదురు గాక, యచ్చోటు గాన శక్యంబె నాకు

తే. నవనిసురవర్య యన రాజు § నతఁడు చూచి
మునిముహూర్తరుఁ డే నిన్ను § ననిమిషేంద్రుఁ
గా నెఱింగితి సెల్ల లోకములఁ దిరుగు
దెచట నైన బొందదు గదా § యెగ్గు నిన్ను. 74

1. క. గ. చ. లందు వోవు. 2. గ. నెలవు

చ. అనవుడు మ్రొక్కి యింద్రుఁడు మహాత్మ మతంగజ హేతువాదవ
ర్తనుఁ డనుఁ బంపు నీపనుపు ౯ దగ్గొని చేసెద నన్నుఁ బుత్త్రుఁ డీ
వనకరి నాకు సాధుజనవత్సల యిమ్ము కరంబు నెమ్మి దీ
ని ననియె సాంత్వనంబుగ మునిప్రవరుండు కులప్రదీపకా. 75

వ. అనిన విని యింద్రుం డి ట్లనియె. 76

తే. కరి సెలంగి నీమీఁదఁ బుష్కరము సాఁచి
మూరుకొని మెడు నడుగుల మ్రోల నిల్పి
ముద్దు [1]గురియుచుఁ బలుమఱు ౯ మ్రొక్కు నిట్టి
దాని నిన్నేల పాపుదు ౯ మానసీయ. 77

మ. నను నే డాఁచెద నన్న నేబుధులుఁ గానం జాల రక్షింతు బో
ధనసంపత్తి నెఱింగి తేర్పడ మునీంద్రా రండు నీవుఁగ భవ
త్తనయుం డీకరియున్ నిశాంతసుఖనిత్యం బైననాకంబునం
దనపాయస్థితి మత్సఖత్వమునఁ బెంపారం బ్రవర్తింపఁగన్. 78

ఆ. అనుచు సంతసిల్లి ౯ యట్లు కాకనిన న,మ్మునివరుండుఁ గరియు ౯ మున్న గాఁగ
నేఁగ దివమునకు మహేంద్రుండు సమ్మోద,భరితుఁ డగుచు గురునృపాలవర్య.

క. అనిన విని భీష్ముతో న,జ్జనపతి యిట్లనియెఁ దపము ౯ సారపుధర్మం
బని యేఁది మీరు సెప్పుదు, రవఘా రేకుండునే తదధికం బొకఁడున్. 80

వ. అనుటయు నాదేవవ్రతుం డా నరదేవోత్తము నర్మిలి నాలోకించి. 81

భగీరథునకు బ్రహ్మతోనైన సంవాద ప్రకారము.

సీ. వినుము ధర్మము లెల్ల ౯ వినుతకృత్యంబుల,తప మొన్ని యొన్నఁగా ధర్మ మెందుఁ
గలదు తపం బనఁగా నియతాశన,త్వము భగీరథుఁడు పద్మజునిసభకు
నరిగిన నతనితో నద్దేవుఁ డిందుల, కతులనిర్మలతప ౯ మాచరింప
కరుగు దేరంగ నెవ్వరికిని రా దెట్లు, వచ్చితో యనిన నవ్వసుమతీశుఁ

తే. డేను గోదానములును భూదానములును
గన్యకాదానములుఁ దీర్ఘశీలనములును
రాజసూయాశ్వమేధాధ్వరములుఁ బెక్కు
సేసినాఁడ వచ్చుట దానఁ జేసి కాదు. 82

మ. అవనీదేవత లొక్కెడం గ్రతువిధివ్యాసక్తులై యుండఁ ద
ద్విఘాతంబులు దోఁచె నేను రణసంరంభంబునన్ వారికు
త్సవ మొందించితి వారిఁ బాసి ముద మందఁ దన్ వారు నన్ బ్రహ్మపా
లవరిష్ఠావ్యయసౌఖ్య మొందు మని లీలం జెప్పినన్ వచ్చితిన్.

తే. ఆఁకలియు నీరువట్టును ౯ నాదరింప

1. క. గ. గురియుచు.

కేను విప్రులపని సేసి § యిట్టిమహిమఁ
గంటి నియతాత్మసత్వమ § కాక తప మ
నంగ వే ఱొండె ధర్మాభినంద్యహృదయ. 84

చ. అనుటయు బ్రహ్మ యవ్విభున § కర్చన లిచ్చి తగంగ గారవిం
చె నధిప నీవు విప్రుల భజించుము సంయమితాత్మనుండ వై
యని దివిజాపగాసుతుఁడు § సాదరభాషణవృత్తిఁ జెప్పిన
న్విని ముద మంది ధర్మజుఁడు § నెమ్మి దలిర్పఁగ నమ్మహాత్ముతోన్. 85

క. పురుషుఁడు శతాయు వను శ్రుతి, పురుషవరా బాలురైనఁ § బొందుదురు మృతిం
జిర మగు నేమిటఁ నాయువ, దిర మగు నెద్దానఁ దెలియఁ § జెప్పుము కరుణన్.

87

వ. అనుటయు నయ్యఖిలధర్మవేది యవ్విభున కిట్లనియె.

తే. అనఘ యాచార మాయువుఁ § బెనుచు నదియు
కాదు శ్రీయును గీర్తియుం § గలుగఁజేయు
విను దురాచారుఁ డాయువు § పెంపుఁ బొందఁ
డతని సర్వభూతంబులు § నభిభవించు. 88

క. కావున నాచారపరత, భూవర మేల్ సాధుజనులు § వొందు తెరువు సం
భావించుట యాచారము, దా వర్ణాశ్రమసమర్హ్యఫలం బరఁగు నృపా. 89

ఆ. గురునిమాట నరకు § గొనమి దుశ్శీలత
పిట్ట పుడుక గోరు § పిసుకఁ ద్రుంపఁ
గజవ మరగు టుదయకాలా § స్తమయసమ
యముల భానుఁ జూచు § టాయు వడఁచు. 90

క. విను క్రోధంబును హింసయు, ననృతంబును లేమి సంధ్య § లైనం దదుపా
సనము సురపూజనము శ్రే, షానరించుట చిరతరాయు § వొనరించు నృపా. 91

క. పరదారగమన మెప్పుడు, పురుషున కది యెల్లపాపకములకంటె నరే
[1]శ్వరవర యాయుస్సంక్షయ, కరంబు తద్వర్జనంబు § గను మే లరయన్. 92

క. [2]పరదారలయందును సఖి, గురువృద్ధనృపాలబాలకులబాంధవభూ
సురవైద్యభృత్యబుధనా, గరకులసతు లాయువునకుఁ § గడుఁ జేటనఘా. 93

94

వ. అని చెప్పి.

క. మే లివి గీడివి యని భూ, పాలక యేఁ జెప్పినట్టిపను లెఱుఁగుము నీ
వోలిన యాయువుఁ బెనుపం, బాలు ననియు నపహరింప § శత్రుము లనియున్.

తే. తగనియది యెద్ది యైన వ్ర § తంబు పూని
మాన నోపిన నాయువు § మాల్పకుండు
నంతటన పోవ దాయు వత్యంతవృద్ధిఁ

1. చ. శ్వర పరమాయుస్సంక్షయ. 2. క ఎ. జ. పరదారములందును.

చేయఁ దగినది సేసినఁ | జెప్పనేల. 96

వ. అని పరిభాషించి. 97

క. దేవగృహముకడ వీథిని, గోవాటమునందు రచ్చకొట్టముపొంతన్
భూవర సస్యములను విష్ఠావిసృజన మెప్పుడుం | జారిత్రవిదుల్. 98

ఆ. ప్రాఙ్ముఖుండు నార్ద్రపాదుండు నై భోజ
నంబు సేఁత మేలు సంగ విందు
నిలిచియుండి కుడుపు | నింద్య మమ్మెయి మూత్ర
సర్జనంబుఁ జౌపసరణి యందు. 99

క. అనలము గోవును బ్రాహ్మణుఁ, జన దెంగిలితోడ ముట్టఁ | జంద్రార్కులఁ జూ
డను నమ్మెయిఁ దగ దాసన్నమును గాంస్యము నసభు భిన్నములు వర్జ్యంబుల్. 100

ఆ. వృద్ధు వచ్చునపుడు | విను బాలుప్రాణంబు
లెగయఁ జూచు నతని | కెదురు లేచి
ప్రణతిఁ జేసెనేని | [1]బాదునఁ బడి యవి
దొంటియట్ల నిలుచు | దురితదూర. 101

తే. అధ్యయనమున మస్తకం | బంటుటయును
నిద్రయును సముచితతోడ | నింద్యకోటి
శిరము గ్రోఁకంగఁ దగ దిరుసేత మస్త
కంబు తైలంబుఁ బూయఁగాఁ | గాదు మేన. 102

సీ. వైరసంబంధంబు | వలవదు గురునితో, నతఁడు కోపించిన | ననుసరించి
తేర్పుట మేలు నిరసించుట గురు నెడ, సన్నుతి మాడుట యాయువపహరించు
విప్రగోస్త్రీయువృద్ధదుర్బలభారవహగర్భిణులకు నీ | వలయుఁ దెరువు
మాన్యభూదేవుని | మంగళంబుల వనస్పతులను వలగొని | చనఁగ వలయుఁ

తే. పంచదశినిఁ జతుర్దశిఁ | బద్మమిత్త్రి
వసుతిథుల జన్మతిథులందు | వలయు బ్రహ్మ
చర్య మడుగు లొండొంటితోఁ | జనదు తోమ
దోషములు గొండియమును గ్రూరభాషణంబు. 103

తే. అంగహీను దరిద్రు విద్యావిహీను, రూపహీనునిఁ దెగడుట | పాప మండ్రు
వేదదేవతానిందలు పెతినార్థముగ జోస్యంబు నడపుట | కల్మషములు. 104

సీ. దంతధావన మూత్రపురీషసర్జనంబులు మాని యై చేయవలయు నుభయ
సంధ్యల నిద్రింపఁ | జనదు తండ్రికి రేవు, మ్రొక్కు మాచార్యవిప్రులకు వరుస
మఱి మ్రొక్కనది పీఠ కెక్కఁగుట దక్క దేవార్చనంబునకు ముక్కన్న న్యాకడకుఁ
జనఁ గాదు గర్భిణీసంయోగ మెప్పుడు, పరిణయంబునకు ముందు సురతసుఖము

1. క. బాలునఁబడి

తే. ననుభవించిన నవకీర్ణి ✽ యండు దట్టి,యఘమను వోవుఁ బ్రాయశ్చిత్తకమాచరింప
నుత్తరము పడమర దలఁకయుఁగ శయింపఁ,దగదు శీర్ణతల్పంబునిక ✽ ద్రయమును గడు.

క. సితపీతంబులు ధార్యము, లతులమలీ కుసుమకోటికయందుఁ గృతస్నా
నత శే పాపము శుచితా,చ్యుతుఁడగు సుస్నాతుఁడేని ✽ నొడలు వొడసినన్.

తే. నీళ్ళ నాడక మును పూఁత ✽ నిందితంబు, సీర తడితో విడిద్బుటక్సెట్ట రొంటరులు
గట్టివిడిచినవస్త్రంబు ✽ గట్టఁ రాదు,మడత మార్చు టొప్పదు.[1]కడుకమాపు డైన.

క. వలవదు వటపిప్పలముల, ఫలములు నమలంగ మేడికపండ్లను దగ దా
వుల మోఁకల సెనిఁగులయొంజ,చులుఁ గానివి యవిహితంపుఁకజాతుల. నధిపా. 108

క. విను [2]మొరుచూచిన మహాచూ, చినభోజ్యము నింద్య మస్వాకచిత్తముతోడం
గొనఁదగ దాహారము పాత్తునఁ గుడుచుట యఘమను గూడుకదూషించుటయున్.

క. చేతఁ గొని యుప్పు [3]నములుట లాతిపనుని నుప్పు గొనుట ✽ రాత్రి దధియుంభూ
పేతంబుగఁ గుడుచుట ధర్మేతరములు రేయి సక్తు ✽ వెగ్గు నరేంద్రా. 110

క. ఒకరులు మూదినయది వారికి బెట్టక నములుటయును ✽ బ్రీతిం దనపం
క్తికి దెచ్చినచుట్టలు వే, ఱొకభంగిం గుడువ గుడుపు ✽ నుఱు విమతుక్తిన్. 111

క. నేయి మధువు సక్తువు దధి,పాయసము:జలంబు భుక్తకపరిశిష్టము భూ
నాయక యొరికి నిడఁ దగ, దాయావు పెంపారఁ గోరు ✽ టాత్మఁ గలిగినన్. 112

తే. అంగుళాగ్రములఁ సిటికెనకలందు మొదలు
లనఘ దేవర్షితీర్థము ✽ లనఁగఁ బరఁగు
వరుస వల కేలియుప్పలకవాఱు పైత్ర
కంపుతీర్థంబు తర్పణకకార్యమునకు. 113

క. ఆచమనపూర్వకంబుగ, నాచరణీయంబు సర్వ ✽ మొగుతర్పణమున్
వాచఃపరుషత క్రోధం, బాచారవిధిజ్ఞ లఘువు ✽ లండ్రు కుమారా. 114

క. దివమునసురతం బెయ్యెడఁ, జనదు చెడిపఁగన్యఁ గవయఁగఁబండు పతిత సం
టనిదాని నగ్నఁ జూడం, జన దుమిసిన వార్పు కునికి ✽ సకులుతుఁ డైనన్. 115

ఆ. అట్టిమొదలఁ దనకు ✽ నాచమనము దొర
కొనక యున్న సూర్యుఁ ✽ గనుచుఁ బ్రణవ
కలనతోడఁ గూడ ✽ వలచెవి ముట్టుట
శుచిత నిచ్చు నండ్రు ✽ సూరి జనులు.

ఆ. భగిని గురుని మిత్త్రుఁ ✽ బండితు [4]వంశజుఁ జేదవడినఁదెచ్చి ✽ ప్రియములోడఁ
దనగృహమునకల్మి ✽ కనురూపముగఁబ్రోపు, పెనుపు సేయునాయువనకు సిరికి.

క. పారావతములు శుకములు, శారికలును బుష్పలతలు ✽ జనవర పసిఁడిం
జారమున నైనమట్టులు, నారయ గృహమునఁగలంబుకలాదర్శములున్. 118

1. క. గ. చ. 'కులునాళ్ళుడైన' 2. క. మాచూచిన: గ. మాన్పూచిన; 3. గ. నంజాట. 4. వంశ్యాన్.

తే. గ్రుడ్డి గ్రద్ద దివ్వారువు | బ్రువ్వఁ గూబ
యిల్లు సొచ్చిన శాంతి సే | యింప వలయుఁ
బదువుఁ గుడుపును సందెలఁ | జనదు రాత్రి
యైన బితృకార్యములు సేయు | టఘముఁ జేయు. 119

క. కులమును రూపము శీలముఁ, గలకన్య వరించి యందుఁ | గనినయపత్యం
బులకుఁ దగ నడవునది మంగళములు కృతదైవపైతృక | క్రియఁ దగఁ జుమీ. 120

తే. వలయుఁ బ్రాఙ్ముఖోదఙ్ముఖ | త్వముల నొకటి
తారకంబులుఁ దిథులును | వారములును
జోస్యు లెఱిఁగించినవి మేలు | సువ్రతైక
లోల మంగళపనికిని | దైవమునకు. 121

క. వినుము సపిండీకరణం, బున్న నేకోద్దిష్టమునను | భోజనవిధి వ
ర్జన మొప్పు నామతింపక, చన దామెతఁ గుడువఁ బోవ | సజ్జనవినుతా. 122

క. తల్లికిఁ దండ్రికి సుతులకు, నెల్ల విధంబులను వలయు | హితములు సెప్పన్.
మల్లకుఁడు గాక కర్జము, [1]సల్లభ్యము గాఁగఁ జూచి | సౌదన్యనిధీ. 123

సీ. క్షత్రియుం డశ్వంబు | గజమును రథమును, నెక్కఁ నేర్పులు గడు | నెక్కఁగఱచి
నానాయుధాభ్యాస | నైపుణంబునఁ బొల్చి యుద్ధతంత్రములకు | నోహటింప
కుండెడుమదిఁ బేర్చి | దండనీతికి బాధకం బగునట్టిశాస్త్రంబు మొదలు
గాఁగ గాంధర్వంబుఁ | గామతంత్రంబు లోనుగ శాస్త్రముల నెల్ల | దగినభంగి

ఆ. నలవరించి మున్న | యధ్యయనంబునఁ, [2]జొరవు గలిగి ధర్మ | చరణవేది
యై ప్రజాభిరక్ష | యధ్వరకరణంబు, వలను మెఱసి నడవ | వలయు నధిప. 124

క. విను వర్ణాచారంబుల, ననఘ యిచటఁ దెలుపఁ దొడఁగ | నైనను మునులీ
పను లాయుర్వృద్ధికరము, లనుటకతన వలసె నీకు | నై చెప్పంగన్. 125

సీ. అధిప రజస్వల | నంటుట కల్మష, మాచరితస్నాన | యైనసతిఁ జ
తుర్థదినంబున | దోషాసమయమునఁ, జెందంగఁ దగు నందు | గొంద ఱార్య
లేనవనాఁడొంద | నింతియు మష్టామ,మునఁ బొంద మగవాఁడుఁ | బుట్టు వినుము
మఱియును సమవిషమము లగుదివసంబులం దోలిఁ బురుషండు | నంగనయును

తే. సంభవింతు రిట్టులు షోడశంబుదాఁక, నెల్లనాఁడును ఋతుశక్తి మొదలకుండ
నట్టికార్యము గల్గిన | ఋతుమతీసమాగమము దప్ప నీకున్న | నాయు నెక్కు.

క. విను మాచార మవశ్యం,బును నడపఁగ వలయు ధర్మ | మున కది మూలం
బనఘా ధర్మం బాయువుఁ, బెనుచును లక్ష్మిని యశంబుఁ | బెం పొందించున్.

తే. ఇన్నియాచారములలోన | నెక్కుడండ్రు
సకలభూతంబులందును | సదయఁ డగుట

1. క, గ. చ. సల్లాభముగాఁగ జూచి 2, గ. జొరవ

యాది మును లట్లు గావున ✱ నఖిలవర్ణ
ములకు దయగల్గి పెద్దయు ✱ వలయు గుణము. 128

క. ఈ యాచారాధ్యాయం, బాయుశ్శ్రీకీర్తికారి ✱ యగు పాపంబుల్
వాయం జేయును బృథివీ,నాయక సద్భక్తిఁ జదివినను దగ వినినన్. 129

తే. అనినఁ బ్రీతుఁడై పాండునృపాగ్రతనయుఁ
డమలతటినీతనూజులో ✱ నన్నదమ్ము
లేమివిధమునఁ దమలోన ✱ నెనచి నడచు
వార లెఱిఁగింపు మనుటయు ✱ గారవమున. 130

వ. అతం డతని కిట్లనియె. 131

క. విను భక్తియు వెఱపుఁ గలిగి, యనుజన్ములు పెద్దవాని ✱ నారాధింపన్
జనవర యతండుఁ దమ్ములఁ, గొనియాడన్ సిరికిఁ బట్టగుదు రుజ్జ్వలులై. 132

క. అనుజుఁ డొకఁడు వెంగలి యై, నను దప్పెడుఁ గాని పెద్దనకు గార్యజ్ఞా
ననిరూఢి లేక తక్కిన, యనుజన్ములు సక్కవడుదు ✱ రవనీనాథా. 133

చ. జనవర యన్నదమ్ములు ప్రసన్నమతిం గలకల్మి పంచి కు
డ్చిన వినుతించు లోకమును ✱ శ్రీయుఁ బొరింబొరిఁ బెంపు నొందు లో
భనిరతిఁ బెద్ద కాసపడి ✱ పాడి దొఱంగిన బ్రాణగొడ్డవుం
బను లగు నవ్విధంబు మనపడ్డది గాదె జగం బెఱుంగఁగన్. 134

తే. తండ్రి పిమ్మట నన్నయ ✱ తండ్రి పిన్న,వారలకు నెల్ల నాతనివనిత దల్లి
దల్లి గడచన్న నని చెప్పితాత మఱియు, మనుమనికినిట్టులనునభిమన్యుపౌత్ర.

క. మానవనాయక యగ్రజుఁ, డైనను ననజన్ముఁడేని ✱ నన్యాయంబుం
బూని సహోదరులకుఁ గీ,డైన నతఁడు దండ్యుఁ డందు ✱ రవనీపతికిన్. 136

వ. అని సహోదర ప్రకారంబు సెప్పి వెండియు. 137

క. విను మప్పఁ దల్లి యట్లుగఁ, గొని నడపఁగ వలయుఁ జన్న ✱ గుడిపి పెనిచె న
వ్వనిత యదియు నాతనికిని, జననీసమ యండ్రు బుధులు ✱ సౌజన్యనిధీ. 138

క. జనకుం డధికుఁ డుపాధ్యా,యునకుం బదిమడుగు లెక్క ✱ దుర్వీనాథా
జనకునకు దశగుణంబులు, జనని గురుత్వమున నిది ప్రశస్తము స్మృతులన్. 139

క. జననీజనకులచే నగు,జననం బాగమము తనువిషయ మని చెప్పన్
విను మాచార్యునలన నొం,దినపుట్టజరామరంబు ✱ దివ్యంబు నగున్. 140

వ. కావున గౌరవంబున నాచార్యుండు సర్వాధికుండు. 141

క. అని యిట్లు సుప్రసంగం,బున గురుజనతారతమ్యములు సెప్పినఁ దా
విని శంతనుతనయున కి,ట్లనుఁ బాండునృపాగ్రతనయుఁ ✱ డతులితభక్తిన్. 142

క. భూసురులకు నృపులకు నుప,వాసము దగుఁ గాని యన్యవర్ణులకు దదీ
యాసక్తి గలిమి పెద్దయు, దోసం బని విందు ధర్మధుర్యస్వాంతా. 143

భీష్ముఁడు ధర్మరాజున కుపవాసవిధివిశేషంబు చెప్పుట.

వ. ఉపవాసవిధియోగ్యతయును దత్ఫలవిశేషంబును వినవలతుం జెప్పవే యనుట యు నప్పురుషవరుం డప్పుడమిఱేనితో దీని నీవు నన్నడిగినట్లు యే నంగిరసు నడిగిన నమ్మునిపతి నాకుం జెప్పె నట్టియంగు చెప్పెద నాకర్ణింపు మని పలికి యిట్లనియె. 144

క. రాత్రిత్రయంబు బ్రహ్మ, [1]క్షత్త్రియులకు నుపవసింపఁ గ జనుఁ దదధికమున్
గాత్రస్థితిఁ దప్పింపని, మాత్ర [2]నయిన మేలు కురుసత్తమాజవరేణ్యా. 145

క. విను వైశ్యులకును శూద్రుల, కును నాలుగుఁగడుపు లుడుగుకోలఁదికి మిగులం
జన దుపవసింప నుపవా, సనిరోధత పెంపు కల్మషము వారలకున్. 146

ఆ. పౌర్ణమాసిఁ బూర్వపక్షాష్టమీచతు, ర్దశుల నుభయపక్షవళిత వచ్చు
షష్ఠిఁ బంచమిని సుకృతివిష్టై నుపవాస, మున్న వివిధశుభము లొలయు నండ్రు.

సీ. ఏకభుక్తవ్రతం బొంతయు నిష్ఠ మాసం బెల్ల నడపిన సద్ద్విజుండు
సుభగాకృతియు రూపశోభితాంగనయు సత్పుత్రులును ధనధాన్యతతులుభోగ
ములు సద్గుణంబులు భూరియశంబును, నుదయైనబహుసుఖాంశబులకుఁ బాత్ర
మగు నేఁడుగాలమక్షయ్యతుల వ్రతమునల్పి, సుఖలభూలోకసౌఖ్యములుఁ ద్రిదివ

తే. మోదమును గండ్రు రెండును మూఁడు నాల్గు
నీక్రమంబున నోపిన నెక్కినట్టి
దినము లెడపెట్టి కుడుచుచు ధృతి నోఁడు
నడపువారల లెఱుఁగు లేకర్పడఁగ వినుము. 148

క. ఎక్కుడుదినముల శుభములు, నెక్కు నఖిలవైభవములు నెక్కు దినమునం
దక్కక యుండెదుకాలము, నెక్కు మహాత్మ్యతయు నెక్కు నిభపురనాథా. 149

తే. వత్సరం బెల్లఁ బక్షోపవాసనియతిఁ, గడపినతనికిఁ బుణ్యలోకంబు లెల్ల
వాసభూములు మాసోపవాసవృత్తి, నైన బ్రహ్మలోకంబుసౌఖ్యంబుగలుగు. 150

ఆ. ఎంతనిష్ఠ గలిగెనేనియు మాసంబు, లోనిరెండ వొక్కదైనదినము
లధిప యుపవసింప నగుఁ గాని మాసాధి, కోపవాసవృత్తి పాప మండ్రు. 151

వ. యుగసామర్థ్యంబునను బురుషుమహానుభావవిశేషంబునను జేసి యుపవాసవ్రతంబు మహాధికకాలకృతం బయినను గీడుం జేయక యత్యంతఫలప్రదం బై యుండు. 152

తే. మాతకును వేదమునకు ధర్మంబులకును
బరము లగుగురుశాస్త్రలాభములు లేవు
తపము లే దుపవాసవ్రతంబుకంటె
నధిక మైనది యండ్రు మహాత్ము లనఘ. 153

1. క. క్షత్త్రియులకు. 2. గ. మయిన మేలు.

తే. పావనంబులలో నెల్ల బ్రాహ్మణుండు, పరమపావన మను శ్రుతి పౌరవేంద్ర
యట్లు గావున భూదేవతార్చనంబు, భక్తిసంభృతముగ నడపంగవలయు. 154

వ. అప్రసక్తం బైనను నీయర్థంబు వినవలయునట్టిది గావునం జెప్పితి నని పలికి
వెండియు. 155

ఉ. అనశననిష్ఠఁ జేసి సురలాదిమునుల్ మహితానుభావు లై
రనఘ సహస్రవర్షసమయాంతరకల్పిత మైనయేకభు
క్తనియమతంత్రమున్ నడిపి గాధితనూజుఁడు బ్రాహ్మణత్వముం
గనియె మహోపవాసములఁ గానిఫలంబులు లేవు భూవరా. 156

క. కావున నుపవాసవ్రత, సేవనము శరీరమునకుఁ జిత్తంబునకుం
బావన మైహికమహిమయు, దేవనిలయసుఖము నిర్విశేషి సేయుఁ గూరుతున్. 157

క. పరమగు నీవ్రతమున కం,గిరసుఁడు దర్శకుఁడు తత్ప్రణీతవిధమునఁ జే
నరు లెవ్వరును దర్శను లగు, మఱి వారిం బొరయ వేమిదోషములు నృపా. 158

క. ఈ తంత్రంబు పఠించినఁ, బ్రీతి వినినఁ బాయు బహుదురితములు తిర్య
గ్జాతులభాష లెఱింగెడు, నాతెలి వగు నపరభవములందును నరులకున్. 159

వ. అనిన విని ధర్మజుండు సర్వధర్మజ్ఞానమానసీయునితో యజ్ఞకర్తలగుట సేయ లని
మీరు పెక్కెడలం జెప్పితిరి యజ్ఞంబు ధనధాన్యవిభవసహాయసంపన్నులకుం
దక్క నందఱు నట్టివారలకుం జేయ శక్యంబు గాదు దెల్లం బెల్లవారికి ననుష్ఠింప
నయ్యెడునట్టిపుణ్యకర్మం బెయ్యది యుపదేశింపవే యనుటయు నప్పితామహుండు
నమ్మహాత్మునకుం డిట్లనియె. 160

క. నరవర యర్థంబులు నుం, బరివారము లేకయును బుధస్థితిఁ జేయన్
[1]దొరకొని యుండుట గని యం,గిరసుం డుపవాసముం బ్రకీర్తించెఁ దగన్. 161

క. ఉపవాసాయాసంబును, నృపముఖ్యా దుస్సహముగ నీవు దలఁచి య
జ్ఞపరత్వము దుర్ఘట మను, నెప మిడి యిట్లడిగి తని మనసీమం గంటిన్. 162

వ. అనశనవ్రతంబులందును జాలుకపి తెఱం గెఱింగించెద. 163

చ. పగలును రేయుఁ గుడ్చి జలపానము లోనుగఁ గుడ్చునట్టి తు
ష్టిగ నొనరించి మర్త్యుఁ డొకటిన్ నడుమన్ మఱి యొప్పు నంట కే
మిగతిని బాపముం బొరయకుం దలకొల్పుగ హోమకార్యముం
దగుమొయిఁ జేయుచున్న విను తంగెటిజున్నను మూర్ధ్వలోకములన్. 164

వ. ఇది మేలితెఱంగు గొందఱు దుష్కరంబుగాఁ దలంతు రట్టివారలు తమ
చూపినభంగుల నంగిరసుం డుపదేశించినయుపవాసవ్రతవిశేషంబు లనుష్ఠింతు
వా రని చెప్పిన నప్పౌరవోత్తముం డయ్యుత్తమబోధనిధికి నమస్కరించి
యధ్యాత్మగవిద్యాబోధకప్రకారంబు లగువాక్యసంచయంబులు పెక్కెడం

1. క. గ. చ. దొరకొనుపని గాదే యుం.

వ. చతుర్వింశ తత్త్వంబులు వివరించెద.

తే. అవధరింపుము భూతంబు లయిదుఁ దద్గు
ణములుఁ బదియింద్రియములు మనంబు బుద్ధి
యును మహేశ యహంకారమును బ్రకృతియు
నాఁగ దత్త్వంబు లిరువదినాల్గు వోలుచు. 178

వ. ఆచతుర్వింశతితత్త్వంబుల నధిష్ఠించి యుండుతత్త్వంబు నిర్దేశించెద. 179

క. [1]దేహం బనియెడ నెరవున, నూహించును బుధుఁడు దాన నుండుం గష్ట
స్వాహాప్రియుక్రియఁ బురుషుఁడు, సోఽహమనినకాన్పురుద్రయతఁ గనుటగున్.

క. ఈ నెఱి నీఁబచుట గలుగదు, మానేర్ష్యావంతు లైనమానవులకు ని
ష్ఠానూనతపోవర్తకు, లైనను గార్హస్థ్యబహులముఖాత్మకు లగుటన్. 181

వ. శ్రుతి పురుషు నమృతార్థతత్త్వం బనియు బ్రహ్మం బనియు నిర్దేశించి. 182

తే. అస్మి తత్త్వంబులకు నమృతార్థతత్త్వ
మెక్కుడది యీశ్వరంబు నవీశ్వరంబు
సత్యపాకంబు నతిరహస్యంబు దానిఁ
గసిన మృత్యుజాలముచిక్కు గడవ వచ్చు. 183

క. అనఘ యనులోమమునఁ దోఁపు ప్రతిలోమమున లయముఁ బొందుటయును గ
ల్గును సర్వతత్త్వములకవి, యెనయుక బ్రహ్మమును గలయు నేకత్వమగున్. 184

తే. ఉత్తమ శ్రద్ధ లేకున్నఁ జిత్త మేక, ముఖముగాకున్న నింద్రియములజయింప
కున్న వేదంబు సదువక యున్న నతఁడు, కీపరిజ్ఞాన మీఁ దగ దిద్ధచరిత. 185

వ. అని చెప్పి తదనంతరంబ యధ్యాత్మంబుల నధిభూతంబుల నధిదైవతంబుల
నుపన్యసించె నా సనత్కుమారుండు తత్ప్రపంచంబు నారదునకుం జెప్పుట యేనును
కెఱింగించి యప్పరిపాటి నిన్ను మున్న వినిపించితి ధర్మనందనా యమ్మునిపతి
మఱియు నప్పశుపతితో నిట్లనియె. 186

ఆ. సకలజంతువులకు సామాన్య మధ్యాత్మ, మాది గాఁగఁ గల్గునంతవట్టు
నిట్లుగాఁగ నెఱుఁగుటెఱుగుట యొండుమై, గనుట యెఱుక గాదు కాముదనున.

క. విను మధ్యాత్మప్రభృతులు, గసిరే ము న్నమరదనుజగంధర్వులును
గనుటయుఁ గల్గునె బ్రహ్మం,బున యున్ననిజంబు తత్ప్రబోధం [2]బసదే. 188

క. ఓంకారవాచ్యమది యన, హంకారనిరూఢభావనారాధ్యముని
వ్పంక మశీత మనుష్ణము, శంకర సుఖలంబునకుఁ బ్రపహారము శివా. 189

తే. అప్రమేయ మవిజ్ఞేయ మచల మాది, విరహితంబు నితాంతంబు నిమ మవ్య
యంబు పుండరీకాక్షు మనతుఁ విషయ, మచ్యుతము సదసత్పర మేకభాసి. 190

క. అది నారాయణుఁ డొకనికి, విదిత మతనివలన సురలు [illegible] ని

1. గ. దేహ మని యెట్టి వెరవున. జ. దేహంబనియెడి వెరవున. 2. క. గ. జ. బసుదే.

ర్మదసిద్ధసాధ్యగణములు, మొదలగునర్వులను బోధకములనోల మయ్యెన్. 191

వ. అట్లగుట నాతత్త్వంబు దృశ్యంబు నిరూఢంబుగా దెట్లనిన వినుము బంధవిముక్తుండు గదా కనువాఁడు. 192

చ. స్మరహర పొందు నింద్రియసమాజయుగంబు మనంబు బుద్ధియుం
బరువడి మై నహంకరణబంధము వాసినజీవుఁ డత్సము
త్కరసహితంబుగా నతఁడు సదా పరతత్త్వమునందు లీనతం
బొరయును దాని నెవ్వరు ప్రబోధముగాఁ గనువారు చెప్పుమా. 193

క. భూతము లన్నియు నడఁగిన, యాతఱిఁ దనుఁ దాన కనుచు నంజనరహిత
త్యాతిశయ మెసఁగ వెలిఁగెడు, నాతెలి వాతత్త్వ మనకు నమరు మహేశా. 194

ఆ. అని సనత్కుమారుఁ డభవుతో మఱియు ని, ట్లనియె దేహవర్తు లైనదైవ
తముల నెల్ల నాదరమున నాకర్ణింపు, మేర్పరింతు యోగసహితము గోర. 195

సనత్కుమారుఁడు శివునకు దేహాంతర్గతదైవతములం దెలుపుట.

సీ. జిహ్వ సోముఁడు వాణి శిఖి ప్రాణమున గాడ్పు, దానంబునందు నశ్వతహ్రాదాలి
వ్యానస్తనాంతరవర్తు లై పర్జన్య, గగనములు బలమునఁ గౌశికుండు
మఱి నపానమున సమానంబునందు నీ, శానమిత్త్రాప్సరసస్వమిత్రు లక్షు
లందు సూర్యుఁడు మేన నంఘ్రులఁ జెవి భూమి, ధరణీధరుండుఁ దిక్కత్తి యుపస్థ

తే. మునఁ బ్రజాపతి బుద్ధియం దనఘ బ్రహ్మ
యుందు నింతకు బుధ్యమానుం డనంగ
వెలుఁగు నాత్మ యధిష్ఠాత విను ప్రబుద్ధుఁ
డన సబుద్ధుండు నా నొప్పు నతఁడు మఱియు. 196

క. ఈ దైవతముల నన్నిటి, నాదరమునఁ గనుచు యోగి యచలితనిష్ఠా
[1]వేదమయా మూర్ధగతుం, డై దశితపేర్మి నిలుపుఁ బ్రాణము లచటన్. 197

తే. అపుడు బుధ్యమానుసిఁ గనునవ్వరిష్ఠ
తత్త్వ మవ్యక్త మందుఁ దత్త్వదర్శి యగుఁ బ్ర
బుద్ధుఁ డాతని నబుద్ధుఁ డెఱుఁగు
చుండు నిది యాత్మదశ లతఁ డొకఁడ యనఘ. 198

క. ఇవ్విధము గాంచు యోగిక, నెవ్వరు సరిగారు చూతు లనేకు లచలు లై
యవ్వస్తువు గోరుదు రది, దవ్వౌరులకు యోగితతికి దక్కు మహేశా. 199

ఆ. క్షరుఁడు నక్షరుండుఁ బరుఁడును నందు ర, వ్వినుతదశల, బంచవింశకుఁడు ప్ర
బుద్ధనామ్ముఁ డతఁ డబుద్ధుసఁ [2]గనుఁబుఱ, షవిధము గను ప్రకృతిసంగ మెఱుఁగు.

క. విను షడ్వింశుఁ డబుద్ధుం, డనఁ జను వాఙ్మనసములకు నందక యునికిం
దనరు నా తత్త్వంబుం, గనిన ప్రబుద్ధుండ యతఁడు కామధ్వంసీ. 201

1. క. వేదమయూర్ధ్వగతుం డై, ప్రాణ్కృత. 2. క. గనియె. బూర్ణవిధము.

క. వేఱుగఁ గనినం బ్రకృతికిఁ, జూలి విడిచినట్లు తనయందుసుజ్ఞానము న
శ్వాకఁబు విడిచి తనకొంటెను, మీఱుఁ నొకటి లేమి గాన్పు గ్రమ్ముకొనవలయున్.

వ. అని చెప్పి. 203

తే. తత్త్వమునఁ గల్గువాఁడవస్థలను సెల్ల
ముగ భవద్భవ్యసన్నిధి నిగడనమునఁ
గూర్పు టభిలేశ నీ వెఱుంగుటయు నాకు
నెల్లయోగిజనంబులు నెఱుఁగుటయ్యె. 204

వ. అని పలికి మునిజనకృత్యంబులు వివరించెద నవధరింపు మనుమాటయు సు
వ్యక్తంబుగా నాఁడ యాక్రీడాత్రపస్వికి నప్పరమయశస్వి యిట్లనియె. 205

క. ముని వనమున శూన్యాలయమున నైన గుహానికేతనమున నేనియి నా
సనబంధధీరుఁడై మనమునఁ గొని యింద్రియములవిషయంబునఁ బెడఁబాపున్.

క. గురూపదేశము నడపుం, బురహార వివిక్తాత్మ వేగముల నాఁకలితోఁ
బొరయం డయ్యభ్యాసము, గురువుగ నాహార మెప్పుడుం గొనఁ డేవన్యలన్.

క. కుడిచినయప్పుడ యోగము, దొడఁగుటయును వలదు మనసు దూలకయుండవే
ప్పుడు విసువు బుద్ధిఁ గొని యెక్కుడునిష్ఠను వలయు దానిఁ గుదియింపంగన్.

క. అది గుదిసిన విజ్ఞానము, గదలక నిర్వాతదీపకాంతియుఁ బోలెం
బొదలును జిత్తంబును సుప్రలభకాసంప్రాప్తి నిశ్చలం బగు దానన్. 209

తే. అనఘ నిర్జననిశ్శబ్ద మైనయట్టి
చోటు హృదయస్థుఁ డగు దేవుఁ జూచుపనికి
వలయు లేకున్న శబ్దసంకలితమైన
సజ్జనాన్వితస్థల మార్యసమ్మతంబు. 210

క. విను తమము నిస్తమముఁ జే, తనారహితచేతనాసుధామయుఁ డాస్థా
ననిరూఢము నగుతత్త్వము, గను నిన్నియుఁ గలుగు యోగి కరుణామూర్తీ. 211

క. మదనహరా యోగనిరతుఁ, డది గని దుఃఖములఁ దొలఁగి యజరామరతా
స్పదమగు నెలవున నిలుచును, బొదలును [1]అణిమాదిచయవిభూతిపదమునన్. 212

వ. మఱియును. 213

తే. యక్షగంధర్వసిద్ధసాధ్యాదిభూత
కోటికంటెను మిగిలి యోగులు నిజేచ్ఛఁ
బరఁగుదురు భవ్యయోగతత్పరుల మేము
నిట్టు లగుట యోగీశ నీ కెఱుంగుపనియె. 214

వ. అని నిజసహజమ్మహిమునసనకసనందనసనత్సుజాతులం దలంచినవాఁడయి
వెండియు. 215

---

1. క. అణిమాదిపరవిభూతిచయమునన్.

తే. యోగధర్మంబుకంటెను నుత్తమంబు
గలుగ నేరదు ధర్మ మొక్కటియు నవున
రాగమం బగుపదమున కరయ నిదియ
మేటి నిచ్చెన సంయమికోటి కెల్ల. 216

క. యోగంబు తెఱఁగు సెప్పితి, భోగివరాభరణ సాంఖ్యమును జెప్పెదఁ ద
ద్భాగు లగు నైష్ఠికులు భవ, సాగరముం గడతు రైక్యసంబోధమునన్. 217

సనత్కుమారుఁడు రుద్రునకు సాంఖ్యయోగంబు తెఱం గెఱింగించుట.

వ. కావున నత్యాదరంబున నాకర్ణింపు మని పలికి యి ట్లనియె. 218

ఆ. ఇంద్రియములకంటె నీశాన మన మహంకారతత్త్వ మంతకంటె దాని
కంటె బుద్ధి బుద్ధికంటెఁ బ్రకృతి యొక్కఁ, డన్నిటికిని బురుషుఁ డెక్కుడరయ.

తే. అంబరాదిభూతములు శబ్దాదిగుణము
లింద్రియము లిరుదెఱఁగు బాలేందుమౌళి
మన సహంకారబుద్ధు లిట్లొనరి ప్రకృతిఁ
గలయఁ దత్త్వచతుర్వింశకత్వ మొందు. 220

క. చేతనుఁ డగుపురుషుఁ డని, శ్చేతన యగు ప్రకృతి వొంది చేతనతాప్ర
స్ఫీత యగుం బెఱతత్త్వము, లాతత్త్వం బనుమహాబ్ధియందలితరఁగల్. 221

క. గుణములఁ బొందఁడు పురుషుఁడు, గుణమహి తాప్రకృతి యిచ్చుగుణముల[1] కేమే
గుణములు దానను గుణులై, గుణిత్వ మా నిర్గుణాత్మకున కొలయించున్. 222

తే. ఏని నెల్ల నసత్కోటిఁ గా నెఱింగి
కొనుచుఁ బ్రకృతి నుపేక్షించి తనకుఁ దాన
కాని యొం డెద్దియును లేమిఁ గాంచినపుడు
పురుషుఁ డపగతధూమాగ్నిఁ బోలి వెలుఁగు. 223

తే. అట్లు గాక యహంకార మావహిల్లి
బ్రకృతి దా నని సృష్టికిఁ బ్రళయమునకుఁ
గర్త యైన వికారాత్మకత్వ మొందుఁ
బ్రకృతివికృతులు గాని యా ప్రభువు[2] నపుడు. 224

క. ధృతి వూనమిఁ బ్రకృతికి వశ, గతుఁ డగుచుఁ దమోమయత్వకలితం బగున
ద్వితతాసుఖత్వమును సుఖ, హతి బురుషుం డనుభవించు మదనధ్వంసీ. 225

క. నేరమి దాని నుపేక్షం, జేసిన షడ్వింశభావసిద్ధిఁ బొరయు గా
రీరమణ పంచవింశుఁడు, [3]సారామలనిపుణమతిఁ బ్రసన్నాత్మకుఁ డై. 226

క. [4]సత్త్వాశ్రయమునఁ బురుషుఁడు, తత్త్వాశ్రయమునను సత్త్వతత్త్వముల వివే

1. చ, కలమిక. 2. జ. నహెపు. 3. జ. సారామలనిపుణతా ప్రసన్నా. 4. క. సత్త్వానాశ్రయ పురుషుఁడు. సత్త్వాశ్రయుఁడును నసత్త్వాతత్త్వము లైన.

కిర్త్వాలేపత్వములన, వితత్త్వము జిత్త్వంబు నొందు ✽ విశ్వాధారా. 227

క. నానాత్వైకత్వము లజ్ఞానజ్ఞానజము లనవఁజాయు గండ్రు బుధుల్
వాని నవిద్యయు విద్యయుఁ గా నివి విను పంచవింశకస్థావస్థల్. 328

క. విద్యామయ షడ్వింశుఁడ, విద్యావిద్యావిభేదవిరహితుఁ డజరుం
డాద్యుఁ డనంతుం డచ్యుతుఁ, డద్వైతుఁ డనాది కేవలాత్మకుఁ డరయన్. 229

ఆ. అని యుపన్యసించి ✽ యమ్మునిపతి యను, శంభుతోడ మఱియు ✽ సాంఖ్యయోగ
శిష్టమానసుల కరిష్టపరిజ్ఞాన, వైభవాతిశయము ✽ వలసి యుండు. 230

వ. ఎట్లనిన దృష్టారిష్టవికృతు లయి యాసుకృతు లవిచ్ఛిన్నాత్మానుసంధానంబునం దదీయదురవస్థం ద్రోవం జాలుదు రరిష్టంబు లవధరింపు మనుపలుకు వలికి వాని నెల్లను విసరించెద నవి పరాశరసంభవు మీశ్వరుండు శిష్యుల కుపదేశించినవిధంబు లై యుండు నంతవట్టును మును నీ వాకర్ణించి తని యమ్మునివరుండు మఱియు నమ్మహాదేవుతో నరిష్టంబులం గాంచి యోగిజనంబులు సర్వాంగధారణసహితంబును బరమహితంబును నగు ననేకల్వాకలనకృత్యంబున మృత్యువు జయింతురని నిర్దేశించి.

క. జలమున మీను నుదుంబర, ఫలమున మశకములుఁ బోలె ✽ బ్రకృతిం దా ని
మ్ముల నునికి దెలిసి వేర్పా, టలవఱిచినపురుషుఁ డవ్యయత్వముఁ బొందున్. 232

తే. కమలదళమున నున్న జలములవిధమునఁ
బ్రకృతి నుండి తదీయసం ✽ బంధవికృతి
లేనితనుఁ గని వెలుఁగు నిర్లేపనిశ్చ
లాజరామరపదవి జీవాహ్వయుండు. 233

ఆ. ప్రకృతి నిల్లు వాసి ✽ పంచవింశుండు షడ్వింశభావ మొంది ✽ విమలశివని
రంజనస్వరూపుఁ ✽ డై వెలుఁ గొందు న, త్తెఱఁగు ముక్తి యండ్రు ✽ దేవదేవ.

క. ఈ పరిబోధం బభవా, కాపిల మస్మద్గురుండు కపిలుఁ డతనికి
దాపరిణతి బహుశిష్యులు, దీపితవిజ్ఞాను లైరి ✽ దృఢనిశ్చయతన్. 235

క. ఏనును శిష్యుల కీవిజ్ఞానము పెక్కండ్రకుం బ్రసన్నమతిని గా
ధానూనంబుగఁ దెలిపితి, మానిత మిది దివ్యమునిసమాజముచేతన్. 236

వ. గార్గ్యగౌతమకాత్యాయనాదులు దీనన చేసి దీప్తబోధు లయి వీతాంతకులును విజ్వరులును విశ్లేషులును నిర్భరానందులును నైరని చెప్పి వెండియు ని ట్లనియె.

క. సంగము బంధ మఖిలని, స్సంగత మోక్షంబు బహువిచారము లేలా
పింగజటాజూటకలిత, గంగా బాలేందుమహిత గౌరీసహితా. 238

క. అని యిట్లు శివునకును న, మ్ముని విజ్ఞాపించి గగనమున కెగసి వెసం
జనియె శివుండును నిజదివ్యనిరర్గళచిత్తపథవిహారుం డయ్యెన్. 239

క. అని చెప్పిన భీష్మున కి, ట్లను ధర్మతనూజుఁ డెక్కు ✽ డైనసముచిత్వం
బొనరింపఁ జాలుతీర్థం, బనఘా యెఱిఁగింపవే దయం దెల్లముగన్. 240

సీ. అనవుడు నాతండు నమ్మనుజవల్లభుతోడ, వినుము తీర్థము లెల్ల విధియును జేల
సత్యాభిధాన మై శౌచాతిశయముం జేయంగం జాలు మానసంబైన తీర్థ
మది ధృతి యను మహాహ్రదమున శోభిల్లుం, దమము రజస్సును దత్తయడంచి
శోధించు సత్యము సూనృతగానిచొచ్చి యాచరిత స్నానుండై శుచిత్వమున వెలుంగు
ఆ. పురుషుండు వీతరాగపరివ్రాజకేంద్రియదమ[1] వ్రతలసత్వవేకు లాతివిల్లు
విమలతీర్థములు సకలవినయత వారల, జెంపుటయును తీర్థసిద్ధి యధిప. 241
క. దమమును దపము నహింసయు, శమమును దీర్థముల వాని శౌచాతిశయం
బమలగుణ కలుగు రిత్తజ, లములం దోంగిన శుచిత్వఫలాభము గలదే. 242
వ. అని వెండియు. 243
క. దొరకొననిదానిం గోరక, దొరకొనినందును మమత్వరతుష్టహ్రాదయుతిం
బొరయక విగతస్పృహులగు, పురుషులు శుచు లేలతీర్థములు వారలకున్. 244
క. అనినం బ్రియమందె తాతకు, మనుమండు ప్రణమిల్లి బోధసమహితా యీన
ర్తనమున నుత్తమపదముం, గను సంద్రది మెఱుంగం జెప్పు కరుణాదలిర్పన్. 245
వ. మృతుండు మేను విడిచి యెయ్యది సహాయంబుగాం జను నదియును వినవలతు
నని యడిగిన సమ్మహానుభావుండా భూవల్లభున కిట్లనియె. 246
క. నీయడిగినగూఢము లగు, నీయర్థము లెఱుంగం జెప్ప నింద్రగురుండు గా
కేయెడల నోరుండు గలండే, యాయన యిట వచ్చు నిపుడ యడుగుము ప్రీతిన్.
క. అనుసమయంబున నచ్చోడ, ననిమిషగురుం డరుగుదెంచె నతనికిం గుంతీ
తనయాగ్రజుండు దమ్ములు, జనపతులును గేశవుండు సద్భక్తిమెయిన్. 248
వ. ఎదుర్కొని ప్రణామపూర్వకంబుగా సముచితోపచారంబులం బ్రీతాత్ముం జేసి
యాసీనుం డై యున్నెడం గురుపతి యగ్గురునిం గురుపితామహు నడిగినయట్ల
యడిగిన నతం డతని కిట్లనియె. 249

బృహస్పతి ధర్మజునకు ధర్మవిశేషంబులు సెప్పుట.

ఆ. తనకుం దోడ కలండె జననంబునప్పుడు, మరణమునను సుగతి నరకమునను
దల్లి దండ్రి దక్కనెల్ల బంధులు శరీరంబు ననుగమించి క్రమ్మఱుదురు. 250
క. ఉత్తమపథంబు ధర్మం, బుత్తము ధర్మంబు మృతుం కధిప సహాయం
బత్తెఱంగున ధర్మక్రియం జిత్తంబునం, జేర్పవలయు జీవించుతఱిన్. 251
క. అది లేనివాండు నరకాస్పదుండగు నటు గాన ధర్మపరుం డగుటయ రూ
పింపము మనుజునకుం జేయందగిన మఱియును వలయువానిం బ్రీతి నడుగుమీ.
వ. అనిన సజ్జనపతి శరీరంబు విడిచి చనియెడుజీవుని ధర్మం బెట్లనుగమించు ననుట
యు నయ్యాంగిరసుండు. 253
తే. భూతపంచకశక్తులు బుద్ధియును స

1. ప్రతిహాస్యవేదు. 2. ట. వినుండిగిన బాధము లగు.

ధర్మకరంబుగ జీవునితోఁ దగిలి యరుగు
ననుడు రేతః ప్రకార మెట్లనియె నృపతి
యలని కిట్లని చెప్పె నయ్యమరమంత్రి. 254

తే. దేహగతభూప్రభృతిపంచకదేవతలును, మనసు నన్నసంతృప్తిఁ బొందిననృపాల
కల్గు రేతస్సు పురుషుండుఁ గామినియును,బొందఁగా నదిగర్భమై యొందుఁజూవె.

వ. అనిచెప్పి మఱియును 256

తే. పుణ్యపాపానుగుణభంగిఁ బుట్టిసౌఖ్య,దుఃఖమయసంసరణమునఁ దడరు నరుఁడు
వినుము కేవలధర్మప్రవర్తన సుఖైక,భాజనత నొందు ధర్మైకపరత మేలు. 257

క. జనవర కృమిగర్దభముఖ,జననంబులఁ బొంది నరకసంవాసముఁ జెం
దు నధికపాపాత్ముం డగు,మనుజుఁడు కర్మసవిశేషమహిమఁ దెలిపెదన్. 258

క. జననీజనక గురూలయెడ, నొనరించిన మేలుఁ గీడు నొదవించుసుఖం
బునకును దుఃఖమునకు నిం, తని కొలఁది యెఱుఁగ వశంబె యజునకునైనన్. 259

క. మాతృపితృగురులు దక్కఁగ, నే తెరువునఁ బాప మొనరిచనేనియు దానిం
బాతురు ప్రాయశ్చిత్తస్థితులు తద్విషయ మైనఁ జెప దల్పములన్. 260

క. కొలు చపహరించునన్నరుఁ, డెలుకయుఁ బందియును నైనయాదుర్జననం
బులఁ బొందు, నంత పాపము, వొలియక యాతనికిఁ గుక్కయపుట్టువుఁ గల్గున్.

క. పరదారగమనదోషము, నరుసన వృక కంక గృధ్ర వలిముఖ శవభు
క్తిరతంబు లైనభవములఁ, బొరయించుం గ్రిమియుఁగాఁగఁ బుట్టించుఁ దుదిన్.

సీ. తనయ నొక్కని కిచ్చి మనసు మరలఁబడి,యన్యున కిచ్చినయట్టివాఁడు
క్రిమి యగు దేవకార్యము సేసి మఱిపైతృకంబు సేయక భోజనంబు సేయు
నతఁడు కాకం బగు నన్నఁ బెట్టినఁ గ్రాంచ, మై పుట్టు బ్రహ్మకులాభిజాతఁ
గవసి శూద్రుఁడు నరకకపుగుంటవు ర్వాగు, నంతకుకింకరు లంటఁ బట్టి

తే. కట్టికొనిపోయి కోసియుఁ గాల్చియును గ్ర
తఘ్ను నుగ్రకంటకసముదయముమీఁదఁ
గ్రంద నదిమియు మఱియు దుఃఖములఁ బెట్టు
తెఱఁగు లెన్ని యన్నింటను బఱుతు రధిప. 263

క. ధనవాంఛ నిరాయుధుఁ జంపిన గాడిద మొదలు గాఁగ బెక్కులు తిర్య
గ్జననంబులఁ బొందును క్ర,వ్యనిహతిఁ దోడ్తోడ మరణదశ వాటిల్లున్. 264

ఆ. అన్నదానిఁ జంపినతఁ డేకవింశతి,దూష్యనరకవాసదుఃఖ మొందు
నన్నదధిపయోఘృతాపూపహరణముల్, మఱి కాదికీటకముల సేర్చు. 265

ఆ. ఫలము విసుము వెంకిఁ బసిఁడి మ్రుచ్చిలికొన్నఁ
గ్రోతి వాయసంబు గ్రువ్వ నీచ
కృమియు నగు సదంబరము హరించిన కశ

జనన మొందు నతఁడు | మనుజనాథ. 266

తే. నమ్మి యిల్లడ పెట్టిన | సొమ్ము గొనిన
వాని లో నగు నీచపు | యోనులందుఁ
బుట్టు గంధవస్తువులు గొ | న్నట్టివాఁడు
వినుము మఱుపుట్టువునఁ జుంచు | తనము నొందు. 267

తే. వనిత లీపాపములు సేసి | వానివాని, పత్ను లై జనియింతురు | పాపభీతిఁ
దెరువు దప్పక నడచిన | నరులు సౌఖ్య,మొందుదురు రెండులోకంబు | లందు నధిప.

వ. అని చెప్పి యిట్లనియె నేనుం గొన్ని తెఱంగు లెఱింగించితి మఱియు ననేకపా
పాపహరణంబులకు బహువిధంబు లగుఫలంబులు వాటిల్లు వాని నెల్లను శాస్త్రాం
తర శ్రవణంబున నెఱింగెదు గాక యనిన విని యక్కురుపతి బృహస్పతితోఁ
బాపంబులం బాపికొను తెఱం గెఱింగింపవే యనుటయు నతం డతనికి ట్లనియె.

క. విను దానంబులఁ బాపము, లనఘా చెడు దానములకు | నన్నిటికిని స
జ్జనసేవ్య యన్నదానము, మునులధికం బండ్రు పాప | ములఁ బాపు నెడన్. 270

క. న్యాయార్జిత మగు నన్నము, వేయింటికిఁ బెట్ట వలయు | విప్రజనము హ
ర్షాయత్తంబుగ దానం, బాయనిపాపములుఁ గలవె | కౌరవముఖ్యా. 271

తే. తిరిసియైనియు నన్నంబు | దెచ్చి [1]శిథిలు
లైన విప్రులయాఁకలి | యపహరించు
పురుషుఁ డూర్ధ్వలోకంబుల | పురుషవరుల
కర్చనీయుఁ డై వెలుఁగుచు | నంద యుండు. 272

క. వేదాధ్యయనార్థప్రతి,పాదనమున విప్రవరుఁడు | బ్రహ్మవిషయస
ద్భూదానంబుల నరపతి, యేదురితము లైనఁ గారు | వైశ్వర పాచున్. 273

తే. నేర్చియులజడిఁ బడినవా | ణిజ్యవిధులఁ, బడసి వైశ్యుఁ డన్నం బిడఁ | బడయు సుగతి
సచ్చునంతలు వడి సిరి | దెచ్చికొని చ,తుర్థు లన్నంబు పెట్టి | కాంతురు దివంబు.

తే. దినము వంధ్యంబు గా కుండఁ | దివిరి యన్న
పానదానంబు లొదవిన | భంగిఁ జేసి
మఱి భుజించుటఁ బోలెదు | మహితధర్మ
కార్య మొండొకఁ డెందును | గలదె గురయ. 275

సీ. అన్నదానంబు ధర్మంబు | లన్నిటికిని, ముఖ్య మింత యెఱుఁగుఁ గురు | ముఖ్య యనుడు
నవనిపాధిపమంత్రి | సమ్మహితుఁ, డి ట్లనియె భక్తివినయంబు | లెసక మెసఁగ.

క. ధ్యానం బింద్రియవృత్తుల, మానించు టహింస గురు | సమర్చనవిధిని
స్నానానుష్ఠానము తప మాను,వీనఁ బరమసేవ్య మొద్ది | వినఁగా వలతున్. 277

వ. వినిపింపు మనిన నమ్మహాత్ముండు. 278

---

1 క. శము లైనవిప్రుల.

క. ఈ యాజును మంచి తెరువు, లై యుండు నహింస యన్నకయైదిటికిః బవి
త్రాయుతన మట్లు గాకయు, నేయుత్తమధర్మములను ననిది వెలిఁగించున్. 279

వ. అని పలికి యామంత్రణంబు సేసి వాసవమంత్రి యమరనగరంబునకుం జనియె నం
దదనంతరంబ. 280

ఆ. ధర్మనందనుఁడు పితామహుతో సర్వ, దేవతలును భూమిదేవతలును
మునివరులు నహింసకగొనియాడుదురు దాని, తెఱఁగు సెప్పు నాకు దేటపడఁగ.

వ. అనుటయు నమ్మహనీయుం డమ్మనుజపతిం బరమాదరంబున నాలోకించి. 282

భీష్ముఁడు ధర్మజునకు నహింసాస్వరూపనిరూపణంబు సేయుట.

ఆ. దంతియడుగులోనఁ దక్కినజంతుచయంబునడుగు లెల్ల నడఁగియుండు
నట్లు ధర్మకోటు లన్నియు లోనగు, నిద్ధగుణ యహింస కింత నిజము. 283

వ. అదియును. 284

క. అరయఁగ నాలుగువిధములఁ, బరఁగు జతుష్పాదవృత్తిఁ బరఁగినగోవుఁ
దొరయుచు నం దొకఁ డెడలిన, నరవర సద్ధర్మవర్తనము గుంటువడున్. 285

తే. మనసునను వాక్కునను గాయమునను హింస
నడపు మాంసంబు దినుటతో నాలుగయ్యెఁ
దెఱఁగు లవియు న్నహింస వర్తింపఁ జేయుఁ
గాన కడుఁ గీడు మాంసభక్షణము దలఁప. 286

క. ఈ నాలుగుదెఱఁగులఁ దగ, మానుట యేఁ జెప్పినట్టిమహితాహింసా
నూనచతుర్విధములు మాంసానేకరుచిప్రమత్తుఁ డది యెట్లునుగున్. 287

క. కావున మాంసముపైఁ దగు, లేవిధమున నుడుగుటయ యహింసారూపం
బై వఱలుఁజుమీ భూవర, నావుడు నక్కురువిభుఁడు వినయముమయుఁ డగుచున్.

వ. మాంసంబు పితృదేవతలకుం బ్రియంబు శ్రాద్ధంబు మాంసముఖ్యంబుగా నడప
వలయు నని చెప్పుదురు వధింపక మాంసలాభం బెట్లుగలుగు ననుటయు ననిమిష
నదీనందనుం డా నరనాథున కిట్లనియె. 289

తే. వాజిమేధంబుకంటెను బూజనీయ
కర్మ మందురు, మాంసభక్షణమువిడుపు
వినుము సంపుటయును జంపఁ బనుచుటయును
గల్మషంబుల కెల్ల నగ్గలము లధిప. 290

క. పితృకార్యయజ్ఞముఖముల, శ్రుతిచోదితహింసఁ గీడు సొరదు నేరము వి
స్మృతగుణ మాంసముచవిగోరి తినం బ్రాణిఁ దెగటార్చక్రియఁ బాప మగున్

క. తను నమలినవాని నమలు, నని మాంసము తెఱఁగు సెప్పు నాగమములు గా
వునఁ దద్భక్షణ ముడిగిన, ననఘు తపంబునకుఁ జాలు నది యొక్కటిగన్. 292

క. జనవర మాంసముచవిఁ గడచినచవు లరయంగ లేమి చేసి చవి యెఱిం

గినవాఁ డది యడిగిన న్యాతని దేవసమానుఁ డండ్రు ధర్మవిధిజ్ఞుల్. 293

ఉ. మ్రానను జాతనుం గలదె మాంసము ప్రాణులమేనఁ గాక యు
మ్మనుల నోఁచునప్డు దమకమ్మెనులు సోఁకినమాత్ర నెట్లుగున్
జానిఁ దలంపఁగా వలదె తా నది యూనిన హింస లన్నియున్
మానవె యుంచు నుత్తముఁడు మాంసము మాను దయార్ద్రచిత్తుఁడై. 294

ఆ. మాంస మాన కునికి మను జేశ ప్రాణివ,ధాభిరతి దోసంబు లగుటఁ జేసి
యట్టివాని కభయ మఖిలభూతంబుల,వలన నెపుడు నెందుఁ గలిమి నిజము.

క. స్వాయంభువుఁ డనుమనువును, నీయర్థము సెప్పె లోకహితముగ మార్కం
డేయాదులు మాంస ముడుగు, టాయుశ్శ్రీరూపకారి యగు ననిరధిపా. 296

క. విను మాంసము గోరునరుఁడు, దనుజుఁడచూ నె మును దేవతలు మాంసంబుం
దిను టుడిగి కానె దానవ,జనితభయముఁ బోవఁ ద్రోవఁ జాలిరి వత్సా. 297

క. దానము ధర్మము తప ము,జ్ఞానిష్ఠ యనంగఁ గల్గుసత్క్రియ లెల్లన్
మానవనాథ యహింసా, నూనాకృతు లండ్రు శ్రుతుల నూనిన పెద్దల్. 298

క. శతవర్ష దుష్కరతపః,కృతి నంజాదు దినమి నగు సుకృత మివి రెండున్
మతిఁ దలఁప నొక్కరూ పని, శ్రుతివేదులు సెప్పుదురు కురుకులక్షితినాథా. 299

క. తపముల దానంబుల బ్రహ్మపురనివాసంబు దప్ప దన రాదు జనా
ధిప మాంసము నములనిపు,ణ్యపురుషునకు సులభ మండ్రు రాసల వార్యుల్.

తే. అధిప మాసాధముఖ్యంబు లైననెలలు
నాలుగింటను మాంసంబుఁదినమిల కుడుగు
టాయురారోగ్యబలకీర్తు లను ఫలములు
నాలుగింటిని నిచ్చు నన్నరున కండ్రు. 301

ఆ. సగరునలదిలీపనృగభగీరథముఖ్య,నృపులు వార్షికంపుఁనెలలు నాల్గు
మాంసభక్షణంబు మానుట నుభయలో,కంబులందుఁ బెంపుగాంచి రండ్రు.

వ. అనిన విని యజాతశత్రుండు శంతనుపుత్త్రునకు నిమ్మాంసు మహనీయం బయిన
మాంసవర్జనంబు వాటించి తక్కినయపూపాదులు ఫలప్రభృతులు నగు భక్ష్యంబు
లాచరించి యేల వర్తింప రెల్లజనంబు లనుటయును. 302

మాంసభక్షణమందలిరుచివిశేషంబు మానుట దుష్కరం బని చెప్పుట.

సీ. అతనికి నతఁ డిట్లు లను మాంసములచవి, మరగినవారికి మాన వశమె
యట్లు గాకయు సురకతాసక్తుబునకు బల, మొలయు నభ్యాశ్రాంతుఁ డుల్లసిల్లు
ఉగము శీఘ్రమున [1]పోషిత ముగుఁ గృశునకుఁ, బుష్టి వేగమ వచ్చుఁ గథాపవర్య
విను మాంసభక్షణంబున నపూపఫలాదు,లం దప్పి శేషంబు లరయఁగలవె

తే. మాంస మానినదోషంబు మహిత దాన

1. క. పోషిత ముగు.

విధులఁ బాయు దివిజపితృవిధివిశిష్ట
మైన యెఱచి గీ డొలయదు యజ్ఞములకుఁ
బశువిధానంబు వేదంబుపనుపు గాన. 304

వ. ఇట్లు గాన నంజుడు నమలుటయు నధికదోషంబులు గానియెుకలునుం గలిగి యుండు నగస్త్యుండు రాజులకు వేఁట విధించెం గావునం గుతూహలంబుఁ గోపంబు ననియెడుభావంబులం బొరయక లోకరక్షణార్థంబుగాఁ గ్రూరమృగవధంబును స్వాహా స్వవిక్రమార్జితమాంసంబున దేవపితృప్రీణనం బొనర్చుటకుం గాఁ బక్షిమృగమారణంబును జేయుభూనాయకుండు దురితంబులం బొరయకుండు విశేషంబు వినుము. 305

ఆ. అన్యమాంసమున నిజాంగమాంసంబుఁ బో
షించు ననుటకంటెఁ జెట్ట లేదు
మాంసభక్షణంబు మానుటకంటెను
మేలు లేదు కర్మజాలకమున. 306

తే. మాంసభక్షణదోషంబు మాను దాన
మహిమ ననుటయు మాంసంబు గుడిచి భుజింప
కున్నఁ జూపె ధర్మము లెవ్వియును దలంప
దయకు సదృశంబు లే కురుధరణినాథ. 307

తే. ఆత్మ సదృశత ప్రాణభయంబునందుఁ
బ్రాణులకు నెల్లఁ గని మాంసభక్షణంబు
మాను దయ నార్ద్రమానసుం డైనపురుషుఁ
డాతనికి బ్రహ్మలోకాదు లాటపట్టు. 308

క. భూతముల కలుగు నతనికి, భూతము లఖిలములు నలుగు భూతహితార్థీ
భూతముల కభయ మిచ్చిన, పూతాత్మున కభయ మిచ్చు భూతావళియున్. 309

ఆ. దానమును దమంబు ధర్మంబు నార్జవంబు, శౌచమంత్రతంత్రసత్యములును
బుధు లహింసరూపకములు గాఁగఁ జెప్పుట, నెల్లకల్మి సుమ్మహింసకలిమి. 310

క. నరనాథ యహింసాగుణ, పరిగణనము గొంతిమాత్ర బలికితి ధర్మే
తర యగునహింస మేలిమి, యరయం గడుఁబెద్ద దాని నలవడవు మదిన్. 311

ఆ. అనిన సంతసిల్లి యమ్మహీపతి దాత, కధికభక్తి మ్రొక్కి యస్మదీయ
సంగరంబునందుఁ జచ్చినవారల, కేది గతియొ నాకు నెఱుఁగఁ జెప్పు. 312

క. బ్రతుకును జావును సుఖదుఃఖదములుగా జంతుకోటి కరుణామూర్తీ
మదిఁ దలఁచు బ్రాణలోభము, వదలు టరిది గాన యట్టివారి నడిగితిఁగా. 313

క. అనుటయు నెన్నఁగఁ దలఁచితి, విను మొకకీటంబునకును వేదవ్యాసం
బున లోకహిత మొనర్చిన, మునుకొని యునసత్కథనము మునినుతి చరితా. 314

వ. దాన నీయడిగినయర్థంబు దెల్లం బగు నని పలికి భీష్ముం డి ట్లనియె. 315

క. శకటపథంబునఁ గీటం, బాకటి వెసం బాఱఁ గాంచె ఘనయోగీంద్రుం డుజం
తుకలాపమానసదశా,ప్రకారసంవేది బాదరాయణుఁ డధిపా. 316

వ. కాంచి నిరూపించి యా కృష్ణద్వైపాయనుం డక్కీటకంబుతో నీవు భయంబున
రయంబు బెసఁగం బాఱెదవు కారణం బేమి యని యడిగిన నది యమ్మునీంద్రున
కి ట్లనియె. 317

తే. తెప్పదెరలంగి బండు లేతెంచు చున్న
యవి మహాత్మ తన్నేమిజాతారవము విం
గడఁక నెడ్లను దఱిమి రోకప్పెడునరాలి
యులివు విని యుల్లమునఁ గడు నులుకు పుట్టి. 318

వ. బ్రతుకును జావును బరమసుఖంబును నత్యంతదుఃఖంబునుం గాదె కావున. 319

క. క్రిందున మేను సిదియు నను,కొంచలపాటొంది ప్రాణగొడ్డ మగుటఁ ద
ప్పం దొలఁగఁ బాఱెదను ముని,బృందారక [1]యసదె ప్రాణభీతి దలంపన్. 320

చ. అన విని దాని కిట్టు లను నమ్మహితాత్మకుఁ డెంతలెస్స నీ
మనికి దలంప నింద్రియసమాజసుఖంబులఁ బొందఁ గీటము
ల్గను టది లేదు దుఃఖబహుళం బిది యీ యెడ లేల చావు నీ
కనయము సౌఖ్యకారి యగు నత్తెఱఁ గీవు దలంచి చూడుమా. 321

వ. అనుటయు నక్కీటంబు. 322

తే. అనఘ కీటంబులకు విషయజము లైన
సౌఖ్యములఁ బొంద లే దనుచనువు గలదె
వినుము దమతమ తెరువుల ననుభవింపఁ
గలదు చావును భీతికిఁ గారణంబు. 323

వ. నీవు నామనం బరసి తెలియ కాక యింత యెఱుంగవే యది య ట్లుండె నా
తెఱంగవధరింపు మేను దొలుమేన నొక్కశూద్రుండ ధనవంతుండ. 324

సీ. ఆచారహీనత యతిలోభ మన్యథ,నాపేక్ష కూరత యవినయంబు
మొద లైనదుర్గుణంబులకు నెల్లను నెల, వై యుండి మాతకు నధికభక్తిఁ
బ్రీతి మెప్పునొసఁగితి బ్రాహ్మణమాత్రుఁ; డతిథి యొక్కరుఁ డొకయప్పుడరుగు
దెంచిన నతనిఁ బూజించితి నది కారణముగ జాతిస్మరణంబు గలిగె

తే. మంచికర్మము సుఖమునొందదమటిపుడు, గాన వచ్చె మునీశ్వరకరుణనాకు
నత్తెఱం గెఱిఁగింపవే యతివిశదము, గాఁగ ననపుకునాతండు గారవమున. 325

వ. ఆ జంతువుం గనుంగొని నీవు సెప్ప నేల దుష్కర్మకోటివలనం గీటంబ వగు
టెఱింగితి భవదాచరితంబు లైనసత్కర్మంబులుం గాంచితి నమ్మేలునకు సంతో

---

1. క. గ. చ. 'యనుదె'

పించి కాదె నీతో సంభాషించితి మదీయతపోవిశేషంబున నీదయిన కీటత్వం బపన యించెద విషాదం బపనయింపుము తపోబలంబును గడచిన బలంబులుం గలవే మనుష్యజన్మంబు నొంది మేలొనర్చెద ననుకోర్కి నీకుం బుట్టుట మేలు మానవులకుం గర్మభూమికృతంబు లైన సదసత్కర్మంబులం జూవె దేవతలును కీటంబులు నగుట వాటిల్లెడు నని పలికి వెండియు, 326

క. సుకృతము లెమ్మెయిఁ గల్గుట, నకట జనిస్మృతియుఁ గల్గె నస్మత్సంద
ర్శకతయు నీకు నొదవె నో,డకు మున్నతపదము నిచ్చుటకు మెయికొంటిన్. 327

వ. అత్తెఱం గాకర్ణింపుము. 328

వేదవ్యాసుఁడు కీటంబునకు నుత్తమజన్మములు గలుఁగ ననుగ్రహించుట.

ఆ. నీచశూద్రవైశ్యనృపజన్మములఁ గ్రమ,వృత్తి నొందు మెపుడు ద్విజోత్తమునకుఁ
బుట్టెదు నట్టిపోఁడిమి నొసఁగితి, ధర్మపరుఁడ వగుము దానఁ జేసి. 329

క. అని సాత్యవతేయుఁడు కృప, నెనసి సుధాధారఁ బోలు నీక్షణముం ద
త్తనువున నిగిడించిన న,మ్మునిపతిఁ గీర్తించె భూతము ప్రీతముగై. 330

క. అక్కీటంబును భక్తిన్, మ్రొక్కి శిరం బతనిపాదములఁ జూపి మనం
బెక్కుడు ప్రమోదమునఁ గడుఁ,జొక్కఁగ నదనంతరము నసువులం దొఱఁగెన్.

వ. కారుణికత్వధుర్యుం డగు నప్పారాశర్యుం డట్లవలీల మేలొనర్చి కీటంబుఁ గృతార్థంబుం జేసి నిజేచ్ఛం జనియె నదియు నమ్మహానుభావునిర్దేశించిన తెఱంగున జనియించుచు ననేకపుణ్యంబు లాచరించుచు నృపజన్మంబునం బూజ్యం బైన రాజ్యంబు నొంది. 332

సీ. ఏనుంగు నెక్కి పెక్కేనుంగు లిరుగడ, రాఁ దురంగంబుల[1] రమణ రొప్ప
గొడుగులుం [2]బడగలు ముడివడ గాయక, వందిపాఠకులరవంబు లెసఁగ
భూషణంబులరత్నపుంజంబు దీప్తులు, దిక్కుల నెల్లను దీటుకొనఁగ
సామంతకవిజనసీమంతినీముఖ, పరివారవైభవస్ఫురణ మలర

తే. దేవపతివోలె సాత్యవతేయు,నాత్మ,మమున కేతెంచి తత్పాదకమల మాత్మ
ముకుటసంగతముగఁ జాఁగి మ్రొక్కఁ గరుణ, నాతఁ డెత్తి తన్మస్తకమునకు నేర్చె.

వ. ఇట్లత్యాదరంబున సంభావించి శిష్యజనంబు నియోగించి. 334

క. రాజన్యసముచితం బగు,పూజావిధి యాచరించి పురుషోత్తమ నీ
వీజన్మంబున సన్మని, రాజకి వెఱఁ గగుతపశ్చరణ మొందవనా. 335

క. గోవులకై రొండెను వి,ప్రావలికై యుండె నిర్భరాహవకేలీ
ప్రావీణ్యము మెఱసి విడువు, నీ వసువులు దానన ధికనిర్మలత యగున్ 336

వ. ఇట్లు నిష్కల్మషత్వంబు సిద్ధించిన. 337

క. ధరణీసురజననమహిమ, దొరకొను నీ కని విధించి దుర్దాంతరిపు

1. క. రమణ మెఱయ. 2. క. నుదరిండ్లు.

స్ఫురణహరణపరిణతు న,న్నరపతి వీడ్కొ-ల్పె- మునిజనంబులు వొగడన్. 338

తే. అతఁడు నానందసంభరితాంతరంగుఁ, డగుచు దండప్రణామంబు లాచరించి
యరిగి యమ్మౌనిచెప్పినయట్ల చేసి, భూమిసురజన్మలాభంబుఁ బొందె నధిప. 339

వ. ఇవ్విధంబున సద్విజుం డై. 340

క. పుణ్యస్థలముల నెల్లఁ, గణ్యము లగుయాగములు ప్రకాశములుగఁ గ
ర్మణ్యతయు వివిధరత్నహి,రణ్యాదికదానములను బ్రస్తుతి కెక్కన్. 341

తే. అధ్వరంబు లనేకంబు లాచరించి
యతఁడు మఱియును బాదరాయణుని గాంచె
సదయచిత్తత నప్పరాశరసుతుండు
ప్రీతుఁ గొలుపంగఁ జని యశోవిభవ మెసఁగ. 342

క. వ్రతశీలతఁ జరఁగి తుదిన్, శతమఖునకు నగ్గలంపుసఖుఁడై యమరా
శ్రితసంస్తుతభవ్యపద,స్థితి నవ్యయపరమసౌఖ్యసిద్ధిం దనరెన్. 343

వ. అని చెప్పి భీష్ముండు. 344

క. మనుజేంద్ర కురుక్షేత్రం,బున నద్భుతఘోరసమరమున నమ్మాడ్కిం
దనువులు దొఱఁగినన్పృపులకు, ననంతసుఖగతులు గల్గుటను మూనం చే. 345

వ. భవదీయబంధు లందఱు స్వర్గలోకప్రాప్తుల నీ వేమియు ననుమానింపకు మని పలికినం బాండవాగ్రజుండు పరమసంతోషభరితాంతఃకరణుండై సురసరిత్సూనుతో విద్యాతపోదానంబులలో నెయ్యది విశేషం బెఱింగింపవే యనుటయు నమ్మహీపతి గౌరవంబునం గనుంగొని. 346

తే. వ్యాసమైత్రేయపుణ్యసంవాద మనఘ, వినిన నీప్రశ్నమున కది విశదమైన
యుత్తరంబగు నేకాగ్రచిత్తవృత్తి, వగుము నీ వని పల్కి యుక్కట్లని యనఘ. 347

వ్యాసమైత్రేయసంవాదము భీష్ముఁడు ధర్మజునకుఁ జెప్పుట.

సీ. వ్యాసమునీంద్రుండు వారణాసీపురి, కరిగి యుర్వ మైత్రేయుఁ డచట నునికి
నాతనియున్నెడ కప్రకాశతఁ జన్న, నెఱిఁగి యమ్మహాత్ముఁ డెలఁగి భక్తిఁ
బూజించి యుత్కృష్టభోజనంబునఁ దృప్తు, సేసిన నధికవిస్మయసరుచిర
ముఖుఁడై నయమ్మహామునిఁ జూచి మోదమ, గ్గలముయిదియుండుఁ గానఁబడియెం

తే. గారణం బేమియో యని గారవమున, నాతఁ డడిగిన నతఁ డధికాదరమునఁ
దపము శ్రుత మాదిగాఁ గలధర్మకోటి,లోన నెల్లను నధికంబు దాన మనియె. 348

వ. అని మఱియును. 349

క. దానార్హవస్తువులలో, మానిత మన్నంబ యన్నమహిమ గుణము లసువులు
మేనుఁ దదీయబలంబును, గాన బుధులు దానిఁ దద్దయ గైకొందురు మదిన్. 350

క. తపముల్లలో మిక్కిలి మేలు, జపగతములఁ జేయు విద్య శాస్త్రద మగు నా
తపసి మహితదానంబున, నుపచిత మగువిద్య తపము నుత్కర్షించున్. 351

క. కాన తపంబును విద్యయు, దానోదాత్తప్రవర్తితంబులు విద్యా
మానత్వం బచ్యుతుఁ గను, దానికి దీపంబు సద్వ్రతప్రవణులకున్. 352

ఉ. కావున నన్నదానమునఁ గాఁ గెటు లుండు మహాప్రమోద మ
త్యావిలచిత్తుఁ డైనను మహోత్తరదానమునన్ విశుద్ధస
ద్భావత నొందు నిక్క మని పల్కె నరేంద్ర తపంబు విద్యయున్
దైవతపూజనీయములు దానము వానికి బోషకం బగున్. 353

క. అని శాంతనవుఁడు సెప్పిన, విని కౌంతేయాగ్రజుండు విపులమతీ యం
గనలసమాచారంబులు, వినంగ నే వలతుఁ జెప్పవే తెలియంగన్. 354

వ. అనిన నతండు కైకేయీశాండిలీసంవాదంబున నిది యెల్లం బగుం జెప్పెద విను
మని యిట్లనియె. 355

తే. సుమన యనియెడు కైకేయిశయసురపురము,నందు శాండిలిఁ గని భవ్యయైనదివ్య
పదవి యేవర్తనమునఁ బొందితివి నీవు, నతివ చెప్పుము నా కనియడిగె నధిప.

వ. అని యడిగిన యాసుమన కయ్యంగన యిట్లనియె. 357

సీ. మామకు నత్తకు మార్పల్క దేవపి,తృతిథిపూజనములయందు సొలయ
[1]నిలువాడఁ బలవాకిఁ దెప్పాడు నెలుఁగక, పిలుచు నవ్వాక శుద్ధవెలయ విప్ర
భిక్ష[2] బోనీక గల్గి పెట్టుచు వర్తింతు, వలయుకార్యములకు వెలఁది మగఁడు
బతి వచ్చినప్పుడు భక్తియు వేడ్కయుఁ, బాదల నాసనపాద్యములను సుముఖ
ఆ. భావమునను సేవ వాటింతు బిడ్డల, శిశువ వదలఁ దిట్టఁ గొట్టఁ గనియు
నాకు వేఱ ప్రియము మగనిఁ గ లేకు పతి మెచ్చు,వంటకముల చవిగ వండియుదుము.

చ. వరుఁ డొకవెంట నెన్నఁడు ప్రవాసగతుం డగు నాఁటఁగోలె న
ప్పురుషుఁడు వచ్చునంతకును బూవులు పూఁతలు మేలిచీర లా
భరణము లెక్కుడుంబపులు పాకవిశేషము లాదరింప నె
ప్పురుసునఁ[3] గొల్చుఁ గూడుదురు బంధులకుం దగ నెమ్మి సల్పుదున్. 359

క. గోవులు మొదలగు తిర్యగ్జీవులసుఖవృత్తు లరసి చెల్లింతు గృహ
శ్రీవర్తనంబునకుఁ బతి, భావము సంకటపడకుండఁ బలుక నొకటియున్. 360

తే. అగ్ని హోత్రి రక్షింతు రక్షాస్యమైన
దాని వెలిపుచ్చ గర్భంబు దాల్చి యున్న
యపుడు వాచవు లెల్లను నవులఁ బెట్టి
దాని కెయ్యది పథ్యముల్ వానిఁ గొందు. 361

క. అని చెప్పి యట్టి చందంబున నడచిన సతికి లోకములు రెండును సౌ
ఖ్యనిరూఢి యొసఁగుఁ బొగడొందు నరుంధతిపోలె నవ్వధూటి నరేంద్రా. 362

క. నృప యీ యాఖ్యానము పర్వపుదినమున భక్తిఁ జదువు వారలు విను పు

1. అ. ఇలువడి 2. క. లెక్కటియును పెట్టుచు. 3 జ. గొల్చి కూడుదురుబంధు.

ణ్యపురుషులును నాయుశ్శ్రీ, లపరిమితము లొంది యదును లగుదురు పీడవన్.

వ. అనిన విని ధర్మనందనుండు సర్వశాస్త్రసారం బై శ్రేష్ఠం బగు ననుష్ఠేయం బెయ్యది పితామహా యనుగ్రహింపు మని యభ్యర్థించిన నాపగేయుండు కృపా విధేయుం డై నారదపుండరీకసంవాదం బాకర్ణింపుము దాన నీ యడిగినయర్థంబు దెలియును దీర్ఘపరుండును జపతత్పరుండును బుండరీకాభిధానుండును నైనమహా ద్విజుం డొక్కయెడ నారదమహామునిం గనిభక్తిం బ్రణతుం డై యుత్తేజింగునన యడుగ నతం డతని కిట్లనియె. 364

నారదపుండరీకసంవాదం బను పరమేతిహాసప్రకారము.

సీ. పరమేష్ఠి సెప్పినపరమధర్మం బల్లఫణితి మహార్థంబు భవ్యమతికి
శ్రోతవ్యమును బరిజ్ఞాతవ్యమును దాని, విను ప్రకృతికిఁ బర మనఁగఁబడిన
యిరువదేనగుతత్త్వ మరయంగ జీవాత్ముఁ, డాతండ సర్వభూతాత్మకుండు
నరుఁ డన వెలుఁగు నప్పురుషునివలనన కలిగి నారము లన వెలసినట్టి

తే. యన్యతత్త్వంబు లతనికి నయన మగుట
నతఁడు నారాయణుం డన నతిశయిల్లు
విశ్వమును దనయంద యావిర్భవింప
విలయ మొంద నద్దేవుండు విభుతఁ బొల్చు. 365

క. పరమబ్రహ్మం బనఁగాఁ, బరతత్త్వం బనఁగఁ బరమపద మనఁగా నీ
శ్వరుఁ డనవిష్ణుఁ డన జగ,ద్భరితత నారాయణుండు దా వెలుఁ గొందున్. 366

ఆ. అతఁడు వాసుదేవుఁ డన నాత్మ యనఁగ వే,దాంతవాక్యబోధ్యుఁ డై వెలుఁగు
నరుల కప్పదములు నామాంతరంబుల, ర్థాంతరంబు లేనియట్టి వనఘ 367

ఆ. సర్వశాస్త్రవాక్యసమితి నాలోకించి, మఱియు దృఢవిచారమహిమఁ దెలిసి
నిశ్చయింపబడియె నిష్ఠ నారాయణు, నెపుడుఁ దలఁపవలయు నిదియొకండ. 369

వ. కావున.

క. పరమానుష్ఠేయం బిది, నరోత్తమా నీవు నెపుడు నారాయణుఁ ద
త్పరతఁ దలఁపు పారకు సవి, స్తరశాస్త్రార్థముల క్రందుఁ దలపోఁతలకున్. 370

క. విను మొకయించుకసేపైనను నారాయణునిఁ దలఁచినను సుగతిఁ గనుఁ
మనుజుఁ డనినమది నెప్పుడు, నునిచినయాతనికి బ్రాతె యుత్తమధిషణా. 371

క. ప్రణుత యగున మోనారా,యణాయ యనునక్షరాలి నంతఃప్రాప్తి
క్షణమున జిహ్వకుఁ దెచ్చినఁ, బ్రణవార్థం బైనపదము బడయుదురు నరుల్.

క. నారాయణపదవాచ్యం, బారయ బ్రహ్మంబు దాని ననిశము వినియున్
సారమతిం దలఁచియు నిం, పారఁగఁ బొగడియు రమించు టతులహిత మగున్.

తే. ఎందు నారాయణపరాయణుండు పాత, కములఁ గెలిచి వెలుంగుట కాదు దన్ను
నాశ్రయించినవారికి నతుల మైన, వెలుఁగు నొసఁగంగ, జాలుట వేదచేత. 374

క. చతురాశ్రమములలోపల, నతులమతీ యెందు నిలిచినతనికి భక్తిన్
మతిఁ గొల్వఁ గూర్పరె సద్గతి పెఱకర్మముల నేల ఁ గల్గఁగ నేర్చున్. 275

క. కనుటరిది యొందుటయి విష్ణుని భక్తిం గనుము నీవు ఁ సువ్రత యద్దే
వుని వినుము భక్తవత్సలుఁ, డనునామము గలిమి దృశ్యుఁడగు భక్తులకున్. 376

క. అని నారదుఁ డుపదేశిం,చిన నానైష్ఠికుఁడు నియతచిత్తుండై వి
ష్ణుని నర్చించు సభక్తిక,మనన విశేషమున నెపుడు ఁ మనుజాధీశా. 377

తే. శంఖచక్రగదాధరు ఁ [1]శార్ఙ్గిఁ బుండ,రీకదళసన్నిభాక్షుఁ గిరీటకుండ
లాభిరాము శ్రీవత్ససంశోభివక్షుఁ, గౌస్తుభోజ్జ్వలు, గలలోనఁ ఁ గను నతండు.

క. చిరకాలంబున సాక్షా,త్కారణంబును గల్గు దానఁ ఁ గానని పదముం
బొరయని శుభనుతుం గలవే, కురువర నీవు నతిభక్తిఁ ఁ గొలువుము విష్ణున్. 379

క. అనిన విని హర్షపూరం,బునఁ జిత్తము దేల ధర్మపుత్రుండాశం
తనుసుతునకుఁ బ్రణమిల్లెం, దనువునఁ బులకాంకుర ప్రతతి బాదుకొనన్. 380

వ. ప్రణమిల్లి యతనితో దానప్రియవచనంబుల రెంటియందును నధికరంజనం బెయ్యది సెప్పవే యనుటయు నద్దేవవ్రతుం డన్నరదేవోత్తమునకి ట్లను రెండును మంచితెఱంగుల యెదిరి చందం బెఱింగి నడపునది దానంబు రంజకం బగుట దెలుప వలవదు సామవాదంబు గుణంబు దెల్లం బగునట్టియితిహాసంబు వినుము సెప్పెద బుద్ధిసంపన్నుం డగునొక్క బ్రాహ్మణుండు విజనం బగువనంబు నం గార్యవశంబున నుండంగ దన్మాంసం బాహారంబు గొనుటకయి దారుణుం డగు దానవుం డతని బట్టికొనిన సాంత్వనభాషణంబులు ప్రయోగించువాఁ డయి యవ్విప్రుండు గలంకము గొందలంబును లేసి మోదంబుతో నద్దానవు నాననంబు గనుంగొనిన నాధైర్యధుర్యుం గనుంగొని తదీయం బగునుదాత్తత్వంబునం జిత్తంబు రంజిల్లి యద్దనుజుం డద్ధరాదివిజునితో మదీయం బగు ప్రశ్నంబునకు సముత్తరం బిచ్చితేని నిన్ను విడిచెద ననుపలుకువలికి నతనశరీరంబు డయ్యుటకు విసుకం బొలుటకుం గారణం బేమి యని యడిగిన నమ్మహీసుర వరుండు వేగిరపడక కొండొకసేపు విచారించి మహాపురుషా నీయట్టికృపాపరుం డడుగం దోఁచిన తెఱంగులం జెప్పుట మేలు గాదె యాకర్ణింపుమని సౌముఖ్యంబు నొంది. 381

సీ. చుట్టాల నీ దగుక చెట్టతనంబునఁ, బాసి పశ్చాత్తాపపరుఁడ నగుట
లేమి గల్గిన దుర్లభామేయధనములు, గోరుట మొగమోట ఁ బూని యొరుని
చేఁ బడనిన్ను గొల్చితి నని యాతఁ,బుట్టుట కృప నుపకారముననుఁ బాత్ర
ముగ నిన్ను సేసినఁ ఁ బురుషుఁ డా మీఁద దన,యుంఘుపౌరుషముననఁ గలిగె ననుట

1. జ. జారు, పుండ.

ఆ. కుమతిజనులు నీదుర్గుణములు గొనియాడ, సిగ్గువడుచు బుధులఁ జేరఁ బొగడు
గాన మరగుచునికి వీనిలో నొక్కటఁ, గార్శ్యపాండురతలు గలుగు ననఘ. 383

వ. అని వెండియు.

సీ. ఉచితంబుగా నెఱి నుగ్గడించినమాట, సభ యియ్యకొననిమి వక్కలభకునీదు
తప్పు తెల్లంబయి తాపంబుఁ బొందంగఁ, దేర్పంగనేరక త్రిప్పికొనుట
నీసొమ్మునకు నోరఁ డాసించుచుండంగ, దానికి దగ రతు దలఁచుచునికిఁ
దులువ పిమ్మట నిన్ను దూషించుపలుకులు, కులజులు నిజముగాఁ గొనుట నీవు

తే. మానుషంబుల నడపంగమాయుకానిఁ, గాఁగఁ జెలులుగాంచుట వగకలిమిపేర్మి
దాసి వెలివుచ్చనోపమి వీన నొకటఁ గార్శ్యపాండురత్వంబులు గలుగు ననఘ. 385

వ. అని మఱియును.

సీ. భార్య పుత్త్రికుఁ డల్లుఁ డార్యవృత్తము లేమిఁ, గ్రువ్మరించుట జనకుండు దల్లి
సోదరుల్ నవయుట యుర్వీసురుని గోవుఁ, దోలుమేనఁ జంపుట దుష్టబుద్ధి
భూసురదేవార్థములు పుచ్చుకొనుట యర్థము గోలుపోక బాంధవులదాపు
బాలిశు మొగమోటఁ బనిగొనఁగాఁ దన్నయశమున కంతరాయంబు గలిమి

తే. పెద్దకాలంబు యత్నసంపీడ నొంది, చెల్లఁ జేసినపని రెటుకపొల్ల పగతు
చే నసిద్ధతఁ బొందుట యివ నొకటఁ, గార్శ్యపాండురత్వంబులు గలుగు ననఘ.

క. అని యిల్లేర్పడఁ జెప్పిన, విని యద్దనుజపతి మెచ్చి విడిచెం గుంతీ
తనయాగ్రజ భూసుర సాంత్వన మిట్టిది యనుగు మింక వలసినదానిన్. 387

వ. అనిన నజాతశత్రుండు గంగాపుత్త్రువదనంబునం జూడ్కి నిలిపి మోడ్చినకరంబులు శిరంబునం గదియించి. 388

తే. మనుమ సంసారవార్ధి వారమ్ముఁ జేర్చు, యానపాత్రంబు నీకరుణాతిశయము
యఖిలకల్మషములఁ బాపునట్టిదాని, వినఁగఁ గోరెద నొకపురావృత్తమనఘ. 389

క. మునిమనుజపతులసన్నిధి, నిను నీకృష్ణుండు మాననీయచరిత వే
డ్క నుపాసించుచు నున్నాఁ, డనుత్తమప్రీతి దాని నాకర్ణింపన్. 390

క. సమ్మోదమ్మున నేనుం, దమ్ములునుం దేల సత్కథాకథనపర
త్వ మ్మాదరింపు మసివర్గమ్ము నృపచయముఁ బులకరాజి వహింపన్. 391

వ. అనుటయు భీష్ముం డు. 392

క. పుణ్యం బగునితిహాస మగణ్యగుణా నీకుఁ జెప్పఁ గనుసుస్ఫుతముఁ గా
రుణ్యనిధి సర్వలోకశరణ్యుఁడు కృష్ణుఁడు వినువరంబుఁ బడసితిక్. 393

క. పారాశర్యాదిమునులు, నీరాజన్యులును వినికి [1]యొంతకు లే దీ
గారాము నాకుఁ బరమో, దారపదావాప్తి గాదె ధర్మతనూజా. 394

వ. నీయడిగినయట్టిదానికి నొక్కయితిహాసంబు గల దది యుమామహేశ్వరసంవాదం

1. క. ఖ. యెంతయు లే దీ గారాము

బనం బరఁగుఁ బౌరవోత్తమా యప్పురావృత్తంబు ప్రవర్తించుటకుం గతంబైన
కథ మున్ను సెప్పి యుంటి దానిం జెప్పిన నొప్పి యుండుం గావున నప్పరిపాటిం జె
ప్పెద నవధానపరుండ వయి యాకర్ణింపు మని పలికి హరికిం బరఁగు భక్తిం బ్రణ
మిల్లి యప్పాండవముఖ్యముఖచంద్రికం దనవిలోచనచకోరంబు లాన నమ్మౌనివ
పలికి నమ్మౌననీయమతి యిట్లనియె. 395

భీష్ముఁడు ధర్మజునకు శ్రీకృష్ణునిచిత్రచరిత్రంబు సెప్పుట.

క. తనయునిఁ బడయుటకై తప, మొనరింపఁగ రుక్మిణియు సముత్సుకవృత్తిం
దనలో రాఁ దుహినాద్రికిఁ, జనియెం గృష్ణుండు మునులుఁ సంతస మందన్. 396

వ. ఇట్లు సని ద్వాదశవార్షికవ్రతదీక్షితుండై యున్నకృష్ణుం గాన మునీంద్రులు నా
రదపర్వతవ్యాసవాల్మీకిదేవలకాశ్యపప్రభృతులు శిష్యవర్గంబుతో వచ్చిన వారల
బాద్యాసనాదిసముచితార్చనంబుల సంభావించిన వార లద్దేవునిం బరివేష్టించి పు
ణ్యగోష్ఠి నడపుచున్న సమయంబున. 397

తే. అతనిముఖమున వెడలి మహాగ్ని యమ్మ,హీధరముపిపినంబుల నేర్చెఁ బక్షి
మృగయుతంబుగ సిద్ధసాధ్యగణములుఁ స,మాకులత్వంబుఁ బొందఁ బెల్ల దరియధిప.

క. ఆ కృష్ణుఁడు నిజసౌమ్యా,లోకనమున నాశిఖిని మహలుగఁ జేసెం బూ
ర్వాకారతఁ నవ్వనము ని,రాకులతం బొల్చె నది మహాద్భుత మయ్యెన్. 399

తే. దానికమ్మునులెల్లఁ జిత్తమున భయము,విస్మయంబును బెనఁగొనఁ వెఱఁగుపాటు
గదిరి చిత్రరూపంబులఁ కరణి నుండ, వారి గన్గొని రుక్మిణీవల్లభుండు. 400

వ. మీ రీయనలంబు తెఱం గేమిగా నెఱింగితి రున్నరూ పెఱింగింప వలయు ననుట
యు వారలు సభక్తికంబు లగుచిత్తంబులతోడ. 401

క. దేవా విశ్వము గలుగుట, నీవలనన యడఁగుటయు నీయంద భవ
ద్భావాధీనము సకల,స్థావరజంగమసమాహితత్వం బెల్లన్. 402

తే. నీవు మమ్ము బోధింపఁగా నేర్తు గాక, యిమ్మహానలస్ఫురణంబు నిట్టి దనఁగ
నేము నేర్తుమె యేమియో యెఱుఁగ కునికిఁ, గాదె నివ్వెఱపడితిమి కమలనాథ.

వ. అనుటయుఁ భవదీయచేతఃప్రసన్నత గాదె జగంబులవర్తనంబులకు నాధారంబు.

క. కావున మీకుం బ్రియముగ, నీవిహ్న తెఱంగు దెలియ నెఱిఁగించెదఁ జి
త్తావిలత విడువుఁ డని కమ,లావరుఁ డిట్లనియె వారలకుఁ గురువర్యా. 405

క. ఒకదానవుఁడు జగన్నా,శకుఁ డిత్తఱిఁ గలఁడు వానిఁ జంపుట కేఁ బూ
నక యునికి గలిగె వాఁ డ,ప్రకటావిడుఁ డగుట నాకతంబున నగుటన్. 406

క. కడు గ్రొవ్వి వాఁడు లోకము, నుడుకులఁ బెట్టంగ విసివి యుగ్రతపమునం
గొడుకుఁ బడసి యద్దనుజుని, బొడవడఁగింపం దలంచి భూరివ్రతముల్. 407

చ. నడప మదాత్మ యగ్ని యయి నావదనంబున నిర్గమించి యె
క్కుడువడి పద్మగర్భకదనకుం జని నమ్మహితుండు మన్మథుం

గొడుకుగఁ బంచి వే తను [1]మఱగుడ్పఁగ వచ్చెఁ గడంగి పోవున
ప్పుడు వన మేర్చె నేను గృపఁ బూర్వవిధం బొడఁగూడఁ జూచితిన్. 408

వ. ఇది యద్దమానంబు తెఱం గని చెప్పి యప్పరమపురుషుం డమ్మునివరులతో మఱి
యును. 409

సీ. లోకత్రయంబున మీకు సువిదితంబు, లేదు త్రికాలసంవేదులార
యుత్తమం బగుపురాణవృత్తంబు సెప్పి కృతార్థుఁ జేయుండు నన్నని వారు
సవినయంబుగఁ గృతాంజలు లయి మ మ్మింత, పెద్దసేయుదె నీవు పెద్దలకును
బెద్దవయత్నసంభృతజగత్త్రియుఁడవు, విశ్వప్రకారసంవిదుఁడ వేము
తే. నీ యెఱుంగని యితిహాస మే యుగమున, నెఱిఁ జెప్పుమా మనవుడు నిజజిలు లనగవు
మాముసకుఁ జెన్ను సేయ నమ్మురహరుండు, వారలకు నిట్టలనుఁ గురువంశవర్య.

క. మానుషయోని జనించితిఁ, గాన మదీయ మగుబుద్ధిగౌరవము తదీ
యానుగుణాల్పోపహిత మ్ముఁ, గా నెఱుఁగుదు మీరు సెప్పుకత విను టసదే. 411

చ. అనుటయు వార లందఱుఁ బ్రియంబున దానికి నియ్యకొన్న నె 412
మ్మనములతోడ నీపనికి మాన్యచరిత్రుఁడు నారదుండ త
క్కిన పెఱవారు సాలరు ప్రకీర్త్యవివేకుఁడు కృష్ణుఁ డర్థితో
వినఁగఁ బురాతనం బగునవృత్తము నిమ్మని సెప్ప టొప్పగున్.

చ. అని తగ నేకవాక్యతఁ బ్రియంబున నాతనితోడ నీవు మున్
గనినది విన్నయట్టిది ప్రకామకుతూహలచిత్తుఁ డై నకృ
ష్ణుని వినిపింపు నావుడు మనోజ్ఞకథాకథనంబునందు వే
డ్క నిగుడ నమ్మునీంద్రుఁడు వికాసమునన్ మొగ మల్లసిల్లఁగన్. 413

ఉమామహేశ్వరసంవాదం బను నితిహాసము.

క. నారాయణసౌహార్దో,దారత్వవిభూతి మున్న తనకుఁ గలిమి న
న్నారాయణునిమనోరథ, పారం బూరించె శంకరాంబికలకథన్. 414

వ. అత్తెఱంగు వివరించెద నట్లు సమస్తసంయమిసంఘంబును బ్రస్తుతిపూర్వకంబుగా నియోగింపం బ్రియంబునం బురాతనకథాకథనంబునకుం బూని యద్దేవముని యద్దేవకీనందనునకు వందనం బాచరించి తదభివందనంబు వడసి యవ్విభున కిట్లనియె. 415

తే. తీర్థజనంబునకు నెందుఁ దిరుగు చుండి, యుత్తరాపథనగంబున కేను వచ్చి
కంటి రమణీయ మగు కేళికావనంబు, సకలతరువల్లికాగుల్మచారుస్థలము. 416

క. కోకిలకులగంధర్వా,నేకధ్వను లెనసి చెలసి నిగుడంగ నమరీ
లోకభ్రమరీమండలి, కాకలికలనాదములును గలసి చెలంగన్. 417

వ. ఒప్పునవ్వనంబునం గనకస్థలంబున శార్దూలచర్మవసనభుజగాభరణభసితాంగరాగ

---

1. క. గ. చ. ఙ. 'మగుడ్చె వచ్చె'.

విరచితాలంకారచారుదివ్యదేహుండగు మహాదేవుండు సురసిద్ధసాధ్యవిద్యాధరముని పుంగవభూతగణపరివృతుండయియున్న నప్పేరోలగంబున నేనును సముచితప్రకారంబున నయ్యనిరూపణీయప్రకారుం గొల్చి యుండితి నట్టిసమయంబున. 418

సీ. పుణ్యాంగనాకారములు దాల్చి పుణ్యనదీనివహంబులు దిశలు గొల్చి
చనుదేర శంకరసదృశపరిష్కార, కల్యాణతను వైనగౌరి వచ్చి
వెనుకదిక్కున మెలుపునఁ జేరి మోమున, కలఁతిన వ్వినుమడిచెలువు నొసఁగఁ
దమ్మిఱేకుల నుల్లసస మృదుత నప్పుడు, కరయుగ్మమునను శంకరునినేత్ర

ఆ. యుగ్మ[1]మెల్ల మూసి యున్నంత లోకమ
నర్కచంద్రతారకాగ్ని మైన మ
హాంధకారమగ్న మగుటయు సంక్షోభ
మందె భూతసముదయంబు లెల్ల. 419

ఉ. అప్పుడు ఫాలలోచనము నప్పరమేశుఁడు విచ్చె విచ్చినం
గప్పెఁ దదగ్నిజిహ్వాలు నగం బఖిలంబును గౌరిదేవి య
ట్లొప్పమి దండ్రి కైనఁ గని యుల్లము బెగ్గిల నీశునంఘ్రులం
గప్పఁగ మౌళిభూషణముకాంతి ప్రణామము చేసెఁ జేసినన్. 420

ఆ. హరుఁడు కరుణఁ జూడ నాహిమవన్నగ, దాహ ముడిగి శోభితత్వ మొలసె
నార్య పరమవిస్మయముఁ బొంది యా సర్వ, భువనకర్తతోడ సవినయముగ. 421

సీ. నిటలంబునను దెఱచుటకుఁ గారణ మేమి, సర్వేశ యిది రహస్యంబు గాక
యున్నని జెప్పవే యన్న నద్దేవుండు, కాంత నీ కెఱిఁగింపఁ గాని యట్టి
పని యెందుఁ గల్గునే వినుము లోకాత్మ, కత్వము నాకుఁ గల్గుటవలనఁ జేసి
న న్నేది వొందిన నన్నిలోకంబుల, నది వొందుఁ గాన నాయంబకములు

తే. నీవు మూయంగఁ దిమిరంబు నిఖిలలోక
చయముఁ గప్పిన భూతముల్ భయముఁ బొందె
నీకరంబుల్కఁ ద్రోవక చీకటియును
జెఱచుటకు ఫాలనేత్రంబు దెఱవ వలసె. 422

వ. అనిన విని యంబిక దనకు నడుగవలయునట్టివి యడుగుటకు నది యవసరంబుగాఁ గనికొని యక్కపర్దికి ట్లనియె. 423

క. నాలుగుముఖములు నీకు, న్నాలనయున గలుగఁ గారణం బేమి [2]సుధు
శ్రీలాభిత్యాస్పదవా, క్కాలికలనమున నాకు నానతి యీవే. 424

వ. అనిన విని యమ్మహాదేవికి నద్దేవుం డి ట్లను దైత్యులు సుందోపసుందు లన నిర్వురు గలరు వార లవార్యభుజవీర్యశౌర్యసంపన్నులు నస్త్రశస్త్రవిద్యులు

1. చ. మెఱిమి. 2. క. మృదుశ్రీ.

నై యుండుదురు హరలవినాశంబునకై మయుండు లోకంబులం గలయొప్పులం
దెల్ల నుత్తమసారంబులు తిల ప్రమాణంబు లాహరించి యొక్క కామినిం గావించి
తిలోత్తమ యనుపేరిడి నాకడకుం దెచ్చిన నచ్చెలువ నాకుం బ్రదక్షిణంబుగా
వచ్చునెడ నే నిది దేవకార్యంబు సేయ నోపుఁ బొమ్మనుతలంపుతోడ నత్తరుణి
దిరిగినదిక్కునకొక్కొక్క మొగంబు దాల్చి దానిం బరీక్షించితి నాఁటం
గోలెఁ జతుర్ముఖుండ నై యుండుదును. 425

చ. అన విని గౌరి నీకు భువననాథప కంఠమునందుఁ గప్పు గ
ల్గినకత మేమి నాకు నెఱిఁగింపుము నావుడు దేవదైత్యు లం
బునిధి సుధార్థులై తరువఁ బుట్టె విషంబు త్రిలోకభీకరం
బనితరసాధ్య మై యొదవిన త్తఱిఁ దాల్చితి దానిఁ గుత్తుకన్. 426

తే. అట్లు కంఠంబునందు మహావిషంబుఁ, దాల్ప నీలత గల్గిన దాననఁ జేసి
కమలజాదిసురులు నీలకంఠుఁ డనుచు, నన్నుఁ గొనియాడి రప్పుడు నలినవదన. 427

వ. అని చెప్పి శంకరుం డింక నేమి యడుగ వలతు నడుగు మనుటయుఁ బినాకం బెల్ల
యాయుధంబులకంటె మెచ్చి పట్టుదు దీనికిం గతం బెయ్యది యని యడిగిన నా
మృడుం డామృడాని కిట్లనియె. 428

సీ. ఆదియుగంబున నబల కణ్వుం డను, సంయమి తపము నిశ్చలనిరూఢి
మెయిఁ జేయఁ బెరిఁగె వల్మీకంబు తనువు[1] మూ, నుంగ నప్పుట్ట వేణువును బుట్టె
విను లోకసామాన్యఘనత గాకుండ మ, హోద్భుతాయామంబు నధిక మైన
పరిణాహమును గల్గెఁ బ్రహ్మ యమ్మునికిఁ బ్ర, త్యక్షుఁడై వర మిచ్చె నతనిమీఁదఁ

ఆ. బెరిఁగియున్న వెదురు గర మర్థిఁ దాఁ ద్రుంచి, కొని జగద్ధితంబు గోరి చేసె
నాకు విష్ణునకుఁ బినాకశార్ఙ్గము లగ్ర, ఖండమున నొనర్చె గాండివంబు. 429

వ. ఇవ్విధంబున విండ్లు మూఁడు గావించి లోకహితం బాచరించి యవ్విరించి య
మ్మూఁడవవిల్లు దాఁ గైకొని తనలోకంబునకుం జనియె నిది పినాకంబు సంభావ
నీయం బైన తెఱం గని చెప్పిన. 430

క. విని గిరితనూజ పెఱవా, హనముల నొల్లక వృషంబు నఖిలేశ్వర నె
మ్మనమునఁ గైకొని యెక్కుదు, వినఁగా నే వేడ్కఁ జెప్పవే కారణమున్. 431

వ. అనిన నద్దేవుం డమ్మహాదేవి కిట్లనియె. 432

సీ. హిమవన్నగంబున నేను లోకహితార్థ, మైనమహాతప మాచరింప
గోవులు సుట్టుఁ దేఁకువ నెక్కి తిరిగి నన్, సంకటపెట్టినఁ బంకజాక్షి
కోపించి చూడ సంతాపాకులత్వంబుఁ, బొందె గోకుల మరవిందభవుఁడు
నమరులుఁ జనుదెంచి ప్రార్థించి వృషముఁ గా, నిక యిచ్చి కరుణ జనింపఁ బలికి

1. క. మూ, నుఁగఁ గప్పుట మును వేణు వన్నను.

తే. నాకు గోపతి యనియెడు నామ మిచ్చి
రపుడు గోబాధ మాన్చి రక్షయ్యె మా వృషము
నాహనముఁ గేతువును గా శివప్రచార
మాచరింతు నెల్లెడ నది యాది గాఁగ. 433

వ. అనుటయు నంబిక యప్పరమేశుతో నీవు పరమశుచులును రమణీయంబులు నగు నివాసంబుల వసింపక యశుచియుఁ గేశాస్థికపాలదుర్గంధదుర్దర్శంబు నైన శ్మశానంబున నునికిఁ గతం బేమి యనిన నతం డిట్లనియె. 434

శివుఁడు పార్వతికిఁ దనశ్మశానవాసితకుఁ గారణంబు సెప్పుట.

ఉ. క్రూరపుభూతముల్ జనులఁ ఘోరవిధంబుల ముట్టి యెప్పుడున్
మారణ మాచరింపఁగ సమస్తజనంబులు నాశ మొందఁగా
వారిజసంభవుం డెఱిఁగి వచ్చి ననుం దగఁ గాంచి తత్ప్రతీ
కారము సేతకై వినయగౌరవ మొప్పఁగ వేఁడ వేఁడినన్. 435

వ. నిశ్చితంబుగా నొక్కెడ నుండి లోకంబులు రక్షింప వలయు నని తలంచితి నట్టి యెడ. 436

తే. మోక్షపరులు శుచిస్థానముగఁ బ్రశంస, సేయుదురు విజనత్వవిశేష మెఱిఁగి
కాన యింపైశ్మశానంబు మానసమున, నొలసెఁ గావున నయ్యెడ నునికి గలిగె.

చ. అచటన యుండి లోకముల నన్నిటి నాత్మఁ దలంచి రక్ష సే
యుచు విహరింతు భూతచయ మొక్కటఁ గూడి చరించు చున్కికిఁ
బ్రచురకుతూహలుండ నయి రాగముఁ బొందుదు నట్లు గాన నా
కచటు నివాస మయ్యె విను మన్యతలంబులు దానిఁ బోలునే. 438

తే. అనిన భసితాంగరాగంబు నస్థిఫణధ, రాభరణములుఁ బరశుశూలాయుధములు
నై మహోగ్రత భీకర మైనరూప, మభవ యేల కైకొంటి వీవని యె గిరిజ.

వ. అనుటయు నమ్మహేశ్వరుం డాపరమేశ్వరితోడ. 440

సీ. లోకస్వరూపంబు లోలాక్షి రెండువిధమ్ములు శీత ముష్ణమ్ము నాఁగ
జనునివి రెంటను సకలంబు గ్రథితమై, యుండు సౌమ్యాగ్నేయయోగకలిత
మఖిలజగంబు సౌమ్యము విష్ణుఁ డాగ్నేయ, మేను వహింతు మస్యుస్వరు దెలింగు
నెనయుటఁ గాని భరియింతు నే విశ్వంబుఁ, గావున నాగ్నేయభావరూఢ

తే. మైనయాకృతి లోకహితార్థముగ వహించినాఁడ నిం కెయ్యది యీవు నన్ను
నడిగెదదుగ్రము నావు నార్యసోముఁ, దలఁ బ్రియంబున నేటికిఁ దాల్చితనియె

చ. అనవుడు దక్షుయజ్ఞమునఁ గల్గిననాఁడు సురాలి కేను బీ
డన మొనరించుచోట వికటంబుగ సోముని మేను ద్రొక్కఁగా
ననుఁ శరణంబు వేఁడిన మనంబున నక్కటికంబు వుట్టఁ జే
సినదురితంబు సోము నిటు సేయక పోదని మౌళిఁ దాల్చితిన్. 442

చ. అని విని కొల్చి యున్నమును ♦ లందఱు నీసదయానువిశేషము
న్మనముల మెచ్చి పొంగి యఖిలనందనపూర్వము గాఁగ భక్తియుక్
వినయము నుల్లసిల్లఁ బదిలవేలవిధంబులఁ బ్రస్తుతించి ర
య్యనుపమధాము గౌరి సమయం బిది నా కని మోదమ్పఁ గేలితోన్. 443

తే. లోలలోచనదీప్తులు ♦ బాలచంద్ర, భూషణునిపదవంబునఁ ♦ బొంది మునుల
మానసంబులు సంప్రీతి ♦ నూన సాంత్వ,నస్వరంబున నిల్లను ♦ నలిననాభ. 444

క. వర్ణాశ్రమధర్మము లఖి,వర్ణింపుము వేదనిరతవత్సల యని నా
కర్ణములతో నఖిలజన,కర్ణంబులఁ బొంది పుణ్యాకర్త్వత నొసఁగన్ 445

వ. అనియె నని యిట్లు గౌరీలోకహితార్థంబుగా వర్ణాశ్రమధర్మంబులు పరమేశ్వరు
నడుగుటయు నారదమునికృష్ణునకుం జెప్పినతెఱంగు భీష్ముండు ధర్మజునకుఁ జెప్పు
ట యుపన్యసించిన నాకర్ణించి. 446

క. మునివర నా దగుచిత్తంబునఁ గౌతూహలము పాల ♦ మొలకొంచె తలి
రుప్పన [1]నెలరారెడు నేర్పడ, వినిపింపుము మోదికథ సకలవిస్తారముగన్. 447

వ. అని యడుగుటయు. 448

మ. [2]స్ఫుటతత్త్వోదయసంభృతైకమధురా ♦ భూతైకరసాధురా
తటిసింఛమనోజ్ఞ మాళిలలితా ♦ దాంతాత్మసంకీలితా
త్రుటికాతత్త్వసమున్నతాశ్రితజనా ♦ దూరాంజనా సువ్రతో
త్కటశీలావనలోలదివ్యహృదయా ♦ [3]ధర్మప్రసన్నోదయా. 449

క. దేహాభిమానసంభృత,మోహాతమోనిరసనాభిరముఖభూరివివే
కాహీనమహాతత్త్వస,మాహితచిన్మాత్రరూపసముధురిమసుభగా. 450

మాలిని. త్వరితవిహితగాఢధ్యాయిసమ్మోదవాదా
స్ఫురదరిదృఢశూలస్ఫూర్తిసంశస్తహస్తా
తరణిశశిమయత్ర్యక్షదారశాచిత్రనేత్రా
పరమనియతిసిద్ధాకథవ్యాహృతప్రద్మసద్మా. 451

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజి ప్రణీతం బయిన శ్రీమహాభారతంబునయందు నానుశాసనికపర్వంబు
నందుఁ జతుర్థాశ్వాసము. 452



1. చ. నెలరారెడు. 2. క. స్ఫుటితత్త్వోదయసంభృతైక్యమధురా. 3. క. ధర్మప్రసంబద్ధయా
చ. ధర్మప్రసన్నోదయా.



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆనుశాసనికపర్వము, పంచమాశ్వాసము



శ్రీలీలోద్ధురసు
శ్లోకాలోకనవిలాస[1]సుస్థిరభవనా
శోకముదాద్యవధూటీ
వ్యాకోశవివేకభవన హరిహరనాథా. 1

### శివుఁడు పార్వతికి వర్ణాశ్రమాచారంబుల తెఱం గెఱింగించుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

తే. అట్లు గంగాత్మజుండు ధర్మాత్మజునకుఁ, జెప్పి యిట్లను గౌరవశ్రేష్ఠ పద్మ
నాభుతో నవ్విధంబున నారదుండు, పార్వతీదేవి ప్రశ్న ముపన్యసించి. 3

వ. ఇట్లనియె నప్పర్వతరాజపుత్త్రి ప్రార్థించిన నప్పరమేశ్వరుఁడు పరమాదరభరి
తుండై. 4

సీ. అజుఁడు మున్ను లోకహితార్థంబుగా బ్రాహ్మణులను సృజించి రాజులను వైశ్య
లను శూద్రులను గ్రమంబునఁ గల్పించె, నాజాతులకు నోలిఁ దనతని ముఖము
బాహులు నూరులుఁ బదములు సంభవస్థానంబు లగుటయుఁ దారతమ్య
భాగులు లగు నని పార్వతి కాతండు, తత్తదాచరణీయధర్మములును

ఆ. వినుము విస్తరించె విప్రులు లోకధారకులు వారియెడఁ బరాభవంబు
సేత యొల్ల చేటుఁ జేయు సమ్మానదా, నములు సకలశోభనము నొనర్చు. 5

చ. ప్రియ మతి యజ్ఞనేనియు దరిద్రునినేనియుఁ విప్రుఁ గందఁ జేఁ
త యుభయలోకసౌఖ్యములు దవ్వుగఁ జేయుఁ దదీయ మైననిం
దయు నను బెట్టు దిట్టుట యధర్మలి నాతనిసొమ్ము పుచ్చికొం
టయును మదర్థముం గొనుట డాపఁక చెప్పితి [2]నిక్క మింతయున్. 6

వ. అని పలికి యిట్లనియె. 7

1. క. సుస్థితభువనా. 2. గ. తొంత మింత.

సీ. అధ్యయనంబును । యజనంబు దానంబు, నధ్యాపనంబును । యాజనముఁ బ్ర
తిగ్రహంబును బ్రశాంతియుఁ దపస్సత్యశౌచంబులు విప్రధర్మంబు లాప
దలఁ దక్క నతనికి । వలవదు వాణిజ్య, మగ్నికార్యంబు శూద్రాన్నవర్జ
నము నిజదారసంగమనియమంబును, నిరుపద్రవ గుణమును । హింస లేమి

ఆ. యును నివాసశుద్ధియును నతిథిప్రియత్వంబు బ్రాహ్మణులకు । వలయుఁ దపము
పేర్మిసాధనముగ । ధర్మమూలముగ వారల సృజించెఁ గాదె । నలినభవుఁడు. 8

ఆ. క్షత్త్రియులకు విప్రసంరక్షముఖ్యధర్మంబు ధరణి వారిరక్షణముఁ
గాని బ్రదుక దమ్మహానుభావులపాలనంబు సేయు శోభనంబు నొందు. 9

క. రమణీ యధ్యయనము యజనము దానము సాధుపోషణము దుర్జనులన్
దమియించుటయు సముత్సాహముఁ గల్మియు ధృతియు నృపుల । కగుధర్మంబుల్.

తే. శస్త్రజీవికయును నరిషష్ఠభాగమాహరించుటయును భృత్యు । నరయుటయును
బ్రజవివాదంబు వినుచోటఁ బక్షపాతి, గామియును రాజులకుఁ గృత్యకర్మకోటి.

సీ. వణిజులు లోకప్రవర్తనంబుల కెల్ల, నుపకారులు కృషియును ననేక
భంగి బేహారంబులును బసులఁ బెంచుటయుఁ గృత్యంబులు వారల । కధ్యయనము
యజనంబు దానంబు । నర్హకర్మంబులు, త్రైవర్ణికద్విజత్వమ్ము కతన
నాతిథ్యములు విధేయములు వారికిఁ దిలగంధరసముల విక్రయము దగదు

తే. మూఁడుజాతుల శుశ్రూష మూలకార్యగతి తదుపయుక్తిశూద్రులకుఁ గలిమి నడచు
వారు శుశ్రూషకులు విప్రవందనంబు వినయ మక్రూరులగుట శూద్రహితకృతులు.

క. తనతనవర్ణంబునకుఁ దగిన యాచారంబు నడపి । కిల్బిషరహితుం
డనఁ బరఁగు నెల్లవారికి, విను ముత్తమజన్మసౌఖ్యవిభవము గల్గున్. 13

వ. ఇవి వర్ణధర్మప్రకారంబు లింక నాశ్రమధర్మంబులు వివరించెద నాకర్ణింపు మని
పలికి పార్వతికిఁ బరమేశ్వరుం డిట్లనియె. 14

సీ. బ్రహ్మచర్యవ్రతపరమనిష్ఠయు గురు నాశ్రయించుటయు స్వాధ్యయనకృతియు
నగ్నికార్యంబు గుర్వర్థసంచారంబు, భైక్షచర్యయుఁ గమలాక్షి బ్రహ్మ
చారిధర్మంబు లాశ్రమముల కెల్ల నాశ్రయణీయమై గృహస్థత్వ మొప్పు
శౌచంబు నిజదారసంతుష్టియును బంచయజ్ఞంబులును నిగమాభిరతియు

తే. దానహోమదయాతిథిమాననములు, వలయు గృహమేధికిని వనవాసవన్య
భోజనబ్రహ్మచర్యజటాజినప్రధారణములు వానప్రస్థధర్మకోటి. 15

చ. కనియమి సంగవర్జన మకించనభావము దాల్మి విప్రవా
సనము ప్రశాంతి యార్జవము । శౌచము సద్వ్రతనిష్ఠ భైక్షభో
జనమిల సద్రసేవ కృప సంచితతత్త్వవిచింతనంబు మా
నిని యతిధర్మముల్ శ్రుతి గణించినభంగిన యేను జెప్పితిన్. 16

వ. అని యాశ్రమధర్మంబులు సెప్పిన విని యప్పరమేశ్వరునకుఁ బార్వతి తపంబు

తపం బనుచు మునిజనంబు లాచరింతురు దాని తెఱం గెఱింగింపవే యనిన నద్దేవుం డి ట్లనియె. 17

శివుఁడు పార్వతికిఁ దపస్స్వరూపంబు సెప్పుట.

సీ. భోగార్థు లై తపంబునకుఁ జొత్తురు తపం, బనఁగ వానప్రస్థు లాచరించు
ధర్మంబు లింద్రియనిగ్రహాదికర్మములో, నుభయకాలమునను యోగసేవ
ఫలకాంక్షఁ జేత తపస్స్వరూపంబుగా, నడపి కాలంబైన నాకమునకు
నరిగి తద్భోగంబు లనుభవింతురు పుణ్య, మవసిత మగుడు మర్త్యత్వ మొందెద
తే. సత్త్వ రధికనియతి నుపవాసములను, జపముఁ బంచాగ్నిమధ్యవాసంబుఁ గలుగు
తపముఁ గలదప్సరఃప్రియత్వంబొనర్చుఁ, గర్తదివాఁడుదివచ్చుఁ గానిమరలి.

వ. అని చెప్పి మఱియు. 19

ఉ. దారయుతంబుగా నడచు తాపసముఖ్యు లహింస పేర్మి నై
కారుణికత్వ మగ్గలము గల్గి తలంతురు సర్వజీవులం
దారును నొక్కరూపుగఁ బ్రదంపడి పుత్త్రకళత్రయుక్తిఁ బెం
పారుదు రూర్ధ్వలోకమున నజ్జనముల్ మఱి వచ్చుఁ గ్రమ్మఱన్. 20

వ. అనిన భవాని వనవాస వ్రతవిశేషంబులుం దదీయఫలప్రకారంబులు నేర్పడ నాన తీయవే యనుటయు భవుండు భరితాదరుం డై. 21

సీ. ఉపవాసములు మౌన మూర్వీశయత్వ మ్మాసన మూర్ధ్వబాహుక స్థాపనంబు
నియమితాహారత్వనిష్ఠ క్రమంబున, శిశిరమున ద్యుతివాసముల నిలుపు
గంధర్వదేవనాగస్థానముల నునికి, యును బహుసౌఖ్యసంయుతము గాఁగ
నానాసహస్రాబ్దమానసీయంబుగఁ, గావించు సంక్షేపగణనఁ గొన్ని
తే. మహితనియతులు సెప్పితి మఱియు నేమి, వ్రతమునను లేపినఁ బాపని ర్హారణముగుటఁ
బుణ్యగతికిల్మి దప్ప దరణ్యవాసి, కడుగు మింకను వలసిన యట్టి వినుము. 22

క. యాయావరుల నమరవం, ద్యా యోర్పడఁ జెప్ప మునియె నంబిక దేవుం
డాయమ కిట్లనుఁ దీర్థప, రాయణు లుపవాసవిధిపరమధికులు వారల్. 23

వ. అది యెట్లం టేని 24

క. నానాతీర్థసలిలస్నానంబులఁ బల్ల లై నజడలును భిక్షా
నూనోపవాసకృశ మగు, మేనులు నై వారితపము మిక్కిలి మెఱయున్. 25

క. మాసోపవాసవిధులం, జేసి తృణాదధాన్యభుక్తి సెల్లింతురు వా
రేసురలకు లేనిసుఖా, వాసమ్ములఁ జరితమూలలు వఱలుదురు మహిన్. 26

వ. అనిన విని యవ్వృత్తాంతంబు వైఖానసులవిధంబు వివరింపు మనుటయు న
వ్విరూపాక్షుండు. 27

సీ. వైఖానసులు ఖరవ్రతు లెట్టు లంటేని, శిలఁ దృణధాన్యముల్ సిసుక నడచి

కొందఱు పండులఁ గొఱికి కొందఱు[1] గన్నగుఱుములగువ్వల తెఱఁగు నోపఁ
నప్పటికప్పటి కాననంబున వైచికొని కొంద ఱాకు లెంగడినవి యేఱి
కొని కొందఱంబువుల్ గొని కొందఱనిలంబు, గొందఱాహారంబు గొందు ఱట్లఁ

తే. గాక యాహారపరులును గలరు వార
లింద్రునకుఁ బూజనీయులై యెక్కు డైన
పదవిఁ జిరకాలబహుసౌఖ్యభాగు లగుదు
రని మహేశ్వరుఁ డుమకు ని ట్లనియె మఱియు. 28

వ. ఇవి యెల్లను వానప్రస్థనియమనిష్ఠాభేదంబులు తపంబు తపం బని మును లాచరింతురు దాని తెఱం గెఱింగింపు మని నీవు దొల్త నడిగి (నవిధంబు) నంతతోడంగి నా చెప్పినవిధంబు లన్నియుం దపం బనుశబ్దంబున కర్థంబు లై యుండు నని చెప్పి యంగుష్ఠప్రమాణదేహులు మృగాజినవసనులు నిర్ద్వంద్వులు నై వాలఖిల్యు లను పేరం బ్రసిద్ధు లగుమునులు దినకరదీప్తులతోడం గూడి వర్తించుచుండుదురు వారలతపోవైభవంబునం గాదె జగంబులు సుస్థిరంబు లై యున్నయవి యొండు మెయి దుర్లభంబు లైనట్టివి తపంబున సులభంబు లగుం దపంబు గడచిన ధర్మంబుఁ గలదే యని పలికి యాదరాతిశయంబున శివుండు శైలేంద్రతనయతో ధర్మంబులు మఱియు నెఱింగించెద నవహితవై యాకర్ణింపు మని యిట్లనియె. 29

ఉ. అంబుజనూతి యేర్పడ గృహస్థసమర్థముగాఁ బ్రవృత్తిధ
ర్మంబు నొనర్చె నార్యజనసమాన్యము దాని తెఱంగు సాల సూ
క్ష్మం బతికాంత లేక తగు కాలమునన్ సముచితప్రవృత్తి ని
త్యంబును ధర్మముఖ్యముగ నర్థముఁ గామముఁ జెల్పు టొప్పగున్. 30

చ. అతఁడు నివృత్తిధర్మము ప్రయత్నమునన్ వివరించె మోక్షణో
ద్యత మది తత్ప్రకారములు దాంతియు భూతచయంబు పైదయా
రతియును సత్యదృష్టియు విరాగత యింద్రియకోటికిన్ దృఢ
స్థితముగఁ జేసి యోగనిరతిం బరిశాంతి యొనర్చికొంటయున్. 31

వ. అని మఱియును. 32

తే. క్షుత్పిపాసలచేఁ గడుఁ గుందినట్టి యతిథి వచ్చిన బ్రియమున నతని దప్పి
వోవునట్లుగ సముచితభోజనంబు, వెట్టు టెల్లపుణ్యంబులకుఁ బెద్ద దలఁప.

క. దీనికి నఖిలాశ్రమనువి,ధానంబులకును గృహస్థతయ మూల మగుటన్
దానిపదాఱవ పాలిస,మానము గాదరయ నాశ్రమం బెయ్యదియున్. 34

క. అన విని గృహస్థునకు నే,పని ముఖ్యం బనియె గిరిజ పశుపతి జననీ
జనకారాధన మతనికి, ననుత్తమం బైనధర్మ మని రూపించెన్. 35

1. క. చ. ముక్కు, చెంచుల గువ్వల

వ. అద్దేవుండు వెండియు. 36

క. పతిభక్తి ముఖ్యధర్మము, పతి గనవుము దేవి నరుఁడు । జననీజనకుల్
మృతులైనను నారి విగత,పతిత్వ మొందినను జేయుఁదగు నెయ్యవి హరా. 37
అనుటయు సర్వజ్ఞుఁడు నారీవర్తనంబు తెఱంగించెద విను మని యిట్లనియె. 38

క. దేవాతిథిపిత్రుపూజలు, గావించుట భావశుద్ధి గలిమి నరునకుం
దేవి వలయును నారికి, నేవిధమున బ్రహ్మచర్య । మేమఱమి దగున్. 39

వ. అని నిర్దేశించి మఱియును. 40

ఆ. పంచపర్వసురతపరిహృతితో నిజ, దారతృప్తుఁ డగుచు । ధాన్యకోటి
పక్షి కొలుకు దిని బ్రదుకుఁ గా ననుగృహ, పతికి నశ్వమేధఫలము గలుగు. 41

వ. అని చెప్పి. 42

ఆ. ఎచట నొలఁగ నేమి । యెట్లుండ నేమి దా, నేమి సేసె నేమి । [1]యెల్ల సంగ
ములను విడిచి కుడుపువలన నియతి గల్గు, యతికి మోక్షవీథి యాటపట్టు. 43

వ. అనిన విని సంప్రీతయై శైలరాజపుత్త్రి త్రిపురహరునితో రా జనువానికి భూజనం
బులయట్ల శరీరంబును భోజనాదులును నట్ల యుండియు నతం డెల్లవారలచే
మ్రొక్కు గొనుటకు నిగ్రహానుగ్రహంబులకుం జాలి సర్వాధికత్వంబున శోభిల్లు
దానికిం గారణం బేమి తెఱంగింపవే యనుటయు నీశానుం డిట్లనియె. 44

శివుఁడు పార్వతికి రాజత్వమహిమాతిశయంబు చెప్పుట.

సీ. అధికపుఁదపమున । నైనది రాజత్వ, మట్లు గావునఁ బేర్మి । నతికయిల్లు
జనములచే మ్రొక్కు । గొనుటకు నిగ్రహం,బునకు ననుగ్రహంబునకు శక్తుఁ
డై యుండు నతఁడు తదీయసునీతియు, విను ముదమున రాజు । వినయపరునిఁ
జేసి యెల్లజనంబు । శిక్షించు నింద్రియ, జయమును నరివర్గజయముఁ బడయు
తే. నెఱిఁగి యుపధావిశుద్ధుల । నిడు నమాత్య
పదవి ననురక్తసారవద్బలముఁ బ్రోచు
హితపరుల మిత్త్రులుగఁ గొను । నిలకు మేలౌ
నర్చు దుర్గంబు రక్షించుఁ । గూర్చు ధనము. 45

వ. ఇవ్విధంబున సప్తాంగసంపన్నత్వంబు నొంది. 46

క. చేయఁ డపాత్రవ్యయములు, సేయుం బాత్రవ్యయంబు । సేయుఁగా నిజగ
తాయత్న మెల్ల తెఱఁగులఁ, బాయక ధర్మంబు సేయుఁ బాపము దొలఁగున్. 47

ఆ. ఆచరించు దండ । మక్రోధకాముఁ డై, చారదృష్టిఁ జూచు । శత్రుకృత్య
ములను నాత్మదేశపురపరివారవి,ధముల సత్యభాషణముల నెగడు. 48

క. ఉద్యోగము ప్రియవాదిత, విద్యాపరినిష్ఠ సంధివిగ్రహవివాహా
వద్యత దీనానాథవి,పద్యాపన మాజ్ఞ నెరవు । పాటించుఁ దగన్. 49

1. క. యెల్లసౌఖ్యములును.

ఆ. కయ్యమునకు నెప్పుడుఁ । గాలుద్రవ్వఁడు దగ, వైనరణము శూరుఁడై రొంపఱచు
యజ్ఞదానవిధిపరాయణుఁడై యుండు, నిత్తైలంగువృత్తి । దుత్తమంబు. 50

క. ఈ నీతులకు విరుద్ధము, లై నడపునల నరకములకు । నరుగు నృపతి పా
పానీతదుఃఖ మొకటతే, దూను నొరుల కలని కెవ్వడు । మానక యొందున్. 51

ఆ. భావశుద్ధి గలిగి । యీ వినీతులఁ బూని, ప్రజల కెవ్వఁ డెల్లరక్షణంబు
సేయ నట్టివిభుఁడు । సిరియును గీర్తియుఁ, గాంచుఁ బుణ్యలోక । గతియుఁ బడయు.

క. అనుటయు ధర్మరహస్యము, వినఁ గోరెద ననిన కౌంభ । విశ్వంభుం డి
ట్లనియె నహింస రహస్యం, బనఁ బరఁగును ధర్మజాల । మఖిలమునందున్. 53

వ. అనిన విని యా జగన్మాత యవ్విశ్వధాతతో హింసావర్జనం బేజనులకుం జెల్ల
దని చూచెద నహింసకెఱం గెఱింగింపవే యనిన నద్దేవుం డది నీతలంచినట్ల
నేలం బిపీలికాప్రముఖంబుల నాకసంబున మశకాదుల మఱియుం జేను నల్లి
నీరపేను లోనైన జంతువులం జంపక యెవ్వరికి మాన రాదట్లు గావున. 54

చ. ఫలము దళంబునుం దొడిమఁ । బాయుట రాలినవానిఁ గొంచు నాఁ
కలి కెరనేసి గోరసము । కార్యము నట్టుల నిర్వహించి బు
ద్ధులు వెలి లేక నిశ్చలతఁ । దోయజపత్త్రనిభాక్షి చిత్రరూ
పులొకొ యనంగ నుండ శమ । పుణ్యులు మూవె యహింసనాత్మకుల్. 55

తే. అవియు శ్రుతిచేత ధర్మర । హస్యమనఁగఁ, బడియెనసిచెప్పి మఱియును । భవుఁడు దేవి
కిట్టు లను నట్లుగాక యహింస తెఱఁగు, గఁదూవినుము విశేషించి । కమలనయన.

తే. విధివశంబున మృతిఁ బొందు । వివిధజంతు,నిచయము మం దనహంకార । నిష్ఠుఁడైనఁ
బురుషుఁ గల్మష మేమియుఁ । బొంద నేర, దెట్టు లగలేని విను మది । డేర్పరింతు.

సీ. దివియలోఁ బడుఁ బుర్వు । దివియ యెత్తినవారిఁ, బాపంబు వొందు నే । కొలాపి మన్న
నాఁగేటి మొనఁ జచ్చు । నానావిధప్రాణు, లన్నరుఁ బొందునే । యఘమువారు
దముపనుల్ సేయ వి । ధాతృవశమున నా,యువు దెగినట్టిజం । తువులు నచ్చు
నేము సంపితి మని । యుంచుకేనియు నహం,కారంబు వారికిఁ । గలుగ దట్లు

ఆ. గాన చూవె వారిఁ । గల్మష మొందదు, పుణ్యపాపములకు । బుద్ధి మూల
మని శివుండు మఱియు । నను హింసవోలెనై, యధికధర్మ మైన । విధము వినుము.

క. దైవగతిఁ జేసి తమకుం, జావ వలసి గోవు లొందు । సా వొల్లక స
చ్ఛావమున రంతిదేవుని,కావించుమఖమునఁ బశుతఁ । గైకొని నెమ్మిన్. 59

వ. అనేకసహస్రంబు లరుదెంచి. 60

క. తము విశసించుట కాభూ,రమణుని వేఁడంగ నతఁడు । రాజీవాక్షీ
క్రమమున విశసింపఁగఁ జ,ర్మములు దరులు గాఁగఁ బాఱె రక్తము నది యై. 61

క. ఆ చర్మణ్వతి యనునది, గోచర మే వర్ణనమున । కారంబ్రియ మగుశం
పై చవి చేయుం బొలిచె యా,సచమహితసలిల మయ్యె । నెత్తురు సుదతీ. 62

క. స్నానమునఁ బానమున నా, హ్లానందము సేయు నమ్మహానది గోసం
తానము దివికి నరిగె న,మ్మానవతిఁ జెప్పనేల మధురాలాపా. 63

క. పరబలము పై నడరి నె,త్తురు వఱ్ఱులు వారఁ జంపు శూరుల దురమున న
ప్పురుసదనంబును బుణ్యో,త్తర మని వేదములు సెప్పెఁ దనుతరమధ్యా. 64

క. పోరులయందలి మరణము, కారణముం బుణ్యలోకసుహితమహిమకుం
గారణ మెఱుఁగు మహింసా, కారంబట్టి యని నీవ కమలదళాక్షీ. 65

సీ. అని చెప్పి యెండియు హరుఁడు పార్వతితోడ, నిట్లను వేటకు నెఱయుటఘుము
గాదు సస్యములు మృగములచేత నశించు, జగ మెల్ల నిర్మనుష్యంబు గాఁగ
గోరు మృగము లది కారణంబుగ మృగ, హతి రాజులకు ధర్మమయ్యె నట్లు
గాక మృగములకుఁ గలుగు సద్గతి రాజు, చే మృతిఁ బొందినఁ జెలువ వినుము

తే. దండ్యు దండింపకుండుట యదండ్యు దండ,నంబు గూర్పుట విప్రుమన్ననంబు నొచ్చ
పట్టి పని సేత నపరాధి యైనయతని,తనువు నొంచుట నూహింప ధరణిపతికి.

వ. అని బోధించి. 67

క. భూసురుల కలుక పుట్టం, జేసి నహుషముఖ్యనృపులు సెడుట ప్రసిద్ధం
బౌ సురపతి విప్రునలుక, గాసిఁ బడఁడె తెలచి పడసెఁ గాదె నహుషముల్. 68

క. కావున విప్రారాధకుఁ, డై వెలయు విభుండు రాష్ట్ర మతని ధనము నై
న్యావలి బంధుత విప్రుల, దీవనబలం బాడలు నింత తెల్లము దేవీ. 69

వ. అని నిర్దేశించి కపర్ది గౌరితో నెండియు. 70

ఆ. పరమమంత్రవిధులఁ బశువులు యూపంబు,లందుఁ గట్టఁబడి మహాసుచిత్వ
విభవ మొందు విహితవిశసనక్రియ మేను,విడిచి దివ్యసుఖమువడయుఁ బొలఁతి.

క. హోమవిధులఁ దన్మాంసము, లామిషములు గాఁగ నొసఁగి యమరుల నగ్ని
ష్టోమాదులఁ బ్రోవఁగ బర,మామితసౌఖ్యములు గల్గు యజమానులకున్. 72

క. శ్రుతివిహితహింస హింసగ, మతిఁ దలఁపఁగ రాదు మునిసమాజం బది దు
ష్కృతతతిఁ బాపెడుపరమసు,కృత మని కొనియాడుఁ గాన గీర్వాణనుతా. 73

ఆ. అని యహింస తెఱఁగు లన్నియు నెఱిఁగించి, యింక నేమి వినఁగ నిచ్చ సెప్పె
దనిన రుద్రు నడిగె నద్రిజ జనులజీ,వనము తెఱఁగు తెల్ల వనజనాభ. 74

సీ. అడిగిన నద్దేవి కద్దేవుఁ డిట్లనుఁ, గాంత మానుష్యంబు కర్మభూమి
సుఖదుఃఖమూలముల్ సురతిర్యగాత్మక,త్వంబు లట్లగుట విత్తంబు వలయు
మనుజుల కెట్టన్న విను ధర్మ కామముల్, విత్తసాధ్యంబులు విద్య వార్త
సేవ కాంత యర్థసిద్ధికి మూలముల్, విద్యవానికి ననవద్యతయును.

ఆ. గర్షకునకు నేల కాల మెఱుంగుట, జట్టిగాని కేది సంభవించె
నందు విలువ మొదలగు లాభమును నెడ,వ్యయము గల్గుటయు శ్రీప్రదముల,

క. పసులం బాలించునతఁడు, వినువక యేమఱక వానివిధము లెఱిఁగి ప్రో

చి సమర్థుం డగు వెరవునఁ, బసఁ గను సేవకుఁడు ధనముఁ § బడయుఁ బొగడుతోన్.

క. వంచనయును జాడ్యంబును, నించుకయును లేక ప్రభువు § నిష్ట మెఱిఁగి తాఁ
బంచినపని వెరవునఁ గా,వించినకర్మకరుఁ డొందు § విపులధనంబుల్. 77

వ. అని వెండియు. 78

క. [1]పరధనపరదారల నప,హరింపమియు దేవపితృ § సమారాధనముం
గరుణయు నతిథిసపర్యయు, గిరితనయా యెల్లవారికిం గృత్యంబుల్. 79

శివుఁడు పార్వతికి వర్ణకర్మఫలపాకంబుల తెలియ నెఱింగించుట.

వ. అనిన విని యపర్ణాదేవి వర్ణంబులకర్మంబులు పాకంబుఁ బొందు ప్రకారంబు సెప్ప
మని యప్పరమేశ్వరు నడిగిన నతం డి ట్లనియె. 80

చ. తమతమకర్మముల్ దెరువు § దప్పక చేసినవారు దేవలో
కమున సుఖంబు నొందుదురు § క్రమ్మఱ వచ్చియుఁ బూర్వజాతిజ
న్మమున మహర్ధిఁ బొందుదురు § మానిని యిట్టియుఁ దప్పి యెట్టి కృ
త్యముల్ జరించి రజ్జనుల § కట్టికులంబునఁ బుట్టి వాటిలున్ 81

క. ఎంతెంత మేలు సేసిన, [2]నంతంతియ కులము నెక్కు § నై సమకూరుం
గాంతా విప్రుఁ డయిన నత్యంతానంద మగులోక § మతనికిఁ గలుగున్. 82

వ. అని చెప్పి మఱియును. 83

ఉ. ఆపదఁ దూలపోక సిరి § నంది మదింపక శౌర్యవృత్తిమైఁ
బాపుల గెల్చి యార్జవము § బంధుజనాళికి నార్యకోటికిం
జూపుచు దీనులం గరుణఁ § జూచి తగం గలమాత్ర బ్రోచుచుం
గోపము లేక యున్కి గలుగ్గగ దివిజాంశమునన్ జనించినన్. 84

క. అనిన విని గౌరి గొందఱు, మనుజులు సంపద సుఖించి § మనఁ గొందఱు లే
మి నలంగి దుఃఖపడుదురె, విన వలతుం గారణంబు § వినిపింపు శివా. 85

చ. అనుటయు శంభుఁ డి ట్లను దకయుగా బలి భిక్షము వెట్టి లేమిఁ గుం
దినచెలిఁ జుట్టముం బిలిచి § దీనత వాపి యుపావవృత్తిఁ జె
ల్లినతొలుబాము గల్గునరు § లెస్సగ [3]జుండు విధాత నిమ్మృపా
త్మ్మని నలిలోభదూషితుని § దుర్గతి దుఃఖతఁ జేయుఁ బార్వతీ. 86

క. విను మలుకయుఁ గూర్మియు లే, వనవద్యా యొజ్జనంబు § లందును విధికిన్
మును సేసినకర్మముఫల, మనుభవగోచరము సేయు § నంతియ తక్కెతోన్. 87

వ. అని యెఱింగించి వెండియు. 88

ఆ. ధనము గలిగి యుండి § ధనరాశి కుడువక, కట్ట కుండు పరమ § కష్టజనము
లారుపు లాత్రి చెప్ప § నుపకారులైతొలు,పుట్టువందు మనినయట్టివారు. 89

ఆ. తమకు ధనము లేక § తగుభోగముల కెవ్వా, రైన నడప మనుష్య § బాధ్యజనులు

---

1. క. ... పరధనపరదారల నపహరింప, 2. గ. నంతంతయు, 3. గ. మన్ను విధాత.

దొల్లి పేదవారక యుల్ల మర్థుల కెప్డు, బెట్టఁ గోరుచుండి కనట్టివారు. . 90

సీ. ఆయాసపడ కుండ నర్థంబు సేరెను, వారు పాత్రజనంబుఁ దార పిలిచి
తొలు మేనఁ బెట్టినయలఘుదయాఢ్యులు, ధనసిద్ధి బహులయత్నమునఁ గలుగు
మనుజులు పూర్వజన్మమున నర్థులు దమ్ము, [1]నడుగ దాఁపక యిచ్చినట్టివార
లాయాసమునను వి త్త్యాగమం బెకలేదు, జనులు ముందటిపుట్టువునఁ గృపావి
తే. హీనులై యాచకుల నేకయుంచి పిడప, నిడనిలోభులు మువిసి ధననేమఁ దగున
రుండు ప్రాయంబునాఁ జీకగండడంగి, తొంటిభవమున సిగిలి కొడఁగినతఁడు.
తే. కలిగి యుండియుఁ దెవ్వులకతన భోగ,ములు భుజింపఁగ మర్త్యులుగిరీంద్ర
తనయ తొలుమేన రోగములే దనికి చచ్చు,నపుడు దానంబు సేసినయట్టివారు.
తే. అధిక సౌందర్యములు గల యట్టిజనులు
దొల్లి మాంసభోజనములు దొలఁగి యున్న
వారు రూపవిహీనులు దారు రూపు
గలిగి తొలుమేనఁ గొనటులఁ బలికినారు. 93
క. విను సౌభాగ్యసమేతుఁడు, మును నిజదారైకపరుఁడు ముందటిజన్మం
బున భార్యకు బ్రీతి రొనర్పనిమనుజుఁడు సుభగతావిరహితఁ బొందున్. 94
క. అమితజ్ఞానము విజ్ఞానముఁ గలిగియుఁ బేదయైననరుఁడు సనిజ
న్మమున వినికి గలిగియు దానము తెరువునఁ బోనివాఁడు నలినదళాక్షీ. 95
క. తగుబుద్ధి లేక సంపద, మిగులఁ గలుగువాఁడు దొంటిమేనగరుణమై
విగత ప్రజ్ఞుం డయ్యును, దగ దీనులఁ బ్రోచినతఁడు దళితాబ్జముఖీ.
సీ. మేధావి యై విస్త మిగిలి విద్యలఁ బొల్చు,నరుఁడు దొల్బాము కుకుసకధిక
భక్తుఁ డై తన దైనకపాండిత్య మొసులకుఁ గావించు వేపక గలుగుసుదమఁ
డభ్యసింపంగ విద్యాయుక్తి లే కుండు,నాతఁడు దొల్లి విద్యాధికత్వ
మున గర్వియై శిష్టజనులకు సభ భంగ, మొనరించి కుందఁ జేసినయతండు
తే. భార్యయును బిడ్డలును దాను బహుధనముల
భోగులై రోగములు లేక పొల్చువార
లమలినాచారపాత్రదానములు సత్య
కరుణలును దొంటిభవమునఁ గలిగినారు. 97
ఆ. అలు బిడ్డ లొంటు లై లేమిఁ గుందుచుఁ, దెవులుచే [illegible] యుదనులు
మున్న క్రోధలోభములనా స్తికతఁ బర, పీడనంబు [illegible] 98
సీ. కాంతజాత్యంధుండు [2]గన్నులు సెనువాఁడు, దనయొప్ప [illegible]
వనితఁ దొల్మేనఁ జూచినవాఁడు కర్ణరో,గార్తుం [illegible]
శిష్టు నొప్పించినకష్టుండు గడుపునఁ దెవు లైన [illegible]

1. క. నడిగి తాఁకఁగ నిచ్చి. జ. నడిగి తొలఁగ నిచ్చి. 2. [illegible]

గరడుండు కోశ మక్కళ్మరినికర్కరను బాధితుఁ డగువరుఁ డన్యసతిని గన్న

ఆ. మహిమ నొవ్వఁ దురగిశమదనాతురత మిన్న, గవిసినాఁడు శోషితదివిరి యొరుపు
ననుభవింపఁ దెచ్చుకొనినమాంసము దొంటి, పుట్టువున హరించినట్టినీచు. 99

ఆ. ఊబము గొన్నవాఁడు దొలుమేన నాథూత, బంధనముల నోరుల ప్రన్నఁ దనము
సెలచినాఁడు పంగు । [1]వొలవఁగఁ గాలుసే, విఱిచి సాధుజనుల బలిచినాఁడు.

క. తిలకాదులఁ [2]గంతులచే, నలమటఁ బడువారు బడియు । నడిచియు, మిష్టిం
జలమునఁ బాడిచియు సాధులఁ, దొలుబాముస నొందినట్టికష్టచరిత్రుల్. 101

ఆ. పాదరోగు లమచిపదముల దేవాల, యములు మెట్టుటయును । నసదువారిఁ
దప్పు లేక క్రొవ్వి । తన్నుటయును దొలు, పుట్టువందుఁ గలిగినట్టివారు. 120

చ. జ్వరమున గుల్మపీడ నతిసారమునం బలుపుండులన్ మహో
దరమున వాతపిత్తకఫదారుణరోగములన్ నిరంతరా
తురు లగువారు నిర్దయతఁ । దొల్లి వినోదము గాఁగ జీవులం
దర మిడి [3]చంపినారు గురుఁ । దల్లడపెట్టినవారు పార్వతీ. 103

తే. గూనివాఁడును బిచ్చుకకుంటు [4]గుజ్జుఁ, గొలుచులమ్మచోఁ గ్రచ్చులు గలిపినరొకు
దూఁచి బెట్టుకు-చోటులఁ దూర్చి-దరపి, పూర్వభవమున లాభంబుఁ బొందినారు. 104

సీ. వెజ్జులు దొలుమేన । వెడ్డున సాధుజనము మోసపుచ్చి ధనంబు గొన్న
జను లనపత్యులు । విను తొల్లి పిత్రుకార్య, దూరులు బాలఘాతుకులును జూవె
హొలఁతి నపుంసకుల్ । పూర్వభవంబున, నెద్దుఁ బట్టినవారు । నేమితప్పఁ
బారయు కుండఁగఁ గోపమునఁ ద్రికచ్ఛేదంబు, గావించినారు । గాము సుఖము

ఆ. విఘ్నపఱచినతులువలు । విధవ దొంటి
జన్మమునయందు భర్తృవంచన మొనర్చి
ధనము గూర్చినదుదియు మదంబు పేర్మి
నోర్తుమగని హరించినయగ్మలియును. 105

తే. పయుతు లై పుట్టి యేవంపుఁబనులు గడుపు
బ్రోఁచికొనువా రహంకారమునను గర్వ
సగానమదదంభములఁ దొల్లి । మాన్యజనులఁ
బరిభవించినతుచ్ఛులు । పద్మనయన. 106

సీ. జానత్వ పొందీ యస్వదలుప్పలఁ దిట్టుల, నాటులఁ బడు ముందునట్టినీచు
లప్పాటఁ దొలుమేన । నతిగర్వు లై ప్రల్లదమ్మునఁ బెక్కండ్రఁ । దప్పు లేక
తిట్టియు నడచియుఁ । దిరిగిన వార లా, పొలువల పిగ్రుప । గలిమి మేలు
ధనికగృహద్వారమునఁ బ్రతిహారి ద, మ్మాఁగంగ నుండి దైన్యమున దుఃఖ

---

1. గ. పలువంగ_జ.వొలవైచి_గాళ్ళేయి...బలిచినాఁడు 2. క. గ. జ. గ్రంథులచే 3.గ. నొంచినారు. 4. క. గచ. 'గుజుకు' 5. గ. జ. గ్రంచులు.

తే. పశుజనంబులు భోగైకపరతఁ దొల్లి, మాననీయుల కవసర * మీనివారు
రాజదండితుఁ డక్రూరాపరాధుఁ గూర్చి,దండదూషితుఁ జేసినతండునూ వె. 107

క. వీను నష్టసకలధను లగు,జనములు నిక్షేప మిడినయసరకులు దొలుబా
మున మగుడ నీక నైప మిడి, కొనినట్టియసత్యలోభకుకుత్సితు లతివా. 108

క. తమబంధులుఁ దారును న్యాకృష్టరియు తెగటాఱువారు * కరుణారహిత
త్వమునఁ దొలుసేన వెడపగ, నమేయునరవధము సేసినట్టిదురాత్ముల్. 109

వ. అని యెఱింగించి యీశ్వరుం డీశ్వరితో ని ట్లనియె. 110

సీ. ఇంతి నాచెప్పినయుప్పపకర్మ లం,దలకును నరకంబు * దప్ప దండుఁ
బడుపాటు లెల్లను * బడి వచ్చి నరు లైన,యప్పుడు వాటిల్లునట్టి తెఱఁగు
లివి యట్లు గాకయు * నెక్కుడుగాని పాపంబుల మానుషభవము గలుగు
[1]నిట్లైన నమ్మేన * నేకర్మమునఫల, మైనను మానవు * లనుభవింప

ఆ. రోపి మునులు దేవయోనులు నత్తను,పునన తపముఫలము * లనుభవింతు
రనిన దేవి యొఱుఁగనయ్యెమాదయఁ బెక్కు, లర్థములు కృతార్థు నైతిననిను.

వ. అని వెండియు నద్దేవునితో మనుజు లపగజన్మంబున గాని కర్మఫలంబు లను
భవింప రంటిరి తప్పు సేసినవనుల నరపతు లిట్టితప్పున కిట్టిదండం బమనిరూపణం
బున దండించెదరది యక్కర్మంబుఫలంబప్పుట్టువునన యనుభవించుటగా దెయ్యది వ
కొఁటికి గంగాధరుం డి ట్లనియె. 112

సీ. జనపతుల్ దమ రాజ్యసంబున దండించి,నారు గా నొల్ల * నరులతప్పు
లకుఁ దగుదండంబులన వారిఁ బఱతురు, తక్కొను లెవ్వరుఁ * దప్పు సేయ
వెఱచుట కై యట్టివిధి మూఁడు టది పూర్వ,కర్మంబువలనన * కాని యవుడు
గల్గినతప్పునఁ * గా దన్న నాదేవి, యవనిశదండితుఁ * డైననరున

తే. కఘము వాఘునో పాయదో * యనిన నీశ్వ
రుండు నృపదండితుఁడు యమదండమునను
బడఁడు లేనితప్పున నరుఁ * బఱిచినతనిఁ
బఱుప కున్నాలనిని యమబాధ వొందు. 113

వ. అని నిర్దేశించి వెండియు. 114

క. విను తమచేసినకర్మం,బునఫల మెవ్వరికిఁ ద్రోచి పుచ్చంగ రా దె
ట్లును గుడువక పో దది యన,విని పార్వతి యిట్టులనియె * విభునకుఁ గృష్ణా. 115

తే. కర్మఫలములు గుడిచినఁ గాని పోన, వంటి వానిఁ బ్రాయశ్చిత్త * మపహరించు
నందు రశ్వమేధంబున * నఖిలపాప,ములును జెడుననఁగా వింద్రుభూతనాథ. 116

వ. అని పలికియది యెట్లొకో యనుటయు భవుండు. 117

1. చ. నట్లయిన నమ్మేన నాకర్మములఫల.

ఆ. అతివ కామకృతము ✽ లైనకర్మంబుల, ఫలము లనుభవింప ✽ వలయు విను మ
కామకృతము సేయుట✽గలుగుఁ బ్రాయశ్చిత్త, మాచరింప సంశ✽యంబు వలదు.

క. కావునఁ గుడువక పోలియదు, దేవాసురమునుల ✽ కైన ✽ దేవీ కర్మో
ద్భవవివిధఫల మియ్యర్థము, నీ వలవఱవుము భవన్మ✽తిమఁ దిరముగన్. 119

వ. అని చెప్పి యప్పరమేశుఁడు వెండియు. 120

క. సుకృతముల నరుఁడు నాకము,నకు జను నవి గొంచె నైన ✽ నరుఁడ యనఘనువా
నికి దివి కేఁగి డిగినయతఁ,నికి మానుషవైవభములు ✽ నెఱయం గల్గున్. 121

వ. అని నిర్దేశించి యుద్దేశరూపంబునం గర్మంబులతెఱం గెఱింగించి యింక నేమి
యడుగ వల తడుగు మనిన నంబిక కర్మకరణంబు జంతువశంబు గ్రహావశంబు
నా రెండుతెఱంగులం జెప్పుదు రం దెయ్యది దృఢం బని యడుగుటయు వృషాంకుం
డి ట్లనియె. 122

తే. నాతి విను గ్రహచారంబు ✽ హేతువులుగ
నశుభములు శుభములు నరుఁ ✽ డాచరించు
గ్రహము సేయించునే తాన ✽ కాక చేత
కొడయఁ డటె గాన ఫలములు ✽ గుడువ వలయు. 123

వ. అనినఁ జావనునది యేమి యని యుమ యడుగ నీశానుం డి ట్లనియె. 124

తే. నిత్యుఁ డాత్మయందు దేహ మ✽నిత్య మతఁడు
ముదిమిఁ దెవులున వికృత మై ✽ యది వికలతఁ
బొందుటయు దానిఁ దొఱఁగి తాఁ ✽ బోవునట్టి
దశకు మరణ మన్పే రయ్యెఁ ✽ దనులతాంగి. 125

క. జీవుఁడు జీర్ణశరీరము, బో విడిచి నవంబుఁ బొందఁ ✽ బుట్టనుపేరం
దా వెలయుం దద్దశ జీ,వావలి వర్తించు నిటు గ✽తాగతపర మై. 126

వ. అనిన విని పార్వతి శర్వునితో బాలురు సచ్చుటకును వృద్ధులు పెద్దకాలంబు
బ్రదుకుటకును గారణం బేమి యనుడు నతండు. 127

తే. మేను జీర్ణముగాఁ జేయుఁ ✽ గాని మరణ
మొందఁ జేయదు విను కాల ✽ మొందు నరుని
పూర్వకర్మంబు లాయువుఁ ✽ బాదలఁ జేయ
సన్నముగఁ జేయ బ్రతుకును ✽ జావుఁ గలుగు. 128

వ. అని చెప్పిన నాయువు వేమిటం బెరుఁగు నెద్దానం దఱుఁగు ననిన విని యుమకు
నుమాపతి యి ట్లనియె. 129

→ శివుఁడు పార్వతికి నాయుర్వృద్ధిక్షయంబులకుఁ గారణంబులు సెప్పుట. ←

తే. క్షమయు సత్యంబుఁ గృపయు శౌ✽చము నను గురుల
వలనిభక్తియు నాయువు✽ పొలుపు నిచ్చు

నలుక బొంకు క్రూరత సుచిత్తతాపగమము
గురువిరోధ మాయువు గడుఁ గుందఁ జేయు. 180

తే. తపమునను బ్రహ్మచర్యవ్రతమున హితమి
తాశనమున రసాయనాభ్యాసమునను
వెరఁగు నాయు వాక్క్రియలపైఁ నరుఁడు ప్రీతి
గలుగుటయుఁ బూర్వభవకృతకర్మఫలము. 181

క. తనలావున కధిక మయిన,పని సేయు[1]టయు క్తమును నపథ్యము వగుభో
జనములు హరించు నాయువు, వనిత యవియుఁ బూర్వకర్మవశతన కలుగున్. 182

వ. మఱియు నొక్కవిశేషంబు సెప్పెద. 183

ఆ. సుకృతు లమరలోకసుచివాసులు నిట
దిగి చిరాయువులును నగుదు రితరు
లతిచిరముగ నరకగతు లయి తుది నాయు
వల్ప మగుమనుష్యు లగుట గలుగు. 184

క. నా విని భవాని పురుష,స్త్రీవిధములు రెండు గలవు త్రినయన వానిఁ
జీవుఁడు వర్తించు తెఱఁగు, నీ వేర్పడఁ జెప్పవే యనియె గంసారి. 185

వ. అనిన విని మహాదేవుండు మహీధరతనయ కి ట్లనియె. 186

క. తాత్త్వికము లైనపురుష,స్త్రీత్వంబులు లేవు పార్వతీ జీవున కా
తత్త్వమున కహంకృతిఁగ,ర్మిత్వ మొలసి భావ్యవిధమగు మెయిఁ గొనుచుండున్. 187

వ. అని మఱియును. 188

ఆ. కర్మములకుఁ గర్త గాఁ డాత్మఁ డతని స,త్త్వము రజస్సుఁ దమము వాతపిత్త
కఫము లెట్లు మర్త్యకాయగతములగు, న ట్లపొందుఁ గర్తలవియ చూడ. 189

తే. సత్యశౌచదయాదులు సాత్త్వికములు
రమణి లోభసంగాదులు రాజసంబు
లనృతహింసాపరత్వభయాలసత్వ
ధైర్యహానినిద్రాదులు తామసములు. 140

క. ఇవి నానాముఖములఁ బురుషు వికారముఁ బొందఁ జేయు నచుం బరఁగును హై
మవతీ కావున సర్వం,బు వినుము గుణకృత్య మిట్టిబోధం బొప్పన్. 141

తే. తన్వి సాత్త్విక రాజస తామసాత్ము
లైనవారలఁ బుణ్యలోకానుభవము
మనుజభావంబు నిరయపీడనముఁ బొందు
మోక్షలక్ష్మి నిర్గుణునకు మునుఁగ నుసరు. 142

వ. అని వెండియు. 14

1. చ. ట. యుక్తమున నపథ్య.

సీ. ఎట్టివి కర్మంబు లట్టివ నరులకు, శుభాశుభసంప్రాప్తు లట్లు గాక
పరవి ప్రియమున మేల్పవడయుటయును గల్గుఁ, బతిభృత్యతతిఁ బటుభర్త్సనముల
నొజ్జ శిష్యులఁ దర్జనోక్తుల వెజ్జు రోగార్తుల నానావిధౌషధముల
నలమటఁ బొందింతు రవ్విధంబులచేత, లన్నియు సుకృతంబు లై ఫలించు

ఆ. నని మహర్షులను జెప్ప సకలేంద్రియోపేత, మగు జరాయుజంబు నండజంబు
నువిద చోఁదు నెఱుఁగు ముద్భిజ్జములు స్వేదజముల కదియుఁ జాపు సంభవించు.

క. నరుఁడు జరాయుజములలోఁ, దరుణీ విను ముత్తముఁడు శ్రుతము లేకున్నన్
సరి నతఁడు పశువుఁ గావున, వరిష్ఠ మగు నట్టివినికి వలయు నరునకున్. 145

క. ఇరు దెఱఁగు విను తమము కార్యకారణమును దేహజము కార్యకరము తేజస్సం
స్ఫురణమునఁ బాయు శ్రుతమునఁ, బరిహృతమగు దేహజంబు పర్వతపుత్రీ. 146

ఆ. బ్రహ్మయాతమంబుఁ బాపుటకై తపో, వ్యాప్తిఁ బడసె శ్రుతులు సంగములును
గాన కార్యములు నకార్యంబులును వానఁ, దెలిసికొనఁగ బుద్ధికలఁత దేఱు. 147

తే. క్రోధకామాదు లైన దుర్గుణము లెల్ల, వాయుహతి మేఘపటలంబు వాయుపగిది
శ్రుతమునఁ బాయు నరులలో సురలకరణి, శ్రుతయుతులు దేజరిల్లుదు రతిశయిల్లి.

తే. శ్రుతము నరునిఁ బరిజ్ఞానయుతునిఁ జేయు, [1]వాని సుకృత మల్పమును ననూనఫలము
నిచ్చు సజ్జ్ఞానిసత్కర్మ మెంత యైన, నఫలమగుఁ గాన శ్రుతవంతుఁ డగుట వలయు.

వ. అని నిర్దేశించి సర్వేశ్వరితో సర్వజ్ఞుం డిట్లనియె. 150

సీ. మృతిఁ బొంది వేగ జన్మించినఁ బూర్వదైహికములన్నియు బుద్ధి నెఱయువాఁడు
జాతిస్మరుం డనఁ జను నయ్యెఱుక [2]పెద్దవాఁడు గాఁగాఁ బెడఁ బవనిత వినుము
పుట్టియుంగుట కల్మి బోధించు టగు నాస్తికులము ను జన్మంబు గలుగు తెఱఁగుఁ
జచ్చిపోయిన వారు వచ్చియు త్తనువొంది, మెలఁగుటొక్కొక చోటఁ గలిగియుండు

తే. నట్టి తెఱఁగు వెంగలు లైన యమునిదూత
లొరులఁ జని కొనిపోయినఁ గరుణతోడ
నమ్మహాత్ముఁడు మగిడి పొమ్మన్న నరుగు
దెంచు టని నీ వెఱుంగు సందియము లేదు. 151

శివుఁడు పార్వతికి స్వప్నాదులతెఱం గెఱింగించుట.

వ. అని తెలిపిన గౌరి కల యనునది యేమి యెఱింగింపవే యనుటయు నతండు. 152

ఆ. స్వప్న మనఁగ సుప్తజనముమనశ్చేష్ట, [3]యనిర్ణయఁ గాంచు మున మహాగతములఁ
గాన కలలు సూచకము లగు భావిశుభాశుభోదయముల కనియెఁ జెప్పె. 153

వ. చెప్పిన విని భవాని భవునితోడ. 154

సీ. దైవంబొ కర్మవర్తనము జనంబును, తాసాహంబొ యనిన నతండు దైవ
మోహికర్మంబు సేయుట లేదు దైవసంకల్పన ఫలంబు బిచ్చుఁ గాని వినుము

1. క. దాన సుకృత మల్ప మనూనఫలము 2. గ, పెద్ద, వాఁడు. 3. ఆ. యదియు...గాగి కనా...కనుచుఁజెప్పె.

దేది పూర్వకృతంబు దైవనామకమునఁ, బరఁగు నప్పటిచేఁత పౌరుషంబు
కృషిఁ బోలె నుండుఁ బౌరుషగతి వర్ష, సద్వాయువులట్ల దైవప్రకార
తే. మెఱుఁగు ధనసమృధనములకు నెట్లు జలముఁ, జిచ్చుఁ బుట్టు నమ్మైయి నరునిచేష్ట దైవ
యోగమున సిద్ధిఁ బొందు నుద్యోగరహితుఁ, డై తెఱంగున దైవసమృద్ధిఁ బడయు.
క. కావున నుద్యోగంబును, దైవంబును గారణములు తా మొరసాక్షీ
యేవిధమునఁ గర్మములకు, లావాప్తికి దీని సంశయము వలదు సుమీ. 156
తే. అనిన నంబిక గర్భంబు నాత్మఁ దెట్లు, సొచ్చు ననవుడు నభవుఁడు సురతబీజ
రక్తదైవములె మాపె కారణములు లాత్మ, గర్భసంవేశనమునకు నగము లనయున.
క. మాయాసహితుఁ డహంకా, రాయత్తతఁ జూచె పుట్టు ననుచు చెలిఁ బడి నా
నాయాసంబులఁ బడు నా, జ్ఞాయుతుఁ డై యాత్మఁ దింత చర్చింపు మదిన్. 158
సీ. అని చెప్పి దైవరహస్యంబు వినిపింతు, విను మని పలికి యిట్లనియె శివుఁడు
దొల్లి మనుష్యులు దొలుమేని కర్మంబు, తెలుఁగఁగాఁ జాలుట నెల్లవారు
మేలు సేయఁగ నిక్కమిలలోకమున నధికం బగుసందడి గాఁగ మనుజు
లమరులై పేర్చినఁ జాడు వేల్పులసంకటము వాయుటకు నుపాయము దలంచి
తే. మానవుల కెఱుక కల్మి మాన్చి కామ, రోషముల నొలయించిన దోషకృతుల
వారు నరకాదిసమ్మర్దకారు లగుదు, రదియుఁ గాదని చింతించి యనువుగాంచి.
క. స్థిరిగా నా రెండెడలకు, నరులు సనుట గోరి మనమునఁ గానమియుం
బరలోకవిధము శాస్త్రము, పెరవునఁ గనుటయు నొనర్చె విధి వారలకున్. 160
వ. అనినం బార్వతి పునర్జన్మంబు గలదు లే దనుసంశయంబుతోన పుట్టువార లగు
దురు నరులు దాని తెఱంగు నిశ్చయింపవే యనుటయు నంధకారాతి యిట్లనియె.
క. కలదో లేదో యనియెడు, తలపోఁతయు కాని నిశ్చితము గాదు సురా
దులకుఁ బునర్జన్మంబున, కలిమియు లేమియును నరుల గానమి దప్పె. 162
క. కల దది యూహకు గానఁగ, నలవియె శ్రుతివాక్యసమితి యర్థంబులపై
నిలిచిన శ్రద్ధం గ్రమమున, దెలి వొందినఁ గాక యెట్టి ధీమంతులకున్. 163
వ. అనిన విని గౌరి గంగాధరున కిట్లనియె. 164
క. మృతులైనవారలు నిరాకృతులై యుండుదురు వారిఁ గినాశభట
ప్రతతి గొని చనుట యా పితృపతి శాసించు టవి యెట్టిభంగులు దేవా. 165
వ. అని యడిగిన నద్దేవుం డిట్లనియె. 166
సీ. తఱి యైన మనుజులఁ దనువులు విడిపించి, మాయాశరీరసమన్వితులుగ
నొనరించి దూతలు గొని పోదు రందును, ధర్మవర్తుల సుగంధంబు మృదువు
నైనమార్గమున మధ్యపువారి నిర్బాధ, సరణిఁ బాపాత్ములఁ బరుసఁదనము
ములికియుఁ గలపథంబున నడపింతు రిప్పరుసునఁ జని పితృపతికిఁ జూప
ఆ. నతఁడు పుణ్యలోకగతియును మానవత్వంబు ఘోరనరకవాసమును వి

ధించి పుచ్చు పాఱఁ దెలిచి మన్నించి ధర్జిరాది దురుసహోదఁ జిగురుఁబోఁడి.

వ. అని చెప్పిన నగేంద్రతనయ చంద్రశేఖరునితోడ. 168

క. నరకం బెట్టిది కల్మషకరులగు జముఁ డెట్టిభంగిఁ గాఱియఁ బెట్టున్
వరదా చెప్పు మనుడు నప్పురహరుఁ డిట్లనియె వృష్ణిపుంగవ ప్రీతిన్. 169

సీ. రౌరవం బనఁగ ధరాస్థలి క్రింద మహారౌరవం బన నవుల దాని
కావల వినుకంటకావనం బన నుండు, గ్రమవృత్తిఁ బేర్చు దుఃఖములు గలిగి
యగ్నికుండంబు నా నట పంచకష్టంబు, నాఁగల వి ట్లున్న నరకతలము
లైదందుఁ బాపక్రియాతారతమ్యంబు లూహించి యంతకుఁ డునుపఁ బనుచుఁ

తే. దగినయెడలఁ బాపాత్ములఁ దద్భటాలి
దహనకర్తనబంధనతాడనములఁ
బఱుప వారలఁ గుక్కలు గఱచుఁ గ్రిములు
దొలుచు గ్రద్దలు నొప్పించుఁ దుండనిహతి. 170

వ. మఱియును యమదూతవ్రాతంబు నానావిధవేదనలం బెట్టి దండించుచుండు. 171

ఉ. అమ్మెయిఁ బాపముల్ వొలియ నంతకు దుఃఖము లంది కీటజ
న్మమ్ములఁ బక్షియోనులఁ గ్రమంబునఁ బొంది మృగత్వమానుష
త్వమ్ముల నోలిఁ బొందుదురు వారిను మెంతయుఁ గ్రాఁగి కల్మష
త్వమ్ము దొఱంగుమాడ్కి నవతామరసప్రతిమాననలోచనా. 172

వ. అనిన విని పార్వతి పాపంబు లనునవి యెట్టివి యెఱింగింపవే యనుటయు నీశానుం డిట్లనియె. 178

—✤ శివుఁడు పార్వతికి మానసవాచికకాయికము లను త్రివిధపాపములఁ జెప్పుట. ✤—

సీ. మానిని త్రివిధముల్ మానసవాచికకాయికంబులఁ బాతకంబు లందుఁ
బరధనాపేక్షపాపానుమోదధర్మద్వేషముఖములు మానసంబు
లనృతదారుణభాషణాదులు వాచికములు వధంబును బంధనమును నభక్ష్య
భక్షణంబును నన్యభామారతము మద్యపానంబు మొదలైన పాపకృతులు

తే. కాయికంబులు విను మధికం బపేయ
పాన మది దుష్కృతంబులలోన నెల్లఁ
బానమున నిందలో వచ్చుఁ బ్రాణగొడ్డ
ములును జేటులు నరకాబ్ధి మునుఁగుటలును. 174

క. లోకము నిర్మర్యాదవ్యాకులమై చెడదె సజ్జనావలి మధుపా
నాకాంక్ష దొఱఁగ కున్న గుణాకల్పా యేమి సేయ దక్కఁడు నరున్. 175

క. కావున నేవిధమున సుర సేవింపక యుండుట యొప్పుఁ జెలువ సకలవ
ర్ణావలికిఁ దానఁ గీర్తి శ్రీవైభవపుణ్యగతులు సేర్చికొన నగున్. 176

క. అన విని యంబిక సుకృతము లనునవి యెట్టివని యడుగ నద్దేవికి ని

ట్లనియెం జంద్రార్ధధరుం, డనుమోదోల్లాసి యగుచు సంబుజనాథా. 177

తే. ఔపరమికాభిధానంబు సంబుజాక్షి
నిరుపకరణాఖ్యమును సోపకరణనామ
కంబు నయి లోకమున సుకృతంబు పరఁగుఁ
ద్రివిధముల వానిఁ దగ వివరింతు వినుము. 178

సీ. ఔపరమిక మనునది పాపవర్జన, మకట కానఁగ నేర రజ్ఞజనులు
యత్నంబువలదు [1]వ్యయముం బేమియును లేదు, పరలోకభీతిఁ బాపముల దొలఁగి
నంతన సుగతిసౌఖ్యం బొడఁగూడెడు, నదియు నాత్మాధీన మట్టిదాని
సుకరత్వ మెఱుఁగక చొత్తురు నరకంబు, వెరవరుల్ శ్రుతమునవృద్ధయోగ
తే. మునను ధృతికల్మి నింద్రియవినిమయమున
నది దమకుఁ గలిగింతురు యమ మనంగఁ
బరఁగు నది దాన నాకంబుఁ బడయ వచ్చు
ననినఁ జెప్పంగ నేల ధర్మార్మ్మభియుక్తి. 179

ఆ. నిరుపకరణ మనఁగఁ బరగు శౌచంబు సత్యంబు శాంతి దాంతి యార్జవంబు
వ్రతనిరూఢి సముపవాసంబు బ్రహ్మచర్యంబు కల్మి నియమమందు దాని. 180

సీ. అభ్యంతరంబు బాహ్యమ్మునన్నగా శౌచ, మిరుదెఱఁగై యుండు హృదయసుకృత
మాభ్యంతరము వినుమ్మాహారశుద్ధియు, నంగశోధనము బాహ్యంబు సత్య
మన్నది గన్నది విన్నది యున్నరూపున నుక్త మగుట యంభోజవదన
శాంతి బుద్ధీంద్రియసన్నివారణ దాంతి, కర్మేంద్రియముల యోగ్యప్రవృత్తి
తే. యార్జవము కుటిలుఁడు గామి యగు వ్రతంబు
మంచిపని పూని నడపుట యంచితోప
వాస మశననిగ్రహ మనవద్య మైన
బ్రహ్మచర్యంబు కామునిబారిఁ బడమి. 181

ఆ. నాతి తీర్థసేవనంబును నియమవి, శేష మగుట దానిఁ జెప్ప వలయు
సకలనదులుఁ దీర్థసంజ్ఞలు గల వబ్ధి, కరుగునట్టి విచ్చు నధికఫలము. 182

తే. వానియాడును మునిపవమానసీయ, దేశములు నబ్ధిసంయోగదేశములును
దెలియ మన్యోన్యసంగమ దేశములును, బరమతీర్థంబు లగుఁ బద్మపత్త్రనయన.

. వనధి మహాతీర్థం బందును సంయమివరులచేతఁ దొల్లి ప్రియమునం
గొనియాడఁబడినచోటులు, విను ముత్తమతీర్థములు విశేషాభరణా. 184

క. వెలి మంచి దై మంచి తీర్థంబులు సొచ్చుట మేలు నియమములు దీప్చితగఁ
వెలలినయెడ దేవార్చనములు విప్రార్చన లవశ్యమును గృత్యంబుల్ 185

క. చెరువతీర్థముకంటెను, దూరపుదీర్థంబు మేలు . . యజవదనా

1. గ. ప్రయత్న మేమియు.

శారీరాయాసము తత్కారణ మై చేటవాక్యగతి యి ట్లుండున్. 186

క. విను సోపకరణ మనునది, ధనధాన్యాదికసమగ్రతను గృహమేధుల్
గొనియాడు తెఱఁగు దానం,బున పైదిశ పైతృకాదిపుణ్యక్రియలన్. 187

సీ. న్యాయార్జితం బైనయర్థంబు వేదవి,త్త్వము శాంతి మొదలగు వరగుణములు
గలవిప్రునకుఁ బుణ్యకాలపావనదేశ,కలితంబుగా భక్తి గలిగి యీఁగి
మేలిదానము శక్తి మిగులుట శక్తికిఁ, దగుట దానికిఁ గడుఁదగమి యుత్త
మము మధ్యమము నధమము నగు దానివి,ధానంబు విను మిట్లు దైవికంబుఁ

తే. బైతృకంబును లోనైనపనులఁ దాను, వేడ్కఁ జేయువస్తువుఁ గోరువిప్రుకోర్కి
కనుగుణం బగునదియును సర్థినిచ్చు,టధికతర మైనఫలమిచ్చు నంబుజాక్షి. 188

తే. చేయు మెంతయు మేలైనఁ జేసి పిదప, వగచినట్టిదానము దనుఁ బొగడికొన్న
దానవిధి నిష్ఫలంబులు గాన రెండు, నుడుగుదాత మహాఫల మొందఁగాంచు.

వ. అనుటయు దాక్షాయణి దాతవ్యంబు లెయ్యవి సెప్పు మనిన భవుం డి ట్లనియె.

శివుఁడు పార్వతికి దానఫలవిశేషంబుల నెఱింగించుట.

సీ. అన్నంబుఁ దోయంబు నఖిలజంతువులకుఁ, బ్రాణముల్ గాన యప్పరమవస్తు
వుల మేలు దాతవ్యములలోన నెల్లను, నతిథుల కవి యిచ్చు నమరలోక
చిరమహాసౌఖ్యంబుఁ జేయుఁ గాంచన మగ్ని, యగుట నద్దాన మత్యంతపావ
నము సర్వకామప్రదము గోవు సద్విప్రు,నకు నీఁగి తద్రోమనికరసంఖ్య

ఆ. వరుస నాకలోకవాసంబు గావించు, నందుఁ గపిల నిచ్చునాతఁ డిరువ 1
దొక్కతరమువారి నూర్ధ్వలోకమునకు, ననుపఁ జాలు పికచవనజవదన. 191

క. విను భూమిదానకర్తకు, ననిమిషలోకమున నిలువ నగు సౌఖ్యంబుల్
దనరుచు నుండఁగ నెఱపెం,పున భూమి గలంతకాలమును గిరితనయా. 192

ఆ. భూమి నఖిల మగువిభూతివిశేషజా,తంబు గలుగుఁ గాన క్షితిప్రదాన
మెల్ల వస్తువులును నిచ్చినయ ట్లగు, దానఁ బోనిపాపతతము లేదు. 193

క. అతివా కన్నియ నిచ్చినఁ, బితృపతి ముద మందు సురలుఁ బ్రీతు లగుదు రం
చితగతి కర్తకు దొరకును, సతి తేజస్వియశస్క మగు నబ్బవమున్. 194

తే. విద్య యిచ్చుటసత్పాత్రవిషయ మైన, నవ్యయానందపదముఁ జేయంగఁ జాలుఁ
దగఁగ దక్షిణ యిచ్చి వేదలకువిద్య, యీని మోగించుటయుఁ దల్ప మాసకృతియు.

సీ. తిలరాశి యిచ్చినఁ గలుగు నగ్నిష్టోమ,ఫలము వాసోదానఫలము చిరత
రాయువు గోడు గీఁగి యఖిలపీడలఁ బాపు, దాసదాసీజనదానమహిమ
కర్మవిమోక్షంబుఁ గలిగించు దీపదా,నముఫల మాత్మాతిమిరవిముల భావ
మంబు ప్రవాహంబు నధిగమింపఁగఁ జేయు, నిఖిలవ్యసనముల నిస్తరింపఁ

ఆ. జేయుఁ దరుపు లెస్స సేయుట సంతాన, మిచ్చు నౌషధంబు నిచ్చు నెల్ల
తెవులుఁ బాపు పాదుకదెరువరి కొసఁగినఁ,ట్లాసఁగుటయు సఁగుదనుసుఖోదయములు.

వ. అనిన విని యజ్ఞంబు తెఱం గెఱింగింపవే యని పార్వతి ప్రార్థించినం బరమే
శ్వరుం డి ట్లనియె.

సీ. విను మింతి వైదికంబును లౌకికంబును, నన రెండుదెఱఁగులు యజ్ఞవిధులు 197
వర్ణయోగ్యార్జనవర్ధనాంచితధన, ధాన్యముల్ గొని దేవతలకుఁ దృప్తి
యగునట్లుగా ఋత్విగర్పన మొప్పఁగాఁ, గావించునది వైదికంబు దేవ
తలకు మహోత్సవంబులు సేయుటయు గీత, వాద్యనృత్తము లనవద్యములుగ

ఆ. సంఘటించుటయును సద్గంధమాల్యధూ, పప్రదీపభోజ్యభక్ష్యములు స
మాదరంబుతో నివేదించుటయు లౌకికంబు రెండు నమరగణహితములు. 198

తే. ధర్మములు దానములును సద్వ్రతచయంబు
సదృశములు గావు వినుము యజ్ఞమున కరయ
యజ్ఞకర్త లోకోత్తరుం డతని కిచ్చు
టతని చేఁ గొను టధికపుణ్యములు చెలువ. 199

ఉ. మానసకృత్యముల్ సురసమాజ మెఱుంగఁగఁ జాలుఁ గావునన్
మానస మొక్కఁ డేసిఁ జన మంచిగఁ జేసిరయేని యజ్ఞము
దానము నాదియైనసుకృతంబులు లగ్గ ఫలింప నీదు త
ద్ధ్యానపరత్వపూతసుకృతంబులకున్ ఫల మిచ్చు మెచ్చుచున్. 200

క. అని చెప్పిన హిమవద్గిరితనయ త్రిపురవైరితోడ దైవికవిధు లే
విని గని సంతోషించితి, వినిపింపుము పైతృకంబువిధము వృషాంకా. 201

సీ. అనిన నా సర్వజ్ఞుఁ డద్దేవి కి ట్లను, గయ కురుక్షేత్రంబు గంగ యాది
యగుపుణ్యదేశంబు లతిఫలదంబులు, మాఘభాద్రపదాఖ్యమాసములు బ
హుళపక్ష మపరాహ్ణ ముగ్మలి యమవస, [1]తేరసి నవమాద్యతిథులఁ దుష్టి
బితృదేవతల కిచ్చుఁ గుతపదాహిత్రతిలలు నితాంతపవిత్రములు పితృక్రి

తే. యలకు శౌచ మక్రోధ మవ్యగ్రభావ, మర్థములు శుక్లపక్ష పూర్వాహ్ణయాగ్ర
దివసజన్మదినములు నిందితము లాజ్య, ముద్గపాయసాపూపముల్ ముఖ్యకోటి.

క. శ్రోత్రియు లరోగు లవికల, గాత్రులు పాత్రములు పైతృకములకు సచ్చా
రిత్రత్వము ముఖ్యంబు స, గోత్రు మృతకళత్రునన్యకులుఁ గొన రతివా. 203

ఆ. గంధపుష్పమాలికాధూపదీపవ, స్త్రముల నర్చ లిచ్చి తగఁగఁ భోజ
నములు నిర్వహించి క్రమవృత్తిఁ బిండప్ర, దానవిధి యొనర్పఁ దేను మెత్తు.

వ. అని యెఱింగించిన మేనకాత్మజ మృడునితో ని ట్లనియె. 205

క. మృతిఁ బొంది పునర్జన్మము, నతకర్మగుణ జంతుకోటి యెప్పుడ పొందఁ
బితృపూజన మది యెవ్వరికిఁ గలవుగఁ జేయుదురు దీని నెఱిఁగింపు. 206

ఆ. అనుము నచట నున్నమునిజనము లెల్లను, నగతనూజ నాత్మఁ బొగడి యభవుఁ

1. అ. తొంపి నవమియుఁ బరఁగఁ దుష్టి. చ. తెరసి నవమాద్యతిథులఁ దుష్టి.

డిచ్చును త్తరంబు § నేర్పడ వినువేడ్క, గడుం బురిడి రవుడు § కంసదమన. 207

సీ. అంబిక కిట్లను § హరుఁడు సందేహింపఁ, దగునది యిది గుహ్యా§తను మాయినుము
దివిజులట్టుల పితృ§దేవతలును దేవ,బృంద ము త్తరదిశఁ § పితృచయంబు
దక్షిణదిశ నుండుఁ § దత్పూజనంబులు, వరుసన హవ్యక§వ్యంబు లంద్రు
నచ్చినవారికి § శ్రాద్ధంబు సేయుఁగా, నా పితృసంఘంబు § హర్ష మొందె
తే. యాయువును శ్రీయుఁ గీర్తియు§నాదియైన, యైహికంబులును గతియు§నాదరమునఁ
గర్త కొసఁగు సురాసుర§ గరుడయక్ష,తతులకును బూజనీయంబు§పితృగణంబు.
వ. అని నిర్దేశించి వెండియు. 209
క. తమతమసారములకుఁదగఁ, గమలాక్షీ చేయుదాన§కల్పనలవిశే
షము నొక్కరూప యగుఁ దత్ప్రమాణరూపణము సేసి § పలికెదఁ దెలియన్.
క. విను మొకకుంచెఁడుధాన్యము, దన కాయతి గల్గునతఁడు § దాని నొసఁగినన్
ధనకోటి గల్గువాఁ డర్థను మెచ్చసఁగిన నొక్కరూప § త త్తత్ఫలముల్. 211
క. పరమత్వము లేకంతఃకరణంబున శుద్ధి సాలఁ § గలిగి ప్రియమున హం
సిరివోవఁ జేత దానము, పరిమోత్కృష్టంబు పద్మ§పత్రనిభాక్షీ. 212
క. అని చెప్పి కొన్ని ధర్మము, లనఘా యోజింగింతు నీకు § నవధానములో
విను మని పలికి శివుం డిట్లను విశదము గాఁగఁ దూర్చి § యంబుజనాభా. 213
చ. తెవులుబలు గొన్నవారి కవి § దీఱుట కౌషధ మిగి దుర్గతుల్
దవులుజనాళిఁ బ్రోవు సుప§థంబుగఁ వైదికకోటి నన్పు బాం
ధవరహితత్వదీనశివ§దాహము దుఃఖతు లైనవారిఁ దే
ర్ప వెరవు నోర్పుఁ గల్మియును § బ్రస్తుతి కెక్కి నమేటి ధర్మముల్. 214
వ. అని పలికినఁ బార్వతీదేవి పరమప్రియంబు నొందె. 215

శివుఁడు పార్వతికి ధర్మవిశేషంబుల తెలియఁజెప్పించుట.

సీ. ధర్మంబు నానావిధంబులఁబరఁగు నం, ద్రవి యెఱిఁగింపవే§యనుడు హరుఁడు
వితతంబు లగుశ్రుతి§స్మృతులచేఁ జెప్పఁగాఁ,బడిన తెఱంగులు § పడఁతి వినుము
జాతిధర్మములు దేశజధర్మములుఁ గుల,ధర్మంబులును గణ§ధర్మములును
గాయంబువికృతులఁ § గాలపర్యాయముల, వచ్చునాపద్ధర్మ§వర్తనములు
ఆ. గాఁగ నిట్లు ధర్మ§గతు లైదు గల వని, చెప్పుటయును గౌరి § శివునితోడఁ
బుణ్యలోకకలిత§భోగంబు లెట్లుండు, ననిన నిట్టు లనియె § హరుఁడు కృష్ణ. 216
సీ. ఎల్లపుష్పంబులు § నెక్కాలమును దద్ద, విలసిల్లఁ గల్పక§వృక్షజనిత
మను లేప మాహార § మమృత మంబరములు, నిత్యామలినములు§నిరుపమాన
భంగి దీప్తంబు లాభరణములు వాన రమించుచు నన్యోన్య§సుమిత్రభావ
మొప్పంగ మేనుల§మెప్పును మనముల,మార్దవంబును గుణ§మాన్యతలును
తే. గలిగి పురుషులుఁ గాంతలుఁ § గామహర్షలీల లెసఁగఁ గ్రోధాములు§లేక రుజయు

జరయు నెఱుఁగక సలిఁ జరింతురు దివంబునందు సంతతనిర్భరానంద మొందఁ.

వ. అనిన విని హైమవతి సుగతిదుర్గతులకుం జనం గలవారిం జూచి యీ రిట్టివా రని నిశ్చయింప వచ్చుట రాదు యెఱింగింపు మనవుడు మృడుండు విను మని యిట్లనియె. 218

చ. జనులకుఁ గీడు సేయక యజస్రము ధర్మరతిం జరించి స
జ్జనగురుపూజనంబులును ✱ సత్యహితోక్తులు దీనపోషణం
బును నతిథిప్రియత్వమును ✱ భూరిదయార్ద్రితయుం గలట్టివా
రనిమిషలోకగాము లని ✱ యాత్మ నెఱుంగుము మేనకాత్మజా. 219

చ. పరుసనిపల్కు బొంకు లగు✱పల్కులు నన్యధనాభిలాషముం
బరవనితావిలోలతయు ✱ బాంధవసజ్జనవిప్రియంబు దు
శ్చరితులతోడిమైత్త్రియును ✱ సంతతధర్మరతాభ్యసూయయుం
గరినిభయాన ఘోరనరకంబున కేఁగెడివారిచిహ్నముల్. 220

క. అని చెప్పిన విని హిమగిరితనయ వృషధ్వజునితోడ ✱ ధర్మంబులు పె
క్కనుపమమూర్తీ పరమం, బనఁ జాలెడుధర్మ మెద్ది ✱ యన్నిటిలోనన్. 221

వ. చెప్పు మనిన నప్పరమేశ్వరుం డిట్లనియె. 222

క. రమణీ వర్గత్రయధర్మము లిచ్చు సుఖములు దుఃఖసమయము లచిరముల్
గమనాగమకరములు నిత్యమహాసౌఖ్యంబు మోక్షధర్మం బిచ్చున్. 223

సీ. కావున విను త్రివర్గంబుకంటెను మేలు, దలపోయ మోక్షంబు ✱ దానిఁ బడయఁ
దెఱఁ గెఱింగించెదఁ ✱ దెలియ గృహస్థధర్మంబున నిల్చి ఋణంబు లెల్ల
బాచి వనమునకుఁ ✱ బరమశాంతత నేఁగి, సద్గురుముఖమున ✱ సాంఖ్యయోగ
విదుఁ డగునది పంచవింశతి జ్ఞానంబు, సాంఖ్యంబు ధర్మనిశ్చలత యోగ

తే. మాసమాహారయుగళ మేకాధికరణ, మస్ఖలితముగ మది నది ✱ యలవరించి
ధ్యానపరుఁ డయి శీతోష్ణహర్షశోక, ముఖము లగువివిధద్వంద్వకములఁ దొలఁగి.

ఉ. శౌచము బ్రహ్మచర్యమును ✱ శాంతియు లఘ్వశనంబు నై ఖిలం
జూచుచు నంతరాత్మ నెడ ✱ సొచ్చినవిఘ్నవిశేషముల్ ధృతిం
ద్రోచుచు భక్తియుక్తికి గుశలుండు ప్రమోదమయుండు గాఁగ ద
ద్గోచరతం జరింపఁగ నకుంఠితమోక్షసుఖంబు సొప్పడున్. 225

తే. అది సదాభ్యాసకలన నత్యంతనిర్మలంబు నవ్యయమును నచలంబు ధ్రువము
నై జరావ్యాధిమరణజన్మాదిదుఃఖ,బహుళసంసారచక్రంబుఁ బాప నేర్చు. 226

వ. అని యుపదేశించి వెండియు. 227

క. విను సంసారమునకు విసువనిమర్త్యుఁడు శోకమోహావశగతుఁ డై మో
క్షనిరూఢిఁ బడయనేరఁడు, మనము విరక్తముగ విసివి సమతిముక్తిఁ గనున్. 228

వ. అట్టిదశ చింతావివర్జనంబునను భూతాస్థిరత్వపరిజ్ఞానంబునను దృష్టారాహిత్యం,

బునను గాని కలుగదు గావున వానిభంగులు ప్రకటించెద. 229

సీ. ధనములు సెడిన బాంధవులు సచ్చినఁ దదీయములగుగుణములక్షయించు మనసు
వెట్టకయున్నది ॥ యెట్టన వగచిన, దాపంబు వొందుట ॥ దక్క నొండు
గలుగునే సుఖము దుఃఖంబును దోడివ, యవి మార్చి వచ్చును ॥ నరుగుచుండుఁ
గేవలసుఖము లే ॥ దావాసవున కైనఁ, జేటు దృశ్యములకు ॥ సిద్ధ మగుట

తే. మున్నకనియున్న వగచి త్రత్రమున జనింప, దరయఁ గీడు పరిగ్రహ్యమది సమగ్ర
మైనతకు పాత్రిమాలివృత్తవ్వట్ల తాన,తనకు బంధంబు గావించిర కొనులతాంగి.

ఆ. విను ధనార్జనంబు ॥ ధనరక్షణంబు ధ,నవ్యయంబు ధనవినాశనముఁ బ్ర
గాఢదుఃఖదములు ॥ గావున దుఃఖభా,జనము ధనము గాల్పురమునఁగవలయు.

క. రమణీ తృష్ణాసమదుః,ఖమును బరిత్యాగసముసుఖముఁ గలవే తా
యము ముదిసిన ముదియదు ప్రాణము గొనిపోఁజాలు తెవులనవం జనుఁదృష్ణస్.

క. కామములు భోగములఁ దెగు,నే మొలఁతుక నేత నాఱునే చిచ్చు ధృతిం
గామములఁ దొఱఁగుసౌఖ్యము, నేమియుసౌఖ్యములుఁ బోలునే యరయంగన్.

క. విచ్చలవిడి నింద్రియముల, నెచ్చటి కైనను జనంగ ॥ నిచ్చిన నరకం
బచ్చుపఱుచుఁ గుదియించినఁ, దెచ్చు సుగతి నరున కది సతీమణిమణీ. 234

తే. కామరసమున నతితృష్ణుఁ ॥ డై మనుష్యుఁ డర్థతృష్ణాపరీతాంతరంగుఁ డైన
గొఱియ నడవిలోనెత్తెదుకొలువులియుఁ, బోలె మృత్యువాతనిఁ గొనిపోవుదేవి.

వ. అని పలికి జరామృత్యువులఁ ద్రోవం జాలుమే లెయ్యది యంటేనిఁ జెప్పెద
నాకర్ణింపు మనుపలుకు వలికె యిట్లనియె. 236

తే. ధనములునుదానములుఁదపోధనము వాజి,పేయరాజసూయంబులు ॥ వేయునోపి
చేయుటలుగావుమోక్షదర్శిత్వ మొకఁడ, మందుజరకుమృత్యువునకునిందువదన

తే. జాములును దివసములు మాసములు నేండ్లు
నైనకాల మాయువుఁ గొని ॥ యరుగు చుండు
నెల్లి సేయుపనులు నేఁడ ॥ యింతి మా పొ
నర్చుపని రేపచేయుట ॥ నామతంబు. 238

తే. మేలు గడు వేగ చేయరుకాలపాశ,బద్ధు లై యేమఱుటఁజేసి ॥ పడఁతి మనుజా
లింత మొఱఁగుటసంసారకమెడలఁద్రోచు,నట్టివిసువుటఁ బుట్టించునది హితంబు.

వ. ఇవ్విధంబున. 240

క. ఈ తెరువు లాదరింపఁగఁ, జేతోగతికిని విమర్శసిద్ధి రొందవుఁద
జ్జాతవిరక్తియు ముక్తికి, నా తెరువ సమీపవర్తి ॥ యచలేంద్రసుతా. 241

క. వైరాగ్యంబు ప్రశాంతికిఁ, గారణము ప్రశాంతి ముక్తిఁ ॥ గను మోక్షానం
తరాము జరామృత్యువు, శేరూపునఁ జేర నేర ॥ విద్ధచరిత్రా. 242

క. అని చెప్పి మఱియు శివుఁ డి, ట్లను హిమగిరిసుతకు సాంఖ్యకమమలినహృదయా

విను వివరించెద సంస్కృతి, యనురోగంబునకు వైద్య మది యరయంగన్. 243

శివుఁడు పార్వతికి సాంఖ్యప్రకారంబు దెలుపుట.

ఆ. జ్ఞానమున విముక్తి సాంఖ్యులు వడయుదు, రరసి చూడఁగా నిరర్థకంబు
ఘోరతరము నండ్రు శారీర మైనత, పంబుఁ బంచవింశభజన మూఁది. 244

సీ. ప్రకృతి యవ్యక్తనామక మను గల దందు, మహదహంకారతన్మాత్రలును మ
నమునింద్రియములు భూతములు జన్యములుగాఁ, గోలిన యిరువదినాలుగయ్యెఁ
బంచవింశకతత్త్వభావితక్షేత్ర మా, తత్త్వసంతానంబు సత్త్వమును ర
జస్సుఁ దమస్సు నా జనునిజగుణములఁ, బ్రకృతిఁ గరణరూపములు గాఁగఁ

ఆ. గొని సృజించు లోకకోటి నయ్యవ్యక్త, మనువు నిత్య మేక మక్రియంబ
హైతుకంబు చక్షురాదుల కగ్రాహ్య, మది ప్రధాన మనఁగ నతిశయిల్లు. 245

తే. సౌఖ్యతుష్టిప్రకాశముల్ సాత్త్వికములు
మోదఖేదాదికద్వంద్వములు లతాంగి
రాజసము లప్రకాశసంత్రాసమోహ
ములును దంద్రయుఁ దామసములుగ నెఱుఁగు. 246

క. ధృతివిజ్ఞానసిద్ధులు, నతివ యసమ్మోహమును దయయు హర్షము నం
చితసత్త్వవృద్ధిఁ బరివ, ర్ధితంబు లగు సత్త్వ మరుగఁ దెరలుం బారున్. 247

తే. క్రోధలోభకామానృతద్రోహచింత, తాపములకు రజోభివర్ధనము వృద్ధిఁ
జేయు వానికి నెల్ల సంక్షీణభావ, మావహిల్లు రజఃక్షయ మావహిల్ల. 248

తే. సంశయంబు విషాదంబు జడత నిద్ర, విను తమస్సు వర్ధింపఁగా బెనుపు నొందు
నది విహీనతఁ బొందిన నవియు హీన, భావ మొందు వికస్వరపద్మనయన. 249

సీ. ఒక్కఁ డొక్కని చేత నెక్కుచుఁ దఱుఁగుచుఁ, ద్రిగుణంబులును బ్రవర్తించు వీన
జనితంబు లగు ప్రీతిసంతాపమోహాదు, లొదవినఁ దత్తద్గుణోదయములఁ
గని యుపేక్షించుచు మనము నూనఁగ నీది, కార్యంబు ధర్మార్థకామములకు
నమరమనుష్యతిర్యగ్జననములకు, మూలముల్ సత్త్వాదు లోలి నెఱుఁగు

తే. బుద్ధి యనఁగ మహత్తత్త్వమునకు నామ
మది వివేకవిజ్ఞానచిహ్నంబు భూత
జని యహంకారమునకు లక్షణ మహంక
రణము దొలఁగుట మోక్షకారణము దేవి. 250

ఆ. అన్నియింద్రియములు నడరింప మగుడఁ జే, యంగ మనసు సాలు నవియు నదియు
భూతతద్వికారములును దేహము లిద, న్యుండు దానఁ బరిగి యుండు దేహి. 251

క. విను దేహియు దేహము వే, ఱను నిశ్చయదృష్టి గల్గునాతఁడు సాలుఁ
మనసు మగిడింప నది నిర్మనస్కతఁ బొనర్చి మోక్షమార్గముఁ జూపున్. 252

వ. అప్పుడు ప్రకృతిం దొలంగి పంచవింశకుండు వెలుంగు నాతత్త్వంబు పరమహంసుఁ

దనం బరఁగు దద్విజ్ఞానంబు శాంతిసాధ్యంబును బరమశాంతి ప్రదంబు నై యుండు.

మ. రసగంధాదిగుణాలి లేమి నవికారత్వంబునన్ సర్వసం
వసనవ్యాప్తి నణుత్వభంగిని మహత్త్వస్ఫూర్తిఁ జక్షుఃప్రభృ
త్యసమాలంబితఁ దేజరిల్లు పరమాత్మాఖ్యంబు మద్వ్యోగశకం
బు సమత్వంబునఁ జూచు శాంతుఁ డతివాఁ పొందున్ విమోక్షస్థితిన్. 254

వ. ఇది కపిలాదిపరమర్షి సేవితంబైన సాంఖ్యధర్మంబు యోగ ప్రకారంబు వివరించెద.

సీ. విను మింద్రియంబులు మనసును బుద్ధియు,నాత్మయందు నొక్కటిగ యగుటఁ గాను
యోగపరిజ్ఞాన ముగ్రమౌని యగ్నిస,మారాధనంబును నధికవాగ్వి
వర్జనంబును సత్ప్రవర్తత్వంబు దానాధ్య,యనములు శౌచసత్యములుఁ బాప
ములఁ బాపుఁ బాపనిర్ముక్తుఁడై మతి యోగ, మాచరింపఁగ యోగ్యుఁడగు నరుండు.

తే. మనసు వట్టుట ముఖ్యపుఁబనుపు దాని
శాంతిమము గాఁగాని కెట్టట్ల శుచియు
విజనమును నగుచోట మృద్వాసనమునఁ
గాయమున కార్జవము భంగిఁ గలుగ నుండి. 256

క. మనమున నైంద్రియములు, మనమది మనం బాత్మ నల్ల నొదిఁగింపఁగ నె
క్కొని ప్రాణంబు నపానం,బును వశ్యత నిలుచు యోగమున సిద్ధికినై. 257

తే. అవహితుం డయి తద్దశ యనుభవింపఁ,గా నపానము శ్రీపాణిగతికి మూర్ధ
మతివ యమ్మయి నెలవగు నతఁడు చూచె,జీవుఁ డనఁ బరమాత్మ యందు నా వెలుంగు.

వ. అని వెండియు. 259

ఉ. ప్రాణు నపానునం దపానునిఁ బ్రాణునియందు నిల్పి ని
ర్వాణము గోరి చిత్తము దిరంబుగఁ బట్టఁగఁ బ్రాణసంయమా
క్షీణత దేహమధ్యశిఖిఁ జిమ్మఁగఁ దత్త్రియ మెంది మూర్ధపా
లీనతఁ గోర్కి సల్పు నపరిచ్యుతిఁ దద్గతుఁ డైన యోగికిన్. 260

వ. అని చెప్పి వెండియు. 261

చ. అలసతయున్ విచిత్తతయు సత్యశనాదరణంబు రోగముం
గలయును లోభమున్ భయముఁ గామముఁ గ్రోధము లౌల్యమున్ విరో
ధులు విను యోగసేనకు సదుష్టతఁ బేర్చిన యోగ మిచ్చసి
ద్ధు లెనిమిదింట నప్రతిహతుం డయి యోగి చరించు నల్లెడన్. 262

ఆ. నిద్ర పెంపు నిద్ర నిగ్రహించుట గాను, గొలఁది మేలుకొను పుగుణ మమియును
యోగి కొప్పు [illegible] కర్తనుఁడైన, నువిద దుఃఖహారి యోగ మెందు.

వ. ఇట్టిది యోగధర్మం బని [illegible] సాంఖ్యయోగశ్రవణంబునఁ బరిజ్ఞాతపర
మార్థుండై భవదీయసాయుజ్యంబు భక్తులెట్టిపరిచర్యం బడయుదు రెఱింగింపవే
యుని [illegible] ట్లనియె. 264

శివుఁడు పార్వతికి శివసాయుజ్యప్రాప్తిసాధనంబులఁ దెలుపుట.

క. విను మవిచింత్యుఁడ సురలకు, మునులకు నేనిటు యోగక్రమమును సాంఖ్యమునా
యొనరించినయవి యీశుఁడ, సనాతనుఁడ నవ్యయుండ సర్వాత్ముండన్. 265

క. ఏను బ్రసన్నుఁడ నైనం, గానిది లేదర్చకులకుఁ గావున మత్ప్రీ
ధ్యానస్తుతివందనముఖ,నానావిధజనములు వలయు నైష్ఠికత శివా. 266

ఆ. నాలుగాశ్రమముల నలువురు విప్రుల, నతివ పాశుపతమహావ్రతంబు
తెలుఁగు లేను దొల్లి తెలిపితి శిష్యప్రశిష్యపరంపరను ప్రసిద్ధ మయ్యె. 267

క. మంగళరక్షాశుచితా,లింగార్చనయోగ్యతలు ప్రకలింపుటకై భూ
తిం గావించితిఁ దల్లి, ప్రాంగులును గపాలధరులు నై శాంతిమెయిన్.

తే. బ్రహ్మచర్యభిక్షాశనపరత గలిగి, జటిలతయు మొండె ముండితయొండె సంభరించి
మనసు నాయందు తిరముగా నునిచి యోగ్య,వస్తువులు దేశ నొల్లమిత్రవర్తిలంగ.

క. చరియించుభక్తజనులకుఁ, బరమానందైకలాసుభవ మొసఁగును న
న్వారవున మత్సాయుజ్యము, దొరకొను వారలకు వికచసరోజవదనా. 270

వ. ఇది సాయుజ్యావాప్తిప్రకారం బని చెప్పి వెండియు. 271

క. శివలింగస్థాపనమునఁ ద్రిభువనములం బరమహితముగాఁ బొందం గరుణన్
ధవళాక్షి చేసితిం దత్ప్రవిమలలింగమున నన్ను భావించు టెఱుకన్. 272

చ. కలశముఁ బాల నేత నుదకంబుల నేని వరాభిషేకము
గళము నొనర్చి భక్తిరతి గంధము మాల్యము ధూపదీపసం
కలనములున్ నివేద్యమును గాఢసమర్పణ మొందఁ జేసి లిం
గలసితమూర్తియందు ననుఁ గాంచి భజించిన ముక్తి సేకుఱున్. 273

క. అని పలికి నీవు దేవాం,గన లాదిగఁ గలత్రిలోకకాంతలకును మ్రొ
క్కునకుం బాత్రం బగుపద,వనజంబులు గల్గి యొప్పువరసతివి శివా. 274

క. చతురవు వివేకవిభవోన్నతచిత్తవు వ్రతవిధాననైష్ఠికతాసం
యుతమతివి లౌకికజ్ఞా,నితామహిమసహజమతి వనిందిత వరయన్. 275

క. కావునఁ గాంతాధర్మము, నీవలనం దెలియవేడ్క నెమ్మనమున నా
కావిర్భవించెఁ జెప్పం,గా వలయును దాని వికచకమలదళాక్షి. 276

ఆ. అనిన సిగ్గుతోడ నయ్యలఁతిన వ్రాలసిన, చెన్ను మొగము వింతచెలువు దాల్ప
వాంచి యొత్తి గౌరి వరునితో నిట్లను, నేను మీకుఁ జెల్ప నెంతదాన. 277

క. ఐనను మీరడిగిన మన్మానసబోధంబుకొలఁది మాటుపల తెలుఁగుల్
వూని వినిపింప కుండుట, దాన తగదు గాన చెప్పెదను సర్వజ్ఞా. 278

క. అని పలికి మఱియు నిట్లను, నను నెప్పుడుఁ బాయకుండు నదు లెల్లను న
న్వనితలతోడ సమాలో,చన మొనరించి మఱి చెప్పఁ దను నిశ్చైఁగున్. 279

వ. అని విన్నవించి గంగ యమున గోదావరి కౌశికి కావేరి కృష్ణవేణి పెన్న (నర్మద

బాహుద రేవ తమస) మొదలైననదులు మున్న తనతోడన వచ్చియున్న నన్నా
తులగురించి యీశానుం డిట్లనియె గడు నెట్లు సెప్పెద మనిన గంగాదేవి నీ కంటెనే
మెఱుంగుదుమె నీ వెఱింగిన తెఱంగున నంగనాధర్మం బెఱింగించి పతింబ్రీతుని
జేయు మేము భవదీయవాగమృతంబు వీనుల వినిచెద మనుటయుఁ బార్వతి ప్ర
సన్నచిత్తయై వల్లభువదనంబునం జూడ్కి నిలిపి. 280

క. దేవా నీదు ప్రసాద, శ్రీ వచ్చినయట్టిక సుందరీవిధము భవ
ద్భావంబునకుఁ బ్రియంబుగ, సేవాధర్మంబుఁ దెలియఁగఁ జెప్పెద ననియెన్. 281

తే. అనినవిని సురల్ మునులు ప్రియంబుఁబొంది, రమరగంధర్వసిద్ధసాధ్యాంగనాజ
నంబు వినువేడ్క వచ్చియ, న్నలినవదన, వెనుకదెసనుండె దేవకీసలనయు యపుడు.

వ. అని చెప్పి యప్పురుషోత్తముమీనులు వికసిల్లు చుండ నారదుం డిట్లనియె. 283

—◆ పార్వతి శివునకుఁ బతివ్రతాధర్మంబుల తెఱం గెఱింగించుట. ◆—

క. వనితలుఁ బురుషులుఁ బ్రియమున, దను వినుతింపంగ శైలతనయ సమాక
ర్ణనకౌతుక యగుసిశా, నునితో మృదురీతి నిట్లనుం గమలేశా. 284

సీ. ఋతుమతి గాక శుద్ధతయుఁ గలిగినయంతి
కన్య తత్పరిణయకరణమునకు
నొడయులు విను తల్లియును దండ్రియును దండ్రి
తోఁబుట్టినతఁడు మాతులుఁడు సోద
రుండును యోగ్యవరునిఁ జూచి వారిలో
నెవరైనను బ్రీతి నిచ్చువారు
పతి యంతనుండియుఁ బ్రభువు దానికి నట్లు
గావున నాతండ దైవ మనుచు

తే. నతనిమత మూఁది దేవతాపితృసమర్చ, నములు నతిథిపూజనము సత్సమ్మతిసమాచ
రించుచును బతిహితమువాటించి నడవు, సతి పతివ్రత యిహపరసౌఖ్యమహిత.

వ. ఏతద్విషయం బయిన యొక్కసిదర్శనం బవధరింపుము. 286

సీ. బ్రాహ్మణుఁ డొకనికి భార్య లిద్దఱు గల, రందొక భామిని యతనిహితము
నడపెడునవధాన మెడలే యాతఁడు పంప, గయుఁ దాన సురపితృకార్యపరత
నడచుఁ దక్కటియింతి నాథుఁ బాటించుచుఁ, దన్మతంబునఁ జేయు ధర్మవిధులు
వారు మువ్వురు విధివశమున నొక్కట, మృతిఁ బొందిరా పతివ్రత వరుండు

తే. సనినసుగతికిఁ జనెఁ బెఱసవసిత జముఁను
నీకుఁ బోలేదు మరలుము నీశరీర
ముఁ నక యుసి యూగెఁ నది శోకమున సబాష్ప
యైనఁ గన్గొని యతఁడు దక్షుఁ డగుచు. 287

క. పతిమతము గొనక ధర్మము, నతివ నడపుటొప్పదింక నైనను బతికిఁ

హితము లగుపానిఁ జేసిన, నతనిఁ గలయు దనినఁ జనియె నదియును మరలన్.

వ. కావునం బతికి ననువ్రత యగుట గృహిణికి ధర్మం బని పలికి వెండియు. 292

క. లలన యిలు వాడి నాథుఁడు, వలచినచవివంటకములు నండి యిడి తనుం
గలయఁ దలంచిన మెయికొని, యెలమిం గైసేసి హృదయమిా వలయు శివా.

తే. పనులతోడ మాఱు వలుకక యనవధానుఁ, డైనపతిఁ దలఁపించి ధర్మార్థకలిత
కృతులు నడపుచు సవతి గల్గినను జోరి, తంబు లేకొక్కటైయుండఁదగవుసతికి.

క. సవతాలికిఁ బతి వలచిన, నవుఁ గాక ని యతఁడిచ్చు ననురూపముగాఁ
దివిరి నడచుసతి దైవను, శివ యది దగు నెల్లజనముచే మ్రొక్కు గొనన్.

క. తనచేలికి నిచ్చినవ, స్తునికాయము నిల్లురువున చొప్పున మగుడం
గొన వచ్చి భార్య పతి దె, మ్మనినప్పుడ యిచ్చుటొప్పు నకపటవృత్తిన్. 293

క. పతి దనకు నేమి యిచ్చిన, నతిముదమునఁ బొందవలయు నాత్మజుఁడైనన్
మతిఁ గొంకక యేకాంత, స్థితి నేకాసనత నుక్కి నెట్ట ప్రమదకున్. 294

క. ధన యధనుఁడు రూపసి రో, ష్వనివాఁడు వివేకి మూఢభావుఁ డరోగుం
డనుగతరోగుఁ డనక యం, గన పతిఁ బాటింప వలయుఁ గామధ్వంసీ. 295

క. బలి భిక్షము గడప కిడ, న్వలయును దేవపితృపూజనంబులకాలం
బులఁ బతి కుభ మందుటఁ ద, త్ఫలంబుగాఁ గోరు టొప్పదము సతికి శివా.

క. గతి బతియచువ్వో భార్యకు, నతనిఁ గడచినట్టినప్పరాయణము కృపా
యుత కలదే కావునఁ దా, నతనికి భక్త యగు టిమ్మనఫలసుభంబుల్. 297

వ. అని చెప్పి యప్పరమేశ్వరునకుం బార్వతి భార్యలయధర్మంబుల వివరించు నది యై యిట్లనియె 298

పార్వతి శివునకుఁ బతివ్రతకు సర్వంబు లగుధర్మంబులఁ దెలుపుట.

సీ. పరమేశ యాసురి పైశాచి రాక్షసి
యను పేళ్లు గల వధర్మాంగనలకు
వ్యభిచారతత్పరత్వంబు వారికి నెల్లఁ
గల దసురాంశజ కార్శ్యనిరత
దనయిచ్చఁ బొలియించు ధనధాన్యములు చల
హృదయ భోగపరాత్మ యీర్ష్యగలదు
పైశాచి క్రోధన భర్తృపుత్త్రులయందు
నిఃస్నేహ గృహకార్యనిపుణ గాదు

తే. కలహశీల రాక్షసి సుఖంబు లేమ, బొంకు పక్క నెప్పుడు నిద్రవోవు వీర
లజ్జ యిందఱు నాథునకలంబు వారి, మరిత మిాఁదించి పోవుదురు నరకమునకు. 299

ఆ. ఎఱుక గలిగి పిదప నేనియుఁ బతిభక్తి, గలిగి ధర్మమోపి చలిపి శాంతి
గలిగి యున్న మున్నుగలపాపములు వాసి, పురుషుతోడ దివికిఁ బోవఁగంద్రు.

ఆ. అట్లుఁ గాక పతులకంతిమసమయంబు, నందుఁ జింతె దక్క యనుమరణము
సేసి రేని సుగతి సిద్ధించుఁ బతిసమే, తంబు గాఁగ సన్నుతింబినులకు. 301

క. ద్విజభామినికి నధర్మము, ప్రజఁ గాంచినపిదప నయ్యపత్యము శోకో
ద్విజితయుఁ బతిభక్తయు నై, త్యజించి యనుమరణ మయుత మగుట మహేశా.

క. అని చెప్పి గౌరి పతికి, ట్లను నా దగుచాపలమున నఖిలేశ్వర నన్
వినిపించితి నేఁ గొన్నివ, చనముల నీ తప్పు నాకు సైఁపుము కరుణన్. 303

క. అని సిగ్గునఁ జెన్నగు నా, నన మించుక వాంచి యొత్తునగతనయ వృం
దును మునులును మునిపత్నులు, వినుతించిరి మధురవాక్యవిభవం బెసఁగన్.

క. సురగంధర్వఖచరకి, న్నరకింపురుషోరగాదినారీజనముల్
పరమప్రీతిని బొగడిరి, పరమేశ్వరి నెలుఁగు లడరఁ బంకజనాభా. 305

క. అని చెప్పి నారదుం డి, ట్లను నగ్గోవిందుతోడ నప్పుడు ప్రియమా
ననమునఁ బొదలఁగఁ బార్వతిఁ, గనుఁగొని సర్వేశ్వరుండు గారవ మొప్పన్.

క. నానీసంవాదము శుచి, యైనైష్ఠికజనుల కెవ్వఁ డాదర మెసఁగం
గా నలినాక్షీ చెప్పును, వానికి నిత్యామరత్వవైభవ మొదవున్. 307

క. మనసంవాదం బెవ్వఁడు, వినిరి నియతి నజ్జనులకు విభవముఁ దేజం
బును గీర్తియు నాయువు శ్రీ,యును నారోగ్యంబుఁ గలుగు ననుత్పలనయనా. 308

క. అని నిర్దేశించి శివుఁడు, సనియె శివయుఁ గొలువుతోన చనె సద్దేసకుం
జని రన వశమే యద్భుత, మనిరూప్యం బప్రతర్క్య మది శ్రీరమణా. 309

క. అని పలికి నారదుఁడు నా, వినినకసినయద్భుతంబు వినిపించితి నీ
కనియెం గృష్ణుని సభ్యుల,మనంబు లానందపూరమగ్నము లయ్యెన్. 310

వ. అని యిట్లు భీష్ముండు మామహేశ్వరసంవాదం బను పుణ్యకథ సెప్పిన ధర్మ
తనయుండు సోదరసహితంబుగాఁ బ్రమోదరసభరితుం డై 311

భీష్ముఁడు ధర్మజునకుఁ బరప్రాప్తిహేతుభూతం బగుజపవిశేషంబు దెలుపుట.

సీ. అతనికిఁ బ్రణమిల్లి యనఘ పరప్రాప్తి, యెద్దాన సమకూరు నెఱుఁగఁ జెప్పు
మనిన నతండు నారాయణధ్యానపూ, జాస్తుతితత్కథాశ్రవణనిరతి
యుమ్మేలు గావించు నధిప విద్వజ్జన, సంరక్షణము కల్మషములఁ బాపు
వేశ్య యొకర్తె తొల్లి విద్వాంసు నొకరుని, మెచ్చని తలవరుల్ మోఁద జూచి

తే. యిటేఁడు మావాఁడు మీఁ దేటి కాగ, డంబు సేసెద రని మోక్షణంబు సేసి
యా సుకృతమున బ్రాహ్మణియై జనించెఁ, దగఁగ నర్చింపు మీవు విద్వజ్జనముల.

వ. అనిన విని యుధిష్ఠిరుండు దారిద్ర్య వ్యాధిశోకంబులకు శాంతి సంపాదింపం
జాలుజపం బెయ్యది సెప్పవే యనుటయు ననిమిషనదీనందనుండు బ్రహ్మవిష్ణు
మహేశ్వరులను వినాయకవిశాఖవహ్నివాయుచంద్రాదిత్యులను శక్రవరుణ
యమకుబేరులను సురభిని సముద్రంబులను గంగాదిమహానదులను మరుదశ్వి

వసురుద్రాదిదేవతలను బితృదేవతలను వాలఖిల్యాదిసిద్ధులను వేదవ్యాసవాల్మీకి నారదాగస్త్యగౌతమకాశ్యపాత్రికణ్వాదిమహామునులను రంభాద్యప్సరస్స్త్రీలను ధర్మతపస్సత్యములను నహోరాత్రంబులను దారాగ్రహంబులను నశ్విన్యాది తారకంబులను మాసర్తువత్సరంబులను వైనతేయకాద్రవేయులను గాశీక్షేత్ర కురుక్షేత్రాదిపుణ్యక్షేత్రంబులను నైమిశారణ్య దండకారణ్యాదిపుణ్యారణ్యంబులను మేరుహిమవత్కైలాసాది ప్రభూతశైలంబులను దిజ్ఞభోభూములను బుణ్యభూరుహంబులను భూసురులను జక్రవర్తులను రాజులను బరమభక్తిం దలంచి కీర్తించి నమస్కరించి యీసహస్రాహం బఠియు నన్ను రక్షించి నాకు నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి పరమానందంబు నభినందనపూర్వకంబుగా నిచ్చుంగావుత మని యిచ్చం గోరి యోం నమో భగవతే వాసుదేవాయ నమః పురుషోత్తమాయ నమ స్సర్వలోకగురవే నమ స్సర్వలోకపిత్రే నమః స్సర్వలోకపితామహాయ నమ స్సర్వలోక ప్రపితామహాయ నమ స్సర్వలోక ప్రధానాయ నమ స్సర్వలోకేశ్వరాయ నమ స్సర్వలోకవిశిష్టాయ నమ స్సర్వలోకసుఖప్రదాయ నమ స్సర్వలోకకర్త్రే నమ స్సర్వలోకభర్త్రే నమ స్సర్వలోకహర్త్రే నమ స్సర్వలోకనిధయే నమ స్సర్వలోకనిధానాయ నమ స్సర్వలోకహితాయ నమ స్సర్వలోకహితకరాయ నమ స్సర్వలోకోద్భవాయ నమ స్సర్వలోకోద్భవకరాయ నమో విష్ణవే ప్రభవిష్ణవే యని పఠించుట మహాజపంబు. 313

క. పాపంబులును భయంబులు, నాపదలుం బాయు నిమ్మహాజపమున ధా
త్రీపాలోత్తమ శుభములు, ప్రాపించును ధర్మతత్పరత సిద్ధించున్. 314

వ. అని యిట్లు గంగాపుత్త్రుం డజాతశత్రునకు సర్వసిద్ధికరం బయినయిమ్మహాజపం బుపదేశించె నని చెప్పి తదనంతరసత్కథ లాకర్ణింపు మని పలికి జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె. 315

తే. మనుజనాథ యశేషధర్మములు సర్వ
పావనములు శాంతనవుఁడు బహువిధములఁ
జెప్ప నిమ్మెయి విని యుధిష్ఠిరుఁడు భక్తి
నమ్మహాత్ముని నిట్లని యడిగె మఱియు. 316

చ. అతఁ డాకరుండు లోకముల కన్నిటికిన్ మహనీయ మైనదై
వత మెవ్వఁ బరాయణంబు నను కైవభవ మెవ్వని కొప్పు నర్చన
స్తుతిరతి నెవ్వనిం గొలిచి శోభన మొందు జనంబు మేలు నా
నతిశయ మొందినీకు మతి కైమెచను నెయ్యది ధర్మకోటిలోన్. 317

తే. జపములం దెల్ల నుత్తమజపము నాఁగ, సంచితం బయి తనుఁ జపియించు జంతు
వునకు జన్మసంసారబంధనము లూఁపి, పావు నెయ్యది మోక్షంబు పరమబోధ.

వ. అని యడిగిన నా భూపతికి భీష్ముం డి ట్లనియె. 319

—❀ భీష్ముఁడు ధర్మజునకు విష్ణుమంత్రధ్యానం బవశ్యానుష్ఠేయం బని చెప్పుట. ❀—

సీ. అఖిలజగత్ప్రభు • వగు దేవదేవు న,నంతునిఁ బురుషోత్తమాభిధాను
నంచితనామసహస్రకంబున సంస్తు,తించుచు సంతతోత్థితమనస్కుఁ
డై యజమానుఁ డవ్యయుఁ డైనయాతని, నర్చించుచును దృఢధ్యాననిరతుఁ
డగుచు నమస్కృతి • యాచరించుచు ననా,ద్యంతు నవ్విష్ణు నధ్యక్షు నెల్ల
తే. లోకములకు బ్రహ్మణ్యుఁ ద్రిలోకకీర్తి,వర్ధనుని సర్వధర్మజ్ఞు • వరదు లోక
నాథు భూతభవోద్భవు నమ్మ భక్తిఁ, గొలిచి సర్వదుఃఖంబుల దొలఁగఁద్రోచు.
తే. ప్రస్తుతులఁ బుండరీకాక్షుఁ బరమభక్తిఁ, దలఁచి యర్చించుటయు నామశతంబు సర్వ
ధర్మములకును సమధికతమము నైన,ధర్మ మింత యెఱుంగుము ధర్మతనయ.
సీ. పరమతేజంబును • బరమపదంబును, బరమైన బ్రహ్మంబుఁ • బరపరాయ
ణముఁ బవిత్రంబులు • నాఁ దగువానికి, నెల్ల బవిత్రంబు • నెల్లమంగ
ళంబులకును మంగళంబును నెల్ల దే,వతలకుఁ బరమదైవతము భూత
సమితి కవ్యయజనకుండు నగునట్టివాఁ డెవ్వఁ డెవ్వానివలనఁ దోఁచు
తే. నాదియుగమునాగమమున • నంత్యవేళ, నడఁగు నెవ్వానియందుఁ జరాచరములు
విశ్వలోకప్రధానుఁ డవ్విష్ణువేయు,భవ్యనామంబులును బాపభయహరములు.
తే. భూరిగుణయోగవిఖ్యాతములును ఋషీస
మాజపరిగీతములును నై • మహిమఁ దనరు
నమ్మహాత్మునినామంబు • లధికతరవి
భూతికై చెప్పెదను విను • భూపవర్య. 323

వ. అని పలికి విశ్వంబు విష్ణుండు వషట్కారుండు భూతభవ్యభవత్ప్రభు వనునవి మొదలై రథాంగపాణి యక్షోభ్యుండు సర్వప్రహరణాయుధుం డనియెడు నివి తుదగాఁ గలసహస్రనామంబు లుపన్యసించి. 324

ఆ. కీర్తనీయుఁ డైన కేశవుదివ్యనా,మంబు లివి భవద్ధితంబు గోరి
తరతరంబ కీర్తితంబు లయ్యె నశేష,భంగి వేయుఁ గురునృపాలవర్య. 325

—❀ భీష్ముఁడు ధర్మజునకు విష్ణునామప్రభావంబు దెలుపుట. ❀—

సీ. విష్ణునామంబులు • వేయును నిత్యంబు, వినినఁ బఠించిన మనుజుఁ డిహము
నందుఁ బరమ్మున • నశుభంబు నొందక, యత్యంతశుభముల • ననుభవించు
విప్రుండు వేదాంతవిదుఁ డగు రాజ వి,జయ మొందు వైశ్యుఁ డక్షయధనంబు
పడయు శూద్రుఁడు సుఖభాగిత [illegible] ధ,ర్మార్థకామప్రాప్త్యభ్యర్థిజనులు
తే. గాంతు రమ్మెయి [illegible] భక్తి, శౌచమై విని కీర్తించి • సారయశము
నచలలక్ష్మియు [illegible] మెలి, పెంపుసొంపు మిగిలి శోభిల్లు నరుఁడు. 326

సీ. పురుషోత్తము [illegible] ంచు, [illegible] ననుభవయంబుఁ బొందఁ

డమితవీర్యమునఁ దేజమునఁ గాంతిని బల,రూపగుణంబుల నరూఢి కెక్కు-
రోగబంధాపదార్తులకుఁ బతనమాత్ర, నయ్యుదురితము లడఁగు వాసు
దేవాశ్రయుఁడు వాసుదేవపరాయణుఁడును నగుమర్త్యుఁ డవ్వినుతనామ

ఆ. కము లుపన్యసించి కల్మషంబుల నెల్లఁ, దొలఁగి దుర్గతులకుఁ దొలఁగి జన్మ
మరణములకు రోగజరలకు నందని,పరమ మైన బ్రహ్మపదము నొందు. 327

క. స్మృతిసౌఖ్యక్షాంతి శ్రీ,ధృతికీర్తులు గలుగు దుర్మతి యుఁ గ్రోధము లు
బ్బతయును మాత్సర్యము లే, వతిపుణ్యుల విష్ణుభక్తు లైనజనులకున్. 328

సీ. చంద్రార్కనక్షత్రసహిత మైననభంబు
నచరాచరోర్వియు జలనిధులును
సురదైత్యగంధర్వగరుడయక్షోరగ
ప్రజములు హరివశవర్తనములు
బుద్ధియు నింద్రియములును మనంబు స
త్త్వంబును బలముఁ దేజంబు ధృతియు
క్షేత్రంబుఁ దద్గతక్షేత్రజవస్తువు
లరయఁగా వాసుదేవాత్మకంబు

తే. లాగమాదితాచారమయంబు ధర్మ
మచ్యుతుండు తత్ప్రభువు సాంఖ్యమును యోగ
తంత్రమును శిల్పవేదశాస్త్రములుఁ గర్మ
ములు జనార్దనువలన సముద్భవించె. 329

ఆ. విష్ణుఁ డొక్కరుండ విను మహాభూతంబు, దక్కభూతతతులు పెక్కు గలవు
సరిఁ ద్రిలోకములను బరఁగి విశ్వంబు భూ,తాత్ముఁ డమ్మహాత్ముఁ డనుభవించు.

ఆ. వ్యాససంప్రణీత మైనయీవిష్ణుస్తవంబు సకలశోభనంబులును సు
ఖములుఁ గోరుపురుషుఁ డమలినబుద్ధిఁ బ,ఠింపవలయు భక్తిపెంపుతోడ. 331

క. అజు విశ్వాధీశ్వరు స,ర్వజగత్ప్రభవావ్యయ ప్రవర్తనకరు నం
బుజలోచను నెవ్వారలు, భజింతురు పరాభవమునఁ బడ రప్పుణ్యుల్. 332

క. కావున విష్ణుని పెల్లగు, [1]నీవేయుఁ బఠింపు నీకు నెప్పుడు నాయు
శ్శ్రీవిభవారోగ్యంబులు, భూవర సిద్ధించుఁ బరమబోధముఁ గలుగున్. 333

క. అని యి ట్లుపదేశించిన, విని మోదము నెమ్మనమున వెల్లిగొనఁగఁ బాం
డునియు గ్రసుతుఁడు గాంగే,యుని కభివందన మొనర్చి యుచితవినయుఁడై. 334

వ. పూజానమస్కారంబులకు నెవ్వరు భాజనంబు లెవ్వారికిఁ జెట్ట సేసినం జేటు
వాటిల్లు నెవ్వారలు సంతోషించిన శుభంబులు సొప్పడుం జెప్పవే యనిన
నతం డతని కి ట్లనియె. 335

1. క. చ. జ. 'నీవేయుఁ బఠింపునీవు నిచ్చలు'.

బ్రాహ్మణపూజానమస్కారంబులు పరమోత్కృష్టంబు లని చెప్పుట.

సీ. పూజానమస్కారరతములకుఁ బాత్రములు బ్రా
హ్మణులు వారలకుఁ గీ డాచరించి
వాసవుండును జెడు వారిసంతసమున
నఖిలశుభంబులు నావహిల్లు
ధర్మసేతువు లోకధారకం బఖిలశా
స్త్రప్రవర్తకము విప్రవ్రజంబు
తపమును వాక్కును ధనము విప్రుల కొక్క
కుడుపుమాత్రన పాపకోటిఁ బాపు
తే. రమ్మహాత్ములు సొప్పరు లఖిలమార్త్యములకు వీను దేవతలు దేవతలకు బాలుఁ
డజ్ఞుఁ డన లేదు పూజకు నర్హు లనిన, నధిప వృద్ధులఁ బ్రాజ్ఞుల నడుగ నేల.
వ. అనిన విని యజాతశత్రుండు బ్రాహ్మణులఁ బూజించుటవలన విశిష్టం బయిన
శుభం బెయ్యది దృష్టం బయ్యె వారలయందు వర్ణనీయం బగువర్తనం బేమి
గానంబడియె నీ విట్లు వారలం గొనియాడ వెలింగింపవే యనుటయు నాపగాపు
త్రుండు పవనార్జునసంవాదం బనునితిహాసంబు వినుము మది భవత్ప్రశ్నంబునకు
నదుత్తరం బై యుండు నని పలికి యజ్ఞపతి కిట్లనియె. 337

పవనకార్తవీర్యార్జునసంవాదంబు భీష్ముండు ధర్మజునకుం జెప్పుట.

సీ. అధిపసహస్రబాహార్జునుఁ డేడుదీవులు నేలి యద్భుతబలపరాక్ర
మములఁ దనర్చి మత్సమ మెవ్వరును నెందు, లే రని యత్యవలేపయుక్తి
నాడిన నొకభూత మాకాశమున నుండి, యెలుఁగెత్తి పలికెద వెల్లవారి
కధికులు గారె ధరామరు లనవుడు, నతఁడు వారలు రాజు నాశ్రయించి
తే. నడపికొందురు మనుగడ పుడమిఁ జేని, కంటె నెక్కుడై రట్లుఁ గాక యేను
మానుతుఁ గూర్చినఁ జెలువుతునర్గిలినసమస్తభూతముల నన్న వెలిచియాభూతమరిగె.
వ. అట్టియెడం బవనుండు గగనంబున నుండి తన్నెఱింగించికొని యన్నరపతితోడ.
సీ. భూదేవశక్తిన కాదె రాజులు ప్రజా, రక్షఁ జేయనర్చుట బ్రాహ్మణులకు
నధికులు గలరె యహల్యకై యింద్రుండు, గౌతముఁ డలిగిన గాసిఁ బడఁడె
కుంభసంభవుచేత నంభోధి యుడఁగదె, యనలుండు భృగుశాపహతుఁడు గాఁడె
యన విని ఘటుడు మాటలయాడక యున్నయర్జునకుఁ బవనుఁ డిట్లని యెఱిఁగించియు
తే. నాంగిరసవంశసంభవుం డగునుచథ్యుఁ
గోరి నిజపుత్త్రి సోముఁడు గారవమున
నిచ్చె నాతంపతులు తమయిచ్చ తనము
నందు వసియించి మునిహృదయంబు లలర. 340
వ. వర్తించునెడ నొక్కనాఁ డత్తన్వి యమునానదీస్నానంబునకుం జనుటయు మున్న

యవ్వనితం గామించి వేచి తిరుగువరుణుండు. 341

క. ఎత్తికొని పోయి తనపురి, నత్తామరసాక్షి నునిచె నమ్మునికడకుం
జెత్తన చని నారదముని, యుత్తెఱఁ గెఱిఁగింప నాతఁ డాతనితోడన్. 342

తే. తాన దిక్పతి దన కిట్లు దగునె యోయూరుల, భార్యఁ గొని పోవ నీవేఁగి పలుకు మిట్ల
యనినఁ జని నారదుండు చెప్పినను విడువఁ, డయ్యుగామాంధుఁ డై సరిత్సనద్ధివిభుఁడు.

వ. విడువకున్న నమ్మునియుచథ్యుకడకు మగడి వచ్చి. 344

సీ. ఇంతఁ దా విడువనిసయ్యండి యసురు కాదు నర్క, చెడతల వట్టి త్రోపించె వరుణుఁ
డని చెప్పుటయు నల్గి యుతఁగు సర్వజలంబుఁ, ద్రావిన వరుణాప్పురంబు ధూళి
మయ మైన భయ మందిసమానినిఁ గొనివచ్చి, యొప్పించి ప్రణమిల్లి తప్పు వాపి
కొని మునికృప గాంచి చనియె నాదిక్పతి, ధరణీశ రాజులా ధరణిసురులా

ఆ. యెక్కుడనిన వినియు నక్కట్లు వడి యున్న, యనలితోడ ననిలుఁ డమరులసుర
సమితి కోడి వచ్చి శరణు సొచ్చిన నగస్త్యుండు విజయలక్ష్మి నొసఁగుటయును.

వ. గంగాతీరంబునం గ్రతువు లొనరించుగీర్వాణులం బూర్వగీర్వాణులు గాసి చేసిన వసిష్ఠునికడకు వారలు మఱియుం బొఱుదేరం గోపించినయత్తాపసోత్తముని రోషానలజ్వాలలు [1]సాకారంబు లయి యాదైత్యలోకంబు నేర్చుటయుం జెప్పి యక్కుల్భసంభవుండును వసిష్ఠుండును శ్రేష్ఠు లగుట రాజుల కొడఁ బాటు గాదో కదే యనివనుం బలుకకున్న యన్నరపతితోడం బవమానుండు మఱియు నిట్లనియె. 346

పవనుఁడు కార్తవీర్యార్జునునకు నత్రిప్రభృతులమహిమ సెప్పుట.

సీ. ఒకతఱి దేవతలకు దైత్యులకు మహారణ మయ్యె నప్పుడ రాహుసత్త్వ
సమితిచే నర్కుండుఁ జంద్రుండు సొలసిన, వెలుఁ గడంగుడుఁ దమంబొలసి వెగడు
పడినయద్దివిజుల వడి నంటఁ దాఁకి య,య్యసురలు నొప్పింప నత్రికడకుఁ
బాఱి మమ్ముం గావు పరమదయాత్మక, యనుడు నతండు చంద్రార్కతనువు

ఆ. లతులితములు సేసి యసురసైన్యము రూపు,మాపె నిజకటాక్షమాత్రమునన
యతని నృపులకంటె నధికుఁ డండ్రెమొ హీనుఁ,డండ్రమో నిజంబు నధిప చెపుము.

సీ. అసిన నూరక యున్న యర్జునుతోడ స,దాగతి యిట్లను ధరణినాథ
సురపతి యాశ్వినుల్ సోమపానంబున, కర్హులు గారన్న నాశ్రయుంబు
వాటించి వారికై భార్గవచ్యవనుండు, దనమంత్రము [illegible] ననిమిషులకు
నగ్గు సేయంగ నక్కయ్యింద్రుండు పోటున, వ్రేటున నాతని గెలడంచు

తే. బుద్ధి నొక శైలమును వజ్రమును రయమునఁ
గొని మహోగ్రతఁ గవియ నమ్మునివరుండు
జలము సల్లిన శైలవజ్రములుఁ దాను

1. క. గ. ట. సాయకాకారంబులై.

[1]ముదుఁగఁబడి యబ్బలారాతి ♦ మూర్ఛవోయె. 348

వ. ఒక్కింత సేపునకుం దెలిసి నంతకు నమ్మునివరుండు మదుం డనువాని ఘోరానన దీర్ఘరసనా ప్రదంతుని సృజించి పంచిన. 349

ఆ. వాఁడ సురగణంబు ♦ వాసవుఁ గబళింప, వారు శరణుశరణు ♦ వరమునీంద్ర
యనిన వారిఁ గాచె ♦ నమ్ముని వారిచ్చె,నపుడు సోమపాన ♦ మాశ్వినులకు. 350

క. నీ వాచ్యవనుండును ధా,త్రీవరుసగి గామి యెట్లుఁ ♦ దెలుప కుశుఁగు దే
నావినియు నొక్కమాటయు, నావిభుఁ డాడండ దాని ♦ కలయుక మతియున్. 351

వ. వాయుదేవుం డన్నరదేవువలని కరుణంజేసి యతనిచే టోర్వనివాఁడై. 352

సీ. అకట దత్తాత్రేయునకు భక్తి శుశ్రూష, సేసి కాదె యవ్విశిష్టబలప
రాక్రమంబుల నొంది ♦ రాజుల కెల్లను, నెక్కుడై తాఁ కృత ♦ మేల మఱన
వినుమీ వొకండవే ♦ యనిమిషాదిసమస్తభూతంబులను వృద్ధిఁ బొందుటవని
దివిజులకృపన యీశతెఱఁ గెల్లజనములు, నెఱిఁగినపని శాంతిఁ ♦ గొఱలి విప్ర

తే. కులమునఁ దైవస్వరూపం బగుట మనంబు,నందుదృఢముగనిల్పి తత్పదాశ్రయమున
వెలయువాఁడవైనను మేలుగవినుమున్నాడు,బుద్ధిగునఘుడునతఁడు ప్రబోధ మొలసి.

క. నీపనుపు సేసి బ్రతికెద, నేపు నహంకృతియు విడచి ♦ యెల్లవలన మే
లాపాదించుచు విప్రుల,శ్రీపాదము లాశ్రయించి ♦ చెందెద శాంతిన్. 354

ఆ. అనిన సంతసిల్లి ♦ యనిలుఁ డా నృపు బుద్ధి గలిగి బ్రదుకు మనుచు ♦ గారవించి
వీడుకొల్పి చనియె ♦ విప్రుల పెంపిట్టి, దని యెఱుంగు కురుకులాగ్రగణ్య. 355

భీష్ముఁడు ధర్మజునకుఁ గృష్ణుని ప్రభావం బుపన్యసించుట.

వ. అనుటయు నవ్విభుండు బ్రాహ్మణమహానుభావం బింకను వినవలతుం జెప్పవే యనుటయు నప్పుడమిఱేనికి భీష్ముండు దనకు నింద్రియంబులును వాఙ్మనసంబులును నపుడు దుర్బలంబు లగుట యెఱింగించి యినుండు దక్షిణాయనంబు తుది సేరుచు వచ్చె దేహన్యాసంబు తడవు లేమి దోఁచుచున్నది కృష్ణుండు నీకు విప్రజనవిశేషంబు వివరించువాఁ డని పలికి యిట్లనియె. 356

తే. ఏను గృష్ణు నెఱుంగుదు ♦ మానవేంద్ర, యుత్తమక్రీడావరాహమై యుద్ధరిత్రి
నిది యొకింతయును జెప్పఁగానేల కృష్ణు,లీలఁ గాదె భూమ్యాదిభూతశాలి గలిగె.

వ. కృష్ణుండు. 358

తే. బొడ్డుతామరయం దొక్కపురుషుఁ డుద్భ,వించునట్లుగఁ [2]జేసి తద్వీరచనాని
ధమున నఖిలచరాచరప్రభవ మయ్యె, నరయ సామాన్యమే కృష్ణుపరమలీల.

క. వినుమెత్తఱి ధర్మంబులు, దనుజులచే బాధఁ బొందుఁ ♦ దత్సమయమునన్
జనియించి యద్దురాత్ములఁ, దునుముం గృష్ణుండు ధర్మధుర్యులఁ గాచున్. 360

క. శూలియునుం దాన దిశా, పాలురునుం దాన విశ్వపతియును గురుభూ

1. క, ముడిఁగిఁబడి 2. జ, జేసి, ద్వి పనావిధవము నఖిల.

పొలవర తాన కృష్ణుఁడు, కాలము దిక్కులును దాన కలఁ డఖిలములన్. 361

ఆ. అరయఁ గృష్ణుఁ డధ్వరాత్మకుఁ డఖిలాగ, [1]మోక్షమంత్రశంత్రయుక్తి నతనిఁ
బ్రస్తుతించి మేలు వడయుదు రధ్వర,కర్త లైనజనులు కౌరవేంద్ర. 362

క. చయనంబుల ఋగ్వేదం, బయమహితసువర్ణనాముఁ డగుకృష్ణుగుణో
దయము వినుతించు యజ్ఞ,క్రియానిరతు లైనసురలు ప్రీతిం బొందన్. 363

క. విను ఋగ్వేదము కృష్ణుని, వినుతించుట యటుదె యఖిలవేదంబులుఁ ద
జ్జనితవిలాసంబులు వే,దనిరూపితవస్తువునను దాన కుమారా. 364

తే. అగ్నులును యజమానుఁడు నాహుతులును
యాగఫలరూపమును గృష్ణుఁ డని యెఱుంగు
మినశశాంకతారకముల నెసఁగు తేజ
ములును గృష్ణమయంబుల భూపవర్య. 365

క. పరమజ్యోతి యనంగ ని,ర్జరామరపదం బనంగ సత్యం బన భూ
వర యమృత మనఁగ దేవకీ,వరసుతుఁడు వెలుఁగు వేదవర్గముతుదలన్. 366

క. అని యిట్లుపదేశించిన, విని మోదము నొంది పాండువిభునగ్రసుతుం
డనిమిషతటినీసుతునకు, వినతుం డై నెమ్మనమున వేడ్కఁ దలిర్పన్. 367

కృష్ణుఁడు ధర్మరాజునకు బ్రాహ్మణప్రభావంబు సెప్పుట.

వ. కృష్ణునకుఁ బ్రణమిల్లి దేవా భూదేవమాహాత్మ్యంబు విన వలతు నానతీయవే
యని వినయసంభృతుం డగుచుఁ బ్రార్థించిన నప్పార్థివునిమీఁదఁ గరుణామృతమ
యం బగునాలోకనం బొలయ నద్దేవుం డాదరభరితుం డై యి ట్లనియె. 368

క. ననుఁ బ్రద్యుమ్నుం డవ్విధ,మున నడిగిన వాని కేను ముద మందుచు నా
తనిహితము గోరి కుంతీ,తనయాగ్రజ యున్నరూప తగ ని ట్లంటిన్. 369

సీ. వర్గత్రయము నపవర్గంబు స్వాధింప, నమరపితృప్రీతు లాదరింప
నైహికసుఖములుపార్జింప వలసిన, వారికి విప్రుల చేయుగడలు
దివిజుల కైనసాధ్యయువు శ్రీయుఁ గీర్తియుఁ, దనరుట తత్ప్రసాదమునఁ జూవె
యలిగి భస్మము సేయ వలచి పెంపొసఁగంగ, నవనీసురులు శక్తులట్టు లగుట

తే. వారిఁ గోపింపఁ జేయక వారలకుఁ బ్రి
యంబు సేయుచు వారు ప్రహర్ష మొందఁ
దనకుఁ గలభంగి నిచ్చునతండు రెండు
భువనములయందుఁ బెంపును బొగడుఁ బడయు. 370

దుర్వాసుఁడు కృష్ణునిమనశ్శుద్ధి పరీక్షించి యనుగ్రహించిన ప్రకారము.

వ. నాకు నినయాశ్చర్యంబు సెప్పెద నాకర్ణింపుము స్వతంత్రప్రవర్తనుం డగుదుర్వా
సుండు మనమందిరంబునకు వచ్చి మందహాసంబు సేయుచుఁ గోపించుచు సుము

---

1. క. చ. జ. మోక్షమంత్రరితులశిథ క్షయుక్తి.

ఖండగుచు విముఖత్వంబు నొందుచుఁ గుడువనొల్ల ననుచుఁ బెక్కండ్రకుం గావిం
చినకూడుగూర దానొక్కరుండ భుజించుచు సెజ్జ నిద్రించుచు భూమి శయనిం
చుచు నెందేనిం బోవుచు మరలి వచ్చుచుఁ బ్రవర్తించుచుండి యొక్కనాఁడు
కృష్ణా నాకుం బాయసంబుమీఁద వేఁడుక పుట్టెడుఁ బెట్టింపవే యనఁ దక్షణంబ
కావించినం గొంత గుడిచి కొంత దనయొడలం బూయుమనినం బూసితి నచ్చేరువ
నున్నరుక్మిణిం జూచి కొంత యకాంతమేనం దాన పూసి రథ్యారోపంబుగా
రథంబున నప్పొలఁతిం బూన్చి రథారోహణంబు సేసి వీథికి వెడలి యమ్ముద్ది
యను ముల్కోలం బొడుచుచు రథంబు నడపింప నాకుం గోపంబు నీర్ష్యయు
నించుకయు జనియింప కుండ నేనుం జూచుచుం దోడన నడచితి నప్పుడు
యాదవు లాశ్చర్యకోపభయాయత్తచిత్తులై యనేక ప్రకారంబులం దమలోఁ బలు
కుచుం జేయునది లేక కెలంకుల వచ్చుచుండ. 371

ఆ. రథము దివిచి డస్సి రమణి మేనినిమీఁద, బ్రగ్గతిలఁగఁ బడిన దిగ్గ నులికి
దానిమీఁద ధూళి దాఁ జల్లి వెసఁ బాఱె, నమ్మునీశ్వరుండు యామ్యదిశకు.

క. పాఱిన నాతని వెనుకన, పాఱితి సంప్రార్థనా ప్రభాషణములతోఁ
దేఱి మరలి యమ్ముని మముఁ గాఱియ వెట్టెడఁ గదే యకట యనుచు దయన్.

వ. నన్నుం గనుంగొని నీవు కోపంబు జయించితివి నీకు వరం బిచ్చెదఁ గైకొనుము.

ఆ. ఎల్లవారుఁ దమకు నెంత గూర్తురు నీకు, నంత గూర్చి నిన్ను ననుసరించు
వారుగాత లోకవంద్యుండవై యెందు, మాఱు లేక యతులమహిమ మనుము.

వ. అని నిర్దేశించి మఱియు నిట్లనియె. 376

క. నాయంగంబుల నెల్లం, బాయస మతిభక్తిఁ బూసి పాదతలమునం
బూయవు గావునఁ గలుగు న,పాయం బఱికాల నిసు నవిలంఘ్యుం బై. 377

క. విను పరమపదప్రాప్తిక, ననుగుణమై యుండుఁ గాన యదియును నశుభం
బన రాదు నీవు బ్రాహ్మణ, జనములయెడ నడపు మిట్టిచందమ యెపుడున్. 378

వ. అని పలికి రథవహనపరిశ్రాంతి యగుమాతల్లిం జూచి నీవు సౌందర్యసౌభాగ్యం
బుల నప్రతిమానవై మాననీయత్వంబునం గృష్ణునిషోడశసహస్రాంతఃపుర
కాంతలకంటె నెక్కుడగు మని దీవన యిచ్చె. యమ్మౌని యంతర్హితుం డయ్యె.

ఆ. రుక్మిణియును నేను రుచిరసంపద నప్పు, డతిశయిల్లు నస్మదంగకములఁ
జూచికొనుచు మిగులఁ జోద్యమందుచుఁ బ్రియ, మెడఁద నెలకొనంగ నింటికరిగి.

ఆ. అందు వస్తుచయము ముందటికంటెను, బహుళమును మనోజ్ఞభంగికంబు
నగుటఁ జూచి యుబ్బుకొలాయత్తచిత్తుల, మైతి మిట్టివార లవనిసురులు. 381

క. కావున వారికి భక్తుఁడ, నై వెలయు కుమార యనిన నతఁ డట్టిఁడ యై
తా వెలసె నీవు నట్టిఁడ, వై వెలయఁగ వలయుఁ గౌరవాన్వయముఖ్యా. 382

వ. అని చెప్పినం బ్రముదితమానసుం డగుచు నద్ధర్మనవనాథుండు మాధవుతో దుర్వాసుండు శర్వాంశసంభవుం డని విందు శర్వునిమహిమ వినవలతుం జెప్పవే యనిన నప్పురుషోత్తముండు భరితాదరుం డై. 383

కృష్ణుండు ధర్మరాజునకు శివునిమహిమ చెప్పుట.

ఆ. అడుగవలయుదాని నడిగితి నీవు న, న్నధిప నాదుమనము ప్రియంబుఁ బొండె
శివునిఁ దలఁచి మ్రొక్కి శివుదివ్యమహిమ చె, ప్పెద నిశాంతవిమలహృదయు లగుడు.

వ. ఏకాగ్రచిత్తుండ వై యాకర్ణింపు మని ధర్మజున కిట్లనియె. 385

క. శతరుద్రీయము నేసరుఁ, డతిభక్తిని శివుని మనమునందు నిలిపి యం
చితమునఁ బఠించు సులభం, బతనికి సర్వంబు నిందు నందు నరేంద్రా. 386

వ. అని వెండియు. 387

సీ. అమరు మహాదేవుఁ డనుపేరు శివునకు, నప్పరమునకు మీఁ దరయ లేదు
తల్లోకపద్మకీల ధర్మవిరుద్ధపు, జాతుల నెల్లను సమయఁ జేయు
దేవతల్ మునులు నశ్రీప్రయత్నంబునఁ గావించు దక్షయాగమున శివుని
మఱచిన నయ్యజ్ఞ మఱువఁ లై పోడె. భగనేత్రనాశ మాదిగ ననేక

తే. భంగములు రావె వారి కాప్రభువుచేత, శరణు వేఁడినఁ గావఁ డక్కరుణ నట్టి
వారి నీశువెంచె మన వచ్చునటయ్యు, వినుము తద్దివ్యలీలలు మనుజనాథ.

సీ. ప్రబలదైత్యులు పురత్రయనాయకులు జగ, త్త్రయము నప్రతిమప్రతాపలీల
బాధింప దివిజులు ఫాలలోచనుఁ గాంచి, కావుము కృప దేవదేవ మమ్ముఁ
బశువుల మగువారిఁ బశుపతి వైననీ, వనుచు మహాక్రోశ మాచరింప
నప్పురంబులు మూఁటి నస్త్రమొక్కటన భ, స్మముగాఁగఁ జేసి యశమ్మార్గణంబు

తే. నరికమున నిడ నది పాలుఁ డైన నీతఁ
డెవ్వఁ డని నూప వెఱఁ గంది యెల్లసురలు
వినుతి సేయ బ్రాహ్మణమూర్తి వెలుఁగునతని
కిడియె [1]దుర్వాసుఁ డనునామ మీశ్వరుండు. 389

తే. అతఁడు నూఱేమాయింటి నరుగుదెంచి, యెంత సేసినాఁ దనవుమునఁ జ్చెరువును
భక్తియును మదిఁ బెరిగొనఁ బొందునగ్ర, సుతుఁడు నిభృతనై దేవకీసుతునితోడ.

క. శివముఖ్యనామములు ప్ర, స్తవనకృతిన్ భోగమోక్షదము లగునని విం
దు విమలబోధ యొఱింగింపవె వాని నిరుక్తి ననినఁ బరమప్రీతిన్. 391

వ. అతం డిట్లనియె. 392

క. శివదేవు ముట్టఁ గొల్వఁగ, నవనీశ్వర యతని పేళ్ళ యర్థ మెఱిఁగి సం
స్తవనకృతిఁ గూర్ప నాకై, న విధాతకు నైన నరిది నామదిఁ జూడన్. 393

వ. అయినను. 394

1. క. దుర్వాసుఁడు నాఁ డయ్యీశ్వరుండు.

క. నీ విట్లు నన్ను నడిగితి, గావున నా యెఱిఁగినట్టి గతిఁ జెప్పెద స
ద్దేవాదిదేవువరనా,మావలి విను మచలమైన యవధానముతోన్. 395

ఆ. అగ్నివాయువాసవాదిత్యవసుమరు, దాదిదేవతామయాత్ముఁడైన
శివునిమహిమఁ బ్రీతిఁ జెప్పుట వినుము స, ర్వార్థసాధకంబు లగు నృపాల.

—◆ శ్రీకృష్ణుండు ధర్మజునకు శివనామనిర్వచనంబు సెప్పుట. ◆—

క. వినుము నరేంద్ర మహత్త్వం,బున నుండను నీశ్వరత్వమున నఖిలమహా
మునిజనములును మహేశ్వరుఁ, డని కొనియాడ వాఁడు దొప్పు ననప్రతిముండై.

సీ. ఉగ్రత్వమునఁ బ్రతాపోన్నతి రుద్రనా,మముఁ దాల్చె దేవసంఘమున నెల్ల
మహతి నాఁ బాలు పారుసమహనీయదేవత, గావున వినుము మహాదేవుఁ డయ్యె
నఖిలసత్కర్మఫలాకారశుభములు, సేయు వేడుక కలిమి శివుఁ డనంగఁ
జనియె సుస్థిరతేజమున వెలుఁగొందుట, సంచితస్థాణునామాఖ్యఁ బరఁగె

తే. జంగమస్థావరాత్మకసకలభూత
రూపబహుళత నొందుట బహురూపనామ
ధేయుఁడై యొప్పె ధూమ్రపుంజజాయజటల
వలన ధూర్జటి యనుపేర వఱలె వాఁడు. 398

ఆ. వినుము విశ్వులనఁగ నను దేవతలు దన,యందు పొడమి రట్లు లగుట విశ్వ
రూపనామకమున దీపితుండయ్యె నా,త్రిపురమర్దనుండు నృపవరేణ్య. 399

సీ. బహునేత్రములు మేనఁ బ్రజ్వరిల్లుట సర్వ,తశ్చక్షురాహ్వయోదాత్తకీర్తిఁ
బరఁగు భూతములెల్లఁ బశువులు దాఁ బతి, గావున బశుపతినా వెలుంగు
నిమమస్థుఁడై యునికి వృషవాహనుఁడు మృత్యు,వనఁ జనుఁ బ్రాణపాకలాఖ్యసమతి
నొంది వహించు వేదోక్తాభిధానముల్, మఱియుఁ బెక్కులు వానిమహిమ వేద

ఆ. వేత్తలైనవారు వివరించి యన్యోన్య,బోధకత్వమునఁ బ్రభూతసౌఖ్యు
లగుచు సంతతము శివారామతానిరూ,ఢాత్ములై చరింతు రధిపముఖ్య. 400

క. ఈ నామనిర్వచనములు, మానవుఁడు పఠించినను సమాహితమతియై
వీనుల నించిన సౌఖ్యము, నానందము నిందు నందు నతనికిఁ గల్గున్. 401

వ. అని చెప్పి మఱియును. 402

క. వ్యాసమహాముని లోకహి,తాసక్తిని శివునివిషయమై పద్యముగాఁ
జేసె నుపస్థాన మొకటి, యా సమధికపుణ్యవాక్ప్రయము విను మధిపా. 403

సీ. సర్వజగన్నిత్యసాక్షి లోకైకను,భావహమూర్తి నిరామయుండు
బ్రథమభూతములకుఁ బ్రథమతమంబును,దాత్తంబు నైనభూతంబు శివుఁడు
దనముఖంబున నగ్ని జనియించె దను సభ, క్తికసమారాధనసత్క్రతుల నియతిఁ
బాటించువారికి భవమోచనంబుగా, వించువేడుక మది నించువాఁడు

తే. విశతచతురాత్మకత్వవిశ్వసృతి వహించి, కరుణం దత్తత్వదస్థిరాత్మకలనకల్య
లగుననపర్యాయకతులకు నకరమ్యవిధంబు, నీడ్యపదవుల నొసఁగుమహాత్మ్యారుండు. 404

తే. ఈ యుపస్థాన మచలితస్వహృదయవృత్తి
నరుఁడు శివలింగ సన్నిధానమున వాఙ్ని
రూఢముగఁ జేసి యాయురారోగ్యసకల
కామ్యవైభవైశ్వర్యములఁ గలిగి నెగడు. 405

భీష్ముఁడు ధర్మజునకు ధర్మసూక్ష్మప్రకారంబు సెప్పుట.

వ. అనిన విని యత్యంతసంతోషంబు నొంది కుంతీతనయాగ్రజుండు శాంతనవునితో ధర్మంబులు బహుప్రకారంబులు గలవు పరమానుష్ఠేయం బగు ప్రకారం బెయ్యది దాని నెఱింగింపవే యనుటయు సజ్జనపతికి జాహ్నవీనందనుం డి ట్లనియె. 406

ఆ. ధర్మములకు సంజ్ఞ తద్వేదులగు మహాత్ములు దగంగఁ జెప్పెదరు నరేంద్ర
వినుము కాలపాకమున నది యన్యథాత్వంబు గలిగి యవిశదత్వ మొందు. 407

వ. ఎట్లంటేని. 408

క. అనఘ యధర్మము ధర్మం, బను మతిఁ బుట్టించుఁ దృణసమావృతకూపప్ర
చ్ఛన్నతలము చందమునఁ దోఁ, చిన సూక్ష్మంబులె సూక్ష్మరుచిత్తత లేదుగా. 409

క. తప్పక కాన్పఁగ లేదిం, జెప్పెడువారలును దద్వివేకము దప్పం
జెప్పఁగ ధర్మంబు తెరువు, దప్పనది క్రియాపరులకు దైన్యము దెచ్చున్. 410

వ. కావున ధర్మంబు సూక్ష్మప్రకారంబు. 411

క. వ్రతముఁ బరిత్యాగముఁ గల, మతిమంతుల నడుగు లోభకామదమోహసమా
వృతబుద్ధులు గానిసమం, చితచరితులవలనఁ దెలియు శీలనిరూఢా. 412

క. కామార్థంబులు మోహాహ్లాదామలకృత్యంబు లని యెఱఁగని ధర్మ
స్తోమమునఁ దగులు జనములు, మేలుగ నెఱిఁగికొనుము సిద్ధవివేకా. 413

తే. అనఘ యుంచితస్వాధ్యాయయజ్ఞమునను యజ్ఞ
మునసమాచారమున నిష్ఠ పూనుఁగుపడక
యుండు నెవ్వారలకు వారి లోని నడవు
నదియ కనుము ధర్మము సూక్ష్మపదవి గాఁగ. 414

క. అన విని యుధిష్ఠిరుఁడు న్యాయమున మిప్పుడు మీరు సెప్పినమాటల సందే
హానిరూఢ మయ్యె ధర్మము, గనికొనవలయుటకు బహుముఖత్వము కల్మిన్. 415

క. పారంబు లేని ధర్మా, చారంబున మునుఁగు మాదృశక్షుద్రులకుం
దీరం బిట్టిది యని తెలి, వారఁ భవాదృశుల తగుదు ధర్మిలి చెప్పన్. 416

తే. ఆగమోక్తవిధంబుఁ బ్రత్యక్షమును సమాచరణముఁ బృథగ్విధకార్యాకులములు
ధర్మసూక్ష్మత యమ్మూఁటఁ దథ్య మిట్టి, దనఁగ రా దియ్యది ట్లున్నదికయుఁ నఘచరిత.

వ. అనిన నాపగేయుండు కౌంతేయాగ్రజుతో నిట్లనియె. 418

క. ఇది మూఁడు దెఱంగులు ధర్మువునూత్మ్మత నిశ్చయింప ॥ ముఖ్యపదంబుల్
దివిరికొని యివియ చూచుట, యవనీశ్వర పూర్వమునులయందుఁ గలుగుట గా.

క. అనుమానింపకు మంధుండును నిశ్చంకాత్ముఁడును జడుండును బోలెన్
జననాథ యేను బల్కెడ, విని దృఢముగ నూఁదు మింక ॥ వేఁచును నేలా. 420

క. విమలాత్మ యహింసయు దానము సత్యముఁ గ్రోధవర్జనంబును విను ము
త్తమధర్మ రాశి యిది ధర్మమునపరమసీమ దీని ॥ మరవుము మదికిన్. 421

తే. బ్రాహ్మణారాధనమునఁదక్కల్పుఁడవగుము, తక్కు మొందువిచారముల్ ॥ ధర్మపుత్త్ర
యనిన మానస మానంద ॥ మొంద నాతఁ, డతని కతిభక్తి వందనం ॥ బాచరించె.

వ. ఎవ్వరు ధర్మంబునెడ నసూయ సేయుదు రెవ్వరు దానిని నుపాసింతు రెఱింగింపు
వారి వారిపొందుగతులను వినవలతుం జెప్పు మనిన ధర్మాత్మకుఁ బురుషో త్తమునకు న
ప్పురుషస త్తముఁ డి ట్లనియె. 423

సీ. వినుము రజస్తమోవికృతులఁ దగిలిన, మానసంబులు గల ॥ మానవులకుఁ
గలుగు ధర్మద్వేషకలనంబు వారలు, నరకవాసార్హులు ॥ ధరణినాథ
సత్త్వపరాత్ములు ॥ సతతంబు ధర్మ ము,పాసింతు రూర్ధ్వలో ॥ కాధివాస
మునకు వారర్హులు ॥ మునుమును పుట్టిన, సుతుఁడు ధర్మము పద్మ ॥ జునకు దాని

తే. నాకసంపద సుమతు లుపార్జితగ ను,పాసనము సేయుదురు లియ్య ॥ పంటిపరువ
మాదరించి తదుపచార ॥ మాచరించు, వెరవు గలయట్టిజనములు ॥ విధము దోఁప.

వ. అననం గౌంతేయాగ్రజుండు శాంతనవుతోడ సాధులు నసాధులునన నెట్టివారు
సెప్పు మనుటయు నమ్మహాత్ముం డి ట్లనియె. 425

భీష్ముండు ధర్మజునకు సాధ్వసాధుజనుల నిరూపించి చెప్పుట.

సీ. తమయుంత నెఱుఁగరు ॥ ధర్మంబు సదుపదే,శమునను గాన ర ॥ సాధుజనులు
ధర్మబోధం బివి ॥ ధంబులు రెంటను, గలిగెడువారు సా ॥ ధులు తదీయ
చరితంబు విను పిదు ॥ పరు మలమూత్రంబు, లర్హంబు గానిచో ॥ నధిప యతిథి
భోజనశిష్టాన్న ॥ భోజులు దెరు విచ్చి, తగినవారలకుఁ బ్ర ॥ దక్షిణముగ

తే. సరుగుదురు నడుపుదురు స ॥ త్యార్జవములు
శరణు సొచ్చినఁ గాతురు ॥ సురలతుష్టి
పరులు నిజదారతృప్తులు ॥ గురువినీతు
లమరహృదయులు సంతోష ॥ మారఁ గలరు. 426

వ. అని వెండియు. 427

తే. సాధు లింద్రియ విభ్రాంతి ॥ సంహరింతు
రఘము దెలిసి ప్రాయశ్చి త్త ॥ మాచరింతు
రప్రకాశంబుగా ధర్మ ॥ మాచరింతు

రఖిలభూతదయాళుత్వ ॥ మార్గం గలరు. 428

వ. అనిన విని యజాతశత్రుండు శంతనుపుత్త్రుతో నప్రయత్నులకు నర్థంబు సిద్ధించుట గలుగు ధర్మపరులను నీతివిదులునై నబలవంతులుబహుమార్గంబు లగునదుపాయంబుల నర్థంబు లాకాంక్షింప సిద్ధింప కుండెడుఁ గొందఱకుసిద్ధించియు నవి భోగంబుల కుపభోగ్యంబులుగా కుండు శిశువులు పెద్ద లేకయుం గొన్ని చిత్తంబులందు విద్య లలవడ శిక్షితు లయ్యును నిర్విద్యు లగుటయునుం గలుగుఁ దెవుళ్ళు నోసియుం బోట్లం బడియును గొందఱు చావరు పూరిపుడుక దాఁకి బలాధికులు నచ్చుట చూచెద మిట్లు గాఁగతం బేమి తెలియంగింపవే యనుటయు నమ్మహీపతి కమ్మహాత్ముం డిట్లనియె. 429

శుభాశుభంబులు పూర్వజన్మకృతపుణ్యపాపంబులచేఁ గల్గు నని చెప్పుట.

క. మొలవం బెట్టనియట్టిది, మొలచునె తొలుమేనిదానకర్మముల నానార్థం
బులు సిద్ధించుఁ బ్రయత్నంబులు లేకయు నింతె నిజము ॥ భూపవరేణ్యా. 430

తే. అలఘుతపములు దొలుమేనఁ ॥ గలిగెనేని
వెదకికొని వచ్చు నన్నరు ॥ విపులభోగ
ములు పురాకృతవృద్ధసేవల ఫలించు
బుద్ధికలిమియు విద్యలఁ ॥ బొలుచుటయును. 431

క. తొలుమేన నహింసారుచి, గలిగిన దీర్ఘాయు వొందుఁ ॥ గారణభూతం
బులు భూవర యివి యీ గుణములు లేమియు కీడులకును ॥ మూలం బరయన్.

వ. కావున. 433

తే. వినుము దానంబుఁ దపమును ॥ వృద్ధసేవ
నము నహింసయు నియతకృత్యములు సర్వ
జనుల కిమ్మహాగుణములు ॥ మనమునందు
దృఢముగా నిల్పి నడవుము ॥ ధీరవర్య. 434

వ. అని యుపదేశించి యాపగానందనుండు వెండియుఁ బాండవాగ్రజున కిట్లనియె.

సీ. ఎప్పుడు ధర్మంబునెడ నాదరము గల, వానికిఁ గాలంబు ॥ దాన యిచ్చు
ధర్మతత్త్వప్రబోధముఁ బరిస్ఫుటముగాఁ, గావున సుస్థిరభావశుద్ధి
సహితతపశ్శ్రుతస్నానదానజపంబులను దేవతాపూజలను నమోఘ
కాలుఁడై వర్తింపఁగా ధర్మయోగంబు, సమకూరు ధర్మంబు ॥ సాధనత్వ

తే. మొంది చేయించుకొని చెప్పఁ ॥ బొందు నిర్మ
లాత్మకుండు సంసారపారాత్మకంబు
నత్యమజరామరము బోధనిత్య మచ్యు
తము పరానంద మగునప్పదంబు ననఘ. 436

అని నిర్దేశించి మఱియును. 437

తే. కను వెలుంగు వేదవ్యాసమునివరుండు
సధిప కృష్ణుండు నీకుఁ బరాయణంబు
చింత దిగ్గ్రావి పాలింపు - శాంతవృత్తిఁ
బ్రజల సర్వంబునందును - విజయి వగుము. 438

క. అని యిట్లుపదేశించిన, యనిమిషతటినీతనూజు నవరుల వచనముల్
విని మోదమలరఁగఁ బులకలు, తనువున జాదుకొన నొప్పె ధర్మజుఁ డధిపా. 439

సీ. అపుడు వీక్షించి సత్యవతీసుతుండు శం,తనుసంతసునితోడ - ధర్మజుండు
దేలి పొందె భవదుపదేశామృతంబున; ననుజాలుఁ గృష్ణుంకు - నాప్తసకల
రాజన్యులును ధృతరాష్ట్రుండుఁ దానును, దగ నిన్నుపాసించి - దయకుఁ బాత్ర
మయ్యెవీడ్కొలుపుమిత్యవనీశుఁ దలితోడఁ, గ్రమ్మఱ నిలఁడు నీకడకు వచ్చె

ఆ. వాఁడు గాక యనిన - వాత్సల్యమునవార్ద్రి,మైనచూడ్కి సమ్మదహాత్మఁ దలనిఁ
జూచి పురికిఁ జనుము - శుభపరంపరలకు, భాజనంబ వగుము రాజముఖ్య. 440

భీష్ముండు ధర్మజు నాజ్ఞాపించి కరిపురంబునకుఁ బంపుట,

వ. అని యనుజ్ఞ సేసి వెండియు. 441

సీ. నీబుద్ధి ధర్మైకనిష్ఠ గావుతమ స,మగ్రదక్షిణాబహుక్రతుయజ్ఞములఁ బ్ర
యూతిచందమున శ్రద్ధాన్వితంబుగఁ జేయు, కాంవధర్మంబుగఁ - బ్రజ్ఞ తిరంబ
నము లాచరింపు చుష్టములును దెలులును, బండినవృత్తంబుఁ - బుత్రకులము
లెట్టట్ల నిన్నాశ్రయించి సుఖంచువా, రర్థునియాత్ర రాజ్యగొనము పాడ్చు

తే. టరసికొని యుండి నాకడ - కరుగు దెమ్ము
పొమ్ము తల్లియుఁ దమ్ములు - భూవరుండు
నీవు సుఖుల రై యుండుఁడు - నృపవరేణ్య
యనుడు నానంద మొంది ధర్మాత్మజుండు. 442

వ. అట్లు చేయువాఁడ నని సవినయంబుగాఁ బలికి దేవవ్రతునకు దండప్రణామం
బాచరించి యిట్లు వీడుకొని. 443

క. జను లనుపఁగఁ గృష్ణాదులు, జనుదేరఁగఁ దోడఁ బురికిఁ - జనిరాజుముదితుఁ డై
జనులెదురుకొనఁగఁ బుణ్యాం,గనలును విప్రులును వచ్చి - కనఁ దివనతోడన్. 444

క. సేసలు సల్లఁగ మహిమో,ద్భాసితుఁడై యిట్లు వోయి - ధర్మజుఁడు నిజా
వాసంబు సొచ్చి గాంధా,రీసంభావన యొనర్చి - ప్రియము దలిర్పన్. 445

ఆ. తల్లి కౌఁగి ముదము - ద్రౌపది గొనరించి, సకలపౌరజనుల - జానపదుల
నెలమి రొంలయ వీడుకొలిపి భూసురులకు, దానాదుల సమ్మదం బొనర్చి. 446

వ. విపతు లైనసతులకు సమ్యగర్థనంబు లొసంగి ధృతరాష్ట్రునిం బ్రభూతపూజా
కరణంబునం బరితుష్టునిం జేసి.

తే. తమ్ములును గృష్ణుండును బ్రమోదమునఁ దేల

సమ్మదహితాత్ముఁ డపుడు రాజ్యాభిషేక
మంగళము నొందినట్లు నెమ్మది దలంచి
గట్టి మైనయూటలు పెంపుఁ గాంచి పొలిచె. 448

వ. అట్లు శోభిల్లి వారల నుచితప్రకారసమాచరణంబులకుం జన నియోగించి యభ్యంతరమందిరంబున కరిగిన యజాతశత్రుండు [1]సమ్యగంగీకృతసామ్రాజ్యుండయి జనసంపూజ్యం బగుచరితంబున సంప్రవర్తిల్లుచుండఁ బంచాశద్వాసరానంతరంబ వాసరపతి యుత్తరాయణగతుం డగుటయు. 449

ధర్మజుఁడు కృష్ణాదులఁ దోడ్కొని భీష్మునియొద్దకుం బోవుట.

సీ. అక్రూరవేశ్వరుం డప్పుడు గదలి గాంధారిని ధృతరాష్ట్రధరణివిభుని
గొంతిని ముందిడుకొని కృష్ణుఁ దమ్ములఁ, దనతమ్ములను విదురుని యుయుత్సు
సంజయులను గృపాచార్య ధౌమ్యుల మంత్రికోవిదులఁ గుయాజకులను దోడఁ
గొని శస్త్రచందనాగురుపుష్పఫలఘృత, కుండముల్ వట్టించుకొని యనేక
తే. రత్నములుఁ గాంచనంబుఁ దోరఁగ నగ్ని
యంచితంబుగఁ దా సంధుకటించి యోగ్య
జనసమానీతముగఁ జేసి సకలపరిజ
నంబుఁ గొల్వ మహావిభవంబు మెఱయ. 450

వ. చని భీష్మునివీరశయనస్థానంబున కనతి దూరంబునం దేరు డిగ్గినం గృష్ణాదులు ను రథావతరణంబులు సేసిరి తానును వారును బారాశర్యనారద దేవల ప్రముఖమహా సంయమిసముపాస్యమానుం డగునమ్మాననీయుం జేర నరిగి మునిజనంబులచే వీక్షితుం డయి తదభినందితుం డగుచు నా ధర్మనందనుం డయ్యమరనదీనందనునకు నభివందనం బాచరించి సమీచీనధ్యానతత్పరుం డైనయద్దేవవ్రతు నుద్దేశించి. 451

తే. అనఘ వచ్చితి ధర్మనందనుఁడఁ బ్రణతి, యాచరించెద నాపలు కవధరింప
నవసరం బేని వినుసమయంబు వార్చి, యగ్ని మొదలుగఁ దేఁ దగునట్టివాని. 452

సీ. తెచ్చితి ఋత్విజుల్ వచ్చిరి హరియు నీ, తనయుఁడు ధృతరాష్ట్రుఁడును సమస్త
బంధులుఁ గలమహీపతులు విప్రులుఁ బౌర, జనులు నేతెంచిరి సదయహృదయ
వీరిఁ జూడుము కనువిచ్చి నావుడు నమ్మ, హాత్ముఁ డందఱఁ జూచి యా నృపాలు
కేలు దెమల్చుచు మేలు సేసితి దైవ, యోగంబు గాదె నీ వొదవుటరయ
ఆ. మనుజనాథ [2]మాఘమాసంబు శుక్లప, క్షంబు నామనమున సంప్రమోద
మావహిల్లఁ జేసె నని యభినందించి, యతని కధికహర్ష మావహించె. 453

వ. తదనంతరంబ ధృతరాష్ట్రునితో నిట్లనియె. 454

తే. వేదశాస్త్రపరిజ్ఞానవృద్ధసేవ, నములు గలిగి యశేషధర్మములు నెఱిఁగి

1. గ. సమ్యగంగీకృత. 2. ఖ. పుణ్య ♦ మాసంబు.

వ్యాసమునిపతి దేవరహస్య మర్థిఁ, జెప్ప విని నిమ్మళంకలఁ గొప్పి లనఘ. 455

క. కావున భవితవ్యములకు నీ, వడలఁగవలదు పాండు నృపపుత్త్రులు స
ద్భావమ్మునఁ జూడ నేర్చిన, భూవర తగ నీవు గన్న పుత్త్రులు గారే. 456

క. వీరిం బరిపాలింపుము, వీరలు శుశ్రూషఁ జిత్తవృత్తి ముదమునం
గూరఁగ ధర్మసుతుని పైఁ, గారుణ్యము గలిగి పనులు గలవుము నెమ్మిన్. 457

తే. ఏ నెఱుంగుదు నీవేఁడు నీయెడఁ బ్రియంబు
భక్తియును గల్గి యకుటిలభావుఁ డగుట
నీవు వత్సలత్వమున నీనృపతిఁ బంచి
పనులు గొనుము కౌరవకులభారధుర్య. 458

క. విను నీతనయులు దుర్యోధనాదు లవినీతిపరు లధర్మజ్ఞులు క్రో
ధను లతిలుబ్ధులు వారల, మనమున నిడి వగవవలదు మనుజాధీశా. 459

వ. అని పలికి కృష్ణు నాలోకించి. 460

భీష్ముఁడు శరీరంబు విడుచుటకు శ్రీకృష్ణుననుజ్ఞ గొనుట.

తే. దేవదేవ జీవాత్మక దేవవంద్య, శంఖచక్రగదాపద్మచారుహస్త
వాసుదేవ త్రివిక్రమ వరద పరమ, పురుష ప్రణతి యొనర్చెదఁ గరుణఁ జూడు.

వ. అనుచు నమస్కరించి. 462

ఆ. బలము నీవ నాకు భక్తుండ నీయెడ, లాలు బిడ లేని యుట్టివాఁడఁ
గావు నన్ను నధికకారుణ్యమున నిమ్మ, నుజ్ఞఁ గమలదళసమానోజ్జ్వలనయన. 463

వ. అని వెండియు. 464

సీ. మాధవ పాండుకుమారవర్గమునకు, గతి నీవ రక్షింపు కరుణ మెఱయ
దుర్బుద్ధి యైనయాదుర్యోధనునితోడఁ, గృష్ణుఁ డెక్కడ నుండు గెలువు గలుగు
నక్కడ కంటి నేఁ బెక్కుమాఱులు నట్లు, సెప్పెఁగా నాపంపు సేయ కతఁడు
దమవారి నెల్లను సమయించి తానును, సమసె నిన్నెఱుఁగుదు సమితమహిమ

తే. నరుఁడు నారాయణుఁడు ననుపరమమునులు
జగము రక్షించుటకుఁ గేల్వజన్మ మొంది
సంచరించెద రని పరాశరసుతుండు
నారదుండును జెప్పిరి నాకుఁ దొల్లి. 465

వ. అనిన విని వాసుదేవుండు దేవవ్రతువదనం బత్యాదరంబున నాలోకించి. 466

ఆ. కీడు వొకప్పు లేదు కృతపుణ్యుఁడవు తండ్రివలనిభక్తిపెంపు గలవు దానఁ
గాదె బంటుఁబోలె గాంగేయ మృత్యువు, నీవశమున నిలిచె నిర్భరముగ. 467

భీష్ముఁడు శరీరంబు విడిచి నాకలోకగతుం డగుట.

వ. నీకు నే ననుజ్ఞ యిచ్చితి వసువులం బొందు మనినం బరమానందంబునం బొంది
పాండునందనులను ధృతరాష్ట్రునిం దక్కటివారలనుం గనుంగొని [illegible]

ననుజ్ఞాతుండనగుదు నని పలికి యందఱం గౌఁగిలించుకొని యానృశంస్యంబును
సత్యంబును నిత్యంబులుగాఁ బాటించి బ్రతుకుఁ డని చెప్పి తాను దొల్లి రాజుల
గెల్చి తెచ్చినధనంబులు విప్రజనంబుల కిచ్చి ధర్మతనయుం జూచి యెల్లబ్రాహ్మ
ణులునుం బూజనీయులు ఋత్విజులు నాచార్యులు వృద్ధులు విశేషించి పూజింప
వలయువా రని నిర్దేశించి యుదార కుండి ధారణానుక్రమంబున సమాహితాత్ముం
డయి వాయువుల సన్నిరుద్ధంబు సేసిన నవి యూర్ధ్వగతం గైకొనియె నమ్మహాత్ముం
డవయవంబులం బ్రాణంబులు వాసికొనుచు వచ్చున య్యైచోట్లు శల్యరహితంబు
లగు చుండ న ట్లగుటం గాంచి కృష్ణాదు లగునఖిలజనంబులు నాశ్చర్యభరితాంతః
కరణు లగుచుం గీర్తించి రా సంయమచతురునిచే సర్వాయతనసన్నిరుద్ధం బై
యాత్మ మూర్ధంబు భేదించి మహోల్కాకారంబున నాకపంబున కెగసి కొంత ద
వ్వరిగి యంత నంతర్హితం బయ్యె నప్పుడు పుష్పవృష్టి గురిసె. దేవదుందుభులు
మొరసె నంబరంబున సిద్ధులు సాధ్యులుం బొగడుచుం బ్రమోదంబు నొందిరిట్లు
దేవవ్రతుండు దివంబునకుం జనుటయు. 468

—ం. పరలోకగతుం డైనభీష్మునకు నగ్ని సంస్కారంబు సేయుట. ం—

సీ. ధర్మపుత్త్రుండును దమ్ములు విదురయు, యుయుత్సులు నగురుకాష్ఠోత్కరంబుఁ
జందనదారుసంచయమును గొని సమ, స్థలి సమంచితచితి యలఘుభంగి
విరచించి రయ్యధిక్షితీశుఁడును ధృతరాష్ట్రుఁడును నమ్మరున్నదీతనయుపుణ్య
గాత్రంబు సుస్నాన కలితంబు విహితాను, లేపంబుఁ బుష్పదామోపశోభి
తే. తంబును త్తవక్షౌమావృతంబునుజ్జ్వ, లాభరణభూషితంబుఁ గా నధికభక్తిఁ
జేసి రప్పుడు సామంబు సెలఁగ హోమ, మాచరించిరి యాజకు లగ్నియులర.
క. కనకములు మణులు భూసుర, జనసంఘంబున కజాతశత్రుఁడు శ్రద్ధా
వినయప్రీతియుతంబుగ, ననేకములు వేడ్కఁ నొసఁగె నవహితమతియై. 470
వ. తదనంతరంబ. 471
క. తలదిక్కు గవలుఁ బాదం, బుల దెస ధృతరాష్ట్రపాండుభూపాగ్రతనూ
జులుఁ బట్టి యధిక విభవో, జ్జ్వల మగు పాడెపయి నిడిరి శవరత్నంబున్. 472
వ. అమ్మెయి నన్నలువురును వహించిరి భీమసేనార్జునులు ధవళచామరంబు లిడిరి
యుయుత్సుం డుత్తమచ్ఛత్త్రంబు వట్టె వృద్ధ లగు కౌరవస్త్రీలాలవట్టంబులు
వట్టిరి ధౌమ్యుండు క్రియాకలాపంబు నడపి నట్లు సోవ నిప్పు దేవవ్రతుని
దేహంబు శ్రౌతాగ్ని కాహుతి సేసి బహుకుండంబుల త్రిఘృతంబు ప్రయో
గించి ప్రజ్వాలింపఁ జేసి రవ్విధంబున బిత్రుమేధంబు విధవనుహితంబును ఏక
విహితంబునుం గా ననుష్ఠించి యుకౌరవు లపసవ్యంబుగాఁ దిరిగి కృష్ణ
ద్వైపాయన నారద దేవలప్రభృతు లనుగమింప భాగిరథికిం జని సర్వజన

భాస్యానమితంబుగా నగ్గాంగేయునకుఁ దిలోదక ప్రదానంబు లాచరించిరి యట్టి సమయంబున. 473

పుత్రశోకాతుర యైనగంగాదేవి కృష్ణాదులం గనుంగొని దుఃఖించుట.

సీ. ఉదకంబులందుండి ♦ యుత్థితయై శోక, విహ్వలత్వంబున ♦ వికలగమన
యగుచు నెమ్మోముపై ♦ నశ్రులు, గ్రమ్మఁగాఁ, జనుదెంచి కౌరవసదసి తిరుగుదుర
నిలిచి భాగీరథి యలఘుండు దనకొడు, కిలఁ బరికింపఁగా ♦ నెట్టిభంగి
వాఁ డుర్వి జరితంబు లేపోడిమి మీకెల్ల, నెఱుఁగుదు రైనను ♦ నేను గొంత

తే. సెప్ప వినుఁడు దృఢవ్రతశీలుఁ డమల,బుద్ధి రాజవృత్తాఢ్యుఁ డుగ్రభూరికృపుఁడు
కార్యసంవేది పితృభక్తిధుర్యుఁ డార్య,సమ్మతుండు విద్యాపరీక్షకుఁ డమనుజుండు. 474

తే. కాశిరాజకన్యకలకుఁ ♦ గాఁ జెనంగి, వానిచే గాసి యైరి భూమిపతులు పలువు
రంబకై పూని వాసమహాబలంబు, జామదగ్న్యుండుఁ జెరలు పఱ్చ జాలక రిగె. 475

వ. అని విలాపంబు సేసి వెండియు. 476

తే. అంతవాఁడు శిఖండిచే ♦ నట్టు లగుట
గనియుఁ జెక్కులు పఱియలు ♦ గాక యునికి
కఠినఁ జేసి వజ్రమయంబు ♦ గాఁగ నొప్పు
నని తలంచెద నాడెంద ♦ మన్నలార. 477

వ. అని వగచిన గంగాదేవికి దేవకీనందనుం డిట్లనియె. 578

పుత్రమరణదుఃఖిత యగుగంగను కృష్ణద్వైపాయనుం డూఱడించుట.

తే. నీవు శోకంబు దక్కుము ♦ నీసుతుండు, పరమగతి నొందె శాపసంప్రాప్తిఁ జేసి
వసువు మర్త్యుఁడై వర్తించె నసదృశప్ర, భావుఁ డాతఁడు వగ పేల ♦ దేవి నీకు.

ఉ. అతని శిఖండి యేల యమరాధిపుఁడున్ సమయింపఁ జాలునే
యతఁడు నిజేచ్ఛఁ జేసి నరుశనంచితదివ్యశరంబు లంగనం
తతములు సేసి పాన్పుగ సుఖస్థితి మృత్యువు మాన్చి యుండి కీ
ర్త్యతిశయ మొందెఁ దా వలచినప్పుడు పోయె విషాద మేటికిన్. 480

వ. అని యూఱడిల్లం బలికెఁ గృష్ణద్వైపాయనమునివరుండును బహుమానకరణీయతత్పర వచనంబుల నజ్జాహ్నవీదేవికి నానందం బాపాదించె నంత నంతరంబ యాత్మీయసలిల స్వాంగత్వంబు నొందు నమ్మందాకినిచేతం గృష్ణాదులు నభిజ్ఞులు జనపతులును నను జ్ఞాతులు నాశీర్వాద ప్రీతులు నై మునులునుం దోడ నడవ నది వెడలి రని యిట్లు భీష్మునివృత్తాంతంబు వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పిన నప్పుడమిఱేఁ డిత్తెఱంగున నత్తాతకు వలయువిధానం బాచరించి చరితార్థుం డైనయప్పార్థివ ముఖ్యుండు మఱి యెట్టిచందంబునం బ్రవర్తించె మునీంద్రా యెఱింగింపవే యని యడుగుటయు. 481

చ. సకరుణదివ్యచిత్త కురుశాంతమహత్త్వవిధానవిత్త ని

స్వీకృతవిలాసహృద్య శ్రుతిశ్రవిస్తరవిస్ఫురద్వైశవేద్య పా
వకబహుళధ్వనాము పరిశ్రవర్ధనసంతుష్టయదూరధామ వి
శ్వాకలితతోషణా సుభగశ్వసాత్త్వవర్తేయువచోవిభూషణా. 482

క. [1]సత్త్వవ్యాచరణ శమవ, ద్వాత్సల్యాభరణ ధర్మరతపూర్వోద్ధరణా
హృత్సంగతభక్తికదురి, తోత్సారణధుర్యదృఢశ్రితమూలాభిసరణా. 483

మాలిని. స్మయవిరహితపూజ్యా క మంత్ర గీతాధిరాజ్యా
నయనహిమగుసూర్యా క నైష్ఠికశ్రేమధుర్యా
దమితభువనరక్షా క [2]శాంతిసంపద్యశాక్షా
నియమినికటవర్తీ క నిష్కళానందమూర్తీ. 484

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతంబయిన శ్రీమహాభారతంబున ననుశాసనికపర్వంబునందు సర్వంబును బంచమాశ్వాసము. 485

శ్రీమదాంధ్రమహాభారతము నందలి
అనుశాసనికపర్వము సమాప్తము.



1. క. సత్త్వవ్యాచరణ సముద్వాత్సల్యా. 2. గ. శాంతి-సంవిత్సమక్షా - జ. శాంతి సంపత్సమక్షా - ట. శాంతి సిద్ధ్యత్సిరక్షా.

శ్రీ

హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## అశ్వమేధపర్వము, ప్రథమాశ్వాసము



నామక పార్వత్యభి
ధానక మాధుర్యధుర్యకత్న్యాశ్లేషో
పాసితనిరంతరసాం
ద్రానందప్లావితాత్మ హరిహరనాథా. 1

శోకమగ్నుం డగు ధర్మజుని గృష్ణాదులు ప్రబోధించుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు సురనదీనందనున కుదక కర్మం బాచరించి ధర్మనందనుండు ధృతరాష్ట్రపురస్సరంబుగ భాగీరథి యుత్తరించి తత్తీరదేశంబున. 2

ఉ. ఉమ్మలికంబునం బొగులు నుల్లముతోఁ బొరి లోచనంబులం
గ్రమ్మఁగ నశ్రువారి ధృతిఁ గారవ మేద మహోగ్ర బాణపా
తమ్మున మ్రొగ్గునేనుఁగువిధమ్మున నేలకు వ్రాలఁ బట్టి వే
గమ్మ వృకోదరుండు మురశత్రుసమ్మరుపంపున నమ్మహీశ్వరున్. 3

తే. పట్టి యతఁడు దనదుకైపెచీర యాస్తరణంబు సేసి భూస్థలంబునందుఁ
బెట్టె మానసములు పెద్దయు నలఁదూరి, యర్జునాదిసోదరాలి వాఁడి వె. 4

వ. కృష్ణుం డుచితవచనంబుల నాభూపాలుం బ్రబోధించె నప్పుడు ధృతరాష్ట్రుండు
గదిసి కూర్చుండి యక్కురుపతితోడ. 5

సీ. క్షత్త్రధర్మంబునఁ గైకొంటి మేదిని, యుమ్మలికింపఁగ నేమి వత్స
యనుజవర్గము నీవు ననుభవింపుము శోక, కాలంబు గా దిది యేల వగవ
నని పల్కె విదురహితాలాపములు దన, వినకుండుటయు సుయోధనునికీడు
నద్దుష్టబుద్ధిఁ దా ననుసరింపఁగ ధర్మ, మెడలినఁ దత్ఫలమున నింత వుట్టె

ఆ. పనియుఁ దెలియనాడ్తెలనకు గాంధారికి, వగలు మిగులఁ బొగులఁ గవలయుటయును
నుగ్గడించి మమ్ము - నొంటివగ్గులఁ గనం, గొనుము వంత దీర్పు - మనియె నధిప.

వ. అనిన విని యూరకున్నం గని శౌరి యక్కౌరవపతితో బంధువులు శోకంబు నొం
దిన మృతకోటులం బరితాపంబు వాటిల్లు నట్లుం గాక భవదీయజ్ఞాతులు సమరం
బున ననివర్తులై యూర్ధ్వలోక వర్తులైరి వారికి శోకింపం బని యేమి శోకిం
చిన వారలు మగిడి వత్తురే యని పలికి వెండియు. 7

క. విన వలయువాని నెల్లను, జననాయక వింటి వీవు - శాంతనవునిచే
వనట యుడుగు మిఁక దుర్మతి, యనుబోలెను వగచు చుండు - టుచితమె నీకున్.

వ. వ్యాసనారదాదులును నిన్ను బోధించిరి వారివాక్యంబు లూహింపుము. 9

చ. అతులితదక్షిణాన్వితమఖాధ్వరకర్తవు గమ్ము దేవతా
పితృనివహంబులం గరము ప్రీతియు భక్తియు నుల్లసిల్ల న
ర్చితములు సేయు ముర్విఁ బ్రజ - జేకొని రక్షఘటింపు బంధుసు
స్థితు లొనరింపు మెప్డు నతిథివ్రజపూజ లొనర్పు భూవరా. 10

వ. అనిన విని ధర్మనందనుండు సాత్యవతేయు మొగంబు గనుంగొని దేవా భవదీయ
దయాప్రేమంబులు నాపై నెప్పుడు నత్యంతగాఢంబులై యుండు నన్నుఁ బెక్కు-
భంగుల రక్షించితి రిటమీఁద వనంబున కరుగ ననుజ్ఞ యిచ్చుట నాకుం బ్రియం
బగుఁ గనియ ట్లునుం బితామహాకర్ణులం జంపినక్రూరకర్మునకు శాంతి యెట్లు
గలుగు నమ్మహాకల్మషం బేమిటం బాయు నయ్యనుష్ఠానంబు విధియింపుం డని
పలుకుటయు నా ధర్మధుర్యునకుఁ బారాశర్యుం డి ట్లనియె. 11

సీ. నిష్ఠించి యిబ్భంగి - నీ వేమి సెప్పిన, వాక్యంబు లెల్లను - వఱదఁ గలసి
పోయెనే నీ దగుబుద్ధి యిం తొప్పదో, కాక మర్త్యుండు గాఁడు - కర్త యాశ్వ
రునినియోగమున మేకలును గీడు నొనరించుఁ, గాన నీమదిఁ బాపకర్మశంక
గలిగెనేనియును యాగముల దానంబుల, నది పాసిపోవ రాదె - యశ్వమేధ

తే. మధికదక్షిణాన్వితముగ - సవఘు చేయు
మంతతో భవదీయచిత్తానుతాప
మంతయును బాయు రఘురాముననట్లుఁ బూరు
భరతులునుబోలె దానసత్త్వయుతుఁడ వగుము. 12

చ. అన విని యమ్మునీశ్వరున - కా నృపుఁ డి ట్లను నశ్వమేధయా
గనిరతి భూమిపాలు గతకల్మషుఁ జేయఁగఁ జాలు నాఁగ ము
న్నును విడ వింటి సజ్జనముఖోజ్ఞవచోమహాసీయ నీవు సె
ప్పినపలు కూఁది యాక్రతువు - ప్రీతి నొనర్చెద నెల్లభంగులన్. 13

వ. అని పలికి మునీంద్రా యుక్క-విన్నపం బవధానంబుతో నవధరింపు మశ్వమేధం
బధికదక్షిణాన్వితంబు గావలయు ననుట దెల్లంబుగా మీరు నాన తిచ్చితిరి నా

కర్థంబు లేదు కయ్యంబున మృతులైన నరపతుల సుతులు శిశువులును శోకా
క్రాంతులునుం గావున వారలవలన ధనాహరణం బశక్యంబు కరణీయంబు గాదు దుర్గ
తంబుగా నైనది దొల్లి దుర్యోధనుండు యాతోఁడియాసునం జేసి పెక్కండ్రు
రాజులను ముక్కడిమూకలనుం గూడఁ బెట్టి ధనంబు వ్యయము పెట్టి భూమియు
బండారంబునుం బాడుచేసె నివ్విధంబున నిర్ధనత్వంబు వాటిల్లె ధనార్జనంబునకు
నొండొక వెరవు దొరకొన దిట్టిది కర్తవ్యం బని తెలియకుంగ యున్నవాఁడ మంత్రుల
రై నాకుఁ గార్యం బెఱింగింప వలయు నని ప్రార్థించిన నమ్మహాత్ముండమ్మహీపతిం
బరమాదరంబున నాలోకించి కొండొక విచారించి. 14

సీ. అతఁడు మరుత్తుండు యజ్ఞంబు సేసి మహాధనరాసుల నవనిసురుల
కిచ్చె వారవి గడు నెక్కుడై యుండుటఁ, ద్రవ్వితండంబులు దమగృహముల
విడిగొని పెటుధన మెల్లను నిధియుఁ గా, నిమ్మైన నేలపున నిముచు నుండి
యందఱు నేకవాక్యత దీని నెవ్వరు, గనినను నిది వారిధనమ యనిరి
ఆ. మానవేంద్ర యమ్మహానిధానము దెచ్చి, పలసినట్లు నీవు వ్యయము సేయు
మనిన ధర్మతనయుఁ డతఁ డట్లుపార్జించె సంతతకాంచనము మహాత్మ చేపుము.
కం. అనుటయు నా సత్యవతీతనయుండు మరుత్తుపుణ్యతరచరితంబుఁ
విన గోరుట మే లెంతయు, వినిపించెద నీను లలర వినుము నరేంద్రా. 16
వ. అని పలికి యిట్లనియెఁ గృతయుగంబున దండనీతిప్రవర్తకుం డగుమనువునకుఁ బ్ర
జాని యనుతనయుం డుదయించె నతనికి క్షుతుం డుద్భవించె నాతనికి నిక్ష్వా
కుండు ప్రభవించె నా భూపతికి నూర్వురు సుతు లుదయించి రం దగ్రజుం డగు
వింశునకు వివింశుం డుదయించె నప్పుడమితేనికిం బదియేన్వురు గొడుకులు పుట్టిరి
వారిలోనం బెద్దవాఁ డగుఖనీనేత్రుం డధికబలశౌర్యుండును ఫకార్యపరుండును
నై సోదరులం గలిపికొని నడవక పదునలువురం జెఱిచి సామ్రాజ్యంబుఁ గైకొని
యుండె.

సీ. మంత్రివిద్వేషంబు మాన్యపరాభవంబును బ్రజాపీడనంబులును గలిగె
మొక్కలీఁ డగుటయు ముచ్చిలి మంత్రులాతనిఁ బాపి యతనినందనుని రాజ్య
మునకుఁ బట్టము గట్టికొని రక్కుమారుండు దమయయ్య చేటుచిత్తమునఁ దలఁచి
సచివప్రభృతు లగుసర్వజనంబులు యాత్మల ననురాగ మావహిల్ల
తే. సత్యమును బాడియును నొప్ప నిత్యధర్మపరత వర్తిల్లె నమ్మహీపాలుఁ డుసత
దానతత్పరుఁ డై కలధనము లెల్ల, విప్రులకు నిచ్చి దారిద్ర్యవికలుఁ డయ్యె. 18
క. దానఁ గడు డస్సె నాతని, సేన యరాతు లది యెఱిఁగి చెచ్చెర బలసం
తానముతోడం గైకొని, యా నరపతిఁ జెఱిచి రాతఁ డాపులుఁ దానున్. 19
క. [1]వనమునకు నేఁగె సంయమి,జనములు నచ్చెరువు నొందుచందంబున న

1. చ వనమునకు నేఁగి... చందంబున ను, గ్రంథపాఠ భేదం దప.

జనవిభుఁడు నియతి నట తప, మొనరించి మహాప్రభావ । మొందెఁ గడంకన్. 20

క. అమలమతిఁ గరముఁ గ్రాలఁగ, సమరిచి మానితతపోమహిమయాధికకీ । ర్తి
ధమునఁ గ్రియ యొనరించిన, నమితగుణా చెప్పఁ జిత్ర । మయ్యెను దానన్. 21

వ. ఆకర్ణింపుము. 22

క. భటతురగసామజరథో, త్కటసేనాసముదయములు । బహువిధరుచిసము
త్కటకాంచనరాసులు న, ప్పటిఁ బొడమెం జూడ నక్కజం బగుభంగిన్. 23

వ. ఇట్లు బలంబును ధనంబునుం గల్గుటయును. 24

క. ఆ నరపతి రయమున రిపు, భూనాథులమీఁద నడచి । పోరుల వారిన్
సేనాయుతముగఁ జంపియుఁ, గానలకుం దోలియును బ్రకాశత నొందెన్. 25

క. కరంధమనంబున నొకఁడు, కరంధముఁ డనంగ బరఁగి । గౌరవమునవి
స్ఫురణము విభవము శౌర్యముఁ, గరుణయు ధైర్యంబు వెలయఁగా నిలయేలెన్.

తే. శమము దమమును సత్యశౌచములుఁ గలిగి, సుజనశీలత నశ్వమేధాధ్వరంబు
లంగిరసుఁ డుపదర్శకుం డై నయింపఁ, జేసె నర్చె లోకములు సంప్రీతిఁ బొగడ.

— శ్రీ వేదవ్యాసమునీంద్రుండు ధర్మజునకు మరుత్తునిచరిత్రంబు సెప్పుట. —

క. అతనిమనుమఁడు మరుత్తుం, డతులయశుఁడు విష్ణుసదృశుఁ । డనఁ దగు నోగా
యుతబలుఁడు ధర్మరత్న, స్థితివిదుఁడు సమిద్ధబహుళ । తేజుఁ డధిపా. 28

ఉ. అమ్మనుజేశ్వరుండు విభవాతిశయంబు వెలుంగ నశ్వమే
ధమ్మొనరించుచుండి వివిధస్ఫురితోజ్జ్వలముల్ ప్రదీప్తధా
మమ్ములు సర్వదార్థము లిడం దగుతక్కును గల్గుసిద్ధపా
త్రమ్ములసంఖ్యముల్ పసిఁడిఁ । బ్రస్తుతి కక్కఁ ఘటించె భూవరా. 29

వ. అట్లు సమకట్టి యతండు. 30

చ. హిమగిరిసానుదేశమున । నెక్కుడువైభవముల్లసిల్ల య
జ్ఞము దగఁ జేసి భూమిసురసంఘము లెల్లను దృప్తిఁ బొంద హే
మ మొసఁగెఁ గుప్పఁగూరలు సమగ్రకుతూహలుఁడై కనత్సువ
ర్ణమయగృహక్రియోపకరణప్రకరంబులు నిచ్చె భక్తితోన్. 31

వ. అని చెప్పి యిది మరుత్తునియభిజాత్యంబును దదీయవిత్తవిశేషంబును నెఱిం
గించుట యవ్విత్తం బతనికిఁ దొరకొనిన తెఱంగును నెఱింగించెదఁ దదంచితక్రతు
క్రియాప్రకారంబును జెప్పెద వినుమట్లు కరంధముఁ డనం బరఁగి మనువంశ
దీపకుం డై పేర్చిన యా భూపతి నిజతపఃప్రభావంబునను మహానుభావుం డగు
నంగిరసుండు దన కుపద్రష్ట యయి యనేకాశ్వమేధంబులు సేయించుటం జేసి
యోవహిల్లినమాహాత్మ్యంబునను మహీపతు లెల్లఁ గొలువఁ బూజ్యసామ్రా
జ్యం బనుభవించి తనవలచినయప్పుడు తనువు తొఱఁగి యూర్ధ్వలోకంబునకుం జనియె
నమ్మనుజపతితనయుం డవిక్షిన్నామధేయుండు ధరాభారధౌరేయుం డై యుండిన

పోలి ప్రజలఁ బాలించె. 32

చ. అతనిసుతుండుసూవె మనుజాధిపసత్తమ యమ్మరుత్తుఁ డా
పతి దనతండ్రి పిమ్మటఁ గృపారతుఁ డార్యుఁడు దండనీతివి
శ్రుతమతి దానశీలుఁ డన రూఢికి నెక్కెఁ దదీయరాజ్యసు
స్థితి వెలుఁగొందె వాసవునిఁ జీరికిఁ జేకొనఁ డీసు పెంపునన్. 33

క. వాసవుఁడును నవ్విభు నెడ, నీసు గలిగి తన్ను మిగులనీ నని తచ్చిం
తాసక్తుం డై మంత్రిని, వాసమునకుఁ జనియెఁ బూరువంశప్రవరా. 34

వ. చని యతనితోడ. 35

సీ. అనఘ మరుత్తుండు నిను వరింపఁదలంచుఁ, దనయజ్ఞమున కుపద్రష్ట గాఁగ
నమరాధిపతి యగునట్టినాకును జేసి, యుపదర్శనం బింక నొక్కమర్త్యు
నకుఁ జేఁత నీపెంపునకు హాని గాదె నన్, విడిచి యాతనియజ్ఞవిధులు నడపుఁ
డాతనిఁ దొఱఁగి మత్పదాప్తత మెఱయుము పె, క్కాడంగ నేటికి ననుడు నతని

తే. పలుకులకునవ్వియా బృహస్పతి మహాత్మ, యెఱుఁగనే నిన్ను నన్నునీవిటుల సెప్ప
నేల సర్వలోకముల కధీశుఁ డైన, నీగురుం డొరు నాశించునే మహేంద్ర 36

వ. అని వెండియు. 37

ఆ. అగ్ని సల్లనైన నబ్జమిత్త్రుఁడు మైల, పడ్డ నుర్వి వొరలఁ బడిన మేరు
నగము సంచలించినను బొంకు వొరయునే, నాదుపలుకు నెమ్మనమున నమ్ము. 38

క. అన విని ప్రమదంబునఁ దేలినచిత్తముతోడ సమదలీలం జనియెం
దనమందిరంబునకు సుర, లనురాగముఁ బొంద నింద్రుఁ డమలచరిత్రా. 39

సీ. అది యంతయును విని యమ్మరుత్తుఁడు త్రిదశాచార్యుకడ కేఁగి యతనితోడ
నీకు నెఱింగించి నీపంపునన యేను, సంభారముల నెల్ల సంఘటించి
యజ్ఞాచరణమున కమరి యున్నాఁడ నీ, వుపదర్శనంబు సేయుటకు రమ్ము
నావుడు నింద్రుండు ననుఁ దనయాగమునకు మున్న వరియించినాఁడు నాకు

తే. నెట్లు రావచ్చు ననియె నాయింద్రమంత్రి, యట్లు వలికిన మాతాత యనఘ నీదు
తండ్రి సంప్రీతితో నుపద్రష్ట యయ్యె, నట్లకృప సేయు మని పల్కె నవ్విభుండు.

చ. విని ధిషణుం డమర్త్యులకు విన్నను వొప్పఁ గ్రతుప్రయోగముల్
మనము దలిర్పఁగా నడపి మర్త్యునియాగమునొజ్జఁ గాఁగఁ జా
ల నిది నిజంబ యింక ననుఁ దలాప మొనర్పక పొమ్ము వేఱ యొ
క్కని నుపదర్శనంబునకుఁ గైకొను మారసి నీవు నావుడున్. 41

వ. అజ్జనపతి లజ్జితుండై మగిడి వచ్చి యెదుర నారదుం గని వినయం బెసంగ వినతుండై నిలిచిన నమ్మునియు నతనిం గనుంగొని యెట వోయి వచ్చె దేల విన్ననై యున్నవాఁడవు నితెఱం గెఱింగింపు మవ్విధంబున నైన నీవిషాదంబు మాన్చెద ననుటయు నమ్మనుజపతియుం మదీయాధ్వరంబునకు నాంగిరసు నుపా

ధ్యాయుం గావరియింపం బోయితి నద్దేవగురుండు నన్ను దూషించి పరిత్యజించె నింక నేటి బ్రదుకని పలికిన నప్పరమసంయమి యప్పుడమిఱేనితో బృహస్పతి నిన్నొల్లకున్న నేమి యంగిరసుని పిన్నకొడుకు సంవర్తుం డాధిమణుచేత ధిక్కరింపంబడి సకలంబును విడిచి వెడలి వైరాగ్యంబు పెంపున దిగంబరుం డయి తిరుగుచున్నవాఁ డతనిపాలికి నరుగు మమ్మహాత్ముండు భవన్మఖంబునకు నుపదర్శనం బాచరించు ననవుడు సంతసిల్లి యా భూవరుం డి ట్లనియె. 42

క. మునివర బ్రదికితి సంవ, ర్తుని నెచ్చటఁ గాంతు నెప్పకరుసునం దగ నా
డిన నతఁడు ద్రోవు సేయక, నను గైకొను నెఱుఁగఁజెప్పుకనాకుం గరుణన్. 43

వ. అని ప్రార్థించినయప్పార్థివోత్తమునకు నత్తపోధనసత్తముం డి ట్లనియె. 44

సీ. భూపాల యతఁడు కాశీపురిఁ బాయక, వర్తించు నున్మత్తవర్తనమున
నతని నెఱింగెడుకనట్టియుపాయంబుఁ వినుము పురద్వారకమున శవంబు
నిడికొని నీవుండు మేతెంచి చూచి నివర్తించువాని సంకవర్తుఁ గాఁగ
నెఱుఁగుము మరలి యక్కల్లఁగంగ వెనుకనకపోమ్ము నిశ్చలభక్తిపూర్వకముగ

ఆ. నెచట నైన నీకు నేకాంత మొదవిన, శరణు సొరుదు వినయకభరితవృత్తి
నాడుగుఱుతు సెప్పికనా రెవ్వరనినను, జెంద నారదుండు చెప్పె ననుము. 45

మరుత్తుండు సంవర్తునిఁ దనయజ్ఞమున కుపద్రష్టగా వరించుట

సీ. ఇప్పుడు నారదుం డెం దున్నవాఁ డని, యడిగినయట్లైన నతఁడు నాకు
ని న్నెఱింగించి యక్కగ్నిప్రవేశము సేసె, ననుము శంకింపక యనుడు నమ్మ
హీపతి వారాణకసీపురంబున కేఁగి, దిక్కుమాలినపీనుఁ గొక్కచోటఁ
బడి యున్నఁ గని దానిఁ బట్టించికొని పుర, ద్వారప్రదేశంబు సేర నరిగి

తే. యచట శకుణపము నిడికయంతనంత, వేచికొనియుండఁగా నొక్కకవెఱ్ఱివాఁడు
వచ్చి శవముఁ గనుంగొనికవాటువడ్డ, పసరమునుబోలెఁ గ్రమ్మఱకపాఱుటయును.

వ. వాని సంవర్తుంగా నెఱింగి యజనపతి యతనిపజ్జన చనం జన నతండు మరలి చూచి పైధూళి సల్లియు నుమిసియు వేదుఱుచందంబు భావింప నా భూవల్లభుండు. 47

క. వినయముతోఁ గేల్ మొగుచుచు, ననుగమనం బుడుగ కరుగకనాతండును వి
ర్జన మగు ప్రదేశమునకుం, జని కౌంకవటవిటపినీడఁ జదికిలఁ బడిమెన్. 48

వ. డప్పి భావించుకొని యమ్మహాత్ముం డట్లు గూర్చుండుటయు. 49

సీ. ఆ రాజు సేరి సాష్టాంగప్రణామంబు, సేసి నిల్చిన ననుఁ జెప్పి నిన్ను
ననఘ పుత్తెంచినకయతని పేరెఱింగింపు, నిజమైన సిద్ధించు నీమనోర
థంబు బొం కగు నేనిఁ దలయేడు వ్రయ్యలై, పడు దని యమ్మునికపలుకుటయును
నారదుఁ డెఱింగించె నాకు మిమ్మును నిజ, మాడిన సంవర్తుఁ డాతఁ డచట

నేనియుఁ గలఁగుదునే యని పలికి విద్యాసంగతి వాసిన సదసిజాప్త
చంద్రకారకాశులాశచలములు గలయంత, కాలంబుఁ బుణ్యలోకములు లేక
తే. పోవు నని శపథము శుద్ధభావవృత్తిఁ
బలుకుటయు మెచ్చి యమ్మునిపతి మహేంద్రు
గాంచి నీవు ధనవంతుఁడవుగా నొనర్చి
క్రతువు నడపుదు వని చెప్పి ప్రమద మొసఁగ. 57

వ. మఱియు ని ట్లను నేత్తెఱంగున నేను ధనవంతుఁడ నగుదు నంటేని వినుము
హిమవంతంబునుత్తరభాగంబున ముంజవంతం బనుపర్వతంబు గలదందు శివుం
డు శివాసహాయుండై సురసిద్ధగరుడ గంధర్వాది సమస్తభూతజాలంబు సేవింప
విహరించుచుండు. 58

క. మరణజరారోగము ల,[1]గిరియెడఁ దరువులను లే వనఫలగుల్మలతా
తరువులఁ గుసుమఫలంబులు, గర మొప్పచు నుండు నెల్ల కాలములందున్. 59

తే. ఆ నగంబుపార్శ్వంబులఁ దరుణకిరణు, రుచిని భానంబు ననుకరించుచు వెలుంగు
శుద్ధకాంచనమయశిలాస్థలవాలు, కాప్రభాజాల మాశ్చర్యకారి యగుచు. 60

వ. మఱియు తదుద్యోతకుం బోల్చు. 61

సీ. శ్రీకంఠు రుద్రుని శివుఁ బూమదంతఘ్ను, హరునిఁ గపర్ది శంకరుని నంత
కాంతకు వరదుని నాదిదేవునిఁ ద్రిలోచను, సహస్రాక్షుని శాంతమూర్తిఁ,
[2]చీరవాసుని ధన్వి సిద్ధు దండధరు మృగవ్యాధు నుష్ణీషిఁ గనకబాహుఁ
బశుపతి వృషు భూతపతి మాతృభక్తుని, నజు నగ్నివక్త్రుని నభవు భవుని
ఆ. భక్తిఁ బ్రస్తుతించి ప్రణతులఁ జేల్చి తత్కరుణ వడసి పసిఁడి త్రవ్వితండ
ములు నృపాల పెక్కుకావులు దెత్తము, రమ్ము భారవహులఁ దెమ్ము చాల. 62

క. అని పలికి యమ్మహాత్ముఁడు, గొని పోవఁగఁ బోయి శివునకుం బతికరుణం
గనక సుసంఖ్యము కావులు, గొని వచ్చె నతండు మంచుకొండయువులకున్. 63

వ. ఇట్లు మహాధనవంతుండై మరుత్తుండు సువర్ణమయంబులుగా యజ్ఞవాటంబును
భాండప్రముఖసకలక్రియాసాధనంబులును శయ్యాసనాదులుం గావించుకొని
తత్ప్రదేశంబున నతిమానుషం బగువిభవం బెసంగ యజనంబున కుపక్రమించు
టయు బృహస్పతి యంతయు నెఱింగి యంగంబు కృశంబై వెలుఁగువాఱునట్టి
వగం బొందిన సంక్రందనుండు చూచి యవ్వాచస్పతి కి ట్లనియె. 64

ఆ. తెలివి వొంది యున్నకదియె పీడుచిత్తంబు, సురల బ్రదుకు తెరువు లరసి నడపు
చున్నవాఁడవే సుఖముత్సాహమున వారు, నీకుఁ బ్రియ మొనర్చి నేర్చి మండ్ర.
తే. అనుటయు నాచార్యుండు సర్వంబు సంపన్నంబయినిన ననిమిషపతి యతనితోడ.
క. నీ యొడలు డస్సి కాలు వెల, నై యున్నది నీకు నిట్టి యధికవ్యథ గవ్వుం

---

1. క. గ. చ. జ. గిరియుం దెవ్వోడల. 2. క. గ. ఙ. ట. 'చీరవాసుని ధన్వి విశదంబు సిద్ధు'.

చేయుఁగ వెలవనీచులఁ, జేయుదు దండితులఁ గాఁగఁ । జెప్పుము వారిన్. 67

వ. అనవుడు నాచార్యుం డట్టిది లేదు మరుత్తుండు మహనీయుం బగుమఘం బొనరింప నుద్యోగించినవాఁ డతనికి మద్విరోధి యగు సంవర్తుండు యాజకుం డయి యది నడపువాఁ డయ్యెనని వింటి మద్విషాదంబునకు మూలం బిది యట్లు గాకుండం జేయవలయు నజ్జననాయకు నియమించి సంవర్తుని యాజకత్వంబు నవశ్యంబును మాన్పునది యని పలికినం బాకశాసనుండు పార్శ్వంబున నున్న యగ్నిదేవు నాలోకించి నీవు మరుత్తుపాలికిం బొమ్మతండు క్రతుకరణంబున కుత్సహించినవాఁడు తదీయం బగు నుపదర్శనంబు బృహస్పతి యాచరించువాఁడుగా సంఘటించి రమ్మని నియోగించిన. 68

ఆ. అట్లు సేయువాఁడ । నని యగ్ని నిజతను, స్ఫురణ మతిశయిల్ల । నరుగుటయును
నల్ల మచ్చెరువున । నూన మరుత్తుండు, ప్రణతి యాచరించి । భక్తితోడ. 69

అగ్నిదేవుం డింద్రసందేశము మరుత్తున కెఱింగింప వచ్చుట.

సీ. సంవర్తుఁ బిలిచి యాసనపాద్యముఖ్యోప, చారముల్ నడపించి । పరిసరమున
నున్న నయ్యనలుఁ డయ్యుర్వీశ్వరునితోడ, బలవైరి పనుప నీపాలి కనఘ
యరుగుదెంచితి దూతనై యున్న నవ్విభుం, డవ్యాసవుండు సౌఖ్యమున వెలుఁగు
చున్నాఁడె యసురసత్కారం బతనికిఁ, బ్రియ మాచరించి వర్తించుచున్నె

ఆ. యాదరంబు గలదె । నాదెస నాసహ, స్రాక్షునెమ్మనంబునందు హవ్య
వాహ యనుఁడు నతఁడు । వసుమతీపతికి ని, ట్లనియెఁ గౌరవాన్వయాగ్రగణ్యా.

క. సురనాథుఁడు దద్దయ సుఖ, సురలాతనికిం బ్రియంబు । [1]సొలయక రొనరిం
తురు నీదెస నాదర మ, ప్పురుమవరున కగ్గలంబు । భూపవరేణ్యా. 71

వ. నావచ్చినపని సెప్పెద నాకర్ణింపుము. 72

క. నీజన్మమునకు ధీమణుఁడు, యాజకుఁడై మర్త్య నిన్ను । నమరత్వదశా
భ్రాజిష్ణుఁ జేయు నమ్మెయి, రాజితముగ నాచరింపు । క్రతుకార్యంబుల్. 73

వ. ఇది యింద్రుండు నీతోడం జెప్పు మన్న కార్యం బనుటయు నమ్మనుజనాథుం డమ్మహాత్ముతోడ. 74

ఆ. అనఘ యేను మ్రొక్కఁగ లాబృహస్పతికి మ్రొక్కఁ, డతండు నన్ను । నదయవృత్తి
నపహసించి తాను । యాజకత్వమునకు, నెట్లుఁ జొరక యున్న । నేను బోయి. 75

క. అనుజుం డతనికి ననుపెను, పొనరినసంవర్తుభక్తి । నొడఁబఱచి తగం
గొని వచ్చితి మత్క్రతుయాజన మీయోగీశ్వరుండ । చాలుం జేయన్. 76

ఆ. అనిన నగ్నిదేవుఁ । డమరగురుం డుపద్రష్టయైన వజ్రధరుఁడు నీకు
నలఘుపుణ్యలోకములు సులభ్యములుగఁ, జేయు నట్లు । మేలు గాదె. 77

క. అనవుడు సంవర్తుఁడు గడుఁ, గనలి యనలుతోడ నిట్టి । గతి నీవింకా

1. క. గ. పొలయక.

డీన మద్దారుణదృష్టిని, నిన్నుఁ గాల్తు మగుడు మిప్పనికిఁ దిరుగకుమీ. 78

చ. అనుటయు భీతి నగ్ని యమరాధిపుపాలికిఁ బోయి యే మరు
త్తునిఁ గని నిమ్మనీ దగు క్రతుక్రియకుం గురు యాజకుండు గాఁ
గొను మని చెప్పితిం విని యతఁ డతిశనిశ్చయుఁ డైనయవ్విభుం
డనిమిషమంత్రికిం బెఱతు నాతని తమ్మునిఁ గోరి తెచ్చితిన్. 79

వ. ఈ యోగీశ్వరుండు మదీయాధ్వరంబునకు యాజకుం డనుపలుకు పలికి సంవర్తుం
జూపె నే నంతనిలువక పురుహూతునకుం బ్రియంబు బొనరించిన నీకుం బుణ్య
లోకంబులు సిద్ధించు నట్లు సేసిన మే లని తత్తఱిమి చెప్పినను నప్పుడమిఱేఁ డొడం
బడండ. 80

చ. అన విని యింద్రుఁ డిట్లనియె నగ్నికి నిమ్మరి వోయి చెప్పు మ
జ్జనపతితోడ నాపలుకు సమ్మతిఁ జేయక తక్కెనేని నేఁ
బనిచెద వజ్రముం జమునిపాలికి నన్నరనాథు వేగమే
యనుచుట కింతవొల్లిదమె యాతనికిం మనయాజ్ఞ యాతయున్. 81

వ. అని పలుకుటయుఁ బావకుండు పాకశాసను నాలోకించి.

[1]సీ. ఇంక వచ్చిన దారుణోగ్రణదగ్ధుఁ గావింతుఁ జుమ్మీ యని విపులకోప
మూర్తివై పలికె సంవర్తుండు గావున, వెఱతు నే నట వోవ తేజోరాశి
పోవుఁ గాకనవుడు దేవేంద్రుఁ డన్యుల, నీవు దహింతు గా కేవిధమున
నౌరులు నిన్ను దహింతురో పేరమాట యిట్లాడు చేయనుటయు నగ్నితలపు

ఆ. మూఁడులోకములును వాఁడిమగంటిమి, నేలుచున్నవాని నెట్లు వృత్రుఁ
డాక్రమించె నిన్ను నదియును గాక పర్జన్య మఱియు వినుము బ్రహ్మబలము. 83

సీ. సయ్యాతి క్రతువున నశ్వినుల సోమ, పానంబు నీ కొడఁగబాటు గాక
పాయుంగఁ బెట్టిన భార్గవచ్యవనుండు, వారికిఁ గా సురవర్గసహిత
ముగ నిన్ను బాధింతుఁ గడుగఁ జేసె నిజమంత్రబలమున దానికి వలిగి వజ్ర
మేడ్తెఱఁ గొని యమ్మునీశ్వరు [1]సాధింపఁ, గడఁగిన నగుచు నెక్కట్టడఁచెఁ గాదె

తే. యతఁడు పుడిసెడునీరనయప్పు డతనిఁ, దెలచి సోము మాశ్వినులకుఁ గలుగఁ జేసె
తరయ నెందును బ్రహ్మబలాతిశయము, గడచినట్టిబలంబులు గలవె యనఘ.

క. అనవుడు బ్రహ్మబలము గడు, ఘన మగు నెఱుఁగుదు మరుత్తుఁ గాఱియఁ బెట్టం
జనదే నా కని శక్రుఁడు, పనిచెను గంధర్వలోకపతి ధృతరాష్ట్రున్. 85

వ. పనుచునప్పు డతని కిట్లనియె. 86

తే. నీవు వోయి మరుత్తుని నెమ్మిఁ గాంచి, గురు నినీకు యాజకుఁడుగఁ గొనఁగవలయు
నట్లచేయక యున్న వృత్రారి క్రోధ, దీప్తుఁ డై కులిశంబుఁ బుత్తెంచు ననుము.

వ. ఈ మాట సంవర్తుసన్నిధిన యాతఁడు మని పలికిన నా ధృతరాష్ట్రుం డియ్యకొని

1. గ. చ. ప్రహరింప.

చని సంవర్తసహితుండై యున్నమరుత్తునిం గని తాను గంధర్వుం డనియును
ననిమిషపతిపంపున వచ్చితి ననియునుం జెప్పి యప్పుడమితేనితో మఱి యి ని
ట్లనియె. 88

చ. వినుము మదీయబుద్ధి పృథివీవర యాజకుఁ గాఁగ నీమఖం
బునకు బృహస్పతిం గొనుము పూర్వదిశాపతి కవ్విధంబు ప్రీ
తి నొసఁగు నట్లు సేయ కవధీరణ చేసితివేని వజ్రముం
బునుచు నతండు నీపయి సభాసదులున్ విన జాటి చెప్పితిన్. 89

సీ. అనిన మరుత్తుఁ డయ్యమరగురుండు నాయాగంబు నడపుట కొల్ల రోసి
రా కున్న సంవర్తుఁ బ్రార్థించి తెచ్చితి, నింక నట్టులు సేయ కెట్లు వచ్చు
ననఘ మిత్రద్రోహ మధికపాపము గాదె, యిది నీ వెఱుంగుదు దయింద్రుఁ డెఱుఁగు
సిద్ధసాధ్యాది ప్రసిద్ధులు నెఱుఁగుదు, రిమ్మాట గురునకు నియ్యకోల

తే. యనుడు గంధర్వుఁ డదె వినవె యత్యుగ్ర వజ్ర
ఘోరనాదంబు నీ కోర్వఁ గొలఁది యగునొ
కాదొ నీవ యెఱుంగుదు మేదినీశ
యనుటయును నృపుఁ డాలించి విని భయమున. 90

వ. సంవర్తున కెఱింగించి. 91

క. కులిశము వచ్చుచు నున్నది, యలుకొందెడు నామనంబు ననఘచరిత స
భ్యులు సంత్రాసము నొందిరి, తలఁకొని రక్షింప వలయు దయ మమ్మెల్లన్. 92

వ. అనిన విని యమ్మహాయోగీశ్వరుండు. 93

సీ. ఇంద్రుని దెస భయం బించు కేనియు వల, దతఁడు నన్నెఱుఁగఁడే యధిపవినుము,
సంస్తంభవిద్యాప్రశస్తవైభవమున, వజ్రంబు నతఁడు నవ్వాసవాది
దైవతంబుల యాయాయుధంబులు నాచేతఁ, బ్రతిహతిం బొందు దుష్ప్రవనచండ
వృష్టిప్రముఖమహావికృతుల బాధింతు, ననుడు మ్రోయుచు నిదె యురుగుదెంచె

ఆ. భిదుర మెవ్విధమున భీతి దొలంగుదు, ననియె నృపతి యాతఁ డల్ల నగుచు
దాని సరకుగొనకు తగువర మడుగు నాతపము పేర్మి నిత్తు ధరణినాథ. 94

చ. అనిన మరుత్తుఁ డట్లనియె నాతనితో భయ మెల్లఁ బాసె నే
నిను వర మర్థి వేఁడెద మునీశ విరోధము దక్క యధ్వరం
బున కిట వచ్చి దైవతవిభుండు నిజోచితహవ్యభాగముం
గొనియెడు నట్లు గాఁగ మునికుంజర చిత్తమునం దలంపవే. 95

క. తమభాగంబులు దక్కన, యమరులునుం బ్రీతిఁ గొనఁగ యాగంబు ప్రయో
గము సుప్రణీత మయి లోకమనోజ్ఞము గాఁగ వలయుఁ గారుణ్యనిధీ. 96

క. అనుటయును మహాహ్వానం, బున నింద్రుఁడు సోమపానమున కేతెంచుం
దనుదెంచి రతనితోఁ దక్కన యమరులుఁ దొడఁగు యజ్ఞకృతికి నరేంద్రా. 97

—మరుత్తునియజ్ఞంబున హవిర్భాగంబులు గొన నింద్రాదులు వచ్చుట.—

వ. అని పలికి దవ్వులన యవ్వజ్రంబు వారించి గంధర్వునకు వీడుకోలు సేయించి యయ్యాగీంద్రుండు దేవేంద్రుని దేవతలనుం బిలిచె నమ్మహాత్ముని మహనీయమంత్రశక్తి నాహూతు లైన యప్పురుహూతప్రభృతిబృందారకులు ప్రియంబున నరుగుదేర నమ్మునిపతి యజ్జనపతి వారల నెదుర్కొను తెఱంగు నడపి తానును గూడి నడచి వారికి నర్ఘ్యపాద్యాదిపూజనంబులు విధివిహితప్రకారంబునం జెల్లించె నమ్మరుత్తుండును మరుత్పతికిం బ్రణమిల్లి దేవా నీవు విజయంచేసి నా జన్మంబు సఫలంబు సేసితి కృతార్థుండ నైతిం గృపాధామ నామీఁదియలుక మాని నన్నుం జల్లనిచూడ్కిం జూడు మని ప్రార్థించి సంవర్తుం జూచి యుత్తాపసపతి బృహస్పతిస్వరూపంబ కావునం గ్రతుయాజకుండుగాఁ బరిగ్రహించితి నని విన్నవించుటయు ననిమిషనాథుండు నీవలనం బ్రీతిం బొందితి నితం డయ్యమరగురుననుజుం డతని యట్లగుటకు సందియంబేమి యనుచు వికచవదనుం డై కనుంగొనిన నమ్మునివరుం డా దివిజవరున కిట్లనియె. 98

ఆ. అఖిలలోకభర్త వమరేంద్ర నీ విట్టు, లాదరమున వచ్చు టరయ నాత
పంబు ఫలముగాఁ జక్క పావనమూర్తి యీ, రాజు క్రతువుఁ బుణ్యరాశి యయ్యె.

చ. సకలవిధానదక్షుఁడవు సర్వము నారసి చేయఁ బంపు నీ
సత్కృపవిలోకనంబులను [1]సార్థము లై క్రతుమంత్రతంత్రముల్
వికలత లేక చెల్లు జనవిశ్రుతుఁ డీ నృపుఁ డుర్వి భవద్దయన్
సుకృతులలోనఁ బెంపు గనఁ జూడఁ గనుం దగఁ బుణ్యలోకముల్. 100

వ. అని యిట్లు నిభృతుం డై యభివర్ణనపూర్వకంబుగా సంభాషణం బాచరించిన.

సీ. భూరిహర్షంబునఁ బొంది పురందరుం, డమృతాశనులఁ గలయంగఁ జూచి
యజ్ఞవాటంబు బుధాశ్రితాభిరామంబుగఁ, జేయుఁ డప్సరస్స్త్రీజనంబు
నాట గంధర్వులపాటఁ జెల్లింపుఁడు, నావుడు వారట్ల నడప మఱియు
సకలకర్మములకు సాహాయ్య మాచరింపంగ వేడ్క యగ్నిభంగి వెలిఁగి

తే. లసితసముచితపీఠ మలంకరించి, వేడ్క సంవర్తముని హవిర్విధి రచింప
యాగదహనుజ్జ్వలమును సుప్రసన్నభాగకంబు, నగుచు నొప్పారె భరతకులాగ్రగణ్య.

తే. [2]ప్రీతిఁ జేర్వేరఁ బిలిచి చేక నేత సోమ, మమ్మహాయాగానియందు మిక్కి నెమ్మిఁ బాన
మాచరించి సహస్రనేత్రాదు లైన, యమరు లానందమునఁ దేలి రధిపముఖ్య.

వ. ఇట్లు మరుత్తుండు మరుత్పతికిం బరమతృప్తి గావించి యామంత్రణంబు సేయ నయ్యందఱు నభినందించి నిజనివాసంబులకుం జని రజ్జననాథుండు. 104

చ. యజనము సెల్లు కాలము సమాప్తతఁ బొందిన నాఁడు దద్దయున్
కడు మిగుభంగిఁ బ్రస్ఫురితకాంచనరాసు లనేకముల్ బహు

---

1. గ. సాధ్యము లై. 2. చ. ప్రీతి రెట్టింపఁ జేర్వేరఁ బిలిచి సోమ.

ద్విజులకు భక్తియు భక్తియును - వేడుకయును వినయంబు నొప్ప సం
భజనపరాత్ముఁడై యొసఁగె - భారతవంశపయోధిచంద్రమా. 106

తే. అంతఁ బోవక హేమసుస్థయత్వమహిత, యజ్ఞవాటభాండాదిపదార్థములును
బ్రాహ్మణావళి కిచ్చె నప్పాట నతఁడు, హిమగిరిప్రాంతమునఁ గ్రతుశ్రవెలయఁ జేసి.

వ. సంవర్తునిచేత ననుజ్ఞాతుం డై నిజపురంబునకు నరుగుదెంచి వార్ధివేష్టితవసుంధ
రావలయంబుం బుణ్యాపరత నిలయం బాలించె బ్రాహ్మణులుఁ దమ కొసఁగినంత
యుం బసిండి ద్రవ్య తండంబులు దెచ్చుకొని లెక్కనఁదానినచ్చట నొక్కెడనిధిగా
నిక్షేపించి దీనిం గాలాంతరంబున నెన్వరేనిం గని వెడియుక్కనినవారిధనంబ యని
రమ్మహాకాంచనసంచయంబు గొని వచ్చి విచ్చలవిడి నశ్వమేధయాగంబున సకల
దేవతలం దృప్తులం జేయు మనియె నట్లు వేదవ్యాసమునీశ్వరుండు సెప్పినవచనం
బుల వినియును బంధువిషయశోకంబునం గ్రమ్మఱం దెలివి నొందియు నొందక
ధూమంబు వొదవినయనలంబునుంబోలె నున్న పాండవాగ్రజుంగనుంగొని కమల
నాభుండు. 107

తే. వంత లైనతలం పెల్ల - వసుమతీశ, యరయ మృత్యుపదం బగు - నార్జవాఖ్యం
బుబు బ్రహ్మపదం బింత - తథ్య మేల, యీయిరెండక్షరంబుల - బీజువారి. 108

క. కర్మానుష్ఠానంబును, నిర్మలముగ నడపఁబడదు - నీచే విను మీ
ధర్మతనూభవ వగయును, నిర్మూలము సేయ విధి యనీవ కలిమియే. 109

వ. వగ [1]నిర్మూలము సేయుమి యెట్లంటేని నీ వంతశ్శత్రుల నెఱుంగవు గాదె కావున
నేతద్విషయం బైనయొక్క యితిహాసంబు గల దాకర్ణింపుము. 110

—✤ శ్రీకృష్ణుఁడు ధర్మరాజునకు మనస్తాపోపశమంబు సేయుట. ✤—

సీ. అవని యెల్లను వృత్రుఁడాక్రమించి తదీయ,గుణ మగుగంధంబు - గొనిన శక్ర
వానిపై వజ్రంబు - వైచెఁ గ్రమంబున, నంబు తేజఃపవనాంబరముల
యందుఁ బ్రవేశించి - యందులరసరూప,సంస్పర్శశబ్దముల్ - చండవిక్ర
ముం డైన యతఁడు సకముద్ధతిఁ గొనఁ గొనఁ, దోడ్తోడనమ్మహేంద్రుండుకులిశ

ఆ. నిహతి వెలువరింప - నిర్భరవేగుఁ డై, యతనిలోను సొచ్చె - నసుర దాన
మూర్ఛవోయె దివిజముఖ్యుండు బోధితుఁ, జేసె మంత్రవిధి వసిష్ఠుఁ డతని. 111

వ. ఇట్లు వసిష్ఠప్రయుక్తమంత్రశక్తిం బ్రబుద్ధుం డై నవ్వృద్ధశ్రవుండు శరీరాంతర్గతుం
డైన వృత్రునదృశ్యం బైనవజ్రంబున వధియించె నవ్యాసవుం డీధర్మరహస్యంబు
తెలుంగు మునుల కెఱింగించె మునులు నాకుం జెప్పిరి మానవేశ్వర దీని నీవు
దెలిసికొను మని పలికి యప్పాండవాగ్రజునితో నప్పుండరీకాక్షుండు వెండియు
ని ట్లనియె. 112

సీ. శారీరమును మానసంబును నా రెండు, దెఱఁగు లై వ్యాధి వర్తించు నందు

1. గ. నిర్మూలముసేయు మది యెట్లంటేని.

విను వాతపిత్త శ్లేష్మములను సమత్వంబుఁ బొందిన యవ్వి స్వస్థుఁ డగున
దుం డవి మాఱుడు నొగ్గెం బై వికృతి నొందు, దిన శరీరవ్యాధి యనంగఁ బరఁగు
సత్త్వరజస్తమస్సమత సుస్థితి విష,మత మనోవ్యాధి యీ ద్వితయమునకు

ఆ. నొంటి దోఁచు నొప్పు నొదవ దన్యోన్యసం,జనకజన్యభావసక్తిఁ జేసి
విస్ఫురితకాల మొకట నొకటి దోఁచు నది వా,తాదులందు గుణములందు నధిప.

వ. ఇది సూక్ష్మకర్మానుష్ఠానప్రకారంబు దీని నీ వలవరింపవు గావునం గర్మానుష్ఠానంబును నిర్మలంబుగా నడపంబడదంటి వని పలికి మఱియును. 114

క. వాతాదులందు గుణములు, నీ యెఱుఁగు దక్కు వగుట యెక్కుడగుట నీ
[1]చేతః ప్రశక్తిఁ దోఁచి నృపా తెలియంగ వలయు సమతకుఁ బరకాంక్షినై. 115

సీ. అమ్మాయ గాక కామాదులు సత్త్వము,ఖ్యములును దివిచినఁ గలఁగు దేని
నది సిద్ధభావమే యను గల దింకను, జెప్పెద నవధాన మొప్పు వినుము
నటి లోపత్రు లయ్యుఁ బాండవ ల్గొని రాజ్య మలవు శాసనము లోన
నిమువులు గుడుచుట నెట్టఁ బెట్టుక జట్ట్యాసుర సైంధవాదుల దురితకృతుల

తే. దలఁపకుము హాస్తినపురమునఁ దైన్యపడుట, బుద్ధి సేయకు భీష్మాదిసయుద్ధతంత్ర
మూహయుంగ యుద్ధంబు గాఁ దలంచుఁ బుట్టు,కీడు నీ కేమియును జిత్తగింపకుండు.

వ. దాని నెట్లు యుద్ధంబు గాఁ దలఁచెదవంటేని యది మిథ్యాయుద్ధంబు సత్యయుద్ధం బాకర్ణింపుము. 117

ఉ. అమ్మయి బంధుమిత్త్రులసహాయత లక్ష్మి ప్రయోజనంబు లే
దమ్మహాసీయయుద్ధమునఁ గాత్మయ తోడు మనంబు శత్రుఁ డీ
వెమ్మయి నైన శాంతి ఘటికాయుధ ముంపుము లోపఁగఁ దీర్పు మందు శాం
తమ్ము చమూమనోవిజయకేతనఁ బెలుఁ గొందుము శాంతబుద్ధివై. 118

తే. అంతరంగబు నిక్కయ్యు నధిప గెలువ, కిట్లు యేగతిఁ జో మెదోకమెఱుఁగ దీని
నీవ కనిగొని సమ్యగ్బుద్ధి నిశ్చయప్ర, వీణుఁడవు గమ్ము మాటలు వేయు నేల. 119

వ. అని చెప్పి కౌంతేయాగ్రజునితోఁ గృష్ణుండు వెండియు నిట్లను రెండక్షరంబులు మృత్యువు మూఁడక్షరంబులు బ్రహ్మం బవి యెయ్యవి యంటేని వినుము మమ యనునవియును నమమ యనునవియును నైయుండు భూతంబులచేతం గానంబడక యా బ్రహ్మమృత్యువులు పోరుచుండు. 120

క. తత్త్వమన శ్వరమశరీ,రత్వంబునఁ దరఁగు భూతరాశి నియతనా
శిత్వంబు హింసకత్వము, తాత్త్వికమై లేదు దేహదళనమున నృపా. 121

క. శరధిపరివేష్టితక్షితిఁ, బరిపాలించినను దానిపై దృఢమమతం
బొరయక వర్తించిన న,ప్పురుషుని దురితంబు లెట్లు పొందఁగ నేర్చున్. 122

క. వనమున వన్యాహారం,బున వర్తించిన, బదార్థములపై మమతన్

---

1. గ. చేతః ప్రసక్తి. దోఁచి నృపా తెలియంగ వలయు సుమతి.

మనమున విషయ కుండిన నమ్మనుజుఁడు మృత్యుముఖవర్తి మనుజాధీశా. 123

క. తెలిపెడు గెలుపు గెలుపే, యలఘుమతిని గెలువవలయు నభ్యంతరశ
త్రులఁ దద్విజయము మోక్షము, నలవఱుపం జాలు నొంట నమ్మెలఁగు నృపా. 124

క. విను మంతశ్శత్రులలో, ఘనుఁ డగుఁ గాముఁడు నిరస్తకాముం బగువ
ర్తనము విరళ మధ్యయనయజనదానంబులును గామసహితములు గదా. 125

వ. ఇవ్విషయంబునం గామగీత లనువాక్యంబులు గలవు వాని నాకర్ణింపుము
కాముండు లోకంబు నుద్దేశించి యిట్లనియె. 126

క. అనపాయుం డగు నెవ్వం, డును నను బాధింపఁ జాలఁడు ప్రయత్నము నా
ధన మగు నె వేదవేద్యుం, డ నయి పరఁగుచున్న నాయొదవను విహారినై. 127

క. [1]ధృతి నెవ్వఁడు నన్నుం బ్రతిఘాతుఁ జేయఁగఁ జూచు [2]భావ మగుడునతని నే
నతఁ డడి యెఱుఁగఁడు గాన వి,హతి బొంకై పోవఁగా జయము లేకుండున్.

క. ననుఁ దపమునఁ బ్రహరించెద, నని యెవ్వఁడు దొడఁగు నతని కాతపము ఫలం
బున దెసఁ గోరిక నై యే, జనియింతుం జెఱపఁగా వశమె యెవ్వనికిన్. 129

క. నను మోక్షమునఁ దొలఁచెద, నని యెవ్వఁడు దలఁచు వానికయుం దే మోక్షా
ర్థనమై యునికి నవధ్యుఁడ, ననాత్మఁడఁ ద్రోవ నొకఁడుఁ జాలఁడు నన్నున్. 130

క. అని యివ్విధమునఁ గాముఁడు, దనుఁ జెఱపఁగ రామిఁ జెప్పెఁ దలఁపొందిన శ
క్తినభంగి నెదను దోఁచెను, విను మవధానమునఁ బాండవేయ ప్రవరా. 131

చ. పనివడి పూఁచి పట్టమి సుబంధురధైర్యము నిర్వహింతు నే
ననుమతి సొన్న కుండుట సమగ్రతపంబున తత్ఫలేచ్ఛ శే
కునికి విమోక్షతృష్ణ భర మొందమి కాము నడంచుఁ గాన యి
య్యనువులు లేమి నువ్వె యనపాయత గాఁ నతఁ డాడె భూవరా. 132

క. విను పెక్కు లేల కోరిక, మనమునఁ జొరనీక యున్న మడియుం గాముం
డనవద్య యశ్వమేధం, బొనరింపుము కోరకుండు మొక్కటియు మదిన్. 133

ఆ. అశ్వమేధముఖముఖంబులం దట్ల యనఘ యలోలుపత్వగుణవిశాలబుద్ధి
శాలి వై ఫలాభిసంధి లేక శక్రాము, ధర్మ్యంగాఁ బొనర్పు ధర్మతనయ. 134

క. చచ్చిన బంధులఁ గొని రా వచ్చునె తలఁపకుము నీవు వారిం గ్రతువుల్
విచ్చలవిడిఁ జేయుము నిను, మెచ్చు జగంబు సమకూరు మీఁదను గతియున్.

వ. అని యిట్లు కృష్ణుండును జెప్పెఁ బారాశర్యుండు బోధించె దేవస్థానుండును నారదుం
డును హితవచనంబు లుపదేశించిరి భీమాదులు నలువురును ద్రౌపదియును దగిన
మాటలు సెప్పిరి శాస్త్రచక్షుర్మహితు లైన మహీసురులు యోగ్యవచనంబు
లుపన్యసించి రివ్విధంబున నందఱి వాక్యంబులు నాకర్ణించి శోకంబు విడిచి
యా భూకాంతుండు ధరణీపాలనాద్యవకరణంబుల కియ్యకొని యనుచితనివృత్తి

1. గ. ధృతిమెయి నెవ్వఁడు ననుఁ బ్రతి. 2. భావ ముగుడు.

లై గంగాతీరంబునఁ గొన్నిదినంబులు నిలుచువాఁ డయి మునివర్గంబునకుఁ బ్రద
క్షిణంబును బ్రణామంబునుం జేసి. 136

క. మీకారుణ్యంబున నా, శోకం బంతయును బాసె సుమనస్కత సు
శ్లోకాత్ములార కలిగెఁ, నాకుఁ విచ్చేయుఁ డింక ననుమతి యొసఁగుఁడీ. 137

వ్యాసనారదాదిమునులు ధర్మజు వీడ్కొని స్వస్థానములకుఁ బోవుట.

వ. అని పలికి విశేషించి వేదవ్యాసమునివరుపాదంబుల కెఱఁగి భవత్ప్రసాదంబునం
గందువ గనిన కనకమ్ము మిమ్ముం బురస్కరించుకొనిపోయి చేకొనం గలవాఁడ
నప్పటికి సన్నిధి సేయవలయు నప్పెన్నిధికి నాశ్రయంబైనహిమగిరి మహీధరం
బులలోన నెల్లను బరమాశ్చర్యనిధి యని సవినయంబుగాఁ బ్రార్థించి నాపైఁ
బెక్కులు కల్యాణకరణకల్యంబు లగుమాట లాడితిరి మహాభాగ్యవంతులకుఁ
గాక యిట్టివారికారుణ్యంబు దొరకొనునె మీకరుణయ నన్ను భాగ్యవంతుం
డని తెలిపెను నని [1]బహుప్రకారంబులం బ్రస్తుతి సేసె నట్లామంత్రితులై
యమ్మహాత్ము లంతఁ గృష్ణార్జునామంత్రణంబు గైకొని యంతర్ధానంబు సేసిరి
పదంపడి భీష్మునకుం బరలోకక్రియలు ధృతరాష్ట్రసహితుం డై యాచరించి
కర్ణప్రభృతిగురుప్రకరంబునకు నూర్ధ్వలోకసాంద్రసౌఖ్యసిద్ధ్యర్థంబుగా నానా
విధదానవిధులు నిర్వర్తించి కృతకృత్యుండై కతిపయదినంబుల కచ్చోటు గదలి
పాండవాగ్రజుండు పాండునృపాగ్రజు నగ్రేసరుం గావించుకొని కరినగరం
బున కరిగి యతనిం బూజించి తదనుజ్ఞాశోభితుం డగుచుఁ గృష్ణుండును భీమా
ద్యనుజులును మోదంబు నొంద జనులు నభినందింపఁ బెం పారి[2]వసుంధరాపరి
పాలనధురంధరుం డయ్యె నని చెప్పిన విని జనమేజయుండు వైశంపాయనున
కిట్లనియె. 138

ధర్మజుఁడు ధరణిం బాలించునపుడు కృష్ణార్జునుల వర్తించువిధము.

తే. ఇవ్విధంబున ధర్మజుం డెలమి ధరణిఁ, బాలనము సేయుఁగాఁ గృష్ణపార్థు లెట్టి
తెఱఁగువార లై యచట వర్తించి రెఱుఁగఁ, జెప్పవే నాకు సజ్జనసేవనీయ. 139

వ. అని యడిగిన వైశంపాయనుం డిట్లనియె. 140

సీ. ధర్మజుం డిమ్మెయి ధరణిఁ బాలింపంగ, ననఘ యింద్రప్రస్థమున వసించి
కృష్ణుండుఁ గ్రీడియుఁ గ్రీడాపరత సరి, త్కాననపర్వతసాను దేశ
ములఁ జరించుచు విప్రపూజలఁ బుణ్యక, థాశ్రవణముల సత్కావ్యగోష్ఠిఁ
బ్రొద్దు పుచ్చుచుఁ దమపూర్వవృత్తము లైన, సమరతంత్రప్రముఖకథములఁ జెప్పి

తే. కొనుచునుండుదు రాత్మీయతనయు నరుఁడు, దలఁచి వగచినశోకంబు దలఁగునట్టి
వాక్యసంతతి నావృష్ణివరుఁడు దేర్చు, సముచితోక్తుల ధర్మజు శాంతి వొగడు.

క. [3]విను మయకృతసభఁ గ్రొత్తగఁ, గని యచ్చో నొక్కయెడ సకౌతుకనానా

1. క. సూత్రప్రస్తుతి సేసె. 2. ట. పృథివిం బాలించె నని చెప్పిన. 3. జ. విను మాయమయసభ.

జనపరివృతులై యుండుదు, రనూనవిభవమునఁ బ్రమద ॥ ఘూర్ణితగవారల్. 142

వ. ఉక్కున్నాఁ డప్పుండరీకాక్షుండు గాండీవితో నిట్లనియె. 143

సీ. సమరంబు ధర్మవిజయపరికీర్త్యంబు, గాఁ జేసి భూమి నిష్కంటకముగఁ
బాలించుచున్నాఁడు ॥ ప్రజ ప్రీతి నొందంగ, విప్రజనంబులు ॥ వివిధసుఖము
లనుభవించుచుఁ దన్ను ॥ వినుతింప నెగడెడు, శాంతియు సమతయు ॥ సకలజనముఁ
గొనియాడ సిద్ధులు ॥ మునులు సేవింతురు, ధర్మనందనుఁ డిట్లుదాత్తుఁ డగుచు
తే. యతని కున్నతి గావించి ॥ యనిలజుండుఁ గవలు నెంతయు నీచేత ॥ గాండివంబు
లీల గల్గి మహాధర్మశాలి సత్య, నిత్యుఁ డమ్మహీపతి కృతకృత్యుఁ డయ్యె. 144

వ. అని యగ్గించి యతనియాననం బాలోకించి. 145

ఉ. నీవలనన్ మహాత్మ విను ॥ నిర్భరచిత్తుఁడ నైతిఁ జూడఁగాఁ
బోవుతలంపు పుట్టెడుఁ బ్రభూతగుణున్ బలదేవు వత్సలన్
దేవకి నార్ద్రచిత్త వసుదేవుని మద్గతరాగసాంద్రస
ద్భావుల సర్వయాదవులఁ ॥ బార్థ వనుం దగ నన్ని పుచ్చవే. 146

క. ద్వారకకుఁ బోయి వచ్చెదఁ, గౌరవపతి కిత్తెఱంగు ॥ [1]కార్యజ్ఞానో
దారుఁడ వగుచీ వేచి, త్యారూఢము గాఁగఁ జెప్పు ॥ మగుసమయమునన్. 147

తే. అవ్విభుఁడు వోయి వత్తుగా ॥ కనక పోను
మీనుఁ బ్రాణంబుఁ దనయులు ॥ మిత్త్రగణము
బంధులును నర్థచయము న ॥ పార్థివేంద్రు
సొమ్ము తదనువర్తనము వ్ర ॥ తమ్ము నాకు. 148

వ. కావున. 149

క. మనము కరినగరమునకుం, జని పుణ్యాత్ముని నజాతశత్రుని నెలమిం
గని తగునవసరమున నిప్పని విజ్ఞాపించి యతని ॥ పనిచిన భంగిన్. 150

క. నడతము పోదమనుచుఁ గ, వ్వడి గొండొకవడి విచార ॥ వన్మానసుఁడై
కడు మేలటు సేయుద మని, యొడఁబాటుం బలుకు పలికి ॥ యొయ్యన పిదపన్.

వ. అమ్మహాత్మునితో నిట్లనియె. 152

ఉ. అనికిఁ బోఁడగునప్పుడు మదాత్మ గలంగినఁ గొన్ని తత్త్వబో
ధనమహనీయవాక్యములు ॥ దాత్తక్రమం దగ నీవు సెప్పి శో
మనమున వానియర్థములు ॥ మాధవ నిల్వఁగఁ జాలనైతి న
వ్వినుతవచస్సుధారసము ॥ వీనుల నిం కొకమాఱు నింపవే. 153

క. అనిన నగుచు నొకకేల వ, తనిఁ గౌఁగిటఁ జేర్చి బుద్ధిశక్తివిహీనుం
డును శ్రద్ధారహితుఁడు నై, తని మాఱి ముకుందుఁ డిట్టులను నాతనితోన్.

తే. [2]బ్రహ్మపద వేదనమునకుఁ ॥ బరమహేతు

---

1. క. కార్యవిధిజ్ఞోదారుఁడ. 2. చ. బ్రహ్మపదవి త్వముపకుఁ,

వ. అనుచుం దచ్చరణంబులు గరంబుల నవలంబించి ప్రణతి యాచరించి కేలు
మొగిచి యున్న నయ్యుర్వీసురోత్తమునితో నాసిద్ధసత్తముండు నీకుం బరిపాటిం
జెప్పెద సావధానమానసుండ వై యాకర్ణింపు మని యిట్లనియె. 163

ఆ. ధర్మసాధనంబు ✽ దనువు ధర్మము పరిజ్ఞానదాయియట్లు ✽ గాన తనువు
నోమ వలయు మర్త్యుఁడేమిట నేమఱ, కాత్మహితము గోరి ✽ యనఘచరిత. 164

వ. ఏమఱుటల తెఱంగు వివరించెద. 165

సీ. తనసత్త్వమును బలంబును దన కయ్యెడు, కాలంబు నారయఁ గాఁ దలంపఁ
డాహారములు గొను ✽ నవియును నగునవి, గానివి యనువివేకంబు బుద్ధిఁ
బొనుపఁడు బహుళభోజన మొకమారి సేయు, నొకమారి దుర్భిక్ష ✽ నుపవసించు
గతకాలమును నపక్వంబును గురుదుష్ట, [1]విషమవిరుద్ధము ✽ విపులరసము

తే. నైన యన్నము దా నరయక భుజించుఁ
గుడిచిపైఁ గుడ్చు దిననిద్ర ✽ గూరు సురత
పరత నొందుఁ బెల్లాయాసపడు విమూఢుఁ
డతని బాధించు దోషత్రయంబుఁ గెరలి. 166

క. అని చెప్పి. 167

శ్లేష్మాదిరోగవికారంబుల నిరూపించుట.

ఆ. అర్హకర్మలోప ✽ మవచయ మొనరించు, ననఘ దేహమున కనర్హ వేగ
ధారణములు రోగతతి జనింపఁగఁ జేయు, గామరోషములను ✽ గాయమెడలు.

క. అత్యంత ప్రబలంబులు, పైత్యవికారములు రేఁగి ✽ ప్రాణములకు శీ
ఘ్రాత్యయమును జేయు మహో, ద్ధత్యంబున నెలవు వెడలఁ దఱిమి సుచరితా. 169

తే. అవ్వికారంబు లెక్కుడై ✽ యుదరి మెచ్చ
లచటు భిన్నంబు సేయు నయ్యెడలు మర్మ
నామకంబులు మర్మభిన్నత్వ మెట్లు
సేయు కుందుఁ బరిచ్యుతి ✽ జీవమునకు. 170

క. వినుము తెలియంగ శ్లేష్మం, బనుదోషం బారఁ బరఁగి ✽ యవయవములు జా
డ్యనిరూఢంబులుగాఁ జేయును లోపలిబయలు నెల్ల ✽ నొయ్యన కప్పున్. 171

వ. పదంపడి. 172

క. కుత్తుకకు నడ్డపడు నూ, ర్పొత్తిలి పోనీక యాఁగు ✽ నూర్ధ్వశ్వాసం
బెత్తఁగఁ జేయును జీవుం, డత్తనువున నుండ నేర ✽ కంతట వెడలున్. 173

క. స్రోతోమార్గంబులఁ జా, వే తమ కర్హంబు లైన ✽ విషయంబులఁ బ్ర
స్ఫుటమతిం జాతుర్యో, పేతము లై యింద్రియంబు ✽ లేనును బుట్టున్. 174

క. స్రోతోమార్గములు కఫము, చేత నిరుద్ధంబు లైనఁ ✽ జెడు నింద్రియజా

1. గ. విషమవిరోధుల ✽ విపులరసము.

తాలతలకస్థలు దానన్న, పీతము లగుఁ జేష్టితములు । విను మనుజులకున్. 175

తే. వాయు వంగంబులందు దుష్కర్మ్యవ్యాప్తిఁ గదిరి
నొవ్వఁ దెవ్రులును బుట్టించుఁ గ్రొవ్వు సెలుచు
సంధు లెడలించుఁ గ్రమమున । నెందుఁ బరఁగి
తనువు [1]మ్రానుగఁ జేసి జీవుని వెలార్చు. 176

క. నాలుక యాడుట గేలుం గాలు ముడుఁపఁ జాఁప నగుట । కాయంబునయం
దీలీలలు వాయుగతుల్, [2]మే లే నివి గలుగుఁ దక్క । మే లమలాత్మా. 177

క. ఎక్కటి యిట్టివి దోషము, లొక్కొక మరి రెండు మూఁడు నొదవి పెరయఁ దా
నక్కడు సన్నిపాతం, బక్కజముగఁ దనువుఁ బావునది । జీవాత్మున్. 178

క. ఈ విధమున వెడలి చనిన,జీవుఁడు నిజకర్మజాలప్రసిద్ధగతులకుం
బోవుం దద్భవసుఖదుఃఖావేశముఁ బొందు చుండు । నయ్యెడలన్. 179

క. కృతకర్మఫలము దెగఁ గుడ్చి తనకుఁ దగినట్టిపుట్టు । వెందు మగుడ ని
ట్టి తెఱంగున జీవాత్ముఁడు, గతాగతము లనుభవించుఁ । గల్మషరహితా. 180

క. పాపాత్ములు నరకముఁ బుణ్యోపేతులు దివము విధినిశ్చయము క్తినవకతం
బ్రాపింతురు గావున నిర్లేపం బగు మోక్ష మొంద । లే రట్టిజనుల్. 181

తే. ఊర్ధ్వగతి కేఁగుమానవు । లుండునట్టి, నెలవు లార్యులు శాస్త్రనిశ్చయమున
గని యెఱింగింతు రవి నీవు వినుము నీకుఁ, దెలియునట్లుగఁ జెప్పెద । ధీసమగ్ర.

తే. సోముఁడనఁ దారకములనసూర్యుఁడనఁగఁ, గలుగు తేజస్విమూర్తులనెలవులందు
ధర్మపరులుండుదురు తారకలమ్యములకు, మనసు లెరియునట్టివి గదు మంచి వగున.

క. అదియును గాక ఫలంబులు, దుది ముట్టఁగఁ గుడిచి వెడలఁ । ద్రోవఁ బడుదు ర
ట్టిది సౌఖ్యమగునె శాశ్వతపదంబు మోక్షంబ కాక । భవ్యవిచారా. 184

వ. అని చెప్పి గర్భావాప్తిప్రకారం బెఱింగించెద వినుమని పలికి సిద్ధుం డా భూసురున
కిట్లనియె. 185

తే. అశుభములును శుభమ్ములు । నైనకర్మములఫలంబులు గుడువక । పోవఁ గాదు
మన్ష్యవశగతమైనయాత్మకు నుదాత్తచరిత యదికారణమున సువ్రాజన్మమునకు.

క. ఎనయఁగ శుక్లము శోణితమును బెరసి తలందిగర్భమున నెలలోను న
ప్పుని బ్రహ్మశక్తి బీజత్వనిరూఢిం బొనరు నవి వోయిదలుఁ బిండం బై. 187

క. విను మాబీజము పిండము, తనువునఁ జైతన్యమాప్తతం బరఁగి శిరం
బును గేలుఁ గాలు నుదరంబు నురము వెన్ను నను నంగములఁ నేర్పఱచున్. 188

వ. అని చెప్పి. 189

క. జననార్హావేళ వెలువడి, తనతొల్లిటికర్మములకుఁ । దగిన వివిధవ
ర్తనములఁ బొందు నవిఁ దెగినఁ, దసముఱి యూఁ బుట్టుఁ గర్మసంతతికిఁ దగన్, 190

---

1. గ. మానుగ. 2. చ. తెన్న లైనగలుగు దక్క । తే వమలాత్మా.

క. నరుఁ డెంతకాలమేనిం, బరమం బగు ముక్తిపదము * బడయక యుండుం
బురుషవర యంతకాలముఁ, బోరిఁబోరి సిబ్బంగిఁ జావుఁ * బుట్టువు నొందున్. 191

సీ. కావున ముక్తికిఁ*గారణం బగుదాని, నేర్పడఁ జెప్పెద * నెఱిఁగికొనుము
దానంబు శమమును * దమమును బ్రహ్మచ,ర్యంబును వ్రతపరి*రక్షణంబు
దయయును బరధన*దారవర్జనమును, నియమయమేంద్రి[1]య*నిగ్రహములు
జననీజనక గురు*జనపూజలును దేవ,తాతిథి పితృదేవ*తార్చనములు

తే. సత్యమును శౌచమును మధ*సంవిధాన
నిరతియును ధైర్యమును క్రౌర్య*నిరసనమ్ము
గలిమి పుణ్యావృత్తం బిది * గలుగు నరుఁడు
మొనయు దీని నూఁతగఁ గొని * మోక్షమునకు. 192

క. పదపడి ధర్మాచరణము, పొదలుం దత్సాత్మ్మవిధము * బుధజనులకడం
గదలక నిలిచి యెఱిఁగికొన, విదితం బగు వారిశీల*వృత్తములఁ గనున్. 193

క. వారలు చెప్పెడి కాంతో, దారవచనసమితి వినఁగ * దద్గతబహుళాగం
తీరార్థము లరిటీకర,తారూఢము లైన బోరయ * వాపద లెందున్. 194

సీ. వ్రతపరినిష్ఠులై * వర్తించు చుండియుం, ద్రయవిజయమును కాం*తియును గలిగి
బ్రహ్మైకభజనతత్పరుఁ డగు చుండెను, వతనికి బ్రహ్మంబు * హితవహించు
సంస్తరంబును సౌభాగ్య*సమిధలు జలమును,మంత్రంబు గురుఁడుబ్ర*హ్మంబయిట్టి
సద్గుణంబు మా*హాత్మ్యబ్రహ్మచర్యంబు, దీనియం దుత్తమ*స్థిరతగలుగు

తే. వాఁడు హర్షశోకోద్గామ*వాయుహతుఁడు
గాఁడు మేదురమోహాంధ*కారమున వె
డంగుపడఁడు సంసారని*స్సంగసిద్ధిఁ
బొందుఁ గాలక్రమమున న*ప్పురుషవరుఁడు. 195

వ. అని చెప్పి మఱియును. 196

## తత్త్వజ్ఞానవిశేష ప్రదర్శనము.

సీ. ఆదిసృష్టిఁ బ్రధాన * మనుతత్త్వ మంబుజా, సనుఁడు గల్పించి చే*కతన మొనర్చె
కర మందు దానిఁ ద*త్పర మగుతత్త్వంబు,నక్షర మనియును * నమృత మనియు
నార్యులు సెప్పుదు * రమ్మిథునంబున,యందు సంపన్నంబు * లఖిలభూత
జాలంబులకును సం*జనకంబు లెనబీజము లిది శ్రుతివాక్య*సంభృతార్థ

తే. మఱియుఁ గల్గింపఁ గమనము * నాగమనము
జీవరాశికిఁ గావున * నావిధమున
నది భ్రమింపుచు నుండుఁ బు*ణ్యాతిశయము
తతన జీవాత్మఁ దొలఁగు దన్ * గాంచునపుడు. 197

1. క. యమంబు నింద్రియనిగ్రహంబు.

క. విను సుఖదుఃఖము లచిరము, లనియుం దను వశుచి యనియు వస్తుపదార్థ
చయము నశ్వర మనియుం గ,ర్మనిరూఢత జాడ్య మనియు నూహింపుచున్.

క. ఊహించి తన్నుఁ గప్పెడు,మోహావేశంబు ద్రోచి మోక్షపదస్పృ
హాహితుఁడు సంసారాబ్ధి వ్య,వగాహనమునఁ జేయకుండు గతకల్మషుఁడై. 199

వ. అని పలికి వెండియు. 200

క. తనిరుజ్జరామరణములు, గని ప్రకృతివిధంబు లెస్సగా నెఱుఁగుటఁ ద
జ్జనితక్లేశమునకు విసి,వి నమర్త్యులు పరమపదము వెదకుదు రనఘా. 201

సీ. అట్టివా రిట్టివా రగుట మేల్ గనుఁగొని, యజనంబుఁ బూతంబు నైనచోట
నాసీనుఁడై హృదయంబున నొకచింత,యును లేక యాత్మనిష్ఠయుంకి యడరి
తోఁచుతోఁకవుల నెల్లఁదోడ్తో నడంచి ని,రాలంబనుండైన యతఁ డొకండు
సర్వమిత్త్రుండును సర్వసహుండును, నిర్జితేంద్రియుఁడును నిర్భయుఁడును

తే. గామకోపహీనుఁడు శమదమనుఁడు నైన
యతఁ డొకండు మానాభిమానాపగమము
సర్వభూతాత్మతత్త్వదర్శనముఁ గలుగు
నతఁ డొకండు వీరలు గందు రనఘ ముక్తి. 202

సీ. ఒలయులాభాలాభములుఁ బ్రియద్వేషంబు,లును సుఖదుఃఖములును సమంబు
లై యుండు నెవ్వని కాసపాటును నవ,జ్ఞతయు నెందును లేక సర్వధర్మ
తంత్రలోలుండును ధర్మశీలుండుఁ గాఁ, డెవ్వఁడు నూర్చువా కౌవ్వ కుండు
వా రని తనకు నెవ్వరును గల్గక త్రివ,ర్గేచ్ఛ యెవ్వనిచేత నీడ విడుచు

తే. బడు నకర్మభావంబుఁ దాపత్రయాప
గమము వైరాగ్యసుస్థిరత్వమును గల్గు
నతఁ డెవ్వనియుండేని నతఁడు నతఁడు
నతఁడు నతఁడును గందు రవ్యయపదంబు. 203

క. అనుమానలంబ మశబ్దము, రసగంధస్పర్శరూపరహిత మగుణ ము
ల్లసితగుణ మగుచు నెఱుఁగు న,భ్యసననియతిపరుఁ డొకండు సదయుం బుత్రా. 204

తే. సర్వసంకల్పవర్జనశాలి యగుచుఁ, బరమశాంతి చిత్తంబునఁ బట్టుకొల్పు
నతఁ డనింధనానలమునకట్లఁ బొందు, వికృతవర్జితమైననిర్వృతి కృతాత్మ. 205

వ. అని నిర్దేశించి యోగిజనానుభావ్యంబైన నెల వెఱింగించెద నని పలికి యోగులు
దాని నాత్మదర్శనానందంబు నొందుదు రవధానంబున నాకర్ణింపు మని యి
ట్లనియె. 206

ఆ. అనఘ ముంజగర్భ మగునిషీక నిదర్శనంబు గాఁగఁ గనుఁగొనంగ వలయుఁ
దనువు ముంజ యాత్మ తషీకనిష్కర్ష,విధము సూక్ష్మ యోగవిదుని వెరవు.

క. తనువున నలవు నిష్కర్షం, బొసఁగ్చి జీవాత్ముఁ గాంచు యోగివరుండ

య్యాను వొదవి యట్లు దన్నుం, గనినప్పుడు జననమరణ-గతులం దొఱఁగున్. 208

క. ముక్తుండు జరామరణవి,యుక్తుం డై హర్షశోక-యోగము విడిచి స
ద్భక్తులకును నప్పద విగా, శక్తుం డగుఁ జుమ్మె బ్రహ్మ-చర్యము పేర్మిన్. 209

ఆ. ఒడలియస్థిరత్వ-మూహించి యాత్మయం, దధికనిష్ఠ గలుగు-నతఁడు సకల
భూతకోటివలనఁ-బొందఁడు భయము రా,గాదిదుఃఖములకు-నగపడఁడు. 210

క. వినుయోగయుక్తునకు శ,స్త్రహతి జలబాధ యగ్ని-దాహము మొదలై
చనువివ్వికారములు లే, వనఘ నతఁడు ఘోరదైన్య-క్రమమునఁ బడ నైనన్. 211

క. తనయందఁ దన్ను లెస్సగఁ, గనుటం గడచినసుఖంబు-గలుగదు లోకం
బున నెందు దాని కయ్యెడు, వినుతానుష్ఠానమునకు-వినుమది వలయున్. 212

వ. అయ్యనుష్ఠానం బెట్టి దనిన. 213

క. తనమొఱఁగిన తెరువున నె,మ్మన మంతర్వర్తి చేసి-మఱి బాహ్యగతిం
జననీక యుండఁగ నది యొం,దనువునఁ బడు నిలుప వలయు-నచ్చట దానిన్. 214

వ. అది యెట్లనిన. 215

తే. దంతములు జిహ్వ గుత్తుక-తాలుతలము
కంఠనాళంబు హృదయంబు-గణ్యచరిత
మఱియు [1]లోపల నెచటికి-మనసు మెలఁగఁ
దాఁ గదల్పక యచటనె-యాఁగవలయు. 216

వ. అని చెప్పి నని చెప్పి నాతో శిష్యుం డని మఱియు నం బలికి తలంచికొని కొండొక నవ్వుచు నవ్విప్రుండు నా మొగంబు చూచి యచ్యుతా యా సిద్ధుం డను వాఁడ నేన కదా నీ యెఱుంగని దియొదియును గలదె మఱియు సత్కాశ్యపనామధేయుం డడిగిన తెఱంగు దానికి నుత్తరంబు నా యిచ్చినవిధంబును విను మని యి ట్లనియె. 217

ఆ. కేలు మొగిచి వినయ-శాలి యమ్మేధావి, విశదకరుణఁ జెప్ప-వే మహాత్మ
పరమమోక్షకరణ-పరిణతం బైనయు,దాత్తసూక్ష్మసుకర-ధర్మ మనిన. 218

వ. అనిన నవహితుండ నై యాకర్ణింపు మని పలికి యి ట్లంటి. 219

ఆ. పాలకడవ పెక్కు-పనులఁ గోడిం బిన, యాతఁ డెట్లు దాని-నరసికొనుచు
నుండు నట్లు లోన-నునిచినమనసు నేమఱక యాత్మ వెదకు-తెఱఁగు మేలు.

క. ఈ తెఱఁగున నుద్యుక్తుం, డై తెలి వొందినమనంబు-నతులవివేక
ఖ్యాతి మఱగించి శశ్వ,ద్ద్యోతిత మగు బ్రహ్మముం జ-తురయోగి గనున్. 221

తే. అయ్యనాదితత్త్వము చక్షు-రాదికంబు,లైనయింద్రియములకు గ్రా-హ్యంబుగాదు
సకలమలనిరాసాద్య ప్ర-సన్నతరమ,నః ప్రదీపంబు తద్దర్శ-నం బొనర్చు. 222

క. కలయంగ నెల్లయెడలం, దలఁగును లోచనములును-శ్రవణంబులు హ
స్తంబులు నై యాతత్త్వం, బు,జ్జ్వలభంగి వెలుంగ-యోగవంతుఁడు గాంచున్. 223

1. చ. లోపట...మలఁగె.

క. తను నేర్పరించి కేవల,మును శాంతము నైసతత్త్వకమును సంతతముం
గనుచున్నఁ డన్ను నెఱుంగం, గను జీకటిఁ బాపు వెలుఁగు గలుగుం బుత్త్రా.

వ. బ్రహ్మవిద్యారహస్యంబు సర్వంబు నీకుం జెప్పితి నీ వింక సుఖవి గమ్ము పొమ్ము నేనుం బోయెద నని యామంత్రణంబు సేసిన నపాస్తసంశయుం డయి యా శిష్యుం డరిగె నిట నిన్ను దర్శింప వచ్చితి నని పలికి యమ్మహాద్విజుం డంతర్హితుం డయ్యెఁ బరమహితం బైనయీవాక్యసంతానంబు సమవధానంబున వినం బడియెనే పాండవముఖ్యమా నాఁడు రథస్థుండ వయిన నిన్ను నేలదీయుం బయిన యర్థజాతంబు వినిపించితి నని యప్పురుషవరుతోడం బురుషోత్తముండు వెండియు నిట్లనియె. 225

సీ. వ్యామిశ్రమతి యగుజనతనికి వక్రకాత్ముఁ, డైనవానికి నవశ్రధానరహిత
చేతస్కునకు నిది సెప్పఁగా దేదొల్లి, తెలియంగఁ జెప్పితి దేవతలకు
గాండివి నీవు దక్కఁగ నిది మర్త్యులా, కర్ణింపఁ దగువారు గలరె యొరులు
పరమరహస్య మీశపరిపాటి దీన నయ్యమృతవస్తువు గని యఖిలదుఃఖ

ఆ. ములుఁ దొలఁగి నిత్యసుఖము క్రత వెలుఁగొందు,నరుఁడు వైశ్యులైన నాతులైన
శూద్రులైనఁ గండ్రుసుస్వాయిమ్మయిముక్తి,బ్రాఁతెబ్రాహ్మణులకురాజులకును.

క. వినిపించితి నిను బోధం,బునకు నుపాయంబు ఫలసముదయము మోక్షం
బును సౌఖ్యనిర్ణయము న్నిక్కనుట గడవ సుఖము లొండుగలవే యరయన్.

ఆ. శ్రద్ధ గలిగి లోకసంగ్రహాసంగంబు, నీడ విడిచి యెవ్వఁ డీ యుపాయ
ముల భజించు వాఁడు మోక్షలక్ష్మికిఁ బతి, యగు నొకింతసందియంబు వలదు.

క. చెప్పం గలయది యెల్లను, జెప్పితి నీ కింత గడవఁ జెప్ప నొకఁడు లే
దిప్పాట నెలల నాఱిటఁ, జొప్పడు యోగంబు నియతిశుద్ధాత్మునకున్. 229

వ. అని యిట్లు కృష్ణుండు జిష్ణునకు నధ్యాత్మవిద్యావిషయంబు లగువాక్యంబులు సెప్పె నని చెప్పిన వినియున్నరనారాయణులు మఱియు నెవ్విధంబున వర్తించిరని యడుగుటయు. 230

చ. గుణసముదానుభూతిహృత్తికోవిదసారవివేకభవ్య చా
రణసురసిద్ధసాధ్యఖచరప్రముఖాఖిలభూతసేవ్య వీ
క్షణకలనాకృతార్థమునిసార్థబహుస్తుతివాక్యరత్నభూ
షణమహనీయఖేలన నిసర్గరక్షాకృతలోకపాలనా. 231

క. నవ్యత్వపురాణత్వద,శావ్యపనయదుర్నిరూపసౌందర్యా వే
దవ్యాసవాక్ప్రశంసిత,దివ్యధురాధుర్య యోగిధీసత్కార్యా. 232

మాలిని. భువనభవనదీపస్ఫూర్తితేజోవిలాసా
సవితృశశిమయత్వస్ఫారచక్షుర్వికాసా

వివిధనిగమవిద్యావేద్యమాత్మప్రభాసా
భువనవిజయలీలాప్రౌఢచేతోనివాసా. 233

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతంబయిన శ్రీమహాభారతంబున నాశ్వమేధపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము. 234





హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## అశ్వమేధపర్వము, ద్వితీయాశ్వాసము





సుఖనిష్పాదనకే
లీనక్తపదారవిందకలీలా సతతా
భ్యాసవికాసిసమాధిస
మాసాదితశాంతిలోల - హరిహరనాథా. 1

బ్రాహ్మణగీతలు.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

ఆ. అట్లు శౌరి పార్థు - నంచితబ్రహ్మవిద్యాప్రబోధకంబు - లైనయట్టి
వినుతవాక్యములు సవిస్తరముగ విన్పించి యతనివలని - ప్రీతి జేసి. 3

వ. వెండియు నిట్లని బోధించు. 4

సీ. భర్తృభార్యాకృత - వ్యసంవాదంబు, నభమనామకము నై - యతిశయిల్లు
నట్టిది యొక యితిహాసంబు విను పార్థ, జననుతసమధిక - జ్ఞానవర్ణి
తాత్మకుఁ డైనమహాద్విజుఁ డొకఁడు విప్రకృత్యప్రదేశసేవిత్వనిరతి
నున్నెడ నల్ల నాసన్న యై వినయంబు, భక్తియు నెసఁగఁ దత్పత్ని ప్రణతి

తే. యాచరించి మహాత్మ - యాధ్యాత్మబోధ, భరితఁ గాఁ జేయవే నన్ను - గరుణ పల్ల
వింప నని దయ వుట్టంగ - వేఁడుటయును, మందహాసవిభాసి తన్మోమగువఁ జూచి.

క. ఈ మాటకుఁ జారుముఖి, నామది ముద మందెఁ గాన - నాతికి నిది యే
లా మేటితలం పనుత్రో, పేమియు లేదోపి వినుము - హితవచనంబుల్. 6

వ. నా యెఱింగినభంగిఁ జెప్పెద నని పలికి యయ్యతులవ్రతుండా పతివ్రత కిట్లనియె.

సీ. వినను గానను జేయ - వెర వైనయవి కర్మములు వానిఁ గర్మకర్తలు సమస్త
సిద్ధిప్రదము లని - చెప్పుదు రజ్ఞానతిమిరాంధులై విను - ధీరచిత్త
జగమున లేదు నిష్కర్మత్వ మొందేనిఁ, గలిగె నేనియును మా - ర్గ్యముగ దాని
నిందింతు రెక్కుడుక్కనెల వది యాత్మ నేఁ, గను బ్రహ్మంబు నిష్కళత నందు

తే. వెలుఁగు నగ్నితో సోముండు గలసి మిథున
ధర్మమం దెప్డు నడపి భూతములఁ దాల్చు
నజుఁడు మొదలుగ నఖిలోకపాస్తి యందుఁ
జేయుదురు శాంతి నింద్రియజిత్త్వ మొంది. 8

వ. అక్షరంబు తెఱం గెఱింగించెద. 9

సీ. స్పర్శంబు రసము రూపంబును శబ్దంబు, గంధంబుఁ గా కునికి కారణముగఁ
ద్వక్కున జిహ్వానేత్రమున శ్రోత్రంబున, ఘ్రాణంబునను బరిగ్రహవిధాన
మాచరించుటకు లోనై యుండ దాత్మ, [1]మమలినబుద్ధ్యవగమము దానిఁ
బ్రాపించుఁ బ్రాణాదిపంచవాయువులును, విను దానివలన వర్తనముఁ బొందు

తే. నంద డిందుఁ బ్రాణంబు నపానమును స
మానవామక వ్యానమధ్యమున నడచు
మెలఁగుచుండుఁ బ్రాణాపానములకు నడిమి
దెస నుదానంబు శ్రుతి యిట్లు దేటపఱిచె. 10

క. నెలకొని ప్రాణాపానం,బుల బురుషుఁడు సుప్తుఁడైనఁ బొలఁతి విలీనం
బు లగు సమానవ్యానం,బులు రోగులు సంశయంబుఁ బొందరు దీనన్. 11

క. విను తెలియంగ నుదానం,బున సుప్తుం డైనఁ బ్రాణము నపానంబున్
ఘనజనిభలోచనా పురు,షుని విడువవు యోగిజనులచూపి ట్లుందున్. 12

అంతర్యాగప్రకారంబు నిరూపించి చెప్పుట.

వ. ఇవ్వాయువు లేనును మనంబును బుద్ధియుం గూడ నేడును వైశ్వానరునకు జిహ్వలు వైశ్వానరుం డనఁ బ్రాణులదేహంబులం దగ్నిరూపంబున వెలుంగుచున్న యాత్మ యందు ఘ్రేయంబును భక్ష్యంబును దృశ్యంబును స్పృశ్యంబును శ్రావ్యంబును మంతవ్యంబును బోద్ధవ్యంబును నగు నీసప్తసంఖ్య సమిధలు ఘ్రాతయు భక్షయితయు ద్రష్టయు స్ప్రష్టయు శ్రోతయు మంతయు బోద్ధయు నయిన యాయేడ్వురును వరుసను ఘ్రేయాదు లయిన హవిస్సు లేడింటిని వేల్చు ఋత్విజు లిది సప్తహోతృవిధానప్రకారంబు వైశ్వానరువదనంబులు పదియు [2]దిగ్వాయుసూర్యచంద్ర పృథివీపావక శక్ర విష్ణుప్రజాపతిమిత్త్రాత్మకంబులు శబ్దస్పర్శరూపరసగంధవక్తవ్య కర్తవ్యగంతవ్యవిసర్గానందంబులు హవిస్సు లీపదింటిని గ్రమంబున నాహుతులు సేయుహోతలు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణవాక్పాణిపాదపాయూపస్థంబు లయినదశేంద్రియంబు లిత్తెఱంగు దశహోతృవిధి యీరెంటిని నెఱింగి యిం దేవిధంబున నేనియు జీవాత్ముం డుపద్రష్ట గా నంతర్యాగంబు నడపు యోగిజనంబులు జననమరణవిముక్తు లగుదురు బహిర్యజ్ఞపరులు గమనాగమనభ్రమణంబులం బొందుచుండుదు రని చెప్పి వెండియు. 13

---
1. క. మనోవబుద్ధ్యవగమము, 2. చ. దిగాకాశసూర్య.

క. విను ప్రణవాదికరూపస్వనిరూఢిం బుట్టు వాక్కు దాని వెనుచనుగా
మనసము పురుషార్థబుద్ధిం, [1]బనుపడి యని చెప్పె పతికి బ్రాహ్మణి దనవూ. 14

క. విని యా విప్రుని తో ని, ట్లను నస్యోలనాగ మన మగనథు ప్రేరేపం
గ నెగయు వాక్కు తదనువర్తనము మనంబునకు నెవ్విధంబునఁ గలుగున్. 15

వ. అనవుడు నతండు. 16

చ. మనసు నుదానవాయువును మానిని గూడి వెలార్చు వాక్కు నా
త్మ్మనివలనన్ భవద్వచనసమ్మతి జనకానుభవంబుచొప్పనై
నను విను కార్యమున్ గుఱిచి రసం దగ వాగనువర్తనంబు సే
యన వలసెన్ మనంబునకు సమ్మయి గల్గుట నట్లు సెప్పితిన్. 17

వ. అని పలికి మఱియు నమ్మహీసురోత్తముం డి ట్లనియె. 18

క. మనసును [2]వాక్కును మాలో, ననఘచరిత యెక్కు డెవ్వరని యంభోజా
సను నడిగిన పతిఁ డెక్కుడు, మన మనవుడు వాణి యక్కమలభవుతోడన్. 19

వ. ఏను నీకుం గామదోహిని నయి యుండ న న్నెట్లు దక్కువగాఁ బలికి తనిన నతండు స్థావరంబును జంగమంబును నన నాకు రెండుమనస్సులు గల వందు స్థావరంబు నాయొద్దను జంగమంబు నీకడను నిలుచు భవద్గోచరత్వంబునం బరఁగువర్ణంబు మంత్రంబు స్వరంబు జంగమమనస్సుగా నెగడు దానికంటె నీ వెక్కుడు నీకంటె నెక్కుడు స్థావరమనస్సు గావున నిమ్మాట యాడం గల దానవు గా వని నిర్దేశించె.

క. విను మమ్మయినిర్దేశం,బున నవ్వాగ్దేవి మూర్ఛ వోయినయ ట్లె
ట్టిని బలుక కంతి పదపడి, వినయంబున నజుని శరణు వేఁడె లతాంగి. 21

వ. అనిన బ్రాహ్మణి పతితో బ్రహ్మమాటకుం గొఱవోయినవాణి యేమిటం దేవ నని యడిగిన బ్రాహ్మణుం డి ట్లనియె. 22

క. ప్రాణాపానంబులయెడ, వాణి నిలుచుఁ గాన ప్రాణవాయువు వొడవి త
త్త్రిణత్వ మఖుడిపె నది గీర్వాణజ్యేష్ఠప్రభావవాసిత యగుటన్. 23

వ. ఇట్టి వని వాఙ్మనసప్రకారంబు తెలుంగుట మోక్షంబునకు మూలం బింకను వాణీమనస్సుల తెఱంగు సెప్పెద వినుము. 24

తే. ప్రాణఁ బొదువుట వాణి యపానుఁ జెంది
తా నుదానభూతాత్మయై తనువు విడచి
వ్యానచేష్టిత సర్వసంవ్యాప్తి నొంద
మనసు సుస్థితి నొందు సమానునందు. 25

వ. మనసు సుస్థితిం బొందుట ముక్తికిం గారణం బని చెప్పి వెండియు. 26

సీ. ఘోషిణి నాఁగ నఘోషిణి యన రెండు, తెఱఁగులు గలిగి వాగ్దేవి వరఁగు

1. క. అనుపడ ఇని. 2. గ. వాకును దమలో.

కం దఘనోపేతకణిక గర్భయసి యుత్తమరసంబు, గోవుచందంబునఁ గురియుచుండు
సత్యంయురూపధిక్షత్యప్రభావోజ్జ్వల, బ్రహ్మవాదిని యిట్లు బ్రాహ్మవిధము
గనుట మహాసందర్భకర మని చెప్పి యవ్విప్రుండు మఱియు నక్కాంతఁ దిలోడ

తే. విషయము ఘ్రాణాదికములు లైదు మనసు బుద్ధి
యొకట యధిష్ఠానమున నుండిరయును నెఱుంగ
వలల రూపం వొంటివిషయంబు నలవికోనఁగ
ననిన వివరింపు మా తెఱం గనియె నింతి. 27

వ. అనుటయు నయ్యావనీదేవుం డయ్యువిద కి ట్లనియె. 28

సీ. గంధంబు ఘ్రాణంబ కాని తక్కిన యూఱు, నధిగమింపఁగ నోప వధిగమించు
రసము జిహ్వాయ యితరము లాపనికిఁ గావు, రూపంబుఁ జక్షుస్స యోపు నెఱుఁగఁ
జెలువమి యొఱుఁగవు తెలివ సంస్పర్శంబుఁ, గాంచుఁ జర్మంబ తక్కటివి గానఁ
జాలవు శబ్దంబుఁ జాలుఁ బట్టంగ శ్రోత్రంబ యన్యమును దక్కరణములకు

తే. వెళవు లేవు సంశయితసంవేదనంబు
మనసుకృత్యంబ యితకార్యతమునకు నొండ్లు
పోవు నిష్ఠ బుద్ధిన యగుఁ జొరఁగ నేర
వి త్తెఱంగున కపరంబు లెఱిఁగికొనుము. 29

ఇంద్రియమనఃపరస్పరసంవాద ప్రకారము.

వ. అని చెప్పి మనస్సునకు నింద్రియంబులకుం దొల్లి గలిగినసంవాదంబు సెప్పెద నాకర్ణింపు మింద్రియంబులు మనస్సుతో నేము నీవు నొక్కరూప యనుటయు మనస్సు వాని కి ట్లనియె. 30

చ. చన దిటు లంట గం పెఱుఁగఁ జాలదు నాసిక జిహ్వయుం జవుల్[1]
గొన వెర లేదు రూపు గనుఁగొంటకుఁ గన్ను వలంతి గాదు సోఁ
కు నెఱుఁగుశక్తి చర్మమునకుం బ్రభవింపదు శబ్దజాతము
న్వినఁ జెవి కల్ప మేనియును నే రొప్పడఁగూడదు నేఁ దొలంగినన్. 31

వ. నిజంబుగా నేను దొలంగితినేని. 32

ఆ. అప్రయోజనంబు లైయుండు నాఱిన, నిప్పులట్లు శూన్యనిలయములును
బోలె మీస్వరూపతలు గాన మనలోన, నెక్కుడేన చూపె యింతనిజము.

వ. అనిన విని యింద్రియంబులు మనంబున కి ట్లనియె. 34

సీ. ఇంతవ ట్టటిద యిల్లైనయుంతన, కలుగు నేర్చునె యధికత్వ మేము
వెలి గాఁగ గ నీ వొకవిషయంబు నేనియు, ననుభవించితియేని నధిక మగుట
గానంగ వచ్చు మాలో నొకం డడఁగిన, ననుభవింపుము తదీయార్థ మట్లు

1. గ. జిహ్వాయుం జవుల్ గొన వెర లేదు.

గాక ఘ్రాణంబున ॥ గంధంబు జిహ్వ రసంబు చిత్తమున రూపంబు నెఱుఁగు

ఆ. చర్మకర్తృకేసి ॥ సంస్పర్శవిషయంబు, శ్రోత్రయుక్తి శబ్దసూత్రగంటు
కాని యొంట నొంటిఁ గబలింపఁ జాల వె, ట్లధికశాంతి రూఢి ॥ శాసెపేవి. 35

క. మును మే మాలంబించిన, వెనుకఁ గదా నీకు ననుభవవిరద వశతం
మనసా [1]నీ వెంగిలి కాఁదనుమా యవ్విషయ మెక్కు ॥ చెయ్యెఁడు మనసా. 36

క. నీ వదఁగినను బ్రాణముఁ, గావఁగ మాయందు బోధకంబసుద్రవ్యం
బావర్తింపఁగఁ జేయుట, గావించును నీకుఁ దెలివుఁ ॥ గనకొను మదియున్. 37

సీ. అట్లు గా దిట్లని కళ్ళును శాసనము సేయఁ, గదు నేర్చు శిష్యులికెడేసుఁ బోటు
వినిపింపఁ దొడఁగి యశ్వినుశాస్త్రములు వార, లుగ్గడింపఁగ గనుకొజ్జవారల
మముఁ గొని విషయోత్కరము నీవు భోగ్యంబు, గాఁ జేసికొందు నీకళలు గన్న
యప్పుడు మా లేమి ॥ నవ్విషయంబు బొం, కైన వాటి లేనికయాలయంబు

ఆ. జెంది మరలినట్లు ॥ నేడ్పాటు వారయుదు, గాక సర్వభుక్తి ॥ గలవె నేడు
నింతవట్టుఁ గాన్పు ॥ మేమును నీవును, గలసి పరఁగ భోగకళల గలుగు. 38

వ. అని యివ్విధంబున మనంబును నింద్రియంబులును సంవాదంబు సేసె నని
ప్పురుషవరుం డావరవర్ణినితో వేఱొక్కండు విను మని యిట్లనియె. 39

సీ. ప్రాణప్రభృతు లగుపవను లంభోరుహా, గర్భుని నొక్కటఁ ॥ గావఁ బోయి
యెక్కుఁడు మాలోన ॥ నెవ్వఁడు నావుడు, నవ్విభుం డెవ్వార ॥ లడఁగ నడఁగు
దురు పెఱవార లెవ్వారికిఁ బ్రవర్తన, మొందిన నెల్లవారును జరింతు
రధికు లందఱకును ॥ నట్టివారలు మీరు, సనుఁ డని పలికినఁ ॥ జనక నిలిచి

ఆ. ప్రాణుఁ డాది గాఁగ ॥ [2]నందఱుఁ దమతమ, వలన నవ్విధంబు ॥ గలుగఁ దెలుప
నాతఁ డే సొంగనాయది యట్టిద, విను:డు మీవి శేషవృత్తిభంగి. 40

తే. ఎప్పు డెవ్వరివలన నేఁచొప్పు గలుగు
నవుడ వా రెక్కుడగుదు రన్యోన్యమిత్ర
భావమునఁ జాల్పుఁ దొండొరుఁ ॥ బవనులార
పొరిఁ బరస్పరభావనాపరుల రగుఁడు. 41

వ. ఇత్తెఱంగున మీరు భద్రం బగుం బొం డని వుచ్చె నట్లుపదేశించిన బ్రహ్మ
వాక్యంబుల వాయువులు సమత నొందె నని చెప్పి వాయువిషయం బైనయది
నారద దేవమతసంవాదంబు సెప్పెద నాకర్ణింపు మని బ్రాహ్మణుండు బ్రాహ్మణి
కిట్లనియె. 42

తే. దేవమతుఁ డనువిప్రుండు దేవమునివ, రేణ్యుఁ డగునారదుని నొక్కపుణ్యభూమిఁ
గాంచి వినతుండై యాలస్యకరుణ వడసి, భక్తిరసముప్పొంగారఁ దన్ను బ్రాంతమునకు.

సీ. అల్లనఁ జన నాతఁ ॥ డాదరంబున నిందు, రమ్మందు మనుచుఁ గరమునఁ జూపు

---

1. అ. 'నీవ యొకఁడ గావునూ'. 2. గ. ( ఇమములు చమటెము.

నెడ సమాసీనుఁడై కడు వినయంబున, హస్తముల్ మొగిచి దశరథాత్మజుఁ డగ్ర
మొఱఁగింపు పవనంబు లేనింటియందును, జాయమానం బగుజంతుప్రసవుఁ
దొలితొలి యెద్ది దాఁ దొడఁగు వర్తింపంగ, ననవుడు నారదుం డతనితోడ
తే. వాయు వెయ్యది గర్భసంవాసమునకుఁ, జొనుపు జీవునిఁ దజ్జంతుజననవేళఁ
దొలుత దానికనంతరకలితమైన, మారుతంబు ప్రవర్తించు మఱియు వినుము.

తే. పురుషునందు సమానంబుఁ బొలఁతియందు
వ్యానమును జాస్తె పొడమించుఁ వరుస ననఘ
శుక్లమును శోణితంబును జాలఁ గల్గు
నయ్యోగంబును విధిచెయ్దిననుర్ఁ బొంద. 45

క. విను సృష్టశోణితంబునఁ, బనుగొనుశుక్లంబువలనఁ బ్రాణుఁడు దగ వ
ర్తన మొందుఁ బ్రాణశుక్లము, లనూన హేతువులుగా నపానుఁడు నడచున్. 46

క. చనుఁ బ్రాణుఁ డధోగతి మూర్ధ్వనిరూఢి నపానుఁ డివ్విధము గలయీరెం
టను నగ్నిమదోదానంబును వ్యానంబును సమానమును వర్తించున్. 47

ఆ. పావకుండు సర్వదేవాత్మకుండు ప్రాణంబునకు నపాననామమునకు
నంతరమున వెలుఁగు నాభవ్యమూర్తి యుదానరూప మండ్రు దక్షజనులు. 48

సీ. విను మహోరాత్రంబులును శుభాశుభములు
సత్యానృతంబులు సదసదాహ్వ
యములును నైన ద్వంద్వములు ప్రాణాపాన
ములకు నామాంతరంబులు తదీయ
మధ్యవర్తిత నొప్పుమహనీయవహ్ని యు
దానంబు దాని నిర్ద్వంద్వభావ
మాంతరయాగవిద్యాప్రవీణులు గండ్రు
పరమశాంతి యనంగ బ్రహ్మ మనఁగ
తే. నరయ భేదంబు లేదన్నయట్టు లుండు, నమ్మహావస్తువును నుదానాకృతియ యు
నంగఁ జెవి యార విందుము నలినగర్భ, చేతనని దివ్యముని యిట్లు సెప్పెఁ గరుణ.

వ. అని చెప్పి యింద్రియమనఃపవనంబుల భంగులు గనుంగొనుటయు నాతత్త్వంబులకుఁ
బరమం బయిన తత్త్వంబు గనుటకుఁ గతం బైయుండు నని పలికి యద్ధరామరుం
డా రామారత్నంబును సదయంబుగా నవలోకించి యుత్తమరహస్యంబు సెప్పెద
నాకర్ణింపు మని యిట్లనియె. 50

## జీవాత్మ స్వరూపనిరూపణ ప్రకారము.

సీ. కరణంబు కర్మంబు కర్త యన్నలద్ద్వి, రాజిత కారకత్రయము చేత
నఖిలంబు సంవ్యాప్తమైయుండు నుపాధిగాదు, లును మనంబును బుద్ధియును బ్రవరులు
కరణహేతువు లండ్రు గంధాదివిషయసం, లతియు మంతవ్యబోద్ధవ్యములును

గర్మహేతువు లగుఁ గఱవుఁ గొనఁగ నానఁ, గాన ముట్టఁగ వినఁగాఁ దలంప

తే. నిశ్చయము దగఁ జేయంగ నేర్పు[1] లేదు
గలవు జీవాత్మునకు నవి కర్తృహేతు
భూతములు [2]వాని విషయానుభూతి నతఁడు
పొఱఁగనిమ్ములు మోక్షహేతువులు సుమ్ము. 51

వ. కరణకర్మకర్తృకారకాత్మకుం డగుజీవాత్ముండు భోక్త యగుట దక్కిన వివిధ విషయమూర్తు లగుహవిస్సుల నుదాసీనత్వస్రుగ్గతంబులు సేసి వేల్చునిమ్మ నాత్మస్వరూపం బగునవలంబు ప్రజ్వలితం బయి యవిద్యాధూమరహితం బగుచుం బొలుచు నది మోక్షప్రకారం బట్లు గాక భోక్త యగునేని నట్టిది బంధప్రకారం బని నిర్దేశించి ముక్తభావంబునకు మూలం బయినయోగ యజ్ఞంబునం దేను బ్రవృత్తుండ నై యున్నవాఁడ దానికి సర్వపరిత్యాగంబు దక్షిణ దాన సకలాత్ముం డగునారాయణుండు ప్రీతుండై స్వీకరించు నద్దశ సేరు మునులు ముక్తి యని చెప్పుదురని చెప్పి యవ్విప్రుండు వెండియు. 52

సీ. శాస్త్ర మొక్కఁడ తచ్ఛాసనంబున నయోఁ, జరియింతు నొక్కఁడ గురుఁ డతండు
చెప్పినయర్థంబు చిత్తంబులో నుంతు, శ్రోత యొక్కఁడ తద్‌జ్ఞాతబుద్ధి
నెగడుదు నొక్కఁడ తగవంగ విద్వేష్ట వాని వ్రాల్చినదిక్క వ్రాలి యొడరుఁ
గడవుదుఁ గడవంగఁ గారణ మయ్యెడు, తెలుఁగు పెద్దలచేత నెఱిఁగినాఁడ

ఆ. వినుము దేవతలును మునులును బరమేష్ఠి, యొద్ద కరిగి మాకు నెద్ది హిత మొ
యనిన నావిధాత యక్షరోపాసన, మనియెఁ గాన దుర్గ మబల కడతు. 53

వ. ఇంక నెక్కడ గడచెద మున్న కడచితిఁ గ్రోధతిమిరంబును లోభవ్యాళంబును గామదస్యుదూషితంబును నగుదుర్గంబు గడచి యొకవనంబు ప్రవేశించితి ననిన విని యవ్వనిత యవ్వనం బెట్టిదని యడిగిన నమ్మహాద్విజుం డి ట్లనియె. 54

ఉ. అంతకుఁ జిన్నలున్ వెదక నంతకు బెద్దలు లేవు దుఃఖ మ
త్యంతముఁ జేయ సౌఖ్య మొస లార నొనర్పఁగ నొండొకంటియం
దంతటినేర్పు లేదు వెఱ పన్నది యేమియు నవ్వనంబు ని
శ్చింతతఁ జొచ్చి యున్ననరుఁ డెందదు నిర్వృతి నెందు నుగ్మలీ. 55

తే, కొన్నిటికిఁ బంచవర్ణముల్ కుసుమఫలము, లందుఁ గొన్నిటి కేకవర్ణాంచితంబు
లవనిజములు గొన్నిటికి నవ్యక్తవర్ణ, కములు సౌరభ్యమాధుర్యసమధికములు. 56

వ. అవ్విపినంబున. 57

క. వృక్షంబులకుం గలుగును, దీక్షాగుణములును నతిథిసత్ప్రతిక్రియయుఁ బ
ద్మాక్షి యతిథులు బ్రహ్మాస,దృక్షులు సౌఖ్యంవునిట్టు దేలుదురు మునుల్. 58

1. గ. లేదు కలదు జీవా. 2. గ. వానివిషయానుభూతి.

ఆ. కెలకులకును వింటికిని మేర లిడియన, రాదు గాన యయ్యక్షరణ్యాభూమి
వెలుఁగు లొండ్లు సారవుక్షవిసుము క్షేత్రజ్ఞుండు, రవి తదీయసేవకభవముఁ బాచు.

క. గగనమున బ్రహ్మసంభవ, మగుజలము వహించుచుండు నందులనదులున్
నగములు విను దానఁ దప,స్విగణం బవ్యయపదంబుఁ జెందం గాంచున్. 60

వ. ఇట్టి దవ్విపినంబు. 61

ఆ. మాననీయనిశ్చితవ్రతమహితతపోధన,వంతు లైనయట్టివారు శాంతి
దాంతినిస్స్పృహాతలుఁ దలఁకొన సుసమాహి,తాత్ములై వసింతు రందుసాధ్వి. 62

వ. అని చెప్పి మఱియును. 63

సీ. వినుము మూర్కొనఁ జవిఁగొన దర్శనస్పర్శ,నములు లాచరింప విగ్రసంగ నెలయు
సేమిసంకల్పంబు నెడఁ జేర్ప నిష్టార్థ,ములను[1] ననిష్టార్థములను గోరు
టయును నొల్లకత్రోచుటయునుస్వభావకృ,త్యము లవిగనుఁగొంచునబలవానఁ
బొరయ నె ట్లన్న మేల్ దొరకొనుఁ గోరక,యును బోదు కీడు ద్రోచినను దీని

తే. నెఱిఁగి యేను స్వభావంబు నెడఁ బరోక్ష, బత్రగతజలబిందువుగ భంగిఁ దాల్తు
నని మొఱంగించి బ్రాహ్మణుఁ డతివలోక, మఱియు నిట్లను శాత్రవసమథనకల్య.

వ. ఒక్కయెడ నధ్వర్యునకు యతికిం గలిగినసంవాదంబు సెప్పెద నాకర్ణింపు మధ్వ
ర్యుండు పశువుం బ్రోక్షించుచుండ యతి నిరీక్షించి యిది హింస గాదే యనిన
నతండు. 66

తే. ఛాగ మిది యరయంగ నాశంబుఁ బొంద,దూర్ధ్వలోకసుఖంబుల నొందుఁగాన
శ్రుతులవాక్యముల్ నీ కెక్కసూనృతంబు, లగునదేని నీ విట్లంటయనుచితంబు.

వ. అని వెండియు నప్పశువు నుద్దేశించి. 67

క. భూతములు నింద్రియంబులు, నాతతగుణ యాత్మ యోనులందుఁ గలయుఁ బిం
డేతరుఁ డగుజీవుఁడు సౌ,ఖ్యాతిశయం బొందు నధ్వరాతిశయమునన్. 68

క. అని పలుకుటయును యతి యి,ట్లను ఛాగము పుణ్యగతికి నరిగెడుఁ బో యి
ప్పని నీ కెవ్విధము ప్రయో,జనంబొ సిద్ధించుఁ జెపుము సమ్యక్ఫణితిన్. 69

వ. అనుటయు నధ్వర్యుం డతని కి ట్లనియె. 70

క. అగమము పశువిధిం దగ, యాగ మొనర్చినఁ ద్రిపిష్టపానేకమహా
భోగానుభూతిభవ్యస,మాగమ మది యనుట బొంకె యాగమువేదీ. 71

చ. అనవుడు హింస పాప మని యాగమవాక్యములంద కాదె యేఁ
గని యిటు లంటి నన్ను యతిఁ గన్గొని నీవు సమాధిఁ బ్రాణరో
ధనము మనోలయంబు సుకృతంబులుగా నొనరించి వెండి యో
గనిరతిఁ బొందె దత్తెఱఁగు గాదొకొ హింస దలంచి చూడఁగన్. 72

వ. అని పలికిన నయ్యధ్వర్యునకు నయ్యతిముఖ్యుం డి ట్లనియె. 73

1. గ. మునఁ గోరును మన్ని పొందలఁ గోరు,

చ. పరమతపంబు గాఢపరిపాకము [1]నొందినఁ జిత్తసౌఖ్యకా
[2]క్షరమునఁ దత్త్వభూతగుణజాలతనున్ క్షరమున్ వివేకతా
పరిణతిఁ బాపి చూచి యనశ్వరమానుషస్థితి నూది పొల్లలం
బొరయక త్రోపు హింస యనుబుద్ధి విమూఢత గాక బోధమే. 74

చ. అనవుడు నాతఁ డార్యవచనామృత మానితవాఁడు గీడు మేల్
గనుఁగొనఁ జాలు నేను బహుకార్యమునప్పుడు మీ రను గ్రహిం
చినక్రియఁ జూడ వేర్తుఁ జదచిద్ద్వయమున్ విభజించి దాన హిం
సనము నొకింతయుం బొరయ జన్నము సేయుదు మేలు నొందుదున్. 75

క. అనుటయు నతనికి యతి యి, ట్లనుఁ బశుయజ్ఞమున కంటె ననఘ తపోయ
జ్ఞనిరూఢి మేలుగావున, వినిపింపఁ దలంచి యుంటి వేయును నేలా. 76

వ. అనవుడు నమ్మాటకు నయ్యధ్వర్యుం డొడంబడియె నని చెప్పి యాభూసురవర్యుం డాభామినితో నీయర్థంబున కొక్క యితిహాసంబు గల దాకర్ణింపుము సహస్ర బాహుం డగునర్జునుండు దుర్జయప్రతాపంబున నఖిలద్వీపంబులు నేలి ప్రాలి తనకు నెదురు లే కున్న విజృంభించి పరశురాముం డొడరి యతనికి నత్యంతం బప్రియం బాచరించిన నతండు బహుశాఖోపశాఖాశోభితం బయినపాదపంబు సొబగుగా నఱికి పడవైచినచందంబునం బరశుఖండితసర్వాంగునిం జేసి నంత నిలువక తత్పుత్రులుంబురాజులుం గూడుకొని తదీయతనయులుం దారు నారాముని యసన్నిధి నతనిజనకుం డగుజమదగ్నిం జంపినం జెంపారుకోపంబున నాటోపం బెసంగ నాజామదగ్న్యుండు రాజుల నెల్లం దర మిడి యిరువదియొక్కమాఱు పరశుధారపాలు సేసిన నతనికిఁ బితృదేవతలు సన్నిధి సేసి. 77

ఆ. పరశురామ నీవు బ్రాహ్మణుండవు నరే
శ్వరులఁ జంప నేల వలవ దుడుగు
మయ్య యనుడు నాతఁ డట్లన కుండఁ డీ
ఱేను రాజపశువిధానమునను. 78

క. పారనియుతిఁ బాటించి మహారోషాగ్ని పరితృప్త మగునట్టులుగా
వీరాధ్వరంబు సేసెద, వారింపక యుడుగుఁ డనిన వా రాతనితోన్: 79

క. యజ్ఞంబులలోనఁ దపో,యజ్ఞం బుత్తమము దాని నాదరణమునం
బ్రాజ్ఞోత్తమ చేయుము సర్వజ్ఞుఁడు ప్రీతుఁ డగు శాంతరస మొప్పఁ జుమీ. 80

వ. అని చెప్పి మఱియు ని ట్లనిరి తొల్లి యలర్కుం డనురాజు మనస్స్పృష్టంబు లగునింద్రియంబుల కలిగి దివ్యాస్త్రంబులు ప్రయోగింపం జూచిన నవి యయ్యవనిపతితో నయ్యస్త్రంబులం దారు సెడ మనియును రోషావేశంబునం బ్రయోగించిన నతండ చెడు నని యనుం బలికి యొప్పుదేని నీతపోమయంబు

1. గ. కొందిన చిత్సుఖా, 2. జ. క్షరమునఁ జిక్కి భూతగణజాలతనుక్షరమున్.

లైనయస్త్రంబులు[1]సంధింపు మనిన నతండు క్రోధంబు దక్కి యోగంబున శాంతి నొంది వానిం దమ్రాపలపఃఫలాస్త్రసాధితంబులం జేసె నీవునుం దపంబున నంతశ్శత్రుజయసౌఖ్యం బనుభవింపుము బాహ్యశత్రుజయంబు జయంబుగాఁ గానకుము. 81

క. అని నిష్ఠించి పలుక న,వ్వినుతచరిత్రుండు శాంతివిభవంబున నూ
నినమనసుతోడ మునిమ్మానసపాత్రంబైనతపముకనన జేలొండెన్. 82

సీ. అని చెప్పి బ్రాహ్మణుండయ్యెంతికి ట్లనుఁ, దొమ్మిదిగుణములు గొమ్మ కలవు
స్తంభాభిమానహర్షంబులు సాత్త్విక,ములు క్రోధసంరంభములును శోక
మునురాజసంబులు మోహాతంద్రాస్వప్న,ములు తామసము లిట్లు గలుగురిపులఁ
దునుమ నేయస్త్రంబు లను వగు వాన న,య్యాంతరశత్రుచయంబు నెల్లఁ

తే. దునిమి యేనింద్రియంబుల మనము నోర్చి
శాంతి నొంది శ్రీయస్సిద్ధిసాధనం బా
నర్చునది ముఖ్యవైరినిర్ణయముఁ జేయు
నంబరీషగీతలు విను మంబుజాక్షి. 83

వ. అంబరీషుం డనురాజు రాజనీతిపరత్వంబునం బరమప్రభుత్వంబు నొంది యరాతుల నెల్ల విగతాసులం జేసి పూజ్యం బగురాజ్యంబుపరిపాలించుచుండి యొక్క నాఁడు విద్వజ్జనంబులతో నిట్లనియె. 84

తే. అరుల నెల్ల జయించితి నదిజయంబు, గాఁగొనక యున్నవాఁడ నగ్గలపుఁబగఁ జయింపకున్కిఁ దద్విజయమువిహీనుఁడన్న,జనిజరామృత్యువశగవర్తనునిఁ జేయు. 85

క. అంతటిలోభము గెలువక, శాంతి గలదె యని తదీయశక్తి నడఁచి ని
శ్చింతత్వ మొంది యా భూ, కాంతుఁడు సామ్రాజ్యమున సుఖస్థితి వడసెన్. 86

జనకునకు విప్రరూపధరుం డైనయమునితో నైనసంవాదము.

వ. అని మఱియు నవ్విప్రుం డిట్లను జనకచక్రవర్తికి నొక్కబ్రాహ్మణునకుం గలిగిన సంవాదంబు సెప్పెద నాకర్ణింపుము జనకుండు దనకు బెదుర బ్రాహ్మణుండు గొఱగామి సేసిన నతనితో నీవు నావిషయంబున వసియింప వలదు పొమ్మనిన నతండు. 87

క. నీవిషయ మెంతవ ట్టది, యే విని పరమవిషయమునకు నేఁగెదఁ దెలియం
గా వినిపింపు మనుడు నా,భూవల్లభుఁ డూరకుండెఁ బుణ్యచరిత్రా. 88

ఆ. ఊరకుండి మూర్ఛ నూని యొక్కింతసే,పునకుఁ దేఱి యిట్టు లనియె నాడు
తాతతండ్రితరముధరణి మద్వశ్యత, నుండ నాకు మమత యొలయ దందు.

వ. మిథిల నెప్పుడు వసియించెద నిష్ఫారంబును మదీయం బని యంగీకరింపంబడదు కావున నిది నావిషయం బన లేమిం జేసియున్న నతఁడు నాఁడినమాటం బుట్టినవగ

2, గ. సాధింపు

పెంపున సురార్చ్య వచ్చె ననిన విని యవ్విప్రుం డా భూవిభునాననం బాలోకించి. 90

క. నరనాయక నీదేశ మెల్లెడు, పురమున భూమిని మమత్వబుద్ధి గలుగ కే
స్థిరపై యుండుటకుఁ గతం, బరయఁగ నెద్ది వినిపింపు మది విశదముగన్. 91

వ. అనుటయు నజ్జనపతి యతని కి ట్లనియె. 92

తే. అరయు నివి [1]యొట్లుఁ జెడి యొదుగ్రనవియు కాన
వినుము మర్దన బింది యుని వీనిలోన
నొకటియుండు నంగీకారమొలయ నెల్ల
విషయమును నాయదియ యనుమవిధము గలదె. 93

వ. ఏ ట్లంటేని ఘ్రాణాదులకు గోచరంబు లయినను గంధాదులు పెడం గలయవిగా
పున నాయవి యన కుండుటం జేసి భూమ్యాదిభూతంబులు నాచేతనిర్జితంబు లై
[2]మద్వశగత్వంబు నొంది యుండు. 94

చ. అనవుడు బ్రాహ్మణప్రవరుఁ డల్లన నవ్వుచు నిన్ను నారయ
స్మరనమున వేడ్కఁ బుట్టె నర నాయక వచ్చితి నేను ధర్ముఁడం
బనుపడు నివ్వివేకపరిపాకము గాఢనిరూఢభావ మొం
ది నిలుచుఁ గాత నీ దగుమదిన్ సతతంబును శాంతికారి యై. 95

వ. అని ధర్మదేవత జనకునకు వరం బిచ్చి యంతర్ధానంబు సేసె నని చెప్పి యా ధరణీ
సురోత్తముం డయ్యుత్తమాంగనతో హితోపదేశంబు సేసెద నవహిత వయి
యాకర్ణింపు మని పలికి యి ట్లను సంసారవర్తనంబు వదల విడిచి యే నేక
తంబ యున్న యెడ నీవు ముచ్చిలి వచ్చి మదీయవైరాగ్యంబు మాన్పఁ దలంచి
నాకు నధ్యాత్మబోధంబు గలుగం జేయు మని యభ్యర్థించిన నీతలం పెఱింగి
యు నెఱుంగనివాఁడ పోలె నధ్యాత్మవిద్యాబోధక ప్రకారంబు లైన వాక్యంబులు
సెప్పితి నే నింక లోకంబులం గలసి చరించువాఁడం గాను నిక్కపుబ్రాహ్మణుండ
నయితి బ్రహ్మచారి నయితి జీవన్ముక్తుండ నయితి మిముబోంట్లు కొలఁదిగా నన్నుం
జూచెద వది నాతెఱం గెఱుంగమి యేను జగంబు సమస్తంబును వ్యాపించి
యున్నవాఁడ నాయున్నభంగికి నాబుద్ధి సకలపృథ్వీరాజ్యంబును నాకలోకాధి
రాజ్యంబును సరిగా నని తలంచు నాబుద్ధియు నాకు ధనంబు [3]దారువుల నగ్ని
యున్నచందంబున సర్వజంతువులయందును నంతర్గత యై సిద్ధి యున్నది గురు
వాసగృహవాసవనవాసపరు లగుబ్రాహ్మణుల కెల్లను శ్రేయఃప్రాప్తికిం దెరు
వొక్కండ యందఱును సరిత్తులు సాగరంబుఁ బ్రాపించిన తెఱంగునఁ బరతత్త్వంబు
నొందుదురు బుద్ధి నిర్మార్గంబు నధిగమింప నగుఁ గాని శరీరంబున వశంబు
గాదు కర్మంబు లాద్యంతవంతంబులు శరీరంబు కర్మబంధనకరం బింత యెఱుం
గుదుం గాన నాహృదయంబునం బరలోకభయంబు లేదు నాచెప్పిన యధ్యా

1. చ. యొల్లుఁ. 2. చ. మద్వశగతంబు లై యుండు. 3. జ. అరణులం.

ల్మవిద్యావిషయవాక్యంబులతాత్పర్యంబు చిత్తంబున నెలకొలిపి భావనానిరత వయి యుండుము నన్ను పోలెదు వెఱవకు మనినఁ బత్ని సాష్టాంగదండప్రణామం బాచరించి కేలు మొగిచి. 96

సీ. నీవు సెప్పినమహనీయవాక్యనికాయ, మతిగహనం బకృతాత్మలకును
నర్థగ్రహణశక్తియసఘ కల్గునె కృతాత్మల కైనఁ గ్రమ్మఱఁ దెలియ వచ్చి
యుండ దయ్యెఁ గాన నుదయింపఁ బట్టిన, యట్టియుపాయంబు సాదరమున
నాకుఁ బ్రసాదింపవే కరుణాకర, నావుడు నాతఁ డన్నాతితోడ

ఆ. నరణి బ్రాహ్మణుండు గురుఁ డుత్తరారణి తపము శ్రుతము నిర్మథన మొనర్ప
జ్ఞానవహ్ని పుట్టు మానిని యని చెప్ప, వనిత యిట్టు లనియె వల్లభునకు. 97

క. జనవినుతచరిత బ్రాహ్మణుఁ, డనఁగా క్షేత్రజ్ఞుఁ డగుట యల్పము దోఁచెన్
మనమున నతని సరణి గాఁ, గొను టవ్వస్తువు తెలియంగఁ గాని పిదపఁ గదా. 98

వ. అనిన నతం డి ట్లనియె. 99

ఆ. అతనిఁ దోఁపఁ జేయు నట్టిసాధనము లే, దింద్రియముల కందఁ డేమి లక్ష
ణములు లేవు నిర్గుణత్వనిరూఢుం డ, దాంత లేమిఁ దోఁచుఁ గాంత కనుము.

వ. అని నిర్దేశించుటయు క్షేత్రజ్ఞవిషయసంశయంబు వాసి యయ్యింతి శాంతి వొందె నని గోవిందుండు సెప్పిన గాండీవి యా బ్రాహ్మణుండును బ్రాహ్మణియు నిట్టివా రగుదు రె వా రిచ్చటివారు వారల నా కెఱింగింపవే యని యడిగిన నద్దేవుం డతనియాననం బాలోకించి. 101

క. నామనమును బుద్ధియును గృ,పామహితా బ్రాహ్మణుండు బ్రాహ్మణియు వ్యాప్తి
కామేయ మైనక్షేత్ర,జ్ఞానులవస్తు వన నేన యనియె నరేంద్రా. 102

— గురుశిష్యసంవాదంబు కృష్ణుం డర్జునున కెఱింగించుట. —

వ. అనిన విని యర్జునుం డచ్యుతునితో భవత్ప్రసాదంబున మదీయమతి యతి విశదయును సూక్ష్మగ్రాహిణియు నయి యున్నయది పరమం బైనవేద్యం బగు బ్రహ్మంబు నెఱింగింపవే యనుటయు నాకృష్ణుండు గురుశిష్యసంవాదం బను నితిహాసంబు విను మది నీప్రశ్నంబునకు నుత్తరం బయి యుండెడు నత్తెఱంగున మేధావి యగు నొక్కశిష్యుండు సంశ్రితవ్రతుం డయిన గురు నడిగిన నగ్గురుండు ప్రజాపతిభరద్వాజ భార్గవ గౌతమ కాశ్యప వసిష్ఠాత్రి విశ్వామిత్ర ప్రముఖు లగుమునిజనంబు లాంగిరసుం బురస్కరించుకొని విరించికడకుం జని తచ్చరణంబులకుం బ్రణమిల్లి హితం బెయ్యది తత్ప్రాప్తికి సుపథం బెట్టిది వివరింపవే యని విన్నవించిన నన్నలినాసనుండు కృపాధురీణం బైన చిత్తంబుతో న త్తపస్విసత్తముల కెఱింగించిన తెఱంగు నీకుం జెప్పెద నవహితుండ వయి

1. గ. గ్రమ్మఱఁ, 2. క. డెలుపు లక్షణములు లేమి నిర్గుణత్వ 3. బృహస్పతి భరద్వాజ.

యాకర్ణింపు మని పలికి యిట్లనియె. 103

ఆ. ఆదరార్ద్రబుద్ధి నగుచు నలరినమోహముల, గాంచి విరతి గాఁగ గమలగర్భుఁ
డా తపస్విజనులకయాసనంబులుగల,యుంగఁ జూచి యిట్టు లనియె వత్స. 104

తే. సత్యము నన భూతంబులు సంభవించు; సంద వర్తించు దానవయుగము నిదిగు
ణత్రయాత్మకసత్యచరిత్ర మమల,బుద్ధులార సత్యంబు ప్రసిద్ధి వినుఁడు. 105

క. శ్రుతి యనఁ దప మనఁగఁ బ్రజా,పతి యన సత్యంబునకు నపరనామాంబుల్
వ్రతులార సత్యమున న,వ్వితతమహిమ [1]మైనపరవ్యవేద్యము నుండీ. 106

క. కావునఁ గామక్రోధస,మావేశము తెడల విడిచి యనవరతంబుల్
సేవింతురు సత్యము దృఢ,భావాకలనమున యోగపరినిష్ఠాత్ముల్. 107

వ. అది హితంబు తత్ప్రాప్తికి సుపథంబు సెప్పెద వినుండు. 108

క. చతురాశ్రమములును జరణ, చతుష్టయము గాఁగ వర్ణసముదయసంసే
వ్యత నొప్పెడుధర్మము సుం, దతులంబు శివప్రదంబు సగుపథ మరయన్. 109

వ. నాలుగాశ్రమంబులకు సామాన్యంబ యధ్యాత్మవిత్త్వంబు లేక పరతత్త్వంబు
నొంద రాదు మాయత్వాదిత్యేంద్రప్రజాపతులకును లోనుగా నిట్టిద యధ్యాత్మ
దర్శనం బనం జతుర్వింశతితత్త్వావలోకనంబు గావునఁ దత్త్వంబులు వివరించెద.

తే. అంబరాదిభూతములు శబ్దాదిగుణము
లింద్రియములు లిరుదెఱఁగు మునీంద్రులార
మన మహంకారబుద్ధులిట్లావరి ప్రకృతి
గలయఁ దత్త్వచతుర్వింశతత్వ మొందు. 111

క. వినుఁడు ప్రభవవిలయజ్ఞా,ననిరూఢము గాఁగ వీనినైజ పాటలముం
గనిన భవమోహ మొందఁడు, గనుఁ బరతత్త్వంబు నతఁడు గతకల్మషుఁడై.

వ. అని నిర్దేశించి యద్దేవుండు వెండియు. 113

క. వ్యక్త మనిర్వాచ్యం బ,వ్యక్తము సుస్థిరము ధ్రువము వ్యాపిత్వధురా
యుక్తము కలితగుణత్రయ, శక్తి నవద్వారపుర మసాధ్యము సుండీ. 114

క. తత్సాధనంబు తద్గత,చిత్సులభత్వప్రసిద్ధిఁ జేయుఁ ద్రిగుణసం
పత్సారవంత మది [2]గుణ, జిత్సువ్రతులైనవారిచే సాధ్య మగున్. 115

సీ. సంయమివరులార సత్త్వరజస్తమో,నామరూఢములు గుణంబు లవియు
నన్యోన్యమిథునత్వ మన్యోన్యసంశ్రయ, మన్యోన్యసంకలితానువృత్తి
భావ మన్యోన్యోపజీవనాచరణంబు, గలిగి దురోపధత్వగాఢభంగు
లై యుండుఁ దమము నియమితమైనరజస్సుఁ,దన్నియమమున సత్త్వంబునడచు

తే. సత్త్వ మడఁగినచోఁ దమశ్చరిత మెసఁగు
లోభశోకసమ్మోహానిద్రాభయములు

1, గ. మైనపద మకెద్యము. 2. క. గ. చ. గుణ, చిత్సువ్రతు.

వికృతిదుర్మానవాధ్యాపకపకృతికోప
కార్కశ్యమాత్సర్యములు తమస్సంభవములు. 116

ఉ. పాములఁ దేళ్ళనుం బసులఁ బంధులఁ గుక్కలు మీలఁ గోళ్ళులుం
జీమలఁ గాకులుం గ్రిములు జింకలఁ నక్కలఁ గొంకనక్కలు
న్దోమలు మ్రాఁకులుఁ బాదలు నోవులఁ బీడలఁ బొంకువారుముఁ
తామసభాగు లల్ల మఱి తద్విధజంతువు లెన్ని యన్నియున్. 117

క. ఇవి తామసంబు లని గుణ, నివహములోఁ గీడు వాపి నేర్చునతఁడు త
ద్వివిధవికృతినిరసనహేతువివేకము గలుగఁగా నధోగతి దలఁగున్. 118

చ. బలమును శౌర్యమున్ మదముఁ బ్రాభవముల్ సుఖదుఃఖభాగితా
కలనముఁ జెల్మి సేఁతయును గాంతుయు నొల్లమియుం బ్రతాపముం
గలహము నీర్ష్యయున్ బహువికల్పవుభావములఁ గామినీదనం
బులయెడ గాఢరాగతయు బొంకును నుబ్బు రజఃప్రభూతముల్. 119

చ. అవి దొలుబాముసం గలుగు నట్టిజనంబులు నీతు లిట్టి వి
ట్టివి యవి నీతు లన్మతిపటిమత గల్గి త్రివర్గవర్తనం
బు వెరవు నొంది యర్థములఁ బొఁదివిపోవుచుఁ గామసౌఖ్యవై
భవములఁ గ్రాలుచున్ మనుజభావనిరూఢతఁ బొల్తు రెంతయున్. 120

క. రాజసగుణములకుం గల, నైజ మెఱుఁగువారు తజ్జనకవైకృతముల్
ధీజితములు గావింపఁగ, నోజ గలిగి శుభదవృత్తి నొందుదు రెందున్ 121

సీ. సంతోషమును బ్రకాశత్వంబుఁ బ్రియమును, నానందమును గరుణాభిరతియు
క్షమయును సత్యంబు శౌచంబుఁ ధృతియును, కార్పణ్యమును దితిక్షయు నహింస
యును నార్జవంబు ననసూయయును గ్రోధ,రాహిత్యమును నసంరంభతయును
సమత దాక్షిణ్యంబు శ్రద్ధధానతయు న,క్రూరభావంబు హ్రీగౌరవంబు

తే. సత్త్వజాతంబు లివి పూర్వజన్మసంక,లితములైనట్టివా రహంకృతి మమత్వ
మర్థతృష్ణ [1]కామార్తి లేక తుల బోధ, భరితులై యూర్ధ్వలోకవైభవము గంద్రు.

క. వినుఁడా గుణంబు లన్నిటిఁ, గని కొని తత్తదనువర్తి గలుగనివాఁడ
ప్పనిచే భుజింపఁగాఁబడఁ, డనఘాగ్రకులార మ్రింగు నతఁ డారాశిన్. 123

వ. అని చెప్పి యప్పరమేష్ఠి మఱియును. 124

సీ. వేర్వేఱ యుండవు వినుఁడు గుణంబు ల,న్యోన్యసంకలితంబు లగుచుఁ బరఁగు
సంగతత్వమునను సంసారయాత్రా ప్ర,వర్తనం బొనరించు వానిలోన
నెయ్యది మిగులఁ దోఁచి తచ్చేదజన్యంబు, లోలయఁ బొయుటయు నొక్కొక్కమాటు
గలుగు [2]దమం బెఱుఁగలి యధికం బైన, స్రోతస్సధోముఖస్రుతి రజస్సు

ఆ. పెరిఁగినపుడు మధ్య[illegible] వృద్ధిఁ, బొంద నూర్ధ్వవృత్తిఁ బొందు వీని

---

1. క. కామార్తి. 2. అ. దమునను [illegible] యధి.

మును [1]ప్రకారభేదముల నెఱింగించితి, నవి [2]సదుత్తరంబు లనఘులార. 125

క. శ్రోతస్సుల [3]జీవగమన, హేతువగుట నాదిశేష । విభాగములుఁ బ్రా
ణీ తెఱఁగు నొందు నని కను, డాతతమతులార కరణ । మగు పదిత్రోవన్. 126

వ. గుణత్రయంబునం ద్రొక్కుటయే యది త్రోవ యనునట్టివిభ్రమత్వంబు లే కుండునది. 127

క. సాత్త్వికులకు దివము రజో,మయ్యాకలితవర్తనులకు । మధ్యభువనవా
సత్వము దామసులకు నీచత్వాకరాధోజగంబు । సంప్రాప్త మగున్. 128

క. ధర్మార్థకామగోచర, కర్మములకు సాత్త్వికాదిక ప్రకరదికా
రోద్యమ్ములు హేతువు లగు నిష్కర్మత కేశవధ్యానాది । కారణము సుఁడీ. 129

క. క్రమమునఁ బ్రాణంబు నపానము సత్త్వంబును [4]రజస్సు । నాకుం జూడఁగ
యమివరులార యుదానము, తమ మిట్టుల శ్రుతియు సువిదితంబుగఁ జెప్పున్. 130

క. జపమును దానము యజ్ఞము, తపమును గర్తృజనచిత్తదశలను సత్త్వా
ద్యుపహితములగుట నడచుం, ద్రిపథంబుల సాత్త్వికపుగతియు మేలెందున్. 131

క. వినుఁ డెక్కువ దక్కువ లే, కనయము నెనసినగుణత్రి । యంబు మహాత్మే
వినుతావ్యక్తం బనఁగా, జనుసత్త్వము శివ మచలము । శాశ్వతమరయన్. 132

క. వదసప్తాకారనిత్యం, బది దాని తెఱంగు గెలుంగు । వాఁడు విజ్ఞా
నదశావధూతగుఁడై, యుదీపగతిఁ బొందఁ గను ద్విరామయపదమున్. 133

వ. అని యుపదేశించి విరించి వెండియు. 134

మనోబుద్ధ్యహంకారాదితత్త్వప్రకారము.

సీ. అవ్యక్తమునను మహత్తత్త్వ ముదయించు, నది బుద్ధి మతి ధృతిఖ్యాతి సంవి
దుపలబ్ధినామంబు । లొంది యొందును గని, విని చని కావించి । విభుత నొప్పు
దాన నహంకారతత్త్వంబునకుఁ గల్గుఁ, బ్రభవంబు వినుఁడు తద్భావితాత్మ
కంబై ప్రవర్తించుఁ । గార్యనీతుల లోక, మఖిలంబు వర్ణత్రయప్రజనితు

తే. లధ్యయనమును వ్రతమును । నధ్వరంబుఁ
దపము మొదలైనక్రియ లందుఁ । దగిలి నడచు
నెల్లఁ దద్వ్యాప్తిఁ జేసియు । నెల్ల నింత
జగము రంజిల్లు దాని తేజంబువలన. 135

క. వినుఁ డాతత్త్వంబుల సం,జనితము లగు మేదినియును । జలమును దేజం
బును వాయువు నాకాశము, ననఁగ మహాభూతములు నిరతిశయమహిమన్. 136

తే. తద్గుణంబులు సూరె గంధంబు రసము
రూపసంస్పర్శశబ్దముల్ । రూఢభంగిఁ
బరఁగు నవ్విషయములఁ బొందల్పడ్డమనసు
గలుగుజంతువు మోహాంధకార మొందు. 137

1. క. ప్రకారభేదంబుల నెఱం 2. క. సదుత్తరంబు 3. చన్నదిదివగమన. 4. గ. రజస్సు తమస్సు నాఁడఁగ సంఘము,

క. దీన సకలజంతువులును, లీనము లగు చుండుఁ దమయందు లీనస్మృతిధై
ర్యానూనం బగు నిర్మల,మానసమునఁ బొరయనీరు మహితార్యజనుల్. 138

క. విషయంబులు నశ్వరములు, విషసన్నిభములు సమగ్రవిపత్ప్రతిజనకముల్
ధిషణాగుణముల నెల్లఁ గ,లుషములుగాఁ జేయు మోహలోభకరములై. 139

ఆ. మాంసశోణితాస్థిమయశరీరంబులఁ, దారు గాఁగ దలఁచునట్టి
కృపణజనులు నీవికిఁ గావఁగ లేక, చిక్కి చెడుదు రింత నిక్కువంబు. 140

వ. పండితులు నీవిచేతం జెడ రని పలికి పద్మసంభవుండు వెండియు. 141

తే. అంతరాత్మ యనంగఁ బ్రాణాదిపంచకమును వాఙ్మనోబుద్ధులుఁ గా నిరూఢి
గలుగు నీయష్టకంబు లోకమున కెల్లఁ, దా నుపాదానకారణత్వము వహించు.

వ. ఇవ్విధంబునం గనుంగొనుట బోధంబునకు నిదానంబు. 143

సీ. వినుఁ డహంకారసంజనితంబు లగుచక్షు,రాదికబుద్ధీంద్రియములుఁ బాయు
ముఖకర్మేంద్రియములును మనంబును, నేకాదశేంద్రియానీక మీక
డిందిసందడిఁ బడి[illegible]కుండక యం దెది, యుంపేనిఁ దనవంక [illegible] జాలు
బుద్ధితత్త్వము గల్గు శుద్ధాత్మకుఁడు పర,తత్త్వంబు గనుటకుఁ దా వలంతి

తే. యని తెలియంగించి మఱియు నిట్లను నజుండు, స్వేద ముద్భిద మండమ స్వేనఁ బుట్టు
నధమమధ్యమోత్తమదశలైన భూత,రాసు లత్యుత్తమములు జరాయుజములు.

వ. భూతతారతమ్యజ్ఞానంబు మాననీయం బగుట నిట్లు సెప్పితి నధ్యాత్మాదులం జెప్పెదఁ
దద్వేదిత్వంబు విద్యామూలంబై యుండు నవధానంబుతో వినుండు. 145

క. అంబర మాఁటి యనిల తేజోంబుధరలు వరుసతోడ నగుఁ జూరె ద్వితీ
యంబుఁ దృతీయంబుఁ జతుర్థంబును బంచమము భూతతతి యట్లుండున్. 146

వ. అధ్యాత్మాదులు భూతాధిష్ఠానంబులు గావున భూతంబుల మున్నుపన్యసించితి. 147

సీ. శ్రోత్ర మధ్యాత్మంబు సూరె శబ్దం బధి,భూతంబు దిశలు ప్రబుద్ధులార
యధిదైవతము చర్మ మధ్యాత్మ మంటలి,సంస్పర్శ మధిభూతసంజ్ఞకంబు
దానికి నధిదైవతంబు విద్యుత్తు నే,త్రంబు దా నధ్యాత్మికంబు రూప
మధిభూత మాదిత్యుఁ డధిదైవతము జిహ్వ,యధ్యాత్మకము రస మారయంగ

తే. దాని యధిభూత ముడుపతి తదధిదైవ,తంబు ఘ్రాణ మధ్యాత్మంబు దలఁప గంధ
మంచితాధిభూతము తదీయాధిదైవ,తంబు మారుత మండ్రు విద్వజ్జనములు. 148

వ. ఇది బుద్ధీంద్రియ ప్రపంచంబు. 149

సీ. పాదపాయూపస్థపాణివాగ్వర్గంబు, కర్మేంద్రియములు సత్కర్ములార
యధ్యాత్మ[illegible] వాని కగు నధిభూతముల్, గంతవ్యము విసర్గమును శుక్ర
మును గ్రహవృత్తియు వినుఁడు కర్తవ్యవ,క్తవ్యంబులును నధిదైవతములు
బభ్రుమిత్రి ప్రజాపతిశక్రవహ్నులు, మఱి యహంకారంబు మనసు బుద్ధి

1. క. శాస్త్రఁ దర ౨. ఝ. [illegible]మందక సోపగిరి యున్నంటిక దన; ఈ కుందక మొదగిలి యుంపవిన త.

తే. పూజితాధ్యాత్మికము లధిభూతవృత్తి
వెలయు నభిమాన [1]మంతవ్యములును నిశ్చ
యంబు నధిదైవతము [2]రుద్రుఁ డమృతకరుఁడు
బ్రహ్మ మిది వేదవాక్యనిర్ణయము తెలియఁగు. 150

ఆ. ఇట్లు తెలియ నెఱిఁగి యింద్రియంబు లింద్రి,యార్థములను భూతసార్థమును దె
మల్చి చిట్లకుండ మానసున నొదిఁగించు,టనఘులార భవవినాశకంబు. 151

వ. అని నిర్దేశించి నీరజాసనుం డా సంయమివరులతో సూక్ష్మభావత్వసంపాదినియు
శివయు నగు నివృత్తి తెఱం గెఱింగించెద ననుమాట మున్నా ట్లనియె. 152

సీ. కమఠంబు దనయంగకముల నెట్టట్లు కా,మముల విద్వాంసుఁ డుపరమరలఁ దివుచుఁ
గామంబుల మఱలఁగా నోపుధీరుండు, విరజస్కుఁ డై ముక్తి తెరువు గాంచు
నింద్రియంబులు పదియుంటిని గుదియించు, చెక్కుచు వెర వది యింధసముగ
నాత్మాగ్ని వెలుఁగుభూతావలి నాత్మఁగాం,చిన సూక్ష్మతత్త్వదర్శనము గలుగు
తే. భూతపంచకజలధి రోగాతిశోక,సహితభోగలవాంశకాశ్రయము దీని
విభులు కాముండుఁ గ్రోధుండు వీరి గెల్వ, వచ్చినప్పుడ యది గడవంగవచ్చు.

ఆ. మనసు మనసునందు మడఁచి యాత్మని నాత్మ,యంద కాంచునట్టి యతఁడు సర్వ
విదుఁడు సకలభూతవితతియందును దనుఁ, గనుచు నుండు నిర్వికల్పకముగ. 154

తే. ఆత్మతత్త్వ మేకంబ దీపాంతరములఁ
[3]గలుగఁ జేయు ప్రదీపంబు కరణి నావ
హించు రూపాంతరముల నవ్యయమియును బు
ధుండు గనుఁగొని బ్రమయక యుండు నొకట. 155

తే. ఆ పరంజ్యోతి పేళ్ళు సూర్యుండు వరుణుఁ
డనిలుఁ డగ్ని సోముఁడు విష్ణుఁ డజుఁడు శివుఁ డ
నంగఁ బరఁగు శబ్దములు సన్మతులు దానిఁ
బ్రయతులయి భజియింతురు నియతులార. 156

వ. అని చెప్పి యచ్చతురాననుం డమ్మౌనీంద్రులతో మఱియు నిట్లను ధర్మంబునకు
నహింస లక్షణం బధర్మంబునకు హింసయు దేవతలకుఁ బ్రకాశత్వంబును
మనుష్యులకుఁ గర్మంబును నాకాశంబునకు శబ్దమును వాయువునకు స్పర్శం
బును జ్యోతిస్సునకు రూపంబును జలంబునకు రసంబును బృథివికి గంధంబును
భారతికి శబ్దంబును మనంబునకుఁ జింతయు బుద్ధికి వ్యవసాయంబును దదీయ
మహత్తత్త్వస్వరూపంబునకు ధ్యానంబును నవ్యక్తంబునకు [4] సాధుత్వంబును
యోగంబునకుఁ [5] బ్రవృత్తియును జ్ఞానంబునకు సన్న్యాసంబును లక్షణంబులు
లక్షణజ్ఞానంబు పరతత్త్వపరిజ్ఞానంబునకు హేతుభూతంబు. 157

1. గ. సంకల్పములును. 2 గ. వేధయమృత. 3. చ. గనఁగఁ జేయు. 4. చ. [illegible] 5. [illegible] వృత్తంబును

ఆ. జ్ఞానపూర్వమైనసన్న్యాసకలనంబు, పరమగతి నొసఁగు భవ్యులార
ద్వంద్వరహితుఁ డై నరుని జరామృత్యువని, స్తరణకరణ మైనధర్మ మిందు. 158

—అవ్యక్తనామకతత్త్వనిరూపణప్రకారము.—

సీ. అవ్యక్తనామకంబగుతత్త్వ మరయ స్వలింగంబు పురుషుఁ డలింగుఁ డతఁడు
క్షేత్రంబు నెఱుఁగుటక్షేత్రజ్ఞుఁ డనఁ జను, క్షేత్రంబు నాఁగఁ బ్రకృతియనఁగ
నవ్యక్తమునకు నామాంతరంబులు గుణ, ప్రభవమాత్త్వము ప్రభవు గుణము
నెఱుఁగవు చేతనాహీనములె గానయ, య్యంతరాత్ముఁడు శక్తి నాప్రపంచ

ఆ. మెఱుఁగు నిట్టు లగుట నెఱిఁగి గుణమ్ముల, విడిచి నిలిచి తత్త్వవేది యంత
రాత్మ వేళనము నచలనిరామయా, వ్యయపదంబు నందు ననఘులార. 159

వ. అని వెండియు. 160

సీ. జ్యోతిస్సులందు వర్యుఁడు రవి భూతంబు, లం దగ్ని వరుఁడు విద్యలఁ బ్రధాన
సావిత్రి దేవతాసమితిఁ బ్రజాపతి, ఘనుఁడు వేదముల ముఖ్యంబు ప్రణవ
మనిలచయమ్మునఁ బ్రాణ[1]ము గ్ర్యమాఛంద, ములకు గాయత్రి యగ్గలము పశువు
లకు మేటి ఘుణ మహిళలా చతుష్పదములకు, ధేనువు మిక్కిలి మానవులకు

తే. బ్రాహ్మణుఁడు వరిష్ఠుండు పక్షులందు, శ్యేన మధికంబు యజ్ఞవిధానములహు
తంబు పెద్ద యుగములఁ గృతంబు మేలు, ధాతువర్గములోన నుత్తమము పసిఁడి.

సీ. యవ లోషధులలోన ననన్నంబు భక్ష్యభో, జ్యములందు జలము పేయములలోన
నమరాచలము పర్వతములలోఁ బ్రశంబు, తరువులలోన చూర్ధ్వంబు దిశల
జాహ్నవి నదులందు సాగరంబు సరస్సు, లందు గృహస్థుండు మాశ్రమముల
నెక్కు డారయ నెక్కుఁ డేను బ్రజాపతు, లం దచింత్యాత్మకుం డైన యట్టి

తే. విష్ణుఁ డెక్కుడు నాకంటెనవినుఁడు తెలియ, నీశ్వరుఁడు దేవతావలి కెల్ల నెక్కు
డతఁడు నా నే ననఁగ విష్ణుఁడనఁగ వస్తు, వొకఁడ మఱి త్రిత్రయంబున నుల్లసిల్లు.

క. నెఱయఁ బ్రధానపదార్థము, లెఱుఁగుట పరిబోధములాల కొంకికల కెల్లన్
మెఱుఁగిడుట మమ్ము మువ్వుర, గుఱుతొని రొఁకఁడుగ నెఱింగి కొనుటవలంపన్.

క. దివసము రాత్రియుఁ మంచారిఁ, బ్రవర్తనముఁ బొందు చుండుపగిదిని సుఖసం
భవదుఃఖజననములు జం, తువులకుఁ గలుగు వల దుబ్బ [2]దురుపిల్లంగన్. 164

తే. పొదలఁ దెఱంగుటకై పొడ [3]వొదవుఁబడుట
కై [4]కడను జేరుఁ బాయుట కై జనించుఁ
బొలియుటకు నై సుఖంబును బొందు దుఃఖ
మందుటకు నై పదార్థము లఖిలములును. 165

క. జ్ఞానము సవిశేషసిద్ధి, దానికి నాశంబు లేదు దాని నెఱియుట
మానాహంకృతిమమతలు, మానిననిర్మలుఁడు మోక్షమార్గముఁ గాంచున్. 166

1. చ. మాద్యము. 2. దురుపిల్లంగన్. 3. జ. వెదుగు. 4. కడుం జేరు.

వ. అని వివరించి యాసమంచి తాపసులతోడ నాశ్రమప్రకారంబు లెఱింగించెద ననిజలికి నయి ట్లని యుపన్యసించె. 167

సీ. గురునకుఁ బ్రియహితకరుఁ డయి వేదాధ్య,యన మొనరించుచు నశన మమల
భిక్ష నొనర్చుచు బిల్వపలాశదం,డములలో నొకటి ధార్యముగఁ జేసి
స్నానశీలుఁడు బ్రహ్మచర్యపరుండును, నియమితేంద్రియుఁడును నిత్యశుచియు
యజ్ఞోపవీతియు నబహుభాషియు మేఖ,లాఢ్యుండు నై శయనాసనప్ర
తే. చారవిధములు సముచితాచరితములుగ, సత్యధర్మనిరూఢుఁడై శాంతి గలిగి
వేల్మి యిరుప్రొద్దు నడపుచుఁ గల్మషంపుఁ,బనుల, కెలయక వర్తించు బ్రహ్మచారి.

సీ. అర్హప్రకారసమావర్తనుం డయి, నిజదారనిరతుండు నిర్మలప్ర
చారుండుఁ బంచయజ్ఞపరుండు నతిథిశి,ష్టాశియు శుక్లవస్త్రాన్వితుండు
శక్త్యనుగుణదానశాలియు నపచలేం,ద్రియుఁడును శుచియు మైత్త్రీపరుండు
స్వాధ్యాయశీలుండు సద్వ్రతనిష్ఠుండు, నై యాజనంబు నధ్యాపనంబు
ఆ. శక్యమైనఁ జల్పి క్షమ గల్గి సత్ప్రీతి, ప్రగ్రహ మొనర్చి మిత్త్రు లహితు లనక
మాటకార్యమునను మధ్యస్థుఁడై గృహస్థుండు నడచు దురితదూరుఁడగుచు.

సీ. గ్రామంబు దొలఁగి యరణ్యస్థలంబునఁ
బర్ణశాలావాసపరత నొంది
స్నానతంత్రము రెండుసంధ్యల నడపుచు
బ్రహ్మచర్యవ్రతభాసి యగుచుఁ
బూరిపంటలు ఫలంబులు మూలములు శాక
సముదయంబును నశనముగఁ గొనుచు
నజినంబు వల్కలము నంబరంబుగఁ గొని
శయనకృత్యంబు భూస్థలి నొనర్చి
తే. యతిథులకు నెడ మిచ్చి యాహారములను
భక్తి నాత్మీయములలోనఁ బంచి పెట్టి
యధ్యయనహోమశీలుఁడై యన్ని యింద్రి
యముల గెలిచి వానప్రస్థుఁ డతిశయిల్లు. 170

క. ఈ మూఁడాశ్రమములలో, నేమిట వర్తించువారలేనియు ముక్తిం
గామించినఁ జొరఁ దగు వి,ద్యామూలాచారమైన యత్యాశ్రమమున్. 171

సీ. సర్వభూతదయానుషంగంబు గలిగి య,తీతవస్తువులఁ జింతింప కద న
నాగతంబులమీఁద నాస సేయక వర్త, మానలబ్ధము లుపేక్షానిరూఢిఁ
గూర్చు చంగంబులఁ గూర్మ మెట్టట్ల యిం,ద్రియముల లోసికిఁ దిగిదికొనుచు
సముచితకాలభిక్షాచర్య దొరకొన్న, యంతన నిజదేహయాత్ర నడపి

1. చ. సన్నమములు. 2. చ. జరించుచు. 3. గ. చాంములుగ, నాచరించుము స్త్రీజనత్యాగ ముండి, (శేల్మి,

తే. గ్రాస మాచ్ఛాదనంబు దక్కఁగ నెవ్వఁ, డర్థి నెయ్యది యిచ్చిన నంద కేళ
వారభోజి యగుచు నమస్కారసఖ్య,నుతినిరాకృతిరహితుఁడై యతి వెలుంగు.

క. అనసూయయు నక్రోధం,బును దమమును బ్రహ్మచర్యమును ఋజుభావం
బును సత్యంబు నపైశున, మ్ము నహింసయుఁ జూవె యతికి ముఖ్యవ్రతముల్.

తే. వృక్షమూలనదీతీరవిజననిలయ, విపినగిరిగుహానిత్యవివిక్తదేవ
సదనవాసియై కౌటిల్య[1]సాధ్యవస్తు,సంచయనము లుడిగి యతి సంచరించు.

క. తనమేలు ప్రకాశింపక, తనుఁ గనుఁగొనునట్టిజను లుదాసీనతమై
నునికికిఁ దగియెడుచందం, బున వర్తించుయతి సర్వముక్తత నొందున్. 175

వ. అని యెఱింగించి మఱియును. 176

సీ. సన్న్యాస మనఁ దపశ్చరణంబు పేరు త,పోజ్ఞానము క్తి ప్రబుద్ధులైన
జనము లచింత్యం బజర మమృతంబు నా, వెలుఁగుతత్త్వము గండ్రు పీతరామ
సము నవధూతరాజసము నై శుద్ధస,త్త్వాశ్రయం బగుహృదయంబు గలుగు
వారు తపోవృత్తివలన సూక్ష్మమార్గంబున నడతు రేకత్వశోభి

తే. మహితనానాత్వ మనఁగ సమస్తభూత
సముదయస్థమై యున్నతత్త్వము ప్రకాశ
మగుట నఖిలగతులఁ దోఁచు నవ్విధంబు
గలుగుబుధుఁడు నిర్ద్వంద్వుఁడై కాంచు ముక్తి. 177

వ. అవ్యక్తప్రభవంబును బుద్ధిస్కంధంబును నహంకారవిటపంబును మహాభూతోపశాఖంబును నింద్రియకోటరంబును [2]సంతతాశాపల్లవంబును శుభాశుభఫలంబును నై సంసారవృక్షం బొప్పుచుండు. 178

క. జ్ఞానాసి నది నఱకి యభి, మానాహంకారదూరమతి యగుపురుషుం
డానంత్యము ప్రస్ఫుటముగఁ, గానంగా నేర్చు విగతకల్మషులారా. 179

ఆ. అనిమిషమైనఁ బరమనియతి నాత్మని నాత్మ
యందు గనఁ దెలివి [3]నారఁ బడసి
బోధమహితమునులు పొందునవ్యయగతిఁ
బొందఁ గండ్రు ప్రకృతి పొందు దొఱఁగి. 180

ఆ. పరమనియతి యనఁగఁ బ్రాణసంయమనంబ, యది క్రమాభివృద్ధి నలవరింప
గాఁ బ్రభావసిద్ధి గలిమి ధ్రువం బవ్వి, శేషకలన యిష్టసిద్ధిఁ జేర్చు. 181

క. అవ్యక్తతత్త్వజాతము, భవ్యము తత్త్వంబు దురితపంకహరం బై
యవ్యయ మస్మృతి యనింద్రియ, భావ్యం బగుతత్త్వ మొందఁ బ్రాఁ గగుఁ జూండీ.

వ. కావున. 183

తే. సత్త్వభావనంబుఁ బ్రశస్తమైన, కృత్య మరయంగ లేదండ్రు నిత్యవస్తు

1. గ. కార్యవస్తు. 2. గ. సంతతసంకల్పపుష్పంబును; చ. సంతతశాద్వలంబును. 3. నఱరి జారు.

సమ్యగధిగమసిద్ధికి ♦ సంయమప్రసిద్ధు లాగమతంత్రప్రసిద్ధులార. 184

క. వినుఁడీ పర్థస్థుఁ బురుషుఁ, గనుఁగొను టనుమానకలనఁ ♦ గాని మనము ద
క్కినతెఱఁ గేమిట నైనం, గనుఁగొనియెద మనుట వెరవు ♦ గాకుండుఁ జుఁడీ.

సీ. ఇట్లగు నెట్లనినయెడ లేని సత్యంబు, సంతోషమును నహింసయును ధృతియు
క్షమయు నార్జవమును ♦ సన్న్యాసమును బరి, త్యాగంబు విజ్ఞానయోగదశయు
సాత్త్వికంబులు గానతత్త్వవిజ్ఞనములీ, యనుమానమునఁ బురుషాధిగమముఁ
బడయుట యొప్పెడుపదమందుఁ సత్త్వంబుఁ, బురుషుండు నొకఁడనుబుద్ధి గొండ

తే. ఆర్యులాఁడుదు రట్టుల ♦ యగు నుదుంబ
రమున మశకమ్ము వారి మీనము వసించు
నట్లు సత్త్వంబునం దంతరాత్ముఁ డుండుఁ
గాక యనియెడివారు పెక్కండ్రు గలరు. 186

వ. అనిన విని యమ్మునులమ్మహాత్మునితో ధర్మంబు లనేకవిధంబులు వీనిలో నెవ్వం డెయ్యది యవలంబించె నదియ వాఁడు మేలను నే మన్నింటిమీఁద నుంబఱఁగిన బుద్ధులు గలిగి యనిశ్చయదర్శనుల మయి యుండుదు మిది ప్రధానానుష్ఠేయం బని యుపదేశింపవలయు సత్త్వపురుషసంబంధప్రకారంబును బ్రస్ఫుటంబుగా నెఱింగింపు మనుటయు వారికి వారిజాసనుం డిట్లనియె. 187

సత్త్వం బవశ్యానుష్ఠేయంబుగా నిరూపించుట.

సీ. సకలధర్మములలో ♦ సర్వభూతాహింస, మేటి యహింసాపరమేతుఁ డైన
వానికి నుత్తమజ్ఞానోదయం బగు, నది మోక్ష మొసరించు ♦ ననఘులార
కోరికమొయిఁ గర్మ ♦ కారి యయ్యెడువాఁడు, పొందు గతాగతంబుల ఫలాభి
లాషంబు లేక నిర్ద్వోషత మే లాచరించిన ముక్తి సిద్ధించు వినుఁడు

తే. విషయి పురుషుండు సత్త్వంబు ♦ విషయ మిట్లు
భోక్తృభోజ్యత్వసంబంధమునఁ, బొసంగి
యుండియును బద్మపత్త్రపయోలవంబు
కరణి నతఁడు తత్సంగంబుఁ ♦ బొరయకుండు. 188

క. సత్త్వము ప్రదీప మాపర, తత్త్వముఁ గాంచుటకుఁ గాన ♦ తత్సాధనతా
[1]తత్త్వము వదలక చిత్తసు, ఖత్వాకలిత మగు నెలవు గండ్రు కృతాత్ముల్. 189

చ. అది సదుపాయ మెందును నుపాయసమగ్రత లేమి నేర్పడ
భ్యుదయము దూరమార్గమునఁ ♦ బొందెడుభద్రము వాహనాద్యుఁడుఁ
నది నెఱి నుత్తరించి కనునందము నౌసహితుండుఁ గాంచునా
ప్పిదము విసాధనుం డయిన చే కెటు లొందఁగ నేర్చుఁ జెప్పుఁడా. 190

ఆ. ఇట్టు లగుట యోగికి యోగి యేనియును నెఱుంగ లేని బలిమి తొచ్చ గడిగి

---

1. గ. పత్త్వము...చిత్త్వసుఖ.

చేయుపని ఫలంబు సిద్ధింప కుండుట, కొలఁదిఁ బోక దుఃఖములెల్లను గలుగు. 191

క. స్థలపథమునఁ బోతమ్ము, జ్జలమార్గమునందు వాహనము వినిరోధ్యం
బులు గా విమ్మెయి సాధన, కలనవిభాగజ్ఞుఁ డైనఁ గడచు దురితముల్. 192

వ. అని చెప్పి. 193

తే. తటినిఁ దగ నుత్తరించునంతకును బోత
మాదరించి తక్కొల్లనిక్రియట్లు పురుషు
దర్శనము సంభవించునంతకును సత్త్వ
మాది విడవఁ దత్సంబంధ మ్ముడుగఁ డనిరి. 194

వ. ఇట్లుపదేశించి మఱియు నిట్లను నవ్యక్తంబు గుణంబు మహత్తత్త్వంబు మహత్తత్త్వగుణం బహంకారం బహంకారగుణంబులు మహాభూతంబులు మహాభూతగుణంబులు శబ్దాదులం దాకాశంబునకు శబ్దంబు గుణంబు వాయువునకు శబ్దస్పర్శంబులు గుణంబులు తేజస్సునకు శబ్దస్పర్శరూపంబులు గుణంబులు జలంబునకు శబ్దస్పర్శరూపరసంబులు గుణంబులు పృథివికి శబ్దస్పర్శరూపరసగంధంబులు గుణంబులు శబ్దంబు మృదుఖరాదిబహువిధభేదంబులు గలిగి యుండు స్పర్శంబు శీతోష్ణముఖ్యవివిధప్రకారంబులం బరఁగు రూపంబు శుక్లకృష్ణప్రభృతినానావిధంబులం జను రసంబు మధురతిక్తాదిప్రభేదభంగుల నడచు గంధంబు సురభితీక్ష్ణప్రముఖానేకవిశేషంబుల వర్తించు నిట్లు పెక్కుచందంబులం జెల్లువిషయంబుల తెఱం గెఱుంగుట వానిఁ దొలంగుటకుం దోడ్పడం జాల నని చెప్పి వెండియు.

ఆ. భూమిముఖచతుష్కమునకంటెఁ బొదివి యహం, కారతత్త్వ మంతకంటె నాని
కంటె బుద్ధి బుద్ధికంటెఁ బ్రకృతి యెక్కు, డన్నిటికిని బురుషుఁ డధికుఁ డరయ. 916

క. భూతముల తారతమ్యము, చేతోగత మైనయట్టి శిష్టజనము ప్ర
ద్యోతితుఁ డగుపురుషుఁ డగుని, రాతంకావ్యయపదంబుఁ బ్రాపించుఁ గనున్.

సీ. పంచభూతంబులఁ బరఁగింపఁ గుదియింపఁ, జాలుటఁ బతి వానిఁ జేలు ప్రభుతఁ
దనరు మనంబు రథ్యముల సారథి యట్టు, లట్టిందియంబులఁ దగ నడప
నదియ వలంతి భూతాత్మకంబును బుద్ధి, సన్నాహమును మనస్సారథికము
సింద్రియాశ్వము నైనయాద్యరథంబున, నభిమతగతి నంతరాత్మ డెంచు

తే. నిమ్మివర్తించు నిట్లగు నెఱుఁగు బుధుఁడు, ఘోరసంసారమోహావ్యాకులతలోను
గాక [illegible] నిరామయము నవ్యయంబును నగు పదంబు.

వ. అని పిలికి మఱియును. 199

క. శరనిధితరఁగలభంగిఁ, బోఁబోరి నవ్యక్తమునఁ బుట్టు నడంగున్
సురనరదనుజ[illegible] చరాచరానేకభూతజాలము లెల్లన్. 200

క. అవ్యక్తాదిక[illegible] నవ్య[illegible]పురుషుఁ డాశ్రయంబుగఁ బరగున్

నువ్యక్తంబుగ నిది గను, భవ్యులు వడయుదురు మోహబంధవిముక్తిన్. **201**

క. విను దక్కనుటకు మూలం, బనఘం బగుదపము యగుట నతినిష్ఠం దపో
ధనసమ్యగ్విధసముపార్జనం బవశ్యంబు వలయు సన్మతులారా. **202**

సీ. భూరితపంబునఁ బూరి ప్రజాపతుల్, బహువిధవృష్టివిసర్జనానిపుణు
లైరి వన్యంబు లాహారంబులుగఁ దప, మాదరంబునఁ జేసి కాదె మునులు
కాలత్రయంబు లోకత్రితయంబును, గాంతురు విద్యల గౌరవంబు
లొదవుఁ దపంబున నొండువిధంబులఁ, బడయంగ రానిమోక్షము పదంబు

తే. లచ్చ మైథునవంబున వచ్చుఁ బజయు, బ్రహ్మవధమద్యపానాదిపాతకంబు
లెల్లఁ బాయు దపఃకృతి నిద్ధతపము, పేర్మి సర్వభూతంబులుఁ బ్రీతిఁబొందు.

క. మమతాహంకృతిరహితత, పమునఁ బ్రజాపతిసమీపపదవ్యపదము సం
యమి పొందు నిందు సందేహ మొకింతయు లేదు నిర్మలాత్మకులారా. **204**

క. మమతాహంకారవిముక్తము శుద్ధము నైనయుచితధ్యానముతో
సముపేతం బగుతపమున్న యమి గను సకలోత్తరావ్యయపదప్రాప్తిన్. **205**

వ. అని చెప్పి వెండియు. **206**

క. తమము రజస్సుఁ దొలంగి స, త్త్వమునన రమియించి యగుణత్వము గని స
త్త్వమును దిగవిడుచు నైరా, శ్యముఁ బొందుఁ దగు మునివరుం డకల్మషులారా. **207**

క. పరమం బనంగ వేదాం, తరహస్యోల్లసిత వెలుంగు తత్త్వము నిక్కం
బరయంగ క్షేత్రజ్ఞుండ యగుచు, పరిణతి గలయతఁడు సర్వపదవిమండనుఁడీ. **208**

క. వృత్తివిశేషమునఁ జతిన, చిత్తము నెమకిఁ జని యందుఁ జేర్చి మనసుం దా
నెత్తెఱుఁగునకుం దివియుము, యుత్తమపురహస్య మంద్ర యోగమున మునుల్.

క. వినుఁ డవ్యక్తాంతరిం బగుపుని యొల్ల నవిద్య నొలయు బంధము మమతం
బనుపడిన మృత్యువమృతం బనఁ జనునది నిర్మమత్వ మూరఁ గలిగినన్. **210**

సీ. కర్మముల్ మేలండ్రు కర్మతత్పరులు బుద్ధాత్ములు విద్య వర్యత నుతింతు
రవి షోడశవికార యగుమూర్తిఁ గల్పించు,నది నిత్యుఁ డగ్రాహ్యుఁ డన వెలుంగు
పురుషునిఁ [1]దోఁచించు నరయుంగఁ గర్మము,మత్వంబు లేమి విద్యామమత్వ
మతనికి నైజమై యతిశయిల్లుట శ్రుతి, సాటు నిత్తెఱుఁగు సుజ్ఞాన మే మ

తే. హాత్మునకుఁ గల్గి యుండు నయ్యార్యవర్యుఁ
డఖిలసంకల్పములఁ బాచి యాత్మ నాత్మ
యంద కాంచి యనామయ మజర మమృత
మనుపదమ్ముఁ బ్రాపించుఁ గృతాత్ములార. **211**

వ. [2] (అని యిట్లు కమలగర్భుండు.) **212**

క. జ్ఞానపరినిష్ఠితాత్మకు, లైనవిముక్తిపదనిర్ణయజ్ఞులచే స

---

1. దోఁతెంచు 2. ఈ వచనము పెక్కిటఁ గానరాదు.

మ్మానిత యగుఁగతి యిది ¹క,ర్మానుగతివిరక్తజనసమంచితనుండీ. 213

వ. అని నిర్దేశించి వెండియు. 214

క. కోరికలకుఁ జొరక యసం,గారూఢత గలిగి యెల్లయెడలను సమతం
గూరినచిత్తంబులు గల,సారాత్మకు లీ పథమునఁ జనుటకు శక్తుల్. 215

క. చెప్పితి సర్వంబును నీ, ²చొప్పున నడవుఁ డెడ నొందు పొరనీకుఁడు మీ
రొప్పెడు తెరు విది దీనం, దప్పుదు పరమపదసిద్ధి ధార్మికులారా. 216

క. అని యిట్లు కమలగర్భుఁడు, మునులకుఁ దత్త్వోపదేశమును జేసిన వా
రనవద్యసమాధికులై, యనితరసులభ మగుసౌఖ్య మందిరి వత్సా. 217

వ. అని పలికి గురుం డా శిష్యునితోడ. 218

క. నీవును నివ్వాక్యంబులు, భావంబున నెలవుకొలిపి ³పరమసమాధి
శ్రీ వాటింపుము నిత్యప,దావాప్తి ఫలించు నీ కనాయాసమునన్. 219

క. అని గురుఁడు ప్రబోధించిన, మనమునఁ దెలి వొంది తత్సమంచితమార్గం
బున నడచి పొందె శిష్యుం, డనామయం బజర మమృత మనియెడుపదమున్.

చ. అని వసుదేవసూనుఁడు సమాదరమేదురచిత్తవృత్తిఁ జె
ప్పిన విని వారియుల్లములపెంపిటు లుండునె వార లెవ్వరో
వినుటకు నాదుడెందమున వేడ్క జనించె నెఱుంగఁ జెప్పవే
యనుటయుఁ బార్థుమోమునఁ గృప నమ్మహితాత్ముఁడు చూచినవ్వుచున్. 221

క. అనఘ విను మే గురుఁడ నా,మనంబు శిష్యుండ విమలభావస నీపైఁ
బనుపడు ప్రీతిం జెప్పితి, ననితరసులభాతిగుహ్య మగునిప్పదమున్. 222

క. విమలము నచలము నగుచి,త్తము నాదెస నేకభక్తితత్పరముగఁ జే
యుము నిత్యము నీయధ్యా,త్మము ననుసంధింపు పాసెదవు దురితములన్. 223

క. సమరమునప్పుడు నీ కీ,యమృతపదప్రాప్తిహేతు వగుసమ్యగ్బో
ధము వివరించితి నచలత, రమింపు మిందెపుడు శమధురాధుర్యుఁడవై. 224

వ. అని యిట్లు కృష్ణుండు జిష్ణున కధ్యాత్మవిద్య వివరించె నని చెప్పినఁ బరమగురుండును విశిష్టశిష్యుండును నగునప్పురుషవరులు మఱియు నెవ్విధంబునం బ్రవర్తించి రాకర్ణించుకౌతుకంబు నామనంబున నెసకం బెసంగెడు మునీంద్రా యెఱింగింపవే యని యడుగుటయు. 225

చ. పరమదయావిధేయ పరిపాలితవేదకలాప ⁴పక్వని
ర్భరశమసూత్మతాతనువిభాసిత పన్నగతల్పభూషణా
దరభరితా పవిత్రపదతామరసస్మరణా పరాపర
త్వరహిత పద్మజాదిసురవందిత పశ్చిమనాళసంచితా. 226

1. గ. కర్మాదులవిరక్తి. 2. గ. చొప్పునడవుఁడెడనొందు 3. ఙ. పరమసమాధిన్,. శ్రీ. 4. గ. పక్షనిర్భర.

క. వినుతచతుర్వర్ణకసం, జనకముఖభుజోరుపాద సంవిదభేదా
మునిహృత్కమలమరాళా, జననమరణహరణచరణసరసిజలీలా 227

మాలిని. వదనమదమరాళీ భక్తసంపోషశాలీ
విదళితసురవైరీ విశ్వలోకైకధారీ
మదరహితహితైషీ మాన్యయోగప్రతోషీ
సదవనపరచిత్తా సర్వనిర్మాణవేత్తా. 228

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున యశ్వమేధపర్వంబు నందు ద్వితీయాశ్వాసము. 229





హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## అశ్వమేధపర్వము, తృతీయాశ్వాసము.



నగసుతాత్మసహితవి
ధానుతశశ్వల్లసల్లతావేష్టనహే
లానిత్యశాద్వలతరు
త్వానుగుణఫలప్రదత్వ హరిహరనాథా. 1

— తాను ద్వారక కరుగవలయు నని యర్జునునిఁ గృష్ణుఁ డడుగుట. —

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు ఫల్గును నఫల్గువిద్యావిశారదుం జేసి శౌరి యతనితోడ. 2

క. నాచిత్తము వసుదేవునిఁ, జూచుట గోరియును నీవు సుమనోవృత్తిం
జూచి యనుమతి యొనర్చుట, వేచినయది నన్నుఁ బుచ్చవే ద్వారకకున్. 3

చ. అనవుడు నక్కిరీటి దగ నయ్యదువంశవరేణ్యుతోడ ని
ట్లను నటులేనిఁ బోవలయు హస్తిపురంబున కిత్తెఱంగు సె
ప్పిన నినుధర్మనందనుఁడు ప్రీతిగ నందుల కొప్పి పుచ్చు న
య్యనుమతి గల్గునట్లు దగ నాడెద నవ్విభుపాల నచ్యుతా. 4

వ. అనిన విని దామోదరుండు దారుకు రావించి రథంబు పూన్పుమని నియోగించె దదనంతరంబ ధనంజయుండు దమతోడం జను దేరం దగుపరివారంబు సమకట్టం బడవాళ్ళం బనిచె నొక్కింతసేపునకు దారుకుండునుం దేరాయితంబు సేసి తేరం బడవాళ్ళునుం బరిజనంబుల సన్నద్ధులం గావించి సన్నిహితుం జేయు నా కృష్ణార్జునులు ప్రయాణోచితాలంకారాలంకృతులై రథం బెక్కి కరినగరంబుపథంబు గైకొని చనుసమయంబున. 5

నయ మారంగ గోవిందున కిట్లను, గాండీవి దేవ నీకరుణఁ జేసి
రవసైన్యసాగర ముత్తరింపంగఁ, గంటిమి గురుభీష్మకర్ణముఖ్య

దుర్జయవీరులఁ నిర్జించితిమి నీవు, శాత్రవరోధులఁ సమయఁ జేయ
వెనుక నేము జయంబుఁగొనుచువచ్చితిమి తేజంబును బేరు శ్లాఘ్యంబుఁ నతుల

తే. మైనభవదీయసుప్రసాదాతిశయము, కతనఁ బడసితి మప్రతిహతమహార్ధి
రాజ్యసంపూజ్యుఁ డయ్యె ధర్మజుఁడు సంశ్రి, తాభిరక్షణవ్రతనిరతాంతరంగ. 6

క. నీమహిమ వొగడఁ గొలఁదియె, దామోదర విశ్వసంవిధాతవు భవదీ
యామలతేజము యగ్నిష్టోమము కాలాత్మకత్వశోభివి కృష్ణా. 7

క. భవదీయోచ్ఛ్వాసనము వాయువు నీక్రోధముఁ బ్రసాదరోగంబును మృ
త్యువు లక్ష్మియు నీవలనన, యవుఁ బ్రీతియు మరణమును మహానందంబున్. 8

క. స్థావరజంగమమగుజగ, దావిర్భావస్థితిక్రియావిలయంబుల్
నీవలనన యగుచుండును, భావాతీతుఁడవు సర్వపతివి ముకుందా. 9

వ. అని వెండియు. 10

కృష్ణార్జును లింద్రప్రస్థమునుండి హస్తినాపురంబునకు వచ్చుట.

క. నారదదేవలకౌశిక, పారాశర్యాదిమునులపలుకుల భీష్మో
దారవచనముల నిను నఘదూరు నే నెఱిఁగి యుండుదును సకలముగన్. 11

వ. కావున. 12

క. నావలనికరుణపెంపున, నీవు ప్రసాదించినట్టి నిరవద్యకవి
ద్యావిస్తారంబున ధృతిఁ, గావిశదమతిఁ దెనుఁగించెదఁ గ్రతుపురుషా. 13

వ. అని యిట్లు సభక్తికంబుగా సంభాషణంబు సేసిన వాసుదేవుండును వినతా
దరవాక్యంబుల నభినందించి నప్పురుషవరు లట్లు సల్లాపంబులు సేయుచుం
బోయి తమరాకకు సమలంకృతంబైన సామజపురంబు ప్రవేశించి ధృతరాష్ట్రు
మందిరమునకరిగి యక్కురువృద్ధుని గాంధారి ప్రణామవినయవిశే
షంబులం బ్రీతులం జేసి కుంతీసమారాధనం బాచరించి విదురధౌమ్యయుయుత్సు
సంజయులదర్శనంబులు సముచితప్రకారంబుల నడపి కౌంతేయాగ్రజు నత్యంత
భక్తిపూర్వకంబుగా సముచితవిధంబునం గాంచి తదాలింగనాద్యాదరణం
బులు వడసి నప్పద్మనాభుండు నాఁడు సవ్యసాచిసదనంబున నతనిచేయు
పూజావిధానంబుల మానసం బలర వసియించి మఱునాఁడు మహనీయాస్థాన
మండపంబున నున్న యన్నరేంద్రుకడకు నయ్యైంద్రసుతుండు తోడన చనం జని
సుఖగోష్ఠి నుండె నట్టియెడ నగ్గాండీవి యప్పాండవపూర్వజునాననంబునం జూడ్కి
నిలిపి వినీతుండై. 14

తే. కమలనాభుండు పెద్దయుఁ గాల మిచట
నున్నవాఁడు దండ్రియును సహోదరాది
సకలబంధులు నితనిదర్శనము గోర
నుండుదు రే వారిఁ జూడ నీతండు గోరె. 15

క. ద్వారకకు నిమ్మహాత్ముఁడు, మీరనుమతి సేయఁ జని యమేయగుణాలు నా
సీరిని వసుదేవునిఁ గని, గౌరవ మెసఁగంగఁ దల్లిఁ గాంచి ముదమునన్. 16

క. తక్కటిసోదరుల సుతుల, నక్కాసఁ బ్రియ మారఁ జేర్చి యప్పురజనులన్
మిక్కిలిమన్నన మక్కున, నెక్కొనఁగా నాదరించి నిలువక మగుడున్. 17

సీ. దేవర యిప్పుని దివ్యచిత్తంబునఁ, జూచి మీ కెట్టులు సూడఁ బోలె
నట్టుల యుత్తరం బానతి యిత్తురు,గాక నావుడు నధిక ప్రియమున
మాతులుఁ గాంచి యిట్లమ్మాధవదేవుండు, మనమారఁ గాఁగ నమస్కృతులును
నాలింగనంబులు నాచరించి హలాయుధుని దేవకీదేవిఁ గనినయవుడు

తే. భక్తిమనకు నై పూజించి బంధుజనుల,నందఱను దత్తదౌచిత్య విభినుతముగ
నాదరించి వారలకుశలానుయోగ, విధము నన్మత్కృతమ్ముగ విస్తరించి. 18

క. పరిజనయోగక్షేమము, లరసి పురజనమ్ములకుఁ బ్రియం బెసఁగఁగ వా
క్యరచవలుం గార్యసమా, చరణములు నొనర్చి నడపి సభసత్కృతులన్. 19

తే. మఱియు వలయుకృత్యంబులుఁ దెఱఁగుపఱుప
వలసినన్నిదినంబులు నిలిచి యశ్వ
మేధమునకు బాంధవజనదమిత్రభృత్య
వర్గసహితుఁడై చనుదెంచువాఁడు గాక. 20

క. అని ధర్మజుండు పలికిన, విని కృష్ణుఁడు సంతసిల్లి వినతుండై గొం
తిని ద్రౌపది దగుమెయి వీడ్కొని తాను సుభద్రఁ దోడుకొనిపోవుటకున్.

వ. గొంతి కౌంతేయుం బ్రియంబున ననుజ్ఞ సేయుటయు నర్జుననుమతియుం గొని.

తే. వివిధవాహనారూఢులై విభవ మెసఁగఁ, బాండవేయులుఁ దక్కనబంధుజనులు
ననుపరాఁగ సాత్యకిదోడనరుగు దేరఁ, బురము వెడలి కొంతకడ నిల్చి కరము నెమ్మి.

క. సముచితభంగుల నందఱఁ, గ్రమమున వీడ్కొని పథంబు గైకొని లనచి
త్తము దృష్టియుఁ బాండవమ, ధ్యముపై నొలయంగ నల్లనరుగుచు నుండెన్.

ఆ. అట్లు మరలి మరలి యర్జునుం జూచుచు, జనఁగ నతఁడు చూడ్కిఁ జనినయంత
దవ్వుఁ జూచు చుండ్లెన వ్విధంబున సితాం, బురుహాక్షుఁ చనుచుండఁ బోవునపుడు. 25

క. సరసన సాత్యకి రుచిరపుటరదంబునఁ జనియె వెనుక నలఁతిరథముపై
నరిగె సుభద్రయు నెమ్మియు, నరుఁగ హరిమీఁద నింద్రుఁ డలరులు గురిసెన్.

క. పవనుం డనుకూలత మెయిఁ, బవర్తిల్లెం దద్యోనతిశుభప్రదభంగుల్
వివిధములు మఱియు ధరణీధవ తోఁచె నిమిత్తములు దిశాంతస్ఫుటతన్. 27

— శ్రీకృష్ణుఁడు ద్వారకాపురంబునకుఁ బోవుట. —

వ. అట్లు వోయి పోయి మార్గంబుకెలనం జేరువ నున్నయుదంకాశ్రమంబు గని
యందుఁ జని వినయం బొప్ప నమ్మునిం గని యతనిచేయునతిథి సత్కారంబులం
బ్రియం బంది యమ్మునిపాల నాసీనుండయి యుండ నతం డప్పుండరీకాక్షుఁ

కి ట్లనియె. 28

చ. భరతులపాలి కేఁగి తగఁ బాండవకౌరవబంధుభావసం
గరము దృఢంబు సేసియు సుఖస్థితి రాజుల వారివారివి
స్ఫురితమహాధిరాజ్యములఁ జొప్పడ నిల్పితె పక్షపాతితా
దురితము లేని నీవు జనతోషవిధానవిశారదుండ వై. 29

వ. అని యిట్లెఱుంగనివాఁడయి యడిగెడునట్లపోలె నిందాగర్భంబుగాఁ బలికినం బద్మనాభుండు దానును దాని నెఱుంగమి భావించి యా భార్గవునాననం బాలోకించి. 30

చ. కర ముచితంబుగాఁ బలికి గర్వపుమాట నదల్చి భీతికిం
జెరు వగునట్లు చెప్పి కడు దీనత దోఁపగ నాడి సంధి క
న్కురుపతిఁ దమ్ముఁ బోవు మొనఁగొల్పఁగఁ జాలన నాకు భీష్ముఁడు
న్గురుఁడును దోడు చెప్పిరి మునుల్ బహుభంగుల నొత్తి రత్తఱిన్. 31

వ. అతిలోభంబునం జేసి వంశధర్మంబు విడిచి యెవ్విధంబులను సంధికిం జొరక కురుకుమారులు పాండవులతోఁ భండనం బొనర్చి సబంధుపరిజనంబుగా మరణంబు నొంది యుత్తమలోకంబుల కరిగి రిక్కడఁ బాండునందనపంచకంబు దక్కం దక్కటివా రెల్ల నట్ల పోయిరి కాలనియతి గడవ నెవ్వరికిని శక్యం బగునె యనిన విని 'రోషకషాయితంబు లగు తారకంబు [1]లుద్వృత్తంబులు సేయుచు నత్తపోధనసత్తముండు. 32

క. కౌరవకులమున మిథ్యాచారుఁడ వై త్రుంచి తకట శక్తుఁడ వయ్యున్
నేరిమి మైఁ జేయవ పోం, దారఁగ నిక్కల్బిషమున కంతటికిఁ దగన్. 33

వ. ఘోరప్రకారం బగు శాపంబు నీకిచ్చెద ననిన నచ్యుతుం డామునితో సామమాటలు దేటపడ విని తగినయట్లు సేయుదుగాక యని పలికి యిట్లనియె. 34

చ. కినియుట మాను, మేలె మునికిం గుపితత్వము, శాంతవృత్తి నా,
యనునయ మాదరింపు, విను మల్పతపంబులచేతఁ గోలుపో
దు నె, మఱియట్లుఁగాక యతిదుష్కర మైన తపంబు సంచితం
బనఁ దగు బ్రహ్మచర్యమును నాఁడిఁ బోవె కటా శపించినన్. 35

వ. అనిన విని యుదంకుఁడు శ్రీవత్సాంకు నవలోకించి. 36

క. అగుఁగాక నీవు సెప్పెదు, తగ వెయ్యది సెపుమ వినియెదం బోలిన నే
మగిడించెద శాపోన్ముఖ, మగుమన్మానసము ననుదు నల్లన నగుచున్. 37

చ. తమము రజస్సు సత్త్వము నుదంక మదీయవశప్రవర్తమా
నములు, మరుద్వసుప్రభృతినాకిచయంబు మదుద్భవంబు, స
ర్వమునను నేను నిల్తు, సుఖవాసత నన్ దగఁ జెంది నిల్చు స

1. గ. అతిరూగంబెట్టుచు నత్తపో.

ర్వమ్ము, విను మేన చూపెద యపరంబు పరం బనఁ గల్గు తత్త్వముల్. 38

తే. ప్రణవముఖవేదములుఁ జతుర్వర్ణములుఁ జ
తుర్విధాశ్రమములును దత్సర్వకర్మ
జాతములును సముచితస్వర్గమోక్ష
ములును మన్మయములు గాఁగ దెలిసికొనుము. 39

క. క్రతుపరులు నన్ను దగ సం,స్తుతించి ఫల మందఁ గందు రదోషయుతులు స
మ్మతిఁ బ్రాయశ్చిత్తంబులఁ, గృతాత్ము లగుదురు మదీయకీర్తనపరులై. 40

క. మానసము మదగ్రపుత్త్రుం,గా నెఱుఁగుము ధర్ముని జగద్రక్షకు నై
యే నభిమతకాలములను, [1]మానితజన్మముల నొంది మనుదుఁ దపస్వీ. 41

క. భవవర్ధనవిలయంబుల, నవలీలన వరుస బ్రహ్మ యనవిష్ణుఁ డనన్
శివుఁ డన నిర్వర్తింతును, భువనంబుల నేన చూవె భూరిమహిమలన్. 42

క. ధర్మంబు కలఁకఁ గాంచి య,ధార్మికులం బొలియఁ జేసి ధార్మికులను బో
రర్మిలి రక్షింతు నుచిత,కర్మాచరణముల నే జగద్ధితమునకై. 43

వ. అట్టివాఁడ నయి యుండియు నధర్మపరు లగుధార్తరాష్ట్రుల నత్యంతధార్మికులగు ధర్మనందనాదులతోఁ గలుపుటకుం బలుదెఱంగులం బచిలి నది దివ్యజ్ఞానదేదీప్యమాను లగుపారాశర్యప్రభృతిమునివరులచిత్తంబుల కెక్కె. నక్కౌరవులు దమదౌరాత్మ్యంబున మాహాత్మ్యవంతు లగు నాకౌంతేయులం దొడరి ధర్మసమరంబున సమసిరి నాచేసినపని యిట్టిది నన్ను నుదంక నీవింక నేమనియెద వమ మని పలికిన నతండు వినతుం డగుచు నిట్లనియె. 44

ఉ. ఇప్పుడు నీమహామహిమ యేర్పడ సమ్యగనుగ్రహంబునం
జెప్పినయీసమంచితవిశేషము లెల్ల నెఱుంగుదున్ మదిం
గప్పిన యీ దురాగ్రహపుగర్వము నీ వొసఁగంగ నాకు ము
న్నొప్పడియెన్ సుధాసదృశసూక్తులఁ దేర్చితి వీవ యచ్యుతా. 45

వ. అని వెండియు. 46

ఆ. అతుల మైననీదయామహిమకు నేను, బాత్ర మగుదు నేని పద్మనాభ
యనుపమానతావకాకృతిఁ జూపవే, నాకుఁ జూడ్కియును మనంబు నలర. 47

కృష్ణుఁ డుదంకునకుఁ దనవిశ్వరూపంబుఁ జూపుట.

చ. అనుడు దయాళుఁడై నహరి యర్జునుఁ జూచినదివ్యమూర్తిఁ జూ
పినఁ గని సంప్రమోదమును భీతియు విస్మయముం బెనంగొనన్
మునిపతి పాణిపద్మములు మోడ్చి నమః పురుషోత్తమాయ తే
యనుచు వినీతి నమ్ర ముఖసంగము నివ్వెఱ నిశ్చలంబుగన్. 48

వ. ఒక్కింత నిలిచి నిభృతస్వాంతంబున. 49

1. త. మ్మానితజన్మముఁ బొందితినదఁ దుఁ దపస్వీ

సీ. పుండరీకాక్ష యీ పుడమి యంతయును భ,వత్పాదపంక్తిసంవ్యాప్త మయ్యె
నంబరం బెల్లను నావృత మయ్యె నీ,మహితసముజ్జ్వలమస్తకముల
నంతరిక్షము దావకాద్భుతకుక్షిదే,శంబులచేత సంఛన్న మయ్యె
భవదీయమహనీయబాహార్గళానిచ,యావిహితము లయ్యె నన్నిదిశలు
తే. బహుచరణముల బహుశిరోభాగములను
బహుజఠరముల బహుభుజాప్రకరములను
దేవ యిట్లు సర్వంబును నీవ యైత
నర్చి తిది నామకన్ను మనసంబుఁ దనిపె. 50

వ. విశ్వరూపా యీ రూపం బుపసంహరించి నీ దగునెప్పటియాకారంబు గైకొనవే యనిన నప్పరమేశ్వరుండు వరంబు గోరు మని యానతిచ్చిన నమ్మహాత్ముండు సంశ్రితార్తిహర నీమూర్తిఁ గంటి నింతకంటె మిక్కిలివరంబులును గలవే యనుటయు. 51

క. ఆదేవుఁ డతనితో నటు, గాదు ననుం గనుట శుభము గావింపక పో
దేది ప్రియ మడుగు మిత్తుఁ బ్ర,మోదంబుగ నీకు ననిన ముని యిట్లనియెన్.

వ. అవశ్యంబును నాకిట్లు గావలయు నని యవధరించితేని దేవా యిది మరుదేశం బిచ్చట జలంబు దుర్లభంబు నాకు జలసన్నిధి యిప్పుడు గలుగఁ బ్రసాదింపుము. 53

క. అనుటయు నంబుజనాభుఁడు, దనయొప్పటిలలితమూర్తి ధరియించి మునీం
ద్రునితోడ నన్నుఁ దలఁపఁగ, ననఘా దొరకును జలంబు లని పలికి తగన్. 54

వ. వీడ్కొని చనియెం బదంపడి యా భృగువంశవరుం డొక్కెడ నెలంగు చుండి తృషితుం డయి హృషీకేశుం దలంచిన. 55

సీ. కుక్కలు సుట్టిరా నొక్కమాతంగుండు, బాణబాణాసనపాణియును ది
గంబరుండును మలినాంగుండు నగువాఁడు,వోఁచె నచ్ఛజలంబు దొరఁగుచుండ
మునితో నమ్ముని వానిఁ దప్పక చూడ, వాఁ డోయుదంక యిక్కవారి డప్పి
వోఁ ద్రావుమనుడు నాకభూసురాగ్రణియొల్ల,నని పల్కెఁ బల్కినవినుమునీవు
ఆ. నీరువట్టు శ్రమముఁ గూరిన నీమీఁది,కరుణ వచ్చినాఁడఁ గాను నాక
యర్థిఁ ద్రావు టొప్పు ననియె నాచండాలు, వలుకమెయి నదల్చెఁ నత్తపస్వి. 56

వ. అదల్చిన నతండు సారమేయంబులుం దానును నంతర్ధానంబు సేసె నాసంయమి యాకులపడి యొక్కింతవిచారించి యిక్కపట ప్రచారంబు కృష్ణసంపాదితంబు గావలయు నని యూహించుసమయంబున నయ్యేడకుం గృష్ణుం డరుగుదెంచుటయుం గనుంగొని యమ్మహాత్మునితోడ నమ్మునివరుండు. 57

క. జలము నినుఁ దలఁపఁగా నిటు, గలుగఁగనె చండాలునోడలఁ గాఁజెడు నీ కే
నలఘుగుణ త్రావుదునె యే,కాలంబిది శ్రమం బైన వరము గుచ్ఛితమయ్యెన్

చ. అనవుఁడు గృష్ణుఁ డిట్టు లను నాకడిఁ బోయెఁ బ్రయత్న మొల్ల నీ
వనఘ యెఱుంగ వైరి సమయం బొకఁ డెవ్వియుఁ గల్గె నేర్పడ
న్వినుము నిలింపవల్లభుని । నీకయి వేఁడితి నే సుధారసం
బనితరసాధ్య మైనశుభ । మయ్యెడు భూ[illegible]లంగ నక్కటా. 59

వ. అది యె ట్లంటేని. 60

క. ఏను సుధ యడుగుటయుఁ హరి, మానవులకు నేల యగు నమర్త్యత్వము మే
లైన తెఱఁగొండు గోరుము, దానిం దగ నిచ్చెదఁగా ముసడం బారంగన్. 61

వ. అనిన నయ్యనిమిషపతియాననం బాలోకించి. 62

క. నిను వేఁడుట మోఘముగాఁ, జనునే యొల్లెన నాదువచనవు సెఱపక
మ్మునిపతికి నమృతరస మి, మ్మని ప్రార్థించిన మహాత్మ । యాతఁడు నాతోన్. 63

వ. సమయంబు సేసికొని వచ్చె నత్తెఱంగాకర్ణింపు మమ్మహితసౌజన్యధన్యుండు. 64

శా. మాతంగత్వము దాల్చి యే నరిగి సన్మానించి యా భార్గవుం
బ్రీతుం జేసెద నట్టు లిచ్చిన సుధం । హ్రీదూషితస్వాంతుఁ డై
యాతం డొల్లక యున్న నేమి విను నా । కన్యాయ్యవృత్తంబు గా
దీ తంత్రంబున కీవ సాక్షి యని తా । నేతెంచి నిల్ గానఁగన్. 65

వ. నీవు ప్రత్యాఖ్యానంబు సేసిన నతం డంతర్ధానంబు సేసెం గానిమ్ము దాని కేమి సేయ వచ్చు నాయిచ్చినవరంబు బొంకు గాకుండ నీకు జలం బెప్పుడుం గలుగ జేసెద. 66

చ. అనఘ జలంబు నీవలసినప్పుడ మేఘము లీమరుస్థలం
బున నొసఁగుం బ్రభవద్యశము । పొంపిరివోవ నుదంక మేఘనా
మనుతవిహారముల్ గలిగి । మాన్యత నెప్పుడు నియ్యెడం జరిం
చును జలదంబు లింక నను । సువ్రత దూఱకు పోయివచ్చెదన్. 67

క. అనినం బ్రీతుం డయ్యెను, ముని యంతర్ధానకలనమునఁ గృష్ణుండుం
జనియె నని చెప్పి మఱియును, జనమేజయనృపతితోడ । సంప్రీతిమెయిన్. 68

వ. వైశంపాయనుం డిట్లనియె. 69

ఆ. మనుజనాథ యెప్పుడును మరుదేశంబు,నందు నియతవృత్తి । నద్భుతంబు
దలకొనంగ నయ్యుదంకమేఘంబు లొ,క్కొక్కపుణ్యతిథుల నోలసి కురియు. 70

వ. అనిన విని జనమేజయుండు మునీంద్రా యుపేంద్రుని శపించుటకు నుత్సహించిన యుదంకుం డేమివిధంబుతపంబున నమ్మహానుభావంబు నొందె నెఱింగింపవే యనుడు నా విభునకు వైశంపాయనుం డిట్లనియె. 71

జనమేజయునకు వైశంపాయనుఁ డుదంకుని చరిత్రంబు సెప్పుట.

సీ. అతనికి గురుభక్తి యనఁజొప్పడియె న, త్తెఱఁగు చెప్పెద విను । తెలియ నతఁడు

దనఘుఁడుం డైనగౌతమునకు శుశ్రూష, నియతిమైఁ జేయు సత్యన్నభక్తి
కంబుగఁ బెద్దయుఁగాలంబు సనిన నా,సంయమిపతి శిష్యసమితి కెల్ల
వివిధవరము లిచ్చి వీడ్కొల్పి పుచ్చి య,దంకునిదిక్కును దలఁపకుండె

ఆ. నత్తపఃపరాత్ముఁ డతినిష్ఠఁ బరిచర్య, నడుపు చొక్కనాఁడు గడున్రవేఁగు
గలుగునట్టివంటకట్టియమోపు, గుదియ మోచి తెచ్చెఁ గురువరేణ్య. 72

క. అటు మోచి తెచ్చియుండొక,జట బెద్దయుఁ దగిలి యుండ సరభసముగ నై
చుటయుఁ దెగి మోపులో ముం,దట నది పడియెనుజరాసితచ్ఛవి మెఱయన్. 73

సీ. దాన నన్నియుతుండు దనవయఃపాకంబు, నెఱిఁగి శోకంబున నేడ్వ నమ్మ
హాముని యశ్రువు లంజలిఁ బట్టంగ, నిజపుత్త్రిఁ బనిచె నరసీరుహాక్షి
రయమునఁ బట్టి కరంబులు వేఁడిమి, నెసిన విశిచిప ధరయుఁ దలరె
నమ్మని యా శిష్యు నమ్మని చేరంగఁ, బిలిచి నీ వేటికి నలఁతఁ బొందె

ఆ. దనిన నతఁడు శిష్యు లందఱపైఁ గల,కరుణ విూఱుఁ బెద్దకాలమేని
మునివరేణ్య నావకలన భేద దానికి, నుమ్మలింప కెట్లుగలుండవచ్చు. 74

వ. అనుటయుఁ గృప చిగుకొత్తుచిత్తంబుతోడ. 75

క. ఎలప్రాయ మిచ్చితిని నీ, కలఘుమతీ యిచ్చెదను మదాత్మజ నుల్లం
బలరఁగఁ జెండిలి గమ్మని, పలికి మఱియు నా తపస్విపతి యిట్లనియెన్. 76

క. నీ తేజంబు సహింపఁగ, నీతామరసాక్షి దక్క నెవ్వరికి నపు
న్నీఫలా శక్యము గా దిది, చేతోగతిఁ జూచి తగవు సిద్ధించుటకై. 77

వ. ఇమ్ముద్దియకును. 78

క. తను వొంపుఁగఁ జేసెద నది, జననాంతర మెట్టులట్ల సద్గుణుత నీ
వనుమానము దక్కుము యౌ,వనమును గైకొనుము కన్య వరియింపు తగన్.

వ. అధర్మము గాకుండునట్లుగా వరం బిచ్చితి నని యనుగ్రహించి యక్కన్యకా
రత్నంబునకును. 80

చ. తనులత యొండు సేసిన నుదంకుఁడు యౌవనలక్ష్మిఁ దాల్చి య
వ్వనిత వివాహ మయ్యె నృపవర్య పదంపడి యమ్మునీంద్రుతో
ననుఁ బని గొంపు మీరలు మనంబున నెద్ది దలంచి వేడ్క నీ
సిన నది దెత్తు మీకగుణఁ జేసియ కల్గెను నాకు శక్తియున్. 81

క. అని విన్నపంబు సేసిన, విని దక్షిణఁ బ్రీతి యగుట వే యొరులకుఁ గా
కనఘ భవదీయచరితం,బునఁజూవే నాకు సనియె మునిపుంగవేంద్రా. 82

తే. అంత నిలువక మునిపత్నికతఁడు భక్తి, నెఱిఁగి తల్లిమీ రానతిమ్మిందు మీకు
వలయునట్టిపదార్థ మకవశ్యమును సమాహరింతు నే ననుటయు నయ్యహల్య.

చ. వలవదు లాఁతివాఁడ వె భవద్గుణతోషితగౌతమాంచితో
క్తులు మది నూఁదు మన్నను నకుంతితచిత్తత నొత్తి పల్కె న

య్యాలఘుతపస్వి యానతి ప్రియంబున మిత్రసహాఖ్యదేవికుం
డలములు దెమ్మ, నాకుఁ బ్రకటంబుగఁ బెంపువహింపు తమ్ముఁడా. 84

వ. అని యిట్లు పనిచిన నాతండు ప్రీతుండయి యప్పనికిం జనియెఁ బదంపడి గౌతముం డుదంకునిం బొడగాన మెచట నున్నవాఁ డని యహల్య నడిగిన నా భృగువంశవరుం డరిగిన తెఱం గెఱింగించిన నద్దయాళుం డద్దేవియాననం బాలోకించి. 85

క. ఆ సౌదాసనరేంద్రుం, డాసురచరితుండు శాప ✽ మాతని నటు గాఁ
జేసినయది మానుషమాం, సాసక్తుం డగు బెలుంగఁ ✽ దమ్ముని యతనిన్. 86

సీ. అకట యెట్లగునొకో ✽ యనుపల్కు కృపదోఁప, బలికినమ్మార్గ ✽ భయముగొనుచు
నెఱుఁగ నిట్లగుట మునీశ్వర నామీఁది, దయ చిగురొత్త నా ✽ తనికిఁ గీడు
రాకుండునట్లుగాఁ ✽ జేకొని కావవే, యనిన నాసంయమి ✽ యంత వెఱవ
నేల యే నతనికి ✽ నెడరు రానీ నని, తగ నూఱడించె నుదంకుఁ డరిగి

ఆ. మనుజరక్తసిక్తతనువును ఘోరమీ, సములు వృత్తలోచనములు నైన
యుగ్రమూర్తితోడ ✽ నొక్కశూన్యాటవి, నెలమి నున్నయన్న ✽ రేంద్రుఁ గాంచె.

క. ముని యట్లు నెమ్మిఁ గాంచినఁ, గని యతఁ డాఁకొనుటఁ జేసి ✽ గాసిలి యొచ్చెం
గనువాఁడనొ తగుభక్ష్యం, బనుచుండఁగ వచ్చితివి ప్రి ✽ యంబుగ ననుడున్. 88

వ. ఉదంకుం డతని కిట్లనియె. 89

క. గురుకార్యంబునకై భూ, వర నిన్నుం గాన నేను ✽ వచ్చితి గుర్వ
ర్థరతులు హింస్యులు గా రి, ట్లరయక యాడుదె యధర్మ ✽ మగుమాట నృపా.

వ. అనుటయు. 91

క. దినమున మూఁడవయామం, బున నపరార్ధంబు యోగ్యముగ నాహారం
బునకుం గల్పించిరి నా, కనిమిషు లటు గాన మాన ✽ నాఁకలి పుత్తున్. 92

సీ. అని పల్కె సౌదాసుఁ ✽ డమ్ముని యట్లని, నధిప మద్గురుకార్య ✽ మాచరించి
వచ్చెద మగుడ నవశ్యంబు నామాట, యనృతంబు సోరదు నీ ✽ వర్థికోటి
కిష్టపదార్థంబు ✽ లిత్తు పాత్రము యేను, గురులకుఁ గాఁగ నా ✽ కోరుకోర్కి
నీవ తీర్తని కృతనిశ్చయత్వంబున, నరుగుదెంచినవాఁడ ✽ ననుడు నృపతి

ఆ. యట్ల కాక యేమి ✽ యర్థించి వచ్చితి, చెప్పు మనిన నతఁడు ✽ చిత్త మలర
ననఘ నీదుపత్ని ✽ యర్థిమై ధరియించు, కుండలంబు లని యతండు సెప్పె. 93

---

1. 'వ. అక్కట యెట్లయ్యెడునో యనుచుం బలికిన నమ్మాద్రి భయంబు గొనుచు.
సీ. ఎఱుఁగ నిట్లగుట... మనుజాశిరక్తంపుఁదనువును ఘోర,మీసములును వృత్తలోచనములు నైన
ఆ. యుగ్రమూర్తితోడ ✽ నొక్కశూన్యాటవి, నెలమి నున్న యన్న ✽ రేంద్రుఁ గాంచె
ఘోరవికృతభయద ✽ ఘూకవిభావమై, ప్రచురమైనకోప రాశి యనఁగ."
యని పాఠాంతరము కొన్నిటఁ జూపట్టెడి.

వ. చెప్పిన విని యమ్మనుజవరుం డొరులధనం బిచ్చువారలుం గలరె కుండలంబు లడుగం గొం డెద్దేనియు నడుగు మనుటయు నాసంయమి నీవు నెపం బిడి త్రోవం గలవాఁడవు గావే నన్యాయవస్తువు లొల్ల నని పలికిన నాభూవల్లభుం డమ్మాట కియ్యకొని యున్నాతి యున్నచోటికిం జను మేఁ బుత్తెంచితి నని చెప్పి నీవాంఛితం బెఱింగింపు మని నియోగించిన నమ్ముని యద్దేవి యెచ్చోట నున్నయది యని యడిగిన నప్పుడమిఱేఁ డల్లడె తన్నివాసప్రదేశం బని చూపినం బోయి. 94

సీ. అద్దేవిఁ గని యతం డట్ల చెప్పిన ముని,వల్లభ నా కానకవాలు దెమ్ము
నృపుపాల ననియె నక్కన్నెలంత యుదంకుండు, ననుఁ దెంచి విభుఁ డభిజ్ఞాన మడిగ
నాతఁ డీగతి సేమ మాగు నని నిమ్మింప,గా దిది వెలి గాఁగ లేదు వేఁగ
గతియును ననుపలు కతివకు నాయిచ్చు,వర్ణితాభిజ్ఞానకనిర్ణయముగఁ

ఆ. జెప్పు మనిన సంతసిల్లి యమ్మదయంతి,కడకు నరిగి తత్ప్రకారమునన
పలుకుటయును భర్త పనుపున నిచ్చెదఁ, గుండలములు నీకు గురుహితార్థి. 95

వ. అని యక్కొమ్మ యమ్మహాత్మునితో మఱియును. 96

సీ. సురలు గంధర్వులు నురగులు నిక్కుండ,లములకుఁ జెక్కుపాయముల వేచి
తిరుగుదు రెంగిలి సోఁకిన నేమఱి, నీవు నిద్రించిన నేల నిడిన
నపహరింతురు భక్తి నర్పించి యివి దాల్ప, నాఁకలి నీరువ ట్టగ్నిభయము
విషవికారము భూతశాకినీబాధలు, వారయవు వినుము బ్రాహ్మణులకు నైనఁ

ఆ. బెద్దవారి కైనఁ బెట్టిన నయ్యాయి,కొలఁది నమరి యుండుఁ గురియుఁ బసిఁడి
ననిన నప్రమత్తవృత్తిమైఁ గొని చను,మయ్య గురులు నిన్ను నభినుతింప. 97

—ఉదంకుండు మదయంతివలనఁ గుండలంబులు పుచ్చికొనుట.—

వ. అని చెప్పి యప్పరమపతివ్రత భక్తిప్రీతివినయములు మనంబున సంకురింప నుదంకునకు నక్కుండలంబు లొసంగినం బ్రమోదం బెసంగ నాశీర్వాదంబు సేసి యాసంయమివరుం డబ్బామచేత నామంత్రితుండై భూమీశ్వరుపాలికి వికాసలసితవదనారవిందుం డగుచు నేతెంచి యక్కుండలలాభంబు ప్రకటించి దీవించి దేవా నీవలనం గృతార్థుండ నైతి నని పలికి నాకానవాలుగా నీవు సెప్పినవాక్యం బత్యంతగూఢంబు తదభిప్రాయంబు నెఱుంగవలతుం జెప్పం దగి యుండునేని చెప్పు మని యడిగిన నతం డతనితోడ. 98

సీ. బ్రాహ్మణజనముల రాజులు పూజింతు, రటు గాన యేము విప్రార్చనంబు
సేయుదు విప్రులచేతన యిట్లైతి, వెడదప్పు నన యొండు వెరవు నాకు
దురితంబు వాపంగ దారకొన దది కార,ణముగ భూసురపూజనంబు దుష్క
రము దీన మేలు గందు మనంగ రాదిది, గాదన్న వేఱొండు గలదె మార్గ

తే. మని యభిజ్ఞానముగ మదయంతి యిపుడు, సెప్పి పుచ్చితి నిట్లు విశిష్టరత్న
మయమహాకుండలము లిచ్చి ♦ మాన్తుఁగీడు, నీకు నన నుతలఁపునర్లోకవంద్య. 99

వ. అనిన నా భృగువంశవరేణ్యుని పుణ్యసన్నిధిం జేసి యా సౌదాసనరేంద్రునకు సంప్రాప్తసమాధానసూతనసత్త్వంబు[1] గలుగుటకతంబునం గార్యదర్శనంబును గుండలదానశ్రద్ధయు శాంతివచనంబునుం గలిగెఁ దదీయవచనశ్రవణానంతరంబ యుదంకుం డతనితో మిత్రత్వంబు సంభాషణమాత్రసిద్ధం బగుట బోధవృద్ధులు సెప్పుదురు గావున నీవలనం గృతార్థుండ నైతిఁ బోవుచున్నవాఁడ మగిడి వచ్చెద నని పలికిన భూవరుం డుదంకు వడ కుండ వత్తు ననినఁ జిత్తంబు కృపాయుత్తం బగుచుండ నా భూపతి యుత్తాపసోత్తమునాననం బాలోకించి. 100

ఉ. చంపెదునట్టి నాకడకు సంయమివల్లభ వత్తురయ్య నీ
పెంపును నిక్కముం దెలిసెఁ ♦ బ్రీతుఁడ నైతి మదార్తినీతప
స్సంపదఁ జేసి పావు మని ♦ సంస్తుతిఁ బల్కిన వీనులందుఁ జే
రిం పొలయం బ్రసన్నత వహింపగఁ జిత్త ముదంకుఁ డిట్లనున్. 101

ఉ. ఏమిట నైన నొప్పుదు నరేంద్ర సుచిత్తులఁ బొందెదేనియున్
వేమరలుగ భవదుణమ ♦ వీతకళంకునిఁ జేసె నిన్ను సాం
ద్రామలకీర్తి గౌతమమహాముని సల్లనిచిత్తవృత్తి నీ
పై మలఁగించెఁ గావలయుఁ ♦ బార్థివసత్తమ పొందు మున్నరిగా. 102

క. అని పలికి మఱియు బలుదీవన లిచ్చి యతండు గారవమున నతని మ్రోం
దనకరములు నివిరి ప్రియం, బొనర్చి నిర్గరితుఁ డైనయూర్వీపతియాన్. 103

వ. భక్తివినయసంభరితుం డయి యప్పరమమునిం బ్రస్తుతించి నమస్కరించి యామంత్రణంబు సేసిన నమ్మహాత్ముండు కుండలంబులు కృష్ణాజినంబునం బదిలంబుగా ముడిచికొని గౌతమాశ్రమంబునకు రయంబునం బోయిపోయి పక్వఫలంబులం బెరిఁగినబిల్వంబుం గని యాఁకటి పెల్లునం దదీయవిటపంబున సకుండలం బగునయ్యజినంబు దగిల్చి యమ్మహీరుహం బెక్కి ఫలంబులు గోసికొనుచుండె. 104

సీ. గాలి నవ్విటప మూఁగలోల మగుడుఁ దగు, లెడలి యయ్యజినంబు పుడమిఁ బడినఁ
గని యైరావతనాగంబు ♦ గ్రక్కునఁ జనుదెంచి, వెసఁ బుచ్చికొని కదు వేగపడిన
గాంచి యుదంకుండు ♦ గ్రమ్మన దిగదాఁటి, వెనువెంటనంతకుఁ ♦ గనపుట్టఁ
జొచ్చెనయ్యురగమున్నెసు వ్రతిపడుఁడుతి ప్రముఖకాష్ఠముగొని ♦ త్రవ్వఁదొడఁగె

తే. దాని సైరింపఁ జాలక ♦ ధరణి దలరె, విప్రుఁడై వచ్చి గీర్వాణవిభుఁడు గొయ్య
కోలఁ ద్రవ్వి సమాత్రఁ బాతాళమూన, మిలసిద్ధింప నేర్చు మ్మకరిం ద్రవినుము.

వ. పాతాళభువనం బిచ్చటికి [2] సహస్రయోజనంబుల నున్నది కుండలంబులు గొని

---

1. క. సంప్రాప్తసమాధానసత్త్వంబు. 2. గ. చ. జ. 'సహస్రయోజనంబు లున్నది.'

పోయిన భుజంగం బైరావతాపత్యం బనిన విని యమ్మునిశిష్యుండు. 106

క. పాతాళంబున నున్నను, వే తెత్తుం గుండలములుఁ వినుమప్పని నా
చేతం గాకున్న నను, వ్రతము విడువంబడు నిది ధ్రువం బని పలికెన్. 107

చ. పలికిన నత్తపస్విదృఢభావ మెఱింగి సురేంద్రుఁ డొంకుప
ఱుకలవని నిల్పి కాష్ఠమునకుం గులిశంబునఁ గల్గువాఁడి యర్థిఁ
బలువును నిచ్చి వజ్రి సనఁ బాంధవ మేర్పడఁ జెప్పి భీతిమై
నిల దెరు విచ్చె నమ్మునియుఁ నేర్తెఱఁ జొచ్చె భుజంగలోకమున్. 108

వ. చొచ్చి యనేకప్రకారప్రాకారపరిరక్షితంబును బహురత్నదీప్తిజాలదేదీప్యమానంబును నైనయమ్మహానీయలోకం బాలోకించి దశయోజనాయామంబునుం బంచయోజనవిస్తారంబును నగుతద్ద్వారంబు గని యతండు కుండలాహరణంబు దుర్లభం బనుతలంపున డిల్లపడియె నయ్యెడ నరుణవదనంబును నసితాంగంబును సితవాలంబును నై వెలుంగుతురంగం బతని కిట్లనియె. 109

ఉ. అలత మైననాదగునపానము నూఁదు మెఱికింతయర్థిఁ జగు
పాతురవృత్తి నీదుహృదయంబునఁ జొన్పకు లోకవంద్యుఁ డ
గ్గౌతమునాశ్రమంబున నఖండితభక్తి నుపాస్తి సేసి నగ్గ
బ్రీతునిఁ జేసినాఁడవు పరిశ్రమతపోధన యట్లు గావునన్. 110

వ. నీకుం బాడనూపి యైరావతసుతుండపహరించినసముచితకుండలంబులు మగుడం జేరెడునుపాయం బుపదేశించితి ననిన నుదంకుండు నిన్ను నెఱుంగ నుపాసించుట యెట్లు గలిగెఁ దెలుపు మనుడు నయ్యశ్వం బతనితోడ భవద్గురునకు గురుండం బావకుండ నీవు శుచివయి సభక్తికంబుగా నిత్యంబును నన్ను నియతిం బూజించి తత్తెఱం గెఱుంగవే యని పలికినం బ్రీతి నొంది యతండు తదీయోపదిష్టప్రకారం బాచరించిన. 111

సీ. ఘోటకోత్తమరోమకూపంబులం దెల్ల, నొక్కట ఘనధూమ ముద్గమించి
కవిసి పాతాళలోకం బంతయును గప్పె, వాసుకిప్రభృతినివాసభూము
లుపరుద్ధభావంబు నొందె నైరావతా, వాసంబు హాహారవంబుతోడ
నాకులం బయ్యె నట్లతిదారుణం బైన, పెనుఁబొగ నంతయుఁ భీతి నొంది

ఆ. యమ్మునీంద్రుకడకు నహివరుల్ రయమున, వచ్చి భక్తి నర్చ లిచ్చి వినతు
లై తదీయకార్య మడిగి యెఱింగి వే, తెచ్చి కుండలంబు లిచ్చి రధిప. 112

ఉదంకుండు గుండలంబు లిచ్చి యహల్యను సంతోషపఱచుట.

చ. అతఁడును వారిఁ బోఁ బనిచి యగ్నికి భక్తిఁ బ్రదక్షిణంబు సే
సి తగ నమస్కరించి విలసిల్లఁగఁ దేజము ప్రీతచిత్తుఁ డై
యతలము నిర్గమించి రయము మీఱఁగ వచ్చి యహల్యఁ గాంచి తె
చ్చితి నివె కుండలంబు లని చేనిడి భూస్థలిఁ జాఁగి మ్రొక్కెనన్. 113

తే. ఆ యమయు గౌతముండు నత్యాదరమున, గౌఁగిలించుచు దీవించి । గారవింప
నలఁడు నమ్మునిపతికి నయ్యమకును, పెక్కుమాఱులు భక్తిమై । మ్రొక్కి నిలిచి.

క. మీకరుణఁ గాక తగుమెయి, నీకుండలములు పరిగ్రహించుట నడుమన్
వైకృత మొలసినఁ దలఁగుట, నాకొలఁదియె యనియె వినయసమ్ముండగుచున్.

వ. అనిన విని వార లత్యంతసంతుష్టాంతరంగులై రగ్గౌతముం డతని కిట్లనియె. 116

ఉ. నీచరితంబు చిత్రమవధారణీయము మిత్రసహక్షితీశ్వరున్
నీచతఁ బాప నాగ మపనీతము సేసినకుండలద్వయం
బా చతురత్వ మా బలిమి । యా దృఢనిశ్చయ మట్టు లొప్ప ధ
ర్మోచితలీలఁ దేర నొరుఁ । డోపునె యేను నిజంబ పల్కితిన్. 117

వ. అనియె నయ్యుదంకుం డట్లు దనమహాతపంబుబలిమిం బరాక్రమించి యనన్యసులభంబు లగుకుండలంబు లాహరించి గురుజనమనోరథసిద్ధి గావించె నా భృగువంశమహాత్రుమహానుభావం బిట్టిదనిన విని జనమేజయుం డమ్మహాత్మునకు వరం బొసంగి చనినవాసుదేవునన్తరవృత్తాంతంబు మునిసత్తమా యెఱింగింపవే యని యడిగిన నవ్విభునకు వైశంపాయనుం డిట్లనియె. 118

సీ. ఆ భార్గవోత్తము । నట్లు వీడ్కొని కృష్ణుఁ, డరిగి యలంకృత । మైననిజపు
రము సొచ్చునప్పుడు । రైవతకాచల, యాత్రామహోత్సవ । మఖిలజనులుఁ
గొనియాడుచుండి యు । గ్గోవిందుసందర్శనంబున నుత్సవోన్మత్తభావ
మిమ్మడి యై ప్రమో । దమ్మునం దేలి ర, ద్దేవదేవుఁడు వసు । దేవుఁ గాంచి

తే. దేవకీదేవి బలభద్ర । దేవుఁ దక్కఁ, గలుగువృద్ధబాంధవులను । గని వినీతిఁ
దత్తదుచితమనోజ్ఞవి । ధానమంచి, తాచరణములు నడపెఁ బ్రి । యము వెలర్ప.

వ. వార లందఱకు ధర్మనందను చెప్పినచొప్పునఁ బ్రణామాదియోగ్యోపచారంబు లాచరించె ననుజతనుజామాత్యభృత్యులు దన్నుం గనినం బ్రీతివాత్సల్యసంభావనాబహుమానంబులు మెఱయ నాదరించె సాత్యకిసుభద్రలం దగు తెఱంగులం దగినవారలం గానిపించె నట్లు సకలజనప్రమోదాపాది యైనదామోదరు నత్యంతసమీపాసీనుం జేసికొని వసుదేవుండు భారతరణప్రకారంబు యాతాయాతజనంబులచేత వింటిం బ్రస్ఫుటంబుగా విన వలతుం జెప్పవే యని యడిగిన నచ్యుతుం డతని కిట్లనియె. 120

క. అది యతివిస్తారము పెక్కుదినంబులు సెప్పఁ బట్టుఁ । గొంత దగం జె
ప్పెద నేఁ బ్రధానపురుషస, ముదయసమరవిధము లఘుతరోక్తులఁ దెలియన్.

సీ. కౌరవసైన్య మే । కాదశాక్షౌహిణీ, కలితంబు దానికిఁ । గట్టె వీర
పట్టంబు భీష్ముఁ డా । ప్రభువున కాదు రొడ్డి, కెలమిమైఁ బాండు । పుత్త్రులు శిఖండి
నక్కడ సప్తసం । ఖ్యాక్షౌహిణీక మ, నీక మిమ్మాడ్కిఁ బ । న్నినబలద్వ
యంబును ఖేచరు । లచ్చెరువడఁ బోరెఁ, గాండీవి దోడ్పడఁగా శిఖండి

తే. యన్నదీనందనునిఁ బదియవదినంబు నందుఁ గూలిచె నుత్తరాయణము వచ్చు
నంతకును మృతిఁ బొందక యాతఁ డుండె, నధిప శరతల్పమునఁ గడు నద్భుతముగ.

క. గురుఁ డైదు దివసములు ని,ర్భరసమర మొనర్చి యతనిఁ బరిమార్చెఁ గనా
వెరవున నర్జునుప్రాపున, దొరకొని యమ్మహుతాగ్నిభవుఁడు ద్రుపదసుతుఁ డనఘున్.

క. దంటన రాధాతనయుఁడు, రెండుదినంబులు పెనంగి గ్రీష్మసమయసూ
ర్యుండుం బోలె వెలింగెడు, గాండీవధరుశరకరోష్మఁ గ్రాఁగె నరేంద్రా. 124

చ. విను మఱునాఁడు శల్యుఁ డతివిక్రమతన్ సమరం బొనర్చి య
ద్దినమున సగంబు సెల్లఁగ యుధిష్ఠిరుచేఁ దెగుఁ దుర్బలంబు గై
కొని యని సేయఁగా శకునిఁ గూల్చె వడిన్ సహదేవుఁ డంతఁ గో
మనమునఁ జేవ దక్కి తనమానము డిగ్గఁగఁ ద్రావి హీనుఁ డై. 125

వ. దుర్యోధనుండు దనతమ్ముల భీమసేనుండు సంగ్రామంబునం దెగటార్చి యుండ
భంగంబున కోర్చి పలపలని మూఁక విడిచి గద చేతం గొని పాదచారి యయి
యొక్కండునుం బాఱి యొక్కమడువు సొచ్చి నీళ్ళు (పాషాణమయము గా)
మంత్రించికొని డాఁగియుండెఁ బాండవులు తెఱంగిపోయి పొదివికొని మర్మభేదంబు
లగు దూషణభాషణంబుల నొప్పించిన. 126

ఆ. అతఁడు మడువు వెడలి యనిలనందనుతోడఁ, దగఁ బెనంగి తద్గదావినిహతిఁ
దొడలు విఱిగి కూలి విడిచెఁ బ్రాణంబు లి,బ్బంగి జయము గొనిరి పాండుసుతులు.

క. గురుసుతుఁడు పాండుతనయశి,బిర మాఱే యడరి పొదివి భీషణవృత్తిం
బొరిగొనియెం గరిఘోటక,నరనిచయము సెల్ల నే మనం గల దధిపా. 128

వ. ఆరాత్రి యేనును బాండుసుతులు నచ్చట లేమి నంత వుట్టె నిట్లు పదునెనిమిది
దివసంబులు సెల్లినసంగ్రామంబున నే మార్వురము సాత్యకియునుం దక్క మా
దిక్కున సమస్తజనంబులు నస్తమించిరి కౌరవులదెస నశ్వత్థామకృపకృతవర్మలు
మువ్వురు బ్రతికిరి యయ్యుత్సుండు మున్న పాండవుల నాశ్రయించుటం జేసి
చావునకుం దప్పె నిది భారతరణప్రకారంబు 129

క. అని చెప్పెఁ గాని యభిమ,న్యునిచా వేర్పడఁగఁ జెప్ప నొల్లఁడ వసుదే
వునకు వగ మిగులు టను నె,మ్మనమునఁ దా నోర్వకునికి మాధవుఁ డధిపా. 130

వ. దాని నెఱింగి సుభద్ర గద్గదస్వరంబున గోవిందునితోడ నీయల్లుం డభిమన్యుండు
దెగుట మీతండ్రికిం జెవులారం జెప్పు మన్నా యని వసుదేవుండు వినంబలుకు
చుం బుడమిం బడిన వసుదేవాదియాదవజనంబులు మనంబులం గదిరిన క్రొత్త
నెవ్వగలం బలవించినం బద్మనాభుండు వారల నెల్ల నూరార్చి వారణపురంబున
సుభద్రయు నుత్తరయు నభిమన్యుని దెస నార్తిన శోకంబున నాకులత్వంబు
నొందినచందంబును గొంతి యదగు మాటల వారిఁ దేర్చిన తెఱంగును నెఱింగించి
పాండవు లేవురును వేర్వేఱ నభిమన్యునకై మఱి కాంచనగజాదివస్తువుల

విప్రప్రకరంబుల కొసంగుటయు మఱియుం దటాకకరణాదిధర్మంబు లాచరించుట
యునుం జెప్పి మఱియు దూరంబునం దెరలక మరలక యా సౌభద్రుండు రౌద్ర
మూర్తి యై దుర్యోధన ద్రోణ కృప ద్రౌణి కృతవర్మ కర్ణాదివీరవ్రాతంబుఁ
గలంచి యనేకనృపలోకంబు జమలోకంబున కనిచి యనిమిషులు వొగడ నుత్త
మలోకంబున కరిగి సుఖి యై యున్నవాఁడు వానికి వగవ నేల యనియుం బలికి
యిట్లుపశాంతి గావించి. 131

ఆ. బంధులోకమునకుఁ । బరమప్రియం బైన, యుచితవర్తనమున । నుండెఁ గృష్ణుఁ
డని సవిస్తరంబు । లగువాక్యములఁ బ్రీతి, సిగురులొత్త నిట్లు । సెప్పి మఱియు.

వ. కరిపురంబునం బుట్టినవిశేషంబులు విను మని పలికి వైశంపాయనుండు జనమేజ
యున కిట్లనియె. 133

వ్యాసుఁడు పాండవుల నశ్వమేధయాగోన్ముఖులఁ జేయుట.

సీ. మఱచుఱఁ దనచెప్పుల । నూఁడినయట్లుగ, నభిమన్యుసంస్తుతి । యైనవాక్య
యము ప్రసంగాధీనమై బంధుజనులందుఁ, బొడముటయును ధృతి । మొదలి తలరి
యుత్తర విలపింప । నత్తన్వియాలమట, గనుఁగొని పాండునం । దనులు వనటఁ
గూరిన నచటికిఁ । గారుణ్యమూర్తి వే, దవ్యాసుఁ డేతెంచి । తగినమాట

తే. లాడి వారలవగ మాన్చి । యశ్వమేధ, విషయవిధులు ప్రసంగించి । వేగ తొడఁగుఁ
డని నియోగించి వారెల్ల । నట్ల కాక, యనిన నాతఁ డంతర్హితుం । డయ్యె నధిప.

క. అన విని జనమేజయుఁ డ, మ్ముని యిట్లు హితోపదేశ । మునుం జేసినఁ బాం
డునృపాగ్రతనయుఁ డెట్లు, ననఘ తొడఁగె నశ్వమేధ । యాగంబునకున్.

క. అని యడిగిన వైశంపా, యనుఁ డాతని కిట్టు లనియె । నప్పుడు కుంతీ
తనయాగ్రజుండు దమ్ములఁ, గనుగొని యుత్సాహలక్ష్మి । గనుఁగవ నొప్పన్.

సీ. వ్యాసమహాముని । వత్సలత్వంబున, నానతి యిచ్చిన । మాననీయ
వాక్యంబు వింటిరె । వసుధ యిత్తఱి వసు, హీన యై యున్నది । దానఁ జేసి
భూదేవనిహితధ । నాదాన మావశ్య, కం బయ్యె ధానిశ । క్యత్వమును హి
మాచలయాత్రాస । మాచరణప్రకా, రమును విచారణీ । యములు గావె

ఆ. యనుఁడు పవనతనయుఁ । డతనితో నీశ్వరుఁ, బరమనిష్ఠతోఁ గొ । లిచి కరుణ వడసి
ప్రమథగణము నెల్ల । భక్తిఁ బూజించి య, త్తలమునందు భూత । బలులు లొనర్చి.

క. తెత్తము గాక నరేంద్ర, మ్మరుత్తకలిత మైనధన । రూపము సుమహో
దాత్తస్థితి నున్నకనక, మిత్తఱి నిలఁ దెసఁ దలంప । నేటికి మనకున్. 138

వ. అప్పనికి సముచితసైన్యసమేతంబుగా దేవర విజయంబు చేయవలయు ననిన
నర్జునుండును గవలును నట్ల పలికిరి దానికి ధర్మనందనుండు ప్రియం బంది
కృతనిశ్చయుం డయి ధృతరాష్ట్రునికడకుం జని యశ్వమేధయాగోపక్రమోత్సవ
శ్రవణంబునం బుత్త్రులం దలంచు శోకసంతాపసమాక్రాంతుం డయి యున్న

యన్నరపతిచరణంబుల కెఱఁగి వేదవ్యాసువచనంబులు గాంధారియు వినుచుండ నతనికిం జెప్పి యతని నయ్యాజ్ఞాచరణంబునకు ననుజ్ఞ వడసి యయ్యిరువురకును దండప్రణామపూర్వకంబుగా వీడ్కొని గొంతిపాలికిం బోయి సంతోషవికచవదన యయి యున్నయద్దేవి యధ్వరవిధానంబునకు ననుమతి సేయుం దదీయపాదంబులకుం బ్రణమిల్లి తదామంత్రితుం డై యాస్థానమండపంబునకు నరుగుదెంచి యాయుత్సు రావించి కార్యంబు తెఱం గెఱింగించి నీవు నగరరక్షకై నిలువు మని నయ్యుంబలర విదురసమేతంబుగా నిలిపి బలంబుల సంఘటింపం బడవాళ్ళం బనిచి నియతుం డయి సురపితృపూజనంబులు దీర్చి మహేంద్రార్చనం బొనర్చి మహితావధానుం డై. 139

క. నానావిధబహుళాంచిత, దానము లొనరించి యర్చితం బగునగ్నిన్
దానియధికారి ధౌమ్యుం, డాను బ్రదక్షిణవిధాయిసతం గొలిచి తగన్. 140

క. సితలేపనసితభూషణ, సితమాల్యసితాంబరములఁ జెన్నుగ సమలం
కృతుఁ డై సితాతపత్ర, ప్రతతి మెఱయఁ బూర్ణచంద్రుపగిది వెలుఁగుచున్. 141

వ. షోడశశ్వేతాశ్వయుక్తరథారూఢుం డై. 142

క. భూదైవతదత్తాశీ, ర్వాదంబులుఁ బుణ్యాగారోరవములు నొప్పో
మేగురమంగళతూర్యని, నాదంబులుఁ జెలఁగ బుధజనస్తుతు లెసఁగన్. 143

చ. వెడలుడు నమ్మహీవిభునివెంటఁ బెఱింగి వృకోదరుండుఁ గ
వ్వడియును బిన్నతమ్ములును వైభవ మొప్ప నలంకరించి యా
కుఱ్ఱఁడు మెఱయం బ్రధానభటసఘోటకదంతిరథప్రతానముల్
[1]దడిగలుఁ గుంచెలుల్ గొడుగుసెలండములుల్ విలసిల్ల వచ్చినన్. 144

క. కని యా నృపుఁ డలఁతినగవు, నిను పారెడిచూడ్కి వారిజనేత్రగములపైఁ
దను పారుచుఁ బొలయఁ జనఁ, జన రాజులు గూడుకొనిరి సైన్యంబులతోన్. 145

వ. ఇవ్విధంబున నరిగి యక్కురువంశవరుండు సముచితప్రయాణంబుల గిరిసరిదరణ్యంబులు గడచి హిమశైలంబు సేరి ధౌమ్యాదిపురోహితులఁ బురస్కరించుకొని తదీయతలం బధిష్ఠించి యొక్కయుచితప్రదేశంబున విడిసె నట్టియెడ. 146

వ్యాసుఁడు హిమవత్పర్వతంబున నున్న పాండవులకడకు వచ్చుట.

శా. బాలార్కద్యుతిపుంజపింజరజటాభారంబుఁ బ్రావృట్ఘన
శ్రీలీలం బ్రహసించు నంగమును రోచిష్ స్ఫారదండంబు ను
న్మీలన్నీలమృగాజినాంబరము నై నిర్వాణదానక్రియా
శీలుం డై నపరాశరాత్మజుఁడు విచ్చేసెం గృపాలోలుఁ డై. 147

వ. ఇట్లు సన్నిహితుం డయిన వేదవ్యాసమునీశ్వరునకుం బాండవులు పరమభక్తిం బ్రణామపూర్వకంబుగాఁ బూజించి కర్తవ్యం బెయ్యది యానతిం డనిన నమ్మౌన

1. గ, చ, జ. 'దడి గుడిగుంచెలున్'.

నీయుం డెల్లి మీ రెల్లవారును త్ర్యంబకపూజలు సెల్లింపవలయు నేఁటిరాత్రి నియతులై దర్భసంస్తరణంబుల శయనించునది యని నియోగించిన. 148

ఆ. రమ్యమైనచప్పరంబుల దర్భసం,స్తరణములను యోగ్యసదనమునఁ బ్ర
భాసమానము లగుపంచాగ్నులునుబోలె, నమ్మహాత్ము లుండి రధిపముఖ్య. 149

వ. అట్లుండి యవనీసురాశీర్వాదంబుల నాదరించుచు నా రేయి గడపి కల్యం బగుటయుం గాలోచితకరణీయంబులు నిర్వర్తించి సర్వక్రియాకలాప నిర్వాహణధుర్యుం డగుపారాశర్యుండు వనుప ధౌమ్యప్రముఖపురోహితసహాయమహనీయ సమాచారు లగుపాండవేయులు పరమస్థండిలంబునం బార్వతీపతి నావహించి యుత్కృష్టంబులును బహుళంబులు నగుగంధపుష్పధూపదీపంబులం బూజించి సముచిత మనోహారిభూరిపాయసాది [1]భవ్యద్రవ్యభారమహోదారం బగునైవేద్యంబు సమర్పించి వేఱువేఱ ప్రధానప్రమథులకుఁ దద్గణంబులకు నర్చ లిచ్చి కుబేరమాణిభద్రప్రభృతిభూతయక్షజనంబులను సభక్తికావాహనకలితులం గావించి పూజనంబు లాచరించి. 150

క. రక్షాకరమంత్రకలన,దక్షాత్మకులైనయట్టిధౌమ్యముఖోదా
త్తక్షోణీసురులు బెరయ, నక్షయపుణ్యుఁ డగుకౌరవ్యనాథుఁ డెలమిన్. 151

క. అనుజులుఁ దానుఁ బరాశర,తనయపురస్సరముగా నిధానస్థలికిం
జని యరుణగంధకుసుమము,లను మాంసాపూపములను లాజములఁ దగన్. 152

ఆ. భూతతృప్తిఁ జేసి భూరిబలాఢ్యులఁ, బరిజనములఁ ద్రవ్య బచుచుటయును
నతికుతూహలమున నార్చి వారలు ద్రవ్య, సన్నిధానదేశ మధిపముఖ్య. 153

క. త్రవ్వినఁ బ్రభ లెల్లదెసల, నివ్వటిలఁగ వెలుఁగుచుండె నిధి యనిలజుఁడుం
గవ్వడియుఁ గవలు నలరఁగ, నవ్వసుధాధిపుఁడు దాని కర్చన లిచ్చెన్. 154

వ. అట్లు వివిధవిద్యానిధి యగు వేదవ్యాసుండు సన్నిధిసేసి యప్పెన్నిధి సాధించినధర్మనందనుఁ డాపరాశరనందనుపాదంబులకు దండప్రణామంబు సేసి నిలిచి కేలు మొగిడ్చి ఫాలతలంబునం గదియించి వినయావనతుం డై యున్న వన్నరేంద్రు నమ్మునీంద్రుం డాలింగనాశీర్వాదంబుల నాదరించి యామంత్రణంబు సేసి యంతర్హితుం డయ్యె నమ్మానవనాథుండు. 155

సీ. శకటఖరోష్ట్రఘోటకకుంజరంబుల, నేకసహస్రంబు లెలమి సంఘ
టించి భారంబు లెత్తించి భారవహాత్య,దక్షజనుల్ పెక్కు లక్ష లర్థిఁ
గదిసి యే నెనసి కడఁగి మోపఁగ యాగ, నిలయంబుఁ గలపయ్యకలశములును
నలఁకులుఁ గాఁగులు నాదిగాఁ గలభాండ,ములును బీఠములు శయ్యలును బోళ్ళు
తే. రోఁకళులుఁ బట్టువంబులు స్రుక్స్రువాద్య, పాత్రిదండకమండలు[2]దాత్రములును
లోనుగాఁ గల్గువస్తువు లుద్ధహేమ, మయము లొక్కట నడపించె మనుజనాథ.

---

1. ట. భవ్యద్రవ్యాంబుమహోదాత్తంబగు. 2. క. పాత్రములును,నివి యులోను గాఁగలిగినయిద్ధహేమ

చ. మఱియును సన్నిధిం గలసమంచితకాంచనరాశి బండులం
బెటికల మూపులం గొలఁది వెట్టఁగఁ బెక్కగుబారువుల్ జనుల్
వెఱఁగుపడంగ ఖేచరులు వెక్కస మందఁగ శత్రుకోటికిన్
వెఱ పొనరించువార్త పృథివిం బరఁగన్ నడపించె భూవరా. 157

ఆ. ఏరుసేలకొలఁది నెడనెడ విడియుచుఁ, బోవ వలసి యుండె భూరిభార
వహనలడప్పి మొఱఁగు వాఁ డగునాధర్మ,నందనునకు ధరణినాథవర్య. 158

వ. అంత నక్కడఁ గృష్ణుండు. 159

తే. ద్వారకానగరమునకుఁ దన్నుఁ బుచ్చి, నపుడు ధర్మజుఁ డశ్వమేధాధ్వరంబు
సమయమగుట ప్రతీక్షించి సకలబంధు, యుక్తముగ రమ్మనినమధువైరి యేతెంచి.

కృష్ణుండు సకలబంధుసహితుం డై కరినగరంబునకు వచ్చుట.

వ. అరసికొని యుండి యప్పాండవాగ్రజుండు యాగంబున కుద్యోగంబు సేయుట
చారులు సెప్ప నాకర్ణించి కుతూహలోన్నిద్రుం డై బలభద్రసాత్యకికృతవర్మ
ప్రద్యుమ్నచారుదేష్ణసాంబాదియాదవసమేతంబుగా వసుదేవ దేవకీసమనుజ్ఞాతుం డై
సుభద్రం దోడ్కొని కరినగరంబున కరుగుదెంచిన ధృతరాష్ట్రుండును గాంధా
రియుఁ గొంతియుం బనుప నుత్సుకుం డై యుయుత్సుండు విదురుం బురస్కరించి
కొని యప్పాంచజన్యధరు నెదుర్కొని పరమభక్తిం దోడ్కొని వచ్చిన. 161

తే. మున్ను ధృతరాష్ట్రుకడకు నాసన్నుఁ డేఁగి
యతని గాంధారిఁ బ్రణతిపూర్వాతిమధుర
వాక్యములఁ బ్రీతి నొందించి వచ్చి గొంతిఁ
గాంచి ప్రణమిల్ల నద్దేవి కౌఁగిలించి. 162

వ. పెక్కుభంగుల దీవించె బలదేవాదులుం దగిన తెఱంగున నప్పాండు రాజమహిషిం
గని రఘుకులపాలికాతిలకంబు పులకంబులం బెరిఁగిన మేనితో మాననీయచరిత్రుం
డగునద్దేవకీపుత్త్రు సంభావించి. 163

క. ప్రమద మెసఁగ విదురుఁ బనిచి, సముచిత మగునర్చనంబు సంకర్షణపూ
ర్వము గాఁగ నడపి యదునిక,రమునర్చలు సంభృతాదరంబున నడపెన్. 164

వ. సుభద్ర దన్నుం గనినం బరమప్రియంబున గారవించి యభ్యంతరమందిరం
బునకుం బుచ్చెఁ బద్మనాభప్రభృతు లగునాబంధుజనంబు నెల్లను నగరిచేరువ
శోభిల్లుమందిరంబుల విడియుంప యుయుత్సు నియోగించె నట్లయ్యందఱు
నభినందితు లై యున్నసమయంబున. 165

ఉ. ఉత్తరపుణ్యగర్భమునఁ దనుండి భవజ్జనకుండు పూరువం
శోత్తరుఁ డాదిరాజగుణసంయోగి పరిక్షితుఁ డుద్భవించినం
జిత్తము లలరఁ బుత్త్రుఁ డని చెప్పిరి వెల్పలివారి కింటిలో
నత్తఱి నున్నవృద్ధసతు లార్చ జనం బఖిలంబు నుబ్బునన్. 166

క. బాలుఁడు మృతజాతుం డని, యాలోనన యేడ్పు చెరయ ✽ నలమట నచ్చో
నా లలన లుగ్గడించినఁ, దేలిరి శోకమున జనులు ✽ ధీరవిచారా. 167

వ. అ త్తఱి రోదనధ్వనులు గలయం జెలంగిన విషాదవేదనాయత్తంబు లయిన చిత్తాంగంబులతో శౌరి సాత్యకి యనుగమనంబు సేయ సత్వరంబుగా గొంతి యున్నెడకుం జనుదెంచె నప్పు డాకుంతిభోజనందనయు ద్రౌపదియు సుభద్ర యు నా ర్తనాదంబు లెసంగం దనకడకు రయంబున రా నెదుర నయ్యాదు వీరుండు గాంచి శోకసమాకులమానసుం డయ్యె నప్పాండురాజపత్ని పురుషో త్తముతో డగ్గుత్తిక నెలుంగు దగుల ని ట్లనియె. 168

పరిక్షిత్ప్రాణదానంబునకై కుంతీసుభద్రలు కృష్ణుఁ బ్రార్థించుట.

క. గతి నీవె నాకు మత్సం,తతికిని నీయల్లుఁగుఱ్ఱ ✽ తనయుఁడు పుట్టెన్
మృతుఁడై క్రూరుం డగుగురు,సుతునిషీకాస్త్రవహ్నిఁ ✽ జూఁడినకతనన్. 169

సీ. దేవకీపుత్రి సం✽జీవితుఁ జేయవే, యబ్బాలు నద్దారు✽ణాస్త్రసంప్ర
యోగంబునపుడు కృ✽పాగరిష్ఠుండ వై, చేసితి ప్రతిన గా✽చెద నవశ్య
మును నుత్తరాగర్భ✽జనితు నే నని బాలు,బ్రదుకుతోడిద నాదు✽బ్రదుకుద్రుపద
తనయాసుభద్రలు ✽ ధర్మజుం డనుజు లా.శిశువు సంజీవితుఁ ✽ జేయ కున్న

ఆ. బ్రదుక రన్వయమున ✽ నుదకపిండప్రదా,నంబు లెడలు మత్స్య ✽ నందనయును
నూఱడింపఁబడియె ✽ నొకనాఁడు నీచేత, దానియార్తి కరుణఁ✽దలఁగవయ్య 170

వ. దేవా నీ విక్కులంబు గలిగించినవాఁడ వింకను నీవ వీని బ్రదికింపవే యని పల్కుచుం బుడమిం బడిన గొంతి నగ్గోవిందుం డనునయవచనంబుల నూఱార్చి యెత్తె నట్టియెడ సుభద్ర యమ్మహాత్మునితో ని ట్లనియె. 171

క. గురుసుతుఁడు భీమునకునై, పరమాస్త్రం బెత్తె దాని✽ఫల మందంగా
నరుఁడును దత్పత్నియుఁ గాం,చిరి తుది నే నీకు నేమి ✽ సెప్పుదుఁ బ్రభువా. 172

క. నీమఱఁది యాకొడుకుపైఁ, బ్రేమం [1]బెప్పుడును బెంపఁ ✽ బ్రేలెడి మనుమం
డీమొయి వమ్మయి పోయిన, నేమి యగునొ యెఱుఁగ నీవ ✽ యెఱుఁగుదు దీనిన్.

సీ. ధర్మజుం డెమ్మెయి ✽ [2]ధరియించు నెవ్వగ, పవననందనుఁడును ✽ గవలు నేమి
చెప్పన నుపశమిం✽తురు దీని విను దేవ, యస్త్రప్రయోగంబు✽నపుడు నీవు
గురుసుతు నదలించి ✽ కుచ్చిత నిమ్ము మో,ఘాస్త్రునిఁ జేసిద ✽ నంటి దాన
నూఱడి యుండుదు ✽ నుజ్జ్వలతేజ ని, మహితానుభావత ✽ మాకు నెల్లఁ

ఆ. దెలిసి యుంటఁ గాన ✽ [3]యలుకము సత్యద, యాశ్రితాభిరక్ష ✽ లనఘ నీకు
నైజములు శిరఃప్రణతి నేను వేఁడెదఁ, గరుణ నిక్కులంబుఁ✽గాచికొనుము. 174

తే. ఏవిధంబునఁ గోలుపో✽నీవు నివ్వు, పాండవుల నీదుసన్నిధిఁ ✽ బాపకర్మ
శీలుఁడైనయశ్వత్థామ ✽ గోలుపుచ్చె, వాని నే మనఁగలదు దు✽ర్వారతేజ. 175

1. ౯. చెప్పు వంగప్పుఁ చెంప. 2. ౪. ర.యుంచు. 3. చ. యలుకము.

వ. అని వెండియు. 176

చ. భువనము లొక్కపెట్ట మృతిఁ బొందిన, జీవము లావహింప నే
ర్తు వలచినట్టు లైన గుణశరూథుఁడు మేనమఱందిపౌత్త్రుఁ జా
వ విడు తే వంతపెంపున నవారణ నీయెదురం బ్రలాపముల్
వివిధము లే మొనర్చితిమి వెఱ్ఱుల మై యిటు భక్తవత్సలా. 177

తే. అనినఁ గృపయును శోకంబు నగ్గలింప, వనజనాభుండు జను లర్థివినఁగఁ బిన్న
వాని బ్రతికింతు భగవంతనలవదని యెం, నెలుఁగుఁ జెఁదిస్వనమ్మనస్సెసఁగ పొసఁగ.

వ. ఎల్లవారును బ్రమోదంబు నొంద నట్లు పలికి సూతికాగృహంబునకుం గుంతీ
ప్రభృతులు దోడరా నతండు వోవునప్పు డది ధవళకుసుమసితసర్షపలాజపూర్ణ
కుంభప్రముఖమంగళవస్తువులను బ్రజ్వలితపావకప్రదీప్తశస్త్రపిచుమందపల్లవాది
భూతపరిహారకపదార్థంబులనుజతురవృద్ధాంగనాచికిత్సకదక్షపరిచారికాముఖ్యహిత
కారిపరివారజనప్రవర్తనంబులను బరిశోభితంబయి యుండెనమ్మందిరంబాగోవిం
దుండు ప్రవేశించె నట్టియెడ నంతకుమున్న. 179

సీ. కడచి ద్రౌపది సని యడలునఁ బడి యున్న, మాత్స్యనందనతోడ నమాధవుండు
సనుదెంచె ఁడెఁడె సవినయంబుగాఁ గను, మనవుడు సుస్థిత లై వికీర్ణ
వేణీధరంబుతో వినతి గావించి భ, క్తార్తి వాపుట నీకు నతిదృఢవ్ర
తంబు కదే దేవ దయ వెలయంగ నీ, శిశువు సంజీవితుఁ జేయవయ్య

తే. నీవు గూర్తేని మేనల్లునికిఁ దదీయ పుత్త్రుద్రోణుని పుత్త్రుండు బాలియఁ జేయు
వాఁడె పతిహీన యగుపాపవతికిఁ బుత్త్ర, హీనతయును బాటిల్లినన్ నెట్లు బ్రదుకు. 180

ఉ. నందనుచావు నిక్క మయినం జను టప్పుడ కల్లు దేవకీ
నందన యెల్లభంగి నరనందనుపాలికి [1]నాఁటి కేఁచి పో
వం[2]దనతోడి తెంపునకు వారక యిచ్చినబాస దప్పె నిం
కం దనుఁ గన్న దెప్పు నొడికా ఁడని కొంకెదఁ గాని యచ్యుతా. 181

తే. పద్మనాభుండు వచ్చినన్ బాలుఁ జంకఁ, బెట్టికొనిపోయి మ్రొక్కింతుఁ బ్రీతి యెసఁగ
నని తలంచుచునుండితినమ్మనోర, థంబు విఫలంబుగాఁ జేసె ద్రౌణి పేర్చి. 182

వ. అని యమ్మంత నిలుపనివలవంత పెంపున బాలశవంబు నెత్తికొని యంకతలంబున నిడి
కొని తదాననం బాలోకించి. 183

ఆ. తాత లోకగురుఁడు దామోదరుఁడు వచ్చి, యుండ లేచి మ్రొక్క వుజ్జ్వలాంగ
ధర్మవేది వైనశీతంద్రికిఁ బుట్టి య, ధర్మపరుఁడ వగుట తగునె నీకు. 184

క. కను విచ్చి గొంతిఁ జూడుము, ననుఁ జూడుము ద్రుపదనృపతనయఁ జూడుము నీ
జనకునితల్లి సుభద్రం, గని, దనయా చూడు తల యెత్తి దరహాసములోన్. 185

చ. అని పలవించి యాసరసజానన మూర్ఛ మునింగి నేల వ్రా

1. క. నాఁటి కేఁచి. 2. క. దనతోడి తెంపునకు.

లినఁ గరుణాంబుపెంపున విశ్లీనతఁ బొందుమనంబులుం గా సభా
ష్పనయనయుగ్మకంబులును బొడలుమెరోమములు నైన కౌరవాం
గనలయ్యలంతఁ గాంచిన పగల్ మిగులుం బగవారి కేనియున్. 186

వ. ఒక్కింత సేపునకుం దెలి వొంది విరాటనందన ధరాతలంబునం బడి యున్న భంగిన ఫాలతలంబునం గేలు మొగిచి గోపాలదేవునకు మ్రొక్కుచు వెక్కుచు శరణు శరణని పలికిన నప్పరమకృపాపరుం డోడకోడకు మనుచుం బాదప్రక్షాళనోపస్పర్శనంబు లాచరించి యశ్వత్థామ ప్రయుక్తంబును బ్రహ్మశిరోనామకంబును నగు నమ్మహాస్త్రంబు నుపసంహరించి యబ్బాలశవంబు శయ్యాతలంబునం బెట్టం బనిచి దరోల్లసితు లైన యెల్లవారలం గలయం గనుంగొని. 188

కృష్ణుఁడు మృతబాలుం డైనపరిక్షితు లబ్ధజీవితుం జేయుట.

తే. మీఁద బొంకగుమాట యేను మీరు వినఁగ, నాడ నిబ్బాలు బ్రదికింతుం జూడుఁ డఖిల
జనులు నిప్పుడ యేలుండు సంతసమున, దీని విని పాండవులు ప్రీతిఁ బూనువారు.

వ. అని ప్రతిజ్ఞ సేసి యిట్లనియె. 189

తే. పగఱయెడనైన నే బొంకుపలుకనేని, సమరముఖమున నెన్నఁడుఁ జలితవృత్తిఁ
బిఱిఁది కడుగిడనేని నిప్పిన్నవాని, యంగమున జీవ మీప్రొద్ద యావహిల్లు. 190

క. ధరణీసురకులము నెడం, గర మొక్కఁడు ప్రియము నాకుఁ గలదేని సధ
ర్మరతుఁడ నయేని యియ్యుత్తరాసుతుఁడు లబ్ధజీవితత్వము నొందున్. 191

క. నరుని యెడ నామనంబున, విరోధ మెన్నఁడును నేమివిధమున నైనం
బొరయమి నిజమేనియు సుస్థిరముగ నిబ్బాలు మేన జీవము సెందున్. 192

క. నిక్కపుధర్మపునన మే, నక్కంసాదుల వధింతు టారసి చూడన్
నిక్కువ మై యార్యజనుల, కెక్కనయేని నసువర్గ మీశిశువు గనున్. 193

తే. సుహితసత్యంబుఁ బరమధర్మంబు గాఢ, నిర్మల బ్రహ్మచర్యంబు నిత్యసుప్ర
తిష్ఠితంబులై నాయందుఁ దేజరిల్లు, నేని నిబ్బాలునకు జీవ మిపుడ వచ్చు.

వ. అని యిట్లు పురుషోత్తముండు పలికిన. 195

సీ. బాలుని మేనికిఁ బ్రాణముల్ వచ్చిన, నల్లన కదలెఁ దదంగకములు
మఱి కను విచ్చె నత్తెఱఁగు దెల్లంబుగాఁ గని గొంతి మొదలైన కౌరవాంగ
నలు మనంబులు నిండి [1]యలువులఁ బాటెడు, నానందపూరంబు లనఁగఁ బొల్చు
హర్ష బాష్పములు రోమాంచకంచుకితదేహంబులు నై యలరార నఖిల

తే. జనసమూహమ్ములును సంతసమునఁ దేల, గగనమున దివ్యవాణి యక్కమలనాభుఁ
బొగడె మీఁ దండ్రి యున్న యప్పుణ్యగృహము, కరము శోభిల్లె నప్పుడు కౌరవేంద్ర.

ఉ. ఉత్తర బిడ్డ నెత్తికొని యొయ్యన మోము మలరంగ వచ్చి య
త్యుత్తమతేజుఁ డైన పురుషోత్తమునంఘ్రులపొంత భూస్థలిం

1, క. యలవుల దిగఁబాఱ నానంద. 2, 'యత్యుత్తమతేజుఁ డైనపురుషోత్తము' నని పెక్కుప్రతులు.

జిత్త మొప్పఁగా దనదుక్క చెన్నఁబుఫాలము సేర్చి నర్జ ముదా
యుత్తమనస్కుఁడై యతఁడు సాదరభాషల గారవించుచున్. 197

క. వినుతబహురత్నవిస్ఫుర, దనేకభూషణవిశాయ మబ్బాంబునకి
చ్చినఁ దక్కటియుమువీరులు, జననాయక యొసఁగి రక్కజంబగుతోడవుల్. 198

వ. అప్పుడు. 199

తే. ఆత్మకులము పరిక్షీణ మైన జనన, మొందెఁ గాన యియ్యభిమన్యునందనునకు
నర్హమగుఁ బరీక్షిన్నామమని యొసఁగ గృష్ణుఁ, డఖిలజనములువినఁ బౌరవాధినాథ.

వ. అట్లు పుండరీకాక్షుండు పాండవసంతానంబు గలిగించి నట్లప్పరమపురుషుచేతం బ్రత్యుజ్జీవితుం డైనభవజ్జనకుం డేకమాసవయస్కుం డగుచుండె నంత నొక్కపుణ్య దివసంబున. 201

సీ. ధర్మసుతుండును దమ్ములు నమ్మహా, కనక మస్లెత్తించికొని యుదాత్త
వైభవ మెసఁగంగ వచ్చినఁ గృష్ణుని, యుక్తులై విదురయుయుత్సు లర్థిఁ
గస్తూరినీళ్లుల్కలయంపులను గప్పురంపు మ్రుగ్గుల బహురత్నతోర
ణములఁ దోరపుముత్తియములఁ నొనర్చిన,ప్రాలంబమాలికాపంక్తులను బ

తే. సింకిపూర్ణకుంభముల విశేషమరక,తప్రకరమయకదళికాస్తంభములను
గరిమ దోరంబు జిత్రరేఖంబుఁగా న, లంకరించిరి పురముఁ గుశలప్రదీప. 202

వ. సకలజనంబులుం గయిసేసి కలయం బొలయ నప్పు డప్పురంబు చంద్రోదయ ఘూర్ణమానం బయినయర్ణవంబు ననుకరించె నయ్యచ్యుతుండును బలదేవ సాత్యకిప్రద్యుమ్నప్రముఖులు ప్రమోదంబునం బొంపిరివోవుచుం బెంపారు నలంకారంబుల నభినవోదారచారుత్వంబు వహించి మెఱుఁగుచని పాండవులం గని రయ్యిరువురుదెఱంగులవారలును సౌహార్దంబును సౌముఖ్యంబును సౌజన్యంబును నత్యంతంబును మెఱయ నర్హంబు లగునాచారంబులు నడపి రట్లు కృష్ణసమేతులై యీ తాతలు హర్షోల్లాసభాసమానులగుచు నాసమగ్రకాంచనసంచయంబుఁ బురస్కరించుకొని పురప్రవేశం బాచరించి. 203

క. తొలుత ధృతరాష్ట్రగాంధా,రులఁ గని మఱి గొంతిఁ గాంచి ప్రోన్మిలచ్చ
త్కులుఁ బ్రమదసంభరితచి,త్తులు న[illegible] నయయుయుత్సునర్జ విదురునిం బ్రీతిన్. 204

వ. కానిపించికొని సంభావించి సంభృతాహ్లాదులగుచుం గృష్ణాదియాదవలోకంబునుం దారు నొకరమ్యమండపంబున నుండి రట్టియెడ. 205

వ్యాసుఁడు కృష్ణసహితులై యున్నపాండవులయొద్దకు వచ్చుట.

సీ. తగువారిఁ గాంచి యత్యద్భుతం బగుభవ,జ్జనకు తెఱంగు విస్తార మొప్పఁ
జెప్పిన వార లచ్చెరువాటు సంతసం,బును నెమ్మనంబులఁ బెనగొనంగఁ
బద్మనాభు ననేకభంగుల వినుతించి, యిట్టివి వింత లే మెల్లనాఁడు
నిట్టుల కాక మాకయెడ నీదుకరుణపెం, పని యభినందించి రట్లు గలసి

తే. నెమ్మిఁ దారును గృష్ణుండు | సమ్మదమున, నుచితవర్తనకలితులై యుండఁగొన్ని
దివసములకు సంప్రీతి నేతెంచె బోధ,భాసితుం డైనసత్యవతీసుతుండు. 206

క. ఏతెంచిన గోవిందస,మేతంబుగ నెదురుకొని మహితపూజాసం
ప్రీతునిఁ గావించి యతని, బూతాతలు గొలిచి యుండి మృదువచనములన్. 207

వ. సముచితగోష్ఠి నడపి రప్పాండవాగ్రజుండు మునిజనాగ్రణితో భవత్ప్రసాదం
బునం బడిసినయుస్మశోధనంబు మహనీయంబుగా నశ్వమేధయాగంబునం దుప
యోగంబు నొందింపఁ గోరెద ననుజ్ఞ యీవే యనిన సంతసిల్లి యాసంయమి
వరుండిట్లనియె. 208

ఆ. తురగమేధ మఖిలదురితహరము నీ, వది సమగ్రదక్షిణాన్వితముగఁ
జేసి నిర్మలత్వశోభాసమానుండవై, వెలయు మమృతకిరణకులవరేణ్య. 209

ఉ. అనవుడుఁ బ్రీతి నొంది యతఁ | డచ్యుతుఁ గన్గొని భవ్యమైనయు
ప్పని దగ నిట్లు సేయు మని | పన్నుము తల్లియుఁ దండ్రియున్ గురుం
డును సచివుండు నిష్టసఖుఁడుం గరుణాకర నీవమాకు నీ
యనుపమముఖ్యవృత్తి జగ | మంతటికిన్ గతి వేయు నేటికిన్. 210

వ. అనిన విని యంబుజనాభుం డతని కిట్లనియె. 211

ఉ. వ్యాసులు పంచినట్లు నియమాఢ్యతఁ జేయుద మశ్వమేధముం
జేసి కృతార్థతం బొరసి | చిత్తమునెవ్వగఁ దొల్లఁ బాచి కా
మ్మానుకృతంబు ధర్మనిచయప్రవరం బని యేన చెప్పి కా
జే సుగుణాభిరామ నిను | దీనికిఁ బొన్పితి మున్న దృఢంబుగన్. 212

చ. అనుమతి యింక వేగపడఁ దలఁ పేటికిఁ గౌరవేంద్ర న
న్ననుపుము వాజిమేధకరణంబున కేపని సేయువాఁడ నీ
యనుజులు నల్వురే నొకఁడ | నధ్వరకార్యము లెల్ల నీదు న
మ్మనమున కెక్కఁ జేయుదుము | మాన్యచరిత్ర తొడంగు మర్థితోన్. 213

సీ. అన విని సమ్మోద | మారినచిత్తంబుతో నభినందించి | యా నరేంద్ర
వరుఁడు పారాశర్యువలను గనుంగొని, దీక్షకు నయ్యెడుదినము దీరు
నూచి యా సంస్కార | మాచరింపుఁడు దయ, ననవుడు నమ్ముని యాజ్ఞవల్క్యుఁ
బేర్కొని పిలుపించి | బ్రీతి నెఱింగించి, వారును నేనును | వసుమతీశ

ఆ. నడపవలయుపనులు | నడపువారము చైత్ర,మాసకలితపౌర్ణమాసి నిప్పు
డరయఁ జనుపు మేధ్యమగుతురంగముఁ దద్జ్ఞ, లైనయట్టిజనుల | నంచితాత్మ.

క. వేదోక్తవిధిసహితముగ, వ్యాదరమున విడువఁ బడినయయ్యశ్వం బీ
మేదినిఁ గలయం దిరుగును, నీ దగునిర్మలయశంబు | నెఱయ వెలుఁగఁగన్. 215

వ. సర్వసంభారంబులును సమకట్టింపుము స్రుక్స్రువాది క్రతుసాధనంబులు గ్రొత్త

లుగాఁ గనకంబునం గావింపం బనుపు మని చెప్పిన నప్పుడమిఱేఁడు. 216

క. తురగపరీక్షావిదు లగు, పురుషులఁ బిలిపించి యశ్వకపుంగవుఁ గని తెం
డరయుఁడు మనకొట్టములలో, నిరుపమలక్షణముఁ గీర్తనీయంబును గాన్. 217

వ. అని పలికి కర్మాధికారులం గలయం గనుంగొని యజ్ఞంబునకు వలయునట్టి భాండ ప్రముఖంబు లయినసాధనంబులును స్రుక్స్రువాద్యుపకరణంబులును సువర్ణమయంబులుగా వేగంబ చేయింపవలయు నని నియోగించిన నట్ల కాక యని చని వారును బడంబడి. 218

క. తురగంబును సంభారో, త్కరమును గొని వచ్చి చూపఁ ధర్మజుఁడు పరా
శరసుతునకు వాని వినయ, పరత సమర్పించెఁ గురునృపాలవరేణ్యా. 219

క. ముని యశ్వముఁ జూచి కరం, బనురాగముఁ బొంది మేధ్య మగు నిది దీనిన్
వినుతవిధానమున విడుత, మనవుడుఁ నతఁ డతనితోడ నాదర మలరన్. 220

తే. దీని రక్షింప నర్హుండు మానసీయ, బోధ యెవ్వండు నీదు సద్బుద్ధి నరసి
యిట్టివాఁ డని యానతి యిమ్ము నాకు, ననిన నమ్మునినాథుఁ డయ్యధిపుతోడ.

క. దివ్యాస్త్రవిదుఁడు ధిషణా, భవ్యుఁడు శౌర్యోత్తముండు పార్థుఁడు దగు న
శ్వవ్యాపనక్రియకు నితఁ, డవ్యాహతి నాచరించు నక్కార్యంబున్. 222

వ. భీమసేనుండును నకులుండును మనరాష్ట్రంబు రక్షించువారు భవదీయకుటుంబ కార్యంబులు సహదేవుండు నడపువాఁ డని నిర్దేశించిన. 223

—ధర్మజుం డర్జును యజ్ఞాశ్వరక్షణంబునకు నియోగించుట.—

సీ. అమ్మహీవల్లభుఁ డర్జునుఁ బిలిచి య, ధ్వరయుక్తమైన యత్తురగరత్న
మనఘ సంరక్షణీయంబు నీ కొరులకు, నప్పని శక్యంబె యెల్ల భంగి
నిక్కార్యమునకు నీ వేఁగంగవలయు నీ, యుంచితాశ్వము చరియించుచుండ
నెడనెడ రాజులకే నశ్వమేధదీక్షితుఁడ నై యుండుట సెప్ప ముచిత

తే. కరణనియతి నిరోధంబు గాకయుండ, నడపు మని చెప్పి భీమనకులుల రాష్ట్ర
గోపనమునకు సహదేవుఁ గులకుటుంబ, సమితిరక్షకుఁ బనిచి యుత్సాహ మెసఁగ.

వ. మఱియునుం గలయు లంతిపనుల కర్హజనంబుల నియోగించి గాంధారీధృతరాష్ట్రుల యనుమతి వడసి కుంతీసమనుజ్ఞాతుం డయి యశ్వమేధముఖంబున కున్ముఖుం డయ్యె నని యిట్లు ధర్మపుత్త్రుపుణ్యచరిత్రంబు సెప్పిన నప్పరమధార్మికుండు సకలలోకమనోజ్ఞం బగు యజ్ఞం బెవ్విధంబున నిర్వహించె వినువేడ్క నాచిత్తంబునం జిగురొత్తెడుఁ జెప్పవే యనుటయు. 225

ఉ. మానమదాదిదోషపరిమార్జననిర్మలచిత్తభక్తస
న్మానసలోల వీతపరిగ్రహణవిభూతివిశాల శాంతతా
హీనవిదూర విశ్వహితకేళివిచార నిరామయాన్వయ

స్థానకసిద్ధిమంగళవిధాయక[1] వేదసభైకనాయకా. 226

క. అనపేక్షితఫలతాశో, భవమహనీయక్రియావిశేషాత్మకరూ
ప నితాంతధూతసంశ్రిత,జనపాపా పరమమిత్రసత్యాలాపా. 227

మాలిని. తరుణజరఠభావద్రావణోదారమూర్తీ
వారణకరణనిర్మూలనతాభ్యంతరార్తీ
మరణజననదుఃఖోన్మాదహృత్పుణ్యకీర్తీ
చరణకమలపూజాశాలిచిత్తానువర్తీ. 228

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతంబైన శ్రీమహాభారతంబున యశ్వమేధపర్వంబునందుఁ దృతీయాశ్వాసము. 229



1. గ. వేద॥ సభైకనాయకా. జ. వేదపదైకనాయకా.



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## అశ్వమేధపర్వము, చతుర్థాశ్వాసము



విద్యాశాంతకృతీ
ప్రావీణ్య [1]నిరూఢిగణ్యా ! పాదసరసిజసం
సేవనతత్పరహృత్కా-మ
లావాసకృతప్రమోద ! హరిహరనాథా. 1

ధర్మజుం డశ్వమేధదీక్షం బూని హయంబుం బుడమిం దిరుగ విడుచుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె న ట్లశ్వమేధయాగోత్సవాగ్ర ప్రద్యోతితుం డయినపాండవాగ్రజుదీక్షకు నర్హం బయినదినంబు సంప్రాప్తం బగుటయు మహారాత్రికదత్తశుభముహూర్తంబునం గృష్ణద్వైపాయనాదులైన ఋత్విజులు వేదవిహితవిధానమహితంబుగ నక్కురుక్షితిపతి దీక్షితుం జేసి రవ్వసుంధరావల్లభుండు సంవీతక్షౌమకృష్ణాజినుండును దండపాణియు నయి ఋత్విగ్గణంబులు బలయం బరమసంయమపరివృతి ప్రజాపతిప్రఖ్యుండును గన త్కాంచనాభరణభూషితుండు నయి బహుళప్రభలు నిగుడ సందీప్తపావకసన్నిభుండును నగుచు వెలింగెఁ దత్తుల్యాకల్పకల్పనంబున ఋత్విగ్గణసమాజంబును దేజరిల్లె నావేదవ్యాసమహామునిచేత శాస్త్రోక్తప్రకారంబున ముక్తం బయి హయోత్తమంబు వెడలె నప్పుడు. 2

సీ. విన్వచ్చుఁ డాగమ్యవిధివంతముగ ధర్మనందను నామంత్రణంబు వడసి
గాండీవపాణి యై ! కవచధోసలల్ ధరియించి, తేజోవిశేషంబు ! రాజితముగ
నయ్యశ్వరత్నంబు ! ననుసరింపంగఁ బ్రజ, బాలురు వృద్ధులు ! భామినులును
లోనుగాఁ బఱతెంచి ! లోలత [2]నతనినాహయమును గనుఁగొనుచునప్పు డగ్గ
తే. లంపుసంబడి నెమ్మిఁ బ్రకటింప నాజనంబు లహ్వానకు దివకనలఁ బాగడ్త
లను బ్రమోద మొనర్చిరి కవనధిరవము,ననుకరించెనయ్యులిపు నృపాగ్రగణ్యా. 3

---

1. క, నిరూఢ గణ్యపాదసరసిజ, 2. గ. నతని హయంబును గనుంగొను,

వ. ఇవ్విధంబునం జను నా కవ్వడితోడ యజ్ఞకర్మకుశలుం డైన యాజ్ఞవల్క్యశిష్యుం
డర్హవిధానంబులకయి మాననీయవిప్రజనసహితంబుగాఁ జనియె నప్పరమ
తురంగంబు ధరణిం బ్రదక్షిణరూపంబునం దిరిగి యుత్తరాభిముఖం బై యల్ల
నల్లన యరుగుచుండ నర్జునుం డనుసరించి పాలనపరుం డగుచు బ్రవర్తింపం
ద్రిగర్తదేశంబునందు. 4

అర్జునుతోఁ ద్రిగర్తదేశాధిపతులు యుద్ధము సేయుట.

సీ. ఉద్ధతులై త్రిగర్తోర్వరాపతిపుత్ర,పౌత్రు లయ్యశ్వంబుఁ § బట్టువారు
గాఁ బూని తేరులు § గడురయంబునఁ దోలి,కొని యడ్డముగ వచ్చు§కోలుతలకు
నలుగక నరుఁ డన్న § యానతి దలఁచి యా,రాజకుమారవ§ర్గంబుతోడ
ధర్మజునశ్వమే§ధంబున కపకార,మాచరించుట పాప § మదియుఁ గాక
తే. యేము మీరును బాంధవ§మెసక మెసఁగ, నడచుటొప్పదె పగ యేల§వంగ వారు
సూర్యవర్మనామకుఁ డగు§శూరతముకు, మూరుఁ డగ్రణి గాఁగ ను§దారలీల. 5
చ. కవిసిన వారితో మఱియుఁ § గవ్వడి యిట్టు లనుఁ దయాధురా
ప్రవణుఁ డజాతశత్రుఁడు తురంగమరక్షకు నంపునప్డు భూ
పపతతి నెల్లనుం దగియె § భారతయుద్ధమునందు బాలురం
దివిరి వధింపఁ గాదు కృపఁ § దిన్నఁదనం బెసఁగం జరింపుఁడీ. 6
చ. అవినయవృత్తి నశ్వమున § కడ్డము వచ్చిర యేని నీవు బాం
ధవము దలిర్పఁ బల్కి యనిఁ § దప్పఁగ ద్రోవుము కిన్క మాను మ
న్నవచనవృత్తి నా దగుమ§నంబున నెక్కొని యున్కిఁ జేసి యా
హవమున గొల్లనయ్యెదఁ బ్రియంబులు గావొకొ మీకుఁ బ్రాణముల్.
చ. వలవదు పొండనంగ సలు§వం బడ కేవున సూర్యవర్మ య
బ్బలియుసి మీఁదఁ బ్రూరిశర§పంక్తి నిగిడ్చినఁ ద్రుంచెఁ జిప్పయ
మ్ముల నది యెఱ్ఱనవ్వు తిన§మా మనుతమ్మికి లేఁత యెండ వై
[1]చెలువము చెన్ను వింటలుగఁ § జేయఁగ నావిజయుండు భూవరా. 8
వ. అట్టియెడ. 9
తే. సూర్యవర్మనితమ్ముండు § శూరవరుఁడు, కేతువర్మ గాఁడీవిపైఁ § శాతబాణ
వృష్టిఁ గురియుచు నుద్ధుర§వేగ మొప్ప, నన్నఁ గడచి బెట్టడరిన § నన్నరుండు. 10
చ. అలసి నొదుంగ జేయుటయు § నాతనితమ్ముఁడు చండవిక్రమో
ద్ధతి ధృతివర్మ నాఁ యఁ డతి§దారుణసాయకపంక్తి సత్వరా
తతిగతిఁ బర్వఁ జేయుచుఁ బృథాసుతుఁ దాఁకిన మెచ్చి వచ్చి య
య్యతిరథవర్యుఁ డప్పుడు తవంగము లేయఁగ నొల్ల కుండుటన్. 11
చ. శరములు ద్రుంప నాతఁడు వెసన్ బలునారసముల్ నిగిడ్చి న

1. చెలువముఁ జెన్ను.

న్నిరుపమునాబలిష్ఠుఁడు మగనంబునఁ గొండొకయుల్క పుట్టి య
న్నరవరసూతి పేరురముఁ గన్నన బడి తూఁపులు గ్రుచ్చె దానికిం
గెరలి యకుక్కుమారుఁడును దీవ్రశరంబులఁ జేయి నొంచినన్. 12

ఆ. ముష్టి సడలి చోద్యముగను గాండీవ మిలఁ, బడిన నా త్రిగర్తబలము దెసలు
చెలఁగ నార్చె ¹సంభ్రమించె యుంగఁగలదొ బాహు, లకుమారవర్యు నవులఁ ద్రోచి. 13

తే. ఇంద్రధనువు చందంబున నెసక మెసఁగు
గాండీవము పాటు గంటిరే చండవిక్ర
మాభిరాముండు గాండీవి యన్న పలుకు
లకు మహోగ్రత సూప నొక్కెల్లండు గాక. 14

ఉ. నిక్క పుఁగిన్క వచ్చిన నకునిన్ నొసలం గను సూపు ²వింటిపా
టక్కట రిత్త వోవునె నృపాత్మజులం దెగటార్చు నీతఁ డిం
డొక్కఁడుఁ ద్రిక్క కుండ మన యొప్పుమి నూడఁగ నేల మున్న పే
రుక్కునఁ దాఁకు టొప్పు నని యొక్కట నర్జును నాక్రమించినన్. 15

క. అట మున్న గాండివం బుత్కటరయమున నెత్తి కోపదహనుం డత్యు
ద్భటమూర్తిఁ దాల్చె నన మి, క్కుటమై కడగంటి కెంపు గొమరారంగన్. 16

వ. ఆ బీభత్సుండు. 17

క. పిడుగులు వడిఁ బెక్కొక్కటఁ, బడియెడు ననఁ దొరఁగఁ జేసె పటువిశిఖముల
ప్పుడు మేదిని దోఁపద చె, ప్పెదు కొలఁదియె రథికవరులకు పీనుఁగుఁ బెంటల్. 18

మ. ఆ యుగ్రోద్ధతి సూచి వెల్కటి త్రిగర్తానీకముల్ నల్గడం
బాయం బాఱఁ దదాప్తు లేము దగ నీ సర్వం పోవి సద్భక్తిమైఁ
జేయంగాఁ బనిగొమ్ము పెర్మిగ మముం జేకొమ్ము సమ్యగ్జయా
శ్రీయుక్తా యనినన్ ధనంజయుఁడు గారాపించెన్ వారి నెల్లం గృపన్. 19

వ. అట్లు వెనుకొనక నిలిచి యొలుంగ గత్తి వారలతో మీరిట్లు ప్రాణంబులు గాచి కొనుండు నా పంచిన పని సేయం బూని బుద్ధి గలిగి సుఖుల రై యుండుం డని పలికి యయ్యశ్వంబు ననుసరించె నది క్రమగతిం బ్రాగ్జ్యోతిషపురపరిసరంబునకుం బోయిన దాని తెఱం గాకర్ణించి. 20

సీ. భగదత్తతనయుండు బాహుగర్వంబున, బాల్యసిద్ధం బగుచాపల్యమునను
బురినిర్గమించి యశ్వతురగంబు వెంపించి, కొనిపోవఁ గాంచి యర్జునుఁడు గాండి
వము సజ్యముగఁ జేసి వాలమ్ములొక్కట, నకుమారుని మీఁదఁ బెక్కు గురియ
నవ్వజ్రదత్తుండు నొవ్వ దక్కిన దాని, నచ్చట దిగఁ ద్రావి చొచ్చె బురము

తే. సత్వరంబుగ నటు సొచ్చి సామజంబుఁ, బన్నఁగాఁ బంచి వెస నెక్కి బలము చాలు
పిలిచియును నొప్ప నన్నరుఁ దాఁకె కాత, ఘనశరంబులు వఱఁగించె నగరవేంద్ర.

1. గ. సందు సేయంగ. 2. జ. వింటిపాఁ టక్కట.

క. నడుమన వానిం బార్థుఁడు, ప్రౌఢిగా నేయంగఁ గనలి ♦ భూపకుమారుం
డడరించెఁ దోమరంబులు, గడఁ బెక్కవి మిడుతకదుపుక్రగతిఁ గవియంగన్. 22

ఆ. అనలశిఖలు వోలెఁ దయమున్మలగమి వాని, రూపు మాపి యన్నరుండు వాఁడి
లేనిదొడ్డతూఁపు లేనింటఁ దొడి రాచ, కొడుకు నేసెఁ దూలికపుడమిఁ గూల. 23

క. కూలియుఁ నీడంబోవక, బాలుఁడు రయ మార దంతిస్థైకిం జని దో
ర్లీల మెఱయ నరుఁ బటుశర,జాలంబులఁ బొదివె గగనచరు లగ్గింపన్. 24

చ. అతఁడును దీవ్రబాణముల ♦ నా భగదత్తతనూజదంతి నా
వృతముగఁ జేసె నట్లు పృథివీవరనందన యేమి సెప్పుదున్
శతమఖపుత్త్రుతోడ [1]దివసత్రయ ముగ్రరణం బొనర్చి య
ద్భుత మెసఁగం జతుర్థదినమున దెగునంతకుఁ బోరె ధీరతన్. 25

వ. [2](తెగియెడుసమయంబున). 26

ఆ. అక్కుమారుఁ జేచి ♦ యర్జున యర్జున, ఘను గలుగ నీకు ♦ నెందుఁ బోవ
వచ్చు వృద్ధుఁ డైనవాఁడు గావునఁ దండ్రి,సమసె నట్లు నన్ను[3]సమతఁ జేల.

వ. అని యదల్చి. 28

క. పెనుసెలయేఱులు వారఁగఁ, దనరుగిరియుఁ బోలె బహుమదంబుల దొరఁగం
గనుపట్టుకుంజరము సిం,హానిభుం డగుపార్థుఁ ♦ నడరం జేసెన్. 29

క. అది [4]ఫూత్కారము సేసిన, నొదవినకరశీకరముల ♦ సుర్వీవర యం
బుదముక్తసలిలధారలు, వొదివినగిరివోలె నింద్రపుత్త్రుం డొప్పెన్.

చ. కరి యిటు సేపునం గవియఁగా భగదత్తసుతుండు దీప్తని
ష్ఠురశరపంక్తి నాహవపటుత్వము సూపిన నల్పకోపసుం
దరుఁ డగుచుం నరుండు శతధారనిభం బగునారసంబు భీ
కరగతి నేయఁ గూలె నది ♦ కౌరవనాయక పర్వతాకృతిన్. 31

క. కూలిన నేలకు వచ్చిన,బాలుం గని నాకలోకపతిసుతుఁడు దయా
లోలుం డై మార్దవమ్మ్రు, ద్యాలాపము లొప్ప నిట్టు ♦ లను నాతనితోన్. 32

వ. ధర్మతనయుం డశ్వమేధదీక్షితుం డయి యత్తురంగంబుపజ్జ నన్నుం బుత్తెంచు
నప్పుడు. 33

క. చంపకుమీ రాజుల నను,కంపాతిశయంబు మెఱయఁగా నడపుము నీ
పెంపనుకుసుమమునకు నా,పం బొనరించుటయ సౌరభముగ నెఱుఁగుమీ 34

క. అనియెం గావున నీపైఁ, గినుక వాడమ దలుక విడ్డువు ♦ గీతయమం డా
జనపతియాగంబునకుం, జను దేరఁగవలయు బంధుజనములు నీవున్. 35

ఆ. అధిపతనయ నిన్ను ♦ నామంత్రితునిఁ జేసి, పోవుచున్నవాఁడ ♦ నీవు హాస్తి
పురికిఁ బావిచైత్రమునఁ బున్నమకు ముద, మొదవ నరుగుదెంచు టొప్పఁ జేయు.

1. క. చ.ట దివసద్వయ...ద్భుతి ముసి ముం. 2. ఇది పెక్కిటలేదు. 3, గ సు తె. 4, చ. ఫీంకారము.

క. అనిన నతఁ డట్లు గాక యని, వినతుం డగుటయును బ్రీతి విజయుం డభినం
దన మాచరించి యశ్వము, వెనుకఁ జనియెఁ బూరుకులపవిత్రచరిత్రా. 37

అర్జునుఁడు సింధుదేశాధీశులతోడ యుద్ధంబు సేయుట.

వ. అది సింధుదేశవర్తియగుటయు భారతరణహతు లయిన సైంధవవరూధులపుత్త్ర
పౌత్త్రులు పూర్వవైరంబు వాటించి యాటోపంబున ననేకసహస్రసంఖ్యులరథి
కులు రాజనందనులుం గూడుకొని క్రీడిపై నడచి రట్టియెడ. 38

సీ. అరుణాంబుదంబులు వరఁగి పెన్నెత్తురుఁ, గండలుఁ గురిసె మార్తాండబింబ
మసితారుణచ్ఛాయ మయ్యె నుల్కాతతు, లెల్లదిక్కులఁ బెల్లు దుల్లె నశ్వ
సహితంబుగా సవ్యసాచిఁ జుట్టును ముట్టి, యతనిపై నయోధ్యర్థవితతి యొక్క-
పెట్ట శస్త్రాస్త్రముల్ బెట్టుగాఁ గురిసిన, నప్పాండవుఁడు పెనుదప్పి సోలి

తే. నేమి సెప్పుదు నీకు నుద్దామవిక్ర
మాభిరాముండు నాఁ జనునక్కిరీటి
కరము కరము బెం డగుటయు గాండివంబు
వడియెఁ బుడమిపైఁ గురునరపతివరేణ్య. 39

చ. అనిమిషులున్ మునీశ్వరులు నప్పుడు శోకమునన్ మునింగి య
ర్జునజయకాంక్షులై నియతి శుద్ధి [1]వహించి సవీర్యమంత్రసా
ధనపరులైరి తెప్పిలె యతండు ధనుర్ధరుఁడున్ సముల్లస
త్తనువిభవోజ్జ్వలుండు సముదగ్రమనస్కుఁడు నయ్యె భూవరా. 40

వ. ఇట్లు తెలివొంది విజృంభించి. 41

శా. నారాచప్రముఖాస్త్రజాలపటువిన్యాసంబు తీవ్రత్వరా
ఘోరం బై విలసిల్లఁ జేయ సమరక్షోణీతలం బంగయుగ్
వైరివ్రాతశవావృతం బగుడు గీర్వాణుల్ మునుల్ సిద్ధుల
వ్వీరుం బ్రస్తుతి సేయుచుం బొదలి రుద్యద్వేలప్రమోదంబునన్. 42

వ. హతశేషం బైన యాసింధురాజకుమారసైన్యంబు దైన్యంబు నొంది నలుదిక్కుల
విచ్చియు నొచ్చియు వివ్వచ్చుండు రణధరణిం బొలిచి నిలుచుటఁ జూచి మాత్స
ర్యధుర్యం బై మగుడం బోరికిం బూని యడరిన నప్పురందరనందనుం డందలి
రథికముఖ్యులతోడం దమయన్న సెప్పినవాక్యంబు లుపన్యసించి మీరేల జాలిం
బడియెదరు ప్రాణంబులు మీకింతనే దయ్యనే యని పలికినను నిలువక పైపయి
వా రురవడించిన. 43

క. నవ్వుచు నానాశరముల, నవ్వీరులఁ బొలియఁ జేయు నంతయు విని తా
నవ్వగతో దుస్సల యా, కవ్వడిఁ బౌత్త్రాన్వితముగఁ గానఁగ వచ్చెన్. 44

సీ. వచ్చి కన్నీళ్లు వదనంబుపై నెల్లి, గొన రోదనంబు సేసిన నతండు

---

1. గ. వహించిన వీర్యమంత్ర.

దయ నిలనిడియెఁ గోదండ మప్పు డతుల, పౌత్త్రునిఁ జూపి యిబ్బాలుఁ గావు
మితఁడు మీ యల్లునిసుతుఁ డన్న నప్పార్థుఁ, డిప్పుడు నా యల్లుఁ । డెచట నున్న
వాఁ డని యడిగిన । వనిత వెక్కుచు నతం, డాత్మజుఁ డనకుఁ దుర్గ్రాహవమున

తే. ననఘునిచేతఁ జెగుట దా । విని నితాంత, శోకమగ్నుఁడై యుండి నీరాక బిట్టు
విసుట జెగిలి ప్రాణముల్ । విడిచె ననుచు, నెలుఁగు గడలుకొనంగఁ [1]బెల్లేడ్చె నధిప.

వ. అప్పుడు శోకాక్రాంతుం డయి గాండీవి వదనంబు వాంచి యుండ నయ్యాగ్మలి యతని నుద్దేశించి. 46

సీ. ధార్తరాష్ట్రులకీడు । దలఁపక సైంధవు గొలఁగాము లెల్లను । మఱచి తండ్రి
లేనియీశిశువుపై । మానితం బైననీ, యక్కటికంపుఁజూ । పడరఁ జేయు
మాశ్రితవత్సల । యనుచు నబ్బాలునిఁ, జరణానతునిఁ జేసి । శరణు శరణు
కృప నన్ను రక్షింపు । కీర్తియు ధర్మంబుఁ, జేకొను మనవుడుఁ । జిత్త [2]మడల

తే. రాచకోల మిదిగాల్పనేరకార్యమూల, మని తలంచుచు నాతఁడయ్యతివతోడ
నధమవృత్తిసుయోధను । డంతకంటె, నేమిఁ గొలఁగాము మాచేత నింతపుట్టె.

క. అనుపలుకు వలికి బహుసాంత్వనముల నూరార్చి యాసుదతిమస్తకముం
దనయక్కునఁ జేర్చి యబల, చనుము వగవు దక్కి యని ప్రసాదభరితుఁడై. 48

వ. వీడ్కొలిపిన దుస్సల దనమనమునం దమబలంబులం గొని ప్రియంబునం జనియె నయ్యనిమిషపతిసుతుండును క్రతువిషయంబు లయి వలయు ననుష్ఠానంబులు విధివంతంబులుగాఁ జలుపుచుఁ దురంగంబు వెనుకం దారా మృగానుసారి యయిన పినాకపాణియుం బోలెఁ బోవు చుండ నదియును నిజేచ్ఛ నఖిలదేశంబుల సుఖసంచారంబునం బవరిలుచుఁ గ్రమంబున [2]మణిపూరపురంబునుపాంతంబున కరిగిన నన్నగరంబుపతి యైనబభ్రువాహనుండు నిజజనకుండయిన యర్జునురాక యాకర్ణించి. 49

ఆ. వినయమెసఁగ నార్యజనసమేతంబుగా, నరుగుదెంచి యతనిచరణములకుఁ
బ్రీతి నెఱఁగ నక్కి । రీటి యన్నరపతి, నాదరింప కుండె । మేదినీశ. 50

వ. అట్లుండి తనయునాదరంబునకుం గారణం బెఱుంగక సవిచారుండై యూరకున్న యక్కుమారునితో ధనంజయుం డిట్లనియె. 51

ఉ. యాగవిముక్తమై చనుహయంబున కడ్డము వచ్చి పట్టి కా
కిగతి మెత్తఁబాటు దగఁ । నే నృపధర్మవిహీనత రణో
ద్యోగము లేక తక్క భయ । ముల్లముఁ జేరఁగ నిచ్చు రాజరా
జే గుణహీన పొమ్మనిన । నేమియుఁ బల్క కతండు గ్రమ్మఱన్. 52

సీ. అరిగి పట్టణవీథి । నల్లన చనుచుండ, నర్జునుం డతనితో । నాడినట్టి

---

1. క. ర. న. బెట్టేడ్చె. 2 ఉ. మరిలి. మరియు 3. మూలమునను తెనుఁగునను 'మణలూరపుర' మనియును 'మణిపూరపుర' మనియును రెండుపాఠము లున్నవి.

తెలియఁ గల్గఁ దన దగుదివ్యబోధంబునఁ, గని భుజంగోత్తమసుతనయ సదయ
వృత్తిఁ బాతాళంబు వెలువడి యన్నరా, ధిపునిపాలికిఁ జనుదెంచి యేను
మీతల్లి నాగేంద్రసూతి నులూపి నా, పేరు హితంబు సెప్పెదు వినుమ

తే. నరుగుదెంచితి వినుము మీయయ్యయాపనుపు
దలఁకొనుము రాజులకు నర్హ ధర్మమైన
యని యొనర్పుము దనతోడఁ జెనఁగు టధిక
సమ్మదము సేయు నక్కురుసత్తమునకు. 53

క. అనిన సభక్తికముగ న,వ్వనితకుఁ బ్రణమిల్లి యాహవము జనకునితోఁ
జనునె యొనర్పఁగ నని యు,వ్వునికిఁ జొరక వచ్చితిని శుభప్రదమూర్తీ. 54

క. నీ వింత దెలిపి పలికితి, వా విభుఁడును మున్న నన్ను ననుమతిఁ జేసెం
గావునఁ దల్లీ మీకుం, గావించెద నిద్దఱకు నఖండప్రియమున్. 55

బభ్రువాహనుం డర్జునునితో యుద్ధంబు సేయుట.

చ. అని నిజమందిరంబునకు నయ్యలనాగఁ దగంగఁ బుచ్చి య
మ్మనుజవరుండు సాధనసమంచితమైనరథంబు హాత్తరే
ఖ నెఱయ నెక్కి యర్హపరికల్పితభూషణలేపనాంబరం
బును సమరోత్సవోద్ధతవిభూతియు నైతన మేనెలర్పఁగన్. 56

ఆ. ఎక్కి హంసకేతు వేత్తెఱఁ గ్రాలంగ, నరిగి యశ్వమునకు నడ్డపడఁగఁ
జూచి మెచ్చి సవ్యసాచి మార్కొనుటయుఁ, గురిసె నతఁడు నిశితశరచయంబు.

శా. వానిం దా నవలీలఁబోఁ దునిమి దుర్వారోద్యముం డద్రిభి
త్సూనుం డోర్కొలనాత్మసూనునొడలం దూఁపుల్ సిగిడ్చెం బదా
ఖానిర్భంకుఁడు బాహుసారమద మేపాఱంగ నవ్వీరు మే
నే నారాచము లైదునాలుగులు పృథ్వీనాథ నాటించినన్. 58

చ. మదిఁ గొనియాడి యారిపువిమర్దనుఁ డంచసిడంబు ద్రుంచి యే
పొదవఁగ మేను నొంప నచలోద్ధతి నాతనిజత్రు వేసె బె
ట్టిద మగునారసంబునఁ గడిందిమగం డగు బభ్రువాహనుం
డది వడిపేర్మి శోణితజలార్ద్రిత నొందక యుచ్చి పోయినన్. 59

క. అమ్మేటిమగఁడు దనచాప మ్మూఁతగ నిల్చి సోలి పడపడి తెలి వు
ల్లమ్మున నొలసిన నౌరా,యిమ్మడి యని పొగడెఁ గొడుకు నెంతయుఁ బ్రీతిన్.

తే. పొగడి యేఁ దీవ్రశరములు నిగుడఁజేయు
సుద్ధతికి మంచిబంటవై శౌర్య వలయుఁ
జూమ్మ రా యని పలికి వాక్యలమ్ము లధిక
రయము మెఱయంగ బరఁగించె రాజముఖ్య. 61

ఆ. మొనసి వాని నతఁడు ముత్తునియలు గాఁగఁ, జేయ మత్సరంబు చిత్తవృత్తిఁ

వనికి సత్వరముగఁ § దద్గాత్రమున నించె, నరుఁడు పెక్కు మెఱుఁగుటనారసములు.

ఉ. దానికి నీడఁబోవక యుదగ్రపరాక్రమ మొప్పవజ్రకీ
లానిభతీక్ష్ణ మెఱుంగులవిశలాసము నింగి వెలుంగ నుద్భటుం
డై నిగిడించెఁ బార్థుహృదయస్థలి నారస మస్త్రశస్త్రవి
ద్యానిపుణత్వశాలి యగునన్నరపాలసుతుండు భూవరా. 63

—❀ అర్జునుఁడు బభ్రువాహనునిశరంబుచేతఁ బుడమిం ద్రెళ్ళుట. ❀—

క. వడి నది వీపున వెడలినఁ, బడియెఁ బుడమి నర్జునుండు § పడపడి త్రెళ్ళెం
గొడుకును మున్నతఁ డేసిన, వెడిదపుటేటులయలంతఁ § బృథ్వీనాథా. 64

వ. అట్లు దనపతియును సుతుండును భండనంబునం బడుట విని శోకాక్రాంత యగు
చుఁ జిత్రాంగద యులూపియుం దోడన చనుదేర నచ్చటికి వచ్చె నట్లు వచ్చి
యచ్చెలువయయ్యగుపురంగనుంగొనియుల్లంబుజల్లనఁదల్లడిల్ల మూర్ఛమునింగి
మేదినిం బడి కొంతవడికిం దెలిసి యులూపి నాలోకించి. 65

సీ. నీకతంబునఁ బతి § సొకుమారుసిచేత, ననిఁబడి యున్నవాఁ § డతివ కంటె
నీవు పతివ్రత § గావె ధర్మజ్ఞవు, గానిదానవె యేమికారణమున
నిది కార్యముగఁ జెప్పి § తీపిన్నవానికిఁ, గొడుకుదిక్కున నాకు § నడలు లేదు
వరుఁ జూచి పోక్కెద § వామాక్షి నీదెసఁ, దప్పు సేసినను నీకతనఁ గృపార్ద్ర

తే. చిత్తవై యెల్లభంగి సంజీవితుఁడుగఁ, జేయువమ్మ యక్కట నాథు నేయఁబనిచి
నావు సూచియు వగవవు § సాహసమున, కొలఁదిలేదు నిన్నేమందు § గులవరేణ్యా. 66

వ. అని పలికి పార్థుం జేరం బోయి. 67

ఆ. మహితకీర్తిలోల § మత్ప్రాణవల్లభ, యన్యజనుల ప్రాణ § మరసి కావఁ
జాలునట్టినీకు § నేల ప్రాణంబుల, నిట్లు వదలి పోవ § నిచ్చియుండ. 68

సీ. నాథ నీ వెప్పుడు § నన్ను మన్నింతువు, కను విచ్చి చూడక § యునికి దగునె
హాయమున కెవ్వరు § నడ్డంబు రాకుండ, [1]నాఁగిలి వగ్రజు § నధ్వరంబు
దమ్మయి పోకుండ § లెమ్మిత్తురంగంబు, వెనుకొన వలవదే § యనఘ నీకు
నని యార్తిఁ బలవించి § యహిపుత్రి దెసఁ జూచి, సుతుఁడెట్టులుండినఁ § బతికి నిమ్ము

తే. జీవ మాండ్రురఁ జెక్కండ్రఁ § జేసికొనుట
పురుషులకుఁ దప్పె భార్యల § త్తెరువునందు
[2]నడవరే యోర్చి నీదుమనమున నింత
యొజఁగి కలిగింపు వరు వేయు § నేల తల్లి. 69

వ. అని యంత నిలువక. 70

ఆ. కొడుకుచేతఁ జచ్చి § పడి యున్న యిక్కుడు, కులవరేణ్యఁ గరుణ § గూరి నీవు
బ్రదుకఁ జేయకున్న § బ్రాయోపవేశన, మాచరింతు నహిసుతలాగ్రగణ్యా. 71

---

1. వ. నాఁగి నిమ్మగ్రజునధ్వరంబు. 2 గ. నడతురే.

వ. అని పలికి పతిచరణంబులు శిరంబుసోఁకం బ్రణమిల్లి యాసీనయై యూరకుండె నట్టియెడ బభ్రువాహనుండు తెప్పిఱి లేచి యప్పొలంతిం జూచి. 72

ఉ. ఇంచుకయేనియుం గనక యెన్నఁడుఁ బొందనితల్లి నేఁడు నా
మంచితనంబునం బిలుకుమాలిననాథుని నుగ్రశత్రులన్
మంచు నినుండువోలెఁ బరిమార్చుమహాబలుఁ జూచి యిట్లు దుః
ఖించుచు నుండఁ జూచితి సహించినచిత్తమున కెంత పెద్దయే. 73

క. గాదిలితనయుండ నగునే, గా దన కిరుకుఱుకు లాగ్రగణ్యుని నిమ్మై
మేదినిఁ గూల్చితి మణికిరణోదాత్తం బైనమకుట మూర్వం బొందన్. 74

వ. అని విలాపంబు సేసి వివ్వచ్చుతోడం గూడ యజ్ఞతురంగానుసారులై వచ్చిన యాజ్ఞవల్క్యశిష్యప్రభృతిబ్రాహ్మణజనంబులు నయనపథప్రాప్తు లగుటయు. 75

సీ. అధ్వరహయమువిషయంబుగా నీ రేమి, పని సేయువారొకో పార్థుఁ డిట్లు
వడిఁ జన్నవాఁ డని పలవింప జనకుని, నిట్లు సేసినపాపుఁ డెవ్విధమున
నాచరించునొకో ప్రాయశ్చిత్తమని పలుక, పండ్రెండువర్షముల్ భైక్షవృత్తి
నిమ్మహాత్మునికపాలమ్మున నడపంగ, వలయుఁ గా కొం డెద్ది గలుగ నేర్చు

ఆ. సని యులూపిదిక్కు గనుఁగొని నీవు పన్నంగఁ దండ్రి నట్లు భండనమున
విగతజీవితుఁడుగఁ దెగఁ జేసితివి నింక, నెలమిఁ బొందు భరతకులపవిత్ర. 76

వ. అని వెండియు. 77

క. జనకునిఁ దెగటార్చినపాపునకుం బ్రాణంబులతోడి[1] పొత్తు మనంగా
మనమునఁ దాలిమి గలుగునె, చనుఁ గాక యతండు సనినసద్గతిక తగన్. 78

వ. అని యగ్గలించి స్థావరంబులు జంగమంబులు నగుభూతంబులు విన భుజంగపుత్త్రియు నాకర్ణింపఁ జెప్పి [2]వ్రతంబు సమ్మంబూనెద మా తండ్రి లేకునికి నిజం బగునేని బ్రాహ్మణోపవేశంబ యుత్తమకృత్యంబు వీరవధంబు పాపం బంతకంటెను రాజవధం బెక్కుడంతకంటెఁ గడు నగ్గలంబు ధార్మికవధంబు జనకవధపాతకం బింతయని కొలంది యిడ రా దిట్లుండ వీఁడును రాజును ధార్మికుండును జనకుండు నైన యిమ్మహాత్ముని వధియించినమహాపాతకుని కేతద్వ్రతానుష్ఠానంబు దక్క నొండుమెయి నిష్కృతి గల్గునే దీని నడపెద నని పలికి యప్పరమనియతుం డుపస్పర్శనం బాచరించి పలుకు లుడిగి కూర్చుండె నప్పుడు. 79

ఉలూపి సంజీవనమణిచేత నర్జునుం బ్రతికించుట.

ఆ. అట్లు దెంపు సేసి యాసీనుఁడైన యయ్యాతల్లిఁ గొడుకు నవనిఁ ద్రెళ్ళి యున్న
విజయుఁ జూచి పాఁపకన్నెలఁది సంజీవన, మణిఁ దలంచెఁ గురుసమాజముఖ్య. 80

వ. తలంచిన భుజంగమంబులకుం బరాయణం బైనయమ్మణి యమ్మహాభాగహస్త

1. 'పొత్తున మనఁగా' అని కొన్ని ప్రతులు. 2. గ; వ్రతం బనుష్ఠింపం.

తలంబునకు వచ్చిన నాథామిని బభ్రువాహనునాననం బాలోకించి. ౮౧

సీ. విజయుండు సచ్చునే వేఁడుబులార యింద్రునిచేత నైన నీకతనికి నొక్క-
ప్రియము సేయుంగఁ గోరియునునీకొలఁదియా, రయుబుద్ధినీతండుకరణ మెయినర్పఁ
దలఁచిన రవ్వీరుకతలఁవు సిద్ధింపంగఁ, జేయుటయును నింత సేయ వలసె
నాకుఁ గావున మోహాకనం బగుమాయాప్రయోగంబు నడపితి ననుజ్వాలాత్మ

తే. నరుఁడు నారాయణుండు మహాస్త్రతరము సుస్వామిలతని తేజమెవ్వరికిఁ దెలియనట్లు జూని
నార్పవచ్చుమీవగ పెల్లఁ దీర్ప నిపుడ, యుత్థితుం డగునీకౌరవోత్తముండు. ౮౨

వ. మాయాప్రయోగంబ వేఱొండు గాదు నీకు మీతండ్రితోడ భండనంబు సేయ
బుద్ధి పుట్టించితి నింతమాత్ర మని తత్ప్రదేశంబున నున్నయెల్ల జనంబులు నుల్లం
బున నానందంబు నొందఁ బలికి యమ్మణిపూరపురపతికరతలంబున నమ్మణి యిడి
దీని నిమ్మహాత్ముని హృదయదేశంబున మోపు మనవుడు నతం డట్ల చేయుటయుం
బార్థుండు ప్రత్యుజ్జీవితుం డై. ౮౩

తే. లేచి కూర్చుండి కలయుంగఁ జూచి యెట్టి
సెరలకాంతియు దంతెరుకదియును బెరయ
నతిమనోహరముగఁ దనకసుతునితోడ
మనుజనాయక కుశలమే యనుడు నతఁడు.

సీ. వినయ మూరంగ నాకతని చరణంబుల, కెఱఁగి భవత్పుణ్యాకవీక్షణమున
నఖిలంబుఁ గుశలంబ యసిన నిజ్జనముల, మొగములయుం దెల్ల వగవు దోఁచి
యుచ్చెరువాటును హర్షంబుఁ గదిరెడు, నిది యేమి సెప్పవే యెఱుఁగు జేని
నాచెప్పినట్ల రణంబున కేతెంచి, తీవు చిత్రాంగద యేల వచ్చె

ఆ. నిచ్చటికి నులూపి [1]యేమిటి కిపుడు స
న్దించె ననుడు భక్తినిర్భరముగ
నతఁడు సాఁగి మ్రొక్కి హస్తముల్ మోగిచి య
య్యహితనూజుఁ జూపి యతనితోడ. ౮౫

వ. అంతియు నిమ్మహానుభావ నడుగుం డనిన గాండీవి యాయింతివదనం బాలో
కించి కురువంశనిసారకా నిరాతకుం గారణం బేమి యిమ్మణిపూరపురనాథుని
దెస నావలన భవదీయచిత్తంబు ప్రసన్నం బయి యున్నయదియె యిన్నరపతి
యును నేనును జిత్రాంగదయును నీకేమియు నపరాధంబు సేయము గదా
యనుటయును. ౮౬

ఉలూపి యర్జునునితో వసువుల శాప ప్రసాదంబుల నెఱింగించుట.

సీ. అల్లన నవ్వుచు నయ్యింతి యతనితో, నాథ నీయుం దౌకనాఁడు నెగ్గు
గలదె నాపుత్త్రునివలనఁ గీ డొక్కఁడి, యది విసి తాత్మ చిత్రాంగదయును

---

1. గ. యేటికిఁ జను దెంచె, ననుడు నచల భ క్తివినయగతుల.

గినియుక విను మేను ॥ వినతోత్తమాంగనై, చెప్పెద నీసుతునిచేత నీకు
నాచపిల్లైన నశుభ ॥ మాహవంబున నీవు, గంగాతనూజు శిఖండినెపము
తే. గాఁగఁ జెగటార్చి తదిపాతకంబు దాని, కనఘ నిష్కృతి సేయకుండినను విడిచి
తేని నరకవాసమునకుఁ బోవ వలయుఁ, గాన నిష్కృతి సేసితిఁ గడఁగి వచ్చి. 87

వ. అది యెట్లంటేని నాకర్ణింపు మే నొక్కనాఁడు సభసమేతంబుగా సురనదీ స్నానంబునకు వచ్చియుండ వసువు లక్కడ కేతెంచి యింత నంత నొక్క రేవునం దోఁచి కృతస్నానులై నిజరూపంబున సన్నిహితయైన గంగాదేవితోడ గాండీవధరుండు శిఖండిం బురస్కరించుకొని గాంగేయుం జేయ కుండం బరమ సాయకంబుల నతనిం గూల్చె నట్లు కుత్సితజయార్జనం బొనర్చిన యయ్యర్జును నేము శాపసంతాపితుం జేయుదు మని చెప్పిన నప్పరమానుభావయు దాని కొడంబడినపలుకు పలికె నంతయు విని తత్క్షణంబ. 88

సీ. అరిగి రేఁ దండ్రికి ॥ నత్తెఱం గంతయు, నెఱిఁగించుటయు నతఁ డెసక మెసఁగ
భయమున రయమునఁ ॥ బఱతెంచి వసువులఁ, బెక్కువిధంబులఁ ॥ బ్రియము పుట్ట
బలిచి ప్రార్థించిన ॥ నలుక నో విడిచి పా, రతనితో విను సమయం బొకండు
సేసెద మనిలోన ॥ వాసవిఁ దత్పుత్త్రుఁ, డగు బభ్రువాహనుం ॥ డస్త్రవితతిఁ
ఆ. బఱపి కూల్చెనేని ॥ శాపము వక్కల్చిమ, మనిన మగిడి వచ్చి ॥ యాభుజంగ
నాథుఁ డెల్లఁ జెప్పె ॥ నాకు నిప్పని దగ, నిట్లు దీర్చితిని సమిద్ధ తేజ. 89

వ. తీర్చిన తెఱంగు నెఱింగించెద నని పలికి బభ్రువాహను నుపలక్షించి యిక్కుమారుఁడు వోవు సమరంబు సేయ నొల్లక నీకు నమస్కరించి మరలి మందిరమునకుం బోవు చున్కి బుద్ధింగని సమయకార్యంబునకు నిది యవసరం బని యూహించి రయంబున నితనికడకు వచ్చి రణంబు మీతండ్రికిఁ బ్రియంబును ధర్మంబు నని చెప్పి యితనిం బోరికిం బురికొల్పి యిప్పరునియందు వసువులు సెప్పినవిధంబు గలుగునట్లుగా విక్రమవిశేషం బావహించితి. 90

క. అనినఁ బ్రియ మంది దేవీ, యనఘుం బగునీచరిత్ర ॥ మస్మత్కులవ
ర్ధనకారి యగుట యొప్పెడు, గనినది గాదె యని పలికె ॥ గాండీవి నృపా. 91

ఆ. పలికి సాదరముగ ॥ బభ్రువాహనుఁ జూచి, మానితాగమవ్యయమాన చైత్ర
మాసపౌర్ణమాసి ॥ మహితాశ్వమేధకాలంబు దాని దెసఁ దగలంపు గలిగి. 92

క. నీవును దల్లులు బంధుజనావళియుం బరిజనములు ॥ హాస్తినగరికిన్
రావలయు ధర్మజునిసం,భావనముం బడయ టొసఁగుఁ బరమశుభంబున్. 93

ఉ. అనవుడు నట్లసేసెద నుదాత్తచరిత్ర పురంబు సొచ్చి యి
వ్వనితలు నీవు నావలని వత్సలతం గొనియాడు చిరోద్యద
మన మలరంగ నిల్చి జనసమాన్యునిఁ గా ననుఁ జేసి ప్రీతి ని
ననుపగ వచ్చి చేయు మనుయానము యజ్ఞతురంగరక్షకై. 94

వ. అనుచుం బ్రణతుండై బభ్రువాహనుండు ప్రార్థించినం బార్థుం డప్పార్థివులతో
నేను దీక్షితుండ నగుట యెఱుంగవే నాకుం బురప్రవేశంబు సేయం జనదు
పోయి వచ్చెద మీరును సుఖుల రయి యుండుం డనిన నట్ల కాక యని యతం
డుచితప్రకారంబునం బూజించి యామంత్రణంబు సేయ నబ్భామలచేత నను
జ్ఞాతుం డై యమ్మహాత్ముండు యజ్ఞాశ్వంబు ననుసరించె నదియును నిజేచ్ఛ నఖిల
దేశంబులం బ్రవర్తిల్లె నట్టియెడ. 95

క. రాజగృహపురముకడ న,వ్వాజి యరుగు టెఱిఁగి యాహవమునకుఁ బిలిచెన్
రాజత్కీర్తిధనుం డగు,నా జిష్ణుని మేఘసంధి యనురా జధిపా. 96

వ. అట్లు లప్పురంబుపతి యగుజరాసంధపౌత్త్రుండు బాల్యంబునం దన్ను నెదిరి నెఱుం
గమిం గవ్వడిం గయ్యంబునకుం బిలిచి వుచ్చి తోడన కల్పితరథారూఢుం డై
వెడలి యవ్వాసవికి నడ్డపడి. 97

సీ. వనితలలోపలఁ జనియెదు చాడ్పున, నివ్వాజిఁ గొని యించుక యేని శంక
లేక పోయెదవు పోనీక యేఁ బట్టెద, దీని గయ్యము సేసి కాదేనిఁ జేయు
మనుడు నవ్వుచు నతం డమ్మగధేశుతో, విఘ్నకర్తల నేను వెరవుతోడ
మాన్పింతు వినుము నా యమనమునఁ గినుక లే, దది యెట్లు లనిన మాయగ్రజుండు
తే. [1]సామమునన కర్జము నీవు సక్కఁబెట్టి,కొందుగాని యెవ్వరియెడఁ గ్రూరవృత్తి
వలన దని నాకుఁ జెప్పిన వాఁడు గాన, యట్లు నేయుడు నీయిష్టమాచరింపు.

—✿ అర్జునుఁడు జరాసంధపౌత్త్రునితో యుద్ధంబు సేసి యోడించుట. ✿—

చ. అనవుడు నేమియుం బలుక కా నృపపుత్త్రుఁడు నిర్జరేంద్రపు
త్త్రునిపయి నుజ్జ్వలంబు లగుశాతపుంఖముల్ వఱఁగింప వాని నె
ల్ల నతఁడు శాతభల్లతతులం దునుమాడియు నొల్లఁడయ్యెఁ ద
త్తను వొకబాణ మేనియును దాఁకఁగ నేయ నరేశ్వరోత్తమా. 99

వ. అగ్గాండీవికృప యే మని చెప్పుదు. 100

క. తనమీఁద మగధుఁ డేయఁగ, జననాయక రథ్యములను సారథి నైనన్
గొనకొని నొప్పింపక యు,ల్లన శరనికరంబు పైఁ గవలయు నిగిడించెన్. 101

క. అది బలహీనతగాఁ గొని, మద మేపారంగ నక్కుమారుఁడు లీలం
గదిసి బలునారసంబులు, తదంగమున గ్రుచ్చె నతఁడు దాన నలిగియున్. 102

వ. ఆ సహదేవుపుత్త్రుగాత్రంబు దాఁక కుండునట్లుగా శరంబుఁ నిగిడించి. 103

ఉ. సారథిఁ గూల్చి యశ్వములఁ జంపి రథంబుఁ బగిల్చి కేతువుం
జీరి శరాసనంబుఁ బొడి చేసిన నమ్మగధుండు ధీరతో
దారగతిన్ సముజ్జ్వలగదాభ్రమణంబున బాహు వొప్ప న
వ్వీరవరేణ్యుపైఁ గవిసె విక్రమ మాకృతి దాల్చి వచ్చె నాన్. 104

1. క. చ. జ. ‘సామమునఁ గర్జమున నీవు’.

వ. అట్లు గవియుటయు. 105

తే. అప్పుడును మత్సరంబున ◊ గతఁడు భాజ
నంబు గాకుండెఁ గాన యన్నరుఁడు వెడఁద
వాఁడియమ్ముల గద పలుకవ్రయ్య లై మ
హీతలంబునఁ దొరఁగంగ ◊ జేసె నధిప. 106

వ. అ ట్లేసిన. 107

సీ. నివ్వెఱపడిన యాకృపనందనునితోడ, నయ్యతిబలుఁడు మాఱాయన్నయొకని
ప్రాణంబునకును దప్పకు మయ్య యని [1] యానతిచ్చినకతన నే ◊ నేయ కున్న
నీ వింతవడి పోర ◊ నిలువఁ జాలితి విను, మది యట్టు లుండె రాజార్హ మైన
ధర్మంబు వాటించి ◊ కాఁకితి నన్నునిం,తియ చాలు నింక శాంతియ నరేంద్ర
తే. తగినయది యని పల్కె-నతండు నిజము, నట్ల కా కని యూహించి ◊ యమ్మహాత్ము
పాదపరిసరమున భక్తిఁ ◊ బ్రణతుఁ డైన,గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి యక్కురువిభుండు.

వ. వచ్చుచైత్రమాసంబునం బున్నమనాఁడు పాండవాగ్రజు నశ్వమేధం బనుసంధిం
చుటకై బంధులు నీవును రావలయు ననిన నవ్వసుమతీపతి యట్ల చేసెద నని
యత్యంతవినయంబున నవ్విజయుం బ్రియపూర్వకంబుగాఁ బూజించి యామంత్రి
తుం జేసిన నాతండు ప్రీతుం డయి యభినందించి యమ్మగధపతిం బురంబునకుం
బోవం బనిచి యశ్వరత్నంబు ననుసరించె నదియును వంగపుండ్ర మ్లేచ్ఛదేశం
బులం జరియింప నయ్యైరాజులు సెనకినం దేజోధనుం డగునాధనంజయుండు
జయించుచుం జన నత్తురంగంబు. 109

సీ. చేదిదేశంబు సొచ్చిన శిశుపాలుని, తనయుండు శరభుండు ◊ దనదుశుక్తి
పురము వెల్వడి యుద్ధపూర్వకంబుగఁ జేరి, యమ్మహావీరున ◊ కర్చ లిచ్చె
నతని వీడ్కొలిపి యత్యతులతేజుఁడు ఘోట,కము వెన్కఁ జనుచుఁ డెంకణకిరాత
ముఖదేశనృపతులు ◊ ముట్టినఁ దగ గెల్చి, గొనుచుఁ గ్రమంబునఁ గోసలులను
ఆ. గాసిలను జయించెఁ ◊ గ్రమ్మఱి యత్తురం,గము దశార్ణదేశగామి యయ్యె
జిష్ణుఁ డనుసరింపఁ ◊ జిత్రాంగదుం డని, సేసి యోడి పూజ ◊ సేసె నధిప. 110

వ. ఇట్లు దశార్ణపతి పార్థునిం బూజించి యాతనియాదరణంబు వడసి పోయె నదంపడి
తురంగంబు నిషాదాధీశదేశంబునకుం జనిన నేకలవ్యనందనుండు పాకశాసననందను
మీఁద నైషాదసేనాసమేతుం డై తోఁతెంచిన. 111

చ. అతనిబలంబుఁ గ్రూరవిశిఖార్చుల నేర్చిన బాహుసారగ
ర్వితుఁ డగు నన్నిషాదపతి ◊ వీఁక నెదుర్కొనినం గిరీటి యా
తతపటుబాణదీధితులఁ ◊ దన్మదసంతమసం బడంచె వాఁ
డతివినయంబునన్ వినతుఁ ◊ డై తగ నర్చితుఁ జేసె నాతనిన్. 112

1. గ. యప్పగించినకతన నేఁ ◊ గినియకున్న.

వ. అట్లు కలవ్యానందనుం దనవశంబు సేసికొని ధనంజయుండు హయంబు ననుగమించి నది మరలి మఱియును దక్షిణాభిముఖం బయి చని తిరుగఁ బౌండ్రాంధ్రద్రవిళ కేరళకర్ణాట దేశాధీశుల ననాయాసంబున వశగతులం గావించికొని యక్రమంబున సౌరాష్ట్రంబు సొచ్చి గోకర్ణసమీపంబునం బ్రవర్తించి పదంపడి. 113

సీ. ద్వారకానగరంబుఁ జేరువ ఘోటక, మరుగంగఁ బ్రీతులై యదుకుమారు
లాలపుటాలంబుఁ జనువున నయ్యింద్ర,నందనుఁ గని పూజనం బొనర్ప
నభినందనము సేసి యవ్వీరుఁ డపరాబ్ధి,తీరదేశంబులఁ దిరిగి పంచ
నదముపైఁ జని [1]మాపు నరనాథ గాంధార, దేశంబు సొచ్చి వర్తింప శకుని

తే. నందనుండు బాల్యకలితదుర్ణయము పేర్మిఁ
దనదుసేనలఁ గూర్చి యుద్దామగతిఁ గి
రీటిఁ దాఁకిన నతఁడు వారించి పాండ
వాగ్రజుని యాజ్ఞ దెలుపంగ నంతఁ బోక. 114

క. పొదివినఁ గనుఁగవ వెడలెం, బొదవఁగఁ జతురంగముల శరోత్కరములఁ దాఁ
బొదివె విజయుఁ డవి వడియుం, జెదరియు సన్నంబులైనఁ జిత్తములోనన్. 115

ఉ. మత్సర మెక్కఁగా సుబలుమన్మఁడు దుర్దమలీలఁ గిట్టి బీ
భత్సునిపై నిశాతశరపంక్తి నిగుడ్పఁ దదీయబాహుసం
పత్సముదీర్ణతం దనదుభావమునం గొనియాడి యెంతయు
వత్సలుఁడై నయస్ఫురుఁడు వానికి నిట్లనుఁ గౌరవోత్తమా. 117

క. రాజులఁ జంపకు మని మా, రాజానతి యిచ్చె నుద్ధురత నేనవిన
యోజ విడిచినఁ గెలిచినఁ బ,రాజితుఁగా నన్ను నధ్వరాపతి దలఁచున్. 117

అర్జునుఁడు గాంధారదేశాధీశుతో యుద్ధంబు సేసి జయించుట.

ఉ. కావున నేఁ గడంగ విను కయ్యము నీ కిది యేల తమ్ముఁడా
నావినియుం బడక్ శకునినందనుఁ డయ్యమరేంద్రనందనుం
దా విశిఖంబులం బొడిచెఁ దానికి [2]నవ్వుచు వానిశీర్షకం
బా విజయుండు బల్వెడఁ ద్రుంచె నమ్మెన సేను బడంగ సేసినన్. 118

వ. అచ్చిత్రము సూచి యచ్చోటం గలయట్టి. 119

క. ఎల్లజనుల సిగ్గెఱుఁగ, డొల్లఁడు గా కుత్తమాంగ ముర్వి నిటుల వే
డొల్లఁగ సేయుటె పలుసిన, జెల్లం బోయితని కరుణ చెలువిట్లున్నే. 120

వ. అనుచు సంగ్రామాగ్రంబు జేరి యతనితేరు మరల్చికొని పోవం బోవ. 121

తే. సురభిమానము పెంపు నశ్వరవరుండు
[illegible] పనిచిన ముగ్ధ కైరలి చనిన

1. జ. మాన్య నరనాథ. 2. జ. నవ్వుచు తచ్ఛిరస్త్రకం.

బలము గ్రమ్మతి యయ్యెం డ్రుపట్టి జుట్టు
బలసి శస్త్రాస్త్రచయములు పరఁగఁ జేయ. 122

చ. అవి నిశితాస్త్రపంక్తిఁ దునుకమూఁడి రయంబు సెసఁగంగఁ గప్పె నా
హవతల మంతయుం దలర నప్పటువిక్రమశాలి యన్మహో
గ్రవిహారణంబునం గలఁగి కన్కనిఁ జూచె బలంబు లక్కుమా
రవరునిఁ గాచికొంటకు ధరారాజవర మంత్రులు వానితల్లి యున్. 123

వ. అర్ఘ్యంబు గొని రయంబున శరణు శరణు చని వచ్చిన సవ్యసాచ్యుండును నవ్వ
లంది నభినందించి మంత్రులకు మాననీయవచనంబులం బ్రియంబొనర్చి [1]యబ్బాలు
నితో సాంత్వనస్వరంబున నిట్లనియె. 124

ఉ. నీ వీటు వన్ని నాపయి సననిద్యపరాక్రమ రాశి నూరిది ము
ద్భావము ఖేద మొందుటయు ధర్మజుపంపిది రాదు కోటి నే
నేవిధినైనఁ జంప నని యెల్లజనంబు వినంగఁ జెప్పనే
కావున నీబలంబులన కాని నినుం దెగటార్ప కుంకితిన్. 125

వ. విశేషించి గాంధారీధృతరాష్ట్రులం దలంచి నాకు నీదెస నిట్లు గా వలసియుండె.

ఆ. అట్టు లగుటఁ జేసి యవనీశనందన, యింత ప్రొద్దుఁ బోరి యింక శాంతిఁ
బొందు టొప్పు ధర్మపుత్త్రునితోడిపొం, దొప్పదయ్యె నీకు నుదితశౌర్య. 127

వ. అని చెప్పి యాగామి యగు నచైత్రంబు పున్నమనాఁడన్న రేంద్రచంద్రు నశ్వమే
ధయాగంబున కనురాగంబె సంగ రమ్మా యనియును బలికి యప్పాండవమధ్య
ముండు మేధ్యాశ్వంబు ననుసరింప నది కరిపురంబుదిక్కు మొగంబు యుగం
బొచ్చె నట్టిమొడ నతండు వివిధదేశంబులం దిరిగిన తెఱంగెల్ల నుంజాయులచేత విని
యజాతశత్రుం డప్పురుహూతపుత్త్రుం డశ్వరక్షణం బట్లు ధర్మప్రకారంబున
నిర్వహించుటకుం బ్రీతి వహించె నద్దివసంబు. 128

ఆ. మాఘమాసపౌర్ణమాసి యైయుండె నా, ధర్మనందనుండు ప్రేమ వెలయ
నెలమి మిగులఁ బెద్దకొలువున నుండి తమ్ముల సగౌరవముగఁ బిలువఁ బనిచి. 129

వ. అనిలనందనునాననం బాలోకించి. 130

క. నీతమ్ముఁడు తురగముఁ గొని, యే తెంచుట వింటె చైత్ర మింకఁ దడవు లే
దీతఱి మునులను నృపసంఘాతంబును బిలువఁ బంపఁగా వలయుఁ దగన్. 131

వ. యాగశాలయు శిల్పిజనులం గొని కల్పింపుము తగువారలకు విడియం దగిమొకు
వివిధగృహంబుల నొనరింపు మని పనిచిన నతండు. 132

ఆ. యజ్ఞవాటమును జనాధిపులకు మునివ్రాతములకు విడియ వలయునట్టి
మందిరములుఁ గనకమణిమయంబులు గాఁ బొనర్చెఁ దన్నుఁ బనుపు బొగడ.

1. గ. యబ్బాలుని సాంత్వవచనంబుల.

ధరణీసురులను బనిచెను, ధర నెందును దిరిగి మునుల ధాత్రీశుల న
ధ్వరమునకుఁ బిలువుఁ డని యమ్మరుత్సుతుఁడు వారుఁ జని సమంచితభక్తిన్.

చ. పిలిచిన రాజులున్ మునులుఁ బ్రీతి యెలర్ప బలోత్కరంబు శి
ష్యులుఁ దమతోడ రా మనము లువ్విళు లూరఁగ యజ్ఞవర్తనం
బులు గనుఁగొంటకై సకలభూవలయంబునఁ గల్గునట్టివా
రలు సనుదెంచినం గురుధరాపతి చిత్తము వేడ్కఁ బూనఁగన్. 135

క. ఎదురుకొని వీడుఁబట్లకు, ముదమారఁగ దాన యనిచి మొక్కలములు నిం
పొదవించునట్టివియుఁ గాఁ, బదార్థములు[1] ప్రజ దలమునఁ బాటించితగన్. 136

క. భోజనశయనాసనములు, రాజిల్లెడునట్టు గాఁగ రాజుల కెల్లం
దేజోధనుఁ డాధర్మత,నూజుం డిడఁ బనుచెఁ జనవినుతసుచరిత్రా. 137

చ. మునులకు నెల్లఁ గందములు మూలములున్ ఫలకోట్లు నుం బ్రియం
బొనరఁగఁ దాన పోయ మధురోక్తులతోడ సమర్పణంబు సే
య నిటుల సంవిధానము లనూనము లై విలసిల్లఁ జేయు న
య్యనిమిషనాథవైభవుఁ డహంకృతివర్జనసంస్తుతంబుగన్. 138

తే. యజ్ఞవాటంబుఁ దక్కటియాలయములు
లలితభంగి రమ్యములు సలక్షణములుఁ
గా నొనర్చినశిల్పినికాయమునకుఁ
బసదనం బిచ్చె సంతసం బెసక మెసఁగ. 139

సీ. పాండవాగ్రజుఁ డట్లు పవననందను బంచి, యజ్ఞశాలాకరణాదు లైన
కృత్యముల్ నడపుటఁ గృష్ణుండు గనుఁగొని, కడుఁబ్రీతిఁ బొందెనాగతనృపాలు
రచ్చెరు వొందిరయ్యమృతాంశువంశని,స్తారకుం డర్థిమైఁ జేర బనుప
ననవద్యపశువుల నఖిలజాతులవాసిఁ, గొని వచ్చి రత్యంతకుశలపరిజ

ఆ. నంబు లన్నపర్వతంబులు నాద్యవా,హినులుఁ గల్గి విప్రజనపరంప
రలు భుజించు పెర్మియొలసి యాగారంభ,సమయమద్భుతప్రకాశక మయ్యె. 140

క. విను లక్షభూసురులు గుడి,చిన నొకమఱి మ్రోయుభేరి సెలఁగుచు నుండున్
జననాయక యెప్పుడు నే, మని చెప్పుదు నశ్వమేధయజ్ఞవిభూతిన్. 141

చ. శరధిపరీతభూమిఁ గలసర్వజనంబును దోఁచె నమ్మహా
ధ్వరమున భూపతుల్ మకుటపంక్తులు భూషణరాజిఁ జక్కఁగాఁ
బొరిఁబొరిఁ ద్రోచికొంచు మదిఁ బొంపిరి వోయెడు వేడుకం బనుల్
వెరవులు లావులున్ మెఱయ వేయువిధంబులఁ జేయు టొప్పఁగన్. 142

సీ. కలయంగ రాజులఁ గనుగొని ధర్మనం,దనుఁడు భీమునిఁ బిల్చి మనుజపతుల
కెల్లను వే పూజ లిమ్మన్న నమ్మరు,త్తనయుండు దగఁ దనసమ్మదోయ

---

1. అ. పసదనములు.

నెలవిఁ గూర్చుకొని మహీశుల సబహుమానంబుగఁ బూజించె ‖ నలిననాభుఁ
డప్పుడ సీరిసాత్యకిముఖయాదవ,సహితంబు గాఁగఁ బ్రసన్నవదన

తే. కమల మొప్పంగఁ బాండవాగ్రజునికడకు
వచ్చుడును బ్రియ మలర న‖వ్వసుమతీశుఁ
డా బలుఁడును నతఁడును ‖ నాదిగా స
మస్తయాదవులకు నర్థి ‖ కౌఁగి లిచ్చె. 143

వ. నారాయణుండు నరుసిం బ్రసంగించి పాండవాగ్రజుమొగంబు గనుంగొని ద్వారవతినుండి యాప్తుండును విచక్షణుండును నగువాఁ డొక్కరుండు వచ్చె నివ్వచ్చుం డప్పురంబుపరిసరంబునఁ బోవం జూచితి ననియె వివిధసంగరంబులం దదంగంబు కృశింప జై యున్నయది యనియుం జెప్పె నప్పార్థుండు సేమమున నరుగుదెంచెం గాలోచితక్రియాకలాపంబునకుం దొడంగు మనవుడు నప్పుడమిఱేఁ డప్పురుషోత్తమునితోడ. 144

క. నీపంపునఁ బోవుట నుదీపితబలశౌర్య‖ధైర్యతేజోయుతుఁడై
యా పార్థుఁడు యాగక్షేమాపేక్షుం డయ్యె నడపు ‖ ముదితంపుఁబనుల్. 145

కృష్ణుఁడు ధర్మజునితో నర్జునసందేశంబు సెప్పుట.

వ. అనిన నవ్వారిజనాభుఁడు ద్వారకనుండి వచ్చినవాఁ డగ్గాండీవి దనతోడం జెప్పె నని చెప్పినమాటల తెఱం గాకర్ణింపుము. 146

ఆ. నాదువిన్నపముగ ‖ నరనాథునకు విన్న,వింపు రాజు లెల్ల ‖ వేడ్కతోడ
జన్నమునకు వచ్చు‖చున్నారు మున్నిట్టి,వారలైనఁ బూజ‖వలయు ననుము. 147

వ. విశేషించి మదీయపుత్త్రుండు. 148

క. మణిపూరపురాధీశుఁడు, గుణగణవిభ్రాజితుండు ‖ గురుహితుఁడు విచ
క్షణపరుఁడు బభ్రువాహనుఁ, డణుమాత్రముఁ గీడు లేని‖యట్టిం డెమ్మన్. 149

క. మీచరణసరసిజంబులు, సూచుటకై రాఁ దనకు ‖ సువ్రతముగ మున్
వేచి యునికి వచ్చుఁ గృపా,గోచర మగుచేఁతకుం ద‖గును మీ కనుమీ. 150

వ. అని చెప్పె ననిన విని యవ్వాక్యంబు లభినందించి ధర్మనందనుండు గోవిందునితోడ. 151

సీ. ఏ వింటి విద్యఁ జూడ దనేక యుద్ధంబుల, నలజడి పడుట యు‖ల్లతఁడు నాఁడు
నక్కట ద్రోణభీష్మాదులతోడయె,క్కుడుఁబోర నిమ్మలఁ ‖ బడియె నేఁడు
నిత్తెఱంగునఁ బడి‖యెను నాకుఁగా నన్ని,పాటులు పడె ని‖య్యప్పరమసౌఖ్య
యోగ్యదేహుండు ని‖న్నొక్కటి నడిగెద, నతని మేను సులక్ష‖ణాన్వితంబు

తే. నామదికి నెక్కు నిప్పు గ‖న్నాఁపి కన్న, నుట్టికేని లేదె మొదలు ‖ తెలుపు మనవు
వముల నెం దేఁ గలిగనే ‖ యమితమహిమ, భాగ్యమునఁ బడకు మూలమె‖ పద్మనాభ.

క. తెలుపఁ దగునేనిఁ గరుణం, దెలుపుము నా కనుడు వాసు‖దేవుఁడు నిటుం

దెలుపుటయుఁ గృత్యమే విను, తెలిపెదఁ గలమాత్ర వసుమతీశవరముఖ్యా. 153

తే. సర్వగాత్రంబులందును ♦ సవ్యసాచి
కధికశుభలక్షణంబుల ♦ యతిశయిల్లుఁ
దనువుమాత్రకు నించుక ♦ ధరణినాథ
మెక్కుడై యుండుఁ జిఱుదొడ ♦ లిదియ కొఱఁత. 154

క. అలఁదిఱ్ఱు దీనివలనం, గలిగెడునో కాని తక్కు ♦ గలుగ దరిష్టం
బలఘుశుభలక్షణాన్విత, విలసితతనుఁడైన గాండివికి నెయ్యెడలన్. 155

వ. అట్లున్నరూపు సెప్పినవెన్నునివచనంబులు విని యవ్వసుంధరావల్లభుం డతని యాననం బాలోకించి యది యట్ల కాక యని పలికె నప్పుడు పాంచాలి పద్మనాభుం బ్రీతిస్ఫీతం బగుచూడ్కి నాలోకించిన నాలోకనాథుం డది యర్జునవిషయం[1]బైన ప్రణీతంబు తెఱం గనుట యెఱింగికొనియె నట్టియెడ భీమాదులును యాదవకుమారులును నక్కిరీటిగుణంబు లగ్గించుచు నాప్రొద్దున కదియు గోష్ఠిగ సలాపంబు సేయుచుండ నగ్గాండీవిపాలనుండి కాలరి సనుదెంచి. 156

సీ. పాండవాగ్రజునకుఁ ♦ బ్రణతి యొనర్చి వివ్వచ్చుఁ డిప్పురి సేర ♦ వచ్చె నెల్లి
వచ్చు మీ శ్రీపాద ♦ వనజంబులకు మ్రొక్క, ననవుడు హర్షాశ్రు ♦ లడరఁ బులకి
తాంగుఁడై వానికి ♦ నన్నరేంద్రుఁడు పసదన మాభరణవస్త్ర ♦ కనకములు స
మగ్రంబుగా నిచ్చె ♦ నందఱు నానందరసమునఁ దేలి యాక్షరాత్రి పార్థుఁ

ఆ. జూచువేడ్క నూను ♦ చును వేగు టెప్పుడో
యనుచు నుండ నుదయ ♦ మయ్యె నినుఁడు
క్రీడిసమయవిహితకృత్యముల్ సలిపి హ
యంబు మున్న గాఁగ ♦ నరుగుదెంచె. 157

వ. అప్పుడు. 158

అర్జునుఁడు యజ్ఞాశ్వంబుతోడ హస్తిపురంబునకువచ్చుట.

క. విను మింద్రతురగసమఖే, లనమున నవ్వాజి జనముకలకు నెల్లను లో
చనపర్వ మయ్యె వారివ, దనముల సంతోషమధురతరభాషణముల్. 159

సీ. కలయంగ నిట్లని ♦ చెలఁగె నిగ్గాండీవి, దక్క నిమ్మాడ్కి నొండొక్కరునకు
నశ్వంబు దనయిచ్చ ♦ నఖిలదేశములకు, నరుగంగ ధరణీశు ♦ లచట నచట
బలములతో వచ్చి ♦ బలసి తదీయరోధం బాచరింపఁ దృణంబు గాఁగఁ
గొని లీల మెయిగెల్పు ♦ గొనుచుఁ బోల్ల నుగ్రతి, వాటింప కగ్రజు ♦ పలుక మెట్టి

తే. దశల నైనను బాటించి ♦ తా నొకండ, నమితలం పెప్పు నుల్లంబు ♦ నందు లేక
తనువు గవుసెనబెట్టి పుచ్చినవిధమున, [2]నరుగుదేవచ్చునే యిది ♦ యక్కజంబు.

క. సగరాదులఁ జెప్ప విని మె, మగఁటిమియును బలము నిట్లు ♦ మాను మథంగి

---

1. గ. బైనప్రణామంబు తెఱం. 2. చ. నరుగుదెంచు టె యిది గదు ♦ నక్క

నెగడునె యింకను ఖట్టరు, జగతిని[1] గాండీవితోడ । సరివచ్చుమగల్. 161

క. మానుషము దైవమును సరి, నే నే నని కార్యసిద్ధి । నెలయింపఁగ ని
త్యానందుఁ డయ్యె ధర్మజుఁ, డీ నిర్మలభాగ్యమహిమ । యెవరికిఁ గలదే. 162

క. విను మట్లు సెలంగఁగ ఘూర్ణన మొందినయర్ణవం బక్రనగఁ బొంగారెఁ 162
జననికురుంబం బాపెం, పనఘా చూడఁడ వినఁ బడయు । మఖిలజగములన్. 163

వ. మఱియును. 164

సీ. నృపు లోహటింప జంక్రత్రపుమీనునేసి చే,కొనియెఁ బాంచాలునిశ్రమాఁతునితఁడె
సురసేనతోఁ బురంధరుఁ గెల్చి భుజగర్వ, మే పాఱ ఖాండవం । బేర్చె నితఁడె
యొక్కటిబవరాన । నీశాను మెప్పించి, పాశుపతాస్త్రంబుఁ । బడసె నితఁడె
యొంటిపై భీష్మాదిశరజాధుల కురుపతి,ధృతిఁ బాపి గోవులఁ ।[2] దెచ్చె నితఁడె

తే. ప్రతిన నేసి విషమసమరమునఁ బ్రొద్దు
గ్రుంక నీ కాఁగి సైంధవుఁ । గూల్చె నితఁడె
యనుచు సందడిగాఁ గ్రమ్మి । యఱ్ఱు లెత్తి
చూచె జనలోక మాసవ్యసాచిఁ బ్రీతి. 165

క. ఆ వాక్యము లెల్ల వినుచు, భావ మలర నర్జునుండు । భాసుర మగున
మ్మామ వగ్రేసరముగ యజ్ఞావాసంబునకు వచ్చె । నంచితలీలన్. 166

వ. అట్టియెడ ధర్మనందనుండును భీమాదులును గృష్ణుండును బలదేవ ప్రభృతులును ధృతరాష్ట్రుం బురస్కరించికొనుచు నప్పార్థు నెదుర్కొని రతండు వారల నెల్ల సముచితాచారసం ప్రీతులం గావించి గాంధారిని గుంతినిం గాంచి యాఁతకాఁడు తీరంబు గనినచందంబు నొంది యుండ దఱు నభినందించుచుం బొదివికొని యొండ నొక్కరమ్య ప్రదేశంబున నుండె నాసమయంబున. 167

సీ. బభ్రువాహనుఁడు వైభవ మొప్పఁ జిత్రాంగ
దయు నులూపియుఁ బ్రమదంబుతోడఁ
దోడ రా ధర్మపుత్త్రునిమందిరమునకు
నరుగుదెంచుటయు నక్కురువరేణ్యుఁ
డును దమ్ములును గృష్ణుఁడును బలభద్రాది
యాదవులును బ్రీతు । లై తదీయ
సందర్శనము నర్హసత్కారచరితార్థ
ముగఁ జేసి రతఁడును । దగినవిధుల

తే. నందఱకుఁ బ్రియ మొనరించి । యాంబికేయు
నతనిభార్యను గని నమస్కృతు లొనర్చి
గొంతిఁ గాంచి యా యమయమగులకు నెఱఁగి

1. క. సరివచ్చుమగలు ♦ [illegible]. 2. గ. తెచ్చె.

[1]పలుదెఱఁగుదీవనలును గౌఁగిలియుఁ బడసి. 168

వ. ధర్మపుత్త్రుం గొలిచి కూర్చుండ నతని కతండును ననుజులును వేర్వేఱ సర్వరత్న రాజివిరాజితంబు లగుభూషణంబులును బరమాంబరంబులును నొసంగిరి సీరపాణి శౌరి ప్రభృతులు ప్రభూతాభరణంబులను భాసురవాసోవిశేషంబులను వలని నర్పించి రయ్యవసరంబున. 169

సీ. చిత్రాంగదయు నాగపుత్త్రియుఁ దొలితొలి, గాంధారికిని గొంతికిఁ గాంచి రెలమి
దీవించి గాఢసంభావనఁ గౌఁగిటఁ, జేర్చె నద్దేవి రత్నార్చు లెసఁగు
తొడవుల నర్పించె ద్రోవదియును సుభ, ద్రయు వారుఁ దమ్ము చిత్ర ప్రకార
మునఁ గన్న నమ్మయి వినుతపూజనముల, నతులసమ్మోదము నావహించి

ఆ. యోగ్యపీఠములను నునిచి తత్సల్లాప, సౌఖ్య మొంది రట్లు సకలభర్త
నముల నశ్వమేధసముపక్రమం బుదా, త్తాభిరామ మయ్యె నధిపముఖ్య. 170

వ. పదంపడి యర్హ్వాదివసంబు సంప్రాప్తం బగుటయు సాత్యవతేయమునిపతి కురుపతి పాలికిం జనుదెంచి నేఁడు యజనంబునకుం దొడంగుము యాజ్ఞికులు శుభముహూర్తం బాసన్నం బయ్యె ననుచున్నవారు నీమఖంబు మహనీయంబు నీవు మహాధనవంతుండ వైతి దక్షిణలు ముమ్మడుంగులుగా నిడి మూఁడుమఖంబుల ఫలంబు నొందు మశ్వమేధావభృథంబు పరమపావనంబు సమస్తదురితపరిహారణ నిపుణంబు నీకు భారతరణకృతజ్ఞాతివధంబు పాతకం బనుమెరమెర మానంబునం గలిగియుండు నట్టివి యెల్లను దీన నిస్తుషంబు లగు సమస్తశుభంబులు నావహిల్లు నని యాజ్ఞాపనంబు సేయుటయుఁ బ్రాజ్ఞప్రవరుం డైనయా భూవరుండు. 171

ధర్మరా జశ్వమేధయాగంబు సుప్రయోగంబుగాఁ జేయుట.

క. ప్రయతుం డై హయమేధ, క్రియాకలాపంబునకుఁ బ్రకీర్త్యముగాఁ జొ
చ్చి యుదాత్తభంగి జనమే, జయభూవర నడపె గాఢసంప్రీతి మెయిన్. 172

క. క్రమయుక్తయు యుక్తముఁగా, నమరగురుప్రతిము లైనయాజ్ఞికులు క్రియా
సముదయము నడపఁగా స్ఖలి, తము లేక ఘుహుతము సారకతత్క్రతువొప్పెన్.

చ. అవహితులై ప్రవర్గ్యము బ్రథాభినుతంబుగఁ జేసి ఋత్విజుల్
సవనము లుక్తమార్గము ప్రశంసకు నెక్క నయించి వేదవా
క్యవిహితవృత్తిమై నభినవాభ్యుదయం బొనరించి రర్థి మా
ధవుఁ గొనియాటలం దమకృతంబులకున్ మెఱుఁగిడ్డయట్లుగన్. 174

వ. అట్టియెడ. 175

సీ. [2]వివిధభోజ్యపదార్థవిభవంబువలసను, సంతృప్తిఁ బొందక చనునరుండు
ధనధాన్యవస్త్రసంతతిలబ్ధి దారిద్ర్య, మపనయింపక యేఁగునట్టివాఁడు
గోరి యెయ్యది సేయఁ గాంచక మొసఁగంగఁ, బడయక రిత్తవోయెడుమనుష్యుఁ

1. గ. పలుదెఱఁగుదీవనయును 2. గ. సారాన్నముల మనోహారిపానములను.

జెద్దియేనియుం దుఃఖ మొలసినం జనుదెంచి, యది నిస్తరింపక యరుగునతం
తే. మండునకు[1] వెదకినను లేఁడండ మొండ, నరసి కుడువుఁడు కట్టుఁ డిచ్చానురూప
వస్తువులు గైకొనుఁడు దురవస్థ దెలిపి, పాపికొనుఁ డని భీముండు పలుకు చునికి.
ఉ. ఆయతులాధ్వరంబున ప్రతాభిరతత్వము లేనివాఁ డుపా
ధ్యాయుఁడు గానివాఁడు నిగమాంగకవృత్కము లేనివాఁడు లేఁ
డేయెడఁ జూచినన్ సభ నరేశ్వర యట్టి సదస్యు లమ్మరు
న్నాయకుకొల్వు దివ్యమునినాథులు దక్కఁగఁ గల్గ రెచ్చటన్. 177
వ. అట్లుం గాక. 178
సీ. కనుఁగొను కౌతుకంబునఁ గూడి చనుదెంచి, దివ్యమునీంద్రు లతి ప్రియమున
నభినందనము సేయ నఖిలగంధర్వులు, నానందనము లగు గానములను
నప్సరఃస్త్రీలు హృద్యము లైన నృత్యవి, శేషంబులను నుల్లసిల్లు చుండ
సిద్ధవిప్రజనంబు సేసలు సల్లుచు, బహువిధాశీర్వాదపరతఁ బరఁగ
తే. నాద్యులై పేరు గలుగు పౌదార్య రవని
వరులయాగంబులకు సరివచ్చు మిగులుఁ
గానిగ యిది వ్రతువడ దనఁగా వెలుంగు
ధర్మతనయుని యశ్వమేధము నరేంద్ర. 1[illegible]
చ. పసిఁడియిట్టికలం జతుశ్చిత్యంబు నష్టాదశకరాత్మకంబు గరుడాకృతియును గా
యజనం బొనర్చి మహనీయుం బై యొప్పుచుండు యూపక్రియాసమయంబున
ఖాదిరంబు లాఱును బైల్వంబు లాఱును బాలాశంబు లాఱును దేవదారు
మయంబులు రెండును శ్లేష్మాతకతరుకల్పితం బొకండును గా నిరువదియొక్క
యూపంబులును దక్కను శోభనార్థంబుగా ననేక కాంచనయూపసంచయంబును
శాస్త్రోక్తప్రకారంబున యాజకులు నిలిపి వానియందు, 1[illegible]
క. నలుగాలివానిఁ బశుల, జలచరముల విధియుతముగ సంయోజింపం
బొలిచెం బశువులు మున్నూ, అలఘుయశోమహిత యమ్మహాయజనమునన్. 18[illegible]
క. నరయూపసుయోజిత మగు, తురంగమము పుట్టుఁ బశుతతుల నిల్పిన సుం
దరభావము దత్ మఖ, స్ఫురణం బిట్టి దని చూపుపోలిక మెఱసెన్. 1[illegible]
తే. ఆగమోక్తంబు దర్శనీయంబు నైన, యాసుతంత్రంబు నొనరించు యాజకోత్త
మావలికిఁ దా నలంకారమై పరాశ, రాత్మజునిశిష్యకోటి యొప్పారెనధిప 18[illegible]

—ధర్మరాజు వ్యాసునకు యజ్ఞదక్షిణగాఁ దనరాజ్యం బంతయు నిచ్చుట.—

వ. సవ్రపమ[2] శ్రవణంబు లాచరించి ఋత్విజనంబు లశ్వాలంభనసమయంబు
యాజ్ఞసేని సన్నిహితం జేసి యశ్వంబునవయవంబులమాంసంబు లమ్మైదేవ
లకు నాహుతు లిడునప్పు డమ్మహాదేవి నిజహస్తంబునం జేయం దగియె

1. క. వెదకిన లేఁడు నంద. 2. గ. విశసనంబు లాచరించి.

హుతంబులు సేయించిరి తదనంతరంబ యశ్వవపాహోమంబునం బరఁగు
గంధం బాఘ్రాణించి ధర్మనందనుండు దమ్ములుం దానును బరమానందంబునం
బొందె శేషించిన యశ్వావయవంబు లర్థప్రకారంబున యాజకులు వేల్చి రిట్లు
సాశ్వవతేయుండు యుధిష్ఠిరునశ్వమేధం బఖిలలోకహితంబుగా నిర్వహించి
యాతనిఁ గుఱించి యుదాత్తనాదం బెసంగ నాశీర్వాదంబు సేసె సమస్తదేవ
మునులును దీవన లిచ్చి రప్పుడు కౌరవవంశపావనుం డగు భూవరుండు. 184

తే. అలఘుభక్తిసదన్నుల• కెలమి మెసక, మెసఁగఁ గోటివేల్ నిష్కము•లిచ్చి తనను
వసుధయంతియు నొసఁగె ది•వ్యప్రబోధ,ఘనత నొప్పు వేదవ్యాస•మునివరునకు.

క. విను ఋత్విగాధ్యుఁ డగు న,మ్మునిపతి యట్లు కురువంశ•ముఖ్యుఁ డొసఁగ మే
దిని సంప్రమోదమునఁ గై, కొని యిట్లను నానరేంద్ర•కుంజరుతోడన్. 186

ఆ. జగతి ఋత్విగర్థ•ముగ నిచ్చితేము వి, ప్రస్వభావకలనఁ • బసిఁడిఁ గొనఁగఁ
గోరెదము కరంబు•గారవంబున బ్రాహ్మణాభిలషితదాయి • వగుట మేలు. 187

వ. అని వెండియు. 188

క. ఇలకు వెలగా హిరణ్యం, బలఘుమతీ మాకు నొసఁగు • మనుటయు ధరణీ
శులు వినఁగా సప్వారవ,కులపతి యావేదరత్న•కున కిట్లనియెన్. 189

ఆ. అశ్వమేధమునకు • నార్యులు దక్షిణ, ధరణి యండ్రు గాన • నరునిచేత
విజితమైన ధరణి • ప్రజనితప్రీతిమై, ఋత్విగర్పనముగ • నిచ్చినాడ. 190

వ. అని మఱియును. 191

చ. వనమున కేఁగి యుండు సు•ఖవాసత నుండఁగలాఁడఁ గాక యే
ననఘవిచార బ్రహ్మధన • మక్కట కొందునె యన్నఁ బ్రీతిమై
ననుజులు యాజ్ఞసేనియును • నట్టిద యాపని యొండు సెప్ప కుం
డనుటయు హర్షబాష్పపుల•కాంకురముల్ ధరియించి రందఱున్. 192

వ. అప్పుడు. 193

తే॥ దివ్యవాణి కీర్తించెఁ గౌ•రవ్యవరుని
నఖిలజనములుఁ బ్రస్తుతి•ముఖరు లైరి
తానుఁ బొగడె వేదవ్యాసుఁ • డానరేంద్ర
చంద్రునకు నిట్టు లను విప్ర • చయము వినఁగ. 194

క॥ ఏ మమ్మెద మునినఁ బృథివి, యో మనుజాధీశ కొనుట • యొప్పదు తెరు విం
దేమియును నెగ్గు లే దీ, భూమిసుపలకోర్కి దీర్చి • పుచ్చుము ప్రీతిన్. 195

క. అని పలికినఁ గృష్ణుం డి, మ్మునినాయకు వనుపు సే•యుము నరేశ్వర నీ
వని చెప్పిన నొడఁబడి తన, యనుజులతో నట్ల కాక • యని యతఁ డర్థిన్. 196

కోటికోటులు మాడలు • గుప్పవోసి, ధరణివెల యని చెప్పి య•వ్వరమునిందు
మావతికి సమర్పించె•నతఁడు ఋత్వి,గావలికి బంచిపెట్టె బ•య్యాతులధనము 197

వ. మఱియును. 198

తే. అతులకనకమయము లైన ♦ యజ్ఞవాట, వేదికాయూపతోరణ ♦ వివిధభాండ
దండకలశయ్యాసనాదుల ♦ ధరణినాథుఁ, డొసఁగె విప్రచయంబుల ♦ కుల్లసిలఁగ. 199

తే. అట్లు విప్రుల కిచ్చి య ♦ నంతరంబ
రాజులకు వైశ్యులకు శూద్ర ♦ రాజి కన్య
జాతులకు మ్లేచ్ఛులకును బ్ర ♦ భూతధనము
ద్రవ్వి తండంబు లిచ్చె నా ♦ ధరణివిభుఁడు. 200

క. ఇమ్మెయి సకలజనులు హ, ర్షమ్మునఁ బరితృప్తులై య ♦ త్యుందమ్మగు మో
దమ్మునఁ దేలుచు నిజవా, సమ్ములకుం జని రజాత ♦ శత్రుఁ బొగడుచున్. 201

క. రెండవమరుత్తుఁ డై య, ప్పాండవముఖ్యుండు సేయు ♦ వరమఖవితరణం
బొం డొకరుఁడుఁ గల్గునె యె, న్నండును జూడ విన స ♦ జ్జనస్తుతచరితా. 202

క. తన యంశమైన కనకము, విను కుంతీదేవి కిచ్చె ♦ వేదవ్యాసుం
డనఘా యది యంతయు న, ద్వినుతచరిత ధర్మకృతుల ♦ వినియోగించెన్. 203

తే. సకలబాంధవభూపతి ♦ సంయుతముగ, నానరేశ్వరుఁ డవభృథ ♦ స్నానపూత
గాత్రుఁడై చిత్తగతసర్వ ♦ కల్మషములఁ, బాచి నిర్జితస్వర్గత్వ ♦ భాసి యయ్యె. 204

వ. అట్లొప్పి యవ్వసుమతీశుఁడు పరాశరనందను చరణారవిందంబులు దన వెడంద నొసలు సోఁక జాఁగి మ్రొక్కి యక్కులపతిం బెక్కుభంగులం బ్రస్తుతించి యామంత్రితుం జేసిన నా మునిశ్రేష్ఠుండు శిష్యసంఘసహితంబుగా నంతర్ధానంబు సేసె నట్టియెడ. 205

— ♦ ధర్మజుఁడు యజ్ఞంబులకు వచ్చిన రాజుల నెల్ల సత్కరించి పంపుట ♦ —

క. అనుజులు నఖిలనృపాలురుఁ, దనుఁ బరివేష్టింప నొప్పె ♦ దారకలలోనం
బెనుపొందు చంద్రుగతి న, మ్మనుజాధీశ్వరుఁడు కురుకు ♦ మార ప్రవరా. 206

తే. క్రతువుఁ జూడ నేతెంచిన ♦ రాజవరుల, కండఱకు మణిభూషణ ♦ హస్తివాజి
వారకాంతాచయముల న ♦ వ్వసుమతీశుఁ, డొసఁగె ధనదుని కైవడి ♦ నొసఁగ మొసఁగ.

ఆ. బభ్రువాహనునకుఁ ♦ బరమవిశేషంబు, మెఱయ గారవించి ♦ మేలివస్త్ర
కోటు లొసఁగి ప్రీతి ♦ గూరిన మనముతో, నతనిఁ దత్పురమున ♦ కరుగ బనిచె.

క. చిత్రాంగదయు నులూపియు, వృత్రారితనూజుపాల ♦ విభవసహిత లై
గోత్రావర నిలువఁగ న, ద్ధాత్రీశుఁడు సనిచె సమ్మ ♦ దం బెలరారన్. 209

తే. మున్న చనుదెంచి ప్రీతిమై ♦ నున్నయట్టి
దుశ్శలకుఁ బెంపు గలుగఁ ద ♦ త్పుత్త్రిపుత్త్రు
సింధుదేశంబునకు నభి ♦ షిక్తుఁ జేసె
దోహలమున నజాత ♦ శత్రుఁడు నరేంద్ర. 210

క. తమతమ దేశంబుల భూ,రమణుల నెల్లను విభక్త • రాజ్యులఁగా [1]నె
య్యము నెఱయ నిలిపెఁ బాండు,కుమారమణి పెద్దకొడుకు • కౌరవముఖ్యా. 211

వ. ఇట్లయ్యాగంబున నెల్ల రాజులయుల్లంబులు ప్రమదంబునం బొందం జేసి వీడుకొలిపి కృష్ణునకు నత్యుత్తమవస్తువిస్తారమహోదారంబగు నుపహారం బిచ్చి దేవోపచారంబుల నారాధించి కృతార్థత్వంబు నొంది యుప్పార్థివోత్తముండు బలభద్రునకు భక్తియుక్తంబును వివిధరత్నవిరాజితంబును నగు పూజావిశేషంబునం బరమసంతోషం బావహించి సాత్యకిప్రభృతి యాదవలోకంబున కతిలోకంబులగు నానావివిధపదార్థంబు లొసంగి యయ్యందఱుం దనచేత నుచితప్రకారంబుల నామంత్రితులై ద్వారకానగరంబున కరుగం దాను మఱియు ననేక దేశాగతులైన జనంబుల నన్నపానంబులం గనకవస్త్రాదిదానంబుల ననురక్తులం గావించి మహారావంబున దిశలఁ బిక్కటిల్లం జెలంగు మంగళతూర్యంబులు మొరయం బుణ్యపాఠకరవంబులు నానందనగానంబులు వినుచు మందిరంబునకుఁ జనుదెంచె నని చెప్పిన వైశంపాయనునకు జనమేజయుం డిట్లనియె. 212

ఆ. అనఘ మత్పితామ • హుని యశ్వమేధయా,గంబు సమయమునఁ గరంబు విస్మ
యంబుఁ జేయఁజాలు • నట్టిది యే మేనిఁ, గలిగెనేని వినఁగ • వలతుఁ జెపుమ. 213

వ. అని యడిగిన యమ్మహీనాయకునకు వైశంపాయనుం డిట్లనియె. 214

క. అమ్మెయిఁ బ్రభూతధనలా,భమ్మున భూమిఁ గలయట్టి • బ్రాహ్మణు లెల్లన్
సమ్మద మొందఁగ హయమే,ధ మ్ముజ్జ్వలభంగి నొప్పె • దత్సుతయమునన్. 215

తే. అఖిలజనములు నచ్చెరు • వంద ధర్మ,నందనుని మానసమున నా • నంద మొలయ
నతనిపై మకరందధా • రాభిశోభి, కుసుమవర్షంబు వెల్లుగఁ • గురిసె నధిప. 216

వ. అట్టియెడ. 217

—• సక్తుప్రస్థచరిత్రంబు నకులంబు బ్రాహ్మణునకుం జెప్పుట. •—

సీ. ఒక్కబిలంబుననుండి వెల్వడి • యొక్కనకులంబు విప్రజ • నంబునడుమ
నిలిచి సక్తుప్రస్థ • నలఘుధర్మంబు నే,మియుఁ బోల దీయశ్వ • మేధ మనిన
నవ్విప్రు లతివిస్మ • యం బంది యమ్ముంగిఁ, గనుఁగొని మంత్రవ • ర్తనముఁ దంత్ర
గమనికయును వివి • ధములైన దానవి,ధులు బహుళత్యాగ • ములును లోక

తే. సంస్తుతము లయ్యెఁ భక్తియుఁ • శ్రద్ధయును బ్రి
యంబు వినయంబు సురముని • హర్ష మావ
హిల్లఁ జేసె నీ వేమిట • నిమ్మహాధ్వ
రంబుఁ గీడంటి చెప్పుము • ప్రస్ఫుటముగ. 218

వ. అనుటయు న న్నకులంబు వారి కిట్లనియె. 219

సీ. వినుఁడు ధర్మక్షేత్ర • మన రూఢమైన కు

---

1. క. నె,య్యమున నిలిపెఁ బాండుక్ష్మా,రమణుని పెద్దకొడుకు కురురాజ ప్రవరా.

కురుక్షేత్రమునయందు • రోసకాము
విహితుం డొక మహా•ద్విజుఁ డుంఛవృత్తిమై
నుండు భార్యయుఁ దన•యుండు నతని
పత్నియు సహచర•భావంబు నొంది వ
ర్తింతు రట్టులు తప•శ్శ్రీ వెలుంగ
మున్నెడఁ [1]బులువంట • లన్నియు నర్వాంత
వికలంబు గా ననా•వృష్టిదోష

తే. మూనహల్లిన నతని శా•హార మొనరఁ
జేసికొనుట దుర్ఘటమయి • చెల్లు చుండఁ
దారు నలువురుఁ జని తృణ•ధాన్య మల్ప
మేఱి కొని వత్తు రాఁకలి • దీఱ కుంచు. 220

వ. అట్టి యెడ నొక్కనాఁ డయ్యందఱును రేపు దొడంగి పడమటిజామునకు వెదకి తెచ్చినపూరికొలుచు ప్రస్థమాత్రంబు సక్తు వయ్యెం గర్తవ్యానుష్ఠానంబులు నడపి యనంతరంబ యా కుంచెఁడు పేలపిండియుఁ జెఱి మానెండు (నలువురును సమంబుగాఁ) బంచికొని యుపయోగించువారై యున్న సమయంబున. 221

— • యముఁడు సక్తుప్రస్థునికడ కతిథి యై వచ్చుట • —

తే. అతిథియొక్క ధరామరుం • డరుగుదెంచెఁ
గని ప్రియంబున వా రెదు•ర్కొని సభక్తి
కనుగఁ బర్ణశాలాభ్యంత•రమున కతనిఁ
దోడికొనిపోయి యాసన•స్థుఁడుగఁ జేసి. 222

చ. అడుగులు గడ్గి ప్రీతి మెస• లారఁగ దద్దయు నెమ్మిఁబల్కర
వ్వాఁడు మది పల్లవింప ముని•పుంగవుఁ డాతనిఁ కాత్మభాగ మె
క్కుఁ డగు వినీతిఁ జూచి బుధ•కుంజర నిర్దురితార్జనంబునం
బడసినయట్టి సక్తువు కృ•పారతి నాఁకలి దీఱఁ దీర్పవే. 223

వ. అని సమర్పణంబు సేసిన నమ్మహీసురోత్తముం డా సక్తు వుపయోగించె దాన నతండు తృప్తింబొరద కునికి యమ్మునిఁ గనుంగొని యేమిట నితండు తృప్తుండగు నెట్లు సేయుదునొకో యను విచారంబు వొడమి డోలాయమానమానసుం డయ్యెం దదీయభార్య తదింగితం బూహించి యతనితోడ. 224

క. నాపాలిసక్తు విచ్చెద, నీపురుషునిఁ దృప్తుఁ జేయు • మీ వనిత నతం
డాఁకలిదప్పియును సం,దీపితజఠరాగ్ని యైన• తెఱఁగును గనుచున్. 225

వ. ఇట్లనియె. 226

---

1. క. బలుపంట.

క. మృగములుఁ బక్షులు లోనుగఁ, దగు నాహారములు దెచ్చి ♦ తమ ప్రియులకు నిం
పుగ నిచ్చి నాకుఁ గొనఁగాఁ, దగునె భవద్భోజ్యమైన ♦ ద్రవ్యము సాధ్వీ. 227

క. స్త్రీ సంతోషించు తెఱం, గా నవడని మనసు గలుగు ♦ నట్టి యధముఁ డి
చ్చోఁ బడిఁ గనుఁ జని యచ్చోఁ, గాసింబడు జమునిభటులు ♦ గాఱియ పెట్టన్. 228

వ. అనిన విని యవ్వనిత యతనివదనంబునం జూడ్కి నిలిపి. 229

తే. పతియ చుట్టంబు పక్కంబుఁ ♦ బతియ చెలియుఁ
బతియ తల్లియు దండ్రియుఁ ♦ బతియ గురువుఁ
బతియ దైవంబుఁ గావున ♦ పతిని వని యొ
నర్చుటయ చూవె ధర్మంబు ♦ నాతి కరయ. 230

వ. అట్లుం గాక. 231

క. మానితగుణ నీ వాఁకలితో నుండఁగ నేటిపాలు ♦ దోషం బిది యి
ట్లే నాహారము గొందునె, యీ నిర్మలమతికి దీని ♦ నిమ్ము చితవిధిన్. 232

చ. అని తన సక్తు విచ్చినఁ బ్రియమ్మున నమ్ముని యమ్మహాద్విజుం
గనుగొని దప్పి వోఁ డిదియు ♦ గైకొను మన్న నతండు ప్రీతి నె
క్కొన భుజియించి పెండియును ♦ గూరఁడ తృప్తిఁ దదంతరంగముం
గనుఁగొని యత్తపస్విపతి ♦ గ్రమ్మఱ నెమ్మదిఁ జింత నొందనన్. 233

వ. తదీయతనయుండు తద్దశావిశేషం బెఱింగి. 234

సీ. తనపాలిసక్తువుఁ ♦ దండ్రికిఁ జూపి యీ, యతిథిఁ దృప్తునిఁ జేయు ♦ మనఘ దీనఁ
దనయుండు దండ్రిచి ♦ త్తమున నెక్కొనినకృత్యం బాచరించుట ♦ యర్థధర్మ
మన విని యమ్మహా ♦ ముని నెంత ప్రాయంబు, సనినను విను జన ♦ కునకు సుతుఁడు
బాలుండ యాఁకలి ♦ బాలుర కగ్గల, మట్లు గావున నిది ♦ యనుచితంబు

తే. నావుడును దాన పుత్త్రుఁడ ♦ నంగ నిందు
నన్నుఁ గాచుట యరయంగ ♦ నిన్నుఁ గాచి
కొనుట యిప్పిండి యిమ్మహా ♦ త్మునకు నిచ్చి
కావవే నన్నుఁ గారుణ్య ♦ భావితాత్మ. 235

వ. అనినం గొడుకుమాటలకు నమ్మహాత్ముండు ప్రీతాత్ముండై యాసక్తు వా యతిథి కిచ్చినం బుచ్చుకొని యతం డుపయోగించె దానను నాఁకలివోని తెఱంగు దోఁచిన నయ్యుంఛవ్రతుని డెందంబు కుందు నొందినం గోడలు తదాకార ప్రకారంబు గని తనయంశం బైన పిండి మామముందటికిం దెచ్చి. 236

సీ. ఇదియును నతిథికి ♦ నిం డన్న నక్కట, యాఁకటఁ దలరి నీ ♦ యంగకములు
శిథిలంబు లై నవి ♦ నేడ్పడి యున్నది, చిత్తంబు దీనిఁ బు ♦ చ్చికొని నిన్ను
దప్పితో నుండంగ ♦ నెప్పాట జూడఁగ, లాఁడ నేననుదు నా ♦ లజ్జ మీఱు
మద్గురుగురులకు ♦ మహితశుశ్రూషకుఁ, గాదె ప్రాణములు నం ♦ గములుఁ గలిమి

తే. విహిత మిటు సేఁత నా కను • వృత్తిశీలఁ
గాఁగఁ జేయుండు నన్ను మీ • కరుణ యలర
ననిన సంయమివరుఁ డియ్య • కొని యతనికి
నచ్చెలువపాలి సక్తువు • నర్థి నిచ్చె. 287

ఉ. ఇచ్చినఁ బ్రీతిఁ బుచ్చుకొని • యింపెసలార భుజించి తృప్తిమై
నచ్చువడంగ మెచ్చున ము • ఖాంబుజహాసం బలరంగ నిట్లనుం
[1]బొచ్చెము లేక యయ్యతిథి • భూరిగుణోత్తర నిన్నుఁ జూడఁగా
వచ్చితి నేను ధర్ముఁడ భ • వద్వ్రతశీలతఁ జూచి మెచ్చితిన్. 238

క. భక్తియు వినయము శ్రద్ధా, యుక్తియునుం దాల్మితోడ • నొప్పును గరుణా
సక్తియు నతిథులయెడ ననురక్తియు నీయందు సుస్థిరత్వముఁ బొందెన్. 289

క. నీదానంబున విస్మితు, లై దైవతయుతసిద్ధ • లభివర్ణన మ
త్యాదరమునఁ జేసెద రిదె, రోదసి సమ్మర్దముగ న • రుగుదెంచి తగన్. 240

క. అని చూపి పలుకునవసర, మునఁ బర్జన్యుండు గురిసెఁ • బుష్పాసారం
బనవద్యహృద్యనాదం, బున మ్రోసెను దేవదుందు • భులు గగనమునన్. 241

వ. అప్పు డయ్యతిథి వెండియు. 242

— యముఁడు సక్తుప్రస్థుని బ్రహ్మలోకంబునకుఁ బో నియోగించుట —

క. నిన్నుఁ జూచువేడ్క నేడ్వురు, మునులమనంబుల సమగ్ర • మునఁ గదిరెను స
జ్జనకీర్తనీయ దివికిం, జనుదెమ్ము ప్రియాసుతస్ను • షాసహితముగన్. 243

తే. క్షుధ హరించుఁ బ్రజ్ఞాపరి • శోభనతలఁ దృష్ణ గుందించుఁ గృప నీవు • దెలిసి పాప
మనఘ నిర్జించి కాలుబిడ్డనక యతిథి, పూజనం బిట్లు నడిపిన • పుణ్యమునకు. 244

క. తగు ప్రియమున సకుటుంబం, బుగఁ దన సభ [2]కిపుడు రాక • బుద్ధిం గని బ్ర
హ్మ గడుఁ వేడ్క విమానం, బు గుణవ్రతశీల శీఘ్ర • మునఁ బుత్తెంచున్. 245

చ. వినుము ప్రభూతదానములు • విశ్రుతయజ్ఞములున్ సధర్మతో
వినుతికి నెక్క జాలవు వి • వేకనిధీ పరిశుద్ధిశోభితా
ర్జనమునఁ దెచ్చికొన్నది వ • రం బగుఁ బ్రస్థము సర్వకాలము
గని లఘువస్తువేని నొసఁగం గను టుజ్జ్వలధర్మ మారయన్. 246

క. అని పలుకుచు దివ్యంబగు, తనయాకారంబు నూపె • ధర్ముండు కన
త్కనకమణిమయవిమానము, వినువీథిం దోఁచె మునులు • విస్మయ మొందన్. 247

వ. అప్పుడు సక్తుప్రస్థుండు పరమప్రీతిం దానును దనవారును ధర్మదేవతకు దండ
ప్రణామంబు సేసి నిలిచిన. 248

తే. ధర్మదేవత యతనితో • ధర్మనిరత
కంటె బ్రహ్మ పుత్తెంచిన • ఘనవిమాన

1. క. గ. జ. ట. 'బొచ్చము' 2. గ. కిపుడ రాక.

మనఁగ నది భూమి కవతరించినఁ బ్రమోద
మెసఁగ నాధర్మ్మఁ డాతని కిట్టు లనియె. 249

క. వేడుక నాలుం గొడుకును, గోడలు నీవును బ్రభూతగుణ యెక్కును సం
క్రీడమెయి నీ విమానము, నీడితగతి బ్రహ్మసభకు నేఁగఁగ వలయున్. 250

క. అనవుడు సక్తుప్రస్థుఁడు, దనవారును దాను నెక్కి ధర్మ్ముం డనుపం
జనియె నది యంతయును నేఁ, గనుఁగొనుచు బిలంబు వెడలఁగా నామేనన్. 251

— సక్తుప్రస్థుఁడు సకుటుంబముగా బ్రహ్మలోకంబునకు బోవుట —

వ. ఆసక్తువు గంధంబును నతిథిపాద్యజలక్లేదంబునుం బొరసి సక్తుప్రస్థకృతం బైన పరమధర్మంబుమహిమం జేసి మదీయమస్తకంబును నొక్క పార్శ్వంబునుం గనకమయంబు లయ్యె నాఁడు దొడంగి యేను దానవిధిస్థలంబులకును బుణ్యాశ్రమభూములకును వివిధాధ్వరప్రదేశంబులకుం జనుచుండుదుఁ దక్కటిప్రక్క పసిండి యగునను తలంపున నెన్నిచోట్లకుఁ బోయినను గాకుండు లోకోత్తరచరితుం డజాతశత్రుం డశ్వమేధంబు సేయుచున్నవాఁ డయ్యెడ నాకోర్కి సిద్ధించు నని పెద్దయాసతో నరుగుదెంచితి నించుకవిశేషణంబునుం గానవిుం దది కారణంబుగా నయ్యుంఛవృత్తి విప్రునిధర్మంబు నీయజ్ఞంబు వోల దంటి నని పలికి యన్నకులంబు దా నెక్కడ బోవుటయు నెఱుంగకుండం బోయెఁ బాండుకులపవిత్ర యమ్మఖంబునం గలిగినయాశ్చర్యంబు తెఱం గెఱింగించితి ననిన విని జనమేజయుండు.

సీ. జన్నంబునందు రాజన్యులుఁ దపమున, మునిజనంబులు శాంతి ననఘ విప్రు
లాసక్తు లగుదు ర ట్లగుటఁ గాదే పల్కు, రవనీశ్వరులఁ దొల్లి యాగకృతుల
నతులకీర్తులను సద్గతులను బడసిరి, ధర్మనందనుఁ డత్యుదాత్తభంగిఁ
దొంటిభూనాథులకంటె సత్యమునను, శౌచమునను భక్తి శ్రద్ధ [1]సేగి

తే. నతిశయిల్లె వేదవ్యాసుఁ డాదిగాఁగఁ, గలుగు నార్యజనులచిత్తములకు నెక్క
సమరవల్లభుచంద మందముగఁ జేసె, నశ్వమేధంబు మెచ్చులకాకరముగ. 253

వ. అట్టి పరమధర్మం బానకులంబుచేత గర్హితం బగుటం గారణం బేమి యని యడిగిన వైశంపాయనుండు ధర్మపుత్త్రాధ్వరంబు నీ చెప్పినయట్టిద యైనను నొక్కటి సెప్పెద నవహితుండ వగు మన్నకులంబు హింసాత్మకం బైన పశుయజ్ఞంబుకంటె [2]నహింసామహితం బైన తపోమయయజ్ఞం బధికం బని చెప్పిన యది యయ్యె రిత్త చెప్పుటగాక తనశిరంబును శరీరార్ధంబును సువర్ణమయంబు లైనకతంబునం బలికెం గాన దానివచనంబులు ద్రోపువడ వేతద్విషయం బైనది యొక్క యితిహాసంబు గల దది యాకర్ణింపు మని యమ్మనుజనాథున కిట్లనియె. 254

1. క. గలిగి యతి. 2. గ. నహింసనభినుతం బైన

సీ. అమరాధిపతి దొల్లి • యాగంబు సేయంగఁ
దొడఁగ మహాముని • స్తోమములును
సురసంఘములుఁ గూడి • గురుముఖ్య ఋత్విగ్గ
ణముల నేర్పఱిచి సాం • పనుర వేది
గల్పించి తగ నగ్ని • గార్యంబు నడపంగ
నప్పాలు పసువిచా•యంబుఁ జేర
నమ్మునుల్ గనుఁగొని • యధికదయార్ద్రంబు
లగు చిత్తములతోడ • నమ్మహేంద్రు

ఆ. నాననంబు నూచి • యుత్కట హింస ధర్మంబు గాదు కృతయు•గంబు సాద్వి
ననఘ పత్సక్రతో•యము ప్రాంతగిలినబీజంబు లిపుడు యజన•సాధనములు. 255

క. వేదోదితప్రకారంబ, బాదర మెసఁగంగ నడపు • మది యుత్తమ ధ
ర్మోదయము సేయు నీకు ద,యాదృష్టిం జూచు పసుగ•ణార్తి మహాత్మా. 256

ఆ. అనిన వారిమాట • లాదరింపక యుండె, వాసవుండు దాన • వారు పుట్టె
న మ్మునీశ్వరులకు • నతనికి సురసంఘ, ములని గూడ వాద • మతిశయిల్లె. 257

వ. అట్టియెడం గర్మకాండవిదుం డగు నవాంచరవసువు సన్నిహితుం డగుటయు నయ్యిరుదెఱంగులవారును నా రాజన్యుని సాక్షిగాఁ గోరిన నతండు దేవతాపక్షపాతంబున బసువిశసనంబు కర్తవ్యం బని పలికి యధఃపాతంబు ప్రాపించెం గావున హింసారహితంబయిన యజనంబు పూజనీయం బగుటకు సంశయింపవలవ దట్లుం గాక. 258

ఆ. ఉంఛవృత్తి యైన•యుర్వీసుకోత్తముం, డట్లు ప్రాణరక్ష • కై ఘటించి
స్వజనములును దాను•భుజియుఁప నుండి యా,సక్తు వతిథి కిచ్చెఁ • జనదె పొగడ.

వ. అనిన విని జనమేజయుం డది యట్టిద మునీంద్రా నీవచనంబుల కొడంబడితి ధర్మమార్గగతంబైన ద్రవ్యం బింత భవ్యంబు గదే యవ్వస్తువు దానంబునకుం బ్రధానం బగుట యింకనుం బ్రస్ఫుటంగాఁ బ్రకీర్తింపు మనవుడు నాసంయమి యవ్యాసపౌత్త్రిపౌత్త్రి నాలోకించి యి ట్లనియె. 260

—• అగస్త్యమహాముని ద్వాదశవార్షిక యజ్ఞప్రభావము •—

సీ. ఇవ్విషయంబున • నెందుఁ బ్రసిద్ధతం, బరఁగెడునట్టిది • ధరణినాథ
విను తేతిహాసంబు • వినుము చెప్పెద నగ, స్త్యుండు పండ్రెండేండ్లు • సువ్రతాభి
రతిఁ జేయుమహితాధ్వ•రమునకు దివ్యాను, భావంబు గలయట్టి• పరమమునులు
వేడ్క ఋత్విజులయి • వెలయ నిజప్రౌఢి, నఖిలతంత్రంబులు • నాచరింప

తే. నాసమయమున వర్షింపఁ•డయ్యె నింద్రుఁ డోషధులు వికలత్వంబు • నొందె దానిఁ
జూచి యత్తపోధను లగ•స్త్యునకు నన్న,దానవిధు లెట్లు సెల్లునో• తగువిధమున.

వ. ఇతండు ద్వాదశవార్షికం బైన దీక్షావిశేషంబు నొందినవాఁడు ధర్మమార్గాగతం
బయిన ద్రవ్యంబు దక్షిణ నొండు వినియోగింపండు వానయుం గురియదని ము
చ్చిరి తమలో[1]బలుకఁబలుకులు ప్రతాపదీపితుం డగు నక్కుంభసంభవుం డాలించి
వారలతో నిట్లనియె. 262

ఉ. న్యాయము గల్గి యధ్వరమునందు విఘాతము పుట్టకుండఁ దాఁ
దోయదకోటిఁ బన్పి హరి తుష్టిగ వృష్టి యొనర్పకున్న నే
[2]నా యమరేంద్రతం గొని మహాద్భుతవృత్తి జగంబుఁ బ్రోచెదన్
మీరు మెడఁ జింత దక్కుఁడు సమిద్ధతపఃపరులార నాదెసన్. 263

క. కాదేనిఁ ద్రిజగముల బహుళోదార ద్రవ్యకోటు లున్నయునికి మీ
పాదములపరిసరమునకుఁ, దే దొరకొను నశ్రమమునఁ దెచ్చెద వానిన్. 264

తే. అంత సేయంగ వలయునే యున్న ననఘు
లార యుత్తరకురుభూము లారఁ బండి
యున్నవని యాగశాలోచి తాన్నమునకు
వలయు ధాన్యముల్ దలఁపున వచ్చు నిందు. 265

వ. అని పలికి వెండియు. 266

క. ఆజాలి యేల నిర్మల,బీజహవి స్తంత్ర మేను ప్రీతి నొనర్పం
గా జగతి వఱపునం జెడు, నే జన్నము విఘ్నపడునె యేటికి వగవన్. 267

సీ. అన విని నీవు ధర్మాగతి సంసిద్ధ, వస్తుదాయివి నిరవద్యతపము
వ్యయముగా నీ కేల వాసవుపై కిన్క, నఖిల జగద్ధన మాహరించి
కొనసేల యుత్తరకురుభూములందలి,ధాన్యంబు లేల సన్మాన్య బీజ
హుతములందు ఫలేచ్ఛ యోజింపనేల మాకై యిన్ని దెఱఁగుల యుండుఁ బాటె

తే. నీదు చిత్తంబు దీని విన్నిశ్చయముగఁ
జేసి సుఖ మగు మేము మాచేసినట్టి
సుకృతములఁ దెచ్చికొందుము సులభములుగ
వలయు నాహారములు లోకవందనీయ. 268

మ. అని సల్లాపము సేయుచుండఁగ ననేకాంభోదజాలంబులం
బనిచెం దెల్లుగ వర్షముల్ గురియఁగాఁ బర్జన్యుఁ డాప్రొద్ద తా
నును నాచార్యుఁ బురస్కరించుకొని సమ్మున్నంగావచే యుంచు న
మ్మునిశార్దూలుని గాన వచ్చె వినయంబుఁ భక్తియుం దోఁపఁగన్. 269

ఉ. వచ్చిన గారవించి యనవద్యపుటర్చన లిచ్చి సంయమం
మెచ్చఁగ శాంతసద్వచనలీలఁ బ్రమోద మొనర్చి యాతనిం
బుచ్చె సురేజ్యయుక్తముగఁ [3]బోఁడిగఁ గ్రమ్మఱ వేల్పుఁబోటి కా

1. క. బలుకఁబలుకులఁ బ్రతా...సంభవుండు రోషించి. 2. గ. నాయమరేంద్రురీతిని 3. గ. బ్రోడిగ.

సచ్చరితుండు లోకమును । సాహసమందె వెలింగె జన్మమునన్. 270

తే. క్రతుసమాప్తిసమయమున । నశ్వదుడు వినయ
భరితుఁడై యోగ్యభంగి స । ద్విప్రమునుల
కర్చలిచ్చి యామంత్రణ । మాచరింప
వారుఁ బ్రీతి నేఁగిరి నిజా । వాసములకు. 271

—॥ జమదగ్నిమహాముని పితృదేవతలశాపంబున నకులంబై పుట్టిన కథ ॥—

వ. ఇవ్విధంబున హింసారహితంబుగా మహితయాగంబు సుప్రయోగంబు నేసి యగ్రస్థ్యుండు పరమప్రశస్తిసుజ్వలుండయి వెలింగెం గావున ధర్మమార్గాగత ద్రవ్యకృతంబై తపోమయంబగు యజ్ఞంబు ప్రాజ్ఞజనమనోజ్ఞంబై వెలయు నని చెప్పిన విని జనమేజయుం డిట్లనియె. 272

తే. అనఘ నకులరూపంబున । నట్లు దోఁచి
బ్రాహ్మణుఁ తోడ మానవ । భాషణముల
నెవ్వఁడేనియు నొక్కఁ యు । హీనబోధ
ఘనుఁడు సల్లాప మొనరించె । నని తలంచి. 273

తే. అతఁ డెవ్వఁడో యని విస్మ । యమునఁ జూచి
వెండియును బ్రస్తుతోక్తుల । విందు ననుమ
నంబులో నూరకుండితి । నాకు నతనిఁ
జెప్పఁదగు నేని బోధన । శీల చెపుము. 274

క. అనుటయు వైశంపాయనుఁ, డనూనపుణ్యప్రదీప్తుఁ । డగు నీ కెందున్
వినఁదగనియదియుఁ గలదే, వినిపించెద నుంగివిధము । విను తెలియంగన్. 275

సీ. జమదగ్ని పితృకార్య । సంకల్పమత్యంతనియతాత్ముఁడై చేసె । నిష్ఠ యొప్పఁ
జారునూతనకల । శంబున హోమధేనువుఁ దాన పిదికి గౌ । రవముతోడ
నిర్మలమయెడఁ బది । లమ్ముగా డించిన నతని చిత్తము తెలియంగ । నరయు బుద్ధి
కోపాదివృత్తిఁ గ్రో । ధాధిదైవము వచ్చి, ప్రామాదికం బను । భంగి దోఁపఁ

ఆ. గుండతోడిపాలు । గూల్చినఁ గినియక, యూరకుండె నాస । ముజ్జ్వలాత్ముఁ
డప్పు డాత్మ మెచ్చి । యద్దైవ మతనికి, నిట్టు లనియెఁ గురుమహీశవర్య. 276

క. భృగువులు క్రోధను లనఁగా, జగతిఁ బరఁగు వాద మది [1]మృ । షాపరికలితం
బగుట దెలిసె నోడితి నీ, కగణిత మగునీతపమున । కలికెద ననఘా. 277

వ. అని వెండియు. 278

క. నాదెసఁ బ్రసన్నుఁడవు గ, మ్మాదరమునఁ జూపు సైఁపు । మపరాధము వి
ద్యాదయుతి యనిన నమ్ముని, యాదైవముఁ జూచి శాంతి । యుల పడ నెమ్మిన్. 279

వ. నామెక సిప్పుడు. 280

1. క. మృషాపరికల్పం బగుట.

క. నీ వేమితప్పు సేసితి, త్రోవము శంకాభయంబు • దొలఁగఁగ సంక
ల్పావిలతకు నలుగుట పితృ, దేవతలకుఁ గలుగుఁ బొమ్ము • దిగ్గున ననుచున్. 281

వ. భీతి నాభూతం బంతర్ధానంబు సేసెం దదనంతరంబ యా జమదగ్నిం బితృదేవతలు గోపించి పొడసూపి యతనితో నీవు శ్రాద్ధంబునకు సంకల్పించి యుండి తద్వైకల్యంబు పుట్టిన నూరకుండి తని పలికి ముంగిసవయి పుట్టుమని శపించిన నతండు వారలకు దండప్రణామంబు సేసి తపస్వికి నలుగం దగదని [1]యపరాధంబు గనియునుం గ్రోధాధిదైవంబునకు నలుగ నైతి. 282

ఆ. తప్పు సైఁచి నన్ను • దయఁ జూచి శాపమోక్షము ననుగ్రహింపుఁ • డమితతేజు
లార యని వినీతి • లంపటుం డగుచుఁ బ్రార్థించుటయును వారు • దెలివు నొంది.

వ. విదగ్ధవిప్రసమూహం బాడంబడు నట్టి యుచితవాక్యంబుల నీ వెన్నఁడేని మహాధర్మంబు గీడని యాడితి నాఁడు నీకు శాపమోక్షం బగు నని నిర్దేశించి రన్నకులంబును సక్తుప్రస్థనికతంబునం దగినమాటల నా తెఱంగున సదస్యులతో ధర్మనందను నశ్వమేధంబు నధిక్షేపించి విగతశాపత్వానందంబుహొంది యంతర్హితం బయ్యె నని యిట్లు జనమేజయునకు వైశంపాయనుండు పాండవాగ్రజు నశ్వమేధంబువిధంబు విస్తారప్రస్తవనీయంబుగా వివరించుటయు. 284

శా. భక్తిస్మేరమునీంద్రచిత్తకమల • ప్రస్ఫీతసౌరభ్యసం
యుక్తా [2]రూఢతరప్రకాశతనురూ • పోల్లాస రాగాదిని
ర్ముక్తైకాంతిజనైక తారసిక చిం • న్ముద్రాసదోన్నిద్ర ధీ
శక్తిస్వైరవిహారదూర లలితా • సద్భావనోన్మీలితా. 285

క. అజరామరపదకరపద. భజనా సంసారజలధి • పారీణస్తో
తృజనా స్వమూర్తివైదిక, యజనా పాశ్చాత్యనాడి • కార్ద్రివ్యజనా. 286

మాలిని. త్రియుగకమలవీథీ • దీప్తసంచారలీలా
నియమితపవనాత్మా • గ్నిప్రభాస్నిగ్ధసంగా
స్మయవికచమహాబ్జ • స్వైరమాధ్వీకధారో
దయమయ [3]మధురాత్మా • దర్శితానందవర్త్మా. 287

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం బైన శ్రీమహాభారతంబున నశ్వమేధపర్వంబునందు సర్వంబును చతుర్థాశ్వాసము. 288

శ్రీమదాంధ్రమహాభారతమునందలి
యశ్వమేధపర్వము సమాప్తము.

---

1. క. యపరాధం బల్పంబనియు గ్రోధా. 2. గ. గూఢతర ప్రకాశతమరూపోల్లాస-చ: రూఢతర ప్రకాశితమహాప్రోల్లాస. జ. రూఢతరప్రకాశతమహోస్త్రోల్లాస 3. క. గ. చ. మధురత్వాదర్శిత.



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆశ్రమవాసపర్వము, ప్రథమాశ్వాసము.





సాధనపదపద్మో
పాసనవిద్యా శమైక • పరతానిత్యా
భ్యాసజనహృద్య వేద
వ్యాసవచోవిభవవేద్య • హరిహరనాథా. 1

—•{ యుధిష్ఠిరాదులును గాంధారీధృతరాష్ట్రులును నొండొరులయెడల నడచికొన్న ప్రవర్తనము }•—

వ. దేవా జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె. నట్లు పితృపితామహాశ్రిమ ప్రాప్తంబయిన సామ్రాజ్యంబు జగత్పూజ్యప్రకారంబునం గైకొని మహాధ్వర ప్రముఖధర్మకార్యధుర్యులును సముపాసితార్యులును దయావిధేయులు నగు పాండవేయులు ధృతరాష్ట్రువలన నెవ్విధంబువారై నడచిరి. హతపుత్రమిత్రామాత్యుండును గతైశ్వర్యుండు నగురాజును యశోమహిత యగు గాంధారియు నెట్టిభంగి వర్తించి రత్తెఱంగు నాకెఱింగింపుము. 2

సీ. అనవుడు నమ్ముని • యమ్మహీపతికి ని, ట్లనుఁ బాండునందను • లాంబికేయు
నెడ భక్తివినయంబు• లెసఁగంగ వర్తింతు, రతని యోగక్షేమ • మరసి యెపుడుఁ
దత్సమీపంబునఁ • దగ నిల్చి తమకు నెయ్యది యైన నెఱిఁగించు • నట్లు గాఁగ
నుందురు విదురుఁ డు• యుత్సు సంజయుఁ బు ద్ధారును నిత్యమును వచ్చి• వినతిఁ జేసి

తే. కొలిచి కూర్చుండి యానృపు • నలఘుకార్య
విధము లేర్పడ నడిగి య•వ్విభుని చెప్పి
నట్ల చేయుదు రతఁడును • నాదరంబు
గాఢవాత్సల్యంబును • గలిగి యుండు. 3

ఉ. కౌరవనాథ కుంతియును • గౌరవ మొప్పఁగ వచ్చి కొల్చు గాం
ధారి నశేషయత్నమున • ద్రౌపది తాను సుభద్రయుఁ [illegible]

బోరఁగ నిత్యముం [1]గొలుచు • నక్కురువంశమహత్తరుల్ మహో
దారము లైన వస్తువు లుదాత్తత నిత్తురు వార లందఱున్. 4

క. చిత్రాంగదయు నులూపియు, ధాత్రీశ్వర పత్ను లెపుడు • ద్రౌపదితోడన్
గాత్రములు భూరివినయా, న్వితములుగ సుబలసుతఁ బ్రమదమునఁ గొలువన్. 5

క. ఆతల్లికిఁ దండ్రికి సం, ప్రీతి యలరఁ గుడువఁ గట్టఁ • బెట్ట నుదాత్త
స్ఫీతంబు లైన వస్తువ్రాతంబుల నిచ్చు ధర్మరా జనుదినమున్. 6

తే. గుళ్ళఁ జెఱువులుఁ గట్టించుఁ గోరి యూళ్ళ
నగ్రహారముల్ గావించు • నాంబికేయుఁ
డధిప ధర్మతనూజుఁ, డత్యంతహర్ష
చిత్తవృత్తియై యనుమతి • సేయుచుండ. 7

క. జనవర ధర్మజుఁ గొలువం, జనుదెంచినయట్టి వివిధజనపతు లెల్లన్
మును ధృతరాష్ట్రునిఁ గొలుతురు, విను మాకొడుకుమది పల్లవించును దానన్. 8

క. నూనులు లేమిం గలిగెడు, దీనత్వము దోఁప కుండఁ • దేజస్స్వాభ్యా
నూనులుగ జేయు ధర్మజుఁ, డానరపతి నతని దేవి • నతులితభక్తిన్. 9

సీ. వంశవృద్ధులు పుత్త్రవర్గవియుక్తులై, యున్నవా రేమిట • నుమ్మలింతు
రో యనుపుయిలోట • నాయుధిష్ఠిరుఁడు దమ్ములకును దగు నమాత్యులకు నిష్ఠ
భృత్యులకును మీరు • ప్రీతియు భక్తి, నాంబికేయుని దెస • నతిశయిల్ల
నారాజు పంచిన యట్లు చేసి చరింపుఁ, డతని నారాధించు • టస్మదీయ
ఆ. చిత్తమునకుఁ బ్రియము • సేయుట యతనికి, మనసు గానియట్టి పని యొనర్పు
టగ్గలంపుదుఃఖ • మావహించుట యని, యనుదినంబు జెప్పు • మనుజనాథ. 10

క. విను మెల్లవారు నతనివ, చనములు మది నూఁది యట్ల • చరియింప మరు
త్తనయుండును నమ్మెయి వ, ర్తనము నడపుచుండు మనసు దద్దయు నెరియన్. 11

క. ద్యూతంబున దుర్యోధను, చేతం దమ పడినపాటు • చిత్తంబున క
త్త్యాతురతఁ జేయుచుండుట, నాతఁడు ధృతరాష్ట్రుఁ జూచి యులుకు మనమునన్. 12

తే. శ్రాద్ధదివసంబులందుఁ బుత్త్రవజమున
కాంబికేయుండు గోకనకాదిదాన
కీర్త్యముగఁ బారలౌకిక • క్రియలు సేయ
నల్లుగా సంఘటించు ధర్మాత్మజుండు. 13

సీ. అతులభోగంబులు • నంచితత్యాగంబుఁ, దొల్లింటియట్టుల • చెల్లఁ జేయు
ధృతరాష్ట్రునకు ధర్మసుతుఁడు గాంధారికిఁ, బూర్వప్రకారసం • పూజ్యదాన
[2]నిరతిఁ జెల్లించు నక్కురువృద్ధుఁ డిమ్మెయిఁ, బాండుపుత్త్రులు దన్ను • బరమభక్తి
శిష్యవర్తనములు • సేవింపఁ దానును, గురునట్ల వాత్సల్యపరత నెపుడు

1. గ. గొలుతు రక్కురువంశమహత్తరన్. 2. చ. నిరతిఁ జెల్లించుచు • నిష్ఠ నక్కురువృష్ణ, పాండు.

తే. వారలకు శ్రీయు నాయువు • వైరిజయము
మానసమున నాశాసించు • మానవేంద్రు
డతని తొంటివర్తనముఁ దం•త్సుతునికీశు
నాత్మఁ దలఁపఁ డెన్నండు ధ•ర్మాత్మజుండు. 14

క. విను మితని తెఱఁ గెఱిఁగి పరిజనములతో నాంబికేయు • చరితము దుర్యో
ధనుకొలఁదిగా మిఁయు నెవ్వాఁడును వ్రాఁకువ్వఁగ వెఱతు•రు కురుప్రవరా. 15

సీ. రాజ్యాధిపత్యసా•మ్రాజ్యత్వమున ధృతరాష్ట్రు పాండుసు తాంత•రంబు గాన
రాకయులు జానప•దోత్కరమునఁ బౌరవర్గంబునందును • వసుమతీశ
యుమ్మెయి నడపెను•నప్పాండవాగ్రజువలన నిజాత్మజు•వలనికంటె
నక్కురురాజు ప్రీ•తుఁడు బొరి నట్లున్న, యక్కాలమునఁ బవ•నాత్మజుండు

తే. సన్నిహితుఁ డైనయప్పు డం•జ్ఞనవిభుఁడు
దన తనూజులఁ దలఁచి సం•తాప మందు
నతనిఁ గనుఁగొని యబ్భముఁ •డతని సుతులు
దమ్ముఁ బఱచినపాటులు • దలఁచి యలుగు. 16

తే. హృదయములు నొండొరులడెస • నిట్టివార
లయ్యు వరుఁడు నతండు నం•న్యోన్యభాష
ణముల యప్పుడు మృదులవి•న్యాస మొప్ప
నాడుడుతు చుట్టములు మెచ్చు•నట్లు గాఁగ. 17

వ. ధృతరాష్ట్రుం డేకతంబ యున్నయెడ వృకోదరుం డతనికి నింత నంత నుడి
గాంధారియు వినుచుండ. 18

సీ. అంధునికొడుకులు•యుం దొక్కరునిఁ దప్పఁ బోనీక ద్రుంచితి • భూరిశక్తి
దర్పితం బైనమ•ద్బాహుపంజరము స్రాచ్చిన రిపురాజన్య•సింహములకు
పెడలంగ వచ్చునే • వెంగలులై వారు, గయ్యంబు సేసిరి • గాక యన్న
నెఱిఁగినఁ దొడరుదు • రెట్టులు దుర్యోధనాదుల వనిఁ దెగ•టార్చువట్టి

తే. నాదుదోర్దండములఁ జంద•నం బలంది
కనుముదాముములో సుట్టి ప్రమో•క్కుడు మహాత్మ
తాము లరయుండ్ర దైవములే • గావె యనుచు
[1]దీయమర్మంబు లెల్ల భే•దిల్ల నదిప. 19

వ. దీని ధర్మనందనుండు ధనంజయుండునుం గుంతియు ద్రౌపదియు నెఱుంగరు
గవ లొక్కొక్కమా ఱిమ్మాటలు విని సంతసిల్లుదురు ధర్మనందను తెఱం గెఱుంగు
టం జేసి పుఱులోఁడి తా రేమియు నాడరు ధృతరాష్ట్రగాంధారులుం గాల
పర్యాయంబు గనికొని డెందంబులు గంద నూరకుండుదు రట్టిభంగిఁ బంచద

1. గ. దీయమర్మమర్మములు భే•దిల్ల.

వత్సరంబులు సరిమె నంత నొక్కనాఁ డయ్యంధనృపతి బంధుజనంబులం గూర్చి ధర్మనందను రావించి యతండు వినుచుండ గద్గదకంఠుండగుచు వారల తోడ. 20

—◆ ధృతరాష్ట్రుఁడు ధర్మజునితోఁ దనమనోరథంబు దెలుపుట ◆—

సీ. నా కతంబునఁ జేసి ◆ యా కౌరవులకు నాశంబు వాటిలుట దెల్లంబు మీకు
జడుఁ గ్రూరు నతిలోభి ◆ జ్ఞాతిజనద్రోహకరు రాజుఁ జేసితిఁ ◆ గురుధరిత్రి
కచ్యుతుఁ జెప్పిన ◆ యమలవాక్యంబులు, విన నేరనైతి నా ◆ తనయువలని
ఘనతరస్నేహంబు◆నను మొగమోటను, దగియెడుమాటలఁ ◆ దలఁపమి యొత్తి
తే. యాడ కుండితి భీష్ముండు ◆ నస్త్రగురుఁడు
విదురుఁడును సంజయుండును ◆ వేవిధముల
నాకుఁ జెప్పిరి గాంధారి ◆ నన్ను దూఱి
చెప్పె నమ్మాట లేఁ బెడ ◆ చెవుల నిడితి. 21

వ. ఇత్తెఱం గంతరంగంబున శల్యంబై యున్నయది యని చెప్పి వెండియు. 22

క. సుతులు సమరమునఁ దిరుగక, మృతులై సద్గతికిఁ జనిన◆మేలిమి యస్మ
న్మతిఁ దలఁచి వరక్షత్త్రచరిత మని యప్పలికి వగవఁ ◆ బ్రీతియ కలుగున్, 23

వ. అని పలికి పాండవాగ్రజుఁ జేరం బిలిచి యతనితోడ. 24

సీ. నీ వరయంగ సు◆ఖావాప్తిఁ గొఱఁత లే, కుండితిఁ జనవును ◆ నుజ్జ్వలంబుఁ
దేజంబుఁ గలిగి వ◆ర్తించితి దానంబు, లంచితములుగఁ బె◆క్కాచరింపఁ
గంటి శ్రాద్ధంబులు ◆ గాంధారిసుతులకుఁ, బలుమాఱుఁ జేసితిఁ ◆ బరమధర్మ
శీల పాంచాలికిఁ ◆ జెట్ట సేసి రగణ్య, పుణ్యుండవగు నీదు ◆ భూరిలక్ష్మి
తే. నపహరించి రద్దుర్యోధ◆నాదు లట్టి
కష్టచరితులఁ బాడిమై ◆ గయ్యమునను
నిహతులుగఁ జేసి తక్కురు◆నికర మూర్ధ్వ
భువనగతిఁ గాంచి సుఖ మందె ◆ భూపవర్య. 25

ఆ. కావున నేమియుఁ జేయంగా వలవదు వారికయి య◆కారణకరుణా
శ్రీవిలసితుఁ డగు నీతో, నా విధముం జెప్పవలసె ◆ నరవరముఖ్యా. 26

సీ. ఏ కార్యమైనను ◆ నెవ్వఁడేనియుఁ జేయఁ, దొడఁగునప్పుడు విను◆పుడమిఱేని
చే ననుజ్ఞాతుఁ డై ◆ కాని తొడంగఁ గాదట్లు గావునఁ బార్థ◆ కాభిలీఢ
మైనమదీయకా◆యమునకు సంస్కార, మాచరింపఁగఁ ◆ దప మాచరించు
పనికి భూపాల నీ◆యనుమతి వడయంగ, వలసి చెప్పెద రాజ◆వంశజులకు
ఆ. సమరమరణ మొండె ◆ విమలతపమునకుఁ, జొచ్చి యందు నిలిచి ◆ చచ్చుటొండె
వలయు నస్మదీయ◆కులముఖ్యు లిట్టుల, సకపి రనుపు నన్ను ◆ నడవి కనఘ. 27

క. రాజు గురుఁ డెల్లవారికి, రాజోత్తమ గురునియాజ్ఞ ◆ రంజిల్లఁగఁ జే

రోజం జేసినకృత్యములు,నూ జగములు రెంటియందు • శోభన మిచ్చున్. 28

తే. ఏను గాంధారియును దపో • మావనీయ,మునులచేరువ వల్కల • ములు ధరించి
కందమూలఫలముల నా • కలి హరించి, నిన్ను దీవించుచుండెద • మన్న నతఁడు.

క. ధరణీరాజ్యము నాకును, నరవర సౌఖ్యంబుఁ జేయు • నా నీ విప్మై
డురపిల్లి దుష్కరం బను, నరణ్యవాసమున కేఁగ • నట్టిద యైనన్. 30

తే. గాఢబుద్ధి నై నమ్మించి • కురువరేణ్య, యే నెఱుఁగక యుండంగ • నిట్లు శోక
వనధిఁ దేలుచు నుండి తి • వ్వనట గంటి,నింక రాజ్యంబు నాకొట్టు • లింపఁ జెపుము.

ఉ. తల్లియుఁ దండ్రియున్ గురుఁడు • దైవము నా కరయంగ నీవ భూ
వల్లభ నీవు కాననని • వాసము గోరి చనంగ నెట్టు లే
నుల్లము నట్టి హస్తిపురి • నుండఁగ నేర్తు యుయుత్సుఁ బెంపు తో
భల్లఁగ రాజుఁ జేయు నిఁకఁ • బ్రీతి వెలర్పఁగఁ గొల్చువచ్చెదన్. 32

క. అతఁ డౌరసుండు నీ క్షితి కొడయఁడు దుర్యశంబు • చేఁ గుందుట భూ
పతివర [1]కని కని దూ ఱ, ట్లతిమాత్రము సేయఁదగునె • యక్కట నాకున్. 33

సీ. నీవు రాజవు గాక • నీ కేను రాజనే, గురుని మహారాజుఁ • గురువరేణ్యు
నిటు సేయుమని పంప • నే నోడయుండనే, దుర్యోధనాదుల • దుష్కృతములు
నామదిలో నిల్పి • నేమును వారును, [2]విధిమోహమున నైన విరసభావ
మావహిల్లినఁ బుట్టె • నంతటు పనులు గాంధారియు గొంతియు • గారవమున

ఆ. నాకు నొక్కరూప • మీకుఁ గాననవాస, మెల్లభంగిఁ గలుగు • నేని నేను
దగిలి తోన వత్తు • నదగుమాటగా నాట, గాదు నామహృదయ • గతియు నిట్లు. 34

క. పలికెద నే సత్యము నా, కిల బ్రీతిం జేయు దధిప • యా విట్లు మనఁ
గులముకలఁక దైవకృతం, బలఘుమతీ విడువు శోక • మరయుము నన్నున్. 35

తే. నీకు శుశ్రూష యొనరించి • నృపవరేణ్య, చిత్తతాపంబు మానఁగఁ • జేసికొందు
నని తలంచుచు నన్ విడువంగ • నగునె యనన,కుండ నై నిన్ను వేఁడెదఁ • దొడరఁగ వగలు.

క. అనుచు నతని చరణంబులు, దనఫాలతలంబు సేర్చి • ధర్మతనయుఁ డా
తని నుబ్బి యెత్తి కౌఁగిట, నెనయుంగాఁ జేర్చి యాతఁ • డట్లను నఘహా. 37

తే. నీవు శుశ్రూష చిరకాల • నియతిఁ జేసి, తేను వృద్ధుండ నైతి నా • కింక దపము
వలన దయ్యెడు రాజును బాలి • వాఁడ యెవ్వ,రేను సేసినఫలములు • యొడ నృపాల. 38

వ. అని పలికి విదురకృపసంజయుల నుద్దేశించి తనకు ముఖశోషయుం దనుగ్లానియుం
గలిమి నుగ్గడించి నాలుకదొట్రుపడ వారలతో మీర లనునయవచనంబుల నజాత
శత్రుం దెలివొందం జేయుం డని చెప్పి డప్పి యెక్కుడు గదిసిన గాంధారితను
వున మేను సేర్చి మూర్ఛిల్లుటయు నార్తి నొంది యక్కుంతీనందనాగ్రజుం
డిట్లని పలవించె.

---

1. క. కనికని - మీతిట్లతి; అ. కనుకనిఁ దుది నిట్లతి. 2. గ. విధిమోహితుల మయి విరస.

క. కరిదళనసహస్రబలవి,స్ఫురితుఁ డగువిచిత్రవీర్యపుత్త్రుఁ డొకతలో
దరి నూఁతగొనియె విధి యెవ్వారి హీనులఁ జేయుఁ డకట వక్రుం డైనన్. 40

చ. అనిలజు మేనిచంద మగు నాయసరూపము చూర్ణితంబు సే
సినబలమాననీయుఁ డొక చేడియ నక్కట యాశ్రయించె నే
మనఁ గల దవ్విధాతృ నని [1]యాతనికీడును మానసంబునం
జొనపమి లావ పేరుకొని శోకము ధర్మజుఁ డొందె భూవరా. 41

సీ. అప్పుడు గాంధారి యల్లన ధర్మజుతోడ మీతండ్రి యుతూలతపంబు
తోడసంతతచింతఁ గూడుదొలంగి శ్రాంతుం డుండఁ గూర్చుండ నోప కునికి
నిట్లయ్యె ననవుడు నవ్వనికతమున నిమ్మహాత్మున కిట్టి యొడరు వుట్టె
[2]నట్టినామనువు నే మనఁగల దంచు నాతఁడు శీతజలము హస్తమునఁ బుచ్చి

తే. కొని యతనిమోమునందు నక్కున విదిర్చె
సమయమున విదురుండును సంజయుండు
నఖిలభరతభార్యలు నేడ్చి రవ్విభుండు
నివిరెఁ జలికేల నానృపు నవయవములు. 42

క. నివురంగఁ దెలిసి యతనిం, గవుఁగిటిలోఁ జేర్చి మస్తకము మూర్కొని కౌ
రవవృద్ధుఁ డతఁడు నాశ్లేషవిశేషంబున నొనర్చె సంప్రీతునిఁగన్. 43

వ. అట్లు దెలివొంది ధృతరాష్ట్రుండు ధర్మరాజుతో నా కెట్లునుం దపంబునకయి కాననంబునకుం బోవవలయు ననిన నజ్జనపతి నీ వారగింపు మప్పలి మఱి సెప్పెదనని తీపుమాటగాఁ బలికిన నయ్యాంబికేయుండు పెక్కుమాట లాడ శక్తి లేదు నన్నింక నలజడిఁ బెట్టకుము తపశ్చరణంబునకు నీయాజ్ఞ వడసి కాని కుడువ ననియె నయ్యవసరంబున సాత్యవతేయుండు కృపావిధేయుం డై యచ్చటికి వచ్చి సకలజనంబులు వినతులు గైగొని దీవన లిచ్చి యాధర్మతనయునాననం బాలోకించి. 44

— వ్యాసుఁడు ధృతరాష్ట్రు వనవాసంబున కనుజ్ఞ యిచ్చుట —

సీ. అంబికేయుఁడు సెప్పినట్టుల చేయుము, వృద్ధుఁడు నాత్మజవిరహితుండు
నైన యీతఁడు తప మాచరింపఁగఁ గోర, గున్నె గాంధారి శోకోపశమము
దాలిమి నొదవి యుం డదెఁ బ్రవర్తించె, నింక నియ్యమునకును నిదియె తలఁపు
గావున నీకు నీ కార్యంబు సెప్పంగ, వచ్చితి వీరిఁ బోనిచ్చు టొప్పు

తే. ననఘ పూర్వరాజన్యులు సనినయట్టి, సౌఖ్యపథమున నీరాజు సనుట మేలు
గాన యాతని కాననగమనమునకు, నిమ్మనుజ్ఞ విచారంబు లెల్లఁ దక్కి. 45

క. నీవినయము భక్తియు సం,భావనమును వీరి వగలఁ బాపఁగ శుశ్రూ
షావశవర్తిత నడచితి, భూవర చిరకాల మింకఁ బోనిమ్ము తగన్. 46

1. గ. యాతనికిం బనమానసం 2. చ. నట్టినామనము నే మనఁ.

చ. అని విని యాకురుప్రవరుఁ • డమ్మునివల్లభు మోమునుఁ జూచి యి
ట్లను మహాత్మ మాకు గురుఁ • డన్నను ధర్మవిధోపదేష్ట య
న్నను బరదైవ మన్నను మ•హఃప్రియ కార్యకలాపకర్త య
న్నను వినుము నీవ నీవచ•నంబున కడ్డము వల్కువాఁడ నే. 47

ఆ. అనిన నమ్మహాత్ముఁ • డను రాజులకు రణ, మరణ మొండె వృథను•మాధిఁ దనువు
విడుచు టొండెఁ గాక • వృద్ధులై రోగత,ల్పములఁ జావు మేలె • భరతముఖ్య. 48

వ. అనిన విని ధర్మతనయుం డొండు వలుక వెఱచి యి ట్లనియె. 49

క. అనఘా యిక్కురుముఖ్యున, కనుజ్ఞ యే నిచ్చితిని మహోత్తరముగు మీ
యనుమతియుఁ బడసె నినుఁ గ్వాక నిజేచ్ఛను నాకువిఘ్న•కరణము దగునే. 50

సీ. అనుటయుఁ బ్రియమంది•యమ్మహాముని యమ్మ•హీశ్వరుతోఁ బొండు•డీనృపాలు
గద్దియ నిడికొని • క్రతువులు సేయించి, యవిరళభోగానుభవము నడపి
యీతనివారలఁ • బ్రీతి నీక్షించి తా, శిష్యుండపోలె సం•సేవనంబు
భక్తిమై నొనరించెఁ • బదపడి నీవును, దిగ్విజయాదులఁ • దేవ ముతని

తే. నొందునట్లుగఁ జేసితి • వొకటఁ బిదపఁ, దాన వసుమాఁడువర్షముల్ • ధరణి యేలె
నీవు నక్రమ [1] యుత్తతి • నియతి నడపి, తితనిమది లేదు కలఁక యొక్కింతయేని

ఆ. కేవలతపఃక్రియాసం, సేవనతాత్పర్య మిపుడు చిత్తంబున యం
దావేశించినయది యీ•భూవరునకు నితని ననిచి•పుచ్చు మడవికిన్. 52

ఆ. అనిన ధర్మతనయుఁ • డట్టుల కాకని, పలికె దక్షిణంబ • బరమ యోగి
వంద్యుఁ డయిన సత్య•వతి కొడు కాత్మత,పోవనమున కరిగె • భూపవర్య. 53

సీ. తదనంతరమ ధర్మ•తనయుండు ధృతరాష్ట్రు,తోడ నీ కెట్టులు • నూడఁ బోలె
విదురుండుఁ గృపుఁడు నా•య్యాదికృత్యమని విని,శ్చయ మొనరించిరి•సంజయునియు
యుత్సుమనముల • నొలసినకర్తవ్య, మొద్ది దానిన చేయు • మెంతయేని
నాకుఁ బ్రియంబు భూ•నాథ యానతుఁడనై, వేఁడెద నొకటి నీ•విశదబుద్ధి

ఆ. నేమి సేయఁ దలచి•తేని నీ వక్కట, యారగించి చేయు మయ్య యనుడు
నడిగె నానృపాలు • డభ్యంతరావాస, మునకుఁ దోన సుబల•తనయ సనఁగ. 54

వ. ఇట్లు కురువృద్ధుండు వృద్ధసామజంబుచందంబునం జనునప్పుడు విదురుండును
యుయుత్సుండును గృపాచార్యుండును సంజయుండును వెనుకనచని రజ్జనపతి
దివసకృత్యంబు లాచరించి భూమిసురులం భుజించి యాహారతంత్రంబు
నిర్వర్తించె గాంధారియుం గుంతీప్రముఖభరతభార్య లనునయించి భోజనవిధి
యొనర్చెం దదనంతరంబ విదురాదులుం బాండవేయులును వనితాజనంబులుం
గృతాహారు లయి యా వైచిత్రవీర్యు బరివేష్టించి యుండఁ బాండవాగ్రజు
నప్పుండునృపాగ్రజుం డేకాంతస్థానంబునకుం దోడ్కొని పోయి యతనితోడ

1. చ. తతి నెప్డు నియతి.

సప్తాంగంబయిన రాజ్యంబు బూజ్యంబగు ధర్మంబుతో నెనయు నెవ్వుడు దుష్కరంబు గావున నాయెఱింగినంత బోధించెద నాకర్ణింపు మని పలికె ని ట్లనియెం. 55

—♦ ధృతరాష్ట్రుఁడు ధర్మజునకు రాజనీతివిశేషంబులు సెప్పుట. ♦—

సీ. నీవు నిచ్చలును వి♦ద్యావృద్ధజనములఁ, దగ నుపాసింపు మ♦ర్థముల వారి
బ్రీతులఁ జేయుము ♦ నీతులు వారువ, దేశింప వాని నూ♦ఁదినమనంబు
గలిగి [1]వర్తింపుము♦ కార్యంబు, నింద్రియంబుల రాజ్యరక్షితంబు♦ బోలె నరసి
రక్షింపు మ్రప్పుఁడు ♦ రక్షితం బైన శు,భంబులం గావించు,♦ భావశుద్ధ
ఆ. ధాముములును బితృపి♦తామహా క్రమసమా,గతులు విశదమతులుఁ♦ గాగవలయు
సచివు, లతివిదగ్ధ♦చారులఁ బనుపుము, పరులయా ప్తజనుల♦భంగు లరయ. 56
క. పురరక్షణము దృఢంబుగ, నరవర చేయంగ వలయు,♦ నమ్మఁగలుగు స
త్పురుషుల నిడఁదగుఁ, గుడుపుని, దుర మొదలగు లోనివనుల♦తోడ రువు లరయున్.
సీ. ఆప్తవృద్ధులఁ బెట్టు ♦ మంగనాజనుల సం,రక్షకు, నెల్ల కా♦ర్యముల మంత్రి
జనములతోడ వి♦చారించి చేయంగ, వలయును, గుప్తని♦వాస మొండె
మూడువుమీఁ దొండె♦మాటు లేనియరణ్య, తల మొండె మంత్రవి♦ధానమునకు
నర్హముల్, కేవల ♦ [2]మైనట్టిమంత్రంబు, గోవనం బొందినఁ గురువశేణ్య
ఆ. యఖిలకర్మములు ఫ♦లావాప్తి నొప్పఁ, బంగ్వాంధజనులు చీకులైన నీర
హాస్యభాషణముల♦యప్పుడు సేరువ, నునికి యొప్పదార్య♦వినుతచరిత. 58
క. విను మంత్రభేదమున వచ్చినకీడున కనఘ శాంతి ♦ సేయు టరిది గా
వున మంత్రులతో మంత్రా,సనవియమం బూఁది చెప్ప ♦ వలయుం జుమ్మా. 59
సీ. వ్యవహారములు శుచు ♦ లైన విద్వాంసులఁ, దోడుగఁ గాని తీర్పు,♦ దుష్టజనుల
దండించు నెడ వా♦రి♦తప్పులకొలఁదులు, మదిఁ [3]దూఁచి చూచి తం♦న్మాత్రదండ
మాచరింపుము, విను ♦ మాయవ్యయములు సం, క్షేపరూపంబున ♦ రేపకడలు
దానికి మును దేవ♦తాపూజనము భూసు రార్చనమును జేయు ♦ మమలబుద్ధి
తే. ప్రొద్దు సాలంగ నెక్కిన♦ప్పుడు సమర్హ భోజనక్రియ నిర్వహిం♦పుము సుశీల
మాన్య లదనంతరము గంధ♦మాల్యభూష,ణాంబరములు నిచ్ఛమై♦ననుభవింపు. 60
క. కొలువు విమ్మ మాపుకడ యోధుల కెల్లను, సంధ్య వద్ద ♦ దూతలనుం జా
రుల సంభావింపుము రాత్రులఁ గాంతాభోగతత్పరుఁడ వగుము నృపా. 61
తే. ఏమిః గ్రొత్తగఁ బుట్టిన ♦ నించుకేని, నలసుఁడవు గాక దాన నీ ♦ వరసి తీర్పు
[4]మిట్టి తెఱఁగుల క్రొద్దు ♦ లింతవట్టు నర్హములు కౌరవక్షితి♦పాగ్రగణ్య. 62
క. న్యాయంబుతోడ నానాధో,పాయంబు లర్థములను ♦ నుపార్జింపుము భూ
నాయక రాజ్యనిభూతను, సేయఁ జనుల నెఱిఁగి చంక ♦ జెఱువన వలయున్. 63

1. క. నిర్వర్తింపుకార్యంబు. 2. చ. మాప్తమంత్రంబులు. 3. జ. నూఁది. 4. అ. మిదిదెఱఁగుగ క్రొద్దు♦ నింతవట్టు.

క. పనులయెడ మేలు గాంచిన, మనుగడ యగ్గలము సేసి ♦ మన్నింపుము రా
జనయజ్ఞ భృత్యకోటిం, గొనియాడుము సేఁత పేరు ♦ గుఱిచ్చి కొలువునన్. 64

క. నీవలనను భక్తిస్నేహా♦వేశము గలిగి శూరుఁ ♦ డై యలజడికిం
దా వినువనిసత్కులజుం, గావింపుము సైన్యవిభుని♦గాఁ గురుముఖ్యా. 65

సీ. ఆత్మరంధ్రము లింక ♦ కైనను నొరులకు, నెఱుఁగ రాకుండఁగ♦ మఱువుసేయు
మన్యరంధ్రంబుల ♦ నారసి కనుము శత్రులకడ బుద్ధియు ♦ బలుపుఁ గలుగు
వారల నెఱిఁగి భూ♦వర యొక్కమై నీగి, మన్నన నెఱపి త♦న్మానసములు
నీయెడ నార్ద్రంబు ♦ లై యుండఁ జేయుము, చేరువనృపులకు ♦ నైరబాధ
ఆ. పుట్లు గలుగు దాని ♦ నేమఱ కుంతుము, వారియవుల నన్న ♦ వారు మిత్రు
లగుదు రెల్లభంగి నధిప యుదాసీను, లట సమీపవర్తు ♦ లైనవిభులు. 66

క. వీరలసప్తాంగంబులు, నారసికొని యునికి కార్య ♦ మవనీశ సదృ
శ్యారబలుఁడైననృపుతోఁ, గారవమున సంధి సేయఁ♦గా వలయుఁ దగన్. 67

తే. దైవ మానుష బలములు ♦ దఱిఁగి యుండు
నెవ్వరికి నెవ్వ డప్పుడ ♦ యొసక మెసఁగ
వైర మతనితోఁ బాటింప ♦ వలయుఁ జెఱచు
టప్పనము గొను టర్హత్వ ♦ మరసి నడపు. 68

క. నడపునఁ గొల్వుచ్చుగ నగు, నెడయు విడిసి యుండి చెఱచు♦నిక్కయు నీ వే
ర్పడఁ గనుఁగొని యందర్హము నడపుము నిజసైన్యరక్ష♦ణము వలయుఁజుమీ. 69

క. ప్రెగడలమనసులు విరసము, లగుగతి నడపు రిపురాజ్య♦ మరసి విభిన్నం
బుగఁ జేసి కలఁచి పైకొని, జగతీవర కొనఁగవలయు ♦ సౌకర్యమునన్. 70

ఆ. బలము లెసఁగ దైవ♦బలమును కలిగి లో, గుట్టుచేటు లేని♦యట్టినృపతి
వలన మత్సరంబు ♦ వలదాశ్రయంబుచ్ఛ,దంబుపొందు వడయఁ♦దగు నృపాల. 71

—♦ ధృతరాష్ట్రుఁడు ధర్మజునకు శత్రురాజుల జయించు తెఱంగు సెప్పుట. ♦—

ఆ. కుదుప నిచ్చుతఱియఁ ♦ గురువర [1] రక్షించు, నవసరంబు నెఱిఁగి ♦ యరినృపాలు
నీవు ధీరవృత్తి♦నికఁ బ్రాఁకఁ బోనిమ్ము, క్రమ్మఁ కపిల యనఁగ ♦ గ్రమ్మి [2] చెఱుపు.

సీ. ఉత్సాహశక్తియు ♦ సార్వశ మంత్రశ, క్తియుఁ బ్రభుశక్తియుఁ ♦ గెలనివాని
కిని నీకు నిట్టివి ♦ యను తారతమ్యముల్, వెరవునఁ బరికించి ♦ వేర మెత్త
వలయుట నెఱి గల్గి ♦ పలుకక యుండంగ, దగుట యూహించు ట♦త్తమవిధంబు
మూలబలంబును ♦ మొత్తాలవారును, మిత్రబలంబును ♦ శత్రుబలముఁ
ఆ. గానసంబుబలముఁ ♦ గైజేతిగాండ్రును, నైన యట్టిబలము ♦ లారు నరసి
యుచితకాలదేశ♦యుక్తంబుగఁబన్ని, కొనఁగవలయువాఁ♦కొలదు లెఱిఁగి. 73

తే. సంపదల నావదల నొక్క♦చంద మగుట

1. జ. శంకించు. 2. గ. చెఱుపు.

విశ్రుతి నొందుట యాబల • వితతులందుఁ
గాంచి యెల్లప్పుడును హిత • కారి యైన
బలము నెక్కుడుగాఁ బ్రోవు • భరతముఖ్య. 74

క. [1]వసుల గెలిచి నిర్భయముగ, ధరణిఁ బ్రజం గాచువెరవు • ధర్మపథమునం
బరిపాలించిన వెలయుం గురువర కృప పెంపు వదల • కుము ప్రజలయెడన్. 75

క. వినికి గలిగి రక్షించుచు ననువున దయతోడి పాడి • నాయతు లెల్లం
గొనుచుఁ దగ నేలి ఘనుఁ డొం,డనరాజన కుర్వి కామ • ధేనువ కాదే. 76

సీ. ధర్మమార్గంబున • ధరణిఁ బాలించిన, నైహికసుఖములు • నగ్గలంపుఁ
బొగడును బరలోక • భూరిసౌఖ్యములను, సిద్ధించు విపులద • క్షిణలు వెట్ట
యశ్వమేధ ప్రము • ఖాధ్వరంబులు పెక్కు, లాచరించుటకంటె • నధిక మండ్రు
మేదిని ప్రజల న • త్యాదరంబున గరు,ణాతిశయంబు మ • ధ్యస్థతయును

తే. గలిగి బిడ్డల నరసిన • కరణి గాఢ,రక్షణం బొనరించుట • రాజవర్య
వినుము తమ్ముల నీగి ము • న్ననల ననుది,నంబు గొనియాడు మానంద • నంబుగాఁగ.

చ. నరవర రాజనీతులు జ • నస్తుతుఁ డైన నదీతనూజుఁ డున్
హరియుఁ బరాశరాత్మజుఁడు • నాదిగఁ గల్గిన పెద్దలెల్ల నీ
కరయఁగఁ బెక్కు సెప్పిరి మ • దాత్మయు నీదెసఁ బ్రీతి [2] పెద్దయుం
బొరయుట నేనుఁ గొన్ని యిటు • వోలినభంగి నెఱుంగఁ జెప్పితిన్. 78

క. [3]నిత్యవిధిసద్వివేకము, సత్యవ్రతశీల ధర్మ • సారజ్ఞ భవ
న్మత్యాకలితము లైనను, నిత్యంబును వృద్ధసేవ • నిమ్ముఁ జలుపుమీ. 79

సీ. అన విని ధర్మజుం • డంబికాపుత్త్రుతోఁ, నాపగాసుతుఁడు లేఁ • డబ్జనాభుఁ
డాత్మపురంబున • కరిగె [4]వాత్సల్యత నీవు దక్కఁగ నాకు • హితము సెప్ప
నొడయుఁ డెవ్వఁడు భవ • దుపదిష్టపథమున, నిష్ఠమై నడచెద • నెమ్మనమున
నీవు ప్రీతిని బొందు • నృపముఖ్య నావుడు, నాతఁడు సంతస • మంది యలసి

ఆ. నధిప విశ్రమింపు • మధికశ్రమంబు నా,తనువునందుఁ జెందె • నని తగంగఁ
బోవఁ జెప్పి బాంధ • వావళి కభిముఖుఁ, డయి నిజాలయముల • కరుగఁ బనిచె. 80

వ. తాను నభ్యంతరగృహంబున కరిగి సుఖాసీనుం డై యున్న నయ్యాత్మజననాథుతో
గాంధారి దేవి వనంబున కెపుడు విచ్చేయువాఁడ వని యడిగిన నాభూవల్లభుం
డద్దేవి కిట్లనియె. 81

క. మాతండ్రి పరాశరసుతు, చేతం బడసితి ననుజ్ఞ • శీలపరతన్
పేతుఁ డగుధర్మతనయుఁడు, ప్రీతి నొడంబడియె బంధు • బృందయుతముగన్. 82

ఆ. ఇంకఁ దడయ నేల • యింతి వే వెడలుద, మట్లు గల్లజూద • మాడి పావ

---

1. గ. అరుల. 2. క. బద్ధముం- ట. బంధముం. 3. గ. నిత్యము వినికి వివేకము-జ. నిత్యవినీత వివేకము. 4. ట. వత్సల నీవు, దక్కఁ నెవ్వఁ డాకు హితంబు సెప్ప.

భాగులైన నీడు ¹పట్టుల సుగతికి, ననుచు వాఁడె దపము నతిశయము ననె. ౬౪

— ధృతరాష్ట్రుండు వనవాసంబునకుం బురజనులచే ననుజ్ఞ గొనుట —

వ. అని పలికి యమ్మునివర్యుం డక్కుమొగంబయి వారికి సుగతి గల్గునట్లుగా నిప్పుడును గొన్ని పుణ్యక్రియ లజాతశత్రు ననుమతితో నాచరించి పోవుటయ గాక యని నిశ్చయించి తనకుం దపోవనగమనంబునకై పౌరుల యనుజ్ఞ గొనవలయు నని పాండవాగ్రజునకుం జెప్పం బనిచిన నతండు దగు పురజనుల నెల్లను ²నొక్కెడ సేసి వెలార్చికొనుచు నఖిలబంధుమిత్త్రులునుం దానును వచ్చి ధృతరాష్ట్రమందిర ద్వారపురోభాగంబున నిలిచె నయ్యంబికేయుండు గాంధారియును దోడరా వెడలి వారిసన్నిధికిం జని బ్రాహ్మణక్షత్త్రియవైశ్యశూద్రసంకులంబైన యన్నగరజనప్రకరంబు నుద్దేశించి. ౬౫

సీ. కౌరవకోటియు మీరుఁ బెద్దయుఁ గాల, మనఁగి పెనఁగి యన్యోన్యసంభృ
తాధికస్నేహులరై ప్రవర్తింతిరి యనఘవర్తనులార వినుఁడు నాదు
పలుకు వృద్ధునకుఁ దపశ్చరణంబున, కై వనంబున కేఁగు టర్హకర్మ
ముచితకృత్యంబు లోజ మీ రెఱిఁగిన, యదియ కా మది ముదమార మీర

ఆ. లెల్ల నా కనుజ్ఞ యిచ్చి కానకుఁ బుచ్చుఁ, డనుడు సర్వజనులు వస్త్రపిహిత
వక్త్రులగుచు గద్గదికఁ బలుకంగ, నార్తి దోఁప నేడ్చి రధిపముఖ్య. ౬౬

వ. విని ధృతరాష్ట్రుండు వారి కిట్లనియె. ౬౭

సీ. ప్రజ ముద మొందఁగఁ బాలించెఁ బుడమి శం
తనుఁ డనంతరము శాంతనవుచేత
రక్షితుఁ డగుచు మీరలు ప్రీతిఁ బొదల వి
చిత్రవీర్యుండు నిర్భీతి యేలెఁ
బడసి పాండునృపాలుండు మీరు హ
ర్షింపంగ భూమి రక్షించెఁ బిదప
ధర్మనందనుని చందము మీ రెఱింగిన
యది సత్యధర్మాత్ముఁడైన యితని

తే. ననుసరింపక యన్యాయమాచరించి, దుర్నయంబున నిల యేలె ద్రుంచెఁ గులము
నుర్విఁ గల భూపతులను దుర్యోధనుండు, వానిదుశ్చేష్టలకు మూల మే నగాదె.

వ. అది మీ మనంబులం బెట్టుఁడు. ౬౮

క. మహి లెస్సగ రక్షించిన, మహితగుణులయన్న కొడుకు మనుమం డని నా
కు హితంబు గోరి కరుణా, సహితుల రై యిం డనుజ్ఞ సర్వప్రముఖుల్. ౬౯

వ. అని యప్పు డజ్జనంబుల మనంబుల లేకున్నను దనకుఁ జెల్లఁ గడించి యరణ్యగమనానుజ్ఞాకరణంబునకుం బ్రార్థించి యమ్మహీభుండు వెండియు. ౭౦

---

1. గ. పట్ల సద్గతికిని. 2. చ. ఒండు సేసికొని వెలార్చి.

ఆ. వృద్ధ కృపణ పుత్త్రవిరహిత గాంధారి, యీ నెలంతఁ జూచి • దైవ మీర
లకట కాననమున • కరుగుట మే లని, మా కనుజ్ఞ యిండు • మాన్యులార. 91

వ. అని పలికి పాండవాగ్రజుం జూపి. 92

సీ. తమ్ములనయము నీలిందు దిక్పాలక [1]మధ్యభాసితుఁ డైన • మఘవుఁ బోలి
మహనీయవిభవసమగ్రత వెలిఁగెడు, నేమిట నేమఱ • కెపుడు మీర
లీతనిఁ బొదివి సంప్రీతిగ వర్తింపుఁ, డయ్య యిల్లడ యిమ్మహానుభావు
నిడితి మీకడ మిమ్ము • నెల్లభంగులఁ దన పరిపాలనంబునఁ • బరమసుఖులు

ఆ. గా నొనర్పువాఁడుగా నప్పగించితి, వాఁడ నేను మీకు • వేఁడి దాఁకు
వట్టుగాఁ జరింప • నస్మత్కులీనుల, కధికదుఃఖకారి • నైతిఁ గాని. 93

క. అరయ నెన్నం డైనను, మీరలు నా కెగ్గు గాఁగ • మెలఁగుట లే దో
పౌరవరులార నన్నున్, గారవమున ననుప రయ్య • కాననమునకున్. 94

వ. అనినం బౌరజనంబు లేడ్పులు మ్రింగికొని యొండొరులం జూచుచు నూరకున్న
నమ్మహీశ్వరుండు మఱియును. 95

సీ. సాధుచారిత్రయు • శాంతయు నైన యిగ్గాంధారియును నేను • గాఢవినయ
మార మీ చెలి విట్లు • గోరుచు నున్నార, మఖిలధర్మాభిజ్ఞుఁ • డగు పరాశ
రాత్మజుండును ధార్మికాగ్రణి పాండవాగ్రజుఁడును నాకు నరణ్యగమన
మునకు నిచ్చి రనుజ్ఞ మోక్షప్రాగేతాదల గదియించి మిమ్ము వేఁడెదఁ గృపాధ్యు

తే. లార యనుమతి సేయుఁడు • పోఁదు ననుడు, వార లుత్తరీయంబులు • వదనవినిహి
తములుగాఁ జేసికొని రోదనము రవంబు, లెసఁగఁ జేసిరి విను ధరణీశవర్య. 96

వ. అ ట్లేడ్పి యుడిగి తమయంతవట్టునుం గూడికొని కార్యవచనంబు లార్యచరితుం
డును జతురాలాపకల్యుండును నగు [2]శంబు వనువిప్రోత్తమునకుం జెప్పి యిత్తెఱం
గున ధృతరాష్ట్రునితో నాడు మని నియోగించిన నాతం డారాజు నగ్రభాగంబున
జేరి సవినయంబుగా ని ట్లనియె. 97

— • ధృతరాష్ట్రునితో శంబు వనువిప్రుఁడు పౌరజనసమ్మతి చెప్పుట • —

సీ. భరతవంశోత్తమ • పౌరజనంబులు, దమమాటలుగ భవత్సన్నిధాన
మున వ న్నుపన్యాస • మొనరింపఁ బంచిన, యట్టిభాషణము శ్రేష్ఠాగ్రబుద్ధి
నవధరింపుము మీ మహాన్వయంబున మహీవిభులయం దొప్పమి • వెదకిమైనఁ
గానము మము మీరు • గన్నట్టిప్రజల నెట్లట్ల రక్షించితి • రాదరమున

తే. వినుము దుర్యోధనుండు సేసినయనర్హ
మొక్కటియు లేదు నినుఁ ద్రిలోకోత్తముండు
సత్యవతికొడు కే మని • సమ్మతించి
పంచె దానిన చేయుము • పరమనియతి. 98

1. గ. మధ్యభాసితశతమఖుఁడుఁబోలె. 2. క. చ. ట. శాకల్యుం డను.

క. అడలేడఁబడఁగా మమ్మను, విడిచితి గురుసై నశోక ♦ వేదన యే మిం
చుడిపికొను నప్పటికిఁ ద్రోడ్పడు నీ దగు సద్గుణములు ♦ బంధుసులువోలెన్. 99

ఆ. భ్రాతి శంతనుఁడు విచిత్రవీర్యుఁడుఁ బాండు, రాజు నెట్టు లట్ల ♦ రాజరాజు
ప్రజకు సంతసముగ ♦ బాలించె నీయందు, నతనియందుఁ గలదె ♦ యధిప యొగ్గు.

వ. భీష్మద్రోణకృపద్రౌణికర్ణకృతవర్మశల్యు లొక్కదిక్కును భీమార్జుననకులసహదేవ
ద్రుపదవిరాటసాత్యకు లొక్కదెసయు నై విధిప్రేరణంబునం బోరి వారివలన
నఖిలక్షత్రియసంక్షయం బావహిల్లె నది యొక్కదుర్యోధనుచేతన యయ్యెనె
యట్లుంగాక రణంబు రాజుల కుత్తమధర్మంబ కాదె యందుల మరణంబును
సుగతికారణకల్యంబు నీసుతుండు సహాయులుం దానునుం బుణ్యలోకసౌఖ్యం
బునం బొంది యున్నవాఁడు ధర్మాచరణశాలి వగు నీకును సుగతిప్రాప్తి సులభంబ
యగు నిట బ్రాఁదటికి మాభాగ్యంబునం జేసి పరమకృపాభరితు లైన పాండవులు
మాకు రక్షకులుగాఁ బడసితి మాకర్ణింపుము. 101

తే. స్వర్గమైనను బాలింపఁ ♦ జాలువారు, వీరలకు భూమిపాలన ♦ విధి యనంగ
నెంతపని వీరిచేతికి ♦ నిచ్చితిపుడు, మమ్ము నెల్లవిధంబుల ♦ మనిచి తధిప. 102

సీ. ధర్మపుత్త్రుఁడు దీర్ఘ♦దర్శి మహోదాత్త, సచివుండు బంధుర♦క్షణపరుండు
రిపునెఱ నైనను ♦ గృప పెద్ద భావసం, శుద్ధియుఁ బ్రతిభయు ♦ సున్నతంబు
నితనికి వెన్నతో ♦ నిడినవి యొకులను, దనయట్ల కాఁ జూచుఁ దమ్ము లెల్ల
సన్నుతి కెక్కిన ♦ సకలగుణముల నిమ్మహితాత్ము చందాన ♦ మమ్ముఁ బ్రోచు

తే. మాత్రయే దేవవిషయస♦ముంచితాగ్ర, హారసజ్జనమాన్యంబు ♦ లైన గ్రామ
ములు దగంగ రక్షింతురు♦వెలయఁ దాను, నిత్తు రాఢ్యులు దేవము♦హీసురులకు.

క. మృదువులకుఁ జాలమృదువులు, విదియశా వినుము పాండ♦వేయులు గఱుబె
ట్టిదులు బెడిదంపువారికి, మదలోభిత్వములు లేవు ♦ మందున కైనన్. 104

క. శూరులు శాంతస్వాంతులు, పౌరజనప్రకరజాన♦పదచయనిత్యా
పారప్రమదాపాదన, పారగు లతుల గురుభక్తి ♦ పరతంత్రాత్ముల్. 105

తే. గొంతిదేవికిఁ గొడుకు♦కును మానసముల, గరుణ యగ్గలమై యుండుఁ ♦ ధరణినాథ
పౌరులందును జనపద♦ప్రజలమెడను, నాకుదురు మేలు దమ కగ్గ♦మైనయపుడు.

తే. వీర లెప్పుడు మును నీవు ♦ గారవించు
టెఱిఁగి మన్నింతు రమలిన♦హృదయ కలిత
దక్ష ధర్మజుపై రాజ్య♦తంత్రభార
మిడి మనంబున నూఱడి ♦ యిచ్చ నలుపు. 107

వ. అని చెప్పి నిట్లు విప్రముఖంబులం బౌరులభాషణంబులు విని ధృతరాష్ట్రుండు
ప్రీతుండయి సముచితప్రకారంబుల నజ్జనంబులం గ్రమంబున వీడ్కొలిపి
కౌంతేయాది బంధువులను మిత్త్రులను నిజనివాసంబులకుం బోవం బం

గాంధారీసమేతుండై యభ్యంతరమందిరంబున కరిగి యద్దినశేషంబును రాత్రి
యుం దగు వర్తనంబులఁ గడపి మఱునాఁడు విదురుని రావించి మృతు లయిన
బాంధవుల కెల్లను సవిశేష శ్రాద్ధంబులు సేయుతలంపు పుట్టి కొన్నిదినంబులు
పయనంబు మానితి మానితమాననీయచరిత్రుం డగు ధర్మపుత్త్రుపాలికిం బోయి
నీ విక్కార్యంబు సంఘటింపు మని పనిచిన నతం డట్లు చేసెద నని చని యనుజ
సహితుం డై యున్న యన్నరేంద్రునిం గాంచి. 108

సీ. మీతండ్రి సురనదీసూతిబాహ్లికులకు, సోమదత్తునకుఁ దత్సూనునకును
దుర్యోధనాదిసుతులకును దక్కను, గలుగు బంధులకు నుత్కర్ష మెసఁగ
శ్రాద్ధముల్ సేయువిచారంబు దోఁచిన, మసలేఁ గార్తికపౌర్ణమాసిదాఁక
వనమున కరుగఁ డప్పని నీచేఁ బోలిన, యట్టులు గావింపు మనిన నాతఁ
తే. డెంతయును వేడ్క నమ్మాట కియ్యకొనియె
నర్జునుండును బ్రీతుఁ డై యర్హ మనియె
భీముఁ డపుడు [1]గమర్చినమోముతోడ
విదురువదనంబు సూచుచుఁ బెదవు లదర. 109

వ. ఏమేనిం బలుకం జూచిన భీభత్సుండు మెలుపున నతని వారించి యల్లన యి
ట్లనియె. 110

సీ. రాజు వృద్ధుఁడు ధృతరాష్ట్రుండు భీష్మముఖ్యజ్ఞాతులకు శ్రాద్ధకర్మ మాచ
రింపఁ దలంచి యర్థించె భవజ్జిత, ధనధాన్యములు నీవు దానికియ్య
కొనమి యశంబునకును ధర్మమునకు వి, ధ్వంసంబు సేయదే ధర్మతనయ
తలఁచినపని విఘ్నితము సేయఁ దగునయ్య, మనకు నయ్యంబికాతనయుఁ డొల్లి
ఆ. వేఁడికొందు మతఁడు వేఁడెడుఁ గానకుఁ నేఁగుచుండి మనల నిష్ట డింత
సూడ వలదె యొండు లాడక యప్పని, సలుపు టొప్పు బాహుశాలిసేకు. 111

క. అని చెప్పఁగఁ జెవి [2]దారిచి, విని ధర్మతనూజుఁ డంత విజయునిఁ బొగడ్తా
మనమున నమ్మాటల కియ్యనిలతనయుఁ డిట్టు లనియె నన్నరుతోడన్. 112

— భీముఁ డర్జునితో ధృతరాష్ట్రునుద్యోగంబునకుఁ బ్రతికూలించి చెప్పుట —

క. మును చేసినయవి సాలవె, విను గాంగేయాదిబంధువితతికిఁ దగ నిం
కను శ్రాద్ధంబులు వలసిన, మనము దగమె చేయ దుష్టమతి యతఁ డేలా. 113

క. మఱచితె యాతఁడు మనలం, బఱచినబన్నములు భీష్మబాహ్లికముఖు ల
త్తఱి నెట్ల వోయిరి వారల, నెఱుఁగమె మన మట్టిబంధు లేటికి మనకున్. 114

వ. వారివిషయం బైనమేలునకు మాటాడుట యెగ్గు గా దాకర్ణింపుము. 115

తే. కర్ణునకుఁ జేయవలసినగారవమున, గొంతి యింకను శ్రాద్ధ మత్యంతవిభవ
ముల్లసిల్లంగఁ జేయుఁ గాకుచితనిరతి, యావిధమునకు మాటాడనూరె యెగ్గుం

1. క. గనలిన. 2 గ. వాలిచి.

117

వ. అని పలికి వెండియు.

సీ. పాంచాలి నవమానపఱచిన తెఱఁగును, నయ్యంతి వెనుక రా ◆ నడవిఁ గలయ
ధర్మజుఁ డన్నచందంబును మది గీఱి, [1]యుండక మఱపెట్టు ◆ లోలసె నీకు
నాంబికేయుఁడు దండ్రియగుట నాఁడట వోయె. భీష్ముండు మొదలగు ◆ పెద్దవారి
బాంధవం బేమయ్యెఁ ◆ బార్థ యీవిదురుఁ డెఱుంగఁడే వారల ◆ భంగి యునిన

ఆ. ధర్మజుండు భీముఁ ◆ దగువచనముల నదల్చి నరుఁడు మఱియుఁ ◆ దగఁడె పూజ
కాంబికేయుఁ డిట్టు ◆ లనకుము మనకు న, గ్రజునివనుపు సేఁత ◆ వ్రతము గాదె.

క. అని భీము నదిమి విదురునిఁ, గనుఁగొని మాతండ్రి పుణ్య ◆ కర్మము లెమ్మెఁ
దనబంధులకై చేయఁగ, మనంబునం దలఁచె నా స ◆ మంచితభంగిన్. 119

క. నాయింటిధనము గై కొని, చేయఁగలాఁ డమ్మహీశు ◆ చిత్తము సుతో
పాయత్తంబుగ వేగమ, పోయి యనఘ చెప్పు మవ్వి ◆ భుఁడు ప్రియమందన్. 120

చ. అన విని మెచ్చి ధర్మసుతుఁ ◆ డర్జునునిం గొనియాడి యాదరం
బున విదురుం గనుంగొని ప్ర ◆ భూతవిధానములన్ నిజేచ్ఛ నా
ధనమును నర్జునార్థమును ◆ దాఁ గొని శ్రాద్ధము లాచరించు వాఁ
డనఘ కురూద్వహుం డిది మ ◆ హాత్మకు నిం పని విన్నవింపుమీ. 121

122

వ. అని చెప్పి మఱియు నిట్లనియె.

క. వనవాసాయాసంబుల ననయంబును నలఁగి దాని ◆ నాత్మ నిడి మరు
త్తనయుండు పెక్కులాడెఁ ద, గనిమాటల దీన రాజుఁ ◆ గనలకు మనుమీ. 123

క. ఇతఁ డేమి యన్న నే మగు, ధృతరాష్ట్రుఁడు మాకుఁ బరమ ◆ దేవత విను స
మ్మతిఁ దత్ప్రసాదముం బడసితి మేమును దత్కృతాభి ◆ షిక్తుల మనఘా. 124

125

వ. అని పలికి యప్పుడమిఱేఁడు విక్లబవదనుం డగుచు.

క. మాతండ్రి నిష్టవిధములఁ, బైతృకవిధు లాచరింపఁ ◆ బంపుము [2]రథ్య
వ్రాతకనకగోగజములఁ, జేతఁ గొదవ నర్జునుండుఁ ◆ జేర్చుచు వచ్చున్. 126

క. గ్రామములు దేవతలకును, భూమిసురులకును గురుప్ర ◆ భువు నిమ్మనుమీ
పో మసలితి చెపు మాతని, కీమాటలు నలయుపనుల ◆ కీవు మెలఁగుమీ. 127

క. అనినఁ బ్రియ మంది విదురుఁడు, సని యానృపుతో నజాత ◆ శత్రుకడకు నీ
పనిచినపనికిం బోయితి, వినిపించితిఁ దెఱఁగతెందు ◆ విని మోదమునన్. 128

క. నరువలను నూఁచి నతఁడుం, బరమప్రియభరితుఁ డయ్యెఁ ◆ బార్థివవర య
య్యిరువురుఁ బ్రాణంబులు దాఁ, పరు నీకును ధనము దాఁచు ◆ పని గలిగెడినే. 129

క. చేయుము విచ్చలవిడి గాం, గేయప్రముఖులు నిరస్త ◆ కిల్బిషులై మో
దాయత్తచిత్తులుగ భూ, నాయక శ్రాద్ధములు జగము ◆ నం బాగ డెసఁగన్. 130

చ. కనకము మేలిరత్నములు ◆ గ్రామములున్ హయగోవ్రజంబులుం

1. జ. యుండఁగ. 2. ట. రత్నవ్రాతకనకగోహయములఁ, జేతోరతి నర్జునుండు.

దనియెఁగ నిమ్ముల సర్వవసుధాసురకోటులకున్ నిజేచ్ఛ నీ
తనయులు పుణ్యలోకసుఖధాములు లై వెలసిల్లునట్లుగా
ననుటయు నాంబికేయుహృదయంబున మోద మెలర్చె భూవరా. 131

చ. పదపడి భీముఁడాట లోకభంగి నెఱుంగఁగ జెప్ప వాఁడు దు
ర్మదుఁ డవి పాటి గావు కురురాజమహాత్తర పెట్ట కుండు నీ
హృదయమునందు వాని నని యేర్పడ ధర్మజపార్థవాక్యముల్
విదురుఁడు సెప్పె సంతసము వెల్లిగొనంగ ననేకభంగులన్. 132

ఆ. అట్లు సంతసిల్లి యధిప కార్తికపౌర్ణ, మాసి నవ్విభుండు మహిత భూమి
దేవకోటి నెల్ల రావించి యంచిత, శ్రద్ధఁ జేయఁ దొడఁగె శ్రాద్ధవిధులు 133

సీ. కనకాదివస్తువుల్ గడు వేడ్క ధర్మనందనుఁడు పుత్త్రేర నుదాత్తభంగి
బాహ్లికునకు గంగపట్టికి సోమదత్తునకుఁ దదీయపుత్త్రునకుఁ దొలుత
[1]నంచితశ్రాద్ధంబు లాచరించె సుయోధనాదికుమారుల కందఱకును
బేర్వేరఁ గ్రియ[2]లు నిర్వాపవిధంబులఁ దగ నొనరించె సింధురాజునకుఁ దక్కఁ

ఆ. గలుగుబంధులకును వలయురాజులకును, ద్రోణునకును బుద్ధిఁ దోఁచినట్టి
యిష్టజనములకు నహీనభవ్యప్రకారములఁ బారలౌకికము లొనర్చె. 134

చ. అతులిత రత్నకాంచనగవాశ్వవిభూషణవస్త్రకన్యకా
క్షితిముఖవస్తుదానములు కీర్తన కెక్కఁగ నవ్విభుండు ను
వ్రతుఁ డయి చేసెఁ బంచదశవాసరముల్ నిజదానలౌల్య మ
ప్రతిహతవృత్తిఁ జెల్ల విని పాండుసుతాగ్రణి ప్రీతిఁ బొందఁగన్. 135

ఆ. భూమిదానవిధులు భూవర యొకమాత్ర, నంబికాతనూజుఁ డాచరింప
నంతఁ బోక యూళు లగ్రజన్ములకు నీ, నతని బనిచెఁ బాండవాగ్రజుండు. 136

—ధృతరాష్ట్రుఁడు గాంధారీసహితుం డై వనంబునకుఁ బోవుట—

వ. పదిదినంబు ప్రియంబు పెంపున హృదయంబు పల్లవింప నాభూవల్లభుం డనేక
గ్రామంబు లగ్రహారంబులు గావించి గాంధారరాజు మొదలయిన నిజబంధు
వులకు బహుళదక్షిణలుగాఁ బారలౌకిక క్రియలు సేసె నిట్లు ధృతరాష్ట్రుండు
భారతరణంబున మరణంబు నొందిన బంధులోకంబునకుం బుణ్యలోకసౌఖ్యాతి
శయపదంబు లగు పరమశ్రాద్ధంబులు నిర్వర్తించి కృతకృత్యుండై సర్వకృత్యం
బులుం జలిపి పాడ్యమినాఁడు కేవకడ బుద్ధిసమేతుం డై యిష్టి నడపి పాం
డవులను తక్కటిబంధువులను మిత్త్రులను రావించి వనవాసంబునకు సంక
ల్పంబు సేసి సకలభృత్యజనంబులకు నర్థధనంబు లిచ్చి గాంధారీసమన్వితుం
డై వల్కలాజినంబులు ధరియించి యక్షతగంధపుష్పంబుల గృహంబుఁ బూ
జించి సర్వపదార్థంబులు బరిత్యజించి యుద్దేశయుఁ గదిసి నడవ యాజకు

1. క. ఖడ్గినై [illegible]. 2. ఆ. లలితోచితవిధంబుల [illegible]నరించె.

లగున్నలు నుపకరణంబులును ధరియించి ముందటం జేరువ వరుగ వరుగ వెడలె
నట్టియెడ నే తెంచి. 137

క. గొంతి మొదలైనకౌరవ, కాంతాజనులెల్ల నెవ్వగలం బొగులుచుం బ
ద్మాంతరంబుల బాష్పసలిల,సంతానము లురలం దోన చనుదేరంగన్. 138

వ. అజ్జనపతి సనుచుండె. 139

తే. పాండవాగ్రజుం డక్కురుభర్తవలను, శోకదీనుండై తప్పక చూచి యేడ్చి
హా మహారాజముఖ్య యెందరిగెదనుచు, నొడలు కంపింపం జదికిలంబడియె నధిప.

క. నరుం డనునయించె కసన న,న్నరపతి నెత్తుచును దా నంనయమున్ వనటం
బురపురం బొక్కెం గురుభూవర యుద్దెస తెలుంగు రాదు వాకువ్వంగన్. 141

వ. భీమసేననకులసహదేవులును గృపయుయుత్సుసంజయులును ధౌమ్యాదిధరణీ
సురులును శోకవ్యాకులత్వంబు నొందిరి గొంతి యడలుచు గాంధారికరంబు
నిజస్కంధంబున నిడికొని నడవ నయ్యంధనృపతి గాంధారీస్కంధభాగకలిత
బాహుం డై పోవుచుండె నప్పుడు పాంచాలియు సుభద్రయుం జిత్రాంగదయు
నులూపియు సపుత్రి యగు నుత్తరయు మఱియుం గలయట్టి మగువలుం గురరీనిచ
యనాదంబులచందంబు దోంప నాక్రందనంబు సేసి రయ్యవస్థ జూడంబునాండు
పాండవులు పురంబు వెలువడినప్పటిదశం బోలియుండె నట్లు ధృతరాష్ట్రు
కాననగమనంబు నిశ్చితం బగుటయు నాబాలవృద్ధంబుగాం బురజనంబు గనుం
గొనం జనుదెంచిన. 142

ఆ. వచ్చి రెండకన్ను వానకన్నును నెఱుం, గనిపురంధ్రులెల్లం గరము వంతం
దలరు నంతరంగములతోడ నక్కురు, వృద్ధుం జూడ నార్తివికలగతుల. 143

క. నేలను హర్మ్యంబులపై, నోలి నిలిచి చూచుమానవోత్కరములలో
కాలాపవిలాపంబులు, నేలకు మింటికిని నడుమ నిండి చెలంగెన్. 144

వ. ధృతరాష్ట్రుండును బురద్వారంబు నిర్గమించుచుండి సకలపౌరజనంబుల నిలువం
బనిచె విదురుం డక్కురువృద్ధునితోడ వనంబున కరుగుట దృఢనిశ్చయుం డై
పలికె సంజయుండు నవ్విధంబువాం డయ్యెం గృపాచార్యుండును యుయుత్సుండు
నత్తెఱంగుమాటలాడిన నాంబికేయుండు వారిని వారించి ధర్మనందనున కప్పగించి
నిలిపి కోడండ్ర నెల్లను సముచితవచనంబుల మరల నియమించిన వార లానైచి
త్రవీర్యునకు గాంధారికిం బ్రణమిల్లి బాష్పంబులు వదనంబున వెల్లిగొనుచుండ
నడ్కొనియును బాండురాజమహిషిం జూచికొని వెనుకం జనుచుండె నాసమ
యంబున నజాతశత్రుండా గొంతి కిట్లనియె. 145

క. మాయయ్య కాననమునకుం, బోయెడు నే నితనితోడం బోయెద నన్నా
పాయక్షుండనై యుండెద, నీయువిదలం గొనుచు మగిడి యేంగుము తల్లీ. 146

చ. అనుటయు గొంతి యక్కురుకులాగ్రణి కిట్లను నెప్పు డోడంగా

వనమున కేఁగుదెంచుట జనస్తవనీయ చరిత్రుఁడు విభుం
డనుమతి సేయునే యుడుగు ♦ మావని యియ్యమ యత్త నాకు నీ
మనుజవిభుండు మామ గరిమంబుగ వీరలఁ గొల్చి పోయెదన్. 147

తే. ఇతని కియ్యకొనుము విను ♦ మీవ చూవె, వలఁతి శుశ్రూష సేయంగ ♦ వత్స మీర
లావనికి నేర్తురే వీర ♦ లడవి కరుగ, నింట నుండంగ నామన ♦ మియ్యకొనునె.

వ. అనిన నాధర్మపుత్త్రుండును దమ్ములు నుచితవచనంబుల వేఁడికొనిన సద్దేవి యగ్రతనయుం గనుంగొని. 149

క. వీరలయెడఁ గొడుకా [1]యుపచారంబులు వలుకుదున వి♦చారము విడు మే
నీరూపంబున నిలువన, గారవమున నిది వ్రతంబు ♦ గాఁ గైకొంటిన్. 150

వ. అని పలికిన నిజస్కంధంబున నున్న గాంధారికరంబుఁ గరంబు నయంబునం బాపి యతనిదిక్కు మొగంబై 151

క. నీ వేఁడియు ననుము సహా, దేవుని నేమఱక యరయు ♦ దినకరసుతునిర్
భావమునఁ దలఁపు మే నా, దేవసుతునిపుట్టు వడఁచి ♦ తిం గపటమునన్. 152

క. అది పాపము దానికి నా, మది నెప్పుడు వగతు విమల ♦ మానస యక్కీ
డు దొలంగునట్లుగా స, త్పదార్థదానములు సేయు ♦ తాత్పర్యమునన్. 153

ఆ. అవ్విధమునఁ గర్ణుఁ ♦ డాఱడిఁ బోయిన, నాదుమానసంబు ♦ వోదు నూఱు
పఱియలై తలంప ♦ జలుదాతఁ జేసిన, వారు గాఁగ వలయు ♦ వంశవర్యు. 154

క. నీవును దమ్ములు భక్తిభ, రావేశముతోడఁ దలఁపుఁ ♦ డమ్మహితాత్మున్
ద్రోవది నెప్పుడు దృఢసం, భావన మన్నింపు మయ్య ♦ పౌరవముఖ్యా. 155

క. భీమార్జుననకులముఖ, కామంబులు సఫలతా ప్ర♦కాశంబులు గా
భూమీశ యరసి యొనరుపు, మేమిట నేమఱకు ధర్మ♦మిల యరయునెడన్. 156

వ. అని పలికి నానిశ్చయంబు శిథిలంబు గాదు మీరు మరలుం డని పలికినం బాండవాగ్రజుండు విషాదం బంది యూరకుండె భీమాదులు డెందంబులు గొందలం బంద నశ్రులోలుకం దలలు వాంచి రిట్లమ్మొత్తంబుగ మనంబు [2]గుదివడుచు మందంబై చెల్ల ధృతరాష్ట్రుండు [3]గొండొకయెడ గలుగం జనియె నాధర్మతనయుండు తల్లియాననం బాలోకించి. 157

— ♦ ధర్మరాజు కుంతిని వనంబునకుఁ బోవలదని ప్రార్థించుట. ♦ —

సీ. ఇది యేము సేయంగ ♦ నెత్తికొంటిమ్మాట, యాడకు మేను ని ♦ న్నడవి కేఁగఁ
బనుతునే మమ్ముఁ దొల్లి ♦ పనిచి వనుల్ గొను, భంగిన సామ్రాజ్య ♦ భారనిర్వ
హణము తెల్లంగును ♦ నప్పటికప్పటి, కిట్లని యానతి ♦ యిచ్చినడపఁ
బంపక యున్న నో ♦ప్పమి రాదె మాకు ము, న్నీవును గృష్ణుండు ♦ నేవిధమున

తే. నడపితిరి కార్య మెఱుఁగవే ♦ యడలు వెల్లి

1. క. యుపచారంబులు. 2. గ. సుడివడుచు. 3. గ. గొండుకయెడ.

మమ్ముఁ బాంచాలి నిటు ముంచి యమ్మ యడవి
నెట్లు యుండెద వనఁగ నయ్యింతి బాష్ప
పూర్ణనయన యై యూరక పోవుచుండె. 158

ఉ. అయ్యమలాత్మతోడఁ బవనాత్మజుఁ డిట్లను ధర్మపుత్త్రు నీ
వెయ్యది యుక్తహేతువుగ నిమ్మెయిఁ బాసెదు నీదుపన్నువం
గయ్యము సేసి భూపతినికాయములం బరిమార్చి తల్లి నీ
కియ్యన లక్ష్మి నూఁది [1]చరియింపగ యిప్పుడు వాయ బాడియే. 159

క. మనమునఁ దోఁచినదానము, లనుదినమును జేయుచును సమాశ్రితజనులం
బెనుచుచు బంధులఁ బ్రోచుచు, జననుతచరితమున బరఁగు సౌజన్యనిధీ. 160

క. వనమున మాద్రీపుత్త్రులు, [2]వెనుఁబడుటకుఁ దలరి తట్లు విక్రమమునకుం
గొనగొల్పి తిట్లు వీరల, నసూనదుఃఖముల ముంచి యరుగం దగునే. 161

వ. అనియె నట్టియెడ. 162

క. ద్రోవదియు సుభద్రయు శోకావేశం బడర మోము లశ్రులఁ దోఁగం
గా వెక్కి వెక్కి యేడ్చిరి, భూవర పాండుక్షితీశపుత్త్రులు నేడ్వన్. 163

క. పరిజనములు గన్నీళ్ళులు, దొరఁగఁగ [3]నడలొంది వారితోడం జని రి
వ్వరుసనుఁ దనదుతనూజులు మరలమికిం బాండురాజమహిషి మఱుఁగుచున్. 164

వ. తెగనాడ కున్నఁ బోవ రని కన్నీరు దుడిచికొని వారలం గలయం గనుంగొని వా
రలు వినుచుండం దత్పరిజనంబులతోడ. 165

సీ. దుర్ద్యూతమునఁ దాను మూలఁబోవుటయును, నాసభ నపకీర్తి యగు తెఱంగు
వాటిల్లుటయుఁ బెక్కు భంగుల నడవుల, నిడుమలఁ బడుటయు నే సహింపఁ
జాలక కార్యంబు చక్కించి సంధిమై నొన్నవివారెల్ల నవ్వఁ దలలు
వంచి కౌరవులలో వర్తింప నే లని, హరితోడ నాడితి నవ్విధమున

ఆ. మానినీయు ధర్మసూను నాగాయుత,బలుని భీము శత్రుభంజనైక
శీలు బార్థు శౌర్యలోలురఁ గవల దైన్యంబు నొందఁ జూచు టర్హమగు నె.

వ. అని ధర్మతనయువదనంబు వీక్షించి పాంచాలిం జూపి. 167

సీ. గారవంబున సుకుమారత్వమున నొప్పు,నిప్పొల్తిఁ దల నట్టి యీడ్చి తెచ్చి
సభలోన నట్లు దుశ్శాసనుం డవమాన, పెట్టంగ నచ్చటి పెద్ద లెల్లఁ
బలుకక యుండ నబ్బన్నంబునకు నోర్వ, వలసె మీ కప్పటి కలఘుతేజ
నీ తేజ మట్టులు నీ అయిఁ పోయినఁ, బాండునికులము సెప్పఁగఁ జూవ

తే. లేక [4]పోదె యబ్బంగిఁ బల్కితి ముకుందుతోడ నేను మీ రెమ్మెయి రూఢికెక్క
వెలుఁగఁ గోరుటక తమున దలఁచి దాని, ననిలసుతుఁడె త్తిసెట్టె నే మనఁగఁగలను.

1. గ. చరియింపఁగ నిప్పుడు. 2. క. చ. ట. 'వెనుఁబడుటకు...విక్రమము సెయిం గొనివచ్చి తిపుడు వీరల'. 3. గ. నడ లాడ వారి. 4. గ. పోక కబ్బంగి.

వ. అనిన విని ధర్మసుతుండును భీముండును సిగ్గువడి రిట్లు పలికి గొంతి యిమ్మాటకు భీముచిత్తం బెట్లగునో యనుతలంపున ధర్మసుతుని కలనిం జూపి. 160

ఉ. నామది నొండు లేదు విను ♦ నవ్విత నీతనితోడ నీదు ల
క్ష్మీమహిమన్ మనం బలరఁ ♦ జేసితి నుత్తమదానముల్ జన
స్తోమనుతంబుగా నడపఁ ♦ జూచితి జన్నము గన్నులార నిం
కేమికొఱంత నా కుడుగ ♦ నెట్లును బోదు నరణ్యవృత్తికిన్. 170

తే. రాజ్యఫలము గావింపఁ బు♦త్రా సమగ్ర, తపమునకు ఫలమైనయు♦త్తమగతి ప్ర
సిద్ధి గోరుదు నది గల్గఁ♦జేత కిట్టితోడు మఱి నాకుఁ గలుగునే ♦ దురితదూర.

క. కురురాజునకును దేవికిఁ బరిచర్య లొనర్చుచుం ద♦పంబునఁ గృశితం
బారయుతనువుతోఁ గడపెదఁ, గరము నియతి నింకఁ గలుగు♦కాలము వత్సా. 172

వ. మీరు మరలుం డనియె నట్టియెడ నప్పాండురాజమహిషి దమతోడ వనవాసంబున కై వచ్చుటకుం గడంగుటయు దాని కొడంబడక పాండవులు దగు పలుకులం బ్రార్థించుటయు నెఱుంగుం గావున ధృతరాష్ట్రుండు ధర్మతనయుం డెట్లు సెప్పె నట్లు సేయు మని విదురసంజయులచేత నద్దేవికిఁ జెప్పిపుత్తెంచి వార లేతెంచి యబ్భంగి సెప్పినను వదలక వారిపలుకు లామూలము విచారించి దృఢనిశ్చయంబునఁ గొడుకులఁ గోడండ్రను దక్కటిబంధుజనులను సర్వాభరణభార్యలను బరిజనంబులను గలయం గనుంగొని యిళ్లల వచ్చెదరు నిలువుండు సుఖుల రై యుండుం డనుటయు. 178

క. హృదయములు దలర నాదటఁ, బ్రదక్షిణము గాఁగ నేఁపఁ♦ గందు వెలుఁగు లే
ల్ల దెసలఁ జెలఁగఁ దిరిగి త,త్పదంబులకు నెఱఁగి వంతి ♦ దనూవులు మూలఁగన్. 174

వ. నిలిచి రందుఁ బాండవు లేవురుం బాండురాజమహిషి ననుప మఱియుం జని యాయమను ధృతరాష్ట్రగాంధారులను గలసి వారల నిరువుర నుద్దేశించి మీరు వనంబునకుం బోయి తాను నను లేకున్న మా కెట్లు కాలంబు గడపవచ్చు నను తలంపునం దున్న నెంత ప్రార్థించినను గొంతి నిలుచుట కొడంబడ దయ్యె నీసాధ్వికి బుద్ధిసెప్పికొనుచుం బరిచర్య సేయించుకొండని యప్పగించి యా రాజునకు నద్దేవికిఁ గుంతికిం బ్రదక్షిణంబు సేసి దండప్రణామంబు లాచరించిన దీవించి వా రామంత్రణంబు సేయ నా ధర్మపుత్త్రాదు లశ్రుప్లావితంబులగు వదనంబులతోడ మరలి వనితాజనంబులం దోడ్కొని. 175

తే. పొగులుచును నల్లనల్లన ♦ పురికి నరిగి
[1]రయము సుమ్మలికంబు ప్రో♦వైనయట్లు
సూడఁ గూడక యుండంగఁ ♦ జొచ్చి రాత్మ
మందిరము లందఱును బుధ♦మాన్యచరిత. 176

1. గ. వ్యథయును సుమ్మలికంబు.

వ. అట్లు పురప్రవేశంబు సేసి ధర్మనందనుండును దమ్ములుం దగినవర్తనంబుల నుండి రట యక్కురువృద్ధుండు నిశ్చింతుండై గాంధారియుం గుంతియు విదురసంజయులు నగ్నిహోత్రంబునకు వలయుఋత్విగ్జనంబులతోడ నరుగుదేర నలయక భాగీరథీతీరంబునకుం బోయి యొక్కయోగ్యప్రదేశంబున విడిసెదదనంతరంబ యతండు. 177

క. స్నానాదికవిహితానుష్ఠానంబులు నడపి శ్రుతివిశారదభూదే
వానీకప్రణయనమున, మానితరుచి వెలుఁగు చున్నసమహితాగ్నులకున్. 178

తే. అర్చలిచ్చి హోమంబు సమంచితముగఁ, జలిపి యెల్లవారలకు భోజనము సంఘ
టించి యాహారవిధి యాచరించి విదుర, సంజయులరయొనర్చినదర్భశయ్యనుండె.

ధృతరాష్ట్రుఁడు శతయూపరాజర్షి యాశ్రమంబున వసియించుట. —

వ. ఆశయ్యకు ననతిదూరంబునం గల్పితంబైనతల్పంబున గాంధారియుం దదనంతర సన్నిహితశయనంబున గొంతియు నింతనంత విదురసంజయులును జుట్లం దమకుఁ జూడం బోలినచోటుల యాజకజనంబును విశ్రమించిర ట్లద్దినశేషంబు సనిన సాయంతనకృత్యంబులు సలిపి రయ్యామిని యచ్చటఁ గడపి సూర్యోదయసమయంబునం గాలోచితకరణీయంబులు నిర్వర్తించి యాంబికేయుండు దనవారును దానును గంగానది యుత్తరించి చని కురుక్షేత్రంబుఁ బ్రవేశించి యొక్కపుణ్యాశ్రమంబునుపాంతంబునం దరుచ్ఛాయాశీతలంబైన సికతాతలంబున నాసీనుండయ్యె నట్లక్కురురాజు నిజాశ్రమప్రదేశంబునకు వచ్చుట శతయూపనామధేయుండును గేకయవంశవర్యుండును దపోధుర్యుండును నైనరాజర్షిసత్తముండు విని యయ్యెడకు వచ్చి. 180

క. కని గారవంబునం దోడ్కొని చని యర్ఘ్యాదివిధులకుంఠితవినయం
బున నడపిన నయ్యాశ్రమ, మున నతఁడు వసింపఁ గోరె భూపవరేణ్యా. 181

క. కోరిన విదురాదులు నా, కౌరవపతితలఁపు మేలుగాఁ గొని తగ న
చ్చేరువను బర్ణశాలలు, వే రచియించి రుచితంపువిధమున నధిపా. 182

వ. అం దక్కురువిభుండు దానును గాంధారియుఁ జీరాజినవసనులును సువ్రతపరులు నగుచుఁ గుంతీవిదురసంజయులతో వసియించి తపం బాచరింప యాజకులు నిజకృత్యంబులు నడపుచుండి రిట్లు నియమనిష్ఠలతిశయిల్ల నాభూవల్లభుం డచ్చటి మును ల(చ్చేరువంద న)చ్చేరువ నతితీవ్రతపశ్చరణంబున నిజాంగంబు నిర్మాంసత్వంబునం జర్మాస్థులు గదియునట్టికార్శ్యంబు దనకు నొప్పుగా వర్తిల్లె నని యిట్లు ధృతరాష్ట్రు వృత్తాంతంబు సెప్పిన వినియ వ్విచిత్రవీర్యనందనుండుపదంపడి యెట్టివాఁ డయ్యె మునీంద్రా యెఱిఁగింపు మనుటయు. 183

శా. ఆశాపాశవిమోచనోపకరణవ్యాకోచవృద్ధామ సం
క్లేశోత్సారక దివ్యనామ వరదృగ్లీలాప్తనిస్సీమ ల

క్ష్మాకుంభత్సురలోక చక్ర పరమ్యచ్ఛిన్నానుకంపాళ వి
ద్యాలోకాభాస్ఫురణాకృతీ శమదమాన్వంతత్త్వభాస్వత్కృతీ. 184

క. మునిహృదయనిలయపాదా, వినతజనావనవినోద విద్యావిద్యా
ఘనచిరకాంతికదూర లసనపీతస్ఫీతసామజత్వగ్వసనా. 185

మాలిని. అపరిమితవిభూతీ యప్రమత్తానుయాతీ
[1]లపననిభృతవేదా కలక్వణస్వైరనాదా
జపపరవరదాయీ సర్వవిద్యావిధాయీ
విపులకృపకటాక్షా విశ్వసంహ్లాదదక్షా. 186

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబున నాశ్రమవాసపర్వంబు
నందుఁ బ్రథమాశ్వాసము. 187



1. గ. లపనవిస్రుతవేదా.



హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆశ్రమవాస పర్వము, ద్వితీయాశ్వాసము

—:0:—



సంబంధాయుర్గురుశ్రీ
తాసిద్ధిదచరణపద్మ ! దాంత్యన్నిర్మల
ధీసద్మ ! శాంతిసేవ్యా
వ్యాసాదిమునీంద్రభావ్య ! హరిహరనాథా. 1

ధృతరాష్ట్రునికి నారదుండు మునులతో వచ్చి యుత్తపోవనమహిమ సెప్పుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు వైచిత్రవీర్యుండు పరమ తపోధుర్యుం డయి యుండె నంత నొక్కనాఁడు నారద పర్వత దేవల మాంజా యను లమ్మహీనాయకుం జూచువేడ్క నయ్యాశ్రమంబునకుం జనుదెంచిన. 2

క. శతయూపుఁడు నయ్యేడకుం, గుతుకంబున వచ్చె వారిఁ ! గుంతి వినయసం
భృత యై యందఱను సమర్చితులుగఁ జేసినఁ బ్రహృష్టచేతసు లగుచున్. 3

వ. ధృతరాష్ట్రునికడకుం బోయిన నతండు వినయసంభ్రమంబులతో వినతుం డైన దీవన లిచ్చి యతనిపెట్టించినదర్భాసనంబుల నాసీను లై యుచితసల్లాపంబులు సేయుసమయంబున నారదుం డన్నరనాథుతో [1]శతయూపనామధేయుం డయిన ధరాధిపుపితామహుం డగు సహస్రచిత్యుఁ డనుమహారాజు దనపెద్దకొడు కైన శతచిత్యునందు రాజ్యభారం బిడి యిద్దివ్యాశ్రమంబునకు వచ్చి తపశ్చరణంబున దుశ్చ్యవనసఖత్వంబు వడసె మఱియును బృహద్రథుండును శైలాలయుండును బురుకుత్సుండు నిందుఁ దపంబు సేసి యింద్రలోకంబు వడసిరి రాజర్షిసత్తముల నిల్లను నే నీలోకంబున మెలంగుచుండి యిమ్మేడం గంటి నమ్మేడం జూచితి నిది యితరదుష్ప్రాపం బయినపుణ్యప్రదేశంబు నీకుం గృష్ణద్వైపాయనుప్రసాదం బున నిచ్చట వసియింప సంభవించె నని పలికి వెండియు.

సీ. ధరణీశ యిచ్చటితపమున నీవు నా నృపుల యట్టుల విశిష్టపుఁబదంబుఁ

1, జ. శతజన్నామ...ధరాధిపుఁ ప్ర యగుసహస్ర.

గందు నీతోడన ౯ గాంధారియును వచ్చు, మీకు శుశ్రూష య౯మేయభక్తిఁ
జేసి కుంతియుఁ బతిఁ ౯ జేరంగ నరుగు, న,ప్పాండుభూపతి సుర౯పతిసమీప
మున నుండి యెప్పుడు ౯ నినుఁ దలంచు నతండు, పోఁడిమి సేయఁ గ౯లాఁడు నీకు

ఆ. ధర్మమూర్తియైన౯ధర్మనూనుఁడు దన, యాత్మ గాన విదురుఁ ౯ డన్న రేంద్ర
వినుతతనువుఁ దగఁ బ్ర౯వేశించు సంజయుఁ, డతులనాకలోక౯గతి వెలుంగు. 5

వ. అనిన విని యాంబికేయుండు గాంధారీకుంతీసమేతంబుగా సంతోషంబు నొందె
నచ్చటియందఱును బ్రీతాత్ములై రప్పుడు. 6

క. శతయూపుఁడు నారదుతో, నతులజ్ఞానాభిరామ ౯ యడిగెద నిన్నుం
గుతుకంబున నొక్కటి నీ,వితతకృపం దెలియఁ జెప్పు౯వే నా కనుఁడున్. 7

వ. ఆదేవముని నీయడుగఁ దలంచినది యెయ్యది యడుగు మనిన నతం డక్కురుపతి
సుగతి గను నని నిర్దేశించితి తద్విశేషంబు వినవలతు వివరింపు మనుటయు. 8

నారదుఁడు శతయూపునితో ధృతరాష్ట్రాదులు సుగతిఁ బొందెడు తెఱంగు సెప్పుట.

సీ. ఆ సంయమీశ్వరుం ౯ డాతని కిట్లను, నిచ్చలు నేను మ౯హేంద్రుకడకు
నరిగి సంభావణ ౯ మాచరించుచు నుండ, నాసభ నిక్కౌర౯వాధినాథు
వలనివార్తలు వుట్టె ౯ యలఘుతపోవృత్తి, నిష్ఠాతిశయము వర్ణించి రప్పు
డవ్యాసవుఁడు సెప్పె ౯ ననఘ నాతో ముని,జాతుఁడు ధృతరాష్ట్ర౯జనవిభుండు

తే. తపము మూఁడేఁడులోనరించి౯తానుసతియు, దేహముల్విడ్చి ధనదనా౯ధీశు చెలిమి
నతిశయిల్లు దివ్యాభర౯ణాభిరాముఁ, డై విమానవిహారవ్యా౯ప్తాత్ముఁడగుచు. 9

క. అని పాండునిమది ప్రమదం,బునఁ దేలఁగఁ జెప్పె ననుడు ౯ మోదము ధృతరా
ష్ట్రుని నెమ్మనమున సండా, రె నఖిలజనచిత్తములను ౯ బ్రియము దలిర్చెన్. 10

వ. ఇట్లు సద్గోష్ఠి నడపి యత్తాపసోత్తము లక్కురుపతిసత్తము నభినందించి యామం-
త్రణంబు సేసి నిజనివాసంబులకుం జని రక్కాలంబున. 11

సీ. పాండుపుత్త్రులు దల్లిఁ ౯ బలుమఱుఁ దలఁచుచు, వగతురు ధృతరాష్ట్ర౯వలనసుబల
నందన దెసను మ౯నం బిడి చింతింతు, రట్ల పౌరులు వంత ౯ నార్ఁ గూరి
వృద్ధుండు ధృతరాష్ట్ర౯విభుఁడు సుఖార్హుఁడు, విగతజనం బైన౯విపినభూమి
నెత్తెఱంగున వసి౯యించు గాంధారియుఁ, గుంతియు నత్యంత౯కోమలాంగు

తే. లడవి నుండంగ నెట్లోర్తు ౯ రకట యిట్టి
కొడుకులను రాజ్యసౌఖ్యంబు ౯ విడిచి యట్లు
సను నె యక్కుంతిభోజని౯తనయ జనని
దొఱఁగి పోవుట కెంత గుం౯దుదురా వీరు. 12

క. ఆయాసంబున విదురుని,కాయము సంజయుసిమేనుఁ ౯ గందక యున్నె
పోయిరి ధృతరాష్ట్రమహీ,నాయకుపైభక్తిఁ గాన౯నమున వసింపన్. 13

క. అని యొండొరువులతోడ, న్వనట యెసఁగఁ బలుకుదురు మ౯నంబులఁ గుంతీ

తనయులు మాతృవియుక్తత, గనయము నడలుదురు కౌరవాన్వయముఖ్యా. 14

సీ. ధర్మపుత్త్రాదు లంగదలు నొక్కచో నుండి, ధృతరాష్ట్రు నాతని దేవిఁ బేరు
కొని వారి కొడుకు లెల్లను ద్రుంగి రని వార, లతివృద్ధు లెమ్మెయి నడవిఁ గలసి
యున్నా రనియు నింక నెన్నాళ్ళు లుండెడి, గొంతి వనంబునఁ గూర దినుచు
ననియును బంధుల నదయతఁ దునిమితి, మలుక ధైర్యంబున నడఁపమైతి.

తే. మనియు నభిమన్యు వీరుని నతనితమ్ముఁ
గుఱ్ఱలను గర్ణు నాఱడిఁ గోలుపోయి
యొంటి వడితి మనియుఁ గడు నుమ్మలంపు
మాట లాడుదు రప్పరిజనుల్ మఱుఁగుచుండ. 15

వ. ఇట్లనుదినంబును ఘనచింతాక్రాంతు లై యలంత నొందుదురు. 16

చ. విదురుని సంజయుం దలఁచి వేదనఁ బొందుదు రట్లు నెవ్వగల్
హృదయముఁ గుందఁ జేయఁ జెలు వేది మనోజ్ఞము లైనభోగము
ల్వకలి వినోదముల్ సలుపుకలాలసితం బెడఁబాసి రాజ్యసం
పద నరయం దలం పెడలి పాడఱి యుండుదు రేమి సెప్పుదున్. 17

క. ద్రౌపదియు సుభద్రయు సంతాపం బందుదురు పాండుతనయులు దలరన్
భూపాల భవజ్జనకుని, చూపందఱమానసముల శోకము నదుమున్. 18

ఆ. పరమధీరులైన పాండుతనూభవు, లిట్లు ధైర్యసార మెడలి వికల
బుద్ధు లగుచు నుండి పోవం గడంగి ర, య్యంధనృపతిఁ జూడ నధిపముఖ్య. 19

వ. అట్టియెడ సహదేవుండు పాండవాగ్రజునకుం బ్రణమిల్లి భరితవినయుండై. 20

క. చను మును చెప్ప వెఱచితిఁ, గాని యధిప గొంతిఁ జూడఁగాఁ జనుటర్హం
బైనపని యింత కేదెస, దా నొందునొ విపినవాసదాస్థిత్యమువన్. 21

తే. గొంతి ప్రాణంబుతో నుండఁ గురువరేణ్య
యచ్చటికిఁ జని యొకమరి యమ్మహాను
భావ దర్శింప వలవదె బావ నప్పు
నను సరించుచు నెట్లున్న దయదికొమ సాధ్వి. 22

క. ధృతరాష్ట్రుఁడు గాంధారియు, నతివృద్ధులాంగకులు వల్కలాజినధరు లై
వ్రతచర్యల వన్యాహారత నలఁగుచు నున్నవారు రాజవరేణ్యా. 23

ఉ. వారలఁ జూడఁ బోఁ దగు నవశ్యము దుర్దశ పుట్టకుండ మున్
మీ రని చెప్ప నప్పుడు సమీపమునం జెవి దార్చి నెవ్వగం
గూరుచు నున్నద్రౌపది యొగుం గరణీయము బంధుదుఃఖసం
తారక మీకు నీతఁ [1]డుచితంబుగఁ జెప్పినకార్య మెమ్మెయిన్. 24

తే. గొంతికొడుకు లెల్లను గురువరేణ్య, మెత్తినడుగుల నున్నవా రత్తపస్వి

1. గ. డుచితజ్ఞత.

నీవరిష్ఠ దర్శింపఁ గలఁ బోవఁ గోరి, యనియె నట్టు లయ్యురువురు నాడుటయును.

### పాండవులు బంధుసహితంబుగా ధృతరాష్ట్రుఁ జూడఁ బోవుట

వ. తద్ధర్మనరనాథుండు కాననగమనంబు నిశ్చయించి పడవాళ్ళం బిలిపించి ధృతరాష్ట్రు దర్శింపఁ బోద మనతిబహుళంబును బ్రధానచతురంగసముదీర్ణ భంగికరంబునుం గా బలంబుల సమకట్టుం డందలంబులునుం జాటబండ్లునుం గాఁ బెక్కాయితంబు సేయుం డనేకశకటంబులుం బటకుటీరప్రకరంబును నానావిధభక్ష్యభోజ్యంబులునుం గొనివచ్చునట్లుగా నిపుణపరిచారకుల నియమింపుఁడు పౌరజనంబు లారాజుం జూచువేడ్క నెవ్వారు వచ్చినను వారల యోగక్షేమంబు లరసి సురక్షితంబుగా నడపింపఁ దగువారి నియోగింపుం డల్లి పయనం బని చాటింపుం డని పనిచిన వార లటు సేయ మఱునాఁడు యుయుత్సునిఁ గృపాచార్యుని ధౌమ్యుని రావించి మీరు పురరక్షణంబునకు నిలువుం డని యత్యాదరంబునఁ జెప్పి. 26

సీ. [1]ఎనికగములతోఁ జనేతెమ్ము నీవని, బాహుదర్పోజ్జ్వలుఁ బవనతనయుఁ
దేరులగమి సెలు వాఁడు నీచే నని, దేవసమాను గాండీవధరుని
గుఱ్ఱపుదళముల కగ్రమణి నీ కలవడు, నని చారుతనుమనోహరు నకులుఁ
గాల్బల మహారథి కలసివచ్చుట నని సన్నుతచేష్టితుఁ జిన్నతమ్ముఁ

తే. బనిచె వార లమ్మెయి దూర్యనినద మెసఁగ, నాతపత్త్రావళిధ్వజప్రాంతకలిత
కల్పనగోచులు రోదోంతరంబు నిండ, నరుగుదెంచిరి వైభవ మతిశయిల్ల. 27

వ. ద్రౌపదీప్రముఖవధూజనంబులనుం దక్కనుం గల భరతభార్యల నందలంబులను [2]గునకంబుబండ్లను నిడికొని రం డని యంతఃపురాధికారుల నబ్భరమునందు నియమించిన వార లట్ల చేసిరి తానును మణిభాసమానంబును సితవాలశోభితషోడశశ్వేతాశ్వవ్యూఢంబును నైనరథం బెక్కి మౌక్తికప్రాలంబమాలికాద్యోతితంబు లగు నాతపత్త్రంబు లుల్లసిల్ల. 28

తే. వేణువీణారవంబును వివిధగాననాదములుఁ బాఠకారావమేదురంబు
లగుచు వందిబృందములవాక్యావలి బెరసి, దిశలు దీటుకొనంగ బ్రదీప్తలీల. 29

వ. వెడలి వివిధవాహనారూఢు లయి పౌరు లపూర్వరుపంబున ననుగమించి రిత్తెఱంగున మెఱయుమహిమ సుజ్జ్వలుఁ డగుచుం జని భాగీరథి యుత్తరించి పాండవోత్తముండు కురుక్షేత్రంబు ప్రవేశించి చనుచుండ. 30

సీ. సంయమివరు లైన శతయూపమునిపతి, యాశ్రమంబునఁ దదుపాంతభాగ
మునఁ గదళీశోభితయును మృగాకీర్ణంబు, నగు ధృతరాష్ట్రునియాశ్రమంబు
నెఱిఁగినవార లిదియంచుఁ బేర్కొని, చూపి చెప్పిన ధర్మసుతుఁడు డేరు
డిగిన భీమాదులు డిగ్గిరి వాహనంబులు సర్వజనులు నప్పురుషవరుల

1. క. ఎనికఘటలతో. 2.క. జ. ట. బాలబండ్లను.

ఆ. అనుసరించి రాజనాథిపుఁ డయ్యంబి, కేయు నాశ్రమంబు సొచ్చి యచటి జనుల [1]నడిగె నయ్య యేడీ యని, గద్గదిక యెలుంగు గడలుకొనఁగ. 31

వ. అడిగిన వార లప్పు డతనితోడ. 32

క. యమునాస్నానంబునకును, సుమహితోదాహరణమునకు సువ్రతుఁ డాతం
డమి సనియె ననుచుఁ దన్మార్గము సెప్పిరి సమ్మదిం దెలియంగ గౌరవమున భూభృత్. 33

పాండవులు కురుక్షేత్రంబున నున్న ధృతరాష్ట్రగాంధారీకుంతుల దర్శించుట.

సీ. చెప్పినఁ బాండవు లప్పథంబున భక్తి, నరుగుచు నెదురుగ నరుగుదెంచు
నంబికానందనుఁ డాదిగాఁ గలవారిఁ, గని రప్పు డన్నలఁ గడచి శీఘ్ర
గామియై చని తల్లి కాళ్లపైఁ బడి యేడ్చె, సహదేవుఁ డధిక బాష్పప్లుతాస్యుఁ
డగుచు నబ్బామిని వగచుచు నాతని, నెత్తి తాఁ గౌఁగిట నిఱియఁ జేర్చి

తే. పేరుకొని చెప్పె నతని గాంధారి కంతఁ
గూడి యతఁడును దారు నక్కుఱుకుమారు
లక్కురూద్వాహు నన్నియుక్తాత్మ దేవిఁ
గాంచి రనుజీవు లెఱిఁగింపఁ గౌరవేంద్ర. 34

చ. కని మఱి తల్లి పాదములఁ గ్రందుగఁ జేర్చిరి మస్తకంబు ల
వ్వనితయు నందఱం బొదివి వత్సలత న్మన మార్ద్రభావ మొం
ద నురములు నశ్రుబిందువులఁ దడియఁ జిక్కఁగఁ గౌఁగిలించి యా
రినయునవారిఁ జేఁ దుడిచి ప్రీతిగ దీవన లిచ్చె భూవరా. 35

తే. అట్టియెడఁ బాండవాగ్రజు నధికవినయ, భరితుఁడై కాంచి భీమునిఁ బార్థుఁ గవలఁ
గనియు సంజయుఁ డంతయు గౌరవమున, నాదరించి రయ్యేవురు నతనిఁ బ్రీతి. 36

సీ. ద్రోవదిఁ దొట్టి వధూజనంబులుఁ దక్కఁ, గలయట్టి భరతభార్యలుఁ గ్రమమునఁ
గాంచిరి కురువృద్ధుఁ గాంధారిఁ గొంతిని, వారలు గొని వచ్చు వారికలశ
ములు పాండురాజపుత్త్రులు పుచ్చుకొని భరి,యించిరి పురజను లెల్ల నధిక
వినయమున నమ్మువ్వురను గని రవ్వేళ, నరద ముద మంది రట్లుదగిన

ఆ. వారు బలసి యునికి వారణపురమున, నున్నయట్ల కాఁగఁ దన్నుఁ దలఁచె
మదిఁ గులోద్వహుండు తదనంతరంబ ని,జాశ్రమమున కెలమి నరుగుదెంచి.

ఉ. తారకశోభితాంబరవిధంబునఁ బొల్పెసఁగంగ నాశ్రమా
గారతలంబు బంధుజనకోలాహలనంబునఁ దాను జంద్రునో
ప్పార వహించి విస్ఫురితుఁడై తనరెం గురుభర్త వచ్చి ర
చ్చేరువ గల్గుతాపసులు సెచ్చెరఁ బార్థులఁ జూచువేడుకన్. 38

వ. వచ్చినం గని వారల నెల్లను సవినయప్రణామంబులం బ్రీతులం జేసి పాండవు లలరుమొగంబులతో ధృతరాష్ట్రుం బరివేష్టించి యుండిరి వనితాజనంబులు

1. గ. నడిగె నయ్యెయేడీ యని; నయ్య మొదట నున్నాఁడని.

నొక్కవలన నిలిచి రుచిరాసనంబుల నున్నయమ్మనుజులు సంజయు నాలోకించి
ధృతరాష్ట్రబంధుజనంబుల నందఱం బేరువేర నేర్పడ మా కెఱింగింపవే యని
యడిగిన నతండు వారల కి ట్లనియె. 39

సీ. జాంబూనదచ్ఛాయ • చందంబువర్ణంబు, గలిగినపలుచని • గనపమేను
నుచితదీర్ఘత్వస • మున్నతఘ్రాణంబు, నిడుద లైనవిశాల • నేత్రములును
గంధీరవంబు రే • ఖయు నొప్పఁ జూడ్కికి, నెంతయు బ్రేఁ గైన • యతఁడు ధర్మ
తనయుఁ, డబ్జదనంబుఁ • దనరినమూఁపులు, నాయతస్ఫీతంబు • లైనబాహు
తే. వులును వెడఁదయురంబు నై • పొలుచునితఁడు
భీముఁ, డుజ్జ్వలసుందర • శ్యామతనువు
వారణేంద్రకైవడియును • వారిజముల
యట్టికనుదోయిఁ గలయితం • డర్జునుండు. 40

తే. సుందరాకారమునఁ దమ • కెందు సదృశు
లొరులు లేమి దెల్లం బగు • చుండ గాంతి
యుభయపార్శ్వంబులందుఁ గూ • ర్చున్నవిష్ణు
శతముఖోపముల్ వినయభూ • షితులు గవలు. 41

సీ. నీలోత్పలచ్ఛాయఁ • గ్రొబ్బోలుమైచాయయు, నవపద్మదళములఁ • దెవదుమెఱుఁగుఁ
గనుదోయి మధ్యత్వ • మునకుఁ బ్రవేశించు,ప్రాయంబు వత్యభి • రామమూర్తి
యలవడఁ గైకొన్న • యతులితసంపద,చందంబు దోఁపించు • చారుగార
వంబును గలుగుని • వ్వనిత పాంచాలి, యి,య్యంతిపార్శ్వమునఁ • గ ట్లెఱ్ఱిమేను
తే. వనజసన్నిభముఖము నై • యినునిమహిమ,యుజ్జ్వలాకృతి దాల్చిన • ట్లున్న యీల
తాంగి నారాయణునిచెలి • యలు సుభద్ర, నరునివల్లభ సంయమి • నాథులార. 42

ఆ. వీరి కెలనఁ గనక • గారమధూకాభ
తనువు లొప్పుచున్న • వనిత లురగ
పాండ్యసుతలు నరుని • భార్య లులూపి చి
త్రాంగద యనఁ బరఁగు • నాహ్వాయములు. 43

సీ. ఇందీవరచ్ఛాయ • కెన యైనచాయ నొ,ప్పినమేను గలుగునీ • భీతహరిణ
నయన భీమునిభార్య, • నవ్యచంపకదామ,గౌరాంగి యైనయి • క్కమలవదన
సహదేవుగృహిణి, మే • చకనవకువలయ,వర్ణంబునకు పరి • వచ్చు కాంతి
జెలు వైనతనువునఁ • బొలుచునిన్నలినాయ,తాక్షి మాద్రీదేవి • యగ్రతనయ
తే. పత్ని,వీరలకెలనఁ జా • పటలు లేక, ధౌతసితవస్త్రపరిధాన • లై తనువుల
నిభృతిదోఁపఁగనున్న యి • న్నెలఁతలాంబి, కేయకోదండ్రు కరుణావి • ధేయులార. 44

తే. వీరిచందంబ యై కదు • గౌరవమునఁ,దను సుభద్ర వొదువ నున్న • తరుణి ద్రోణ

---

1. జ. కదిసి. వీరికెలనఁ • గనకమధూకాభ.

కర్ణముఖయోధవీరులఁ * గలఁచి తెగిన, యట్టియభిమన్యుప్రియ యుత్తరాభిధాన.

వ. అని చూపి చెప్పి నప్పు డాంబికేయుండు కౌంతేయాగ్రజున కిట్లనియె. 46

సీ. కుశలివై యుండుదే * కురువంశసత్తమ, పౌరజనులు జానపదులుఁ దెలుఁగు
తో నిన్ను ననుసరింతురె * తమ్ములందఱు, సుఖముందురె నీదు * సఖులుఁ సుఖులె
బంధులు సంతోషభరితులే యిష్టభృత్యులు దమ * కైనకోర్కులు ఫలింపఁ
గ్రాలుదురె హర్షలీలలఁ బూర్వరాజన్యునినడవడి * సలుపఁబడునె

ఆ. నయముతోడియుప్పనముల భండారంబుఁ, బెనుతెయ్యగృహారజనులమీఁద
గాలి మైన సుడియఁగానీక యరయుదే, యనఘ పుణ్యకీర్తు * లతిశయిల్ల. 47

క. మిత్రనరపతుల శాత్రవ, ధాత్రీశుల నెమ్మిఁ బరుపఁదనమున వశతా
పాత్రములుగఁ జేయుదె సుచరిత్ర యుదాసీననృపపరిస్థితి నడచునే. 48

క. దేవతల నతిథులకుఁ బితృ, దేవతలకుఁ బూజనములఁ * దృప్తి యొనర్తే
యీవసుధఁ జతుర్వర్ణజ, నావలులు నిజోతక్రియలఁ దగ మనునే. 49

తే. బాలురకును దుర్బలులకు * భామినులకు, వృద్ధులకును మనంబుల * వెఱపు లేని
యట్టిమెలఁకువ గలిగెదు * నట్లుగాఁగ, నడచునే యాజ్ఞపురమున * బుడమియందు.

క. అనిన విని యానృపతి యజ్ఞనపతితో నిట్టు లనియె * జగతీశ్వర నీ
వినుతోపదేశమున భవ, దనుయుక్తము లెల్ల నడచు * నవికలభంగిన్. 51

52

వ. అని పలికి యిట్లనియె.

కం. ఆయాసము సైరింపసి, మీయొడలు తపఃక్రియలకు * మొయికొనియెనె భూ
నాయక శుశ్రూషదగం, జేయునొకో గాంతి దప్పిఁ * జెందక మీకున్. 53

క. మాపెద్దతల్లి యలజడి, కోర్పి తపోవృత్తి గడపు * చున్నదియె సుత
వ్యాపాదనకారుల మముఁ, బాపాత్ములఁ దలఁచి యెట్లు * వలుకునొ మీతోన్.

ఆ. సంజయుండు తపముఁ * జాలికిఁ జాలి వర్తిల్లు చున్నవాఁడె * ధీరచిత్తుఁ
డిచట లేఁడు విదురుఁ * డెచటి కేఁగినవాఁడో, యతనిఁ జూడవలయు * జనపతి నాకు.

56

వ. అనుటయు ధృతరాష్ట్రుఁడు ధర్మతనయుతోడ

సీ. ఏదపంబున కోర్తు * నెంతయు శుశ్రూష, యలయక గొంతి మా * కాచరించు
వినుము గాంధారియు * ననఘచరిత్ర త, పోనిష్ఠ కోర్చు నిశ్శమ్మానసీయ
మిముఁ దలంచినయప్పు * మెచ్చి దీవించు సం, జయుఁడు ప్రాజ్ఞుఁడు తపశ్చరణమునకు
వినుపఁడు మముఁ బ్రాశి * విదురుఁ డెచ్చటనేని, జరియించు మునిజనా * శ్చర్యకారి

ఆ. యగుచు జలము లనిల * మాహారముగఁ గొను
నవియు నదియుఁ గొనక * యయిన నుండు
శూన్యవిపినమున విశదైన్యపాతంత్రసం
చారియై వసించుఁ * గారవేంద్ర. 57

క. ఒక్కొకమరి డబ్బాటీ, చక్కటిఁ గాన నగు ననియె * జనవర తోఁచెన్

గ్రక్కున నప్పుడ విదురుండు, దక్కం దేయగ్రజునకనతిదూరమునన్. 58

వ. కాంతారధూళిమలినాంగుండును జటీభూతకేశపాశుండును దిగంబరుండును నగు విదురుం బట్టం దోఁచి యయ్యాశ్రమంబున నున్నజనంబులం గని మగిడి పోవం జూచి ధర్మతనయుండు దనయనుచరుల నిలువుం డనుచుం దా నొక్కరుండును సత్వరంబుగా నవ్వినుతప్రభావునివెనుకం జనియె. నతండు గుల్మాంతరితుం డగుచుం దోఁచుచుం బోవం బోవ నప్పాండవాగ్రజుం డెలుం గెత్తి యో విదుర యో విదుర నిలు నిలు మేను యుధిష్ఠిరుండ నిన్నుం గానవచ్చితి నని పలుకుచుం బాఱిన నమ్మహాత్ముండు మరలి కనుంగొని వివిక్తప్రదేశంబున నొక్కపాదపంబు సేరి నిలిచిన. 59

—విదురుఁడు యోగమార్గంబున ధర్మరాజునందుఁ గలియుట.—

సీ. ధర్మతనూజుండు తత్సమీపంబున, కేఁగి యయ్యోగికి నెదుర నిలిచి
యాతండు నయనంబు లర్ధమీలితము లై, యుండంగ నూరక యున్నఁ గాంచి
నిర్మలాత్మక యేను ధర్మనందనుఁడ నన్నుఁ, గను విచ్చి చూడవే యనుడుఁ నతఁడు
తెప్పల నెగయించి యప్పాండవోత్తముఁ, దప్పక చూచి యుదాత్తయోగ
తే. బలము గైకొని యింద్రియములను బ్రాణ
ములను నింద్రియములఁ బ్రాణములును గలపి
నిజశరీరంబు విడిచి యానృపతితనువు
సొచ్చె దేజోమయత్వవిస్ఫూర్తి మెఱయ. 60

ఆ. వినుము ధర్మపుత్రు తనువునఁ గాంతియు, లావు నప్పు డగ్గలంబు లయ్యె
నొలసె బుద్ధి యధికబల మట్టు లగు టతఁ, డెఱిఁగి చోద్యమందె నెలమి నొందె.

క. తదనంతరంబ యప్పతి, విదురశవము ప్రాను పెంది వికృతిరహితమై
బెదురమియు నొఱిగి యున్నప, గిది నుండం జూచి యగ్నికృత్యము నడపన్. 62

చ. తలఁచిన యంత నొక్కయెలుఁగు ధర్మతనూజ యతిత్వగౌరవో
జ్జ్వలునికళేబరంబునకు వహ్నివిధాన మొనర్పు టర్హ మే
వల దని మ్రోసె నమ్మనుజవల్లభుఁ డప్పుడు దక్కఁ బోయి భ్రా
తలకును దండ్రికిన్ సువిదితంబుగ నంతయునుం గ్రమంబునన్. 63

వ. ఎల్లవారును వినుచుండం జెప్పిన నందఱు నద్భుతరసంబున మునింగిరి. పదంపడి ధృతరాష్ట్రుం డామంత్రణంబు సేయ మునిజనులు నిజనివాసంబులకుం జనిరి తదనంతరంబ యాంబికేయుండు ధర్మనందనునితోడ. 64

సీ. భరతకులోత్తమ ఫలమూలముల నుప, యోగింపు మొసఁగెద మొదవితమకు
నెయ్యెడి యాహార మయ్యె నాతిథ్యంబు, దానన నడపుట ధర్మసరణి
యనవుడు నల్ల కాకని ఫలంబులు మూల, ములు నుపయోగించె మోదభరితుఁ
డగుచు నప్పాండునృపాగ్రణి యబ్భంగి, నఖిలజనములు నాహారకలన

తే. మాచరించి రయ్యెండలు ♦ నవనిశయన
మొందిరయారాత్రి నిద్రించి ♦ యుదితసూర్య
కాల మగుటయు సముచితసత్కర్మకరణ
మనుజులును దాను జేసె పెదనమ్మనుజవిభుండు. 65

వ. అట్లు కాలోచితకృత్యంబులు నడపి సహోదరసహితుండును దారోపేతుండును నర్వపరివారానుగతుండును నై యాశ్రమపథంబు గలయ మెలంగి పావన స్నానపావకార్చనజపధ్యానాదితాపసధర్మచర్యావిధంబులునానామృగనిర్భయసంచారప్రకారంబులువివిధపక్షికులనిశ్శంక [1] కేళీవిభవంబులు నాలోకించి కృతప్రాతస్సవనకరణీయులై యున్న కురువృద్ధుకడకు వచ్చి వందనాభినందనవచనంబుల నతనియుల్లంబు పల్లవింపం జేసి యతండు వనుపం బవిత్రాసనోపవిష్టుండై. 66

చ. అనుజులుం దాను భక్తిమెయి ♦ నమ్మహనీయుని గొల్చి యుండ న
య్యనికిం గనుంగొనంగ గర ♦ ముత్సుకతన్ శతయూపుం డాదిగా
మునివరు లేగుదెంచినం బ్ర ♦ మోదమునం గుశపీఠరాజిపై
నునుపంగం బంచె గాథవినయోక్తుల నాధృతరాష్ట్రుం డంచితున్. 67

వ. అట్లున్న యమ్మునిజనంబులును పాండుపుత్త్రులును బరమధర్మమయసంభాషణంబులు సేయుచుండ నినుండు నభోమధ్యగతుం డయ్యె నప్పు డాంబికేయుండు సవినయంబుగా నత్తాపసోత్తములతో మీరు మధ్యందినకృత్యంబు లాచరింప వలయు విజయంచేయుం డనిన వారలు నిజస్థానంబులకుం జనిరి తదనంతరంబ కౌంతేయుల మాధ్యాహ్నికకరణీయంబులు నిర్వర్తించుట కరుగుం డని పనిచె నని చెప్పిన విని జనమేజయుం డప్పాండవేయు లవ్విధంబున వనంబున నెన్నిదినంబులు వసియించి రని యడిగిన వైశంపాయనుం డతని కిట్లనియె. 68

సీ. ధరణీశ పాండుసంభవులు లట్లు సాంతఃపురంబును సపరివారంబుం గాంగ
నడవికి నేగి యయ్యంబికానందనుం, గాంచినదినమునం ♦ గరమునియతి
ఫలమూలసమితి నాకలి పుచ్చి భూమిశయనమున నిద్రించి ♦ జాగరిష్ణుం
డమ్మహితాత్ముల ♦ కర్థితో మఱునాం డనుజ్ఞ యిచ్చిన సుమనోజ్ఞములును

ఆ. సన్నుతములు నైనయన్నపానాదుల, ననుభవించి మృదులశయ్యాతల్ప
ముల శయించి రట్లు ♦ నెలనాళు లయ్యెడ, నతనిం గొల్చి యుండి ♦ రధిపముఖ్య.

వ. పదంపడి యొక్కనాం డెప్పటియట్ల పాండుపుత్త్రులు గాంధారీకుంతీసముపాసితుండై యున్నవిచిత్రవీర్యపుత్త్రుం బరివేష్టించి యుండ నవ్విశిష్టగోష్ఠికై శతయూప ప్రభృతిమునివరులు సనుదెంచిన నక్కురువృద్ధుం డర్హంబు లగునాసనంబులు

1. x. కేళీధంగులు.

వెట్టించి సంభావించిన. 70

వేదవ్యాసుఁడు పాండవసహితుం డైనధృతరాష్ట్రునాశ్రమంబునకు వచ్చుట.

సీ. సముచితంబులు సత్✽కర్మములును నైనసల్లాపముల్ సెల్ల నుల్లంబు లలర
వార లున్నెడ సత్య✽వతికొడుకు శిష్యుల, కేతేర నందఱు ✽ నెదురువోయి
వినతు లై భక్తిఁ దోడ్కొని వచ్చి [1]యతులకృష్ణాజినదరోత్త✽రాసనమున
నునిచి యమ్మునివరు✽ననుమతిఁ దమతమ,యాసనంబుల నుండి ✽ రమ్మహాత్మ
ఆ. నర్చితునిఁగఁ జేసె ✽ నాంబికేయుఁడు తద,నంతరంబ సమధి✽కాదరమున
నతఁడు మధురమృదువి✽శదాక్షరంబుగ నమ్మ,హీశముఖ్యుతోడ ✽ నిట్టు లనియె. 71
సీ. వనవాసమున నీకు ✽ మన మలవడియెనే, నియతిమైఁ దాపస✽క్రియల కోర్చి
నడపెదవే పుత్త్ర✽నాశజ మైనశోకము భవదంత✽రంగంబునందు
లేదు గదా ధర్మ✽వేదిని గాంధారి, యున్మలికంబు లే ✽ కున్నయదియె
నీకుఁ బరిజ్ఞాన✽పరినిష్ఠ గల్గెనె కొంతి, శుశ్రూష మీ కొన✽ర్చునె తగంగ
తే. రాజ్య మొల్లక వచ్చె న✽రణ్యవాస,మునకు నీయను మీాను రాఁ ✽ దనకు నింట
నిలువఁ దగ దని యిమ్మేలు ✽ నీమబుద్ధి, నొలసి యుండునె కౌరవ✽కులపవిత్ర. 72
చ. అనఘ యజాతశత్రునెడ ✽ నాదరణాతిశయాన్వితంబె నీ
మనము వృకోదరుఁ నరుని ✽ మాద్రితనూజుల సత్ప్రియాభినం
దనముల గారవింతె వినుత✽స్థితిఁ దద్దయు నిర్మలత్వ మొం
దెనె భవదీయచిత్తమున ✽ ధీమహితా దృఢశాంతిమూల మై. 73
వ. అని యంత నిలువక. 74
ఆ. వినుము దీర్ఘవైర✽వృత్తియుఁ గ్రోధచింతనము లేక వాక్కు ✽ మనము నొక్క
చంద మగుట సకల✽జనులకు ననుబద్ధ,సంపదాప్తిపరమ✽సాధనంబు. 75
వ. అని చెప్పి వెండియు. 76
సీ. విదురుండు దేహంబు ✽ విడిచిన తెఱఁగెల్ల, నెఱిఁగితె మాండవ్యుఁ ✽ డిచ్చినట్టి
పటుశాపమున శూద్ర✽భావంబు నొందిన, ధర్మదేవత బోధ✽నిర్మలాత్మ
డైనయమ్మహనీయుఁ ✽ డట్లగు టంబుజా,సనునియాజ్ఞాపన✽మున విచిత్ర
వీర్యనృపాధీన✽విస్రుతక్షేత్రంబు,నం దేఁ బ్రవర్తింప ✽ నధిప కలిగె
తే. ధర్మదేవతమాట✽తనువు సూవె
యీయుధిష్ఠిరునుజ్జ్వల✽కాయ మింత
యెఱిఁగి కాదె యమ్మహితయో✽గీశ్వరుఁడు స
మాద్యయోగబలంబున ✽ నితనిఁ గలసె. 77
ఆ. అట్లు దేవతాంశ✽యాత్మకుఁ డైనయు,వ్విభుఁడు నిన్నుఁ బ్రేష్య✽వృత్తి నిట్లు
గొలిచి గురుని బుద్ధిఁ ✽ దలపోసి సంతస, మంది యుండుదే కురు✽కులాగ్రగణ్య. 78

1. క. చేలకృష్ణా.

వ. అనిన విని వైచిత్రవీర్యుం డప్పారాశర్యునకుం బరమవినయంబున నిట్లనియె. 79

సీ. వనవాస మించుకయును నాకు దుఃఖంబు, సేయదు దేహంబుఁ జిత్తమును ద
పఃక్రియలకుఁ బనుపడియున్నయవి నన్ను, గాంధారిఁ బుత్త్రశోకంబు బాధింప
యేనియుఁ బొందంగనీఁడు సభక్తిక, మైనవృత్తమున ధర్మాత్మజుండు
మునివర యితనిపై ననుజులమీఁద వత్సలము నాహృదయ మిద్ధరణివిభుఁడు

ఆ. దేవతాత్ముఁ డగుట దెల్లమై యునికి మ
ద్వచనవర్తనములవలన నితఁడ
యెఱిఁగి యుండుఁ గొంతి యెఱుఁగు శుశ్రూషయు
నద్భుతంబు ముదము నావహించు. 80

వ. నాకుం బరిజ్ఞానంబును మానసనిర్మలత్వంబును భవత్ప్రసాదంబునం గలిగెడుం గాక యనియె నాసమయంబున ద్రౌపదీసుభద్రలును దక్కనుం గల్గునంగనాజనంబులును బారాశర్యసందర్శనప్రవణత్వంబునం జనుదెంచి సభక్తిక ప్రణామంబు లాచరించి యంతంత నిలిచి రయ్యలఘుజ్ఞానమానసీయుండు ధృతరాష్ట్రుతోఁడ. 81

ఉ. మీయెడఁ జిరత వాయఁగ సమీహితబుద్ధి యొనర్పఁ గోరి యే
నీయెడ కిప్డు వచ్చితి నభీష్టము వేఁడుము శంక దక్క భూ
నాయక యెల్లభంగిని మనఃప్రియముం దగ నిత్తు నన్నఁ గాం
తేయు లెలర్చి రవ్వసుమతీపతి మోదము నొందె నెంతయున్. 82

వ. వ్యాసుండు వెండియు. 83

చ. అనఘ యమానుషం బనుమ యట్టిద యైనను నాతపంబు పెం
పునకు మునీంద్రు లచ్చెరువుఁ బొందఁగ మీ కవలీల నిత్తు నే
ననుటయు నాకురుక్షితిపుఁ డాదటఁ గోరఁగ మీర లిందు వ
చ్చినకరుణామయోదరవిశేషముకంటెను మేలు గల్గునే. 84

క. మానుష మైన నమానుష, మైనను బ్రార్థనకు విషయ మైనది భవదీ
యానూనకృపకు నెక్కుడు, గా నొక్కఁడుఁ గాన నేను గారుణ్యనిధీ. 85

ఆ. సంయమీంద్ర నాదుజన్మంబు సఫలతఁ, బొందె మీకు విమలబుద్ధి నింత
యాదరించినపుడ లేదింకఁ బరలోకభీతి ధన్యతముఁడ నైతి నేను. 86

వ. అట్లయినను మీకొక్కటి గోరు మనిన నామనంబున నెప్పుడుం గలయది తెలియింప వలసె విన్నవించెద. 87

సీ. దుష్టచిత్తుం డగుదుర్యోధనుండు ని, ష్పాపస్వభావులఁ బాండుసుతులఁ
బరిభవించి సమస్తనరనాథు లని గరి, తురగయుతంబుగా నుగ్రుంగఁ జేసి
ధరణిరాజ్యము గోరి గురుభీష్మకర్ణాది, సత్పురుషుల నెల్లఁ జంపించె నిమె
నన్ను మునుఁగా మహారాజు లాంప్రను, బిడ్డల విడిచి యభేద్యధైర్య

ఆ. పృత్తి రణమృతిఁ బొందిరి రాజ్యవిభుల కేది
గతియొ యమ్మెఱుఁగు మాధులై కలనఁ బడిన
[1]కురుకుమారకు లెట్లైరొ పరమబోధ
మహిమ నెఱుఁగనివగ పెద్ద మాన్పు మనియె. 88

వ. అనుటయు నప్పిఱిముడిపలుకులు విని గాంధారికిం గుంతికిం బాంచాలికి సుభద్రకు మఱియునుం గలయంగనలకుం జిత్తంబుల నెవ్వగలు గ్రొత్తలయ్యె నప్పుడా సుబల నందన పట్టావృతలోచనత్వంబునన చూచి దయాధామం బైయున్నయామామ నుద్దేశించి మోడ్చినచేతు లద్దెసకు నిగిడ్చి యిట్లనియె. 89

సీ. మునినాథ యీరాజతనయ లందఱును గర్యంబునఁ దెగినది యాదిగాఁ బ
దాఱేండ్లు వగలపా లగుచుఁ దుఃఖసన్నిధి, గల్గుట గోరు లోకంబు లెన్ని
యున్నయఁ జూపంగ నైనను జాలుదు, నిర్మలతపమునఁ పేర్మి నీవు
పుత్రసాన్నిధ్య మీభూపతి కొనరించు, టంతటిపని నీకు గొంతిద్రుపద
తే. రాజపుత్రిసుభద్ర కౌరవకుమార,శతముభార్యలు నూర్వురు సౌమదత్తి,
పత్నియుత్తన్వియుత్త యప్పుడఁతియుత్త,గోరుదురు యుద్ధమృతబంధుకోటిఁ జూడ.

వ. అంతయును భవదీయదివ్యబోధంబు గనుచుండు. 91

క. పరమమునీంద్ర సమరమృత,కురువీరుల మానమునులగో డుడుగ భవ
త్కరుణ వెలయ లోకం బచ్చెరు వందఁగఁ జూపవే విచిత్రపుమహిమన్. 92

చ. అనునెడ గొంతి వాడువదనాబ్జముతోడ మదిం దలంచెఁ గ
ర్ణుని నది యత్తపోధనవరుం డదఁ గాంచి దయానురక్తి న
వ్వనితగుఱించి యిట్లను భవన్మతి నొందినకోర్కి సెప్పు మే
ననఘచరిత్ర దానిఫల మందఁగఁ జేసి యలంతఁ బాపెదన్. 93

వ. అనిన విని యక్కుంతి సంతసిల్లి యాసంయమివల్లభునకు దండ ప్రణామంబు సేసి చేతులు మోడ్చి లజ్జాసహితం బగునంతరంగంబుతో వినయనమ్ర యగుచు నిట్లనియె. 94

—కుంతి వేదవ్యాసునితోఁ గర్ణుఁడు దనకు జన్మించిన తెఱం గెఱింగించుట—

సీ. దేవతలకు నీవ దేవత విట్టిని, న్నామగాఁ బడసితిఁ మహితకరుణ
నన్నుఁ జూచి నాదువిన్నప మాదరింపు మేఁ, గన్యాత్వదశ నుండఁగా మదీయ
జనకునికడకుఁ గోపనుఁ డైనదుర్వాసుఁ, డన్మహాముని వచ్చె నతని సవిన
యార్చనకలనాసమారాధితుం డుగాఁ, జేసితిఁ బ్రీతుఁడై చెలువ నీకు
ఆ. నిత్తు వరము వేఁడు మెయ్యది కోరికి, యనియె నతఁడు మాప్రియంబు కంటె
ననఘ మిగులుకోర్కి యును గలదె నాకు నంటిఁ గాని యొకఁడు నను గనైతి. 95

1. క. కురుకుమారుల కెట్లొకో పరమ.

వ. అమ్మౌనిమాట దక్షమనంబునకు రానిచందంబు మొగంబునం దోఁప నత్తాపసవరుండు వరం బెల్లభంగి నొసంగక పోవ నడుగు మనుటయు నెఱింగియు నాదు వేడ్క తెలియం గట్ల యగుటకును బుత్త్రుం గోరితిఁ గోరిన నమ్మునిపతి యొక మంత్రం బను గ్రహించి దీని నీ వావహించిన దేవతలు భవద్వశగతులై సుతజన్మంబులు గలిగింతురు విశేషించి ధర్మువునకుఁ దల్లివి గాఁ గలదాన వని పలికి యంత ర్ధానంబు సేసిన. 96

ఆ. అద్భుతమునఁ బొంది యమ్మంత్రరూపము, ల్లమున నెప్పుడునుదక్షలంతు నొక్క నాఁడు మేడమీఁదఁ బోఁడిమి నే నుండి, కంటిఁ బొడుచుచున్నశీతమలమిత్త్రు. 97

క. కని యిది కన్యకు దోషం, బని తలఁపక బాల్యసంభృతాజ్ఞానమున వేఁ డ్క నొవర్ప నావహించితి, మునిమంత్రబలమున నూర్యు మునినాథవరా. 98

తే. ఆవహించిన నద్దేవుఁ డాక్షణమున, నాత్మమూర్తివదీపమహాకీర్త్యంతరంబు దాల్చి నాకడ కేతెంచె దక్షిణంబ, నాదుచిత్తము శ్చర్యమగ్నంబు గాఁగ. 99

వ. ఇట్లు సనుదెంచి. 100

సీ. అడుగు మిచ్చెద వరం బనిన వడంకుచుఁ, గేలు మొగిడ్చి పొం జేలయిచటి ననిన వృథాహ్వాన మాచరించుట దప్పు, నిన్నును నెవ్వాఁడు నీకు మిత్త్ర మిచ్చె నాతని శపియింతుఁ జుమ్మా యని, పలికె నయ్యర్యముఁడే వతికిఁ గురుని నిరపరాధుని శాపనిహతుఁగాఁ జేయుట, కోర్వక పుత్త్రకు నొపలను దేవ

తే. కృప భవత్ప్రసూ ననిన నక్షయ్యపరిమేయ
తేజుఁ డాత్మ తేజమున నాదృష్ఫుమ్ము ఖేంద్రి
యములు మనసును సమ్మోహితములు సేసి
యపుడు తనయందు పుట్టెడు మనిమోఁ బిదప. 101

వ. అని నిర్దేశించి. 102

తే. నీకుఁ గన్యాత్వవికలత గాక యుండ, వరము నిచ్చితి ననుచు దివమునకరిగె జనకముఖబంధు చిత్తవంచనమునడపి, గూఢ మంది రాంతరమునఁ గొడుకుఁగంటి.

క. కని యేటిలో నిడితిఁ గలఁ, గనిన ట్లయి యుండెఁ దత్ప్రకారం బిది మీ కనినయది దివ్యబోధం, బున నత్తెఱఁ [1]గంతరంగమునఁ గొని కాలున్. 104

తే. పాప మయ్యెఁ గా కుండె నప్పునిఁ దలంచి
యాఁగుకు చుండును మద్భయ మపనయింపుఁ
డతులకరుణ నిక్కు గువృద్ధుననభిమతమును
సఫలముగఁ జేయుఁ డివి నాకు సద్వరములు. 105

వ. అనిన విని యమ్మునీంద్రుం డమ్మానినిఁ కి ట్లనియె. 106

సీ. నీచెప్పినది యెల్ల నిక్కంబు కోడల, యెగ్గు నీయందు లేదేల వెఱవ

1. గంతరంగముం గొని కాల్చున్.

సుర లబ్ధు ప్రతాపాదచరితులు కర్ణున, కట్లు గా నున్నది యగుటఁ జేసి
యేటిలో నాతని నిడి తీవు కన్యాత్వహాని లేకున్కి. గుణలాగ్రగణ్య
వైతి భవద్వృత్త మమలిన మగుటకు, ననుమాన మించుక యైన వలవ
ఆ. దనుచు నాదరార్ద్రుఁ డయి పల్కె గాంధారి,తోడ నీవు సుతులఁ దోడఁబుట్టు
వులను గాంతు నీదు చెలియలు గొంతియుఁ, గర్ణుఁ జూడఁ గాంచు గణ్యచరిత.
ఉ. ద్రౌపదియున్ సుభద్రయును దక్కటికాంతలు, భ్రాతృపుత్త్రపౌ
త్త్రవిలోకనోత్సవము నొందుదు రిచ్చటి కిప్డు వచ్చు చే
నీప్రసాదాచరించుటకు నిమ్మనుజేంద్రుఁడు నీవు గొంతి చిం
తాపరితాపనోదనవిధంబుగఁ గోరితి రట్లు సేసెదన్. 108
క. నీకొడుకులకు మనుమలకు, శోకింపఁగ వలదు వారు శూరత వెలయం
జేకొనిరి రణమరణమున, నాకభువనసుఖము సద్గుణ స్తవనీయా. 109
ఆ. భామ విను భవత్ప్రభవితవ్య మైనభా,రతరణంబుపొంటె నతులమహిమ
మాననీయదేవయోనులు జననంబు, నొంది రిందు మనుజయోనులందు. 110
సీ. ధృతరాష్ట్రుఁ డనఁగ వర్తిల్లెడు మేటిగం,ధర్వుఁ డీధృతరాష్ట్రధరణివిభుఁడు
తన్వి పాండుండు మరుద్గణమయజని ధర్మ, దేవత నూవి యుధిష్ఠిరుండు
పవనుండు భీముఁ డై ప్రభవించె నరుఁడను,ముని యర్జునుం డయి జనన మొందె
నారాయణుఁడు కృష్ణనాముఁ డై జనియించెఁ, గనుగొను కవలనాశ్వినులుగాఁగ
తే. ద్వాపరంబుగ నెఱుఁగు గాంధారరాజుఁ, గలిసుయోధనుఁ డయ్యె రాక్షసులు పుట్టి
రతనియనుజులై కర్ణునిఁ నరుణకిరణుఁ,గాఁగ నభిమన్యుఁ జంద్రునిఁ గాఁగఁ గనుము.
క. అనలుఁడు ధృష్టద్యుమ్నుం, డన ద్రౌపదితోడఁ బుట్టె ననిలునియంశం
బున జనియించె శిఖండియు, ననిమిషగురుఁ డుద్భవించె నస్త్రగురుం డై. 112
తే. వినుము వసుశక్తి గాంగేయుఁ డనఁగ జనన
మొందె రుద్రాంశమున ద్రౌణి యుదయ మయ్యెఁ
దెలియఁ జెప్పితిఁ గొందఱు గలరు మఱియు
నిర్జరాసురాంశమున జన్మించినారు. 118
క. అని పలికి దివ్యమానంబుల వనట సమస్తంబుఁ బుచ్చి వైచెద నాతోఁ
జను దెండు మీరు గంగకుఁ, గని మొద రనిఁ దెగినబంధుగణముల నచటన్. 114
తే. అనుచు నుత్థితుఁ డగుటయు నార్పు లెలుఁగు
లాకసం బంద ధృతరాష్ట్రుఁ డాది గాఁగఁ
గలుగునాసర్వజనులు నొక్కటఁ గడంగి
యరిగి రమ్మునినాథులోఁ గురువరేణ్య. 115
క. అరుగఁగ మునిజనములు వచ్చెరు వందుచు నమ[illegible]నీంద్రు సేవించి మరు

1. ఆ. సతు లద్భుతాపాదిఁగ...

త్సరిదుపకంఠతలమునకు, నరిగిరి కౌతుకము మనములలరఁగ నెలకొనఁగన్. 116

వ. అట్లు పౌరజానపదసహితులై సకలజనంబులుం జని సాత్యవతేయుండు వనుప భాగీరథీతీరంబున విడిసి రవ్విచిత్రచరిత్రుండు దనచేయంబూనినపని మఱునాఁడు దీర్పఁగడ సేయువాఁడుగాఁ బలికిన నయ్యెండదుఱు నద్దినశేషంబు నాయామినియును శతసంవత్సరంబులుంబోలె నుండ సూర్యోదయసమయంబగుటయుఁ గాలోచితకృత్యంబు లాచరించి ధృతరాష్ట్రుండు పాండుతనయులుం దపోధనులు నప్పారాశర్యుపాలికి నరిగి యమ్మునివరుం బరివేష్టించిరి గాంధారీప్రముఖభామినులు నేతెంచి యొక్కెడ నతనిం గొలిచి యుండిరి సర్వజనులు నట్లు లెత్తికొని యరసి నిలిచిరి తదనంతరంబ. 117

వ్యాసుఁడు ధృతరాష్ట్రాదులకు భారతరణమృతుల రావించి చూపుట.

సీ. సాత్యవతేయుండు ‡ జాహ్నవీసలిలావగాహన మొనరించి ‡ గారవమున
నిరుపాధి సలుఁగున ‡ నిరుడు తిం డినవ్వఁడు, నీ కేమి సెప్పెదు ‡ నీటియందు
రవి-మగ్గలముగ రాక్షరాజు దమ్ములుఁ దత్కు-, మారవర్గము నభిమన్యుఁ డాది
యగు పాండుపౌత్రులు ‡ సర్కుజుండును బాహ్లిక ప్రముఖాఖిల ‡ కౌరవులును

తే. ద్రుపదమాత్స్యులు వారిబరకధులును శకుని
యును దదీయానుజులును నాశతని తనూజ
రాజియును భస్మగిరులఁ బుస్తరస్కరించి
కొనుచుఁ దమదివ్య దేహములే ‡ గొమరు మిగుల. 118

ఆ. దివ్యమాల్యములును ‡ దివ్యాంబరంబులు
దివ్యభూషణములు ‡ దివ్యలేప
నములుఁ జెన్నుఁ జేయఁ ‡ దమమిత్రసుభటపద
దోహములును దారుఁ ‡ దోఁచి రధిప. 119

వ. అట్టియెడ. 120

క. తగ నా కురువృద్ధునకు నొసఁగె నాఁటికి దివ్యదృష్టి ‡ సాత్యవతేయుం
డగణితతపఃప్రభావంబు గని యధికవిస్మయలంబుఁ ‡ బొందఁగ జనముల్ 121

వ. అవ్విశేషంబు విని యద్భుతప్రమదభరితయై నిజనయనంబుల బంధించినపట్టం
బపనయించి గాంధారియును గనుంగొనుచుండ. 122

క. అవ్విధమునఁ దోఁచిన మఱి, నవ్వుచుఁ దెగడుచును బెరసి ‡ నరవర పగ లే
కవ్వీరవరులు నెయ్యము, నివ్వటిలఁగ విలసనములు ‡ నెఱయ మెఱయఁగన్. 123

తే. చతురగంధర్వు లప్సరోజనులు గాన
ములఁ బ్రమోద మొనర్పంగఁ ‡ బొగడ వంది
సమితి నిరహంకృతులు హృదయములగార
వములు దెల్లంబు సేయంగ ‡ వచ్చి రొప్పి. 124

వ. ఇట్లు వచ్చి సకలబంధుజనంబులకుం బరమప్రమోదం బావహిల్లం గలసి సముచితాచారంబులు నడపి రాకొందు దెఱంగులవారలు నర్హప్రకారంబులం బితామహాచార్య శిష్య మాతృ మాతామహ పితృ పితామహ భ్రాతృ జామాతృపుత్త్ర పుత్త్రీభగినీ పౌత్ర దౌహిత్ర శ్వశురశ్వశ్రూస్నుషామాతుల స్యాలక ప్రియ ప్రియామిత్త్రసమాగమసుఖంబు లనుభవించుచు. 125

తే. అనఁగి పెనఁగి నాఁ డెల్ల నిచ్ఛానురూప
వృత్తి వర్తిల్లుచుండి ర య్యివిధము సకల
జనుల నద్భుతరసమున మునుఁగఁ జేసె
నే మనఁగ వచ్చు నాసంయమీంద్రుమహిమ. 126

వ. మఱునాఁడు రేపకడ యప్పారాశర్యుండు వనుప నయ్యిరుదెఱంగులవారలుం బరస్పరామంత్రణంబు సేసి రాజూరజనంబులు దమతమలోకంబులకుం జనువారై జాహ్నవీజలంబులం బ్రవేశింప నన్నిలింపవందనీయుండు దానును జొచ్చి యచ్చటనుండి పతుల ననుగమింప వలసినయంగనలు గంగాతోయంబులం గ్రుంకుటకు రం డనిన విని విధవ లగువీరభార్య లెల్లను ధృతరాష్ట్రగాంధారీకుంతీధర్మనందనులయనుజ్ఞలు గొని రయంబునం జని భాగీరథీసలిలమగ్నలై మానుషదేహంబులు విడిచి దేవతనువులు దాల్చి దివ్యాలంకారసమలంకృతమూర్తులై మగలం గలసి రవ్విశేషంబు నూచి సర్వజనులు నత్యంతాశ్చర్యసంతోషాధీనమానసులై రని చెప్పి వైశంపాయనుండు జనమేజయునకిట్లనియె.

సీ. జననాథ యీప్రియసంగమోత్సవకథ, వినినఁ బఠించిన వేవిధములఁ
[1]బరమప్రియము లిందుఁ బరలోకమున సంభవించు మనమ్మున కించుభంగి
బాంధవయోగశోభనము వర్తిల్లు న,నాయాసమున నామయాపగమము
గలుగు భూదేవనికాయంబునకు దీనిఁ, దగ వినిపించినధార్మికులకు

తే. నవ్యయానందసంప్రాప్తి యావహిల్లుఁ దత్పరతఁ గొనియాడిన దైవతములు
నీచదశఁ బొంద కుండంగఁగాచి తిరిగి, మేలొనర్తురు భరతభూపాలవర్య. 128

వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనుతో ధృతరాష్ట్రుం డట్లు కృష్ణద్వైపాయనప్రసాదలబ్ధం బైన తత్కాలకలితదృష్టివిశేషంబున బంధులోకంబు నాలోకించి మఱి యేమివర్తనంబున నుండెఁ బాండవు లెట్లు వర్తించి రెఱింగింపవే యనుటయు నతని కతం డిట్లనియె. 129

ధృతరాష్ట్రుండు భాగీరథీతీరంబుననుండి నిజాశ్రమంబు ప్రవేశించుట.

సీ. అయ్యద్భుతపు వృత్త మమ్మెయిఁ జెల్లిన, ధృతరాష్ట్రమేదినీపతి తపస్వి
గణము సవినయంబుగా నిజస్థానవర్గా,నమునకు నామంత్రితముగఁ జేసి
నాశ్రమాభిముఖుఁడై యరిగెఁ దోడన పాండు,రాజనందనులును రా నుదాత్త

1. గ. బరమప్రియములు బొందుఁ బరలోకమును సంభవించు మనమ్మున.

తేజు సత్యవతీతనూజు మున్నిడికొని, యప్పు డమ్మునిపతి యతనితోడ

తే. నీవు వేదశాస్త్రార్థముల్ భావితాత్మ, లగుమునీంద్రులచే జెవులార వింటి
కంటితనయుల నీకన్నకంటె నొప్పి,యుండుదురు వారు దివిసౌఖ్యయోగ మెసఁగ.

ఉ. కావున నింక వారికయి కౌరవసత్తమ యుమ్మలింప కా
త్మావిలభావముం దపమునగ్గలికం బెడఁబాపు నిన్ను సం
భావనఁ గొల్చి యొక్కనెల పాండవముఖ్యుఁడు నిల్చె నిష్ఠమై
నీవనభూమి నీవసుమతీశ్వరుఁ బొమ్మనఁ గాదె వీటికిన్. 131

వ. అని చెప్పిన నప్పరమోత్తముండట్ల చేసెద నని పలికి యమ్మునిసత్తమునకుం బ్రణమిల్లి భవదీయకృపావిశేషంబునం గృతార్థుండ నైతి నని యతనినామంత్రితుం జేసినం బాండవులుం దగ నప్పరమముని వీడ్కొని రయ్యందఱును దీవించి యమ్మహాత్ముం డంతర్హితుం డయ్యెఁ దదనంతరంబ. 132

సీ. అంబికేయుండు ధర్మాత్మజుఁ జిత్తసం, ప్రీతి మోమునఁ దోఁపఁ జేరఁ బిలిచి
వసుమతీకార్యనిర్వాహంబు పెద్దకొ,ల్వున నుండి నీ వనుదినము నడప
కునికి కర్తవ్యమే వినుకులు భీష్మాది,మహితులచేత సత్సమగ్రభావ
మొందినయవి యింక నుపదేశ మేమియు, వలవదు రంధ్ర మొవ్వానిజనంబు

తే. వేచు ననుజానుగతుఁడ వై వేగ పొమ్ము, దారయుతముగఁ బురికి నుదారచరిత
నీకతంబున మున్న నాశోక మెల్ల, బాసెఁ దేజంబుసౌఖ్యానుభవముఁ గంటి. 133

చ. తపమునెడఁ మదీయమతి తత్పర గావున దాని కోర్తు నీ
వపగతఖేదమానసుఁడ వై నను నిం దతినిష్ఠ నొందఁ బం
చి పురజనంబు సమ్మదముఁ జెందఁగ సైనికు లుల్లసిల్లఁగా
నృపవర యేఁగి రాజ్యభరనిర్వాహణం బొనరింపు నావుడున్. 134

సీ. ధర్మతనూజుఁ డాతనితోడ నిట్లను, నధిప భీమాదుల ననుగఁ బనుపు
పుడమి రక్షింప నీయడుగులకడ నేను, నిలిచి మాతల్లుల నిన్నుఁ గొలిచి
యుచితతపమున కనుగుణం బైనట్టి,శుశ్రూషణము సేయుచును దపోవి
యతితోడ నుండెద ననవుడు గాంధారి, యిట్లనఁ దగునన్న యీవ కాదె

తే. కురుకులమునకు సంరక్షకుఁడవు నీవు
దండ్రులకుఁ బిండ మొసఁగఁ గర్తవు భవజ్జ
నకునిపంపు సేయుము భూజనము దలంక
కుండఁ బొమ్మది ప్రియము మాకయ్యుల్లములకు. 135

వ. అని పలికిన నప్పాండవాగ్రజుండు పాండురాజాగ్రజమహిషితో నిట్లనియె. 136

ఆ. ఇట్లు మీరు నన్ను నెంతయుఁ దఱిమిన
విపినభూమి మిమ్ము విడిచి పోవ
నియ్యకొనదు నాదుహృదయంబు మునుపోలెఁ

గలుగ దిపుడు రాజ్యకాంక్ష నాకు. 137

క. విను పాంచాలురు మాత్స్యులు, వనితాజనశేషులైరి వారలఁ జేరన్
జననీ శూన్యంబైతోఁ, చినయది రాజ్యంబు నాదుచిత్తంబునకున్ 138

వ. అట్లుం గాక. 139

క. సమరము దీర్చినఁ గోలెను, శమనిరతా! నామనంబు సారతపశ్చ-
రమిమింపఁ గోరు నమ్మ, త్సమధికతపమునకు నేను సహదడి సేయన్. 140

సీ. అని విని సహదేవుఁ డతనితో నే దప, మాచరించెద పీర లంతటికిని
శుశ్రూష సేయు చిరయాశ్రమంబున నన్ను, నక్కుమారుని గుంతికక్కుఁ జేర్చి
వలవదు మీరు రా పలతు లై మామీఁది, భక్తిని పెనఁగ నీకు సలుకు లిట్లు
పలుక మీయునికి తపమునకు విఘ్నంబ, కాక యేకాగ్రత గలుగు నెట్లు

ఆ. మాకు నియమవిధిసమాచరణములపై, నింత యొకింత సారలెల్ల భరంగి
నరుగుటొప్పఁగాని కురుకులోద్వహులు మాట, గొనక యునికి సనదు కర్తనసులార.

వ. మీకు సర్వకార్యంబులయెడను శుభంబు లయ్యెడుమని పోయి రండనిన నజాతశత్రుండు మఱి యేమియుం బలుకం బుద్ధిలేక ధృతరాష్ట్రునితోడం దపోమహాసీయులైన మిమ్ముం గొలిచి గతకల్మషుండ నైతి మీయాజ్ఞాపనంబు దల నిడికొని పురంబునకుం బోయి వచ్చెద ననుటయు నక్కురువృద్ధుం డతని దీవించుచు నాలింగనంబు సేసి భీమసేను సాంత్వనవచనంబులం బ్రీతుం గావించి కౌఁగిలించుకొని గాండీవిం గొనియాడి సంశ్లేషంబు బాచరించి కవల సంభావించి పరిరంభణంబు నిర్వర్తించిన నయ్యేవురు నతనిపాదంబులకుఁ బ్రణమిల్లి యాశీర్వాదంబులు వడసి. 142

సీ. అతిభక్తి గాంధారియడుగుల కెఱఁగిన, నద్దేవి వారల నక్కుఁ జేర్చి
దీవించె వారు గుంతీచరణంబులు, ఫాలముల్ వొందఁగఁ బ్రణతు లైన
దప్పక కుచ్చి యశ్రుదళి నొక్క కౌఁగిటఁ, బొదివి యాశీర్వాదవచనములు క్రమమున
నర్మిలి పెంపున నలరుమనంబుతో, వేర్వేఱ యిచ్చె నావీరవరుల

తే. ద్రుపదపుత్రికా ప్రభృతివధూజనములు, దగు తెఱంగుల మామ నత్తలను వీడు
కొనిరి వారును వారు నగ్గురుజనముల, నల్లవలగొని చనిరి నృపాగ్రగణ్య. 143

క. చని పరిజనములుఁ బౌరులు, నను మోదముతోడఁ గొలువ నరిగి నగరం
బునకుం గన్నులపండువు, జనపదము జనం బొనర్ప జనసంస్తుత్యా. 144

వ. అరిగి సముచితవర్తనంబుల నుండి కొంత కాలంబు సనిన నొక్కనాఁడు నారదమునీంద్రుం డనుజసహితుండై యున్నధర్మతనయుకడకుఁ జనుదెంచిన నజ్జననాథుండు దమ్ములుం దానును సమ్మహాత్మునకు భక్తిం బ్రణమిల్లి యాసనార్ఘ్యపాద్యాదిసత్కారంబు లొనర్చి తదీయసమీపంబున నాసీనులై రతనివడన [illegible] వినయం బెసంగి యమ్మహీపతి మహాభాగ యెందుండి

రాక నేఁడు దేశంబులఁ జరించితి నేను మీకు నేమివలసిన నేయుఁడుఁ జెప్పెదం డనిన నప్ప
రమసంయమి యప్పాండవమిత్రేనితోడ. 145

నారదుఁడు పాండవులకు ధృతరాష్ట్రాదులనిర్యాణంబు చెప్పుట.

సీ. భూపవరేణ్య తపోవనంబుననుండి, వచ్చితిఁ దీర్థసేవాపరత్వ
మున నేను బహుదేశములఁ జరించితి నిన్నుఁ, గని పెద్దకాలంబు గాన చూడఁ
దివిరి యిందులకు నేతెంచితి ధృతరాష్ట్రు, చరితంబు జాహ్నవీతీరపరిసరభూము
జనములచే వింటి ననిన నజ్ఞనపతి, యారాజవర్యుఁడు గాంధారి గొంతి
తే. సంజయుండు సమాధానసహితులై శ, రీరములవింత వుట్ట క్షుత్స్వాంతరై యునికిమె
ననుడు నద్దేవముని వారియఖిలవర్తనంబు వినుము సుస్థిరహృదయుఁడవు బుద్ధితోడ. 146
వ. అనిపలికి యిట్లను మీరు వోయి కాంతారంబున నక్కురువృద్ధుం గొలిచి యుం
డి యతం డనుమతి సేయ నిట వచ్చితిరి మఱికొన్నిదినంబులకు. 147
సీ. ఆరాజు నియతిఁ గాంధారియుఁ గొంతియు, సంజయుండును దోడ్చనఁగ నగ్ని
హోత్రంబు గొని యాజ్యకోత్కరంబ గ్రసరంబుఁ బో నిజాశ్రమము విడిచి
యరిగి గంగాద్వారపరిసరారణ్యభాగమునకు నంపి దుశ్చరతపంబు
వాయుభక్షతఁ బూని చేయఁ దొడంగె గాంధారియు నీళ్ళ యాహారకలన
తే. మోపి యొనరించెఁ గొంతి మాసోపవాస, నియమమునఁ దివర్తించె సంజయుండును షష్ఠ
భోజనాంతరితం బగు భోజనంబు, వ్రతముగాఁ జరించెఁ గౌరవత్రయమున్ 148
తే. యాజకులు ధారయక్కురురాజాభక్తియుత క్తి నొద్దనుండఁ గనుష్ఠితహోత్ర హోమ
మాచరింతు రొక్కొకమరి యయ్యతండు పర్ణశాల వెడలి పూనట్టుచు విపినసంచరించు.
వ. విషమప్రదేశంబుల నవ్విభునకు సంజయుండును గాంధారికిఁ గుంతియును గన్నై
మెలంగుదు రొక్కనాఁడు వార లందఱు గంగాద్వారంబునఁ గృతస్నానులై యా
శ్రమంబునకు వచ్చుచుండ మహావాతోద్ధూతం బై. 150
సీ. యుత్తరం బగుచటచ్ఛటారవ మెసఁగంగ, మ్రాకులఁ బొదలును గ్రాఁచికొనుచుఁ
గమరును నార్తనాదములును జెల్లుగ, నఖిలమృగంబుల నాఁగికొనుచు
లాఁగలఁ బుట్టల లోఁగినశిఖల భుజంగమండలముల నింగిక్రొనుచు
వెగడొంది యటమటచ్చనెగయుబల్పులుఁగులఁ, జొగ నూర్థ్వకీలలఁ బొదివికొనుచు
తే. దెసల వన్నిటఁ దనసముద్దీర్ణగతులు, దారుణస్ఫురణమున విస్తార మొంద
ఖేచరులకును భయముగ నేచి పరఁగె, నద్భుతోద్భవంబైన దావానలంబు 151
వ. ఇట్లు ఘోరగతిఁ బెచ్చు పెరిగి చుట్టు ముట్టిన నమ్మనుజనాథుండును నన్నాతులును నిరాహా
రులై యునికిం జేసి యొక్కచోటఁ దఱియ నుఱికి తొలంగి పోవ లావు లేరై
రట్టియెడ నారాజర్షిసత్తముండు సంజయుతోడ 151
సీ. ఒక్కింత దెఱపి నీ వెక్కడనైనను, గనుఁగొని పొమ్ము గ్రక్కున దనువుఁ ద్రుంప
నని చెప్పి తలఁగి పోఁ దనకు గాంధారికిఁ, గుంతిభోజాత్మజకును నశక్య

మగుటయుఁ జెప్పిన | నడ లొంది యానూత,సుతుఁడు మీఱను నొక | చోట వెడలి
పోవుట గలిగినఁ | బోదుఁ గాకే దవా,గ్నికి మిమ్ము నెర సేసి | యకట పోదు
ఆ. నే మహాత్మ యనుడు | నిలు వాసి యిట్లున్న, జనులకివ్విధమున | సమయు టెగ్గు
గాదు నీకుఁ బోవఁ | గా వచ్చి యుండంగఁ, బోవ కునికి పాప | మునకుఁ బట్టు. 153
వ. అనిపలికి యతఁ డంబోవ నొడంబడి చేసి యప్పౌరవసత్తముండు సమాహితచిత్తుం
డై ప్రాఙ్ముఖాసీనుం డయ్యె గాంధారియుం గుంతియు నవ్విధంబునం గూర్చుండి
రప్పుడు సంజయుండు ధృతరాష్ట్రునితో యోగయుక్తుండవు గమ్మనియె నతం డునట్లు
సేసెఁ దదనంతరంబ. 154
ఆ. ఒక్క లేటిపి సంజ | యుఁడు సని హిమశైల, మెక్కె నంత వారి | నెల్ల నగ్ని
వొదివికొనియె నిట్లు | పోయి రమ్మువ్వురుఁ, బుణ్యలోకమునకు | భూపవర్య. 155
సీ. పదపడి నృప యేను | భాగీరథీతీర,మున వచ్చుచుండి య | వ్వనము దివ్య
మునులచే విని రట | సని క్రమ్మఱంగ వచ్చినది యాదిగ నయ్య | శేషవృత్త
మును నేర్పడఁగ వింటి | మూఁడుకళేబర,ములుఁ గంటి నక్కురు | పుంగవుండు
భార్యయుఁ బాండుని | పత్నియు సద్గతి, నొందిరి నీ వింక | నుమ్మలింప
ఆ. కుండు మనిన శోక | మొదవి యాతఁడు బాహు లెత్తి యెలుఁగు సెలఁగ | నేడ్వ దమ్ము
లడలుఁ గదిరి యేడ్చి | రవ్వార్త నంతఃపు,రమున రోదనార్త | రవము లెసఁగ. 156
వ. అవ్విశేషంబు. 157
క. విని పౌరజనసమూహము, లనయంబును వనట మునిఁగి | హాహారవముల్
వినువీథి ముట్ట రోదన, మొనరిచె నవ్వేళఁ గరుణ | ముత్కటమయ్యెన్. 158
క. నారదుఁ డుపశమఫణితులఁ, గౌరవసత్తమునిఁ దేర్పఁ | గ్రమమున నాక్రం
దారవము లుడిగె బంధుజ,నారబ్ధము లైన యనున | యాలాపములన్. 159

—ధర్మరాజు ధృతరాష్ట్రప్రభృతులు మృతులగుటకు శోకించుట.—

వ. అట్లు సమస్తజనంబులును విగతరోదను లై రప్పుడు కౌరవనాథుండు నారదముని
యాననం బాలోకించి యిట్లనియె. 160
సీ. ఎఱుఁగంగ వచ్చునే | యెవ్వరి కెత్తెఱి, నే దెస యగునో మునీంద్ర యేము
గలుగంగ దెస లేని | పులు వానికిఁ బోలె, నక్కురువృద్ధున | కట్టిచావు
వాటిల్లె సముదీర్ణ | బాహుదర్పోజ్జ్వలు, లైనపుత్రులు నూర్వు | రట్లు గలిగి
బలము నాగాయుత | ప్రాణసమం బగు,నమ్మహారాజ జెట్టి | యడవిచిచ్చు
తే. వలనఁ దెగటాఱె నేమన | గలదు కమల, ముఖులతాలవృంతానిల | ములసుఖించు
ప్రభువె కంకగృధ్రావళీ | పక్షవాయు, వశర నిలఁ బడి యున్నవాఁ | డకట కటకట.
క. కలమృదుమాగధగానం,బుల మేల్కను రాజు గృధ్ర | ములునుం గాకం
బులు నఱవఁగ నిదురనిదుర, నొలసి తెలుప దిక్కుమాలి | యున్నాఁడు గదే. 162
సీ. వల్లభుం డొక్కఁ డు | ద్వ్రితముఁ బూనినఁ దానుఁ, దద్వ్రితమూని గాం | ధారి యతని

పోయినగతిఁ బోయె నాయమకై యంత, వగవఁ బుత్త్రులరాజ్యవైభవంబు
విడిచి [1]మే యోమక యడవికిఁ బోయిన,తల్లికి వగచెద ధర్మసుతుఁడు
భీమసేనుండును భీభత్సుఁడును దన,కడుపునఁ బుట్టినకొడుకులట్లు
తే. [2]యెగ్గతంబునఁ దానుఁ గాఱగ్గిఁ గాలె,నట్టి యనాథయై దీనికి నంతరంగ
మలఁదురకతల్లడిల్లక యాఱటమున,నుడుక కలమటఁబడక యెట్లుండుఁ జెపుమ.
క. విను ఖాండవదహనంబునఁ, దనకుఁ బ్రమోదంబు శక్రతనయుఁ డొసఁగెనా
తనితల్లిఁ గాల్ప దగునే, యనలునకుం గడుఁ గృతఘ్నుఁడయ్యో మునీంద్రా. 164
సీ. మఱియొక్కనెవ్వగ మనమున జనియించె, నాంబికేయుండు గాఱగ్గి నెరిసె
దానికి నెయ్యది యేను జేయుదునొక్కొ, యనవుడు నారదుం డా నృపాలు
తోడ నబ్బరతవృద్ధుఁడు శాంతి యెక్కుడై, సవిశేష మైనపూజావిధాన
మున నుపాసించి తగినయిష్టి సేసి య,గ్నులఁదొలునాఁడ వీడ్కొనియె ననియు
తే. నపుడు యాజక జనములయ్యగ్నిచయము
నడవిలోన నుద్వాసించి [3]యరిగె ననియుఁ
బేర్చి యది యవ్వనం బెల్ల నేర్చె ననియు
వింటి నాత్మాగ్నిఁ గాలె నావిభుఁడు వత్స. 165
ఉ. కావున నెవ్వగం బొరయఁగాఁ బని లేదు నరేంద్ర గొంతియుం
బావకు నప్పకుం గరము భక్తిఁ దగం బరిచర్య సేసి దే
వావలి ప్రస్తుతింపఁగ నిరామయలోకము నొందె వారికిన్
నీ వుదకంబు లీ వలయు నిష్ఠ మెయిన్ దిలసంయుతంబుగన్. 166

యుధిష్ఠిరుఁడు ధృతరాష్ట్రాదులకుఁ దిలోదకప్రదానంబు సేయుట

క. అనుజన్ములు నంతఃపుర,వనితాజనములును నీవు వసుధేశ్వర వే
చని నడపుఁ డుదకవిధి నీ,జనకునకును జననులకును జాహ్నవిలోనన్. 167
ఆ. అనిన లెస్స గాక యని ధర్మసుతుఁ డేక వస్త్రధరణనియతి వఱల నెల్ల
వారునట్ల యేఁగుదేరగఁ బౌరులు, బలసి చనఁగఁ జనియెఁ బౌరవేంద్ర. 168
వ. ఇట్లు సని గంగాస్నానం బాచరించి యమ్మహీపతి మొదలగు సర్వజనంబులు ధృతరాష్ట్రునకు గాంధారికిం గుంతికిం దిలోదక ప్రదానంబులు నిర్వర్తించి నివృత్తులై యశుచిత్వం బపనయించుటకుం బురబహిరంగణంబునఁ బటకుటీర ప్రకరంబుల వసియించి రట్టియెడ. 169
సీ. ఆంబికేయాదులయస్థిపుంజముల గం,గాద్వారసలిలసంగమవిశిష్ట
సంస్కారమునఁ గూర్పఁ జాలెడుసంశుద్ధ,జనముల రావించి సబహుమాన
ఫణితుల వారి కప్పని యేర్పడఁగఁ జెప్పి, పనిచె నక్కౌరవజనవిభుండు
శ్రాద్ధార్హ దినమున వృద్ధానుమతి నతం, డక్కురువృద్ధున కతనిసతికి

1. చ. మెయ్యాడక యడవికి. 2. గ. యనదరతనమునఁ దాను. 3. గ. యరిగి రనియుఁ.

తే. గొంతికిని రత్నకాంచనగోతురంగ, హస్తికన్యాధరిత్రీగృహాదిదాన
విధుల సర్వజనంబులు విస్మితులుగ, నియతి మెయిఁ బారలౌకికక్రియలొనర్చె,

ఆ. మునిజనములు వచ్చి యనుమోద మందంగ, సకలబంధుజనులు సంతసిల
సన్నుతేతరుల నాధ్యాపకుల బిత్రు,మేధ ముల్లసిల్లె మేదినీశ. 171

క. ద్వాదశదినములు నారదుఁ, డాదరమున నొద్ద నుండి యంతయుఁ గనిన
మోదంబుతోడ నాశీ,[1]ర్వాదం బొనరించెఁ బాండవప్రవరునకున్. 172

వ. అమ్మునీంద్రునిం దక్కనేం గలుగు తపస్విసత్తముల సమర్చితులం గావించి యుధిష్ఠిరుం డామంత్రితులం జేసిన నాసంయమివరులు నిజనివాసంబులకుం జని రానృపకుంజరుండు బంధుమిత్రసహితుండై కుంజరపురంబు ప్రవేశించె నిత్తెఱంగున నాంబికేయునకు భారతరణంబుపిదప దానాదిపుణ్యక్రియాకలాప కరణంబులం బురంబునం బదియేనును దపోనియమంబున వనంబున మూఁడు నుంగాఁ బదునెనిమిదిసంవత్సరంబులు సనియె నివ్విధంబున వైచిత్రవీర్యుని[2] సంసేవన సమస్త ప్రకారంబుల సంఘటించి కృతార్థతానందంబు నొంది ధర్మనందనుండు జనంబు లభినందించుచందంబున సామ్రాజ్యంబుఁ బాలించె నని యిట్లు ధృతరాష్ట్రునియాశ్రమవాసంబువిషయం బైనవర్తనంబు వైశంపాయనుండు సెప్పిన విని జనమేజయుండు మహాత్మా యిట్లు కృతకృత్యతం బొందినపాండవాగ్రజుండు భూభారంబు నిర్వహించుచుండఁ బదంపడి పుట్టినవిశేషంబు లెఱింగింపవే యనుటయు. 173

శా. కారుణ్యాత్మకదృక్ప్రచార గతసంకల్పాంతరంగస్థిత
స్మేరాకార పతంగమధ్యమమరీచివ్యాప్తిమూర్ఛత్సుధా
ధారారూపవిహార నిర్మితజగ[3]త్సంసార సారాగమ
శ్రీరోద్యత్సువనీతలాలసిత నిశ్చింతత్వ[4]సంభావితా. 174

క. నిర్మలసరసిజదళనా, [5]ధర్మకరణదుర్నివారకాస్య దైత్యశ్రేణీ
నిర్మథన కేళిసర్జిత, శర్మకృతివిహారశీల సంయమిలోలా. 175

మాలిని. సముదవిముదదూరాసన్నరక్షాప్రసన్నా
శమశుభమరయామూర్తిస్ఫార దుర్లక్షసారా
జమవిభవసుహృద్యద్ధామ నిస్సీమభూమా
సమహృదయలసత్సంసర్గ[6]సానందవర్గా. 176

గద్యము ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం బైన శ్రీమహాభారతంబున యాశ్రమవాసపర్వంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము. 177

1. క. ర్వాదంబుల నొసఁగె. 2. గ. సమస్తప్రకారంబుల నారాధించి కృతా. 3. గ. త్సం హారనానా. 4. క. సంభావితా. 5. గ. [illegible]తదుర్నివార దైత్య. 6. చ. సమ్యక్త్రివర్గా.



హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## మౌసలపర్వము, ఏకాశ్వాసము.



—o—

ధర్మకామహృదయప
మాధానాధావకారకకాంఘ్రిసరోజా
బోధధునవ్యానపరప
మాధిసమాలీఢతేజ హరిహరనాథా. 1

ధర్మజాసామ్రాజ్యంబున నుత్పాతంబులు దోఁచుట.

క. దేవా జనమేజయధా,త్రీవల్లభునకు ముదాత్తతేజోదీప్తుం
డా వైశంపాయనుఁడు ప్రి,యావేశస్మేర చిత్తుఁ డై యిట్లనియెన్. 2

సీ. భారతసంగ్రామపారీణుఁ డై జయ,రమ యుల్లసిల్ల సామ్రాజ్యమునకుఁ
బాండవముఖ్యుఁడు పట్టంబు గట్టిన,యది యాది గాఁగ ముప్పదియు నైదు
సంవత్సరంబులు సన వనంతరవత్స,రంబునఁ బ్రజకు భయంబు దొనర్చు
నుత్పాతములు పుట్టె నుర్వీశ విను, మహో,వాయువు శర్కరావర్షి యగుచు

ఆ. వీచు నర్కునుదయవేళల బింబంబు, బలసి తోఁచు ఘనకబంధసమితి
నీరదములు లేక నిర్ఘాతపాతముల్, గలుగు నుల్క లెల్లకడల దుల్లి. 3

క. పరివేషము లినరజనీ,కరులకు నతిరూక్షరుచులు గలిగి కలుగు నం
బర మెల్లఁ గప్పి వేసవిఁ, బరఁగుం బెనుమూడమంచు పౌరవముఖ్యా. 4

సీ. ఇట్లనుదినమును నెన్నియేనియును మ,హోత్పాతములు పుట్టుచుండఁ గొంత
కాలంబుపోవంగఁ గాంతేయముఖ్యుండు, వినియె నొండొరులతోఁ బెనఁగి సర్వ
యాదవులును దెగి రంబుజనాభుండు, హలధరుండును దక్క నని నరేంద్ర
విని భీమసేనుని విజయు నకులుని, సహదేవు రావించి సంభ్రుతార్తి

తే. యగుచు నవ్వార్త యెఱిఁగించె,నందఱును, వారి లేవుకు నెవ్వగల్ గూరు మాన
సములు గలఁగ నత్యంతవిషణ్ణు లైరి, సకలజనకోటులును శోకజలధి మునుఁగ. 5

తే. అనిన విని యమ్మహీపతి ✽ యాదవులకుఁ, బోరు దమలోనఁ గలిగిన ✽ కారణంబు
వారివృత్తాంతమును విన ✽ వలతుఁ జెప్పు, మనుడు నమ్ముని యిట్లను ✽ నతనితోడ. 6

క. ద్వారవతికిఁ గణ్వుండును, నారదమునివరుఁడు గాధి ✽ నందనుఁడును బెం
పారంగఁ దొల్లి వచ్చిరి, నారాయణుఁ జూచువేడ్క ✽ నరవరముఖ్యా. 7

సీ. చనుదెంచి పురవీథిఁ ✽ జనునవసరమున, వృష్ణికుమారులు ✽ విధివశమున
మనముల నవినీతి ✽ జనియింప సాంబున, కంగనాలంకార ✽ మమరఁ జేసి
కొని వచ్చి యమ్మహా ✽ మునివర్గమునకు మి, థ్యావినయమున వం ✽ దన మొనర్చి
విభృతులై కారుణ్య ✽ నియతాత్ములార యీ, భామిని బభ్రుని ✽ భార్య ప్రజలఁ

తే. గనునె యిది యని యడిగినఁ ✽ గౌరవేంద్ర, యత్తపోధనవర్యు ల ✽ య్యాగడమున
కాత్మలందుఁ గ్రోధానల ✽ మగ్గలముగ, నెలయ నక్కుమారులతోడ ✽ నిట్టులనిరి.

క. అంబుజనాభునికొడుకీ, సాంబుఁడు గను యాదవతతి ✽ యాపాదనకి
ల్యం బగుముసలము మావచ, నంబున కనృతంబు లేదు ✽ నమ్ముఁడు మీరల్. 9

సీ. దామోదరుఁడు హల ✽ ధరుఁడును దక్కంగ, యాదవు లెల్లను ✽ నమ్ముసలము
నన్ముశక్తిగీ ✽ టడఁగుదు రబ్బల, దేవుండు దన దైన ✽ దేహ మధిక
నిష్ఠమై విడిచి వా ✽ ర్నిధిఁ బ్రవేశించు భూ, శయ్య నుండంగ నా ✽ చక్రధరుని
జర యనురాక్షసి ✽ వెరవునఁ [1]బట్టి క్రమించుఁ బొం డని చెప్పి ✽ మెచ్చుగాదు

ఆ. మనము కృష్ణు నింకఁ ✽ గను టనియెడుబుద్ధి, నమ్మహామునీంద్రు ✽ లపుడు వారలి
యాత్మవాసములకు ✽ నరిగిరి తదనంత, రంబ కృష్ణుఁ డవ్వి ✽ ధంబు వినియె. 10

క. విని కాలవేది యగున, వ్వనజాక్షుఁడు నియతి నగున ✽ వస్థకుఁ దలఁపం
జన దన్యథాత్వకరణం, బని యూహించుచు నుపేక్ష ✽ యాత్మ నొలయఁగన్. 11

క. తనచుట్లు నున్నబంధులఁ, గనుఁగొని యిట్టిది విధాతృ ✽ కరణీయం బి
ప్పని మనవారలయొప్పని, తనమున మూఁడె నని వంతఁ ✽ దలపోయకుఁడీ. 12

మునిశాపంబున సాంబునికడుపున ముసలంబు పుట్టుట.

సీ. అని పల్కి యభ్యంత ✽ రావాసమున కేఁగె, మఱునాఁడు సాంబకు ✽ మారుకడుపు
లోనుండి జనుదూత ✽ వోనిభయంకర, నిష్ఠురముసలంబు ✽ నిర్గమించె
దానికి సత్యద్భు ✽ తంబును భయమును, గదురంగ వసుదేవు ✽ కడకుఁ బాఱి
బంధు లయ్యాదవ ✽ పతికి కెఱిఁగించిన, నలఁదురి వెలువెల్ల ✽ నగుచుఁ గొంత

తే. ప్రొద్దు నివ్వెఱఁ గంది యా ✽ భూవరుండు, కదురయంబున రోఁకలి ✽ పొడిగఁ జేసి
వనధిలోపలఁ జల్లంగ ✽ వారిఁ బనిచె, వారలును నట్ల చేసిరి ✽ కౌరవేంద్ర. 13

క. మునిశాపశక్తి మానున, మునఁ ద్రోవఁగ రామి యుల్ల ✽ ములఁ దలఁపక య
జ్జనపతియు బాంధవులు న, ట్లొనచ్చ యూఱడిలి యుండి ✽ రుర్వీనాథా. 14

క. పదపడి ధృతరాష్ట్రిమహిషి, యదయహృదయ యై సమ ✽ స్తయాదవులకు బె

1. గ. బిట్టా క్రమించు.

ట్టిద మగుశాపం బిచ్చుట, విదిత మయిన సజ్జనములు । వెఱచుచు నుండన్. 15

క. కాలం బగుటయుఁ గురుభూ, పాలోత్తమ యాదవేంద్ర। పట్టణమున హ్యా
త్కాలుష్యసమాపాదన, శాలిమహోత్పాతముల్ ప్ర। జాతము లయ్యెన్. 16

తే. అరుణములు ఘూర్ణితంబులు । నైనలోచ
నములు మెఱయ మహోగ్ర దంష్ట్ర। డను ధరించి
తిరుగు నొక్కొక్క చోటను । దృశ్యుఁ డగుచు
నంతకుం డిదె యదె తోఁచె । ననఁగ నధిప. 17

ద్వారకాపురంబున మహోత్పాతము లనేకములు పుట్టుట.

తే. నీలపింగళ దేహ యా। భీలభంగి, కముగ నమ్మెయి వర్తించు । జముఁడు సకల
వృష్ణిభోజాంధకోత్సాది। విహరణమున, మునులశాపంబు ప్రేరేప । మనుజనాథ.

సీ. చిలుకలు గూబల। యెలుఁగుల చందంబు, దోఁపంగ నఱచు రా। త్రులను దివము
లందును నక్కల। యట్లు మేఁకలు గూయు, మొదవుపింఛనకు గా। డిదలు పుట్టు
మంగుల కుదయించు । మూషికంబులు గుక్క, లెల్లను బిల్లుల । నీను బలుఁదు
హరియును దక్కఁగ । యాదవనివహంబు, బ్రాహ్మణప్రతతికి । బాధ సేయు

తే. గురుల కవమాన మొనరించుఁ । దిరుగు లజ్జ
విడిచి యభిలాషముల వెంట । విభులపంపు
సేయ కున్మార్గములఁ దమ। చిత్తములకు
వచ్చినట్ల వర్తింతురు । వనిత లధిప. 19

క. అనలములు హోమకాలం, బున నానాభూతవర్ణ। ములతోడ శిఖల్
మనుజేశ్వర వామావ, ర్తన మొందఁగ నుగ్రగంధ। రౌద్రంబు లగున్. 20

క. విను కూడుఁగూరపాకము, గనుఁగొని ప్రాయి వాపి డింపఁ। గా నప్పుడు సం
జనితములై పువ్వులు గల, గొన మిలమిల మెదలు నందుఁ। గురుకులముఖ్యా. 21

సీ. అనుదినంబును నిట్లు । లశుభసూచకములు, దోఁపంగ సర్వవి। దుండు కృష్ణుఁ
డంతరంగమున సు। సమాలోచనము సేసి, గాంధారి పుత్త్రశో। కమునఁ జేసి
కోపంబు గదిరిన । శాపంబు ముప్పది, యాఱవునేఁ డెల్ల। యాదవులకు
నాశ [1]మనోన్యాసా। సనమున నగుటకు, నిచ్చె నిష్టించి య। య్యేఁడు వచ్చెఁ

ఆ. దప్ప దది ఫలించు । దానికిఁ దీర్థస, మీపభూమి యైన । మేలు గాదె
యని నరేంద్ర యమ్మ। హాత్ముఁడే భంగి నూహించి తెలియు నిశ్చ। యించెఁ దివిరి. 22

ఆ. అట్లు నిశ్చయించి । యాదవనివహాస్య, యంబు దివ్యబుద్ధి । నరసి యప్డు
దివసకలిత మగుటఁ । దెల్లంబుగాఁ గని, కొని యతండు పెద్ద। కొలువులోన. 23

ఉ. జాతర సేయఁగా వలయు । సర్వజనంబులు నంబురాశికిన్
బ్రాతిగ భక్తితోడ నని । బంధుల కెల్లను జెప్పి పీట పి

1. క. మనోన్యాసానన మగుటకు నిచ్చె, నిష్టించి యయ్యేఁడు • నేఁడు వచ్చె.

ఖ్యాతిగ నప్డు చాటుటకు నర్హునిఁ బంచిన ఘంటికాస్వనో
పేతము గాఁగ వాఁ డెలమిఁ బెద్దయెలుంగునఁ జాటె నెల్లెడన్. 24

సీ. ఆరేయి గల నెల్లవారును గోరద్రా,డలును నల్లనిమేను గలనెలరతో
రొక్కట యిలు సొచ్చి యువిదల నీడిచి, కొనిపోవ శస్త్రాస్త్రకోటికేతు
చయమును భూషణసమితియు రాక్షసు, లపహరింపఁగఁ గని రపరదినము
నం దగ్నిదత్తంబు నబ్జనాభంబును, నైనకృష్ణుని చక్ర మద్భుతముగ

ఆ. నెగసి యఖిలజనులు నీక్షింప దివమున, కరిగె నమ్మహాత్ము గరుడకేత
నంబుఁ దోన చనియె నరవర రోహిణీ, తనయు తాటధ్వజము ననుసరించె. 25

తే. వినుము సుగ్రీవమును శైబ్యమును వలాహ,కంబు మేఘపుష్పంబు నాఁగఁ గలుగునట్టి
వాహనంబులతోఁ గూడ వాసుదేవు, తేరు తదవసరంబున దివికి నరిగె. 26

క. వెడలుండు తీర్థయాత్రకుఁ, గడువేగం బనిరి సురలు గగనంబున న
ప్పుడు సువ్యక్తముగా నెక్కు డెలుంగులు సెలఁగ రాజకులవాళిమణీ. 27

క. అవి గనియు వినియు నులుకక, సవరణ లొప్పార నపు డశనసంభ్రములై యా
దవులు మనోజ్ఞము లగు శీ,ధువులును మాంసములు వేడ్కతో నింటింటన్. 28

యాదవు లందఱుఁ గృష్ణసహితులై సముద్రతీరమునకుఁ బోవుట.

సీ. సమకట్టికొనుచు భోజ్యములు భక్ష్యంబులు, నానావిధములు నొనర్చికొనుచు
క్షీరశర్కరలును ఘృతబహుభంగిక,వ్యంజనంబులు వివిధాన్నపాన
ములును నక్షతగంధములును బుష్పంబులు, గావించుకొని బలుగావళులును
దలమోపులును బండ్లును దమతోడ నొప్పారి, చనుదేరఁ గరులు నశ్వములు నరద

తే. ములు నలంకారవిరచనములు సుదాత్త
లలితరేఖంబు లగుమాల్యములును భూష
ణములు నాలేపనములు వస్త్రములు వింత
చెన్ను సేయఁ జేష్టలు విలసిల్లుచుండ. 29

క. తనరథము లేమి నొండొక, ఘనరథమును దారుకుండు గైకొని యెలమిం
గొని రా వెడవెడ గైసే,సినకృష్ణుఁడు నిర్వికారచిత్తత వెడలెన్. 30

ఆ. తొడవు చీర పూఁత తొంటియట్టులు గాఁగ, నేమివాహనంబు నెక్కి కించు
కేని వికృతి లేనిహృదయంబు మిత్రసం,భాషణంబు గలిగి బలుఁడు వెడలె. 31

క. ఆందోళికాదివాహన,సందోహంబున నితాంతచారుత్వము చె
న్నొందఁగ సమలంకృత లగు,సుందరు లేతేర విభవశోభితభంగిన్. 32

చ. వెలువడి లీల నేఁగి మును వేడ్క నొనర్చినమేటి చప్పరం
బుల నెలమిన్ మహార్ణవముపొంత వసించిన నుద్ధవుండు దా
నలఘుతపం బొనర్చుటకు నై విపినంబున కేఁగువాఁడు గాఁ
బలికిన దాని కొండొకఁడు బల్కఁడ కృష్ణుఁడు కాలవేదితన్. 33

వ. *అంత బలుండునుం బోవ నిశ్చయించి చెప్పిన. 34

ఉ. పలుకక మ్రొక్కి వీడుకోలు నొసంగ వనంబున కప్పురోహితుం
డలఘువినిశ్చయంబు వగ పంతయు మాన్పఁగఁ బోయె నాతఁడున్
హాలధరుండు దన్పఁ బోయి వినయంబును భక్తియుఁ దోఁప నయ్యనా
కులు నట పుచ్చి యొక్కెడ నకుంఠితనిర్ణయశాంతచిత్తుఁడై. 35

క. విను మొక్కఁడు నొకభూరుహ, మునమూలంబున నిరస్తమోహాంధత్వం
బున వెలుఁగుబుద్ధివిజ్ఞ,, యనిరూఢతఁ జేసి యుండె నాసీనుం డై. 36

ఉ. భూమిసురావలీమహితభోజనతంత్రముఁ దీర్పఁ బూని హా
ర్ద్యామలరాజితంబు లగునట్లొనరించినకూడుగూర లా
కోమలు లాఁగఁగాఁ గడఁగి క్రోఁతుల కన్నియుఁ బంచి వెట్టి రు
ద్దామవిహారలీల వసుధావర యాదవు లేమి సెప్పుదున్. 37

చ. పదపడి గీతవాద్యగతిబంధురనృత్యము లుల్లసిల్లఁగా
నుదధికి నంచితాతతమహోత్తరగంధవిశిష్టపుష్పసం
పదలు బహుప్రకారములఁ బ్రస్తుతి సేయఁగఁ బూజసేసి పెం
పొదవ నివేద్య మిచ్చిరి సముజ్జ్వలహృద్యపదార్థకోటులన్. 38

చ. విను తదనంతరంబ మదవిహ్వలభావము సేయఁ జాలి యిం
పొనరిచుమాసవంబులు సముత్సుకతం గనకంపుఁగోరలం
గొని హరిసన్నిధానమునఁ గ్రోలిరి యాదవు లంతరంగమో
దనకరణంబులైనయుపదంశములం గొనుచున్ మహీశ్వరా. 39

తే. సాత్యకియుఁ గృతవర్మయుఁ జారుదేష్ణుఁ
డును గదుండును బ్రద్యుమ్నుఁడును మొదలుగఁ
గలుగుయాదవు లెల్లను గాంక్షఁ బాన
విధి యొనర్చిరి పెల్లుగ విధివశమున. 40

తే. వృష్ణిభోజాంధకులు కురువీర యిట్లు, రేఁగి మద్యపానం బొనరించి మాకముఁ
బొంది కేకిసలాడుచుఁ బొందు వదలి, పలుకు లెసఁగంగఁ దిరిగి సర్వులు సెలంగ.

—— సాత్యకికృతవర్మలకు రోషజనకంబుగాఁ గలిగినసంవాదము. ——

సీ. ఉన్మార్గవర్తులై యుండిరి విను మట్టి,యవసరంబున ఘూర్ణితారుణంబు
లయిననేత్రముల సాత్యకి కృతవర్మని, వదనంబు గనుఁగొని మదము మెఱప
నొద్ద నిల్చున్న ప్రద్యుమ్నుచే సఖించుచు, నవమాన మేర్పడునట్టిభంగిఁ
బలుచ నవ్వి యరాతిబృందంబు నిద్రావశత్వంబుఁ బొందుటఁ బాపుమాని
తే. భ్రష్టదశ నొంది యుండంగఁ దుచ్ఛఁ జేసి
నడరి వధియింపఁగాఁ జొరఁ డనిన రాజ

* ఈవచనము వ్రాఁతప్రతులఁ గానిపింపదు.

తనయుఁ డంతపాపంబు సేఁయునె యితండు
పొడిచెనట యిస్సిరో యిట్టిపోటుఁ గోటు. 43

తే. అనినఁ బ్రద్యుమ్నుఁ డిది నీచ ✽ లయినవారి, తెరవు వృష్ణివంశోత్తమ ✽ దీనినిట్లు
నీకు వాక్రువ్వ నేటికిఁ ✽ బోవ విడువు, జను లితనిఁ బ్రువ్వఁ దిట్టుటసాల దెట్లుఁ.

చ. అన విని రోషభిన్నవికృతాననుఁ డై కృతవర్మ సాత్యకిం
గనుఁగొని సిగ్గు లేక యొరుకయ్యము నీ కిటు లుగ్గడింపఁగాఁ
జనునె కిరీటి చే నఱక ✽ శాంతత నొందినసోమదత్తనం
దనుతల ద్రుంపవే మఱచితా యిసిరో యిది పోరిపాడియే. 44

సీ. అనియె దానికి హరి ✽ యాభోజపతిమీఁదఁ గడు నెఱ్ఱనైన క్రేఁగంటిచూడ్కి
నిగిడించి సక్రోధ ✽ మగుమానసంబుతో, నఖిలభోజులఁ గలయంగఁ జూచె
నప్పుడు సాత్యకి ✽ హరితోడఁ గృతవర్మ, ననుజుండు శతధన్వుఁ ✽ డనుచితోద్య
మమునఁ సత్రాజిత్తు ✽ మహితాత్ము మానసీ,యుని శమంతమణికిని వధించెఁ

తే. గాదె యని వారిదెసఁ గేలు ✽ గానుపింపఁ
బలికె నవ్వాడు విని సత్యభామ కోప
మడరి వనితాస్వభావోద్గతాస్రుపూర
యగుచు హరియగ్రతలమున ✽ కరుగుదెంచె. 45

క. కనుఁగొని హరి కతిరోషము, జనియించెను దానిఁజూచి ✽ సాత్యకి యద్దే
వునకును దేవకినిం బ్రియ, మొనరించెద నని తలంచి ✽ యుద్వృత్తుం డై. 46

మ. కృతవర్మం బటుదృష్టిఁ జూచి కినుకం ✽ గెంపారువక్త్రంబుతో
నితఁ డాచార్యసుతుండు దోడ్పడఁగ రే ✽ యెల్లన్ వడిం గిట్టి క
ష్టతరోత్సాహత ద్రౌపదేయులను ధృష్టద్యుమ్నుఁ దత్సోదర
ప్రతతిం జంపిననీచు వారలగతిం ✽ బ్రాపించు టర్హం బగున్. 47

మద్యపానమత్తు లైనసాత్యకి కృతవర్మలతల నఱకుట.

మ. అనుచున్ సంయమిశాపజాతముసలాత్యంతాద్భుతస్ఫీతశ
క్తినిరూఢంబుగ నూనినట్టినిజనిస్త్రింశంబు శీఘ్రంబునం
గొని తద్దీధితి రాజిచే నతనిచూడ్కుల్ విహ్వలత్వంబు నొం
ద నుదగ్రోద్ధతిఁ ద్రుంచెఁ దద్గళము రక్తాంబుప్రసారంబుగన్. 48

తే. అట్లు కృతవర్మఁ దెగటార్చి ✽ యాతఁ డంత
నిలువ కుద్ధతుఁ డయి భోజకులముమీఁదఁ
గవిసె బాహావిలాసంబు ✽ [2]ఖడ్గదీప్తి
చయము మెఱయంగ సంరంభసత్వరముగ.

చ. కవిసినఁ జూచి యాఁగుటకుఁగా నలినాక్షుఁడు వోవునంత నా

---

1 గ. రక్తంబుల్ ప్రసారంబుగన్. 2. గ. ఖచరదృష్టి చయము నొదిఁగింప.

హావఖురులై సభోజులును నంధకవీరులు నొక్కఁ డై దెసల్
సెవుకు వడంగ నార్చి యతిశీఘ్రత సాత్యకిఁ జుట్టుముట్టి ర
ష్ణు విమలబోధుఁ డాహరి కదుం గగన లొందిరియుఁ గాలవేదితన్. 50

ఉ. తమ్మునిఁ గాచునట్టిసముదగ్రతఁ గైకొన నొల్లఁ డయ్యె వే
గమ్మున రుక్మిణీసుతుఁ డఖండపరాక్రమ మొప్పఁ గిట్టి శౌ
ర్యమ్ము భుజాబలమ్ము మెఱయుం గని సాత్యకి సంతసిల్లి ద
ర్పమ్మునఁ బేర్చె మెచ్చొలసి ప్రస్తుతి సేసిరి చూచుఖేచరుల్. 51

చ. కనుఁగొని వృష్ణివీరులు వికామసముజ్జ్వలరోషవహ్ని నా
మ్మనమున నుత్థితంబుగ సమత్సరశౌర్యము విక్రమోద్ధతిం
బెనుపఁగ వార లిద్దఱకుఁ బ్రీతి యెలర్పఁగ సింహనాదము
ల్ఘనపథ మెల్ల నిండఁగ బలంబుఁ జలంబును నుల్లసిల్లఁగన్. 52

క. భోజాంధకసంగమనవి, రాజిత మగునబ్బలంబు రౌద్రోద్రేక
భ్రాజితు లయి తాఁకి పెనఁగి, రేజాలియు లేక కృష్ణుఁ డీక్షింపంగన్. 53

క. అయ్యిరుదెఱఁగున కప్పుడు, కయ్యమునకుఁ బరమసాధకంబుగఁ గలిగె
ముయ్యంచుతుంగ యచ్చట, దయ్యము నేర్పు విను సెప్పెదం గురునాథా. 54

చ. మునివరశాపసంభవదమోఘగతిన్ ముసలంబు సాద్భుతం
బును నతిదారుణంబు నగుభూరిసముద్భటశక్తిఖేలనం
బున ముసలత్వవిస్ఫురణమున్ గలిగించెఁ బ్రవేశగిలఁ గై
కొని సమరప్రవర్తనము ఘోరతరంబుగ నెల్లతుంగలన్. 55

క. పొడి గాఁగఁ జేసి యమ్మెయి, జడనిధిలో వృష్ణివరుఁడు సల్లించినను
జెడ దయ్యె మునివరులయొక్కడుశక్తిని ముసలశక్తి కురువంశవరా. 56

సీ. యాదవవీరుల కాసమయంబున, మద్యపానోద్భూతమదము పేర్చి
మునివరామోఘవచనదివ్యశక్తినిఁ, జేసి కల్గద తుంగ వ్రేసినంత
టన ప్రతిభటునకుఁ దనుపడ గలుగునే, యనువివేకము దానిఁ గొనివిరోధి
నడిచినయప్పుడు మిడుక లేకిలఁ బడఁ, గని యిది యెట్లొకో యని తలంచు

తే. టయునుగావున సమర మిట్టలపుభంగిఁ, జెల్లెఁ గృత్రిమముసలచండదోల్లసనము
లతిశయిల్లంగ వారి కన్యోన్యవధని, హారదుర్వారసంచారఘోర మగుచు. 57

ఆ. తండ్రి పుత్త్రుఁ డన్న దమ్ముఁడు నాక యయ్యిరుదెఱంగువారు నేపు రేఁగి
మడియ మోఁద గాలిఁబడుమ్రాఁకుగముల తెఱఁగు దోఁచె నేమనంగఁగలదు.

క. మునిశాపము వారలమది, ననయము నస మొక్కఁ జేయ నం దొకఁ డైనన్
విను మరలుట దెరలుట లే, కని బెట్టుగఁ జేసి రధిప యార్పులు సెలఁగన్. 59

తే. అట్టియెడ విను భోజులు నంధకులును
జాలఁ గలుగుటఁ బ్రబలుండు సాత్యకియు స

మగ్రశక్తి ప్రద్యుమ్నుఁడు । నాది గాఁగ
మడిసె వారిచే వృష్ణిసమూహ మెల్ల. 60

సీ. అనిరుద్ధుఁ బ్రద్యుమ్ను । సాంబుని సాత్యకి, గదునిని మఱియును । గల్గువృష్ణి
వరుల నంధకభోజ । వర్గపరాక్రమ, క్రీడల సమసి యా । క్షితితలమునఁ
బడియుండఁ గనుఁగొని । పరమమునీంద్ర శా, పంబుమహాశక్తిఁ । బద్మనాభుఁ
డును దీవ్రకోపాగ్ని । తనదుచిత్తమున న్నుద్ధురమై జనింపంగ । దురసమున్నతిఁ
తే. బడక శేషించి మెఱసిన । ప్రతిభటాళి, మీఁదఁ గవిసి తుంగలఁగొని । మొత్తి నిరవ
శేషముగఁ జేసె నిట్లు ల । శేషయాదవులును మౌసలవిస్ఫూర్తిఁ । బొలిసి రధిప.

క. నారాయణుఁ డప్పుడు గాం, ధారీవాక్యంబు తెఱఁగు । దలఁచి మనమునం
బారంబుఁ బొందెనే యిది, యీయాపున ననుచు సంగ । రావని నొకఁడున్. 62

క. నిలుచున్నఁ జూచి రణసం, కులతఁ బడకయున్న దారు । కుఁడు బభ్రుఁడు న
జ్జలరుహనాభుసమీపస్థలికిం జని యిట్టు లని ర । తనితోడ నృపా. 63

తే. అఖిలజనమును సంహృత । మయ్యె నిచట, నేల బలభద్రదేవుఁ డు । న్నాఁడ మనకుండ
యరసికొనిపోము యాతని । చరితమునకు ననుగుణంబైన వర్తన । మాచరింపు. 64

చ. అనుటయు నట్ల కాక యని । యంబుజనాభుఁడు బభ్రుదారుకు
లనుసములు దల్లడిల్లఁగఁ గ । లంకుల రా బలభద్రదేవుపో
యినదెస నాదరం బెసఁగ । నేఁగి కురుక్షితిపాగ్రగణ్య యా
ఘనతరమూర్తి నవ్వలనఁ । గాంచె మహీజముపొంత నుండఁగన్. 65

యాదవు లెల్ల మడిసినపిదపఁ గృష్ణుఁ డర్జునుం దోడ్తేర దారుకుం బంపుట.

సీ. కాంచి దారుకు దెసఁ । గనుఁగొని నీవు వే, పాండుతనూజులు । పాలి కరిగి
వారికి యాదవ । వర్గసంక్షయవిధ, మెఱిఁగించి యర్జును । నింపుఁ దెమ్ము
నావుడు నతఁడు ను । హా వేగవంతంబు, లగురథ్యములఁ బట్టి । యుల్లసిల్లరద
మునఁ బూన్చికొని రయం । బున నేఁగె నప్పుడ, మ్మురవైరి బభ్రుని । మోముఁ జూచి
ఆ. యులివపిండుఁ గుంధ । రాదులఁ బురిఁ జేర్చి, యరుగుదెమ్ము వేగ । మనిన నాతఁ
డట్ల చేయుపనికి । నయి చన నొకబోయ, త్రుంగఁ జేసె నతని । దుంగ వేసి.

ఆ. హరికిఁ గానవచ్చె । నంతదవ్వుల నట్లు, వడిమె బభ్రుఁ డతని । పాటుఁ జూచి
సంయమీంద్రశాప । శక్తికి నచ్చెరు, వంది యమ్ముకుందుఁ । డన్నతోడ. 67

క. సామజరథతురగములను, భామలఁ బురి సేర్చి యే మ । రలి వచ్చెద నీ
భూమిజముకడన నిలువు ద, యామతి నారాక నోర్చి । యనియె నరేంద్రా. 68

సీ. అని గజాదుల పరి । జనులను గొని పురి జేరి, వసుదేవుఁ గాంచి య । వ్వాసుదేవుఁ
డోడగ నిట్లనుఁ । దొల్లి కౌరవకుల, క్షయము నూచితి నేఁడు । సకలయాద
వులనాశము గంటి । నలఘుతేజోధన, యఖిలబాంధవహీన । మయిన యిచటి
మనువున వర్తింప । మనసు గొల్పదు మున్న, మున్న కాననమున । కరిగినాఁడు

తే. భవత్తపమున నాబలభద్రుఁ గూడి, యేను దప మాచరించెద నింక మీర
లరసికొనుఁడు సర్వంబును నరుఁడు వచ్చు, నిందు మీపంపు నేతకై యెల్లి నేఁడు.

క. అనుచు నతని పాదంబులు, దనఫాలతలంబు సోఁక దాత్పర్యమున
ద్వినతి నడపె నంతకమును, వినిరొ జనులచేత సమరవిధ మతఁ డధిపా. 70

చ. విని బలుజీవి వోయి మది విహ్వలమై మెయి మ్రానుపాటు నొం
ద నునికి మీఁదఁ గేశవుఁడు దానును రాముఁడు నిల్లు వాసి కా
ననమున నుండువార మని నైష్ఠికతం బలుకంగ నున్నచే
తనయు నడంగఁ జేష్టితము దక్కి శవాకృతి నుండె నత్తఱిన్. 71

క. తనమాటలు సజ్జననా, థునవస్థయు వినియుఁ గనియు దురపిల్లి సతీ
జను లొక్కటఁ బెల్లాక్రం, దన మొనరించిన మురారి దయమది నొలయున్. 72

సీ. అందఱి నూరార్చి యర్జునుం డప్పుడ, వచ్చు నిచ్చటికి మీ రవంత లెల్లఁ
దీర్చు నక్కురుకులదీపకుం డని యుప, శమవాక్యములఁ దేర్చి జనకుపాల
నాసీనుఁ డయి తదీయాంఘ్రిపద్మంబులు, దనచారుపాణిపద్మముల మెత్త
మెత్తనయొత్తుచు మెలుపొందఁ గగ్గంపుఁ, బలుకులఁ జిత్తవిభ్రమము మాన్చి

తే. మఱియుఁ బార్థునిరాక పక్ష్మలును జెప్పి
యున్నయాధ్యుఁడు పని సేయు నున్నవారిఁ
గరితురంగాదికముల మీర రరసికొనుఁడు
వినుఁడు కర్తవ్య మిట్టిది సేయు నేల. 73

క. అని తగఁ బలికి యాతని వీడ్కొని రామునికడకుఁ జని యనంతభక్తిన్
వినతుండయి మనజనకుని, యనుమతి వచ్చితి మహాత్మ యనియె నరేంద్రా. 74

బలరాముఁడు శరీరంబు విడిచి యనంతునియందుఁ గలయుట.

సీ. తదనంతరంబ యద్దామోదరుఁడు రాము, వదనసరోజంబువలన వెడలఁ
గనియె మహాభుజంగము నర్మణచ్ఛాయ, మై పొల్పువక్త్రసహస్రకంబు
మణుల వెలిఁగెడుఫణములుఁ దెలుపారి, పర్వతాభోగవిభవంబు నైన
మేనిపెంపును గలదాని నబ్బలభద్రుండు నిజయోగబలము పేర్మిఁ

ఆ. దనమేనువు విడిచి చనియె నెయ్యదీర్థ, నంబునిధికి నమ్మహాత్ము నెదురు
కొనియె వరుణుఁ డధికవినయంబుతో నాగకులము లెల్ల వచ్చి కొలిచె భక్తి.

ఆ. అహికులాగ్రగణ్యుఁ డైనవాసుకియుఁ గర్కోటకుండుఁ దక్షకుండు వారు
ణుండుఁ గుండకుండుకనుం గుముకుండును, దుర్ముఖుండునుం బృథుశ్రవుండు. 76

తే. ప్రహ్లాదుఁడు ప్లక్షుఁ డక్రదంతుండు, క్రోధనాఖ్యుఁ
డుండు శంఖుండుఁ బుండరీకుండు మిత్రి
యును నజేయుండు ధృతరాష్ట్రుఁడును మొదలుగ
నరుగుదెంచిరి యద్దేవు నర్థిఁ గొలువ. 77

ఆ. పరమకౌతుకంబు భవ్యభక్తియు నొలయంగ వచ్చి కొలిచె నాఫణీంద్రు
గంగ యాది గాఁగఁ గలమహానదులు స, ముజ్జ్వలాభిరామమూర్తు లొంది. 78

క. అంతయును దివ్యదృష్టిఁ, గ్రాంతి యగునురాంతకుండు గనుఁగొన నమ్మా
ర్త్యంతరము గలపికొనియె న,నంతుఁడు దనపరమమూర్తియందు నరేంద్రా. 79

సీ. అట్లగ్రజుఁడు చన్న నచ్చటు వాసి యం
తంతఁ గ్రుమ్మరుచు మురారి సకల
లోకపాలనకు భూలోకంబునందుఁ దాఁ
బుట్టంగ వలసినయట్టిమేటి
పను లెల్లఁ దీఱుట మనమునఁ దలపోసి
తనువిముక్తికి నిమిత్తంబు దలఁచి
మునులవాక్యము తెఱంగును దొల్లి దుర్వాసు
నవయవసమితిఁ బాయసము పూయు

తే. నప్పు డఱికాలఁ బూయమి నత్తపస్వి
యచట [1]నవిలంఘ్యమై యపాయంబు గలుగు
ననినమాటయుఁ జర్చించి మనసు నింద్రి
యములు నడఁగించి గాఢస మాధి నొంది. 80

క. జలనిధిశయనుండు మహీ, స్థలశయనుం డయ్యె నట్టిసమయమునం దా
నలుకుచుఁ దత్కాంతార, స్థలి కల్లన నరుగుదెంచె జర కురుముఖ్యా. 81

ఆ. అరుగుదెంచి యచటఁ దిరిగెడునొకవేఁట, కానిఁ గాంచి వాఁడు కమలనాభు
నొడలు చూచి యొంకి నున్న [2]యేణంబను, నట్లు సేసి మాయ నావహించె.

మ. ధరణీనాథ యతండు శాతశర ముద్యద్వృత్తి సంధించి యు
ద్ధురభంగిం దెగ నిండఁగా దిగిచి [3]యత్యుగ్రంబుగా నేసె నా
హరి శ్రీపాదతలంబుఁ దూరఁ గొని యయ్యస్త్రంబు మీఁగాల ని
ష్ఠురవేగంబున నుచ్చిపోయె వెస వాఁడుం జేరెఁ గైకొంటకున్. 83

క. చేరి తెలియఁ గనుఁగొని పెం, పారుపురుషుఁ డగు టెఱింగి యత్యంతార్తిం
గూరి వడఁకి తచ్చరణాం, భోరుహములఁ దనశిరంబు వొందం బడియెన్. 84

క. పడి యేడ్చినఁ గృష్ణుఁడు దగు, నోడువుల నూరార్చి తనమనోరథ మిమ్మై
నోడఁగూడిన మానుష మగు, నొడలువిడిచి నిజపదంబు నొందుట కరిగెన్. 85

శ్రీకృష్ణుఁడు శరీరంబు విడిచి పరమపదంబునకుఁ బోవుట.

సీ. ఊర్ధ్వలోకమునకు నూర్జితతేజస్కుఁ, డగుకృష్ణుఁ డరిగిన నచటిదివ్య
మునివరులును సిద్ధులును రుద్రవసుమరు, దాదిత్యవిశ్వముఖామరులును
సంక్రందనుండును సంభృతసంభ్రము, లగుచు భక్తియు వినయంబు నెఱియఁ

1. క. నవిలంఘ్యమగునపాయ[illegible]. 2. [illegible] యేణమనుసవియట్ల. జ. యేణమునపునట్ల. 3. క. యత్యుగ్రంపుటేటు.

గా నెదుర్కొని చరణానతు లై పరమస్తుతివాక్యములఁ విస్తరిల్ల
ఆ. బలసి రండు దేవపతి యల్లఁ జేరి కరములు మొగిచి ధర్మరక్షణమున
కై దయావిధేయ మగుభేలనంబున, ననని నవతరించి తాదిపురుష. 86
ఆ. అవతరించి కంసుఁ డాదిగాఁ గలదేవశత్రుకోటి నెల్ల సమయఁ జేసి
భరతకులముకసటు వాపి సంశుద్ధప్రతిష్ఠఁ గూర్చి యరుగుదెంచి తీశ. 87
క. అమృతం బజరం బవ్యయ, మమలం బవితర్క్యమచల మాగమగమ్యం
బు మహాత్మ భవత్పద మ, య్యమేయతత్త్వంబుఁ బొందు మనిదూప్యగతిన్. 88
క. కృప నిట్లు యవతరింపుము, ప్రపన్నులగువారియార్తిఁ బాపుట కై య
జ్ఞపురుష యుగయుగమున న, న్యాపరిమితగుణాఢ్యరూప మభినుతి నొందవన్. 89
క. అని సంభృతిఁ బలుకఁగ సువచనమ్ముల నత్యాదరం బెసఁగ వినినముకుం
దుని పైఁ బెల్లు గురిసె న, య్యనిమిషపతి పుష్పవర్ష మతులితభక్తిన్. 90
ఉ. అప్పుడు బ్రహ్మ వచ్చి హరియంఘ్రులకుం బ్రణమిల్లి భక్తిమైఁ
దప్పక చూచుచున్ మది ముదంబునఁ దేల సలక్షణస్వరం
బొప్పి చెలంగ నాగమికసూక్తులఁ బ్రస్తుతి సేసెఁ బ్రీతుఁడై
యప్పురుషోత్తముండు కరుణార్ద్రనిరీక్షణముల్ నిగుడ్పఁగన్. 91
సీ. అప్పరమేశ్వరుం డయ్యండజును జూచి, యనిరుద్ధనామకం బైనయదియుఁ
ప్రద్యుమ్నతా ప్రతిభాసమానమ్మును సంకర్షణభావ[1]వికాసితంబు
వాసుదేవాత్మక[2]పరరూపమున నేక, తావిభవత్సమాధానసిద్ధి
నొందించుకొంటి నానందబోధనిరంజ,నామేయమత్పదప్రాప్తి పరమ
ఆ. మంగళానుభూతి నంగీకరించెద, సుఖుల రగుఁడు మీరు సుకృతులార
యనినవచనసమితి యుతిమృదుమధురత, నింపు నొసఁగ సలరి రెల్లవారు. 92
క. ఆదేవదేవుఁ డత్యం, తాదరసంభాషణంబు లమ్మెయి బ్రహ్మేం
ద్రాదులతోడ నొనర్చియు, నాదినిరవసాననిజపదాస్థితుఁ డయ్యెన్. 93
తే. ఇంద్రియాగోచరుం డైనయీశు నపుడు
బుద్ధిఁ జూచుచు నిర్భరాద్భుతకరంబు
లగుతదీయగుణమ్ముల నభినుతించు
చరిగి రాత్మవాసములకు జాదు లెల్ల. 94

దారుకుఁడు పాండవులకు సకలయాదవక్షయంబు చెప్పుట.

సీ. అవనీశ విను మంత నద్దారుకుఁడు చని, పాండవేయులఁ గని పరమమునులు
యాదవకులముఁ బేరలుకమైఁ దొల్లి శపించుట మును దలఁచించి పిదప
జలధితీరమున నాసవపానమత్తులై, వృష్ణిభోజాంధకవీరు లెల్ల
మునివరనిర్దిష్టముసలాత్మకము లై స, మయ్యెం చుతుంగల మోఁకులాటఁ

1. గ. వికాసతేజమ్ము. 2. గ. [illegible]

తే. చేర్చి రోయుం డోగువులఁ బరిమార్చుటయును
రామకృష్ణులయునికియు నామురారి
దన్నుఁ బుత్తెంచుటయు సవిస్తారభంగిఁ
జెప్పె వారలు వినువగఁ జేష్టడంగ. 95

తే. సర్వయాదవసంఘంబుచావు విన్న
ద్రౌపదీప్రముఖాఖిలాంతఃపురాంగ
నలును శోకించి యాక్రందనములు సేసి
రతికరుణముగఁ బురజను లార్తిఁ బొంద. 96

సీ. దారుకుం డత్యంతధర్మవినీతి మై, నర్జునుతో ననున్న నచ్యుతుండు
నిన్నుఁ దోడి తెమ్మని పనిచిన వచ్చితి, నని చెప్పెఁ జెప్పిన నతనిఁ జూచి
యాదవకులవినాశయం బైనయొప్పని, పలుకు నాచెవులఁ జిలుకునట్టి
యచటికి వేగంబ యరుగక యిచటఁ గా, ల్దన్ని యుండెడునట్టి ధైర్య మెందుఁ
ఆ. గలదు నాకు నీవు పిలువ నే లని పల్కి, యున్నతోఁ దగంగ నాడియాతఁ
డక్కులాగ్రగణ్యు ననుమతితో ద్వారవతికి నరిగె శీఘ్రగతి నరేంద్ర. 97

చ. అరిగి మగండు సచ్చినకులాంగనయుం శశి గ్రుంకినట్టిశ
ర్వరియును బోల్పఁ బట్టగుచుఁ వారిజనాభుఁడు లేనిదీనతం
బొరసి కృపైకభాజనతఁ బొందినయప్పురిఁ జూచి మానసం
బెరియఁగఁ జొచ్చె నేటి కెదు రీదినచాడ్పున నేమి సెప్పుదున్. 98

క. దారుకుఁడు దోడఁ జనుదేఁ, బౌరజనము లంతఁ దన్నుఁ బరమాశ్వాసం
బారెడుమనములతోడను, గారవమునఁ జూడఁగా నగరికిం జనియెన్. 99

చ. చనుటయుఁ గ్రొత్తపేరడలు సైఁపఁగ లేక మురాంతకప్రియాం
గనలు పదారువేలును మొగంబులఁ గప్పఁగ బాష్పవారియో
దనరవముల్ సెలంగఁగఁ బదంబులు దొట్రువడంగ దైన్యముల్
తనువులు దాల్చినట్లు దెరలం జనుదెంచిరి పార్థుపాలికిన్. 100

ఉ. వారలఁ గాంచి శోకమునవారణఁ జిత్తము వెల్లగింప న
క్కారవసత్త్వముం దెలుఁగు గద్గదికం దగులంగ నేడ్చుచుం
డే రాకభంగి డిగ్గియులఁ ద్రెళ్ళినయద్దురవస్థ జూచినన్
వైరుల కైన డెందములు వ్రయ్యలుగా వగ దాఁకు భూవరా. 101

తే. రోదనధ్వను లెసఁగంగ రుక్మిణియును, సత్యభామయు నప్పుడాసవ్యసాచి
కడకు నేతెంచి పుడమిపైఁబడిరి యనట, నెల్లమునిఁగి యుల్లంబులు వెగడునొంద.

క. తక్కను గలమహిషీజను, లక్కట్టిశనయుఁ జుట్టు నవని నొఱగి లో
నెక్కొని నవగలఁ బొగిలిరి, దిక్కెవ్వరు మాకనుచు దీనత దోఁపన్. 103

క. వినుము నృప జయుఁ డప్పుడు, దనుఁ దాఁ దేర్చుకొని యెల్లతరుణుల నూఱా

చ్చి నతనిఁ దోడ్కొని హరిజన,కునికడకుం జనియె దారుకుం డట్టియెడన్. 104

సీ. యాదవుల్ సమసిన య ననయ్యె మునడలుచుం,దమ కాక యివ్వనితాజనంబు
నందు దైన్యముతో డిప్పయుత్య తశోకస, మాకులత్వముఁ దోఁచె న నస్మృతియ
మఱచి తమునవీరిప్పయాతురత్వము గన్న,యంతన కొందల మతిళొయుల్లెఁ
గాని విశేషంబు గల్గదు కృష్ణుని,దళ యెట్టిదో యనుతల్లడంబు

ఆ. నెవ్వ రొక్క దీని నెఱిఁగించువా రను, నెవ్వగయును గదిరెఁ గవ్వడికిని
నధిప దారుకునకు న ట్లయ్యు నానృపు,కడ నెఱుంగువారుగాఁగఁ దాడు. 105

—అర్జునుఁడు సకలస్వజనక్షయదుఃఖితుం డగు వసుదేవునిం గాంచుట.—

క. తలఁకుచుఁ జని యతనిం గనఁ, బలువగలం గూగిలి సెజ్జపై మే నిడి య
శ్రులు గ్రమ్మనున్న యవ్విభుఁ, డలమట్ల గ్రొత్తయయి మనసు నలమికొనంగన్.

ఆ. లేచి యడలి సవ్యసాచిఁ గౌఁగిటఁ జేర్చి, గద్గదిక నెలుంగు గడలుకొనఁగ
నడరి పెలుచ నేడ్చె నాఱుఁ బోయినప్రజలఁ బేరు గ్రుచ్చిపనవి పనవి 107

క. మనుజాధిపుఁ డమ్మెయి రో,దన మటు సేయంగ నరుఁ డతని నూరార్చెన్
విను మవ్వసుదేవుం డి,ట్లను నాలుక దొట్రువడఁగ నాతనితోడన్. 108

చ. మనుజులమాత్ర గాక సురమాన్యపరాక్రమ ముల్లసిల్లఁగా
దనుజులఁ జాకి గీటడఁచుదర్పమునం బెను పొంది మాఱు లే
క నెగడి రట్టిబిడ్డలు కకారణరోషమునం బరస్పరా
హననము కల్గిఁచా వలసె నందఱ కక్కట దైవ మలినన్. 109

క. విను నీశిష్యులు సాత్యకి,యును బ్రద్యుమ్నుండు నిమ్మహోగ్రపుసమరం
బునఁ దొలుపీనుఁగు లై రని, వినియు బ్రదికినాఁడ నేన వీరుఁడ జగతిన్. 110

క. తొలితొలి సాత్యకికృతవ,ర్మలు రేఁపఁగఁ బుట్టె నంగరము దానను వా
రల దూఱ నేల మునిముఖ్యులశాపం బిట్టిచేఁతకుం దగి యుండన్. 111

చ. వలసిన నట్టికార్యమును వావిరి నట్టుగ నైనఁ జేయఁగా
వలఁతి మృతుం బరిక్షితుని వత్సలతం బ్రతికించె శౌరి యి
క్కాలమున యాదవుల్ పెనఁగఁగాఁ గని మాన్పఁ డుపేక్ష సేసె నీ
పొలియు టవశ్యభావ్య మని బుద్ధిఁ దలంచుట గాన నయ్యెడున్. 112

క. ఇది విధివశత్వమున నై,నది యని శోకంబు దొఱఁగునట్టివివేకం
బాదవదు ఫల్గున యాఱడి, యదువంశం బెల్ల సమసె ననువగపేర్మిన్. 113

— వసుదేవుఁ డర్జునునకు యాదవనాశనంబు తెఱఁ గెఱింగించుట. —

క. అను నెడఁ గ్రీడి యులెఁడు కృష్ణును పేక్షయ చెప్పెఁ గాని శోక మడరియుం
బనవేఁడు కృష్ణుఁడు గావున, ననుమానము వేఁవ దమ్మహాత్మునినికిన్. 114

సీ. అని మదిఁ జర్చించె నప్పు డవ్వసుదేవుఁ, డతనితో ననియె సహపుత్రయాద

---

1. క. చా వొలసె నందఱ కక్కట 2. ట. దగి యుండన్. 3. గ. దమ్మహాత్మునినికిన్.

పులును మహామునీంద్రుల ఘోరశాపంబు, ఘనశక్తి నుద్భవించినమహోగ్ర
ముసలంబు నిలసనమున ముసలాయుధా, నను లైనతుంగల సమదవృత్తి
నన్యోన్యవినిహతి యాచరించి గతాసు, లగుటయు నొక్కండు నరివపిండు
ఆ. గరుల దురగములను నరదంబులను గొని, యరుగుదెంచెఁ గృష్ణుఁడనిన నాథ
నంజయుండు దనమనంబు దల్లడిల్ల, నమ్మునుంకు దెచటి కరికేనధిప. 115
క. అని యడిగిన వసుదేవుఁ డతని కిట్లను నట్లు వచ్చి దామోదరుఁడే
వనటం బొందుచు నుండఁగ, నను నూరార్చుటకుఁ గాఁగ నరవర నాతోన్. 116
సీ. విధివశంబునఁ జేసి వృష్ణిభోజాంధక, నాశంబు వాటిల్లె నరున కేను
జెప్పిపుచ్చినవాఁడ నిష్పాఢ యక్రూర, వాగ్రణి యుప్పరి కరుగుదెంచు
నీయెడ భక్తుండు నినుఁ గొల్చి యుండెడుఁ, బనిచినపని యొనర్పంగ వలఁతి
యమ్మహాభుజుఁడు కార్యదక్షుండు శౌర్యసం, యుగ్రుండు విక్రమసహితుఁ డతఁడు
ఆ. నాఁగ నే ననంగ నరనాథ భేద మిం, చుకయు లేదు వినుము శోక మతనిఁ
జేతఁ బట్టి నీవు మాతంగతురగాది, కములబంధుజనులఁ గాచికొనుము. 117
క. అతఁడు వనితలను బాలుర, నతిప్రయత్నమున నరసి యాపద బాపున్
ధృతిసారమహిత యంబుధి, కతిపయదినములను ముంపఁ గల దిప్పురమున్. 118
సీ. యాదవుల్ దమలోన నాహవం బొనరింప, కటమున్న బలదేవుఁ డడవి కరిగి
యత్యంతనిష్ఠమై నధికతపోవర్తనంబునఁ దగిలి యున్నాఁడు నాకు
నదియ యొప్పెడు తెరు వై యుండుఁ గర్తవ్య, మిట్టిది వేయును నేల యింక
నొండువిచారంబు లుడిగి దయాలోల, యనుమతి సేయు మయ్యప్పనికి నన్ను
తే. నా. ధనంజయు చెప్పినయట్ల సకల
కార్యజాతంబు నడపి నెగడు మతండ
సమరమృతయాదవుల కెల్ల సముచిత ప్ర
కారమునఁ జేయు నగ్నిసంస్కార మనియె.
క. అతఁడు కాలాంతరమున, బ్రాఁతిగ భవదీయభవ్యపరలోకవిధుల్ 119
చేతోగతి భక్తిపరిస్ఫీతములుగఁ జేయు ననియుఁ జెప్పెఁ గుమారా.
క. చెప్పిన నేను నొడంబడి, యప్పురుషోత్తముని నెమ్మి ననిచితి నిట నీ 120
చెప్పినయట్టులు సేయుట, యొప్పైనను గలదు నీకు నొక్కఁడు సెప్పన్. 121
ఉ. వీనుఁగు పెంటగాఁ బడినబిడ్డల నెల్లఁ దలంచు టెప్పుడున్
మానఁగ రామి తెల్ల మిది మానసముం గలఁగింప నన్నముం
బానము నెమ్మెయిన్ రుచికిఁ బట్టగు నట్లును గాక యిద్దెసం
దాను [1]సహించి యేమిగతిఁ [2]దావుకొనన్ మొయిఁ బ్రాణ మర్జునా.
క. ఈ వనితలఁ బ్రజలను దం, తావళముఖవస్తువులను దగుచందమునన్ 122

1. గ. వహించి. 2. క. గ. చ. దావికొనన్.

నీ వరసికొనుము బాహు,శ్రీవిశ్రుత కృష్ణపనుపు ǂ చెల్లింపవనా. 123

సీ. అన విని ఫల్గునం ǂ డావృష్ణిపతిహృద,యము దేహసిరపేఱ ǂ మగు టెఱింగి
డెందంబు నెవ్వగఁ ǂ బొంద నమ్మెదిసీ,రమణులతోఁ గృష్ణవిరహిత,మైన
యుద్దేశమున వసి,యింపంగ నాకుఁ జి,త్తము గొల్పునే ధర్మ,తనయభీము
లును నేను మాద్రినందనులును బాంచాలి,యును నేకచిత్తుల ǂ మనఘ వినుము

తే. ధర్మతనయుఁ డికార్యంబు ǂ దలఁచి యున్న
నిశ్చయించి బాలకులను ǂ నెలఁతపిండుఁ
దగుధనమును నింద్రప్రస్థనగరమునకుఁ
జేర్పవలయుట మాకెల్లఁ ǂ జెప్పినాఁడు. 124

ఉ. కావున నప్పురంబున సుఖస్థితి నుండెడునట్లు గాఁగ బృ
థ్వీవర సంప్రయత్నమున ǂ వీరల నందఱ నంద పెట్టెదన్
నీవు పురస్సరుండ వయి ǂ నెమ్మిఁ జనం గొనిపోయెదర్ణ భవ
ద్భావమునుమ్మలంబుఁ బెడఁ ǂ బాపుము తప్పునె దైవకృత్యముల్. 125

క. అని పలికి దారుకునిఁ గనుఁ,గొని యాతనిచిత్తవృత్తి ǂ గుందుట బుద్ధిం
గని యిట్లనుఁ గృష్ణునిపో,యినవంక నెఱింగి పోద ǂ మేనును నీవున్. 126

ఉ. ఇచ్చటికార్యముల్ నడపుఁ డి ǂ ట్లని నెమ్మి నమాత్యకోటికిం
బొచ్చెము లేక చెప్పి మఱి ǂ పోవుట యుక్తము నిల్చి వారలం
దెచ్చుట కీవ పొమ్మనిన ǂ దిగ్గన నాతఁడు పోయి యందఱిం
దెచ్చె సుధర్మ యన్నభకు ǂ దేవపతిప్రియసూనుఁ డుండఁగన్. 127

సీ. అమ్మండపమ్మున ǂ కరిగినయమ్మంత్రి,వర్యులక్కౌరవ ǂ వంశవర్యు
వినయ మారఁగఁ బరి ǂ వేష్టించి రమ్మహా,త్ముండుఁ గరమును ǂ నార్ద్రుఁ డగుచు
గారవంబున వారిఁ ǂ గలయఁ గనుంగొని, యంతరంగంబు ǂ శోకాగ్ని నెరియ
వారలతో నిప్డు ǂ పౌరజనంబుల, నెల్లను బిలిపింపుఁ ǂ డేను మీకు

తే. వారికిని నెఱిఁగింపంగ ǂ వలయునట్టి,పనులు గల వని చెప్పిన ǂ విని రయమున
వారు బ్రాహ్మణక్షత్రియ ǂ వైశ్యశూద్రు, లాదిగాఁ బ్రజ రావించి ǂ రధిపముఖ్య.

తే. అరుగుదెంచి యాప్రజలు చి ǂ తాసనమున
నున్నయయ్యింద్రనందనుఁ ǂ గన్న నతఁడు
గరము నెమ్మి నయ్యందఱఁ ǂ గలయఁ జూచి
యిట్లనియె మోమునను దైన్య ǂ మెసక మెసఁగ. 129

క. వననిధి నేఁటికి నేఁడవు,దినమున నిప్పురము ముంచు ǂ దివిజులు గగనం
బుననుండి చెప్పఁగా నే, వినినది యిది వెడలవలయు ǂ వేగమ మనకున్. 130

క. వినుఁ డింద్రప్రస్థపురం,బునకు నధీశుఁడుగ వజ్రుఁ ǂ బోఁడిమితో నే
నునిచెద మీ రెల్ల నతఁడు, మనుపంగాఁ దొంటియట్ల ǂ మనుఁ డచ్చోటన్. 131

క. సరకులు భారవహులకును, భరియింపఁగఁ గొలఁది యయిన ✽ భంగిని మోపుల్
వెరవుపడఁగఁ గట్టుఁడు సై,చ్చెర శకటములాయితంబు ✽ సేయుఁడు మీరల్. 132

ఆ. వాహనములు వాసి[1] వానిముట్టులు నొక్క,వంక గా నొనర్చి ✽ నలసినపుడ
కట్టి వెడలి పోవు ✽ నట్టి తెఱంగున, కనువు గాఁగఁ జేసి ✽ కొనుఁడు వేగ. 133

క. ఈ దేశమ్ము ప్రజ ధర్మజు,నాదరసంభావనముల ✽ నాజ్ఞానిరతిన్.
యాదవవీరుల కలనాఁ, డేది తెఱం గట్టి మనికి ✽ యొసఁగం బారున్. 134

క. అని చెప్పి పురజనులఁ బోఁ, బనిచి సచివకోటితో ని ✽ శ్చయము లాదిగ వా
హనముల సవరణ బెరయం, గొని రాఁ దగినపరిచార ✽ కుల మునుముట్టన్. 135

క. నియమింపుఁడు నగరిసరకు, లయినవి యుట్టట్టిభంగి ✽ వక్షీణాము లై
మొదలం గలవారలఁ గని, పయనము తెఱఁగు సమకట్టు ✽ పని మఱవకుఁడీ. 136

క. సుందరులకు బాలురకును, నందలములు వేసడములు ✽ నాయితములుగాఁ
గందళ కుందళ చనువిధ, మొందఁగ సమకట్టుఁ[2] డెడల ✽ కుండుఁడు తాల్మిన్. 137

తే. గతము లయినకార్యంబులు ✽ గ్రమ్మఱింప, రాదుగాని మనకు ధర్మ ✽ రాజు గలఁడు
క్షేమజనరక్ష కొడయనిఁ ✽ జేయవచ్చు, వాసుదేవుని మనుమని ✽ వజ్రదేవు. 138

క. అని వారి నిండ్లకును బోఁ, బనిచి మదిని వగలు మిగులఁ ✽ బార్థుం డార
యనవద్యచరిత కృష్ణుస,దనమున వసియించె సముచి ✽ తవృత్తమునన్. 139

చ. తెలతెల వేగునప్పు వసు ✽ దేవుఁడు నిర్మలయోగనిష్ఠ మే
నిల నిడి వర్ణనీయగతి ✽ నేఁగినఁ దత్సదనాంతరంబునం
జెలఁగె ననేకరోదనవి ✽ శేషము లన్వసుదేవవల్లభల్
వలఁపురు నెమ్మిఁ గూడి మర ✽ ణంబున కై కయిసేసి రత్తఱిన్. 140

—వసుదేవుఁడు శరీరంబు విడిచి పరమగతికిఁ బోవుట.—

సీ. ఆసమయంబున ✽ నర్జునుఁ డచటికి, నేతెంచి వైభవ ✽ మెసక మెసఁగఁ
ప్రాలంబమాలికా ✽ పంక్తులఁ గదళికా, స్తంభంబులను శాత ✽ కుంభకలశ
శిఖరంబులను బెంపుఁ ✽ జెలువును విలసిల్ల, యానంబు గల్పించి ✽ యాదవేంద్రు
శవము సుస్నాతంబు ✽ చందనచర్చాస, మేతంబుఁ జీనాంబ ✽ రాతిశోభి

తే. తంబు నాభరణస్ఫురి ✽ తంబు మాల్య,పూజితంబును గాఁ జేసి ✽ యాజకప్ర
యుక్తమంత్ర తంత్ర స్ఫుట ✽ యోగమింపొ,నర్ప నేతెంచె సామగా ✽ నంబు సెలఁగ.

క. విను దేవకియును రోహిణి,యును భద్రయు మదిరయును స ✽ ముచితవిధానం
బున నొనరించినయానము, లనూనపరికర్మరుచిర ✽ లయి యెక్కి తగన్. 142

క. చెలువుగ జుట్టలు దాఁపట, వలపట నేతేరఁ దెలివు ✽ వదనసరోజం
బుల నొప్పం దగిమెడుమా,టల వారలనగలు మానవ ✽ తులు నుతికెక్కన్. 143

క. అన్నృపునివల్లభలు శవ,యానంబుపిఱుంద నిట్లు ✽ యరిగిరి విధి స

1. గ. వాసిముట్టును నొక్క. 2 జ. డోడకుండుఁడు.

నొ్మనితగతి ముంగట వి,ప్రానీకము సనియె నుజ్జ్వలాగ్నులు గొంచున్. 144

తే. ద్వారకావాసు లెల్లను దల్లడంబు, లుల్లములఁ గప్ప మోములు నురుల బాష్ప
ధార లతికరుణమున హాహారవంబు, లెసఁగ నేగిరి [1]వెనుక నయ్యనిరుదెసలను. 145

సీ. ఇమ్మెయిఁ గొని చని యమ్మహీశుఁడు వేడ్క, మెలఁగెడుతోఁటలోపలసమగ్ర
చందనాగురుకాష్ఠచయముల మున్న కా,వించినసాదకు సద్విధియుతముగ
నప్పాడె సేర్పించి యర్జునుఁ డయ్యాద, వేంద్రుని పితృమేధ మెల్లజనులు
నభినుతి సేయంగ నచ్చితియం దాశ,వంబు నారోపింపఁ బనిచి యగ్ని

తే. దీప్త మగునట్లు సేయింప దేవకీప్ర,ముఖులు నలువురు నప్పాడ డాశిఖఁ బ్రవేశ
లీల నంగీకరించి రాబాలవృద్ధ, మైనసకలజనంబులు నార్తినొంద. 146

క. ఘృతములు పైఁ జల్లఁగ న,చ్చితి బేర్చినసప్తజిహ్వశిఖలరవము నూ
ర్జితసామగానసనాదో,ద్గతియును హాహారవంబుఁ గలసి చెలంగెన్. 147

క. తదనంతరంబ వజ్రుఁడు, మొదలగుపురుషులు సతీసమూహముఁ దగుమై
నుదకప్రదానవిధి య,య్యదుముఖ్యున కాచరించి రన్వయముఖ్యా. 148

తే. అప్పు డందఱు బంధులనాదరమునఁ, దనకు సముచితాలాపసంతానకలన
ననునయించి పురంబునకరిగెఁ దాను, వారు వగ మదిఁ గదుర విశ్వవాచ్చుఁడధిప.

తే. ఇత్తెఱంగున సత్క్రియా[2]యత్నుఁ డైన,యర్జునుఁడుపితృమేధముఁ నభినుతముగఁ
జలిపి వృష్ణిభోజాంధకసమరధరణి,తలమునకు బుధజనసహితంబు గాఁగ. 150

సీ. అపరదినంబున నరిగె నప్పుడు వృద్ధ,బాలకాంతాజనప్రకరములకు
నని నిర్గతప్రాణులై పడి యున్నభో,జులను నంధకుల వృష్ణులను గలయఁ
జూడంగ నుత్కటశోకంబు గదిరిన, నఱిముఱి మేదిని నొఱగువారు
విప్రలాపంబు నానాప్రకారంబులఁ, జేయువారును నిరుసేయు నెత్తి

తే. యలఁత నాక్రందనములు హాహారవముల
తో నొనర్చువారును నైన నానరుండు
దద్దయడలి దారుకుభాషితములఁ జేతి
యఖిలజనులకు నుపశమ మావహించె. 151

క. తదనంతరంబ రణమృత,యదుసంఘములకు సముచితానలసంస్కా
రదశాపూతత్వము నా,విదితయశుఁ డొనర్చె విప్రవితతిఘటనుఁ డై. 152

ఆ. నిఖిలబంధుజనుల కఖిలమృతులకును, దగఁ దిలోదకప్రదాన మాచ
రించునట్లు గాఁగఁ బంచి యలుత్తక్రి,యత్వ మొనర నడపె నక్కిరీటి. 153

క. ఇవ్విధమున విస్తృతముగఁ, గవ్వడి నియతుఁ డయి బంధుకార్యము లెల్లన్
నెవ్వగలు దనమనంబున, నివ్వటిలఁగ నాచరించె నృపసంసేవ్యా. 154

1. క. వెనుక నిర్దేశల నధిప. 2. క. వృత్తుఁ డైన.

G—17

—అర్జునుఁడు రామకృష్ణుల వెదకుచు వనంబునకుఁ బోవుట.—

సీ. పదపడి యాదవభామినీబాలక,వృద్ధజనంబు నాసమృద్ధబుద్ధి
గలయంగఁ గనుఁగొని పలుకుల మార్దవ, మారఁ బురంబున కరుగఁ జెప్పి
రామకృష్ణులు తపోరతులై ప్రవర్తించు,వనభూమి యారసికొని తదీయ
సందర్శనమునకుఁ జనియెద నని వారి,నామంత్రితులఁ జేసి యేమి యనుచు

ఆ. టకును శోకమార్పకటకును దారుకుఁ డాది, యయిన తగినవారి సర్వవచన
రచన మెఱయఁ బనిచియుచితాప్తకతిపయ, జనులు దోడ రాఁగఁజనియెనధిప.

క. చనిచని మనమున నిట్లను, ననుఁ బిలువఁగఁ బనిచి జనకునకుఁ గావలి గా
నునిచినవాఁ డయి నెమ్మదిఁ, జనినహరికిఁ జావు సెప్పఁ జనియెద నకటా. 156

సీ. ఆరాజు సచ్చుట నారాయణున కేల, సెప్పఁ దపోనిష్ఠఁ జెంది యున్న
యమ్మహాత్మునిహృదయము నకు మెరమెర, పుట్టింప నేటికిఁ బోయి కాంచి
పంచినపని యాచరించెదఁ గాక సువినయభక్తికముగ నరుచు మఱియు
వివిధచింతారూపవిధులు చిత్తమ్మునఁ, బొఱ గాంధారిశాపంబు తెఱఁగుఁ

తే. దలఁచి యయ్యవ్వ యతఁ [1]డెగ్గతంపుఁజోట
నరయ దిక్కెవ్వరును లేనియట్టి తెగుట
నొందఁ గలవాఁడుగాఁ బల్కె నోద్ద నుండి
వింటి నకట నిప్పును జైవ లంటు నొక్కొ. 157

క. అనుచుఁ బెనుఁగలఁక నొందిన,మనంబుతో వలయుదిక్కు మఱి నరయక వే
చను చుండె నొందు లెస కే, మనఁ గలదు విధాతచేత కద్దముగలదే. 158

క. విను మనుచరు లాతనిమోమ్,మునఁ దోఁచువిషాదభావమును గని వెగ డొం
దినకతన నట్లు గా డి,ట్లని చనియెడువంక సాల రై రెఱిఁగింపన్. 159

ఆ. అట్లు దిక్కు దప్పి యడవిలోపలఁ గొన్ని,దినము లిట్టు నట్టుఁ దిరుగ నొక్క
బోయ నూచి యెందుఁ బోయెద రనవుడు, హరి తపంబు సేయునచటి కనిరి.

క. అన విని యొకఁ డొక్కెడఁ, గనుఁగొంటిం గృష్ణుఁ జూపఁగా వచ్చెద నా
వనభూమి నాతఁ డింతకుఁ, జనునో నిలుచునొ యెఱుంగఁజనుదెండనుచున్. 161

తే. అక్కిరాతుఁడు సన చాని ననుగమించి
వెన్నురుచిరదేహము పడి యున్నచోటు
సేరి తెలియఁగఁ జూచి మూర్ఛిల్లి పుడమిఁ
బడియెఁ గవ్వా యనుచు లడలు నొంద 162

—అర్జునుఁడు రామకృష్ణుల కళేబరంబులు సూచి పలవరించుట—

క. నుఱి [illegible]ంగసేప్పన [illegible] దె,ప్పిఱి లేచి [illegible] మేను పెద్దయునుం బ్రా
ద్రి[illegible] [illegible], బఱికి [illegible] [illegible]మ్మ బాష్పము లురులన్. 163

1. 'డుగ్గతింపుఁజోట' అని పెక్కుప్రతులు.

క. అను చరులలోని భూసురు, లనునయవచనములఁ దేర్ప ॥ నతఁ డంకిలి దే
ఱినమతితో నశ్రులు మఱి,యును గ్రమ్మం గరతలమున ॥ నొత్తుచుఁ జూచున్.

ఉ. ఏమిట నిట్టు లయ్యెనొకొ ॥ యిమ్మహితాత్మకుఁ డంచు నున్మిష
ద్ధామము లైనయంగములఁ ॥ దాఁ గలయం బరికించి యోగిహృ
ద్యామలపాదపద్మగత ॥ [1]మైనవిశేషము సూచి రుద్రతే
జోమయుఁ డైనసంయమివరుచోగతి గాంచి సువిస్మితాత్ముఁడై. 165

క. అవికృతమును రుధిరమునై, యవయవములు నిమురవోయి ॥ నప్పటి క్రియనుం
డ వఱలుకృష్ణుని దేహం, బవిరతచక్షురభిముఖత ॥ నాలోకించెన్. 166

ఉ. అమ్మెయి నూరకుండ ననుశయాయిజనమ్ములు పెక్కు లాడి చి
త్తమ్ముకలంక దేర్చి యుచితక్రియకుం దొడఁగొల్పి బంధుసం
ఘమ్ముల నిందుఁ దెత్తమొ వికారవిదూర యుపేంద్రుభవ్యదే
హమ్మట గొంచుఁ బోదమొ సమర్థవిధం బొకఁ డేర్పరింపుమా. 167

చ. అని యదుగంగ దైవగతి ॥ సంబుధి పట్టణ మాక్రమించు న
ద్దినమున నొక్కొ యన్యగ మదిం జొనిపెం గురునాథ యప్పు డ
ప్పొనుతగుణాభిరాముఁ డడవిం దిమతిమ్మటఁ జన్నప్రొద్దు ల
య్యనుచరకోటితోడఁ దెలియం దలపోయఁగ లెక్క దోఁచినన్. 168

క. మఱునాఁడ యగుట లెస్సగ, నెఱిఁగె నినుం డపుడు వేఁడి ॥ మెడలినదీప్తుల్
దఱఁగఁగలిగొనఁ బశ్చిమగిరి, చఱికి ననతిదూరమున విశదుఁడై తోఁచెన్. 169

సీ. దాని కజ్జనములు ॥ దాను నుత్తల మంది, చర్చించి కార్యంబు చాయఁ గాంచి
మనము కృష్ణునిఁ గని ॥ చనుదెంచినార మై, పురమున నివ్వార్త ॥ పుట్టకుండ
నడఁచి[2]యచ్చటిమాటలవి కొన్ని[3]ఘటియించి, చెప్పియుం రేయు సెచ్చెరఁ బ్రయాణ
మునకుఁ గృత్యము లగుపనులెల్ల సమకట్టి, వేగంగ గ్రక్కున ॥ వెడలవలయుఁ
ఆ. గాని వెడల కున్న ॥ భానూదయంబున, వనధి పురము ముంచికొనిన గణన
సేయరానియట్టి సేగియు వ్రయ్యుభా,నంబు వగయు నెల్లభంగిఁ గలుగు. 170

అర్జునుఁడు రామకృష్ణులకు నగ్నిసంస్కారంబు సేయుట.

ఉ. కావున వేగ మగ్నియును ॥ గోష్ఠములుం సమకూర్చి సద్విధి
శ్రీ విలసిల్లఁ గృష్ణునిశరీరము సంస్కృతిఁ గూర్చి క్రమ్మఱం
బోవుట బుద్ధి యంచు మఱి ॥ భూసురకోటియుఁ దాను గాఢసం
భావనతోడఁ జేసె దృఢభక్తికుఁడై పితృమేధభద్రమున్. 171

చ. హలధరునిం దలంచి ముదు ॥ లాడినమాట తెఱంగు దప్ప దం
చలయక తత్ప్రదేశమున ॥ నారసి కాంచి తదీయ దేహముం
వలయు తెఱంగునం బరమవహ్నికి నాహుతి సేసె నయ్యనా

1. గ. మైనవిభేదము చూచి. 2. గ. యప్పటిమాట. 3. క. గణియించి.

కులహృదయుండు భూమిసురకోటియుఁ దానును సత్వరంబుగన్. 172

సీ. అబ్బంగిఁ గృతకృత్యుఁ డైనయప్పార్థుండు, యాదవపురమున కరుగుచున్న
యెడ ననుచరులతో నిట్టికార్యంబును, నడపక తక్కిన నాథుచన్న
గతికిఁ బోవుటకునై కడఁగెడురుక్మిణీ, ప్రభృతుల మనకు నిల్పంగ వశమె
శే యెల్ల నిప్పని సేయువిధములక, వ్యాయ మగు నంతకు వచ్చునబ్ధి

ఆ. మేలు సేయఁ బోయి యాలోక మంతయుఁ, దిట్టునట్టికీడు దెచ్చికొనఁగ
వచ్చునే స్వదేశవర్తుల మై చూచి,కొండ మెల్లపనియు రండు వేగ. 173

తే. అనుచు నరిగి తాఁ దలఁచినయట్ల యెల్ల
తెఱఁగుపనులు నారాత్రిలోఁ దీర్చి ప్రొద్దు
పొడుపునను మున్న వెడలించెఁ బురముసకల
జనములను జీవధనముల సరకు నతఁడు. 174

సీ. అప్పుడు కృష్ణునియంతఃపురాంగనా,జనము షోడశసహస్రమ్ము నతని
మహిషీజనుల రాముమహిళల నుచితవా,హనముల నిడికొని యర్హపురుషు
లేతేరఁ దేరుల నేనుంగులను గుఱ్ఱ,ములను దత్పరిచారకులు ప్రయత్న
మున సవరణతోడఁ గొనిరా నగరిసర,కులఁ దదీయాధికారులు బహుప్ర

ఆ. కారశకటములను గావళ్ళ నెత్తించి, యరసికొని కడంక నరుగుదేర
విగతనాథ లైనమగువల గాఁ రాము, సెడక యుండునట్లు నడపికొనుచు. 175

క. విను వజ్రముఖ్యయాదవ,జనము నుచితవృత్తి నడపి సర్వంబున క
య్యనఘుండు దాన దిక్కయి, చనియె నరదమునను మది విషాదము గదురన్.

క. ఇమ్మెయి నరుండు సకలజ,నమ్ము వెడల నిసుఁడు పూర్వనగ మెక్కెను వే
గమ్మున ముంచికొనియె నగ,రమ్ము పయోరాశి భరతరాజవరేణ్యా. 177

ద్వారకానగరంబు సముద్రమున మునింగిపోవుట.

క. వననిధి పురంబు ముంపఁగ, మనుజేశ్వర యెల్లజనులు మరలఁబడి కనుం
గొని రద్భుతరసపూరం, బునఁ బెన్నిట్టఁ దమచిత్తములు మునుఁగంగన్. 178

తే. అపుడు రెండవజలనిధి యనఁగఁ జాలి
యద్భుతోద్భూతవాక్యచయంబు పేర్మి
మ్రోయు నాజనసంఘంబు మునువిరోధి
మాఱఁది నడపించె దర్పితమార్గుఁ డగుచు. 179

క. నడపించి పంచనదమున, విడియించెను వీడు చోరవీరులు గని యె
క్కుడుధనములు గల వీమ్ర,క్కడిప్రజలో లేరు దీనిఁ గావఁగ యోధుల్.

క. కవ్వడి యొక్కఁడ కంటిరె, చివ్వనఁ జేరుద మితండు సేప్పడఁగా నిం
డెవ్వారుఁ గడంగ లే రివి. ద్రవ్వించినధనము లెఱిగితిమి లోఁ దెల్లన్. 181

క. అని వారొండొరువులతో మనముల నుత్సాహ మెసఁగ మానితధనముల్

గొనునగ్గలికం బలుకుచు, ననేకబలకోటు లగుట నలు కేది వడిన్. 182

క. బాలురు వృద్ధులుఁ జుండీ, యాలమునకుఁ గడఁగ నొక్కఁడమునను లేఁడీ
స్త్రీలం బొదువుడ మనుచున్న, నేల యవిసి మూఁగినట్లు నిర్భరభంగిన్. 183

క. ఏ పెనఁగ లేఁగి యట్లు, ప్పాపాత్మక ఘుగుకిరాతబలము సమగ్రా
టోపమునఁ గవిసి వివిధధ, నాపహరణ మాచరింప నారంభించెన్. 184

— బోయ లర్జును నోర్చి యాదవాంగనలసొమ్ముల నపహరించుట. —

సీ. కనుఁగొని జంభారితనయుఁ డోరోరి యీ
ప్రజ కేన చుందు సంరక్షకుండఁ
దొలఁగి పొం డడియాస దొద్దకుఁ జొచ్చినఁ
దల లేటి యుర్వికి బలి యొనర్తు
నని యదల్చినను వా రఱవాయి గొనక య
ప్పలుకు లన్నియును రజ్జులుగఁ గొనుచుఁ
జామల నచటనచ్చట నొల్చికొనఁగ నా
లోకించి యవ్వీరలోకవరుఁడు

తే. గాండివం బెక్కు వెట్టి ప్రచండబాణ
నికర మక్కిరాతులమీఁద నిగుడఁ జేయ
నలఘుచర్మసంవృతగాత్రు లగుచుఁ దుచ్ఛ
బాణపాషాణలగుడముల్ పఱఁగఁ జేసి 185

క. ఆబోయలు నిర్భయమతు, లై బీభత్సుపయిఁ గవియ నతఁడు మహాస్త్ర
ప్రాబల్యంబును మెఱయుటఁ, దా బుద్ధిఁ దలంచి మంత్రతతి దోఁపమికిన్. 186

క. ఇది దైవవిరోధం బని, మదిఁ దా నూహించి ప్రకృతిమార్గణములు బె
ట్టిదముగ నేయఁగ నవియుం, దుదిముట్టఁగ రిత్తలయ్యె దొనలు నరేంద్రా. 187

సీ. అప్పుడు కాలపర్యయమున కాశ్చర్యమును విషాదముఁ దనమనములోనఁ
బిరిఁగొన బాహువిస్ఫురణకోదండదండమున నాబోయల సమరవృత్తి
నెట్టకేలకు నొకయెడ మాన్చి రుక్మిణి, యాదిగాఁ గలకృష్ణునగ్రమహిషు
లెనమండ్ర బలదేవువనితల మఱియును, గతిపయయాదవాంగనలఁ గాచెఁ

తే. దక్కఁగల యింతిగముల నాదస్యు లడరి, పట్టికొని యేచి వీడెల్ల బన్నపడఁగ
దొద్దగొని రథకుంజరతురగతతులు, దమకు వలనకునికి దిగఁ ద్రావి చనిరి. 188

క. ఇమ్మాడ్కిం బఱిపోయిన, యమ్మొత్తము నడపికొనుచు నతిదైన్యము చి
త్తమ్మలఁ పంగఁ గురుక్షే, త్రమ్మునకుం జనియె నరుఁడు ధరణీనాథా. 189

క. చని యచటనచటఁ దన్నుం, గనునా ప్రజనంబుతోడఁ గాలవశత్వం
బున బొందినయవ్వశఁ దగ, వానర నతఁడు సెప్పెఁ బాచ్చెర[1] మురిపినమదిలోన్.

1. గ. మఱిసినమదిలోన్.

సీ. కోపించి గాంధారి శాప మిచ్చినయది, యాదవసంక్షయ మగుట యొట్లుఁ
దప్పదు మనము తద్బాలవృద్ధస్త్రీజనంబుల నెల్ల నస్వర్గంబు లైన
తావుల [1]సత్ప్రతిష్ఠావిశోకంబులఁ గాఁ జేయవలయు నక్కాలమునకు
[2]నోదవి యత్తెఱఁగున నుత్సహించుట కృత్య, మర్జున నీ కని యాడుచుండు
ఆ. బలుమఱును దలంచి పాండవాగ్రజుఁ డది, కారణముగ నతని కరుణ పెంపు
నొప్పు నెఱుఁగఁ గాన యప్పార్థుఁ డయ్యాదునికరశేషజనుల నెమ్మి నిలిపె. 191
సీ. నిలిపిన తెఱఁగెల్ల నృపవర చెప్పెద, విను కృతవర్మనందనునిఁ జూచి
నీతల్లియును నీవు నీతోడఁబుట్టిన, వారును మృత్తికావతపురమున
నిలుఁ డని బహుసంపదలఁ బొల్చునప్పట్టణంబుఁ దదీయదేశంబు నిచ్చి
యభిషిక్తుఁ జేసిన నాతండు నిజపరిజనములుఁ దాను హర్షం బెలర్ప
తే. నందుఁ బోయె సరస్వతి యనఁగఁ బరఁగు
ఘననగరమున సాత్యకితనయు నట్ల
నెయ్యమును గారవంబును నెఱయ నిలిపి
యనుప ముదమున నందుల కతఁడు సనియె. 192
సీ. తక్కటివారి నింద్రప్రస్థనగరంబు, నకుఁ గొని చని వజ్రు నాథుఁ గాఁగ
నందుఁ బట్టము గట్టి హస్తితురంగరథంబుల విభజించి తగినభంగి
నమ్మువ్వురకును సమ్మానితంబులు సేసి, యయ్యాయిబంధుల నందు నందు
నందును నిలుచున ట్లొందంగ నియమించి, యక్రూరుభార్యల నాత్మజులను
తే. వజ్రునకు నప్పగించె నవ్వ్యాసుదేవుపౌత్రుఁ డతివినయంబునఁ బట్టువఱుప
వారు నిలువక పోయిరి వలచు నెడకు, దాని విని యారసుండె భీమానుజుండు.

అర్జునుఁడు రామకృష్ణులనిర్యాణంబును యాదవస్త్రీల కెఱిఁగించుట.

క. యాదవకుటుంబముల నత్యాదరమున నట్లు నిలిపి హలధరుఁడును దా
మోదరుఁడుఁ డెగుట వారలగాదిలిపొలఁతులకుఁ జెప్పఁగాఁ దలఁచె మదిన్. 194
చ. తలఁచి యతండు మందగతిఁ దానును సర్వజనోత్కరంబు వా
రలకడ కేఁగి శోకవిధురం బగుచిత్తముతోడఁ దారు గా
నల కటు వోయి పంకరుహనాభుని రాముని రోసి పల్దినం
బులు భ్రమ సంచరించుటయు బోయ దముం గని యార్ద్రచిత్తుఁ డై. 195
క. కందువచోటికిఁ గొనిపోవం దా రరుగుటయుఁ జెప్పి వనటఁ గదిరిన
డెందము గలంగఁ గన్నీ, రందంద మొగంబుమీఁద నగ్గల మురులన్. 196
సీ. తల వాంచి యేమియుఁ బలుకక యప్పార్థుఁ, డున్న నయ్యువిదలు వెన్నుఁ డూర్ధ్వ
గతి కేఁగు టెఱిఁగి శోకము మూర్తులొందిన, తెఱఁగునఁ బొగిలియు ధీరభావ
మాత్మల నెలకొన్న నన్న నీ వింతేల, యడలెదు కాలపర్యయము నుడుప

1. క. సంప్రతిష్ఠావిశేషంబులఁ. 2 జ. నొదవిన తెఱఁగున నుత్స.

వశమె యెవ్వరికిని వార్తలకొలఁదిఁ జెప్పఁగు మాకు ననుడు నశక్యాచరితు
ఆ. డడవిలోన నేము దడసినదినము లన్నియు గణించి యంబునిధి పురంబు
రేపకడయ ముంచు నేపాట నిమ్మెయి, వచ్చునెడరుదలఁగు వార మొక్కొ. 197
చ. అనుతలఁ పాత్మ నొందుటయు నప్పటి కద్దెస మీకు నెల్లఁ జె
ప్పిన నుచితంపుభంగులకుఁ బెద్దయుఁ బ్రొద్దు పసంగ నప్పురం
బున గలవిప్రముఖ్యజనముల్ పయనంబున కర్హ మైనవ
ర్తన మొనరింప లేమి జలరాశి మునుంగుదు రట్లు గావునన్ 198
చ. వారికిని రామదేవునకు నర్హవిధానము లాచరించి యె
వ్వారికిని జెప్ప కెల్లపరివారముఁ బౌరులు సామజాదులున్
సరకులు నాయితంబు లగుసంఘటనం బొనరించి నాఁటికిం
గర మవధానయుక్తి సమకట్టితి నెవ్వగతోఁ బ్రయాణమున్. 199
తే. వినుఁడు యాదవభామినీవృద్ధబాల, జనుల నందఱనుచితవర్తనముతోడఁ
బ్రొద్దువోడువఱ ముందఱపురజన ప్ర, యుతముగాఁబురివెలువరింపఁ జితిఁ గడంగి 200
ఆ. దానఁ జేసి మీరు నేనును బ్రయ్యఁ బాపంబు లేక వెడలఁబడితి మిదియ
తల్లులార కరముఁ దప్పు లోఁచుట, నుల్ల మలఁత పేర్మి నుఱియుచుండు. 201
క. వినుఁ డీతప్పున దోషము, దనుకక యుండంగ నన్ను దయతోఁ జూడుం
డనుచు నిలఁ జాఁగి మ్రొక్కినఁ, గని యందఱు నెత్తి యతని గారవ మెసఁగన్.
క. ఊరార్చి యింక నుచితా, చారంబులు నడపుటయు యిచటఁ గృత్యము దు
ర్వారం బగువిధి చేఁతకు, నేరికి నడ్డపడ వశమె యేల యలఁదురన్. 203

రుక్మిణీదేవి మొదలగుకృష్ణభార్య లగ్నిప్రవేశము సేయుట.

సీ. అని పల్కి రప్పుడందు రుక్మిణియు జాంబవతియు లోనగుపద్మముఖులు
గొందఱు గోరిరి కురునాథ యనుమరణమునకు బంధుజనంబు లెల్ల
శోకార్తులై రోదనాకులత్వము నొంది, రనుమృతికలనకు నమరి యున్న
యాబలదేవముఖ్యరాంతకమహిషుల, కతివిభవం బైనయానకల్ప
తే. నంబు నొకల్పరచనంబు నడపి నరుఁడు, చందనాగురుమయచితాసంవిధాన
మాచరించి యర్హప్రకారాగ్నివిధియు, నర్పె మహనీయవిప్రజనంబుఁ బనిచి. 204
క. విను సత్యభామ లోనగు, వనితాజను లధికనియతి వనములకుఁ దపం
బొనరింపఁ బూని కొందఱు, సని రవ్విధమున నలుపత్నిసత్కర్మం డై. 205
తే. అఖిలబంధుజనంబుల నాప్తజనుల, నర్హవాక్యప్రయుక్తి నూఱార్చి యుచిత
మార నామంత్రితులఁ జేసి యస్రులురులఁ, బోయె నాక్రీడి సాత్యవతేయుఁ గుఱిచి.

అర్జునుఁడు వేదవ్యాసునొద్దకుఁ బోయి యాదవక్షయంబు సెప్పుట.

సీ. పోయి మరున్నదీప్రాంతపుణ్యాశ్రమమున, నర్హాసనమున నేకాంతనిరతి
నాసీనుఁడై యున్న యమ్మహాత్మునిఁ గని, యత్యంతభక్తి సాష్టాంగవినతి

యాచరించినఁ జూచి § యమ్మహనీయవి, ద్యానిధి సేరంగ § నతనిఁ బిలిచి
తనసమీపంబున § నునిచి తద్వదనమ్ముఁ, గనుఁగొని ని న్నెఱుఁ§గంగ రాదు

తే. వెడమొగం బైన దిదియేను§విజయ యెట్ల, కేలకెఱఁగితి నిదియేమి§గినుకవొడమి
వధముఁ నకు నయోగ్యుండగు§వానిఁ జంపి, తే పరాజితుఁడై తెలిసి§ తెలుఁగు సెప్పుము.

చ. అనవుడు నాతఁ డిట్టు లను § నమ్మహితాత్మునితోడఁ బద్మలో
చనుఁడు నవాంబుదప్రతిమ§చారుతనూలసితుండు దేవకీ
తనయుఁడు రామదేవుఁడును § దానును మేనుఁ దొఱంగి పోయె నే
మనఁ గల దెల్లయాదవులు § నాఱడిఁ బోయిరి సంయమీశ్వరా. 208

క. మహితాయుధసంప్రహతులు, సహించుదృఢ దేహధృతుల § సడిసన్నమహో
త్సహనులు యాదవవీరులు, నిహతు లయిరి దుంగలను మ§నీషిప్రవరా. 209

తే. అట్లు రామకృష్ణులు సర్వ§యాదవులును, దెగినఁ జిత్తంబు పొగులంగ§ముగువపిందు
బాలవృద్ధులఁ గొనిరాఁగఁ § బథముఁనందు, నన్ను బోయలు దాఁకిన § నగుచు నేను.

చ. ఘనతర బాహుశక్తియును § గాండివశక్తియు నస్త్ర శక్తియు
న్మనమున నచ్చి యప్డు ముని§నాథ కడంగితి నెట్ట కేలక
ద్ధనువు గుణంబుఁ గూర్చితి నుదగ్రత బాహుల లేక యుండె న
స్త్రనికరమంత్రతంత్రములు § సంస్మృతిఁ బొందవ యేమి సెప్పుదున్. 211

క. బోయలసంహృతికిఁ బ్రకృతి,సాయకసంపాతనములు § సాలవె యని యే
నేయఁ దొడఁగ దొనలు సెనటు, లైయుండె నొకండుఁ జేయు§నది లేదయ్యెన్.

క. నెవ్వగయు నచ్చెరువు మది, నివ్వటిలఁగ నప్పు డేను § నివ్వెఱపడితిం
జివ్వన ముసరి కిరాతులు, గ్రొవ్వేసకం బెసఁగఁ జూఱ§గొని రజ్జనులన్. 213

ఆ. చాపదండనిహతి § నోపినభంగిఁ గి,రాతకోటి నాఁగి § రామకృష్ణ
వల్లభాదు లైన§వనితలఁ గొందఱ, వృద్ధబాలకులను § వెరవుతోడ. 214

క. తాచికొని వచ్చి తగ నా, నేచినయ ట్లచటనచట § నిలిపితి మునినా
థా చేటును భంగంబును, నై చిత్తము శోకమునకు § నగ్గం బయ్యెన్. 215

తే. పడనిపాటు వాటిల్లిన§నెఱ మొగంబు, వడక యెట్లుండ వచ్చుఁ దశ§పఃప్రకీర్తి
నీయ యింకిట యే నేమి§ సేయువాఁడ, నెసఁగుదయతోడ నానతి§యిమ్ము నాకు.

—♦ వేదవ్యాసుఁ డర్జునునకు హితోపదేశము సేయుట. ♦—

సీ. అన విని యమ్మహా§ముని క్రీడి కి ట్లను, సంయమదత్తోగ్ర§శాపనిహతి
నఖిలయాదవులును § న శ్లైరి దానికి, నడలంగఁ బని లేదు § హరి యెఱుంగు
మున్న యాసంక్షయ § మన్న చెప్పెద విను, ప్రాప్తకాలం బగు§పనికి నడ్డ
పడనేల యని యాత్మ§భావించి యతఁ డుపే,క్షాపరుఁడై యుండెఁ§గాక మూఁడు

తే. భువనములు నన్యథాత్వంబుఁ § బొందఁ జేయఁ

జాలువాఁడు కణ్వాదుల। శాప ముడుప
శక్తి లేకుండఁజేనే యవశ్యంబు భావి
యైనయది గాన యదునాశ। మయ్యెఁజువ్వె. 217

ఉ. నీ పని సేయు నీవలని। నెయ్యమునం గృప నన్యసైన్యముం
డా వధియించు శూలధర। తాస్ఫురణం బెసఁగంగ ముందర
ద్దేవుఁడు దానిఁ గాంచు భవ। దీయసమంచితదృష్టియర్జు నినుం
గావఁడ యాముఁరాంతకుఁడు। కాలవిపర్యయ మావహిల్లుటన్. 218

చ. ధరణిభరంబు వాప నవ। తారము నొందినవిష్ణుఁ డత్తెఱం
గరుదుగ నిర్వహించి యజ। రామరనిష్కలనిర్వికారభా
స్వరనిజసత్పదంబు నుప। శాంతిపరుం డయి పొందె దానికిం
గురుకులవర్య శోకమునఁ। గుందుదురే మిముబోఁటిబోధనుల్. 219

మ. అవనీభారము వాపి తా హరికిఁ దోఁ। డై భీమసాహాయ్యగా
రవదుర్దాంతపరాక్రమంబునఁ గృతా। ర్థత్వంబునం జేసి య
స్త్రవితానంబును నిన్నుఁ బాసి చనియెన్। దైవప్రకారజ్ఞ నీ
దువరిష్ఠాచరణంబునన్ సురలు సం। తోషించి రపోర్పురులన్. 220

క. బలమును బుద్ధియుఁ జేవయు, నలఘుమతీ యుల్లసిల్లు। నగు కాలమునం
బొలియుం గాలవిపర్యయ,కలనంబున బుధుల కుబ్బుఁ। గలఁకయుఁ గలవే. 221

తే. కాలమూలంబు సర్వంబుఁ। గాన దీని, కొంకుతలఁపులు దక్కి మీ। రుత్తమంపు
గతికిఁజనుడు [1]నిశ్చింతవి। కారతనులు విడిచి యార్యజనంబులు। వినుతిసేయ. 222

సీ. అన విని శోకమోహంబులు వాసిన, డెందంబు నిర్భరా। నందమొంద
నధికభక్తియు విన। యంబును దలకొన, నర్జునుఁ డమ్మహా। త్ముకు వీడు
కొని వారణపురికిఁ। జనుదెంచి ధర్మజుఁ, గని తనపోయివ। చ్చిన తెఱంగు
వినిపించె సర్వంబు। నని యిట్లు సంయమి,సుతుఁడు వైశంపాయ। నుండు రాము

తే. కృష్ణు లాదిగఁ [2]గలిగిన। వృష్ణిచయము, భోజసంతతి యంధక। రాజి నాత్మ
వృత్తములు జనమేజయ। విభునకింపు, [3]సెవులఁదలుకొత్త నేర్పడఁ। జెప్పుటయును.

శా. కాలస్వైరవిహారభంజనకళా। కౌతూహలత్త్వద్దు
శ్శీలాంతఃకరణావిభావ్య కరుణా। శ్రీమందిరాపాంగ మం
త్రాళీవాచ్యసుధామయాంగ పవన। వ్యాపారరోధక్రియా
శాలిస్వాంతసముల్లసద్విహరణా। సంసారనిస్తారణా. 224

క. హృదయకమలమధురూపా, విదారితదురంతతాప। వేదస్తోమా
స్పదపారాశర్యమన,స్సదనా దివిజశుభకృద్వ। చనపరవదనా. 225

1. క. నిశ్చింతవికారచిత్త-చ. నిశ్చితవికారచిత్త, తనువు లార్యజ నంబులు. 2. క. గల యదు వృష్ణిచయము. 3. క. చెలువు.

మాలిని. అమరగణవిరోధిశ్రీవ్యాపదాపాదికోపా
శమితవినతచిత్తాసంగిగాఢత్రితాపా
యమనియమవికాసిశ్రీధ్యానగేహప్రదీపా
దమశమకలితానందప్రకాశస్వరూపా. 226

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబునందు మౌసలపర్వంబు సర్వంబును నేకాశ్వాసము.





హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## మహాప్రస్థానికపర్వము, ఏకాశ్వాసము.

—:O:—



[1]పదసీమాప్తిస
మాపాదన కేళికౌతుకాధీనదయా
వ్యాపార సకలవేదో
హాపోహాతీతసార హరిహరనాథా. 1

వ. దేవా వైశంపాయనునకు జనమేజయుం డిట్లనియె నట్లు కృష్ణునిపరమానంద పదప్రాప్తియు బలభద్రునియనంతత్వసిద్ధియు సకలయాదవమహాసలాహవప్రకారంబును నెఱింగి పదంపడి పాండవులెత్తెఱంగున వర్తించిరి మునీంద్రా యెఱింగింపుము. 2

క. అని యడిగిన వైశంపాయనుఁ డక్కురువంశవరుసమాదరణంబున్
వినయంబుఁ గౌతుకము పెం,పును సంభావించి యవ్విభున కిట్లనియెన్. 3

సీ. అర్జునుం డమ్మెయి నచ్యుతరామాది,యాదవజనులవృత్తాంతములును
దనదు తెఱంగు సత్యవతీతనూభవు,హితభాషణంబులు నేర్పడంగఁ
జెప్పిన విని యుధిష్ఠిరుఁడు ప్రస్థానంబు,నకు మది యొడఁయ నన్నరునితోడ
నఖిలభూతంబుల ననఘ పాకంబుఁ బొం,దించుఁ గాలుండు మదీయబుద్ధి

తే. కర్మసంత్యాగకలనంబు కార్య మిప్పు
డనువినిశ్చయ మొందె నీమనము నరయ
నిదియ మేలుగఁ గనుచున్కి విదిత మయ్యె
నాకు ననవుడు నయ్యింద్రనందనుండు. 4

వ. అన్నరేంద్రున కిట్లనియె. 5

క. కాలము నే మన వచ్చును, గాలముఁ గాలంబు పోలుఁ గా కొంటికి నీ

---

1. గ. పరసీమా.

లీలలు గలవే తెన్నగ, నాలోకించి ఇది హితము నభిమతము నగున్. 6

చ. అని తనమాట కియ్యకొనునన్నరుపల్కుల కిచ్చ మెచ్చి య
జ్జనపతి భీమునిం గవలఁ జయ్యనఁ బిల్వఁగఁ బంచి యత్తెఱం
గు నెఱి నెఱుంగఁ జెప్ప ననుకూలత వారలయందుఁ దద్దగ
ల్గిన చెలి వగ్గలింప నెఱిఁగించె యుయుత్సున కవ్విశేషమున్. 7

క. ఎఱిఁగించి రాజ్యతంత్రముఁ, దెఱఁగుపఱిచి నడపువెరవు దేటపడంగాఁ
గఱపి గృహాంతశ్చరితము, నెఱి నుపదేశించె నధిప నెయ్యం బలరన్. 8

క. ఆయనుజుని నట్లు మహా,నాయకుఁగాఁ జేసి భటజనముఁ గూర్చి మహీ
నాయకుఁ డార్యులు కీర్తన, సేయఁ బరిక్షితుని రాజుఁ జేసె ధరణికిన్. 9

వ. ఇట్లభిమన్యుపుత్త్రు నభిషిక్తుం జేసి యతనికిం బూజ్యసామ్రాజ్యపరిపాలనప్రకారంబు లుపదేశించి కురుకులపవిత్ర సముచితచరిత్ర భద్ర యగుసుభద్ర కిట్లనియె. 10

మ. [1]భవదీయాత్మజునాత్మజుండు కురుభూభారోద్వహుం డయ్యె యా
దవవంశోత్తరుఁ డైనవజ్రునకు నింద్రప్రస్థరాజ్యంబు గౌ
రవదీప్తంబుగ నిచ్చినాఁడ సుచరిత్రా రక్షణీయంబులై
నవి యీయిండులు రెండు నీవు దృఢధైర్యం బొప్ప రక్షింపుమీ. 11

క. విను శేషించినయాదవ,జనులకు నావజ్రనృపతి సంరక్షకుఁ డా
తనిఁ బోషించుట ధర్మం, బనఘా యది లేమి ధర్మహాని యగుఁ జుమీ. 12

క. అని తారు గృహంబు దొఱఁగి, చను నెడ నవ్వనిత పిఱుఁదఁ జనుదే కుండన్
జననాథ యతఁడు నియమిం,చినవాఁ డై యూఱడిల్లెఁ జిత్తములోనన్. 13

చ. పదపడి భారతాజిమృతబాంధవకోటికి మాసలాజి ను
న్మదులయి పడ్డయాదవజనంబులకుం బరలోకసౌఖ్యసం
పద కయి చేసె నక్కురునృపాలవరిష్ఠుఁ డనేకదానముల్
రదనితురంగగోకనకరత్నమయంబులు గా ముదంబునన్. 14

క. భూదానంబులునుం గ,న్యాదానంబులును జేసె నన్నరపతి వా
సోదానంబులు నత్యం,తాదరమున నాచరించి యరదము లిచ్చెన్. 15

తే. ఇట్లు ధౌమ్యాదివిప్రుల కెల్లఁ దృప్తి
యొసఁగ బహువస్తుకోటుల నొసఁగి కృపుని
ధనమునను బహుమానంబునను బ్రమోద
భరితుఁగాఁ జేసెఁ గురుపతి కురువరేణ్యా. 16

వ. శేషించిన కాంచనరత్నాదు లాక్షితిపతి పరిక్షితునకుఁ బరమాదరంబున సమర్పించి యతనిం గృపాచార్యునకు శిష్యుంగా నప్పగించి పౌరజానపదప్రవర

1. క. భవదీయాత్మజునందనుండు.

జనంబుల రావించి. 17

సీ. [1]అపార్థపౌత్రునిఁ జూపి మాయేవుర, మాఱుగా మీరిక్కుమారవరునిఁ
గైకొని తగ నెల్లకార్యజాతంబును, నడపుచు ననురక్తి నాఁడునాఁటి
కెక్కుడగుచు నుండ నీతనియుల్లంబు, రంజిల్ల సమ్యగారాధనంబు
నందు సంప్రవణులరగుఁడయ్య యని పల్కి, తమనిశ్చయంబు నుదాత్తభంగిఁ

తే. జెప్పుటయు వారు మొగములు సిన్నఁబోవ
మము నుపేక్షించి యిటు సేఁత సముచితంబె
నీదుచిత్తంబు కారుణ్యనిలయ మేము
దరతరంబ యాశ్రితులము ధర్మశీల. 18

వ. అని గద్గదకంఠు లగుచు నాడినమాటలకు నమ్మనుజేంద్రుండు దగు తెఱంగున మఱుమాట లాడి తమగమనంబులకు నజ్జనంబుల నియ్యకొల్పె నప్పు డందులోనం గొందఱు గొందఱని వేళనంబు లధికాభిలాషంబున నొత్తికొనుట కారణంబుగా వివాదంబు పుట్టిన సహదేవుండు కలియుగంబు ప్రవేశించుటంజేసి కాదే యిట్టివి పుట్టెడు నని తలంచి నవ్వి నరనాథునకుం జెప్పిన నప్పౌరవోత్తముండు నవ్వుచు మనమనువులు సాలు నని పలికి సర్వాభరణంబులు నూడ్చి వల్కలాజినంబులు ధరియించినం దమ్ములు ద్రౌపదియు నట్ల చేసి రందఱుం దత్కాలోచితంబు లగునిష్టావిధానంబు లాచరించి యగ్నుల నంబుగతంబులు సేసి మొగంబులం దెలి వగ్గలింప గృహంబు వెలువడి రప్పుడు ద్రౌపది షష్ఠత్వనిష్ఠం బోవ సప్తమం బై యొక్కసారమేయంబు వారల వెనుకఁ జనియె నప్పుడు. 19

సీ. పౌరజనంబు లాబాలవృద్ధంబుగా, వచ్చి రక్కురువంశవరులఁ జూడఁ
దత్సమయంబు జూదమునాఁడు వెడలి వా, రరిగెడునయ్యవసరముఁ బోలె
భటసమేతముగ నప్పాండుతనూజులతోన యాయుత్సుండు దాను నరిగె
భవదీయజనకుఁ డభ్యంతరసతు లెల్ల, ననుగమించిరి వారి మనుజనాథ

తే. యిట్లు కరిపురి వెలువడి యేఁగె ధర్మతనయుఁ డందఱు నెంతయు దవ్వు గాఁగ
సాలయ కేఁగి రాకళ్ళనుఁ జూచి నిలువు, మనఁడు తలవాంచియా రాజు సనుచునుండె.

చ. తనువులు దూల నందఱుఁ బ్రదక్షిణముల్ వినుత ప్రణామముల్
వినయసమేతు లై నడపి వీడ్కొని రానృపతిం గ్రమక్రమం
బున నిటు లమ్మలంబు మనముల్ పొగిలింపఁగ వచ్చి చొచ్చి ర
జ్జనములునుం బరిక్షితుఁడు సామజపట్టన మస్ఫురద్గతిన్. 21

వ. ఆసమయంబున. 22

తే. జనకుకడకు నులూచి భుజంగలోక, మునకుఁ బోయెఁ జిత్రాంగద తనతనూజుఁ
డైనబభ్రువాహనుపాలి కరిగెఁ దక్కుఁ, గలుగుసతు లెల్లనీతం డ్రకడననిలువ.

---

1. క. అపార్థనప్తునిఁ జూపి.

వ. అప్పుడు. 24

సీ. కృపుఁడు ధౌమ్యుండు నాగనృపతినిఁ దగువారి, సర్వభూషణములఁ గనుఁగొనుచు
మెలమి చిత్తంబులఁ దలకొల్పి పౌరులఁ, దగఁ దేర్చి పనుల నుత్సాహమెసఁగ
వర్తింపఁ జేసిన వారణపురి పూర్వ,భంగి సంపత్పరిభరిత మయ్యె
నట ధర్మజుండు మందగదటఁ జనఁ గ్రమమున, ననుగమించిరి పవననాత్మజుండు

తే. నర్జునుఁడు నకులుఁడును దనదవరజుండు, ద్రౌపదియు నిట్లు సనుచుండఁ దగిలి వారి
వెనుక విడువక శునకంబు జనియె నవ్వి,ధమునవారు మహాపథగమనమునకు.

వ. పూని యుపవాసవ్రతపరులై భాగీరథిపొంతకుం జని యందునుండియుఁ బ్రాఙ్ముఖ
వర్తనంబు గైకొని యోగబలంబున నరిగి గిరిసరిదరణ్యంబు లనేకంబులు గడచి
పూర్వసముద్రంబుతీరంబు సేరి రట్టియెడ. 26

క. దిక్కులు మేఘపథంబును, బిక్కటిలఁగ నవయవములు భీషణములుగా
నొక్కెడ నగ్నిదేవుం, డక్కౌరవవంశవరులయగ్రతలమున్. 27

అగ్నిదేవుఁ డర్జునుచేతి గాండివంబు సముద్రంబున వైపించుట.

సీ. నిలిచి బీభత్సుండు నిర్భరస్నేహంబు,కతమున విడువక గాండివంబు
గొనివచ్చు చున్న నాతనితోడ నవ్వాయు,సఖుఁ డో ధనంజయ శౌరిచక్ర
మెన్నఁడే దివమున కేఁగె నీ వేల గాం,డీవంబు విడువవు దేవకార్య
మునకుఁగా వరుణదేవునిచేత నేను దె,చ్చినయది యీధను వ్విశ్లేషింపు మమ్మ

తే. హానుభావుని కొప్పింపు మనిన లెస్స, యట్లు సేయుదుఁగా కని యక్కిరీటి
యగ్రజానుజులకుఁ జెప్పి యాదరమున, నాతఁ డచ్చాప మంబుధియందుఁ బెట్టె.

వ. తదనంతరంబ కృశానుం డంతర్ధానంబు సేసె నయ్యోగపరాయణులు పదంపడి. 29

ఆ. దక్షిణాభిముఖతఁ దలకొని యిలకుఁ బ్ర,దక్షిణంబు గాఁగ దమమునములు
దద్దముదము నొంద నద్దెస వార్ధియు, పొంతమునకు నేఁగి రధిపముఖ్యు. 30

వ. అచ్చటనుండి. 31

క. పడమరమొగమై పశ్చిమ,జలనిధితీరంబు సేరఁ జని యుత్తరమె
క్కుడు నియతి నడచి వారిధిఁ, బొడ వడఁగినయాదవేంద్రుపురి సేరువగన్. 32

చ. అట సని యశ్రమంబున హిమాచలముం సమతిక్రమించి వా
రటవులు భూములున్ నదులు నద్రులునుం గడుఁ బెక్కు లంచితో
త్కటదృఢయోగసేవననితాంతనిరాకులవర్తనంబు నొం
దుట గతఖేదులై కడచి తూలక మేరుసమీపభూమికిన్. 33

ద్రౌపది మొదలగువారు గతప్రాణులై పడుట.

సీ. చనునప్పు డయ్యేద్దువురును నతిస్థిరయోగ,సాధనపరు లయి సత్వరముగఁ
బోవంగఁ బాంచాలభూపపుత్త్రిక యోగ, మెడలిన మేదినిఁ బడియె నధిప
పడిన సమీరణుఁడు కొడుకు గనుంగొని, యన్నతోఁ జెప్పి యిట్టియ్యతివపలసఁ

గాన మొన్నఁడు ధర్మ✽హాని, యిట్లగుటకు, నరయంగఁ గత మేమి ✽ యని విషణ్ణుఁ
తే. డగుచు నడిగిన నాతఁ డి✽మ్మగువ యింద్ర,తనయు దెసఁ బక్షపాతిని ✽ దానఁ జేసి
సుకృతములు ఫలియింపమి✽జూవె దీని,కిట్టిదురవస్థ వాటిల్లె ✽ నీద్యచరిత. 34

క. అని పలికి సమాధానము, దనబుద్ధిం దిరము సేసి ✽ ధైర్యస్థైర్యం
బున వికృతి లేనిగతి నా,వనితళనము విడిచి కౌర✽వవిభుం డేఁగెన్. 35

సీ. భూవర యమ్మెయిఁ ✽ బోవంగ సహదేవుఁ, డపగతప్రాణుఁడై ✽ యవనిఁ బడినఁ
గని వాయుజుఁడు ధర్మ✽తనయున కెఱిఁగించి, యితఁ డనహంకారుఁ ✽ డెపుడు నీకు
నతిభక్తిశుశ్రూష ✽ యాచరించుచు నుండు, మాలోన నెల్ల స✽న్మార్గవర్తి
యితనికి నేలొకో ✽ యిద్దెస వాటిల్లె, ననిన నమ్మనుజేంద్రుఁ ✽ డతనితోడ
తే. వీఁడు దనకంటెఁ బ్రాజ్ఞుండు✽ లేఁడు జగతి, నెందు నని సంతతమ్ముఁ దా✽నెడ్డ దలఁచు
దాన నిట్లయ్యె నం చుపే✽క్షానిరూఢ బుద్ధి నరుగుచునుండె న✽ప్పురుషవరుఁడు. 36

క. అనిలజుఁడు నరుఁడు నకులుఁడు, శునకంబును దోన నరుగ ✽ సుస్థిరమతి యై
మనుజేంద్రవర్య యట్ల,జ్జనపతి సన నకులుతనువు ✽ జగతిం బడియెన్. 37

క. విను ద్రుపదనందనయుఁ దన,యనుజన్ముఁడు నంతనంత ✽ నవనిఁ బడుటఁ దాఁ
గని ధృతి దూలినయట్లు వ,డిననకులునిఁ జూచి యడలు✽డెందమునఁ దోడన్. 38

సీ. అనిలసూనుఁడు ధర్మ✽తనయున కెఱిఁగించి, యవ్విభుతో సుంద✽రాకృతియును
శౌర్యంబు ధైర్యంబు ✽ సౌజన్యమును గురు,సంఘము నన కాదు ✽ జగతి నెందు
నితనికిఁ బోలె న✽హీనత మెఱయునే, యెవ్వరి కైనను ✽ నిట్టిపుణ్యుఁ
గుత్సితదశ యెట్లొ✽కో పొందె నక్కట, యనవుడు నక్కౌర✽వాగ్రగణ్యుఁ
తే. డతని కిట్లను నీతండు ✽ నాత్మసదృశు, డఖిలజగముల లేఁడు రూ✽పాతిశయము
దనకకలదని యెపుడుఁ జి✽త్తమునఁ దలఁచు, నయ్యహంకృతి నిట్టి✽కీడయ్యెఁ జూవె.

క. అని ధృతిసారం బూఁది య,తనితనువు నుపేక్షఁ గూర్చి ✽ ధర్మతనూజుం
డనఘు చనుచుండెఁ దక్కటి,యనుజులుఁ గుక్కురము దోన✽ యరుగుచునుండన్. 40

సీ. ద్రౌపదిపాటును ✽ దనయనుజన్ముల,పడుటయుఁ గనుఁగొని ✽ పార్థుఁ డాత్మ
యలమట మునిఁగిన ✽ నిల విగతాసుఁడై, పడినఁ గుందుచుఁ జూచి ✽ బకవిరోధి
యన్నకుఁ జూపి యి✽య్యమలచరిత్రుని,యా దెన్నఁడును నస✽త్యంబుఁ గాన
మిటు పడుటకుఁ గత ✽ మేమి నావుడు నీతఁ, డక్కౌరవుల నెల్ల ✽ నొక్కనాఁడ
తే. యాహవంబునఁ దెగటార్తు ✽ ననియె నట్లు
సేయఁ డయ్యెఁ బల్కొక్కటి ✽ సేత యొకటి
యగుట సాల దోషము విను ✽ మదియుఁ గాక
యెల్లకోదండధరుల గ✽ర్హించు చుండు. 41

ఉ. దానను దాన నిట్లగుట ✽ దప్పనె యంచుఁ దదీయ మైనయ

మ్మానితదేహమ్ముఁ విడిచి మానవనాథుఁడు దాల్మిఁ జేసి బ
ద్ధానిరతాత్ముఁడై యరిగె నత్తఱి వాయుజుఁ డార్తి నెంతయున్
దీనతఁ బొంది ధైర్యలత ద్రెవ్విన నేలకు వ్రాలె భూవరా. 42

క. అప్పుడు దగ సిట్లను నతఁ, డప్పౌరవవరున కోర్వధరాధిప యనుఁగో
మ్మిమ్మప్పా టేమిట వచ్చెం, జెప్పు మెఱుఁగు దేని గరుణ సిగు రొత్తంగన్. 43

చ. అన విని యాతఁ డిట్లనియె నాతనితో భవదీయు మైనభో
జన మతిమాత్రముద్ధతిఁ బ్రచండుఁడ వై భుజశక్తి నెవ్వరిం
గొనక కడంగి రజ్జుపలుకుల్ గడుఁ బెక్కులు వల్కు దెప్పు నీ
వనుపమశౌర్య యిప్పుడుట కత్తెఱఁగుల్ గత మెల్లఁ జెప్పితిన్. 44

క. అనిపలికి నిరీక్షింపక, చనుచుండె నతండు ధైర్యసాహోదారుం
డును నిశ్చయమహితుఁడునయి, వెనుక శునక మధికభక్తివిడువక చనఁగన్. 45

తే. ఆసమంచితసారమేయంబు పాండు,ధరణినాయకునగ్రమ్మతనయుపిఱుఁద
నధికభక్తియుక్తంబుగ నరుగుచునికి, పలుమఱునునీకుఁ జెప్పితిఁ దలఁచియుండు. 46

వ. అని పలికి వైశంపాయనుండు జనమేజయున కిట్లను నిట్లు నిష్ఠాగరిష్ఠుం డయి యుధిష్ఠిరుం డరుగుచుండ. 47

— ఇంద్రుఁడు రథంబు గొని ధర్మరాజు నెదురుకొనుట. —

సీ. దివ్యదేహోద్గతదీప్తిసంతానంబు, దిశలు పదింటను దీటుకొనఁగ
రథసమాగమనసంరావంబు మెరుగ,హ్వారములం బ్రతిరవోత్కరము నీన
నచ్చటిసిద్ధసాధ్యమునీంద్రగణముల,నానావిధస్తోత్ర నాద మెసఁగఁ
దత్ప్రదేశంబుబోధసీంతకల్పవృక్షంబులు పుష్పవర్షములు గురియ

తే. నింద్రుఁ డేతెంచి యాదర మెసక మెసఁగ, నక్కురుక్షితిపాలున కగ్రభాగ
వర్తి యగుటయు నతఁ డభినందనంబు, సేసె సవినయభక్తివిశేష మొప్ప. 48

వ. అట్లు ప్రణతుం డయిన నభినందించి యప్పురందరుం డతని దివ్యస్యందనం బెక్కు మని పలికిన నతండు శోకసంతప్తుం డగుచు నతని కిట్లనియె. 49

శా. తోడంబుట్టువు లందఱుం బడినయాదుఃఖంబు చిత్తంబు సం
పీడం బెట్టెడు సౌకుమార్యవతి ద్రుప్పిం గూలెఁ బాంచాలి వా
రోడై నచ్చిరి వారు లేక యిట మీతో రాను వా రెల్ల నా
తోడం గూడఁగ వచ్చునట్లుగఁ గృపాధుర్యాత్మ కావింపవే. 50

చ. అన విని యింద్రుఁ డిట్లనియె నక్కురుభర్తకు శోక మేల నీ
యనుజులు ద్రౌపదీసహితు లై తనువుల్ దిగఁద్రావి చన్నవా
రనఘ యమర్త్యలోకమున కక్కడఁ గాంచెదుగాక వారలం
దనువు [illegible] లదు ధర్మమయాత్మక నీవు రావ నా. 51

ధర్మరాజునకు నింద్రునకుఁ గుక్కవిషయమున జరిగినవివాదము.

సీ. అనుటయు ధర్మజుం డమరేంద్రుతో నన్ను, నత్యంతదృఢభక్తి నాశ్రయించి
పురము వెడలునప్పుడు మొదలుగాఁ దోడ్పడి, చనుదెంచె నీభవ్యసారమేయ
మిది యట్టి [1]రావలదే నామనంబు నిష్ఠురవృత్తి కోర్వ దస్తోకపుణ్యా
నిరతాత్మ నావుడు దరహాస మొప్ప నబ్బలవైరి యిట్లంట పాడియే య
తే. మర్త్యభావము గుక్క కేమాడ్కిఁ గలుగు, [2]ననఘ నీచింత తెలియఁగ శక్యంబు దీని
విడిచి చను మేల నిష్ఠురవృత్తి యయ్యె, నిచటఁ దడయంగ నేటికి నెక్కు రథము.
వ. అనిన నమ్మనుజేంద్రుం డింద్రునితోడ నవార్యంబును దుష్కరంబును నగు కార్యం బేనియు నార్యుండును బ్రభుండును నైన నీయట్టిసత్పురుషుండు సంశ్రితుల కై సంఘటింపవలదె భక్తపరిత్యాగంబు సేసి పడయు సిరి నాకు నెంతయుం బయ్యెడు ననుటయు నయ్యనిమిషనాథుండు. 53
చ. అలుక హరించు ధర్మముల నట్లగుటం గురువంశవర్య నీ
వలఁగక విన్ము కుక్కలకు నావసథంబు త్రివిష్టపంబునం
గలుగునె నీకు నిష్ఠురత గల్గదు దీనిఁ బరిత్యజించినం
జలము కొనంగ నేల శుభసంగమనం బెడసేఁత కృత్యమే. 54
సీ. అనవుడు ధర్మనందనుఁ డమ్మహాత్మునితో, విను భక్తియుక్తుని విడుపు బ్రహ్మ
హత్యఁ బోలెడిపాప మని చెప్పుదురు పెద్ద, లట్లు గావున దీని నఖిలధర్మ
సారజ్ఞ విడుచుట సనదు దివ్యసుఖంబు, నరుఁ గాఁగఁ బాపంబు నరకఘోరంగఁ
జాల నావుడును వాసవుఁడు ప్రశస్తుండు, కుక్క నంటిన వానికోటి చేయు
తే. సుకృతమునకు నాశంబగు సువ్రతాత్మ, యింతయొప్పు నిర్బంధ మేల చెపుము
విడువు మీశునకము దీని విడువఁ బడుట, నాకలోకసౌఖ్యంబు నొందవచ్చు నీకు. 55
చ. జనులు నుతింపఁగా సుకృతసంపదఁ జేసి యమర్త్యభావముం
గనియును జెంద కిట్టునికి కార్యమె ద్రౌపది భీమసేను న
ర్జునుఁ గవలం ద్యజించుటకు సువ్రత చాలిత చాలవయ్యె దీ
శునకము విడ్వ నిత్తెఱఁగు సూరినుతుం డగు నీకు నర్హమే. 56
సీ. అన విని ధర్మజుం డఖిలలోకములకుఁ, బతివి ధర్మమునకుఁ బ్రభుడ విట్టి
నీకుం దెలియఁగు దున్నే సదసత్ప్రకారము లట్లుఁ గాక వాదము మహాత్మా
లయినవారలతోడ నగునె చేయంగ నైన, నను విన్నవింపఁ దగిన తెఱంగు
విన్నవించుట దోషవిధము గాదని యెఱు, బుద్ధిఁ జేసెద నేను బూని విన్న
తే. పంబు భీమముఖ్యులును ద్రౌపదియుఁ జచ్చి, రేను వారల విడువక యేడ్చుచున్న
వత్తు రేతోడ వచ్చి చావని శునకము, విడువకుండుట తప్పుగా నుడువఁదగునె.
చ. అనఘచరిత్ర విన్ము శరణాగతుఁ జేకొన కున్కి శుద్ధమి

1. క. రావలవదె నామనంబు. 2. గ. ననఘచిత్త యిత్తెఱఁగు శక్యంబు.

త్రుని మొదఁ జేయుద్రోహము వధూటి వధించుట విప్రునర్థముం
గొనుట యనంగఁ గల్గునివి గూడి సమం బగు నాకుఁ జూడ భ
క్తు ననపరాధునిం విడుచుదోషములో నిది యొక్క వచ్చునే. 58

ఉ. కావున నాకలోకపుసుఖం బటు లుండఁగనిమ్ము దేవ నీ
భావము నిల్పు నాదెసఁ గృపాభరితంబుగ సారమేయసం
భావనచేత దోసముగఁ బట్టమి నాకు వరంబు నీవు ని
మ్మా వనభూమి నుండెద సమిద్ధతపంబున నిన్ను గొల్చుచున్. 59

వ. అని పుఖిలోఁడక పలికెఁ బౌరవోత్తమా యాకర్ణింపుము. 60

— సారమేయరూపంబున వచ్చినధర్ముండు ధర్మరాజునకుఁ బ్రత్యక్షం బగుట. —

సీ. అట్లతిదృఢనిశ్చయంబుగఁ బలికిన, తనపుత్త్రుఁ గనుఁ గొని ధర్ముఁ డధిక
సంప్రమోదముఁ బొంది సారమేయాకృతిఁ, బాసి తానాత్మరూపంబుఁ దాల్చి
పరమసంభ్రమకృతప్రణతియు నానంద, భరితుండు నగునానృపాలుతోడ
నీపుణ్యవృత్తంబు నిర్మలమేధయు, నఖిలభూతంబులయందుఁ గలుగు

తే. దయయు నాదుచిత్తముఁ బ్రమదమునఁ దేల్చె
వత్స భూలోకమున నిట్టివారుఁ గలరె
తొల్లియును ద్వైతవనమున దోషదూర
మునినీమనమున తెఱం గరసినాఁడ. 61

క. విను నీరు రోసి నీదగు,ననుజులు మృతు లయిన [1]వచ్చి యందఱిలో నొ
క్కనిఁ గోరుము బ్రదికించెద, నని పలికితి నేను నిర్మలాత్మక నీతోన్. 62

ఉ. దానికి నీవు చిత్తమునఁ దల్లుల నిద్దఱినుం దలంచి మా
లోన నొకండఁ గల్గితి నకులుఁ డత వారలయందుఁ గల్మి లో
కానుమతంబు గాదె నకులాశ్రిత ధర్మవు నాకు సమ్మతిన్
వీనుల కింపుగా నకులు వేఁడితి తద్విధ మొందుఁ గల్గునే. 63

క. భీముని నర్జును విడిచియు, నీమది నకులు బ్రదికింప నిగుడుట పుత్త్రా
నామనమునఁ బాయదు నిన్నే మన వచ్చు నఖిలంబు నింద్రుం డెఱుఁగన్. 64

క. విను భక్తియుక్త మిది యగు, శునకముఁ జేపట్టి నేవు సురపతి కొనివ
చ్చినయరద మెక్క నొల్లవ, యనఘా సరి నీకు దివము నందును గలరే 65

ఉ. ఇంతటి పెంపు గల్గుట మహేంద్రుఁడు నీదెసఁ గాంచె నీవు ని
శ్చింతత మేనితోఁ జనుము సిద్ధపథంబునఁ బుణ్యలోకముల్
వింతలు గాక యుండఁ బృథివీవర నీకు నుదారసౌఖ్య మ
త్యంతము నవ్యయంబు నగు నందలిమాన్యులు సంస్తుతింపఁగన్ 66

సీ. అనిమొ నప్పుడు పరమాహ్లాదమునఁ జను,దెంచి గంధర్వులు దేవమునులు

1. గ. జచ్చినందఱలో.

మరుదశ్వివసువులు సమహితాదరంబున, ధర్ముండు నింద్రుండుఁ దారు నమ్మ
హాత్ముని నెత్తి రథారూఢుఁ గాఁ జేసి, తమవిమానములు పార్శ్వముల నడపి
కొని చన నిఖిలదిక్కులఁ దనతేజంబు, వెలుగంగ సిద్ధులు వినుతి సేయ
తే. దైవతావాసమునకు నాధర్మజుండు, సనియె నయ్యవసరమున సర్వలోక
సమ్మతుఁడు బోధఘనుఁడు ప్రసన్నఫణితి, నారతోదారుఁడును నగు నారదుండు.

వ. ఎల్లవారును విన సంపూర్ణస్వరంబున నిట్లనియె. 68

ఉ. దానములం దపంబులను దద్దయుఁ బేర్కొలయట్టివారలన్
మానవనాథులన్ వినమె మాసెఁ దదీయయశంబు లెల్ల నీ
మానితకీర్తి కీర్తులు సమస్తజగంబులయందుఁ బర్వెట
న్మేనులతోడ వారిటులు నేర్చిరె రా నమరత్వసిద్ధికిన్. 69

చ. అన విని ధర్మరాజసుతుఁ డాతని కిట్లను నాదుతమ్ములం
గనుఁగొనునంతకున్ సుఖముగాఁ గొనన య్యెద నిత్తెఱంగు నా
కు నకట చూపరే పవనుఁ గొడుకును నింద్రసుతుండు మాద్రినం
దనులును నున్నచోటు సుఖదం బయినన్ సుఖహీనమేనియున్. 70

వ. వారలను మదీయపక్షప్రాప్తులయినభూపతులను జూచువేడ్క యెల్లలోకంబుల
మీఁదను గలుగువేడుకకంటె మిగిలి యున్నయది యనుటయు నమరేంద్రుండు
దనమనంబున నితనితోడ సముచితసంభాషణంబులు సేసెద నివ్విధంబు కటుకవచ
నత్వంబు గాదని యూహించి యిట్లనియె. 71

చ. తనువు దొఱంగ కిట్లు సుకృతంబులపెంపున వచ్చి తిప్పదం
బునకు మహాత్మ యిచ్చటను బోవదు నీమదిఁ బాసి మర్త్యతం
బనుపడియున్న నెయ్యము సభాసదులన్ శుభదృష్టిఁ జూడుమా
మునులను సిద్ధులం దగున ముంపటిచందంబు నొంది యుండఁగన్. 72

చ. ఒరులకు నందరానిపద మూర్జితపుణ్యనిరూఢిఁ బొందఁగా
దొరకొని యున్కి నీవికృతదూరమనస్కతఁ గాదె నీసహో
దరులు భవన్మహోన్నతపదస్థితి కర్హులె తొంటినెయ్యముం
బొరయనె దేవతాత్మకుల బుద్ధి నెఱుంగుము నీవిశేషమున్. 73

క. అని యిట్లాడినసర్వభువనపతియు బుధుండు నైనవాసవుతోఁ దా
ననియెం దగ వెంచియు ధర్మసంభవుఁడు భరతవంశమహిమాధాముఁ. 74

ఉ. మీ రిటు లేమి సెప్పిన నమేయభుజాబలభగ్నదైత్యయే
గారవ మొప్పఁ దమ్ములను గాంతను బుత్త్రుల మిత్త్రకోటిఁ గ
న్నారఁగఁ జూడ కుంటకును నక్కట యోర్తునె యెల్లభోగముల్
వారలఁ జూచి క్రమ్మఱఁగ వచ్చి సుఖస్థితిమై భుజించెదన్. 75

వ. నా కత్తెఱంగు పరమానందకరం బనియె నని యిల్లు మునీంద్రమాననీయం బయిన పాండవేయమహాప్రస్థానప్రకారంబు జనమేజయునకు వైశంపాయనుండు సెప్పె నయ. 76

శా. పారాశర్యవచఃపయోనిధిసుధాభంగీ దయాసంగి దు
ర్వారాశేషవిపద్విదారణవిహారా చిన్మయాకార వి
స్తారోదారగుణత్రయస్ఫుటవిశేషా నిర్గుణాశ్లేష మా
గారీతోజ్జ్వలతత్త్వభాస్వర [1]నిజాగారాత్మకతీశ్వరా. 77

క. ప్రణవైకభావ్య సురరక్షణకేళీస్తవ్య జన్యసకలద్రవ్యా
[2]గణనాతీతా పోష్య ప్రణతవ్రాతా నిరీహాభక్తిప్రీతా. 78

మాలిని. అమృతపికరణక్రీడాభిరామా త్రిధామా
దమితసకలదైత్యోత్సాహ విజ్ఞానదేహా
సుమహదుపనిషత్ప్రస్తుత్యభిశ్రావ్య సేవ్యా
[3]శమకరమణశీలా సంభృతానందలీలా.

గద్యము ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబునందు మహాప్రస్థానిక పర్వంబుసర్వంబు నేకాశ్వాసము. 80



1. క. నిజాకారాత్మక కీశ్వరా-జ. నిజా గారాత్మకీ కీశ్వరా. 2. క. గణనాతీతప్రేవ్య ప్రణత ఛాతా. 3. క. శమదమనశీలా.

శ్రీ

హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## స్వర్గారోహణపర్వము, ఏకాశ్వాసము.





వర్ధనాయురభివృ
ద్ధ్యావహచరణశతపత్ర ! యమనియమాది
ప్రావీణ్యాపూర్ణమిత్రమ
హావిద్యోన్మేషగాత్ర ! హరిహరనాథా. 1

వ. దేవా జనమేజయుండు వైశంపాయనుతోడ మత్పూర్వపితామహు లగుపాండవులును ధార్తరాష్ట్రులును స్వర్గం బారోహించి యెట్టెట్టినెలవుల నిలిచి రెట్లు వర్తించిరి చెప్పవే తదాకర్ణనకౌతుకంబు మదీయచిత్తంబున [1]నుత్తరంగం బగుచున్నయది నీవు సర్వవిదుండ వేను భవదీయసదయవాక్యసంభావనకు నర్హుండ నని ప్రార్థించినం బ్రచురదివ్యజ్ఞానమాననీయుండును బరమకృపావిధేయుండును నైనసాత్యవతేయునిసారకరుణావిశేషంబున సంపోషితం బైనబోధంబున సాధుజన్మస్తవ్యుం డైనయాభవ్యమునివరుం డక్కురువంశవరున కిట్లనియె నట్లు బంధుదర్శనంబు గోరి పలికినపాండవాగ్రజుతలంపున కనుకూలుం డై యాఖండలుండు. 2

సీ. తగువాని రావించి ! ధర్మనందనునకుఁ, దమవారిఁ జూడఁ జిత్తమునఁ గోర్కి
దనికినయది నీ వితని సట గొనిపోయి, యఖిలబంధులఁ జూపు ! మనుడు నతఁడు
గారవం బెసఁగంగ ! నారాజసత్తముఁ, దోడ్కొని పోవఁ గుతూహలమునఁ
దోడన నారదాద్యదులు గొందఱరిగి ర,క్కఁగడుచోటఁ గట్టెదురఁ దోఁచె

తే. నున్నతాసనాసీనుఁ డభ్యుదితసరసి,జాప్తసంకాశుఁ డమృతాశనాంగనాది
వృతుఁడు వీరలక్ష్మీవిరాజితుఁడు సతత,యుక్తసుఖసాధనుండు దుర్యోధనుండు. 3

వ. ఇట్లొప్పి యున్నయతనిం గని ధర్మనందనుండు దేవమునిపరుల మొగంబు లాలోకించి

1. గ. నుత్తాలం బగు.

—◆ ధర్మజుం డక్కట దుర్యోధనుం జూచి యనుతాపపరుం డైన నారదుం డతనిం దేర్చుట. ◆—

సీ. ఇతఁ డతిలోభోపహతమానసుఁడు దీర్ఘ,దర్శిగాఁ డితనికతముననే చేసి
నిఖిలదేశంబుల యఖిలనృపాలురు, ద్రుంగిరి దంతితురంగసహిత
ముగ ననవద్యాంగి విగతకల్మష ధర్మ, చారిణి సాధ్వి పాంచాలి నార్య
జనములు గనుఁగొన సభలోన నవమాన, పెట్టినతులువ యే నిట్టివాని
ఆ. తోడఁ గలసి మెలఁగుదు నె మహితాత్మకు,లార యెచట నున్నవారు భీమ
ఫల్గునులు నుగవలుఁ బాంచాలియును నన్న,నచటి కనుపవలయు ననుచు మరలె.

వ. మరలినఁ జూచి నారదుండు నవ్వుచు నతని కిట్లనియె. 6

సీ. ఓధర్మనందన యీధరణీవిభుం, డాహవసంపరిత్యక్తతనుఁడు
దేవతాసంభావ్యుఁ డై వెలింగెడుఁ బుణ్య,కర్ము లెల్లను గడు గారవింతు
రితని నితండు మహీశుల నుజ్జ్వల,క్షత్రధర్మంబునఁ గాదె త్రుంచె
నది పాప మేలగు ననఘ పాంచాలి యీ,తనిచేతఁ బడుటయుఁ దక్కఁ గలుగ
తే. నెగ్గులును నింక నిచ్చట నేల తలఁప
నిచ్చోటు పుణ్యలోకము మది నీసు రోష
మనుమనోవికృతులు దగునయ్య వాని
విడిచి సమత నొందుము లోకవినుత చరిత. 7

వ. అని వెండియు. 8

క. జూదమునఁ గయ్యమున నీ, కేదురితంబులు నితాంతహృదయక్లేశా
పాదకములు వాటిల్లెన,నాదృతములు సేయు వాని నన్నిటి ననఘా. 9

చ. అన విని యమ్మునీంద్రునకు నవ్విభుఁ డిట్లనుఁ బాపశాలి స
జ్జనసతతాపచారి కులసంక్షయకారణరోషభాగి యి
మ్మనుజవరాధముం డిటఁ డకమర్త్యుల కెల్లను మాననీయుఁ డై
మనునటె పుణ్యలోకమున మాటలు వేయును నేల సంయమీ. 10

తే. అతని నట్లుండనిమ్ము నాయనుజతనుజ,మిత్రజనములఁ బాంచాలపుత్రి నాశ
వర్త్యమును నభివీక్షింపవలయుఁ జూపఁ, బనుపు వారలయున్నెడ భవ్యచరిత. 11

వ. అని మఱియుం గలుగుమునీంద్రులఁ గలయం గనుంగొని. 12

—◆ ధర్మజుండు దేవమునులను గర్ణాదిస్వజనులఁ జూప వేడుకొనుట. ◆—

సీ. సంగ్రామమృతు లైన సకలబంధులకుఁ ది,లోదకం బే నిచ్చుచుండ వచ్చి
కుంతి కర్ణుఁడు దన కొడుకని చెప్పినా, కతనిజన్మము తెలిఁ గంతవట్టు
విదితంబుగాఁ జేసె నది మొదలుగ నమ్మ,హావీరుఁ దలఁచినయప్పు డెల్ల
నుల్లంబు సంతాప మొందుఁ దదీయపా,దంబు లద్దేవిపాదంబులట్లు
ఆ. యని సభర్తృకముగ నర్చింపంబులు సేయఁ, గాన కునికి కేను గరము వగతు

నలఁడు నేము నైనను నమరేంద్రుఁడును మమ్ముఁ, జేయునే త్రిలోకసేవ్యులార.

చ. అతని సెఱుంగ కుండి విను మర్జునుఁ బంచితి నన్ను మహాత్మునిన్
మృతుఁడుగఁ జేయఁగా నది శమింపదు శోకము నావహించుచు
న్నతికి నలంత సేయు గుణసమాన్యుని నాతనిఁ జూచుకౌతుకం
బతిశయ మొందుచున్న యది యాయన మెచ్చట నుండుఁ జెప్పరే. 14

వ. ద్రుపదవిరాటయుధామన్యులు శంఖప్రభృతితదీయజ్ఞాతులును రణాగ్నికిం బ్రాణహవిస్సులు వేల్చినవారు వారల నాకుం జూడవలదె ప్రాణసమముం డగుజగత్ప్రాణనందనుని సంక్రందనతేజోవిరాజితుం డగుశ్వేతాశ్వునినశ్వుల ననుకరించునకులసహదేవులను సహజసద్గుణశాలిని యగుపాంచాలినిం జూడక నిలువంజాలుదునె వారి కెవ్వరికిని నాకలోకనివాసంబు లేకతక్క నేని సోదరరహితస్వర్గంబునందుస్వర్గత్వబుద్ధి పుట్టదయ్యెడు వార లెచ్చోట నుండి రచ్చోటయె నాకుఁ బుణ్యలోకంబుగాఁ దలంచెద నయ్యెడ కనిచి పుచ్చుం డనిమిషవర్యులారా యని పలికిన నప్పాండవాగ్రజుతో నద్దేవమును లిట్లనిరి. 15

ఆ. అట్లు చేయువార మమలాత్మ నీదుచి, త్తమున నేది దోఁచె దాని నాచ
రింప నలయు నని నిలింపేశ్వరుండు వాటించి మాకు నప్పగించినాఁడు. 16

సీ. అని దేవదూతునిఁ గనుఁగొని యిమ్మహి, తాత్ముని భీమసేనార్జునాదు
లున్నచోటికి నన్ను మన్న నప్పురుషుఁ డాదర మెసఁగంగ నాధర్మతనయు
నిందు ర మ్మనుచుఁ దాసముందటఁ జన్న నమ్మహానుభావుఁడు వానిననుగమించె
నట్లు సనంగఁ గేశాస్థిసాంద్రంబు దుర్గంధంబుఁ బరుషతరంబు దంశ

ఆ. మశకనిబిడమును దమఃకలితముఁ గ్రిమి, కీటరక్తమాంసకూటకుణప
ఘోరవిధము శాతదారుణచంచువాయసరవాన్వితంబు నయ్యెఁ బథము. 17

వ. అప్పథంబున బాండవాగ్రజుండు సని చని [1]యారం గ్రాఁగినసూనియపోలెం దెరలు చున్న జలంబులు గలిగి యాయసకంటకదుస్స్పర్శం బగుచుఁదటంబున నసితాసిపత్త్రవనంబు శోభిల్ల వైతరణి యనుపేరఁ బరఁగినయేటియు దత్పరిదేశంబున ననేక ప్రకారయాతన లనుభవించు పాపకర్ములనుంజూచి దేవదూతునితో మనకుఁ బోవలయుచో టెంత యెంత దవ్వు గల దిమ్మెయుచును దేవతాధీనంబై యుండునే యని యడిగిన నప్పురుషుం డతనితోడ 18

తే. ఈనెలవులు బృందారకాధీశు నిమిత్య, మనకు రావలసినచో టింనిన వతం డ
సహ్యదుర్గంధఘోరదర్శనత నచ్చోటు, చిత్త మతిదుఃఖితంబుగఁ జేయుటయును.

వ. మరలి పోనం జూచిన నయ్యెడఁ గొన్ని మెలుంగులు. 20

తే. [2]భవ్యజనన నీగాత్రముదివ్యసౌర
భంబు బెరసినగాడ్పు మాపైఁ గరంబు

1. క. ఘార కాఁగిన- చ. నూనెం గాఁగిన. 2. ట. దివ్యజన నీగాత్రము.

హృద్యమై వీమటయు దుఃఖ మెల్లఁ బాసె
భూరిసౌఖ్యంబు నొందుచున్నార మేము. 21

క. నినుఁ జూడఁ గనుటఁ బటురయ, తనలం దొఱఁగితిమి పరమధర్మాత్మక నీ
వనయము దయ నిచ్చట నిలిచిన బ్రతుకుదు మింకఁ గొంతసేపు నిలువవే. 22

— ధర్మరాజు నరకమున నున్న యన్నదమ్ముల నెఱింగి పరితపించుట. —

వ. అని దుఃఖభారకృపణంబు లగుచు వీతెంచినఁ గౌంతేయాగ్రజుం డోహో యెంతబెట్టిదంబులై యిడుమలం బడియెదరో వీర లని కారుణ్యం బాలయ నిలిచి వెండియు నత్తెఱంగుమాటలు విని మీ రెవ్వ రని యడిగినఁ గర్ణుండ భీమసేనుండ నర్జునుండ నకులుండ సహదేవుండ ద్రౌపదిని ధృష్టద్యుమ్నుండ ద్రౌపదేయుల మనుపలుకు లెసంగుటయు. 23

సీ. ధర్మనందనుఁడు చిత్తమ్మున నుద్వేగ, మావహిల్లఁగ దైవ మకట యిట్లు
సేసెనె కీ డేమి సేసిరొకో వీర, లిన్నరకమునకు నేఁగుదేర
వలసినయట్టిది వాసవాద్యమరులు, నీచులువో వీరి నేవిచార
మించుకయును లేక యిట్టికష్టపుటిడుమలఁ బెట్టెడిదె ధర్మమా తెఱంగు
తే. మాలి తే నీవు సజ్జనమాన్యు లలఘు, సత్యపరులు దయాఢ్యులు నిత్యదాన
రతులు బహుదక్షిణాంచిత క్రతువితాన, పాలితాత్ము లనర్హంపుఁ బాటు వడిరి. 24

చ. ఒకటను మేలు సేయనిసుయోధనుఁ డమ్మెయి దేవపూజ్యుఁడై
సకలసుఖానుభూతియు నజస్రము పెంపు వహింప నొప్పి దృ
ష్టికిఁ గడు వ్రేక నై [1]తనదుచెల్వలుఁ జుట్టలుఁ దాను సంతసం
బుకలిమి నేచి మిన్నడిచి పుణ్యపదావృతుఁడై వెలింగెడున్. 25

ఆ. ఈఁగకాఁగియంత యేనియుఁ బాపంబు, వీరివలనఁ గనుట వినుట గలుగ
దొకనాఁడు నట్టియుత్తములకు విధి, పాడి మాలి యిట్టిపాటు దెచ్చె. 26

సీ. అని యగ్గలపుఁజింత మునిఁగి కలంక మ, నోవికారము నాకు నావహిల్లఁ
గత మేమియొకొ యిది ఘనమాయ యొకొ కల, గనుట యొయరయని కష్టంబా చిత్త
విభ్రాంతిఁ జేసి వివేకింప నేర రా, దయ్యెడు నని పరమాకులేంద్రి
యుఁడు శోకదుఃఖమయుండు నై కొండొక, ప్రొద్దారకుండి స్వబుద్ధిఁ దలఁచి
తే. యలుక యింద్రుపైఁ బాడమిన నమ్మహాత్ముఁ
డప్పరుషుఁ జూచి మగుడ నీ వరుగు మార్య
వర్య యెవ్వరిమాతవు వారికడకు
ననుచుఁ బలికి వెండియు నిట్టు లనియె నధిప. 27

— ఇంద్రుఁడు నరకంబుకడ నున్న ధర్మజునొద్దకు వచ్చి యతని సంభావించుట. —

క. నాయనుజులు దుఃఖార్దితు, లై యున్నారట్టు లగుట నచటికి రానిం

1. ౨. తనగుణిష్టులు.

కీడొడన యేను నిలిచెదఁ, బాయక యని చెప్పు మా కృపానిరతునకున్. 28

చ. అనుటయు దేవదూతుఁడు రయంబున నిర్జరనాథుపాలికిం
జని తెలియంగఁ జెప్పఁ గురుసత్తమ ధర్మజునిశ్చయంబు న
య్యనఘచరిత్రభాస్వరునియాడినమాటలు నాతఁ డంతయున్
విని చనుదెంచె నమ్మొడకు వేగమ సంయమిదేవయుక్తుఁ డై. 29

ఆ. ధర్ముఁడును మహాముదంబున నిజపుత్త్రుఁ, డగుసజాతశత్రు ననునయించి
తత్క్షణం బొనర్పఁ బ్రకటవాత్సల్యత, నరుగుదెంచెఁ గురుకులాగ్రగణ్య. 30

వ. అప్పుడు. 31

సీ. వివిధపాపాత్ములు వికృతశరీరు లై, యాతనాబాధితు లగుట మాని
దుర్గంధమును గృధ్రవర్గాదిపలలాశి, పక్షిపంక్తులుఁ గుణపవ్రజంబుఁ
దోఁపవ యెఱచి నెత్తురు కేశపటలంబు, లస్థిపుంజము లదృశ్యంబు లయ్యెఁ
గ్రూరాసిపత్త్రఘోరారణ్యయుక్తనై, తరణి లే కుండె సత్పరిమళంబు

తే. నింపుఁ జేయుసోఁకును [1]సొగయించుతనుపు
నార వీతెంచి సమ్మోద మావహించె
నమృతమయ మిది యనఁ దగి యనిల మధిక
విశదభావంబుఁ బ్రాపించె దిశలు పదియు. 32

వ. ఆసమయంబున వాసవుతోడం జనుదెంచినట్టి. 33

మహాస్రగ్ధర. వసురుద్రాదిత్యగంధర్వగరుడభుజగవ్రాతముల్ నైభవంబు
ల్లసనం బొందంగ సిద్ధు ల్మనముల ముదము ల్వల్లవింపంగ సాధ్యుల్
హాసితస్వాంతంబులం బెల్లలమికొనఁగ [2]సత్యాదరోత్కర్షముల్ పాం
డుసుతోపాంతంబునం బిండుగొని నిలిచి చూడ్కుల్ తదంగంబు గప్పన్. 34

వ. ఒండొరులతో నక్కురుమూర్తిగుణంబు లుగ్గడించి యగించుచుండ సంయమి
సురసమేతంబుగా నయ్యాఖండలుండు నయ్యఖండయశోమండితుం జేరం జని
సాంత్వనస్వరంబున ని ట్లనియె. 35

క. నీ విచ్చో నునికికి ని, ర్దేవత లంచఱును వగచి ధిషణాగుణసం
భావిత నిన్నుం దోడ్కొని, పో వచ్చినవారు గినుకఁ బో విడువవనా: 36

క. సిద్ధియు నవ్యయలోకస, మృద్ధసుఖావాప్తియును [3]శమితవికృతియు స
ద్బుద్ధియు నుదాత్తభంగిని, సిద్ధించెను నీదుగుణవిశేషముకతనన్. 37

క. విను మొక్కటి సెప్పెద రాఁ, జనువానికి నెల్లఁ దప్ప దనసీశ్వర యె
ట్లును నారకస్థలంబుం, గనుఁగొనవలయు టిది వేదకథితము సుమ్మీ. 38

సీ. పుణ్యంబులును బాపములు రెండు [4]జోక లై, యుండుఁ బుణ్యంబులు నొదవునాఁ

1. క. సొకియింపుఁదనుపు. 2. గ. సంగాదరోత్కర్షముల్. 3. చ. శమితవ్యపోహసమృద్ధియు
4. చ. బ్రోపు లై; జ. బ్రక్క లై.

సుఖము పాపంబులఁ జొప్పడు నరకదుఃఖము విను మున్న నాకంబుసుఖము
ననుభవించినయట్టియతఁడు పడంపడి, యధికనారకపీడ ననుభవించు
మున్న నారకదుఃఖమునఁ బడ్డవాఁ డనంతరమ నాకమునఁ దాఁ బొరయుసౌఖ్య

తే. మల్పపుణ్యుండు దొలితొలి యమరతాసు
ఖంబు గయికొని మఱియు దుఃఖముల నొందు
భూరిపుణ్యుండు మునుమును ఘోరనిరయ
యాతనల నొంది వెండి సౌఖ్యంబు లొందు. 39

క. ఇట యేను నిన్నుఁ బుత్తెంచుట యుత్తరకాలదివ్యసుఖసంగమసం
ఘటనకుఁ గాదె నీకటు, కటఁబడుటకు దీనిఁ దెలుపఁగా రా వలసెన్. 40

సీ. కర్ణుఁ డుత్తమసిద్ధిఁ గాంచి వెలింగెడు, నమ్మహాభుజునకు నై కరంబు
దుఃఖంతు నీ వెప్డుఁ దుదిముట్టి యున్నాఁడ, తండు నిజోజ్జ్వలస్థాన మొంది
సర్వాస్త్రవిదుని నాజలజాప్తనందనుఁ, గనుఁగొని చిత్తంబుకలఁక విడువు
మనిలనందనుఁడు నర్జునుఁడును నకులుండు, సహదేవుఁడును భవత్సైన్యరూప

తే. వర్తిసర్వమహీపతివర్గములును, ద్రౌపదియు ద్రౌపదేయులు రాజవర్య
దీప్తనిజధామసంప్రాప్తిఁ దేజమలరి, యుండఁగాఁ జూచి సమ్మోదయుతుఁడవగుము.

ఆ. దైవవిహిత మగుటఁ దప్పింప రాకున్న, యట్టియల్పదుఃఖ మనుభవించి
తింక నిట సుఖంబు లేపార నాతోడ, విహరణం బొనర్పు విమలచరిత. 42

క. మానితసువ్రతములకుఁ, దానకరణమునకు ననుగుణం బయినశుభం
బే నీకుం గావింపం, గా నుజ్జ్వలవృత్తిఁ బరఁగు కౌరవముఖ్యా. 43

తే. రాజసూయాశ్వమేధాధ్వరములసంచితంబు లయినయుదాత్తలోకంబు లనుభ
వింపు మాధిక్యమహనీయవిభవ మెసఁగ, నక్షయోదారసౌఖ్యంబులావహిల్ల.

సీ. మహితవర్తను లైనమాంధాతృనలహరిశ్చంద్రదిలీపదుష్యంతభరతు
[1]లొందినకీర్తిసీయోన్నతి నొందుము, నినుఁ గొనియాడంగ మునినిలింప
గంధర్వగరుడోరగప్రధానులు సిద్ధ,సాధ్యసత్తములును సకౌతుకముగ
వచ్చినవారి నవ్వారి నెల్లను జూప, నతఁడు వినయసంభృతాంగుఁ డగుచు

తే. నాదరముగఁ బ్రత్యుద్గతి యాచరింప, వార లెంతయుఁ బ్రీతిమై గారవంపుఁ
బలుకు లెసఁగంగ నధికసంభావనంబు, సేసి రాననములు వికసిల్లుచుండ. 45

వ. అమ్మహేంద్రుం డమ్మహానుభావునితో మఱియు నిట్లనియె. 46

క. ఆకాశగంగ యిదె పుణ్యాకృతి యున్నది బరిప్లుతాంగుఁడ వై సు
శ్లోకా నాచెప్పిననృప, లోకంబును మిగులు మమరలోకసుఖములన్. 47

1. క. లొందినకీర్తి నయోన్నతి పొందుము.

యముఁడు ధర్మరాజు నుచితవచనంబుల సంభావించుట.

సీ. అనియె నప్పుడు ధర్ముఁ డభిరామమూర్తి[1] ముఖప్రసాదంబునఁ గరము వెలుఁగ
నారాజవర్యునిఁ జేరంగ నరిగి ని,స్సీమగౌరవ పరీక్షింపఁ గంటి
నిన్ను మున్ను మా అరణిప్రసంగంబున, ద్వైతవనంబునఁ దగిలి కుక్క-
తో వచ్చినప్పుడు దైవతగిరిపొంత, ననుజవర్గము విమోహంబు గాఁగ
తే. నిప్పు డిచటను జలన మొకప్పు డైన, నీదుమది నించుకేనియు లేమ దమము
శమము సత్యంబు మద్గతసారభక్తి, నీకు నగ్గలములు మహనీయచరిత. 48

వ. పరిశోధితుండవ యితి కేలంక దొలంగి సుఖివి గమ్మని పలికి రాజునకు నవశ్యంబు నరకంబు సూచుట గలదు గావున నత్తెఱంగున కయి యేనును వాసవుండును నిన్నుం గడుఁగీ డగునచ్చోటు సొనిపితిమి సూర్యతనయుపవననందనాదుల నరకదుఃఖానుభవంబులు మాచేసిన యెడమాయంబు లగుట నీకుఁ దెలిసె వారు పుణ్యలోకవాస్తు లయి యునికియు వాసవువాక్యంబుల దేటపడియె నని చెప్పి. 49

క. నీ వియ్యాకాశనదీ, పావనసలిలముల మునుఁగు భవ్యాత్మ భవ
ద్భావంబు విడుచు మానవ, భావవికారములశోకబంధము లడఁగున్. 50

చ. పరమసుఖంబుఁ బొంది యతిభాస్వరులై విహరించు నీదు సో
దరు లగుకర్ణముఖ్యుల ముదం బెసలారఁగ జూచె [2]దీమహో
త్తరబహుసౌఖ్యనిర్మలపదంబున దివ్యవిహారలీలలం
బరఁగెద వేల యింకిచట బాంధవరక్షక రమ్ము చెచ్చెరన్. 51

ధర్మజుఁ డాకాశగంగావగాహంబుఁ జేసి దేవభావంబు నొందుట.

సీ. అని పల్కి ధర్ముఁ డత్తనయునిఁ దోడ్కొని, యయ్యంచలును దోడ నరుగుదేర
నాకాశగంగయుపాంతంబునకుఁ బోవ, నప్పుణ్యనది నమ్మహానుభావుఁ
డార్యసంస్తవనవాక్యంబులు సెలఁగ భ,వ్యస్నానమంగళ మాచరించి
మానుషతనువు నమ్మాత్రన విడిచి ది,వ్యం బగుమహిత దేహంబు దాల్చి
తే. వైరమత్సరస్నేహసం[3]వాసలౌల్య, గర్వశోకాదు లైనప్పు డతనివికార
ములు దొలఁగి నిర్ధూతత్వమున నెలుంగు, పావనుండు బోలె శోభిల్లె భారవేంద్ర.

వ. ఇవ్విధంబున నొప్పి మీతాత ధర్మనందనుండు బృందారకనాయక నారదాద్యుదారపురుషుల నభినందించుచు ధర్ముండును దారును దో నరుగుదేర దివ్యశక్తి నట సని మనోహరంబు బున నొక్కెడ. 53

సీ. విస్ఫురద్బహురత్నవితతికనత్కన, కాత్మకం బగునమ్మహాసనమున
దేదీప్యమానమై దివ్యావయవదీధి,తిప్రతానం బెల్లదిశల వెలుఁగ
జక్రగదాద్యస్త్రసంతతి యుజ్జ్వలా,కృతిసుందరపురుషాకృతులును

1. గ. ప్రై. వదనవికాసంబు వెలుఁగుచుండ. 2. గ. దివ్యమహోత్తరబహు. దావహోత్తరబహు. 3. వాసలౌల్య.

చారుమహాళిస్థలిఁ[1]సమవేతనిజరూప, ములఁ గల్గి భక్తిమై బలసి కొలువఁ
తే. దనదుచూడ్కికి నెంతయుఁ దగు లొనర్చి
మున్ను సూచినయ ట్లగుమూర్తి యొప్ప
నరుఁడు కేవలసవినయపరత వెలుఁగఁ
బొలుచునారాయణునిఁ గాంచె భూపవర్య.
చ. కని మది నమ్మహాత్ముఁ డధికప్రమదంబు వహించె నొండెడం
గనుఁగొనియెం బ్రియం బెసఁగ గౌరవవంశవరేణ్యు దీప్తిధా
ముని రవిపంక్తిలోనఁ బదుమూఁడవమూర్తి వెలుంగుచుండఁ గ
ర్ణుని మఱి భీమసేనుని మరుద్గణమధ్యగతత్వశోభితున్. 55
తే. అంగములభంగి దొల్లింటియట్ల యై యనూనతేజోవిరాజితు లైనవారిఁ
గనియె [2]నశ్విసమీపవర్తనులఁ దత్సమానమూర్తులవీక్షించె మాద్రిసుతుల. 56
చ. ఉదితరవిచ్ఛవిం దరుణి నుత్పలగంధి నుదాత్తమూర్తి ద్రౌ
పది నచటెల్లనుం దనప్రభ వెలుఁగొందఁగఁ జేయుదాని న
వ్విదితయశుండు చూచి మది విస్మయ మందఁగ నింద్రుతోడ ని
మ్మదవతి యెవ్వ రార్యజనమాన్యచరిత్ర యెఱుంగఁ జెప్పవే. 57

—♦ ఇంద్రుఁడు ధర్మజునకు దేవత్వంబు నొందినస్వజనంబులఁ జూపి చెప్పుట. ♦—

సీ. అనవుడు నతనితో నాతఁ డేభామ మహాలక్ష్మి ద్రౌపది యనఁగ ద్రుపదు
నికి గూఁతు రై యయోనిప్రభవం బగు మానుషరూపంబు మహితలీల
ముఁ దాల్చి భవదనుభూతి సెల్లించె గౌరీశ్వరునాజ్ఞ వహించి వచ్చె
నని చెప్పి యల్లరమ్యాకృతు లేవురు, గంధర్వవరులు నీకుఁ గమలనయన
తే. యందు మీకు జన్మించినయక్కుమారు, లల్లవాఁడె మీతండ్రికి నగ్రజుండు
ప్రకటగంధర్వపతిధృతరాష్ట్రనాముఁ, డిందు నతఁ డంచుఁ జూపె సురేంద్రముఖ్యు.
వ. ఇట్లు ద్రౌపదీద్రౌపదేయాంబికేయుల తెఱంగెఱింగించి వెండియు నాఖండలుండు పాండవాగ్రజునకుఁ గర్ణుం జూపి భవదగ్రజుండు సూర్యునపరశరీరంబు కౌంతేయుండయి రాధేయుం డనం బరఁగినవాఁడు సుమ్ము సూడు మనిపలికి సిద్ధసాధ్యవిశ్వదేవగణంబులతో నున్నవారు తత్తదంశప్రభూతులయి వాసుదేవానుచరణపరాయణులగుచు వర్తించినసాత్యకికృతవర్మాదియాదవుల నాలోకింపుము. 59
క. అని చెప్పి చూపి యభిమన్యునిఁ జూచి తే చంద్రుభంగి నుజ్జ్వలకాంతిం
దనరెడుఁ దదంశజాతుం, డనూనధృతిశాలి వీఁడె యంచుం జూపెన్. 60
వ. చూపి తదనంతరం బమ్మహాత్మునితోడ. 61
ఆ. పాండురాజు వీఁడె బహురత్నఖచితవి, మాన మెక్కి కొంతి మాద్రితనయు
పాంతభాగమున సుఖాసీనలుగ నాదు, వలను వచ్చుచున్నవాఁడు గంటె. 62

1. క. సమవేదనిజ. 2. క. నశ్వినిసామీప్యగతులఁ దత్స.

క. అదె భీష్ముఁడు వసువులకడఁ, గదిసి మెలమి నున్నవాఁడు గంటే ద్రోణుం
డిదె దివిజగురునిపాలఁ బ్రమద మెసఁగ వసించినాఁడు మాన్యచరిత్రా. 63

వ. అని పలుకుచుఁ జూపి గంధర్వయక్షగుహ్యకగణంబులలో ద్రుపదవిరాటులను దదీయానుజతనుజవర్గంబులనుం దక్కినం గలుగు కేకయపాండ్యప్రభృతి నానాదేశాధీశులను వేరువేరం జెప్పుచుఁ జూపుచు భవదీయం బగుసమరంబునం బరిత్యక్తశరీరు లయి యుత్తమలోకంబులు వడసి యున్నవారల నవలోకింపు మని చెప్పె నని విని జనమేజయుండు వైశంపాయనుతో మునీంద్రా యిప్పుడు నీ చెప్పినసుయోధనశకునిసైంధవులును గర్ణుండును గర్ణకుమారకులును వెండి యుం గల తత్పక్షభూపతులును ఘటోత్కచాదు లయినపాండవులవారును నీచెప్పినసకలజనంబులు నాలోకంబున నెప్పుడు నుండుదురో యట్లు గాక కొంతకాలంబు నిలిచి క్రమ్మఱ మనుష్యాదిజన్మంబుల నొందుట కై యరుగు దెంతురో యిత్తెఱంగు వినవలతుం జెప్పవే యని యడిగిన నమ్మునిపతి యమ్మనుజపతితో ని ట్లనియె. 64

సీ. కురువర యిది దేవగుహ్యంబు మునివరుఁ
డైన వేదవ్యాసుఁ డతులకరుణఁ
జెప్పిన యది నీకుఁ జెప్పెద సమవధా
నంబుతో వినుము సనత్కుమారుఁ
గలసెఁ బ్రద్యుమ్నుఁ డన్యులకు దురాసదం
బయినకుబేరలోకానుభవము
ధృతరాష్ట్రుఁ డొందెను సతియుఁ దానును నింద్ర
భవనంబునన నిల్చెఁ బాండునృపతి

తే. యాంద్రు రిరువురుఁ దో నిల్వ నమృతకరునిఁ
గూడె నభిమన్యుఁ డనిమిషగురుని నొందెఁ
దత్ప్రతీకాశుఁ డయినకోదండగురుఁడు
ద్వాపరాత్మకుఁ డయ్యె గాంధారవిభుఁడు 65

క. ఆరాజు నాకనరకో, దారసుఖాత్యంతదుఃఖసంధానములఁ బెం
పారియు హీనత నొందియుఁ, గౌరవకులనాథ పిదపఁ గలియం దొందెన్. 66

వ. అట్లపోలె నాకనరకంబు లనుభవించి.

ఆ. అతనితమ్ము లెల్ల యాతుధానావలిఁ, గలసి రాత్మజనకుఁ గలసె సూర్యుఁ
గర్ణుఁ డధిప వసువు గావున వినుము గంగాత్మజుండు వసువులందు నిలిచె. 68

వ. ద్రుపదుండును విరాటుండును ధృష్టకేతుండును భూరిశ్రవుండును శల్యుండును శంఖుండును నుత్తరుండును విశ్వనామదేవతలఁ గలసిరి ధృష్టద్యుమ్నుండు హుతవహునిఁ గూడికొనియె నని చెప్ప యప్పరమసంయమి యప్పుడమితేనితో

వెండియు ని ట్లనియె. 69

తే. వినుము ధర్మనందనుపుణ్యతనువునందుఁ
దగఁ బ్రవేశించి యున్నవిద్యామయాత్ముఁ
డైనవిదురుండు నమ్మహితాత్మబోధ
శాలియును ధర్ముఁ గూడిరి సచ్చరిత్ర. 70

సీ. కమలగర్భునినియోగంబున నిజయోగ, బలము గైకొనిబలభద్రదేవుఁ
డంబుధి కరిగి యనంతుఁ బరమమూర్తిఁ, గలసె నత్తెఱఁగు మున్నలఘుకీర్తి
ధన నీకుఁ జెప్పితిఁ దక్కటివృష్ణిభో,జాంధకు లెల్ల గుహ్యకగణంబుఁ
గూడిరి కృష్ణుసంక్రీడకుఁ బాత్రంబు, లైనషోడశసహస్రాంగనలును
తే. విధినియుక్తకాలంబున విను సరస్వ,తీజలంబుల మునిఁగి యుత్కృష్ట మగు ని
జాప్సరోభావ మొందినారాయణునియు,పాంతచారిణులైరి ప్రహర్ష మెసఁగ. 71

చ. అనుమరణంబునం దగ మురాంతకు రుక్మిణి సెందె లక్ష్మి స
వ్వనరుహనేత్రుతక్కఁగలవామవిలోచన లేడ్వురుం దదీ
యనుతతనుప్రవేశనసమాచరణం బొనరించి రవ్వరాం
గనలును లక్ష్మియంశముల కావునఁ గౌరవవంశవర్ధనా. 72

వ. అని చెప్పి యమ్మహాయుద్ధంబున మృతులైనయట్టివారును నేను మున్ను ప్రసం
గించినయట్టివారును బ్రసంగింపనివారును నిట్టట్టిగతిం బ్రాపించి రని నాచే
తం జెప్పంబడినవారెల్లను నిజార్హప్రకారంబుల సురాసురయక్షగుహ్యకగంధర్వ
బృందంబులం జెందిరి కురునందనా నీయడిగిన తెఱంగెఱింగించితి నని వెండియు. 73

తే. వినుము పాండవకౌరవవిషయమైన, యట్టియితిహాస మే నుపాఖ్యానజాత
సహిత మగునట్లుగా సమస్తంబు మహిత, విస్తరంబునఁ జెప్పితి విశదభంగి. 74

వ. కృష్ణద్వైపాయనమునీంద్రుండు సత్ప్రసాదభరితుండై యాజ్ఞాపింప నట్లు తదీ
యానుజ్ఞ వడసి తద్దయాలబ్ధప్రజ్ఞావిశేషుండ నై యశేషంబును వివరింప నమ్మ
హాత్ము కారుణ్యంబున నిమ్మహానీయేతిహాసంబు [1]సమాధానమానసుండ వై యా
కర్ణించి నీవును బహుళపుణ్యాత్ముండవుఁ గృతార్థుండవుఁ బరమార్థవిదుండవు
నైతి వని యిట్లు సాంద్రానందసంపాదనశీలుండై. 75

క. శ్రీనిత్యత్వప్రమదా, ధానకుతూహలనిరూఢతా స్తవ్యాపాం
గా నిర్భరవేదవ్యా, సానేకవచోనుషంగ హరిహరనాథా. 76

వ. దేవా వైశంపాయనుండు జనమేజయునకుఁ జెప్పె నట్లు సర్పయాగసమయ
ప్రవృత్తంబైనమహాభారతం బంతయుఁ దత్సభాగతుండై నరోమహర్షణనామ
ధేయుండును సాత్యవతేయశిష్యుండును బండితప్రవరుండును నగుసూతుని

1. క. సమాధానమానసుండవై.

పుత్త్రుం డైన యుగ్రశ్రవుండనియెడు కథకుండు సమ్యగవధానంబున నాకర్ణించినం
వాఁ డగుటను సమాశ్రితవత్సలుం డైన యాకృష్ణద్వైపాయను ననుగ్రహంబున
దత్కథాసాకల్యవివరణవిశారదుం డై యుండు నతండు నైమిశారణ్యపుణ్యక్షే
త్రంబునందు శౌనకుం డనుకులపతి మొదలుగాఁ గలగొందఱు మహామునులు
సత్రయాగం బాచరించుచుండ నయ్యెడకుం జని వారలం గాంచినం బుణ్యకథా
శ్రవణకౌతుకాధీనమానసు లై యమ్మానసీయులు పుణ్యాత్మకుం డైనయక్కథ
కునకు సముచితార్చనంబులం బ్రియంబు బొనర్చి కథాకథనంబునం బ్రసంగించినం
బ్రీతుండై యాతం డేమి తెలుంగుకథ వినం గోరెద రనుటయు నప్పరమార్థపరా
యణు లతనితోడ నెయ్యది హృద్యంబును నపూర్వంబును సమగ్రజ్ఞానప్ర
దంబును నఘనిబర్హణంబును నైనయది యక్కథ మాకు విన నిష్టం బని పలు
కుటయు. 77

క. అతఁ డింతటిది మహాభా,రతంబ యనునిశ్చయము దిరంబుగ మతిసం
గత మగుడు నమ్మహాత్ముల, కతివిశదము గాఁగ నిమ్మహాకథ సెప్పెన్ 78

వ. చెప్పి యిట్లనియె నట్లు జనమేజయుండు సర్పయాగకర్మానుష్ఠానంబులయెడ వైశం
పాయనువలన నవ్విచిత్రేతిహాసంబు విని విస్మితుండును బ్రమోదభరితుండును
నయ్యె నక్కాలంబునం దదీయయాజకులు యజనసమాపనవిధి యనుష్ఠించి రయ్యధి
ష్ఠిరానుజపుత్త్రపౌత్త్రుఁ డత్తెఱంగున భుజంగంబులయాపద దీర్చినయాస్తీకు నభ్య
ర్చనంబున నత్యంతసంతుష్టునిం జేసి యతనినివాసంబునకు ననిచిపుచ్చి ఋత్విజు
లాదిగా నఖిలబ్రాహ్మణులకు బహుధనంబు లొసంగి వినయం బెసంగ నామంత్రి
తులం జేసిన వారలునిజనివాసంబులకుం జనిరి వైశంపాయనుఁ బెంపారుసవిశేష
పూజనంబులఁ బరితోషితుం గావించి దేవోపచారంబులఁ గృష్ణద్వైపాయనము
నీంద్రుం బూజించి యజ్ఞపతి సకలజనంబులు ప్రస్తుతింప విభవంబు శోభిల్లఁ
బురంబుఁ బ్రవేశించె. 79

సీ. అని చెప్పి యాశౌనకాదిమునీశ్వర,గణముతో మఱియు నక్కథకుఁ డింపు
మిగులంగ నిట్లను మేటిమునీశ్వర,సంఘంబులో నెల్ల సత్యదర్శి
సర్వవిధిజ్ఞాత సర్వవిజ్ఞానధ,వ్యాత్ముండు సర్వేంద్రియప్రబోధ
శాలి సర్వజ్ఞుండు శౌచశాంతిక్షమా,దాంతితపోనిత్యతావిభాసి

తే. యాప్తసర్వవిధైశ్వర్యుఁ డఖిలసాంఖ్య,యోగభేదవిదుండు ధర్మోపదేశ
చతురవాగ్విలాసుండు నిరస్తతత్త్వవస్తు,వేది సాత్యవతేయుండు వేదమయుఁడు. 80

వ. పాండవులకీర్త్తిం బ్రకటించుటకును మఱియుం గొందఱు జనపతులచరిత్రంబులు
జనుల కెఱింగించుటకును దేవదేవుం డగువాసుదేవుని సంక్రీడావిశేషంబులు వివ
రించుటకును సర్వదేవజాతులజన్మంబులును దదీయసాయుజ్యంబులును దేటపఱుచుట
కును సకలధర్మంబులునుం దెలుపుటకునుగాఁ బంచమవేదం బను పరఁగు నిమ్మహా

భారతసంహిత యొనర్చె నిమ్మహితేతిహాసంబు సంవత్సరత్రయకృతంబు దీనివిశే
షంబు వినుండు. 81

తే. అమలధర్మార్థకామమోక్షములగుఱిచి
యొలయుతెరు [1]వెద్దియును నిందుఁగలుగు నదియ
యొండెడలఁ గల్గు దీన లే కుండుచొప్పు
దక్కఁ గంటను లేదు వేదజ్ఞులార. 82

సీ. పూతాత్ములార యీపుణ్యేతిహాసంబు, జనమేజయుఁడు సేయు సర్పమఖము
కాలంబునం దట్లు కారుణికోత్తముఁ, డైన వేదవ్యాసుఁ డాదరమున
నాజ్ఞాపనము సేయ నతనిశిష్యుఁడు లోక, నుతుఁడు వైశంపాయనుండు సెప్పె
నన్నరేంద్రుఁడు విన నాసభ నిలిచి స, వినయభక్తిక్రమముగ వినినవాఁడఁ

తే. గథనశక్తియు నమ్మునికరుణవలన, గలిగె నా కిత్తెఱంగున గారవించి
మీరు వినుచుండఁ జెప్పెడు మేటిపదము, గంటి నంటిమీఁదయు పెంపు కతనఁ జేసి.

వ. [2](అని పలికి వెండియు) 84

—• ఫలశ్రుతి •—

క. అలఘుమతులార పర్వం, బుల నీయితిహాసరత్నమును వినిన నఘం
బులు వాయు నాకలోకము, గలుగును సిద్ధించు ముక్తి కాంక్షిత మైనన్. 85

క. ఆద్యంతంబును నీయన, వద్యకథ వినఁగఁ గనిన వారికిఁ బాయున్
సద్యంబ బ్రహ్మహత్యా, వద్యము మొదలైన పాపవర్గం బెల్లన్. 86

క. సురపితృకార్యంబుల భూ, సురులకు దీని వినిపించు సుకృతాత్ముఁడు త
త్కారణఫలంబుల నధిక, స్ఫురితంబుగఁ బడయు మహితబోధనులారా. 87

క. మానసముల నింద్రియముల నేనియుఁ జేయంగఁబడిన యేనఃపుంజం
బీనిర్మలేతిహాసము, వీనుల సోఁకినంత సిలుక విరియు సకలమున్. 88

ఉ. భ్రాజితవృత్తమైఁ బరఁగు భారతసంహిత సంయమీంద్రులా
రా జయనామకంబునను రాజితభంగి జగత్త్రయంబునం
బూజితకీర్తి యై నెగడు భూరిజయోన్నతిఁ గంద్రు దీనిచే
రాజు లిలాసురుల్ మఱి యరాతుల గెల్తురు విన్నయంతటన్. 89

ఉ. భారత మర్థితో వినిన భక్తిఁ బఠించిన శ్రీయు నాయువుం
భూరియశంబునుం బ్రమదముం దృఢవిద్యయుఁ గల్గు వారి కే
కోరిక లైన వేగ మొనఁగూడు సుపుత్త్రునిఁ గాంచు సద్గుణా
గారవ మొప్పఁగాఁ బడయు గర్భిణియుం వరుసం గుమారియున్. 90

ఉ. శిక్షితచిత్తులార శుభసిద్ధులు వొందు ననేకజన్మ పా

1. వెద్దియే నిందుఁ గలుగునదియ, యొండెడలఁ గల్గి దీన లేకుండుచొప్పు, దక్కఁ గంటను లేదు.
2. ఇది వ్రాఁతప్రతులఁ గానిపింపదు.

పక్షపణంబునన్ వెలుఁగు భారతసంహిత కెల్లఁ బుండరీ
కాక్షుని వాసుదేవుఁ బ్రకటార్థముగాఁ గని విన్నమానవుం
[1]డక్షయపుణ్యలోకములయందు రమించు నిరామయస్థితిన్. 91

ఉ. వ్యాసమునీంద్ర సారకరుణాతిశయంబున భారతార్థము
ద్భాసితమైనయట్టిమతి భాగ్యవశంబున సకలాగమార్థసం
వాసన మావహిల్లు జనసంస్తుతులు కీర్తన సేయు శశ్వదు
ల్లాససుఖానుభూతి నచలస్థితి నొప్పు నతం డుదాత్తుఁడై. 92

వ. అని యిట్లు సమస్తపురాణపారీణుండైన సూతుండు. 93

చ. పరమపదాప్తిహేతు వగు భారతసంహిత శౌనకాదిభూ
సురవరు లింపునం గరఁగఁ జొప్పునఁ జెప్పిన వాని మోదసం
భరితతఁ బొంది యక్కథకుఁ బ్రాఁతిగ నర్చితుఁ జేసి రర్మిలిన్
హరిహరనాథ సర్వభువనార్చిత నన్ దయఁ జూడు మెప్పుడున్. 94

ఉ. పావన దుర్దశాపహ శుభప్రదమూర్తి సుధానుభూతిసం
జీవితభక్తలోక తులసీదళదామ కపాలమాలికా
భావిభవాభిరామ పరిపక్వతపఃఫలరూప సాంఖ్యవి
ద్యావహయోగశక్తివిశదాద్భుతఖేలన లోకపాలనా. 95

కం. దేవాదిచతుర్విధభూ,తావాసా సుకృతహృదయవిహారివిలాసా
కేవలభావానందమ,యా వేదవ్యాసవర్ణనారూఢదయా. 96

మాలిని. అకృతకమధురోక్తివ్యాప్తసందీప్తసారా
సకలభువనరక్షాశాలిశుంభద్విహారా
శుకజనకమనీషాశుద్ధబుద్ధానుభావా
[2]సకృపకృతవిలాసాసంభృతానందభావా. 97

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతంబైన శ్రీమహాభారతమునందలి స్వర్గారోహణపర్వంబు సర్వంబు నేకాశ్వాసము. 97

శ్రీమదాంధ్రమహాభారతము

సంపూర్ణము.

శ్లో॥ యదక్షరపదభ్రష్టం మాత్రాహీనం తు యద్భవేత్ ।
తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోఽస్తు తే.

శ్రీకృష్ణార్పణమస్తు.

---

1. గ. డక్షయసౌఖ్యసత్పథమునందు. 2. క. సకృపకృతనవారీ-గ. సకృతిసుస్థితారీ.